# బుడిగె జంగాలు

## భాషా సాహిత్య సాంస్కృతికాంశాల పరిశీలన





డాక్టర్ ఎన్.ఆర్.వెంకటేశం

జానపద విజ్ఞానం

# బుడిగె జంగాలు

## భాషా సాహిత్య సాంస్కృతికాంశాల పరిశీలన

ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి
పిహెచ్.డి. పట్టా పొందిన సిద్ధాంత గ్రంథం



డా॥ ఎన్. ఆర్. వెంకటేశం

దివ్యదీప్తి ప్రచురణలు
హైదరాబాదు
1995

# BUDIGE (BUDGA) JANGALU

(A Study of Language, Literary and Cultural Aspects)

Doctoral Thesis by

Dr. N.R. Venkatesham M.A., M Phil., Ph.D.
Lecturer, Department of Telugu, University College of Arts, Osmania University, Hyderabad. 500 007.



Publication No. 4

First Edition : May 1995

Copies : 1000

Price : Rs. 170/-



Cover Design by :
Sheela Veerraju

For Copies :
N. Vikranth
H.No. 18-2-192/2,
Jangammet Falaknuma,
Hyderabad - 500 053.
Phone : 523202.

Printed at :
Padmavathi Art Printers,
L.1.517/B/1, New Bakaram,
Gandhinagar, Hyderabad - 500 380.
Phone : 7611413.

---

This book is Published with the financial Assistance of Telugu University, Hyderabad.

# అంకితం

వీడు ఉత్తరం చదువగలిగితే చాలునని

వీధిబడిలో చేర్పించి

ఉపాధ్యాయులు వీణ్ణి తప్పక చదివించాలని చెబుతున్నారని

ఉన్నత పాఠశాలలో కొనసాగించి

విశ్వవిద్యాలయ స్థాయికి ఎదగడం చూసి

విశ్వాన్ని జయించినంతగా మురిసిపోయిన

అమ్మానాన్నలు

నిదానకవి ఈశ్వరమ్మ రంగయ్యగార్లకు

ఆనందబాష్పాలతో

అక్షరాంజలిగా

# రచయిత పరిచయం



| | | |
|---|---|---|
| జననం | : | 6-6-1952 హైదరాబాదు. |
| చదువు | : | ఎం. ఏ. (లాంగ్వేజెస్) ప్రథమశ్రేణి - 1980.<br>ఎం. ఫిల్. - నార్లవారి మాట పరిశీలన 1983.<br>పిహెచ్. డి. - బుడిగె జంగాలు (భాషా సాహిత్య సాంస్కృతికాంశాల పరిశీలన 1992) |
| ఉద్యోగం | : | తెలుగు పండితుడు 1978 - 84.<br>జూనియర్ లెక్చరర్ 1985 - 89.<br>జులై 1989 నుండి ఉస్మానియా యూనివర్సిటీలో అధ్యాపకత్వం. |
| ఇతర రచనలు | : | కందాల మకరందాలు 1993.<br>వ్యాస ప్రసూనాలు (వ్యాస సంపుటి) 1993.<br>రాగాభిషేకం (ప్రణయ కవితా సంపుటి) 1994 |

Grams : "TELVERS"

Phone: Off: 234815
236911
Res : 238244
Fax : 0842-236045

తెలుగు విశ్వవిద్యాలయం

# TELUGU UNIVERSITY

Prof Pervaram Jagannadham
M A., Ph D.
Vice-chancellor

Lalitha Kala Kshetram,
Public Gardens,
Hyderabad-4. (A.P.)

No. తెవి/వి.సి/95.

Date : 16-5-1995

# ముందుమాట

మిత్రులు డా॥ ఎన్.ఆర్. వెంకటేశంగారు మంచి పరిశోధకులు. తెలుగు భాషా సాహిత్య అభివృద్ధికి దోహదం చేస్తున్నారు. ఈయన ఉస్మానియా విశ్వ విద్యాలయం తెలుగు శాఖలో ఉపన్యాసకుడిగా పనిచేస్తూ పరిశోధన చేసి ఉత్తమ ఫలితాలను పాఠకులకు అందిస్తున్నారు. వీరు ఇటీవల బుడిగె జంగాల గురించి విశేషమైన కృషిచేసి చక్కని గ్రంథాన్ని వెలువరిస్తున్నారు.

తెలుగునాట ఎన్నో జానపద కళారూపాలను ప్రదర్శిస్తూ వాటిని తమ జీవనోపాధిగా చేసికొని, వాటి వికాసానికి తోడ్పడుతున్న జానపద భిక్షుక గాయకుల్లో 'బుడిగె జంగాలు' ప్రముఖమైన స్థానాన్ని ఆక్రమిస్తారు. వారి కళా ప్రదర్శనల్లోని విశేషాలను, ఆ కళల్లోని ప్రత్యేకతను వివరించి, వారి జీవన సరళిని క్రోడీకరించి డా॥ వెంకటేశంగారు ఈ గ్రంథాన్ని రూపొందించినారు. ఎంతో శ్రమకోర్చి విలువైన గ్రంథాన్ని రచించిన డా॥ వెంకటేశంగారిని అభినందిస్తు న్నాను.

ఇంకా ఇటువంటి గ్రంథాలను ముందు ముందు విరచించి తెలుగు పాఠకు లకు అందిస్తారని ఆశిస్తున్నాను. వీరికి భగవంతుడు శుభములు చేకూర్చుగాక!

పేర్వారం జగన్నాథం

Prof. Nayani Krishna Kumari
Retired Head, Department of Telugu
Osmania University,
Hyderabad - 500 007.

# అక్కరకు వచ్చే పరిశోధన

'బుడిగె జంగాలు - భాషా సాహిత్య సాంస్కృతికాంశాల పరిశీలన' అనే యీ పరిశోధన గ్రంథాన్ని పూర్తిగా చదివాను. విషయం సామాజికశాస్త్ర స్పర్శ కలిగి, అనేకమైన అమూల్యాంశాల క్రోడీకరణతో విశ్లేషణాత్మకంగా ఉంది. విషయ నిర్భరత్వం, పాఠకునిచేత ఒక్క బిగిని ఈ గ్రంథాన్ని చదివించ డానికి ప్రతిబంధకం కాకపోవడం ఇక్కడి విశేషం పరిశోధకుడు డా॥ ఎన్. ఆర్. వెంకటేశం ఈ సిద్ధాంతగ్రంథాన్ని రూపొందించడానికి చూపించిన శ్రద్ధా సక్తులు మెచ్చదగినవి.

బుడిగె జంగాల సామాజికాంశాలు, జీవన నేపథ్యం, ఆచార వ్యవహారాలు, భాషావ్యవహారం అన్నీ ఎంతో పరిశ్రమ కోర్చి సేకరించి, వాటి విశ్లేషణను పరిశోధకుడు పాఠకుల కందించడం జరిగింది. వాళ్ళ భాషలోని కొన్ని పదాలు మనం గ్రంథగ్రంథులుగా ఈనాటికీ భావించే అర్థాలను తేటతెల్లం చేసేవిగా ఉన్నాయి. వాళ్ళ కల్పనాప్రతిభను, ఎన్నో జంతువులకు వాళ్ళచేత ఖాయం చేయ బడ్డ పదాల తీరు వెల్లడిచేస్తున్నది. ఉడతను తోడ్సిగాడు ఎలుకను ఉన్నానిగాడు, ఉడుమును వలెంగాడు అంటారు వీళ్ళు. ఇట్లా ఎన్నో జంతువులకు వీళ్ళ పద కోశంలో కొత్త పదాలు దొరుకుతాయి. అట్లాగే పెళ్ళి కాని పిల్ల 'పుట్టింటి పిల్ల', పెళ్ళయిన స్త్రీ 'మగనాలి పడుచు' - ఇట్లా వీళ్ళ దగ్గర ఎంతో పద సంపద దొరుకుతున్నట్లు మనం గ్రహించవచ్చు. ఈ పరిశోధకుడు తరువాతి పనిగా, ఈ పదాల నన్నిటినీ వ్యుత్పత్త్యర్థకోశంగా అమర్చవలసిన బాధ్యతను చేపట్టడం అవసరం.

ఈ గ్రంథం బుడిగె జంగాల మీద పరిశోధన కనుక, పరిశోధకుడు వివిధ కుల నామాలతో వ్యవహరింపబడే జంగము లందరూ బుడిగె జంగాలే అనే వివరణ ఇవ్వడం జరిగింది. వీరశైవ ప్రాబల్యం తగ్గినవెనుక జంగములుగా మాత్రమే పిలువబడిన వివిధ కులాల వారు, తిరిగీ తమ వెనుక కాలపు కుల ప్రాతినిధ్యం కోసం పాకులాడడం జరిగింది. అటువంటి జంగములలో బుడిగె జంగములది ఒక ఉప విభాగం. వైదిక వర్ణ వ్యవస్థ ననుసరించి, మొదటి మూడు కులాల నుండి జంగములుగా మారిన వారి విభాగం మొదటి విభాగం. నాలుగవ కులమైన శూద్రజాతి నుండి జంగములైనవారి విభాగం రెండవ విభాగం. పంచమ కులం నుండి జంగములైనవారి విభాగం మూడవది. ఇది కులాను క్రమణిక ననుసరించిన అమరిక. ఇందులో బుడిగ జంగాలు, శారదకాళ్ళు, బాల సంతులు, కాటిపాపలు, బొమ్మలాటలవాళ్ళు, మాల జంగాలు - వీరందరూ మూడవ విభాగానికి చెందినవాళ్ళని చెప్పవచ్చు.

ఒక చక్కని పరిశోధనాత్మకమైన ఆకర గ్రంథాన్ని ఆంధ్రలోకానికి అర్పించిన డా॥ ఎన్. ఆర్. వెంకటేశానికి నా శుభాకాంక్షలు. ఈ గ్రంథానికి పరిశోధకుల మధ్యకు హార్దికాహ్వానం.

హైదరాబాదు
11.5.1995

నాయని కృష్ణకుమారి

**డా. ఆర్వీయస్. సుందరం**
తెలుగు శాఖ, మైసూరు విశ్వవిద్యాలయం,
మానస గంగోత్రి,
మైసూరు - 570006.

# సామాజిక, సాంస్కృతిక నేపథ్యాల పరిశీలన అవసరం

డా. ఎన్. ఆర్. వెంకటేశం ప్రకటించిన "బుడిగె జంగాలు" అనే గ్రంథం విశిష్టమైంది. తెలుగులో వైవిధ్యమయంగా సాగుతున్న జానపద విజ్ఞాన పరిశోధనకు ఇది ప్రతీకగా ఉంది.

ఆంధ్రుల జానపద విజ్ఞానం విస్తృతిలో, వైవిధ్యంలో, వైశిష్ట్యంలో ప్రపంచంలోని ఎవరి జానపద విజ్ఞానానికి తీసిపోదు కాని, మనం చూపిస్తున్న ఆదరణ మాత్రం అత్యల్పం. నిజానికి జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చెయ్యడమంటే సంస్కృతిని అధ్యయనం చెయ్యడమే. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో మన సంస్కృతికి అద్దం పట్టే ఎన్నో పరిశోధనలను చేయించినందుకు ఆచార్య బి. రామరాజుగారికి అందరూ ఋణపడి వున్నారు.

ఆంధ్రుల జానపద విజ్ఞానంలో జానపద కళాకారులను గురించిన పరిశీలన ఎంతైనా చెయ్యవలసి ఉంది. ఇప్పటికే తెలుగులో కొన్ని ఉత్తమగ్రంథాలు వెలువడ్డాయి. అయినా ఇది తరగని ఆస్తి. చిల్లిగవ్వయినా ఆస్తిలేని కళాకారులు మన కళాసంపదను తరతరాలనుండి కాపాడుకుంటూ వస్తున్నారు. కనీసం వారిని గురించి తెలుసుకొనే పనయినా చెయ్యకుంటే మనం మన సంస్కృతికి ద్రోహం చేస్తున్నామన్నమాటే.

"బుడిగె జంగాలు" అనే గ్రంథాన్ని చదివితే ఒక్క కళాకారుల సమూహాన్ని గురించి ఎంత విస్తృతంగా రాయవచ్చు అనే విషయం బోధపడుతుంది. దీన్ని ఇంకా విస్తరించడానికి కూడా వీలుంది. మనలో ఎంతోమంది జానపద గాయకులు దక్షిణభారతమంతా విస్తరించి ఉన్నారు. మన గంగిరెద్దుల

వారు నెల్లూరి నుండి చిక్కమగళూరు వరకు ప్రయాణం చేస్తారు. పిచ్చుకుంట్లు, దాసర్లు, బలిజలు మొదలైన తెలుగు గాయకులెందరో కర్నాటకంలో స్థిరపడి, కన్నడ జానపద క్షేత్రానికి చిరకాలంగా సేవ చేస్తున్నారు. గొరవయ్యల వంటి కన్నడ కళాకారులు తెలుగు నాట ప్రసిద్ధి చెందారు బుడిగె జంగాలను గురించి, వారిలోని శాఖలను గురించి, వారికి ఇతర రాష్ట్రాలతో ఉన్న సంబంధాలను గురించి డా. వెంకటేశం చక్కని పరిశీలన జరిపారు. ఈ పరిశీలనా వైపుల్యం పరిశోధకుని నిష్ఠకు, ప్రామాణికతకు నిదర్శనంగా ఉంది. వారి అభిప్రాయాలు శాస్త్రీయంగా ఉన్నాయి ఆధారసహితంగా ఉన్నాయి, ఆమోదయోగ్యమై ఉన్నాయి.

తెలుగు భాషా సాహిత్యాలలో పరిశీలన జరిపేవారు భాషకు, సాహిత్యానికి మాత్రం ప్రాధాన్యమిస్తే చాలనుకుంటారు. కాని, సాంస్కృతిక నేపథ్యం అన్నిటి కంటె ముఖ్యమైనది. ఈ విషయాన్ని తెలుగువారు గమనించరు, గమనించినా అది సాహిత్యానికి ఎందుకూ పనికిరాదన్నట్లు మాట్లాడుతారు. కనీసం జానపద సాహిత్య పరిశోధన చేసేవారయినా సామాజిక, సాంస్కృతిక నేపథ్యాల పరిశీలన చేపట్టడం ముదావహం అసలు సాహిత్య విద్యార్థులకు సాంస్కృతిక పరిశీలన జరిపే అవసరం లేదని, అర్హత లేదని చెప్పేవారు కూడా ఉన్నారు. కాని, నిజాయితీ ఉంటే ఎలాంటి అర్హతనయినా సంపాదించవచ్చని డా. ఎన్. ఆర్. వెంకటేశం నిరూపించారు. మొదట మనం మన సాంస్కృతిక అంశాల లోతుల్లోకి వెళ్ళి విషయం తెలుసుకుంటే తర్వాత విశ్లేషణ మార్గాలను అన్వేషించవచ్చు. ఇప్పటికి డా. వెంకటేశం చేసింది వర్ణనాత్మక పరిశీలనే. అయితే ఈ పరిశీలనను తులనాత్మకంగా, విశ్లేషణాత్మకంగా విస్తరించడానికి చాలా అవకాశముంది. భవిష్యత్తులో డా. ఎన్. ఆర్. వెంకటేశం ఆ పని కూడా చేపట్టాలనుకుంటే తప్పు కాదు. జానపద విజ్ఞానం పరిధి ఎలాంటిదో, కళాకారుల జీవనమార్గం, భాషా సంస్కృతులు ఎలాంటివో ఆంధ్రులకు వివరించి చెప్పినందుకు రచయితను మనసార అభినందిస్తున్నాను

మైసూరు
8-5-1995

ఆర్వీయస్. సుందరం

Dr. M. K. Devaki
Reader, Department of Telugu
Sri Krishna Devaraya University
Ananthapur, A.P.

# అభినందన

కుల వ్యవస్థలో ప్రతి కులానికి ప్రత్యేకమైన జీవనవిధానం ఉంది. ఆ విధానాన్ని అనుసరించి వచ్చే ఆ కుల సంస్కృతిలో కూడ విలక్షణత్వం ఉంది. బుడిగె జంగాల సంస్కృతిని సమగ్రంగా సేకరించి, సవిస్తరంగా వింగడించి, విశ్లేషించి, శాస్త్రపద్ధతుల్లో అనుశీలించి డా॥ వెంకటేశంగారు పిహెచ్.డి. పట్టా కోసం రూపొందించిన సిద్ధాంత వ్యాసమే ఈ గ్రంథం.

ఇందులో కులం, తెగ, సంస్కృతి మొదలైన పదాలను నిర్వచించి, బుడిగె జంగాల వృత్తివేషాల విశేషాలు, వారికళలు, ఆచారాలు, కర్మకాండలు, ఆరాధనా పద్ధతులు, కుల పంచాయతీలు, వైద్య విధానాలు మొదలైన అంశాలను వివరణాత్మకంగా చర్చించడమేగాక; సాహిత్యపరమైన వాళ్ళపాటలు, కథలు, సామెతలు, పొడుపుకథలు, జాతీయాలు, నమ్మకాలు మొదలైన వాటిని కూడా సమగ్రంగా పరిశీలించడం ముదావహం.

బుడిగె జంగాలకు సంబంధించిన వస్తు సంస్కృతిలో భాగమైన ఇండ్లు, ఆహారపానీయాలు, దుస్తులు, చేతిపనులు మొదలైన వాటిని చక్కగా వివరించడమేగాక, మరో పిహెచ్.డి. చేయదగినంత వివరణాత్మకంగా వాళ్ళ పరిభాషను విశ్లేషించి చూపడం అభినందనీయం.

తీసుకున్న పరిశోధనాంశాన్ని అణువంతైనా వదలిపెట్టకుండా అన్ని కోణాల్ని స్పృశించి, సమగ్రంగా వివరించడం ఇందులో కనిపిస్తుంది. కుల సంబంధమైన సంస్కృతి ఎన్ని రూపాల్లో, ఎన్ని రకాలుగా విస్తరించి వుంటుందో ఈ గ్రంథం చదివితే తెలుస్తుంది. రచనాశైలి పరమ పఠనీయంగా ఉంది.

బుడిగె జంగాల సంస్కృతి మొత్తాన్ని చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయేటట్లుగా ఈ గ్రంథాన్ని రచించారు.

విశ్వవిద్యాలయానికే గర్వకారణమని చెప్పుకునే కొన్ని పరిశోధనా గ్రంథాల్లో ఈ గ్రంథం కూడ చేరుతుందనడంలో సందేహంలేదు. ఎంతో శ్రద్ధాసక్తులతో పరిశ్రమించి, పరిశోధించి, ఈ సిద్ధాంత గ్రంథాన్ని వెలువరించిన డా॥ వెంకటేశం గారిని హార్దికంగా అభినందిస్తున్నాను.

అనంతపురం
5-5-1995

ఎమ్. కె. దేవకి

# కృతజ్ఞతలు

జానపద విజ్ఞాన పరిశోధన అనే గంగను విశ్వవిద్యాలయ కేదారాల్లోకి మళ్ళించి, పసిడి పంటలు పండించినవారు జానపద పరిశోధనా పరమేశ్వరులు ఆచార్య బిరుదురాజు రామరాజు గారు. వారివద్ద పరిశోధన చేయటం నా అదృష్టంగా భావిస్తున్నాను. పూర్వ విద్యార్థినైన నా ఈ సిద్ధాంత వ్యాసానికి పర్యవేక్షకులుగా ఉండి, పథనిర్దేశం చేస్తూ, నన్ను ముందుకు నడిపించారు.

ఈ రంగంలో తొలిప్రయత్నం చేసినవారు ఆచార్య పేర్వారం జగన్నాథం గారు. 1985 లో నేను ఈ అంశం మీద పరిశోధన చేస్తున్నానని చెప్పగానే నా వెన్నుతట్టి ప్రోత్సహించారు. ప్రస్తుతం తెలుగు విశ్వవిద్యాలయం వైస్‌చాన్సలర్‌గా ఎంతో పనులవొత్తిడిలో ఉండి కూడ నా అభ్యర్థనను మన్నించి, పెద్ద మనసుతో ఈ గ్రంథానికి 'ముందుమాట' ను పొందుపరిచారు.

నేను ఎం. ఫిల్. పూర్తిచేశాక, నా అభిరుచికి అనుగుణమైన అంశంపైన పి హెచ్. డి. కోసం పరిశోధన చేయాలనుకున్నప్పుడు సమ్మతించి, పరిశోధనకు అవకాశం కల్పించినవారు నాటి తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణ కుమారి గారు. తెలుగు జానపద విజ్ఞాన పరిశోధనకే కొత్త ఒరవడిపెట్టి, తర్వాతి పరిశోధకులకు మార్గదర్శకురాలైన మా గురువుగారు 'అక్కరకు వచ్చే పరిశోధన' అనే పీఠికతో నన్ను ఆశీర్వదించారు.

ఆంధ్రాంగ్ల కన్నడ భాషల్లో జానపద విజ్ఞానాన్ని మథించిన నిరంతర పరిశోధకులు డా॥ ఆర్వీయస్. సుందరంగారు అంత దూరంలో ఉండి కూడ నేను కోరగానే నా పరిశోధనను అభినందిస్తూ, అందరూ ఆలోచించదగ్గ అభిప్రాయం రాసి పంపారు.

డా॥ ఎం.కె. దేవకిగారు జానపద విజ్ఞాన పరిశోధన లోతుల్లోకి వెళ్ళినవారు. బిరుదురాజు రామరాజు జానపద విజ్ఞాన పరిశోధనా పురస్కార గౌరవాన్ని పొందినవారు. నా సిద్ధాంత గ్రంథానికి పరీక్షకులు. గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివి వెల్లడించిన వారి అమూల్యాభిప్రాయాలు నాలో పరిశోధనపట్ల మరింత ఉత్సుకతను రేకెత్తించటానికి దోహదం చేశాయి.

నేను ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల విద్యార్థిగా ఉన్నప్పుడు నన్ను గమనించి, దగ్గరకు తీసి పరిశోధనవైపు మళ్ళించినవారు అప్పటి కళాశాల ప్రిన్సిపాల్, ఇప్పుడు హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయంలో డీన్ ఆఫ్ ఆర్ట్స్ ఆచార్య కె. కె. రంగనాథాచార్యులుగారు, డా॥ కె. వి. సుందరాచార్యులు గారు, ప్రాచ్యకళాశాల ఆచార్య బృందం. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం ఫిల్. చేస్తున్నప్పటినుంచి, ఇప్పటివరకు నామీద ఆశీరమృతాన్ని కురిపిస్తున్న వారు గురువర్యులు ఆచార్య ఎస్వీ రామారావుగారు.

ఎల్లప్పుడూ నన్ను ప్రోత్సహిస్తున్నవారు తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య ఎన్, గోపిగారు; చేర్మన్, బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారు, తదితర ఆచార్యులూ అధ్యాపకమిత్రులు.

క్షేత్ర పర్యటనల్లో సమాచార సేకరణకు నేను వెళ్ళినప్పుడు ఓపికగా నాకు సహకరించిన సమాచార దాతల మేలు మరువరానిది. ఆయా జిల్లాల్లోని సమాచార దాతలను అనుబంధాలు - 7 లో స్మరించాను.

అడిగినప్పుడల్లా నా సందేహాల్ని తీర్చి ఎంతో సమాచారాన్ని అందించిన వారు మా అమ్మ శ్రీమతి నిదానకవి ఈశ్వరమ్మ, మా అక్క శ్రీమతి సిరివాటి దేవమ్మ, నా శ్రీమతి చి॥ నిదానకవి లలిత.

నాకు చేదోడువాదోడుగా సహకరించిన మా చిరంజీవులు విక్రాంత్, నిర్మల, నీరజ, నిశ్చల, నిఖిల.

కవర్ డిజైన్‌ను రూపొందించినవారు చిత్రకళాపెన్నిధి శీలా వీర్రాజుగారు.

అనుకున్న సమయంలో అచ్చుపనిని పూర్తిచేసినవారు పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీనివాస్ గౌడ్ మరియు వారి సిబ్బంది.

వీరే కాకుండ ఈ పరిశోధనా కార్యంలో, గ్రంథ ముద్రణ విషయంలో హృదయపూర్వకంగా సహాయసహకారాలు అందించిన పెద్దలు, మిత్రులు, జానపద కళాకారులు ఎందరో ఉన్నారు.

అందరికీ నా కృతజ్ఞతలు.

ఎన్. ఆర్. వెంకటేశం

# నివేదన

మానవుని తరతరాల సంస్కృతిని సమగ్రంగా దర్శించటానికి, అంచె లంచెలుగా ఎదిగిన మానవుని జీవనవికాసాన్ని అవగాహన చేసుకోవటానికి జాన పద విజ్ఞాన అధ్యయనం అనువైందని ప్రపంచమంతటా గుర్తించారు. జానపద విజ్ఞానాన్ని అనేక శాస్త్ర పద్ధతుల్లో అనుశీలించి, ఎన్నో కొత్త సంగతులను వెలికితీసి, మానవ సంస్కృతీ చరిత్రను పునర్నిర్మిస్తున్నారు.

ప్రపంచంలో భారతీయ సమాజానికే ప్రత్యేకమై, శతాబ్దాలుగా కొన సాగుతున్న కుల వ్యవస్థలో ప్రతి కులానికి ఒక ప్రతిపత్తి ఉంది. ప్రత్యేకమైన జీవన విధానం ఉంది. అలాగే ఆ కుల సంస్కృతిలో కూడా విలక్షణత్వం ఉంటుంది. హారంలోని పూసల్లాగా దేశ సంస్కృతిలో భాగమైన కులసంస్కృతిని అధ్యయనం చేయటం ఈనాడు ఎంతైనా అవసరం.

ఈనాడు రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాల తెలుగు శాఖల్లో జాన పద విజ్ఞానం మీద ముమ్మరంగా పరిశోధనలు జరుగుతున్నాయి. ఈ పరి శోధనల్లో కుల సంస్కృతి పరిశోధన కూడ ఒక భాగం. ముఖ్యంగా జానపద సాహిత్య సృష్టికర్తలూ, జానపద కళా స్రష్టలూ అయిన గాయక కులాల సంస్కృతుల మీద పరిశోధనలు మెల్లమెల్లగా పుంజుకుంటున్నాయి. ఈ పరి శోధనలు జానపద విజ్ఞాన పరిశోధనా విస్తృతికి దోహదం చేస్తాయి. భిన్న త్వంలో ఏకత్వంగా భాసిల్లుతున్న భారతీయ సంస్కృతిని సుసంపన్నం చేస్తాయి. మరుగున పడుతున్న కళా సంపదల తీరుతెన్నులను రికార్డు చేస్తాయి. వారు ప్రదర్శిస్తున్న కళలకు ఆనందించటమే కాదు, వాటి వెనుకవున్న ఆ కళా మూర్తుల జీవన సరళిలోని దైన్యానికి ప్రతిస్పందించటం కూడ సమాజం బాధ్యత. వారి కళారీతులలోపాటు, వారి జీవన విధానాలను కూడ వెలికితీయటం పరిశోధకుల బాధ్యత. అందువల్ల తరతరాలుగా మన కళాసంపదను, మన సంస్కృతిని మౌఖికంగా కాపాడుతూ వస్తున్న ఆ కళాకారుల ప్రదర్శన కళలను, వారి జీవితాన్ని అధ్యయనం చేయటం కూడ అవసరమవుతున్నది.

ఆచార్య బిరుదురాజు రామరాజుగారు విశ్వవిద్యాలయాల్లో జానపద పరిశోధనకు అంకురార్పణ చేశారు. వారి పరిశోధనా గ్రంథం 'తెలుగు జానపద గేయ సాహిత్యం'లో 'జానపద భిక్షుక గాయకులు' అనే పేరుతోని ప్రకరణంలో కొంతమంది జానపద కళాకారుల్ని దాదాపు పది పుటల్లో టూకీగా పరిచయం చేశారు.

ఒక కులంవారు ప్రదర్శించే కళల గురించి, వారి సాహిత్యం గురించి మొదటగా పరిశోధించటానికి పూనుకున్నవారు ఆచార్య పేర్వారం జగన్నాథం గారు. 'ఆరె జానపద సాహిత్యం - తెలుగు ప్రభావం' అనే వారి పరిశోధనా గ్రంథం ఈ రంగంలో తొలి ప్రయత్నం. తర్వాత 'జానపద భిక్షుక గాయకులు' అనే అంశం మీద డా॥ ఎన్. యాదగిరిశర్మగారు అనేక జానపద కళాకారుల కులాలను పరిశోధించి, వెయ్యి పుటలకు మించిన గ్రంథాన్ని రచించారు. ఆ గ్రంథం ఇంకా ముద్రింపబడలేదు.

1984 - 85 లో నేను 'బుడిగె జంగాలు - భాషా సాహిత్య సాంస్కృతి కాంశల పరిశీలన" అనే అంశాన్ని పిహెచ్.డి కి రిజిస్టర్ చేయించుకున్నాను. ఈ గ్రంథంలోని చాలా భాగాన్ని 1986, 87 సంవత్సరాల్లో రాశాను, అనివారణ కారణాలవల్ల ఆలస్యం జరిగి 1991 లో పూర్తిచేసి 1992 లో పట్టా పొందాను.

డా॥ చింతల రాజేశ్వరరావుగారు 'ఆంధ్రప్రదేశ్‌లోని పెరిక కులంవారి సాంఘిక, సాంస్కృతిక జీవన సమీక్ష' అనే పరిశోధనకు నాగార్జున విశ్వవిద్యాలయం నుంచి 1988 లో పట్టా పొంది, అదే సంవత్సరంలో గ్రంథాన్ని అచ్చు వేయించారు.

డా॥ చింతల యాదయ్యగారు 'జానపద విజ్ఞానంలో బవనీలు - పరిశీలన' అనే ఎం.ఫిల్. పరిశోధనా గ్రంథాన్ని 1990 లో ప్రచురించారు. డా॥ పులికొండ సుబ్బాచారిగారు రుంజకులం వారిని గురించి 1987 లో ఎం.ఫిల్; ఆశ్రిత కులాల మీద పరిశోధించి 1992 లో పిహెచ్.డి. పొందారు. 'గొరవయ్యలు' అనే జానపద కళాకారులను గురించి డా॥ బి రామాచార్యులుగారు (పిహెచ్.డి), 'జానపద విజ్ఞానంలో దాసర్లు' అనే అంశాన్ని స్వీకరించి డా॥ బి. కేశవులుగారు 1993 లో పిహెచ్.డి. కోసం పరిశోధనలు చేశారు. బీరన్నలమీద గంగాధర్‌గారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్. చేశారు.

ఇప్పుడు వివిధ విశ్వవిద్యాలయాల్లో ఎరుకల, బోయ, పిచ్చుగుంట్ల, వీర ముష్టి, లంబాడీ, గోండు మొదలైన కులాలమీద, తెగలమీద అనేక కోణాల్లోంచి పరిశోధనలు జరుగుతున్నాయి.

నేను ఈ పరిశోధనా గ్రంథంలో అధికాధికంగా వర్ణనాత్మక పద్ధతిని పాటించినప్పటికీ, అక్కడక్కడ అవసరమైనచోట్ల తులనాత్మక, విశ్లేషణాత్మక విధానాలను కూడ అనుసరించినట్లు గమనించవచ్చు. అలాగే దీన్ని భాషా సాహిత్య సాంస్కృతికాంశాల పరిశీలన అన్నప్పటికీ సామాజిక, మానవ శాస్త్ర దృక్పథంతో విశ్లేషించటానికి కూడ ప్రయత్నం చేశాను. Ethnographic Research పద్ధతిలో ఈ గ్రంథాన్ని రూపొందించటానికి ప్రయత్నించాను. ఇందులో ఎంతవరకు సఫలీకృతుణ్ణయ్యానో విజ్ఞుల అభిప్రాయాలే ప్రమాణం.

'బుడిగె' అనే వాద్యాన్ని ఉపయోగించి తందానా కథలు చెప్పే వీరికి 'బుడిగె జంగాల'ని పేరొచ్చినా, 'బుడిగె' పదమే తర్వాత కాలంలో 'బుడగ', 'బుడ్గ'గా ప్రచారంలోకి వచ్చింది. బుడిగె - బుడగ - బుడ్గ అనే పదాలు రూపాంతరాలు. నేను ఇందులో 'బుడిగె జంగాలు' అనే పేరునే స్వీకరించాను.

ప్రతి కులం పుట్టుకకు ఒక కథ ఉంటుంది. దాన్నే కులపురాణం అంటారు. బుడిగె జంగాల కులం గురించిన ఇలాంటి కథ ఒకటి బాగా ప్రచారంలో ఉంది. కుల పురాణాల్లో ఆ కులం గొప్పదనం, ప్రాముఖ్యం, ఆ కులం వారు ఆ వృత్తులు చేపట్టటానికి మూల కారణాలు మొదలైన అంశాలు పేర్కొనబడతాయి. కాని, ఈనాటికీ బుడిగె జంగం కులం హీనమైన, దీనమైన స్థితికి మూలమైన విషయాన్ని ఈ కథ చెబుతున్నది. ఇదొక శాప వృత్తాంతం.

పూర్వకాలంలో ఒకనాడు ఈ కులం మూలపురుషులు నలుగురు అడవిలో ఎలుకలు పట్టుకోవటానికి కన్నాన్ని త్రవ్వుతున్నారు. అప్పుడు లోకంమీదికి విహారానికి బయలుదేరిన పార్వతీపరమేశ్వరులు వీళ్ళను చూశారు. వీళ్ళ హీనమైన, దీనమైన, అటవిక జీవన స్థితికి జాలిపడి పార్వతీదేవి వీళ్ళకు సుఖప్రదమైన జీవితాన్ని ప్రసాదించమని భర్తను వేడుకున్నది. వీళ్లు దుష్టబుద్ధులు, అవివేకులు, ఎన్నటికీ బాగుపడే యోగంలేదని పరమేశ్వరుడు చెప్పాడు. మీరు తలుచుకుంటే అదెంతపనని పార్వతీదేవి పట్టుపట్టింది. సరే, ముందు వీళ్ళను

పరీక్షించి చూద్దాం - నీకే తెలుస్తుందని పరమేశ్వరుడు వృద్ధవేషం, పార్వతి పడుచువేషంలో వెళ్ళి, వాళ్ళకు హితవు చెప్పబోయారు. పార్వతీ పరమేశ్వరుల మాటలను పెడచెవిని పెట్టి- వృద్ధుని వేషంలో ఉన్న పరమేశ్వరుణ్ణి ఎగతాళి చేసి, ప్రక్కకు నెట్టి, పడుచు పార్వతి మీదికి కాముకులై వెళ్ళారు. అప్పుడు పార్వతీదేవి ఆగ్రహించి, మీరు సుఖశాంతులు కోల్పోయి స్థిర నివాసం లేక ఊరూరు తిరుగుతూ హీనమైన దీనమైన బ్రతుకు వెళ్ళదీయండని శపించింది. తర్వాత పార్వతీపరమేశ్వరులు అదృశ్యమయ్యారు అప్పటినుంచి ఈ కులస్థులు ఆటవిక అనాగరక సంచారజీవనులై కాలంగడుపుతున్నారట. ఇదీ కథ. ఈ కులస్థులు వీరశైవమతం పుచ్చుకోకముందునుంచే ఈ కథ ప్రచారంలో ఉండి ఉంటుంది. వీరశైవమతం క్షీణించాక, మతాచారాలను త్యజించి, మధు మాంసాహారులై జీవనోపాధికి బుడిగెలతో కథలు చెబుతూ బుడిగె జంగాలైనప్పటికీ ఈ కథే కుల పురాణంగా ఇప్పటికీ కొనసాగుతున్నది.

బుడిగె జంగాలు రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లోనే కాకుండ కర్నాటక, మహారాష్ట్ర ప్రాంతాల్లో కూడ నివసిస్తున్నారు విషయ సేకరణకోసం తెలంగాణా అన్ని జిల్లాల్లోనూ; ఉభయగోదావరులు. విశాఖ, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, ప్రకాశం, కర్నూలు, కడప, చిత్తూరు, అనంతపురం జిల్లాల్లోనూ పర్యటించాను. అలాగే బొంబాయిలో అనేక ప్రాంతాల్లో నివసిస్తున్నవారిని, కర్నాటకలోని బళ్ళారి, గంగావతి, హాస్పేట, కోలారు, బీదరు మొదలైన ప్రాంతాల్లో ఉన్న వారినికూడ కలుసుకున్నాను. రాష్ట్రంలో, రాష్ట్రేతర ప్రాంతాల్లో విస్తృతంగా పర్యటించినప్పటికీ, ఎక్కువగా తెలంగాణా ప్రాంతాన్నే ఉపయోగించుకున్నాను.

ఈ క్షేత్ర పర్యటన, సేకరణ అనంతం. ఒక పట్టాన ముగిసేవి కావు. ఇంకా మిగిలిపోయిందే ఎక్కువ. ఇప్పటికి తెలియవచ్చినంత తేటపరిచే ప్రయత్నమే నేను చేసింది.

ఎన్. ఆర్. వెంకటేశం

# విషయసూచిక

మొదటి ప్రకరణం

# బుడిగె జంగాలు – సంస్కృతి పరిచయం

## 1. జాతి-కులం-తెగ నిర్వచనం

మానవజాతి, భారత జాతి, తెలుగు జాతి, కోయజాతి అనే మాటలు తరచుగా విన్పిస్తుంటాయి. 'మానవ జాతి' అన్నప్పుడు 'జాతి' అనే పదం ఇతర ప్రాణికోటి నుంచి మానవ సంతతిని వేరుగా సంబోధించటానికి ఉద్దేశించబడు తున్నది. ఇంతకన్నా కొంత అర్థ సంకోచంతోగాని, మానవ శాస్త్రజ్ఞుల దృష్టితో గాని చూస్తే 'జాతి' అనే పదం శారీరక విలక్షణత్వం ఉన్న ఒకానొక మానవ సముదాయాన్ని బోధించటానికి ప్రయోగింపబడుతున్నది. ఉదా॥ మంగోలాయిడ్ జాతి, నీగ్రిటో జాతి. 'భారత జాతి' లోని 'జాతి' అనే పదాన్ని 'నేషన్' అనే ఆంగ్ల పదానికి సమానార్థకంగా వాడుతున్నారు 'భారతీయులు' అనే అర్థంలో ఇది ప్రయోగింపబడుతున్నది. ఏ భాష మాట్లాడేవారైనా ఈ దేశస్థులు భారతీయులే 'తెలుగు జాతి' అనే సమాసంలో 'జాతి' అనే పదం 'తెలుగు భాష మాట్లాడే ప్రజలు' అనే అర్థంలో వాడబడుతున్నది. 'కోయజాతి' అనే సమాసం లోని 'జాతి' ప్రత్యేకమైన ఒక తెగను బోధించటానికి నిర్దేశించబడింది. అంతే కాదు, కుల బోధకు కూడ జాతి పదాన్ని వాడటం ఇప్పటికీ ఉంది. తెలుగు శాసనాల్లో (16 శ॥) 'పద్దెనిమిది జాతులు వాండ్లు' అనే ప్రయోగాలు భాలా కనిపిస్తాయి. 'పద్దెనిమిది కులాల వాండ్లు' అనే అర్థంలోనే ఆ శాసన ప్రయోగాలు చేయబడ్డాయి. ఈ పరిశీలన వల్ల జాతి పదాన్ని రకరకాలుగా వాడుతున్నారని బోధపడుతుంది.

తెగ, కులం, జాతి-ఈ మూడు పర్యాయ పదాలు కావు. ప్రత్యేక అర్థ బోధకాలు. తెగ 'గిరిజన సముదాయం' అనే అర్థాన్నివ్వగా, 'కులం' అనేపదం గిరిజనేతర సమాజంలో ఒకానొక వృత్తి కలిగిన ప్రజల సమూహం అనే

అర్థాన్ని బోధిస్తుంది. ఈ రెంటికంటే జాతి విస్తృతార్థబోధకం. ఒకే భాష మాట్లాడే ఒక రాష్ట్రానికి చెందిన ప్రజలను, అంతేకాకుండా ఇంకా విపులార్థంలో దేశ ప్రజలను కూడ 'జాతి' అని అనవచ్చు. పుట్టుకతో వచ్చే కొన్ని దైహిక లక్షణాలు సమానంగా ఉన్న జన సముదాయాన్ని మానవ శాస్త్రజ్ఞులు "జాతి" అని అంటున్నారు, ఆంగ్లంలోని Race అనే పదానికి పర్యాయంగా వాడుతున్నారు. అప్పుడు 'జాతి' అనే పదం ఇంకా అర్థవ్యాకోచంతో ప్రయోగింపబడుతుంది.

'తెగ, కులం' అనే పదాలను సర్వసాధారణంగా పర్యాయ పదాలుగా వాడుతుంటారు. నిజానికి ఇవి భిన్నమైన జనసముదాయాలను బోధిస్తాయి. నేడు కులాలుగా పరిగణిస్తున్న వాటిని 'తెగలు' అని అనటం లేకపోయినా, తెగలుగా పరిగణించే వాటిని మాత్రం కులాలుగా చెప్పటం ఎక్కువగా జరుగుతున్నది. ఉదాహరణకు 'చెంచు, యానాది, ఎరుకల మొదలైన కులాలవారు' అని అంటూ ఉంటారు. నిజానికి అవన్నీ తెగలేకాని, కులాలు కావు. మచ్చుకు మరొక ఉదాహరణ "కొన్ని కులాలకు ఆదివాసుల లేదా జాతి పేర్లు ఉన్నాయి. ఉదా॥ బరవాన్, సంతాల్, మహర్, నాయర్, భీల్, గోండ్ మొదలైనవి."[1] ఇందులో సంతాల్, భీల్, గోండ్ మొదలైన తెగలను కులాలుగా పేర్కొనటం జరిగింది.

తెగ, కులం గురించి శాస్త్రజ్ఞుల నిర్వచనాలు ఎలా ఉన్నాయో చూద్దాం. మజుందార్ తెగను ఈ కిందివిధంగా నిర్వచించాడు: 'ఒక సామాజిక సమూహము నిర్దిష్ట ప్రాంతానికి నిర్దిష్టమై ఉండి, అంతర్వివాహ సమూహంగా ఉండి, కొన్ని ప్రత్యేక ప్రకార్యాలు కలిగి ఉండి, గిరిజన నాయకులతో పాలింపబడుతూ, ఒక భాషగాని, మాండలికాన్నిగాని మాట్లాడుతూ, కొన్ని ఇతర తెగలతోగాని, కులాలతోగాని సాంఘిక దూరం (Social Distance) ఏర్పరచుకొని, గిరిజన సంప్రదాయాలకు, ఆచార వ్యవహారాలకు కట్టుబడి ఉండి, ఆ సమూహంలోని వారందరూ సాదృశ్యత (Homogeneity) భావంతో కలిసి ఉండేదే ఒక తెగ."[2]

---

1. గ్రామీణ సమాజశాస్త్రం - పుట 26.
2. భారతదేశం - గిరిజన సముదాయాలు - పుట - 3.

ఇక కులం నిర్వచనాన్ని చూద్దాం. ''కొన్ని కుటుంబాల సమ్మేళనమై, వారందరూ ఒకే పేరుతో వ్యవహరింపబడుతూ, ఒకే వృత్తిని చేపడుతూ, ఒకే భాషను మాట్లాడుతూ, అంతర్వివాహ సముదాయంగా ఉంటూ, ఒక నిర్దిష్ట ప్రాంతంలో నివసిస్తున్న సమూహమే కులం."[1]

కులానికి, తెగకు భిన్న లక్షణాలెన్నో కనిపిస్తాయి. కులాలవారు గ్రామీణులు, ఆ తర్వాత పట్టణ లేక నగర వాసులుకాగా, తెగలవారు గ్రామాలకు దూరంగా కొండ ప్రాంతాలను ఆవాసాలుగా చేసుకున్నవారు. కులానికి భౌగోళికమైన విస్తృతి ఉండగా, తెగ అలాంటి విస్తృతిలేక పరిమితమై ఉంటుంది. కులం భౌగోళికమైన విస్తృతితో బాగా వ్యాపించి ఉన్నప్పటికీ ఒక కులంవారు మాట్లాడేదంతా ఒకే భాషగా ఉంటుంది. తెగవారికి ప్రత్యేకమైన పరిభాషగాని, మాండలికం గాని ఉంటుంది. కులపంచాయతీ వ్యవస్థ, ఆచార సాంప్రదాయ పాలన కులంలోకంటే తెగలో పటిష్టంగా ఉంటాయి. కులం లక్షణాల నుంచి తెగను వేరుచేసే ప్రధాన లక్షణం తెగకుండే పృథక్కరణం (Isolation.) కులాలవారు గ్రామాల్లో ఇతర కులాలతో కలిసిమెలసి ఉండగా, తెగలు ఇతర తెగల వారికీ, గ్రామవాసులైన కులాలవారికి దూరంగా నివసించటానికి ఇష్ట పడతారు.

## 2. బుడిగె[2] జంగాలు

బుడిగె జంగాలను ఒక కులంగా పరిగణించటం ఉంది. కాని కులం, తెగలక్షణాలను గమనించినట్లయితే వీరిలో తెగ లక్షణాలే ఎక్కువగా కనిపిస్తాయి. ప్రత్యేకమైన పరిభాషను కలిగి ఉండటం, నియతమైన వృత్తి లేకపోవటం, ఆచార సంప్రదాయ పాలనలో పటిష్టమైన కట్టుబాట్లు పాటించటం, గ్రామాలకు దూరంగా గుట్టుగా బిరాళ్ళలో (గూడెంలో) నివసించటం, వేటను సంప్రదాయోప వృత్తిగా కలిగి ఉండటం మొదలైన లక్షణాలు వీరిని ఒక తెగగా పరిగణించ టానికి దోహదం చేస్తాయి. జీవనోపాధికి జానపద కళారూపాలను ఒక వృత్తిగా ప్రదర్శించటం అలవర్చుకున్న తర్వాత గిరి ప్రాంతాల నుంచి ఊరి దరిదాపు

---

1. భారత దేశము - గిరిజన సముదాయాలు - పుట - 2.
2. బుడిగె > బుడగ > బుడ్గ — రూపాంతరాలు.

లకు వలస రావటం ప్రారంభించారని చెప్పవచ్చు. చెంచు, యానాది మొదలైన తెగల్లోకూడ ఈ మార్పును చూడవచ్చు. వీధి భాగోత ప్రదర్శనల్లో పేరు తెచ్చుకున్న చెంచులు చెంచు భాగోతులుగా, యానాదులు యానాది భాగోతులుగా పేరు పడటం ఈ సందర్భంలో గమనించవలసిన విషయం. కళా ప్రదర్శనలతో పొట్ట పోసుకోవటం అలవాటైన బుడిగె జంగాలు క్రమక్రమంగా అనేక జానపద కళా రూపాలను నేర్చుకొని, స్వంతం చేసుకొని, జానపద భిక్షుకగాయకులుగా పేరు బడ్డారు. సర్వకుల యాచకులుగా మారటం వల్ల తెగ లక్షణాలు కలిగిన వీరిని కూడ ప్రజలు ఒక కులంగానే పరిగణిస్తూ వచ్చారు.

జానపద గాయకులు రకరకాలు. వీరిని ప్రధానంగా రెండు భాగాలుగా విభజించవచ్చు. 1. ప్రవృత్తి గాయకులు 2. వృత్తిగాయకులు. కర్షకులు, కార్మికులు తాము చేస్తున్న పనుల్లో శ్రమ తెలియకుండా ఉండేందుకు జానపద గేయాలను సందర్భానుసారంగా పాడుతుంటారు. గ్రామీణులు ఆయా సందర్భాల్లో ఆయా గేయాలను పాడుతుంటారు. పని పాటలప్పుడూ, పండగలు ఉత్సవాలప్పుడూ, వినోదాలు వేడుకలప్పుడూ పాటలు పాడే వీరిని ప్రవృత్తి గాయకుల కింద చెప్పవచ్చు. వీరికి పాటలు పాడటం ఒక వృత్తికాదు, ప్రవృత్తి మాత్రమే. ప్రవృత్తిగాయకులకు భిన్నమైనవారు వృత్తిగాయకులు. వీరు జీవనోపాధికి కొన్ని వృత్తులను అవలంబిస్తారు. గ్రామీణులకు వినోదం కలిగించటానికి తమ వృత్తి కళారూపాలను ప్రదర్శిస్తారు. వృత్తిగాయకుల్లో మళ్ళీ రెండు విభాగాలు చేయవచ్చు. ఆశ్రితకులాలను యాచించి జీవించేవారు మొదటి విభాగం కాగా, సర్వకులభిక్షుక గాయకులు రెండో విభాగంలోనివారు.

తాంబూర బుడిగెలతో గాంధారి, కమ్మొరిపడతి మొదలైన శృంగార కథలను; లక్ష్మమ్మ, కామమ్మ మొదలైన శోకరసాత్మక కథలను; ముగ్గురు మరాఠీలు, కొండ్రాయుడు మొదలైన వీరగాథలను; బొబ్బిలి కథ, సదాశివరెడ్డి కథ, బుడ్డా వెంగళరెడ్డి కథ, సర్వాయి పాపని కథ మొదలైన చారిత్రాత్మక కథలను; కలియుగ పొన్న, బాలనాగమ్మ మొదలైన అద్భుత కథలతో పాటు శతాధిక కథలను ప్రజారంజకంగా గానం చేసే బుడిగె జంగాలు సర్వకుల భిక్షుక గాయకుల్లో ముఖ్యులు.

తెల్లవారుజామున బాలలను దీవిస్తూ భిక్షమెత్తే బాలసంతులు, గ్రామీణుల ముందు ఇంద్రజాల విద్యలను ప్రదర్శించటమేకాక, కాటిలో శుల్కాన్ని వసూలు చేసుకొనే కాటిపాపలు, 'కుర్రుమామ, కొండదేవత ఆన' అంటూ వచ్చి జాతకాలు చెప్పే కొండరాజులు కోయదొరలు; ఏకతార మీటుకుంటూ జోష్యాలు చెప్పే సన్యాసులు; వరుసగా 33 వేషాలు ప్రదర్శించి, సంభావనలు పుచ్చుకొనే పగటి వేషగాళ్ళు, యక్షగానాలనే కాకుండ తందానా కథలను వీధి నాటకాలుగా వేసే వీధిభాగోతులు, ఆరె వాళ్ళనుంచి తోలుబొమ్మలాటలను నేర్చుకొని ప్రదర్శించే తెలుగు తోలుబొమ్మలాటల వారు, ఇంకా గురుప్పలవారు, శారదకాండ్రు మొదలైన వృత్తికళా ప్రదర్శకులందరు సర్వకుల భిక్షుక గాయకులే. వీరితో పొదపోతులవారు (మందెచ్చుల వారు) అనే పేరుతో అడుక్కునేవారు మాత్రం యాదవులను ఆశ్రయించి జీవించే ఆశ్రితకుల భిక్షుక గాయకులుగా ఉన్నారు.

పైన పేర్కొన్న వృత్తి గాయకులందరు ఒకే ఒక్క కులానికి చెందిన వారనేది ఆశ్చర్యకరమైన విషయం. బుడిగె జంగం కులానికి చెందినవారే జీవిక కోసం ఈ వృత్తివేషాలను ప్రదర్శిస్తుంటారు. వీరిలో ఒక వ్యక్తి జీవితాంతం ఒకే వృత్తి వేషాన్ని ప్రదర్శిస్తుంటాడని చెప్పలేము. సందర్భాన్ని బట్టి అతడు ఈ వృత్తి వేషాలను ఆశ్రయిస్తుంటాడు. ఉదాహరణకు తుపాకి రాముని వేషం వేసి భిక్షం అడుక్కొని ఇంటికి వచ్చినవాడు ఒకరితోనో ఇద్దరితోనో (వంతపాట గాళ్ళతో) కలిసి తందానా కథ చెప్పటానికి వెళ్తాడు. మరొకరోజు అతడే భాగోత మేళంలో చేరి వేషం వేస్తాడు. ఈ విధంగా బుడిగె జంగాల్లో ఒక వృత్తి వేషం ఒకరికి పరిమితం కాదు. సమయానుకూలంగా వీరి వృత్తి వేషాలు మారు తుంటాయి. ఏ వృత్తి వేషం వేసినా, వారి కులమంతా ఒక్కటే. కంచం పొత్తు, వివాహ సంబంధాలు, ఇంటిపేర్లు, ఆచార సంప్రదాయాలు, బిరాదు (గూడెం), కులపంచాయతులు మొదలైన తెగ లేక కులం లక్షణాలన్నీ వీరందరికీ ఒక్కటే.

సాధారణంగా ఆయా కులాలవాళ్ళు జీవితాంతం ఒకే వృత్తిని అవలం బిస్తుంటారు. దక్కలివారు, బైండ్లవారు, చిందులు, ఎర్రగొల్లలు (ఒగ్గు కథకులు), దాసర్లు, పిచ్చకుంట్లవారు, చెంచులు (చెంచు భాగోతులు), యానాదులు (యానాది భాగోతులు), గంగిరెద్దులవారు, ఎల్లమ్మలవారు మొద

లైన కులాలవారు ఏదో ఒక వృత్తి కళను ఆశ్రయించి జీవితాంతం దాన్నే ప్రదర్శిస్తూ పొట్టపోసుకుంటారు. కమ్మరి, కుమ్మరి మొదలైన కులాలవారికి ఒక ప్రత్యేకమైన వృత్తి నియతంగా ఉంది. సర్వసాధారణంగా ఒక వృత్తిని అవలంబించే వారంతా ఒక కులంగా పరిగణింపబడతారు. ఈ దృష్టితోనే పూర్వ పరిశోధకులు బుడిగె జంగాలు ప్రదర్శించే ప్రతి వృత్తివేషాన్ని ఒక కులంగా చెప్పుకొచ్చారు.

అయ్యలరాజు నారాయణామాత్యుడు (18 శ) తెరనాటకపు జంగాలు, కాటి పాపలు, మందెచ్చులను వేరువేరు కులాలుగా పేర్కొన్నాడు.[1] ఆర్. ఇ. ఎంతోవెన్,[2] ఆర్. వి. రస్సెల్ హీరాలార్‌గార్లు[3] బాలసంత, కాటి పాపల మొదలైన వృత్తి వేషాలను భిన్నకులాలని భ్రమపడ్డారు. థర్‌స్టన్ (1903) జంగాలు, బాల సంతోషులు, కాటి పాపలను ప్రత్యేక కులాలుగా పేర్కొనగా,[4] సయ్యద్ షిరాజుల్ హసన్‌గారు (1920) తెలుగు మెండికేంట్స్ పేరుతో కాటి పాపల, శారదకాని, బాలసంతోష, బహురూపులు, గురుప్పల. తోలుబొమ్మలాట వారు, మందపిచ్చి, సన్యాసి వారిని రకరకాల కులాలవారిగా వివరించాడు.[5] గులాం అహమద్‌ఖాన్‌గారు (1931) కాటిపాపల, బాల సంతోషం అనే వారిని రెండు కులాల కింద తెలిపారు.[6]

ఆచార్య బిరుదురాజు రామరాజుగారు బుడిగె జంగాలు, శారదకాండ్రను, బాల సంతు వారిని వేరు వేరు జానపద గాయకుల పేరుతో తెలిపారు.[7] ఆచార్య

---

1. హంస వింశతి - 3-29.
2. The Tribes and castes of Bombay.
3. The Tribes and castes of the central provinces of India.
4. The Castes and Tribes of Southern India.
5. The castes and Tribes of H.E.H. The Nizam's Dominians.
6. Census of India 1931 Vol. XXIII. Part. I. Report.
7. తెలుగు జానపద గేయ సాహిత్యము.

నాయని కృష్ణకుమారి గారు బుడిగె జంగాలు, శారద కాండ్రు వేరువేరని అభిప్రాయపడగా,[1] డా. మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి గారు బుడిగె జంగాలు, పిరికి జంగాలు, ఈతముక్కు జంగాలు, కాటిపాపలవాళ్ళు, బాలసంతువారు అనే వృత్తి గాయకులను ప్రత్యేక శీర్షికల కింద చూపారు.[2] డా॥ యెల్దండ రఘుమారెడ్డిగారు జానపద భిక్షుకుల్లో శారదకాండ్రు, బాలసంతులను వేరువేరుగా పేర్కొనటమేకాక, వీరు కాటిపాపల, సాధు, మందపిచ్చి, తగరు జోగు, తోలు బొమ్మలాట, ఏకతార సన్యాసి మొదలైన సుమారు 30 వేషాలు వేస్తారని వివరించారు.[3] ఆరుద్రగారు జంగాలు, పగటి వేషగాళ్ళు, పొడపోతులవారు, బాలసంతులు, బొమ్మలాటవారు, భాగవతులు, శారదకాండ్రు విభిన్న ప్రజా కళా ప్రదర్శకులని వర్ణించారు[4] డా॥ ఆర్.వి.ఎస్. సుందరంగారు బుడిగె జంగాలు, శారద కాండ్రు, బాలసంతువారు, బొమ్మలాట వారిని వేరువేరుగా ప్రస్తావించారు.[5]

పైన ఉదాహరించిన పరిశోధకులు కొందరు వీరిని జానపద గాయకుల పేరుతో, మరికొందరు ప్రజాకళాకారుల పేరుతో, వృత్తి గాయకుల పేరుతో వింగడించినప్పటికీ ఈ విభాగాలు కుల స్పృహతో చేసినవే అయినందువల్ల బుడిగె జంగాలు ప్రదర్శించే అనేక వృత్తి వేషాలను వేరువేరు కులాలుగా గుర్తించారని అభిప్రాయపడవచ్చు. నిజానికి అవన్నీ జీవనోపాధికి వేసిన వేషాలే గాని, ఆ వేషగాళ్ళ కులం మాత్రం ఒక్కటే.

పలురకాల వేషాలు ప్రదర్శిస్తున్నప్పటికీ, వీరంతా ఒకే కులం వారని కొందరు పరిశోధకులు గుర్తించకపోలేదు. శారదగాళ్ళు, సన్యాసి, సాధు, బాలసంతు, గురవ్వల, కాటికాపరి, పగటివేషగాళ్ళు, మందెచ్చులు వీరంతా (బుడిగె లేక గుడిసె) జంగం కులం వారేనని డా॥ యన్. విజయగారు తమ పరిశోధనలో

---

1. తెలుగు జానపద గేయ గాథలు.
2. ఆంధ్ర నాటక రంగచరిత్ర.
3. బాలసంతువారి ఉత్తర రామాయణం (వ్యాసం) భారతి అక్టోబరు 1977.
4. ప్రజాకళలు - ప్రగతివాదులు.
5. ఆంధ్రుల జానపద విజ్ఞానం.

తెల్పారు.[1] డా॥ ఎన్. యాదగిరి శర్మగారు శారదగాళ్ళు, బహురూపులు, కాటి పాపలు, బాలసంతులు, భాగవతులు, బైరాగులు, తోలుబొమ్మలాటలవాళ్ళు, మందులమ్మే కొండరాజులు, తుపాకి రాముడు, మందెచ్చులు అనే భిక్షుక గాయకులందరూ బుడిగె జంగం కులం వారేనని తమ పరిశీలనలో వెల్లడించారు.[2]

ఇక్కడ వీరి కులసంస్కృతి పరిశీలించవలసి ఉన్నది. కాబట్టి బుడిగె జంగం కులంవారు ప్రదర్శించే కళా ప్రక్రియలేవో తెలుసుకోవలసిన అవసరం ఉంది. అంతే కాకుండా వృత్తివేషాల పేర్లనే ప్రజలు, కొందరు పరిశోధకులు కులాలుగా పరిగణిస్తుండటంవల్ల వృత్తి వేషాలేవి? వారి కులమేది? అనే ప్రశ్నలకు జవాబు అరయవలసివచ్చింది. ఈ పరిశీలనవల్ల 'బుడిగె జంగం' అనే కులం వారు పైన పేర్కొన్న అనేక వృత్తి కళారూపాలను జీవనాధారంగా చేసుకొని తెలుగుదేశమంతటా ప్రదర్శనలిస్తుంటారని స్పష్టమైంది.

## 3. సంస్కృతి నిర్వచనం

సంస్కృతిని పలువురు పలురకాలుగా నిర్వచించారు. ఖండవల్లి లక్ష్మి రంజనం, బాలేందు శేఖరంగార్లు "ఒక జాతి యభివృద్ధి మార్గమున నడచిన రీతిని సంస్కృతి యనుచున్నారు. జాతులు కాని, సంఘములుకాని భౌతికముగను, మానసికముగను ఉచ్ఛదశ నొందుటకై చేయు నిరంతర యత్నమే వారి సంస్కృతియని చెప్పనగును" అని నిర్వచించి, సంస్కృతిని ప్రధానంగా రెండు భాగాలుగా విభజించారు. అవి 1. నిత్యజీవితం, 2. శాశ్వతజీవితం. 'నిత్యజీవితం' అనే భాగాన్ని రెండు విభాగాలుగా చేశారు. 1. వ్యక్తిజీవితం, 2. సమష్టిజీవితం. వ్యక్తి జీవితాన్ని 11 అంశాలుగా, సమష్టి జీవితాన్ని 15 అంశాలుగా వింగడించారు. శాశ్వత జీవితాన్ని 6 విభాగాలుగా చూపారు.[3] ఇందులో కొన్ని అంశాలు ఈ విభాగంలో పేర్కొనవలసినవి ఆ విభాగంలో, ఆ విభాగంలో పేర్కొనవలసినవి ఈ విభాగంలో చేర్చటం జరిగినా మొత్తం మీద సంస్కృతిలో భాగమైన అన్ని అంశాలను సమగ్రంగా చర్చించటం జరిగిందని చెప్పవచ్చు.

---

1. The Role of Traditional Folk media in Rural Areas.
2. జానపద భిక్షుక గాయకులు (సిద్ధాంత వ్యాసం - అముద్రితం).
3. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి పుట. 11.

ఆచార్య నాయని కృష్ణకుమారిగారు "సంస్కృతిని భిన్నవర్గములకు భిన్నకాలములకు చెందిన రక రకముల ఆచారముల యొక్కయు, నడవడికల యొక్కయు నమూనాలను (Patterns) సంతరించుకొన్న సమాహార స్వరూప ముగా నిర్ణయింపవచ్చును" అని నిర్ణయించారు.[1] ఒక జాతి సంస్కృతిని అవగతం చేసుకోవాలంటే ఆ జాతికి చెందిన వివిధ కాలాల్లోని, వివిధావస్థలలోని సంఘ జీవనాన్ని పరిశీలించటమే అని విశదీకరించారు.

డా॥ ఆర్. వి. ఎస్. సుందరంగారు సంస్కృతిని నిర్వచిస్తూ "ఆది మానవుని కాలంనుంచి నేటి నాగరిక మానవునివరకు ఆయా కాలాల్లో మనిషి అభ్యున్నతికోసం చేసిన కృషి సంస్కృతి. అంటే, మానవ కృతి సంస్కృతి అన్నమాట" అని వివరించారు.[2]

"ఒక జాతి అనేక కాలములలో పురోగమించిన సంవిధానమునందు సముద్గమించిన సౌమనస విశేషమే సంస్కృతి" అని డా॥ ప్రసాదరాయ కులపతి గారు అంటే,[3] "సంస్కృతి ఉభయాత్మకంగా ఉంటుంది. సౌజన్యం, దాక్షిణ్యం, నిస్వార్థం మొదలైనవి 'సంస్కృతి' అనిపించుకొంటే దౌర్జన్యం, నిర్దాక్షిణ్యం, స్వార్థం అనేవి 'అసంస్కృతి' అనిపించుకొంటాయి" అంటూ ఎం. ఆర్. అప్పా రావుగారు భావించారు.[4] ఈ నిర్వచనంలో 'సంస్కృతి' అంటే 'సంస్కారం' అనే భావన కనిపిస్తుంది. సంస్కారం అంటే మనస్తత్వం, తదనుగుణమైన ప్రవర్తన అని చెప్పవచ్చు. సంస్కృతి సంస్కారం కంటే విస్తృతార్థబోధకంగా ఉంది. సంస్కృతి స్వరూప స్వభావాలను స్పష్టపరచడానికి ఇంకా కొన్ని నిర్వచనాలు గమనిద్దాం.

తెలుగు విజ్ఞాన సర్వస్వం సంస్కృతిని ఇలా నిర్వచించింది: "సమాజము లేదా వర్గము యొక్క మొత్తము జీవిత విధానముల కలయికయే సంస్కృతి.

---

1. తెలుగు జానపదగేయ గాథలు పుట 6.
2. ఆంధ్రుల జానపద విజ్ఞానం పుట. 1.
3. సంస్కృతి - యువభారతి ప్రచురణ పుట - 1.
4. సంస్కృతి - ఆంధ్రా యూనివర్శిటీ ప్రచురణ పుట - 4.

సమాజంలోని సభ్యులు ఒక విధమైన ఆలోచనావైఖరులనవలంబించి, ఒకే రీతి చర్యలు చేయుచు, ఒకేరకమైన వస్తువులను కలిగియుండటం ద్వారా ఒక ప్రత్యేక జీవన మార్గమును వ్యాప్తి నొందించుచున్నారు. సంఘమున కంతటికి సామాన్య లక్షణములైన ఈ ఆలోచనలు, చేష్టలు, వస్తువులు మొదలగునవి సంస్కృతికి మూలకందములై యున్నవి.''[1] ఇందులో సంస్కృతినంతా భావ సంపద, సాంఘిక సంపద, వస్తు సంపద అనే మూడు భాగాల కింద చూపటం జరిగింది. పురాణేతిహాసాలు, మత విశ్వాసాలు, మూఢ విశ్వాసాలు, వైజ్ఞానిక సత్యాలు, సామెతలు, నీతి సూక్తులు, సాహిత్యం - ఇవన్నీ సంస్కృతి భావ సంపద కాగా, సంఘానికి సామాన్య ప్రవర్తనాదికాలైన న్యాయ శాస్త్రం, నీతి నియమాలు, సంప్రదాయాలు, ఆచారాలు. విధి నిషేధాలు, కర్మకాండలు, ఆంక్షలు, ఉత్సవాలు, మర్యాదలు సంస్కృతి సాంఘిక సంపదగా చూపబడ్డాయి. సంస్కృతిలో మూడవ భాగమైన వస్తు సంపదలో భౌతిక వస్తుజాలమైన పరికరాలు, యంత్రాలు, భవనాలు, వస్త్రాలు, వాహనాలు, కళాఖండాలు మొదలైనవి చేర్చబడ్డాయి.

మలినోవస్కీ "పూర్తి జీవిత విధానమే సంస్కృతి" అని నిర్వచించగా, రెడ్‌ఫీల్డ్స్ ''కళాఖండాలు, సాంఘిక నమూనాలు, సాంకేతికాల ప్రపంచమే సంస్కృతి'' అన్నారు. లెప్‌విరైట్ ''సంస్కృతి ఒక వ్యవస్థ. అందులో పనులు, వస్తువులు, ఆలోచనలు, నమ్మకాలు, విలువలు మొదలగునవి సంకేతానుసారంగా ఉంది, కాలక్రమాన మార్పు చెందుతూ ఉండేవే సాంస్కృతిక లక్షణాలు'' అని తెలిపారు. ''నేర్చుకొన్న అలవాట్ల సముదాయం సంస్కృతి'' అని లిన్టన్ అభిప్రాయపడగా పార్సన్ ''దైనందిన జీవిత కార్యక్రమాల పద్ధతి"గా సంస్కృతిని వర్ణించారు.[2]

శాస్త్రజ్ఞులు సంస్కృతి ఏర్పడటానికి గల కారణాలను వర్గీకరించి చూపారు.[3] సంస్కృతి భవనానికి వాటిని పునాదులుగా చెప్పారు. వీటిని ముందు

---

1. విజ్ఞాన సర్వస్వం - 10 వ సంపుటం పుట - 755.
2. సంస్కృతి అంటే ఏమిటి? పుట. 4.
3. సంస్కృతి అంటే ఏమిటి?

రెండు భాగాలుగా విభజించారు 1. స్వాభావిక వ్యక్తిగత పునాదులు, 2. కృత్రిమ సామాజిక పునాదులు. మొదటి భాగంలో పరిసరం, స్వీయ పరిస్థితులు, శ్రమ, సృజనాత్మకత, బాహ్య ప్రపంచానికి బయటి పడటం (Exposure) అనే అంశాలు ఉండగా; రెండవ భాగంలో మత సంస్థలు, రాజకీయ సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు అనేవి చోటు చేసుకున్నాయి. ఈ వర్గీకరణను కింది విధంగా చూపవచ్చు:




సంస్కృతి ఏర్పడడానికి కారణాలను వర్గీకరించినట్లే సాంస్కృతిక రూపాలను కూడ శాస్త్రజ్ఞులు విభాగించి చూపారు.[1] మొదట రెండు భాగాలుగా విభజించారు. 1. పరిమాణాత్మక రూపాలు, 2. గుణాత్మక రూపాలు. పరిమాణాత్మక రూపాల్లో భాష, వాఙ్మయం, కళలు అనే భాగాలు చేరగా గుణాత్మక రూపాల్లో తత్త్వశాస్త్రం, నైతిక సిద్ధాంతాలు, రాజకీయాలు, వైజ్ఞానిక సాంకేతిక పరిజ్ఞానం అనే భాగాలు చేరుతాయి. ఈ వర్గీకరణ కింది విధంగా ఉంటుంది:

---

1. సంస్కృతి అంటే ఏమిటి?




పై నిర్వచనాలన్ని సమీక్షించి ఈ విధంగా సంస్కృతిని నిర్వచింపవచ్చు: అనుభవం, ఆలోచన పరస్పర అలంబనాలు. ఈ రెంటి సమన్వయరూప కల్పనే మానవుని జీవనవిధానంగా కొనసాగుతున్నది. కూడు, గూడు, గుడ్డ అనే ప్రాథమికావసరాల చుట్టూ మానవుడు ఏర్పరచుకున్న జీవనసరళిని; జనన మరణాలు, వివాహాది ఉత్సవాలు, పండుగలూ పబ్బాలు మొదలైన సందర్భాల్లో అవలంబించే ఆచార సంప్రదాయ సంచయాన్ని; భాష, భావ సంపదలను, ప్రకృతికి ప్రతికృతిగా మానసికోల్లాసానికి మానవుడు తీర్చిదిద్దుకున్న కళాకలాపాన్ని; మానవుని బౌద్ధిక, భౌతిక ప్రేరకాలతో, కారకాలతో ఏర్పడిన జీవన విధానాల సమాహార స్వరూపాన్ని సంస్కృతిగా నిర్వచించవచ్చు.

## 4. జానపద సంస్కృతి - కుల సంస్కృతి

ఈనాడు ప్రపంచ మానవాళి సంస్కృతి ఏకీకరణవైపు పయనిస్తున్నది. అయితే, ఈ ప్రపంచైక సంస్కృతిలో ప్రధానంగా మానవతా విలువలు ఏక సూత్రతను సాధించటానికి ప్రయత్నిస్తాయి. ఉదాత్తమైన, ఉత్తమమైన సంస్కారానికి పెడుతున్న పేరే ఈ ప్రపంచైక సంస్కృతి లేదా విశ్వమానవ సంస్కృతి. సంస్కారాన్ని, సంస్కృతిని వేరు చేసి చూస్తేగాని సంస్కృతిలో ఉన్న అనంత వైవిధ్యం అర్థం కాదు.

గ్రీకుల సంస్కృతికి యూదుల సంస్కృతికి, రోమనుల సంస్కృతికి ఉన్న వ్యత్యాసాలు ఎవరూ కాదనలేనివి. అలాగే పాశ్చాత్య సంస్కృతికి ప్రాచ్య సంస్కృతికి ఉన్న భిన్నత్వం కొట్టవచ్చినట్లు కనబడకపోదు.

భిన్నత్వంలో ఏకత్వంలా ఉన్న భారతీయ సంస్కృతిలోనే ఆర్య, ద్రావిడ సంస్కృతులను విడదీయవచ్చు. సంస్కృతిని వేరుచేసి చూపే శక్తి మతానికి ఉన్నదనే విషయం మరువరానిది. క్రైస్తవ, మొహమ్మదీయ, హిందూ మొదలైన మతాల సంస్కృతులు విభిన్నమైనవి. ఒక్క హిందూ మతంలోనే పెక్కు రూపాలలో సంస్కృతి అగుపిస్తుంది. అద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైతం మతావలంబకులలో వేరు వేరు సంస్కృతిని గమనింపవచ్చు. వైష్ణవ, శైవాది మతస్థుల్లో వారి వారి సంస్కృతుల తీరు వేరు వేరుగా ఉంటుంది. ఈ విధంగానే ఒక్కో కులాన్ని తీసుకుంటే ఒక్కొక్క విధమైన సంస్కృతి కనిపిస్తుంది.

నగరాల్లో నివసించే వారికి నాగరికత వేరుగా ఉంటుంది కాని, సంస్కృతి ఒక్కటే అని కొందరు వాదిస్తారు. సంస్కృతిలో 3 దశలున్నాయని మానవ శాస్త్రజ్ఞులు పేర్కొన్నారు. అవి 1. అరణ్య జీవనస్థితి 2.అనాగరకస్థితి 3. నాగరక స్థితి.[1] మానవుని జీవన వికాసంలో ఈ సంస్కృతి దశలు మజిలీలు కావచ్చు. అయితే, ఆధునిక కాలంలో కూడ ఈ మూడు విలక్షణ సంస్కృతి రూపాలను ఒకేసారి సమాజంలో దర్శింపవచ్చు. ఈ మూడింటిని ఆటవికుల (గిరిజన) సంస్కృతి, గ్రామీణ సంస్కృతి, నాగరక సంస్కృతిగా అన్వయించుకోవచ్చు. అప్పుడు గ్రామీణుల్లో వ్యావసాయిక పరిసరాలు కలిగిన జానపద సంస్కృతిని, నగరాల్లో స్థిరనివాసులుగా ఉన్నవారిలో నాగరక సంస్కృతిని దర్శింపవచ్చు.

వేష భూషణ గ్రాస వాసాదులు, గృహారామ వీటి వాటికా గ్రామ పట్టణాదిక నిర్మాణాలూ, భాషా వాఙ్మయ వాస్తు చిత్ర సంగీత నృత్య కళాదికాలు, వర్ణమత ధర్మ దేవాలయాదులూ, వృత్తి వ్యవసాయ పరిశ్రమాదులూ సంస్కృతిలోని అంశాలుగా చెబుతారు.[2] ఇందులోని అనేక అంశాలు ఒక్కొక్క సమాజానికి ఒక్కొక్క విధంగా ఉంటాయి. అందువల్ల సంస్కృతిలో భేదం చోటు చేసుకుంటుంది. ఒక జన సమూదాయంలో ఒకానొక వృత్తి చేసేవానిది, మరో సమాజంలోని అదే వృత్తి చేపట్టేవానిది ఒకే సంస్కృతి కాదు. ఇద్దరి సంస్కృతులు వేరువేరుగా ఉంటాయి.

---

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుట 2.
2. తెలుగు శాసనాల సామాజిక, సాంస్కృతిక అధ్యయనం (అముద్రిత సిద్ధాంత వ్యాసం) పుట 11.

పై విషయాన్ని స్థాపిస్తూ టి. ఎస్. ఇలియట్ ఇలా అన్నారు. "ఒక కళాకారుని సంస్కృతో, తాత్వికుని సంస్కృతో లెక్కలు వ్రాసేవాని సంస్కృతి కంటే లేదా వ్యవసాయదారుని సంస్కృతికంటే కొద్దిగా భిన్నమైంది.... ఇతర దేశాలలో, ఇతర ప్రజా సమూహాలలో అదే వృత్తులు అవలంబించినవారి సంస్కృతి, వీరి సంస్కృతి ఒకటి మాత్రం కాదు."[1]

అలాగే భిన్నమైన కులాలవారికి భిన్న సంస్కృతులు ఉంటాయి. ఒక కులానికి మరో కులానికి పైన పేర్కొన్న సంస్కృతి అంశాలలో తారతమ్యాలు తప్పనిసరి. అందువల్లనే కులసంస్కృతులు విలక్షణంగా ఉంటాయి.

ఇతర కులాలనుంచి, తెగల నుంచి బుడిగె జంగాలను వేరుచేసి చూపే ఆచార సంప్రదాయాల్లోని ప్రత్యేకమైన కుల సంస్కృతి అంశాలను పరిశీలించే ముందు, 'జంగం' కులం ఎన్ని ఉపకులాలుగా చీలిందో చూద్దాం.

1. 'తెలుగు శాసనాల సామాజిక, సాంస్కృతిక అధ్యయనం'లోని ఉటంకింపు - పుట-14

## రెండవ ప్రకరణం

# జంగం కులాలు

### జంగం శబ్ద విచారం

"మొల పులి తోలును మేనం
బలుచని వెలిపూత యఱుత పాములపేరున్
తల మిన్నేఱును జడలను
చలి వెలుగుం గలుగు మేటి జంగము గొలుతున్"—2.59.

కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో జంగంగా శివుని స్తుతిస్తూ చెప్పిన అచ్చ తెలుగు పద్యమిది. శిష్ట సాహిత్యంలోను, జానపద సాహిత్యంలోను శివుణ్ణి 'జంగం,' 'జంగమయ్య,' 'జంగమదేవర' అనే పేర్లతో వర్ణించటం కనిపిస్తుంది. సిరియాలుని కథలో శివుని జంగం వేషవర్ణన ఉంది. శివుడు మాయా జంగం వేషంలో వచ్చి, పరీక్షించి, అనుగ్రహించటం వర్ణించబడింది. పాల్కురికి సోమనాథుడు బసవపురాణంలోనూ, శ్రీనాథుడు హర విలాసంలోను ఈ కథను రచించారు. జానపదులు కూడ ఈ కథను ఆయా సందర్భాల్లో పాడుకుంటారు. అనుముల బ్రహ్మారెడ్డి కథ, పర్వతాల మల్లారెడ్డి కథ, కొమిరెల్లి మల్లన్న కథ, ఎలనాగిరెడ్డి కథ మొదలైన జానపద కథల్లో కూడ జంగమయ్య వర్ణన చేయబడింది.

బహుదేవతారాధనను నిరసించి, జంగమదేవర అయిన శివుణ్ణి ఏకైక దేవుడుగా స్థాపించిన వీరశైవం, శివభక్తునికి కూడ 'జంగం' అని పేరు పెట్టింది. కనిపించని దేవుడు శివుడయితే కనిపించే దేవుడు జంగముడని వీరశైవునికి ఎంతో ప్రాధాన్యతను సమకూర్చింది.

వీరశైవ మతోద్భవానికి ముందు 'జంగమ' శబ్దానికి 'తిరగునది,' 'భ్రమించునది' అనే అర్థాలుండేవి. 'స్థావర' శబ్దానికి వ్యతిరేక శబ్దంగా జంగమ

పదముండేది. వీరశైవ మతంలో అర్థం మారింది. 'జంగముడు' అంటే 'శివారాధకుడు', 'శివ భక్తుడు', 'లింగధారి', 'లింగం ధరించి శివుని మాత్రమే పూజించువాడు' అనే అర్థాలను నిఘంటువులు చూపుతున్నాయి. జంగమ శబ్దాన్ని బసవేశ్వరుడు విస్తృతార్థంలో వాడాడు. వీరశైవ మతంలోని గురు, లింగ, జంగమ సేవను 'త్రిపుటి దాసోహ'మంటారు శరీరాన్ని గురుసేవకు, మనస్సును లింగారాధనకు, సంపదను జంగాలకు అర్పిస్తేనే అధ్యాత్మికమైన పరిపూర్ణత్వం సిద్ధిస్తుందని బసవేశ్వరుడు బోధించాడు. జంగానికి కులగోత్రాలు లేవని చెప్పాడు. "జంగము దనగా సర్వవ్యాపి అయినవాడు. అహంకారాన్ని పూర్తిగా తుడిచిపెట్టి సర్వ విశ్వమును ఆలింగన మొనర్చుకొని, దానిని అధిగమించిన వాడు నిజమైన జంగముడు. జంగముడు సహజ జాగృతి ద్వారా విశ్వ చైతన్యంలో లీనమై తన వ్యక్తిత్వాని పరిత్యజిస్తాడు"[1] అంటూ బసవేశ్వరుడు జంగముణ్ణి నిర్వచించాడు.

ఆనాడు జంగాల్లో నాలుగు విభాగాలు ఉండేవి. 1. మఠమతులు 2. స్థావరీకులు 3. గణాచారులు 4 మడపతులు. మఠపతులు మఠాలకు అధిపతులుగా ఉండి, వీరశైవమతాన్ని ప్రచారం చేసేవారు. వీళ్ళు బ్రహ్మచారులై ఐహిక సుఖాలను త్యజించి శివలింగార్చనలోనే నిమగ్నులై ఉండేవారు. వీళ్ళతో మఠాధికారులు మఠాల్లో విధులు నిర్వహించగా, చరాధికారులు సంచారం చేసేవారు. స్థావరీకులు గృహస్థులు. గురువరంపరలోనివారు. వీళ్ళు లింగాయతులకు పురోహితులుగా ఉండేవారు. గణాచారులనబడేవారు మఠవతులకు శిష్యులు. వారి ఆజ్ఞానుసారులై ఊరూరు తిరిగి పూజాదికాలు నిర్వహిస్తూ భిక్ష సంగ్రహించేవారు. మడపతులు కూడ మఠపతులకు సహాయకులుగా ఉంటూ లింగాయతులకు కర్మకాండలను నిర్వహించేవారు.[2]

విశిష్టాద్వైతి మంత్రం, శంఖ చక్ర ముద్రలు, పుండ్రం, పాదతీర్థం, ఆచార్య శేషం (ఉచ్ఛిష్టం) అనే పంచసంస్కారాలు ఆచరించినట్లుగానే,

---

1. బసవేశ్వరుడు - పుట 46. ఆంగ్లమూలం: హెచ్. తిప్పే రుద్రస్వామి. అనువాదం. బి. వి. సింగరాచార్య.
2. The Castes and Tribes of H.E.H. The Nizam's Dominions. Page.387.

లింగాయతుడైనవాడు 'అష్టావరణ' మనే అష్టవిధార్చనా దీక్షను ఆచరించాలి. అందులోని ఎనిమిది అంశాలు 1. గురువు, 2. లింగం, 3. జంగం, 4. తీర్థం లేక పాదోదకం, 5. ప్రసాదం, 6. విభూతి, 7. రుద్రాక్ష 8. మంత్రం (పంచాక్షరి - నమశ్శివాయ).[1]

జంగాలు తమను పంచాచార్యుల గురుపరంపరలోని వారమని చెప్పుకొన్నారు. శివుని పంచముఖాలనుంచి ఈ పంచాచార్యులు ఉద్భవించి, దేశంలోని ఐదు ప్రదేశాల్లోని పంచపీఠాల్లో ఉండేవారు. శివుని పంచముఖాలు సద్యోజాత నుంచి రేవణారాధ్యుడు, వామదేవ నుంచి మరుళారాధ్యుడు, అఘోర నుంచి ఏకోరామారాధ్యుడు, తత్పురుషనుంచి పండితారాధ్యుడు, ఈశాన్యముఖంనుంచి విశ్వారాధ్యుడు జన్మించారని చెబుతారు. వీళ్ళ గోత్రాలు వరుసగా వృషభ, నంది, భృంగి, వీరభద్ర, స్కంద కాగా, వీళ్ళు నెలకొన్న పీఠాలు క్రమంగా బాళహళ్ళి, వటక్షేత్రం (ఉజ్జయిని), దాక్షారామం, శ్రీశైలం, కాశి అనే పంచపీఠాలు.[2]

బసవేశ్వరుడు కులాతీతమైన మతాన్ని స్థాపించాలని కృషిచేసి కృతకృత్యుడయ్యాడు. కాని, బసవేశ్వరుని మరణానంతరం వీరశైవంలో ఉచ్చనీచ భేదం, బ్రాహ్మణాధిక్యం తిరిగి తలెత్తింది. కులాలు, ఉపకులాలు ఏర్పడటం ప్రారంభమయింది. తరతమ భేదాలతో లింగాయతుల్లో నాలుగు విభాగాలు ఏర్పడ్డాయి. మొదటి విభాగం జంగాలు. లింగాయతులకు వీళ్ళు గురువులు. రెండవ విభాగంగా ఏర్పడ్డవాళ్ళు లింగబలిజలు ప్రారంభంలో వీరశైవాన్ని స్వీకరించిన వాళ్ళు తర్వాత వచ్చిన వాళ్ళను తమకన్న తక్కువగా భావించారు. తమ ప్రాధాన్యత నిలుపుకోవటానికి ఒక ప్రత్యేక సమూహంగా ఏర్పడ్డారు. అదే ఒక కులంగా రూపుదిద్దుకున్నది. వీళ్ళనే తెలంగాణాలో లింగబలిజలని, మహారాష్ట్రంలో లింగాయత్‌వణిలని పిలువగా, కర్నాటకలో వీరశైవులనే పేరే నిలిచింది. మూడవ విభాగంలో చేరినవాళ్ళు లింగబలిజలకన్నా తర్వాత వీరశైవంలో చేరిన వృత్తి కులాలవాళ్ళు. ఇక నాలుగవ విభాగంలోనివాళ్ళు నిమ్నజాతులవాళ్ళు- మాల జంగం, మాదిగ జంగం తదితరులు.[3]

---

1. వీరశైవ ధర్మ బోధిని - పుట. 25.
2. The Castes and Tribes of H.E.H. The Nizam's Dominions - Page 393.
3. Ibid........ Page 386.

వీరశైవ సమాజంలో మొదట బ్రాహ్మణులు తమ అధిక్యాన్ని నిలుపుకోవటానికి ప్రయత్నించారు. అంతేకాక, వీరశైవవేతరులైన బ్రాహ్మణులకంటె తమ సాంఘికస్థాయి అధికమని భావించారు. ఈ దారిలోనే మిగిలిన వర్ణాలవారు పయనించారు. వీరశైవ క్షత్రియులు, వీరశైవ వైశ్యులు ఏర్పడ్డారు. శూద్రులలో ఎన్నో తరతమ భేదాలు ఉత్పన్నమయ్యాయి. ఒక్కో కులం మరిన్ని కులాలుగా చీలిపోసాగింది. మాలల కంటె మాల జంగాలు హెచ్చు సాంఘిక స్థాయిని అనుభవించారు. రానురాను అవి వేరు వేరు కులాలుగా స్థిరపడ్డాయి.

బసవేశ్వరుని తర్వాత కాలంలో వీరశైవం క్షీణించిపోవటానికి, వైదిక మతం ప్రతిష్ఠింపబడటానికి కొన్ని కారణాలను చెప్పుకోవచ్చు.

(1) వైదికానికి శాస్త్ర ప్రమాణం ఉండగా, వీరశైవానికి అనుభవ ప్రమాణమే అధారం కావటం.

(2) శతాబ్దాలుగా వేళ్లూనుకొని ఉన్న కులవ్యవస్థ తిరిగి విజృంభించటం. లింగాయత కులాలు తమ పూర్వ సాంఘిక స్థాయికన్న మిన్నగా భావించుకోవటం వల్ల చీలికలేర్పడి, ఒక్కో కులంలోనే పెక్కు కులాలు పుట్టుకురావటం.

(3) పౌరోహిత్యం, కర్మకాండలు చేసే జంగాలకు తగినంత చదువు సంధ్యలు లేక తమ విధులను సక్రమంగా నిర్వర్తించలేకపోవటం వల్ల వైదిక బ్రాహ్మణుల ఆవశ్యకత పెరగటం.

(4) జంగాలకు మత నియమాల పట్ల చిత్తశుద్ధి లోపించటంవల్ల, మిండ జంగాల పట్ల సమాజంలో నిరసన పెల్లుబుకటంవల్ల 'లింగధారులందు దొంగలు కలరయా' అనే అభిప్రాయం సమాజంలో బలపడిపోవటం.

(5) తెలుగు రాజులు వీరశైవాన్ని ప్రోత్సహించకపోవటంవల్ల వీరశైవం కర్నాటకలో కొనసాగినా తెలుగుదేశంలో క్షీణించింది.

(6) రెడ్డి రాజుల కాలంలో వేదాంత దేశికులు మొదలైన ఆచార్యులు విశిష్టాద్వైతాన్ని ఉధృతంగా ప్రచారం చేయటం.

(7) విజయనగరరాజులు భిక్షగాంధ్రపై 'గణాచారిపన్ను' అని వృత్తి పన్ను విధించేవారు. జంగాల మీద మతపన్ను విధించారు.[1]

(8) మతేతరులయిన నవాబుల ఏలుబడి ప్రారంభం కావటం.

---

1. ఆంధ్రుల చరిత్ర - డా.బి.యస్.యల్. హనుమంతరావు - పుట. 398.

ఈ విధంగా కులాతీతమతంగా ఆవిర్భవించిన వీరశైవం క్షీణించి, అనేక కులాల పుట్టుకకు కారణమయింది. కాకతీయ యుగానంతరం వీరశైవం నుంచి పుట్టిన జంగం, బలిజ, తంబళ్ళ మొదలైన కులాలు ప్రత్యేకమైన అస్తిత్వాన్ని పొందాయి. జంగం కులంకూడా ఉపకులాలుగా చీలటం ప్రారంభమయింది.

17 వ శతాబ్దానికి చెందిన అయ్యలరాజు నారాయణామాత్యుడు తన కావ్యం 'హంసవింశతి'లో తిరునాళ్ళ సందర్భంలో ఆనాటి కులాలను వర్ణిస్తూ 'జంగాలు', 'తెరనాటకపు జంగాలు' అంటూ జంగాల్లోని రెండు తెగలను ప్రత్యేకంగా పేర్కొన్నాడు. అంతకుముందే బైచరాజు వేంకటనాథకవి (16వ శతాబ్దం ఉత్తరార్థం) కూడ తన పంచతంత్రంలో 'కదవోని తెరనాటకపుటూరి జంగాలు' అని తెరనాటకాలాడే ఊరి జంగాలను ప్రత్యేకమైన కులంగా పేర్కొన్నాడు. అంటే కవి కాలానికి 'ఊరి జంగాలు' అనే మరో ప్రత్యేక కులం ఏర్పడిందని స్పష్టపడుతున్నది. 13 వ శతాబ్దాంతానికే ఏర్పడిన జంగం కులం దాదాపు 17 వ శతాబ్దంనుంచే అనేక కులాలుగా చీలుతూ వస్తున్నది. ఈ శతాబ్దం (20) ప్రారంభం నుంచి అలా ఏర్పడిన మరికొన్ని కులాలను గుర్తించటానికి స్పష్టమయిన ఆధారాలు కనిపిస్తున్నాయి. జంగం కులంనుంచి కాలక్రమాన నాలుగు కులాలు ఏర్పడ్డాయి. 1 జంగం (జంగమయ్య,) 2. మాల జంగం, 3. బేడ జంగం, 4. బుడిగె జంగం. వీరశైవుల్లోని స్థిరమూర్తులైన జంగాలే జీవన వైవిధ్యంలో జంగం, మాలజంగం, బేడజంగం కులాలుగా చీలిపోగా, చర జంగాలు మాత్రం శివపారమ్య కథలు చెప్పి జీవిస్తూ సంచరించే బుడిగె జంగాలుగా అవతరించారు.

కులవ్యవస్థ నాలుగు కులాలతో ప్రారంభమయి లెక్కకు మించిన కులాలుగా పరిణామం చెందింది. శూద్రుల్లో అనేకానేక కులాలు ఉద్భవించాయి. నాలుగు కులాలకు తోడుగా పంచముల సృష్టి జరిగింది. స్వాతంత్ర్యం వచ్చాక హరిజనులతో పాటు ఆటవిక జాతులను గిరిజనులుగా గుర్తించారు. మతాన్నిబట్టి, వృత్తులనుబట్టి, అనులోమ విలోమ వివాహాలనుబట్టి, ఆహారాది నియమాలనుబట్టి ఉన్న కులాలే చీలిపోయి ప్రత్యేక కులాలుగా మారినప్పుడు అలా పుట్టుకొచ్చిన కులాలకు మొదటిపేరు అలాగే ఉండి, ఏదో విశేషణంతో పిలువబడటం చాలా కులాల్లో కనిపిస్తుంది. ఉదాహరణకు కురుమ, మాదాసికురుమ; దాసరి, మాల దాసరి, హోలియ (ఒల్లె) దాసరి; సాలె, మాలసాలె; సన్యాసి, మాల సన్యాసి-

ఈ విధంగానే జంగం కులంనుంచి విడిపోయి మాల జంగం, బేడ జంగం, బుడిగె జంగం అనే ప్రత్యేక కులాలు ఏర్పడ్డాయి. ఇక ఈ నాలుగు కులాలను వేరువేరుగా పరిశీలిస్తాను

## 1. జంగం (జంగమయ్య లేక జంగం దేవర)

''జంగము వారిలో పూజ్యుడైన వానిని 'జంగమయ్య', 'జంగమ దేవర' అని చెప్పుదురు'' అని శబ్దరత్నాకరం. మాలజంగం, బేడజంగం, బుడిగె జంగం కులాలు నిమ్నకులాలలో చేరగా, ఈ జంగమకులం మాత్రం సమాజంలో గౌరవస్థానం పొందినా, ఆర్థిక విద్యాధి రంగాల్లో వెనకబడి ఉండటం వల్ల, వెనకబడిన కులాలతో సమానంగా పరిగణింపబడుతున్నది. మొదటినుంచి చీలిక లెన్ని వచ్చినా, మార్పు లెన్ని కలిగినా ఈ శాఖ మాత్రం వీరశైవాచారాలను అవలంబిస్తూ కొనసాగుతున్నది. వీరికే తెలంగాణాలో 'జంగములు' లేక 'జంగమయ్య' లని ఆంధ్రప్రాంతంలో 'జంగమదేవర' లని పేరు.

వీరశైవ మత ప్రభావంతో ఆంధ్రదేశంలో జంగాల పేర్లతో నెలకొన్న గ్రామాలు ఎన్నో కనిపిస్తాయి. గ్రామ నామంలో ప్రథమావయవం 'జంగం'గా ఉన్న ఊళ్ళు కడప జిల్లాలో మొత్తం 12 ఉన్నాయి. కడప తాలూకాలో ఒకటి, కమలాపురం తాలూకాలో ఒకటి, ప్రొద్దుటూరు తాలూకాలో ఒకటి, రాయచోటి తాలూకాలో ఐదు చొప్పున జంగం పల్లెలు ఉన్నాయి. ఇక 'జంగాలపల్లె' అనే పేరుతో రాజంపేట తాలూకాలో ఒకటి, సిద్ధవటం తాలూకాలో ఒకటి, జమ్మలమడుగు తాలూకాలో రెండు గ్రామాలు ఉన్నాయి. మెకంజీ కైఫీయతులను అనుసరించి వీటిలో కొన్ని గ్రామాల స్థానిక చరిత్ర ఈ కింది విధంగా ఉంది:

రాజంపేట తాలూకాలోని జంగాలపల్లెను గురించి మెకంజీ జంగాలపల్లె కైఫీయతు (1134 - 343) "జంగాల కవీశ్వరులకు మట్ల అనంతరాజు పొలం ఇచ్చినందున, అక్కడ వెలసిన గ్రామం జంగాల పల్లె అయినట్లు స్థానిక చరిత్ర" అని పేర్కొనబడింది. జమ్మలమడుగు తాలూకాలోని జంగాల పల్లెను గూర్చి "లోగడ జంగాలు కట్టించిన గ్రామమని స్థానిక చరిత్ర" అంటూ మెకంజీ కైఫీయతు (1169 - 70) లో నమోదు చేయబడింది. అలాగే ఇదే తాలూకాలోని మరో జంగాలపల్లె పుట్టుకను గురించి మెకంజీ కైఫీయతు (1204 - 4) లో

"గురుపాదయ్య జంగం మఠం కట్టాడని, తత్కారణంగా ఊరి పేరు జంగాల పల్లె అయిందని స్థానిక చరిత్ర" అంటూ తెలిపారు.[1]

చిత్తూరు జిల్లాలో జంగం కుల నామంతో 44 గ్రామాలు ఉన్నాయి. ఒక్క సత్యవేడు తాలూకాలో తప్ప మిగిలిన పది తాలూకాల్లో ఈ గ్రామాలు ఉన్నాయి. శ్రీకాళహస్తిలో ఒకటి, పుత్తూరులో మూడు, చిత్తూరు తాలూకాలో ఐదు, బంగారుపాలెంలో రెండు, పలమనేరులో రెండు, కుప్పంలో ఒకటి, పుంగనూరులో పన్నెండు, మదనపల్లిలో ఏడు, వాయల్పాడులో తొమ్మిది, చంద్రగిరిలో రెండు-జిల్లాలో మొత్తం 44 గ్రామాలు ఈ పేరుతో ఉన్నాయి.[2] మెదక్ జిల్లాలో దుబ్బాక మండలంలో 'జంగంపల్లె', నర్సాపూర్ మండలంలో 'జంగం పేట', రామాయంపేట మండలంలో 'జంగంరాయి' పేర్లతో ఊర్లు కనిపిస్తాయి.[3]

నెల్లూరుజిల్లాలో, తూర్పుగోదావరి జిల్లాలో 'జంగాలకంద్రిగల' పేరుతో అనేక గ్రామాలు కనిపిస్తాయి. నిజామాబాదు జిల్లా కామారెడ్డికి సమీపంలో జంగంపల్లె అనే పేరుతో ఒక ఊరు ఉన్నది. మహబూబ్‌నగర్ జిల్లా గణపూర్ మండలంలో రెండు 'జంగమయపల్లె'లు ఉన్నాయి. హైదరాబాదు నగరంలో 'జంగంమెట్టు' అనే పేర బస్తీ ఉన్నది. (ఇది మునిసిపల్ డివిజన్ కూడ.) వరంగల్ జిల్లాలోని ములుగు మొదలైన తాలూకాల్లో కూడా జంగంపల్లెలు ఉన్నట్లు తెలుస్తున్నది. ఇలా రాయలసీమ, సర్కారు జిల్లాల్లో జంగం పల్లెలు, జంగాలపల్లెలు, జంగాల కంద్రిగలు విరివిగా కనిపించినా, తెలంగాణా జిల్లాల్లో మాత్రం అక్కడక్కడ కనిపిస్తున్నాయి.

కులాల ప్రాధాన్యతనుబట్టి కులనామాలే గ్రామనామాలుగా వ్యవహారంలోకి వచ్చినప్పటికి, తర్వాత కాలంలో ఆ గ్రామ నామానికి, ఆ కులానికి పరస్పర సంబంధం లేకపోవచ్చు. ఉదాహరణకు బ్రాహ్మణుల పల్లెలో ఇప్పుడు బ్రాహ్మణులు లేకపోవచ్చు. అలాగే తమ కులం పేరుతో ఉన్న ఊళ్ళలో జంగాలు ప్రస్తుతం నివసిస్తూ ఉన్నా, లేకున్నా ఆంధ్ర దేశమంతటా మాత్రం వ్యాపించి ఉన్నారు.

---

1. కడప జిల్లా గ్రామ నామ నిఘంటువు - 'కడప ఊర్ల పేర్లు'లో.
2. గ్రామనామాలు: భాషా సామాజిక పరిశీలన (చిత్తూరు) - పుట 116.
3. మెదక్ జిల్లా గ్రామనామాలు (అముద్రిత సిద్ధాంత గ్రంథం).

13వ శతాబ్దం అంతంనుంచే 'జంగం' శబ్దం కులవాచకమయింది. నాటి నుంచి నేటిదాకా వీరశైవ మతావలంబకులుగానే ఈ కులం కొనసాగుతున్నది. వర్ణ వ్యవస్థ వీరశైవాన్ని అల్లకల్లోలం చేసిన తర్వాత, పెద్ద కులాలకు బ్రాహ్మణులు పౌరోహిత్యం చేస్తుండగా, శూద్ర కులాలకు జంగాలు పురోహితులుగా, గురువులుగా ఉంటూ వచ్చారు. ఒకవైపు జంగం కులం అనేక ఉపకులాలుగా చీలిపోతూ, అవి ప్రత్యేక కులాలుగా స్థిరపడుతూ వస్తున్నప్పటికీ, వీరశైవ సంప్రదాయాలను మరువకుండ కొనసాగిస్తూ జంగం కులం అస్తిత్వం నిలబెట్టుకున్నది. కుల వ్యవస్థ ప్రభావంతో నిమ్నజాతులైన వీరశైవులు తమ పూర్వపు కులనామానికి జంగం పదం చేర్చుకుంటూ వేరు కులాలుగా స్థిరపడ్డారు. మాల జంగం, బేడజంగం, బుడిగెజంగం అలా ఏర్పడిన కులాలే.

పాల్కురికి సోమనాథుడు తన కావ్యాల్లో వర్ణించిన జంగాలు, వృద్ధ జంగాలు, మిండజంగాలు వీరశైవులనే అర్థంలో ప్రయోగింపబడ్డారు. అప్పుడు 'జంగం' కులవాచకంకాక వీరశైవుడనే మతబోధకం మాత్రమే. ఆ తర్వాత కాలంలో 'జంగం' శబ్దం ఒక కులవాచకంగా స్థిరపడ్డాక కూడ చాలామంది కవులు జంగాల వర్ణన చేశారు.

జంగాల వేషభాషలను కూచిమంచి తిమ్మకవి 'రాజశేఖర విలాసం' (1-167)లో కళ్ళకు కట్టినట్లు వర్ణించాడు:

సీ॥ "కక్షపాలలు పైడికట్ల బెత్తంబులు
శంఖ సంఖ్యల మించు శంఖములును
పిడిగంటలును కేకి పింఛపు కుంచెలు
ఛత్రముల్ పులితోళ్ళు చామరములును
యోగదండంబులు యోగపట్టెడలును
గండపెండేరముల్ కుండలములు
తనువుల భూతిపూతలు కావి వస్త్రముల్
మేలైన రుద్రాక్షమాలికలును

గీ॥ శ్వేతకేతనములు రుద్రవీణియలును
పాత్రమగునట్టి రజతంపు పాత్రికలును
కేలుదామర బలువైన శూలములును
మొలక బంగారు గిలుకు పావలును కలిగి"న జంగాల గణం వచ్చిందని కవి వర్ణించాడు.

పాలవేకరి కదిరీపతి (17 శ.) శుకసప్తతిలో జంగమురాలును అతి సహజంగా వర్ణించాడు. "మ్రిపాలు పూసిన జడల దిండు, చింతాకంత విభూతిరేఖ, సందిట రుద్రాక్షపూసలు, నాగబెత్తం, తామ్రపు నంది ముద్ర ఉన్న ఉంగరం, జన్నిదపువాటు, యోగపట్టె కలదని" కవిజంగమురాలు రూపాన్ని చిత్రం కట్టించాడు.

వీరశైవ సంప్రదాయానుసార జీవనులయిన జంగాలు ఆనాటి నుంచి ఈనాటివరకూ నియమ నిష్ఠలను పాటిస్తూ, తమ కుల ప్రత్యేకతను కాపాడుకుంటూ కొనసాగారు. గురువులయిన ఈ జంగాలు కొన్ని శూద్ర కులాలవద్ద, ముఖ్యంగా శైవులయిన భిక్షుక కులాలవద్ద గురుదక్షిణ తీసుకోవటం ఆచారంగా స్థిరపరిచారు. ఐదేళ్ళకోసారి భిక్షుకకులాలను కలిసి జోలెకు రూపాయి చొప్పున వసూలు చేసుకునేవాళ్ళు. భిక్షుక కులాల పురుడు, పెళ్ళి మొదలైన కార్యక్రమాలను జంగాలు నిర్వహించేవారు. వీళ్ళవద్ద బియ్యం, పప్పులు, చింతపండు మొదలైన వండని ఆహార సామగ్రిని "సాహిత్యం' పేరుతో పుచ్చుకునేవారు. జోలెకింత గురుదక్షిణ తీసుకునే ఆచారం 1958 వరకు కొనసాగింది. తెలంగాణా ప్రాంతంలోని భిక్షుకులవద్ద గురుదక్షిణను శంషాబాదు (రంగారెడ్డి జిల్లా) లోని సారంగమఠాధిపతి కీ. శే. నీలకంఠ స్వామివారు గ్రహించేవారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం 1968 లో జి. ఓ. యం. యస్. నెం. 870 తేది. 12-4-1968 ద్వారా వెనకబడిన తరగతుల కమీషన్‌ను నియమించింది. కమీషన్ నివేదిక 1970లో అచ్చయింది. ఆ కమీషన్ వెనకబడిన తరగతిలో చేర్చుకునేందుకు సిఫారసు చెస్తూ ఈ జంగం కులాన్ని ఈ క్రింది విధంగా నిర్వచించింది. కుల లక్షణాలు, సాంఘిక స్థాయిని ఇందులో పేర్కొన్నది.

"జంగం కులస్థులే 'జంగం దేవర'లు లేక 'జంగమయ్య'లు అనే పేర్లతో వ్యవహరింపబడుతున్నారు. వీళ్ళను సర్కారు జిల్లాల్లో 'లింగాయతులు' లేక 'వీరశైవులు' అని కూడ అంటారు. లింగాయతుల్లోని కులాల్లో జంగం కులం ఒకటి. వీళ్లు వీరశైవ మతావలంబకులు నియమనిష్ఠా గరిష్ఠులు. మెడలో శివలింగాలను ధరిస్తారు. భోజనం చేసేముందు లింగానికి అర్పించి, ఆ తర్వాత తింటారు. లింగధారణ చేసి నియమ నిష్ఠలతో ఉన్నప్పటికి వీరు సమాజంలో

బ్రాహ్మణులకంటే తక్కువగా భావించబడతారు. అర్చకులుగా, శూద్రకులాలకు గురువులుగా ఉండి సమాజంలో గౌరవింపబడుతున్నారు. వీళ్ళకు ఇతర కులాలతో కంచం పొత్తుగాని, వివాహ సంబంధాలుగాని ఉండవు. వీళ్ళంతా శాకాహారులు. కుమ్మరి, సాలె, మున్నూరుకాపు మొదలయిన లింగాయత శూద్రకులాలవారికి కర్మకాండలు నిర్వహిస్తారు" అని కమీషన్ జంగాలను వర్ణించింది.

ఈ జంగాలలో ఒకశాఖ వారికి ప్రత్యేకమైన ఇంటిపేర్లు ఉండవు - మఠ నామాలే ఆనువంశికంగా గృహనామాలుగా ఉంటాయి. వ్యక్తులకు శైవ సంబంధమైన పేర్లు పెట్టుకుంటారు. ఉదా॥ రేకళిగె మఠం వీరయ్య, రవికోటి మఠం వీరభద్రయ్య, హిరేమఠం విరూపాక్షయ్య మొదలయినవి. మరొక శాఖవారిలో మదిరె, శేర్‌దొడ్డి, షట్కారి, మఠం, మడపతి మొదలైన ఇంటిపేర్లు కనిపిస్తాయి.

ఈ విధంగా కులరహిత సమాజాన్ని నిర్మించాలని కలలు కన్న బసవేశ్వరుని మతాన్ని వైదిక సంప్రదాయం పటాపంచలు చేసింది. వీరశైవులంతా మళ్ళీ కులాల పరిధిలోకి రాక తప్పలేదు. అయితే, వీరశైవ వృక్షం కులాల శాఖోపశాఖలను ఎన్ని విస్తరించినా 'జంగం' కులం కాండంగా తన ప్రత్యేకతను నిలుపుకున్నది.

## 2. మాల జంగం

శైవులయిన మాలవాళ్ళకు మాల జంగం మతగురువు. వివాహాది శుభ కార్యాలు మొదలుకొని కర్మకాండల వరకు అన్నీ అతడే నిర్వహిస్తాడు. మాల జంగాలు జంగమయ్యలలాగే మెడలో లింగాలను ధరిస్తారు. నొసట విభూతి రేఖలు దిద్దుతారు.మాల మాదిగలను తమకన్నా తక్కువ కులంగా పరిగణిస్తారు.

మాల జంగం కులం పుట్టుక గురించి ఒక కథ ప్రచారంలో ఉంది. ఒకప్పుడు ఒక ఊళ్ళో ఒక జంగం (జంగమయ్య) ఉండేవాడు. ఆ ఊళ్ళోని అన్ని కులాలవారికి అతడే పురోహితుడు. ఒకనాడు ఒక వైశ్యునికి జంగం అవసరమయి, అతనికోసం చూశాడు. జంగం ఒక మాలవాని ఇంట అన్నం గ్రహిస్తుండటం వైశ్యుని కంట పడింది. అంటరానివాడయిన మాలవాని వద్ద అన్నం తీసుకోవద్దని అభ్యంతరం చెప్పాడు. కాని ఆ జంగం వైశ్యుని మాట

వినకుండ "నేను ఏ కులం వాడింట్లో పౌరోహిత్యం నిర్వహిస్తానో ఆ కులస్థుడి వద్ద అన్నం కూడ స్వీకరిస్తా"నని చెప్పి, మాలవాడు పెట్టిన అన్నాన్ని తీసుకున్నాడు. వైశ్యుడు ఆగ్రహించి, ఇకముందు నీవు మాలవాళ్ళ ఇళ్ళలో మాత్రమే పౌరోహిత్యం చెయ్యాలని జంగాన్ని వెలివేశాడు. అప్పటినుంచి ఆ జంగం మాలవాళ్ళ శుభాశుభ కార్యాల్లో పాల్గొంటూ వాళ్ళకు మతగురువుగా ఉండటం వల్ల అతని కులానికి 'మాలజంగం' అనే పేరు స్థిరపడింది.[1]

పైకథలో మాలవాని ఇంట్లో అన్నం తిన్నందువల్ల జంగం మాలజంగంగా మారాడని పేర్కొన్నప్పటికీ, నిజానికి మాల జంగాలు మొదటినుంచి మాలవాళ్ళ ఇళ్ళల్లో భోజనం చేయరు.

ఈ కులం పుట్టు పూర్వోత్తరాలను పరిశీలించినట్లయితే జంగం కులం ఉప కులాలుగా చీలిన పరిస్థితులు గమనించినట్లయితే ఈ కథ ఎవరో కల్పించి చెప్పిందే కాని, వాస్తవం కాదనే విషయం స్పష్టమవుతుంది. ఇంతకు ముందు వివరించినట్లుగా తొలిరోజుల్లో వీరశైవమతం స్వీకరించిన బ్రాహ్మణులు మొదలు కొని శూద్రకులాల వరకు వీరశైవేతరులయిన తమ తమ కులాల వారికంటే తమను ఉన్నతంగా భావించుకున్నారు ఒకే కులమయినప్పటికి, వీరశైవం తీసుకున్న వారికంటె ఆ మతం తీసుకోనివారు తక్కువ కులంగా చూడబడ్డారు. అలాగే మాల కులంనుంచి వెళ్ళినవారు వీరశైవ మతావలంబకులనే అర్థంలో 'జంగం' పదం తమ కులానికిముందు చేర్చుకొని, మాలజంగాలయి తమను వీరశైవేతరులయిన మాలలకంటే ఉన్నతులుగా పరిగణించుకున్నారు. ఈ నేపథ్యంలో పైన పేర్కొన్న కథను కల్పిత కథగా భావించవచ్చు. ఆచార వ్యవహారాల్లోనూ, ఆహారాది అలవాట్లలోనూ మాలలకు, మాల జంగాలకు స్పష్టమైన భేదం కనిపిస్తుంది. ఈ విధంగా మాల కులం కంటే భిన్నమయి 'మాలజంగం' ఒక ప్రత్యేక కులంగా సమాజంలో స్థిరపడింది.

మాల జంగాలలో స్త్రీలు కూడ లింగధారణ చేస్తారు. తమకు జంగమయ్యలు పురోహితులుగా వస్తారని ఉప్పుగూడ (హైదరాబాదు నగరం) వాస్తవ్యులు (పుష్పమ్మ భర్త పేరు వీరస్వామి వయస్సు 70 సం॥, పద్మమ్మ భర్తపేరు శంకరయ్య వయస్సు 55 సం॥లు) తెలియజేశారు. బుడిగె జంగం, మాల, మాదిగ మొదలయిన నిమ్న కులాలవారికి మాలజంగాలు కర్మకాండలు నిర్వహిస్తారు.

---

1. Ethnographic Notes on Malajangam.
   Census of India 1961, Vol II. Part V-B (10). Page. 1.

మాల జంగాలు గోత్రాలను మరిచిపోయారు. కేవలం ఇంటిపేర్లే వ్యవహారంలో ఉన్నాయి. మేదరి, నక్క, రాజపాటి, రాజం, కాసుల, చేది, దడిగం, మేకల, రుద్రం, ఆరె, తమ్మడి, ఏలంగి మొదలయినవి వీళ్ళ ఇంటిపేర్లు. మేదరి ఇంటిపేరు వారొకరు తమ గోత్ర నామం 'పచ్చకంటి' అని తెలిపారు.

నలగామరాజు కథ, పలనాటి కథ మొదలయిన తందాన కథలను కూడ మాలజంగాలు చెబుతారని తెలుస్తున్నది.[1] కాని నేడు మాలజంగాలు తందాన కథలు చెప్పటం ఎక్కడా కనిపించదు. తెలంగాణాలోని అన్ని జిల్లాల్లోను మాల జంగాలు నివసిస్తున్నారు. 1931 జనాభా సేకరణ వివరాల ప్రకారం వీరి జనాభా 5632 కాగా,[2] 1961 జనాభా లెక్కల ప్రకారం 5296.[3] మాల జంగాలు ఇప్పటికీ కర్మ కాండలను నిర్వహిస్తారు. కాలానుగుణంగా కులవృత్తి మారుతున్నప్పటికి వృద్ధులు మాత్రం పూర్వ పద్ధతులనే ఆచరిస్తున్నారు.

## 3. మాదిగ జంగం

మాదిగల్లో ముఖ్యంగా 25 తెగలు ఉన్నాయని హసన్ తెలిపారు. అందులో వరుస సంఖ్య 5 జంగం మాదిగ. శైవులయిన మాదిగలకు మాదిగ జంగాలు కర్మ కాండలు చేస్తారని, మిగిలిన మాదిగ తెగలకంటె తమను అధికులుగా భావించుకుంటారని, బసవేశ్వరుని ప్రమథగణం (శిష్యబృందం)లోని నుల్క చంద్రయ్య సంతతివారే మాదిగ జంగాలని హసన్[4] వివరించారు. వీర శైవ మాలలు మాల జంగం కులంగా నాటినుంచి నేటిదాకా కొనసాగినట్లు మాదిగ జంగం ఒక కులంగా ప్రత్యేకత నిలుపుకోలేదు. వైష్ణవ మతావలంబకులయిన మాలలు కూడ మిథాఅయ్యలవార్లు (మాల అయ్యరోళ్లు)గా ప్రత్యేక ప్రతిపత్తి కలిగిన కులంగా కొనసాగారు. కాని వైష్ణవులయిన మాదిగలకు కూడ ప్రత్యేక కుల ప్రతిపత్తి లేదు. వైష్ణవులయినా, వీరశైవులయినా వీరు ఒకే కులంగా 'మాదిగలు' అనే పేరుతోనే కలిసి ఉన్నారు. కాబట్టి 'మాదిగ జంగం' అనే ప్రత్యేక కులం తెలుగుదేశంలో కనిపించదు.

---

1. Ethnographic Notes on Mala Jangam - Page 2.
2. Census of India 1931. Vol. XXIII Part I Report. Page-260.
3. Ethnographic Notes on Mala Jangam - Page - 5.
4. The Castes and Tribes in HEH the Nizam's Dominions - Page - 413.

## 4. బేడజంగం

జంగం కులం నుంచి విడివడి ప్రత్యేకంగా ఏర్పడిన మరో కులం బేడ జంగం. సర్కారు జిల్లాల్లో క్షేత్ర పరిశీలన సందర్భంలో బేడ జంగాలు తమ కులం పుట్టుకను గురించి అనేక విధాలుగా చెప్పారు. వారు తెలియచేసిన సమాచారాన్ననుసరించి ఈ కులం జన్మ వృత్తాంతం ఈ క్రింది విధంగా ఉంది:



(1.) 'బేడ' అనే పదానికి కన్నడ భాషలో 'యాచన' అనే అర్థం ఉంది. అందువల్ల యాచనామగ్నమయిన జంగాలకు బేడ జంగాలని పేరు వచ్చింది. 'బేడ తిన్నువ జంగమ నొబ్బను బందు బాగిల నింతను' అనే కన్నడ వాక్యానికి బేడ - యాచించి, తిన్నువ - తిను, ఒబ్బను - ఒకానొక, జంగమ - జంగ

ముడు, బందు - వచ్చి, బాగిలి.వాకిలి ముందు, నింతను - నిలబడ్డాడు. 'యాచించుకొని తిను ఒక జంగముడు వచ్చి వాకిటిముందు నిలబడ్డాడు' అని అర్థం. వీరశైవం సన్నగిల్లిన తర్వాత జంగాలు అనేక కులాలుగా చీలిపోయి నప్పుడు యాచకులుగా మారిన ఒక తెగకు బేత జంగాలని పేరు వచ్చింది.[1]

(2.) 'బేడ' అంటే కన్నడంలో 'వద్దు' అని మరొక అర్థం. తెలుగు దేశంలోని జంగమయ్యలనే కన్నడ దేశంలో లింగాయతులంటారు. వీరు నియమ నిష్ఠాగరిష్ఠులు. శాకాహారులు, వీరశైవాచార భ్రష్ఠులై మధుమాంసాహారులైన ఒకానొక జంగమ తెగను తమనుంచి వెలివేశారు. అంటే మీరు మాతో చేరవద్దు అని నిషేధించారు. అలా నిషేధించబడ్డ జంగమ తెగ బేడ జంగాలనే పేరుతో స్థిరపడింది.[2]

(3.) 'బేడ' అనే పదానికి 'వేట' 'వేటాడు' అని కన్నడంలో అర్థాలున్నాయి. వీరశైవాచారాలు వదలివేసి, మాంసాహారప్రియులై, వేటే ప్రధాన వ్యాపకంగా మారిన వీరికి 'వేటాడే జంగాలు' అనే అర్థంలో 'బేడ జంగాల'నే పేరువచ్చింది [3]

(4) 'బేడ' అంటే తెలుగులో 'రెండణాలు' అని అర్థం. నిమ్న కులాల కర్మకాండలు జరిపేటప్పుడు చనిపోయినవారి పేరు పొగిడేటప్పుడు సంభావనగా బేడ (రెండణాలు) ఇవ్వమని ఒక కట్టడిగా కొనసాగించినందువల్ల వీరికి బేడ జంగాలనే పేరు నిలిచిపోయింది.[4]

---

1. ఈ సమాచారాన్ని తెలిపినవారు: డా॥ మర్రిపూడి జాలయ్య, ఆలూరు, ఒంగోలు. శ్రీ పత్రి సోమసుందరం, శ్రీకాళహస్తి.
2. ఈ సమాచారాన్ని తెలిపినవారు: శ్రీ జి. సుబ్రహ్మణ్యం, పట్టాభిపురం, గుంటూరు. శ్రీ గరికిపర్తి చెన్న బసవయ్య, కాకినాడ.
3. శ్రీ పేట విశ్వనాథం, తిరుపతి.
4. శ్రీ గగనం నాగేశ్వరరావు, అనకాపల్లి.

బ్రాహ్మణుల్లో కొందరి ఇంటి పేర్లు వారు పుచ్చుకునే సంభావననుబట్టి వచ్చినట్లు తెలుస్తున్నది. తమ తమ స్థాయికి తగ్గట్లుగా కొందరు రూపాయి సంభావన తెచ్చుకోగా, కొందరు అర్ధరూపాయి తెచ్చుకోనేవారు. మరికొందరు పావలా పుచ్చుకొనేవారు ఈ సంభావనల ఆధారంగా వాళ్ళ ఇంటి పేర్లు ఏర్పడ్డ ఉదంతాలు కనిపిస్తాయి. సాతానివైష్ణవుల్లో 'నక్షత్రం' అనే ఇంటిపేరు ఇలా ఏర్పడ్డదే. రూపాయిని చంద్రునితో పోల్చినప్పుడు, పావలా నక్షత్రమే (చిన్నదే) అవుతుంది. అందువల్ల వీరికి నక్షత్రం ఇంటిపేరుగా నిలిచింది ఇలాగే రౌప్యంవారు మొదలయిన ఇంటిపేర్లు ఏర్పడ్డాయని చెబుతారు. సంభావననుబట్టి ఇంటిపేరు ఏర్పడినట్లుగా 'బేడ'ను సంభావనగా తీసుకునే జంగాలకు 'బేడజంగం' అనే కులనామం ఏర్పడటం యుక్తియుక్తంగానే తోస్తుంది. కాని, బేడ పదానికి తెలుగు అర్థం కల్పించిందేకాని, వాస్తవం కాదనిపిస్తుంది.

వీరశైవం కన్నడ దేశంలో పుట్టినప్పటికీ, జంగం పేరుతో ఒక ప్రత్యేక కులం ఆంధ్రదేశంలోనే ఏర్పడింది. జంగమయ్యలను కర్నాటకలో ఇప్పటికీ లింగాయతులనే పిలవటం గమనిస్తే, ఈ అభిప్రాయం స్పష్టమవుతుంది. జంగం కులం ఇంకా అనేక కులాలుగా చీలి మాల జంగం, బుడిగె జంగం - కులాలుగా కూడ ఆంధ్రప్రదేశ్‌లోనే స్థిరపడింది. అయితే, బేడ జంగం కులం మాత్రం కర్నాటకలో ఏర్పడి, సంచార జీవనంలో ఆంధ్రదేశంలో కూడ వ్యాపించింది. అందువల్ల వీరి కులానికి విశేషణంగా చేరిన 'బేడ' అనే పదం కన్నడ పదమే కాని, తెలుగుపదంకాదని చెప్పవచ్చు. రెండణాల సంభావన (బేడ) పుచ్చుకోవటం వల్ల ఈ కులానికి 'బేడ జంగం' అని పేరు వచ్చిందనేది నిజంకాదు.

'బేడ'పదానికి కన్నడ అర్థం 'వేటాడు' గ్రహించి చూస్తే సమంజసంగా ఉంటుందనిపిస్తుంది. వేటాడే కులాల్లో కిరాత, నిషాద, బోయ పేర్లు ముఖ్యమయినవి. ఈ పేర్లు సమానార్థకాలుగా ఒకదానికొకటి పర్యాయ పదాలుగా వ్యవహరింపబడుతున్నాయి. వీటిలో బోయలకు కూడ ఒకప్పుడు వేట ప్రధాన వ్యాపకం. బోయపదానికి, బేడపదానికి ఏమయినా సంబంధం ఉందేమో!

Castes and Tribes of Southern India అనే గ్రంథంలో థర్స్టన్‌గారు (1909) బోయలను పేర్కొన్నారు. బళ్ళారిజిల్లా మ్యానువల్‌లో

బోయను కన్నడ భాషలో బేదర్, బేద, బ్యాద అంటారని తెలిపారు.[1] 1901 మద్రాసు జనాభా సేకరణ నివేదికలో వీరశైవుల మధ్య నివసించే బేదలు తమను 'సదరు' అని చెప్పుకుంటారని రాశారు.[2] దీనివల్ల వీరశైవులైన బేదలు తమను వేరుగా చెప్పుకోవటం ప్రారంభించారని అర్థమవుతున్నది. 1891, 1901 మైసూరు జనాభా సేకరణ నివేదిక ప్రకారం బేదల్లో 'తెలుగు మాట్లాడే వాళ్ళు,' 'కన్నడం మాట్లాడేవాళ్ళు' అనే రెండు తెగలు ఉన్నట్లు వివరించారు.[3] ఆ తర్వాత కాలంలో తెలుగు మాట్లాడే శైవ బేదలకు 'వీరశైవు' డనే అర్థంలో 'జంగం' శబ్దం చేరి 'బేడజంగం'గా వ్యవహార నామం ఏర్పడిందని చెప్పవచ్చు. బోయలలో వీరశైవు లయిన వారికి తెలుగుదేశంలో 'బోయజంగం' అనే పేరు

---

1. The Boyas called in Canarese Bedars, Byedas or Byadas.... Castes and Tribes of Southern India. Vol I. Page. 183.

2. In the Madras census Report 1901, it is stated that the caste Boya has four endogamous sections; Pedda, Chinna, Sadaru and Myasa. Sadaru is the name of a sub-division of lingayats found mainly in the Bellary, Ananthapur, districts. Some Bedas who live amidst those lingayats call themselves Sadaru — Vol. I. Page. 185.

3. (I). According to the Mysore census Report 1891 and 1901 "the Bedas have two distinct divisions the Kannada and Telugu.... Vol I. Page. 185.

   (II). మాదిగల్లో కూడ తెలుగు మాట్లాడేవాళ్ళు, కన్నడం మాట్లాడేవాళ్ళు అని రెండు విభాగాలు ఏర్పడినట్లు తెలుస్తున్నది. ఈ విషయాన్ని హసన్ గారిలా చెప్పారు.

   "The Madigas have two main divisions canara madigas and Telugu Madigas who neither intermarry nor eat together...." The Castes and Tribes of H.E.H The Nizam's Dominions. Page. 411.

రావలసి ఉండగా, కన్నడ పదం 'బేడ' కుల నామంలో నిలిచి 'బేడజంగం' పేరే స్థిరపడింది.

బేడజంగం కులస్థులు లింగధారులు. విభూతిధారులు. వివాహ సందర్భంలో గాని, లేదా వివాహానికి ముందు అనువైన కార్తీక మాసంలో గాని లింగ ధారణ చేయించుకుంటారు. గంట, శంఖు వీరి ఉపకరణాలు. శూద్ర గృహాల్లో, శైవులయిన హరిజన గృహాల్లో కర్మలు చేస్తూ జీవిస్తారు. మాల, మాదిగల వద్ద తప్ప, ఇతర అన్ని కులాలవారి వద్ద భుజిస్తారు. మాల, మాదిగ కులాలవారి కంటె తమను అధికులుగా భావించుకుంటారు. వీరిలో కొందరు శాకాహారులున్నప్పటికీ, అత్యధిక సంఖ్యాకులు మాంసాహారులు.

నేడు బేడ జంగాలు పలురకాల వృత్తులను అవలంబిస్తున్నారు. రైతులుగా, వ్యవసాయ కూలీలుగా, దర్జీలుగా, బట్టలు నేసేవారుగా, పూలమ్మే వారుగా జీవిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ బేడజంగం సంక్షేమ సంఘం అధ్యక్షులు రాచమల్లు వెంకటేశ్వర్లు, ఒంగోలు గారు ప్రకాశం జిల్లాలో బేడజంగాలు తందానా కథలు చెబుతారని వివరించారు. కొందరు రుంజ వాయిస్తూ కథలు చెబుతారని వివరించారు. వీళ్ళలో ఓలి (కన్యాశుల్కం) ఆచార వ్యవహారంలో ఉన్నది 9 రూ॥లు మొదలుకొని 25 రూపాయల వరకు వధువు తల్లిదండ్రులకు ఓలి చెల్లిస్తారు. విడాకులు, మారుమనువు కూడా ఆచరణలో ఉంది.

రాచమల్లు వెంకటేశ్వర్లుగారు రాష్ట్రంలో తమ కులస్థుల వయోజన జనాభా సుమారు 15000 పైగా ఉంటుందని చెప్పారు. వారు అందజేసిన బేడ జంగాల ఇంటిపేర్లను అకారాది క్రమంలో ఈ కింద పొందుపరుస్తున్నాను.

**1.** అండెగ, **2.** అందెల, **2.** అమిశగడ్డ, **4.** అమృతం, **5.** ఇందూరి, **6.** ఉద్దంటి, **7.** ఒంటెద్దు, **8.** కడివేటి, **9.** కరోది, **10.** కావేటి, **11.** కుంకుమ, **12.** కొడవలూరి, **13.** కొమ్ముూరి, **14.** కోట, **15.** కోవూరి, **16** గంగపట్నం, **17.** గంధళ్ళ, **18.** గంధవళ్ళ, **19.** గగనం, **20.** గరికపర్తి, **21.** గరిక పాటి, **22.** గుడిదేని, **23.** గుణారి, **24.** గుద్దేటి, **25.** చక్రాల, **26.** చప్పిటి, **27.** చింతలపూడి, **28.** చిక్కా, **29.** చుండూరి, **30.** చెరుకుపల్లి, **31.** చేజెర్ల, **32.** డొక్కు, **33.** తడకలూరి, **34.** తలమంచి, **35.** తిరుపావళి, **36** తేరు, **37.** తోట, **38.** త్రిపురాంతకం, **39.** త్రోవకుంట, **40.** దేవపూజల, **41.** దోగి పర్తి, **42.** దోర్నాదుల, **43.** నంది, **44.** నల్లకాంతం, **45.** నాగం,

46. నాగండ్ల, 47. నాటకం, 48. నున్నా, 49. పంచేటి, 50. పడిగెల, 51. పడిమిటి, 52. పత్రి, 53. పాలా, 54. పానుగంటి, 55. పాలపర్తి, 56. పాలెపు, 57 పురాణం, 58. పెనుబాక, 59. పేట, 60 పొన్నా, 61. బట్టెపాటి, 62. బూరా, 63. బెల్లంకొండ, 64. బొమ్మకంటి, 65. మకుటం, 66. మర్రిపూడి, 67. మామిడి, 68. మాగడ, 69. ముక్కంటి, 70. ముత్యాల 71. యల్లశిరి 72. రాచమల్లు, 73. రేపూరి, 74 లోకనాథం, 75. వావిళ్ళ, 76. విడవలూరి, 77 విడియాల, 78. శంకుల (సంకుల) 79. శంఖం, 80. శిరివెళ్ళ, 81. శివకవి, 82 శివకోటి, 83. శివదానం, 84. శివలెంక 85. శృంగారకవి, 86. సంపెట, 87. సమ్మెటి, 88 సిరిగిరి, 89. సోము, 90 హర్లింగం.

## 5. బుడిగె జంగం

'బుడిగె' అనే పదానికి జానపద వ్యవహారంలో 'వాద్యవిశేషం' అనే అర్థం ఏర్పడింది. నిఘంటువుల్లో ఈ పదానికి 'బుడ్డి, మట్టిపాత్ర' అనే అర్థాలు ఇవ్వబడ్డాయి. ఆ బుడ్డి లేదా మట్టి పాత్రకు ఒకవైపు చర్మాన్ని చేర్చి వాద్యవిశేషంగా తీర్చారు ఈ బుడిగెలు వాయిస్తూ కథలు చెప్పి, పొట్టపోసుకునే జంగం కులానికి బుడిగె జంగాలని పేరు వచ్చింది.

ఆంధ్రనామ సర్వస్వంలో 'బుడుక్క జంగం' అనే సమాసానికి 'శివుడు' అనే అర్థం ఇవ్వబడింది. అందువల్ల శివభక్తులైన ఒకానొక జంగం కులానికి బుడుక్క జంగాలు, బుడుగ జంగాలు అనే పేరు వచ్చి ఉంటుంది.

మరుపూరు కోదండ రామిరెడ్డి గారు 'మాండలిక పదకోశం'లో "బుడిగె జంగాలు అంటే తందానా కథలు చెప్పి జీవించు జంగములు, బుర్ర కథల వాండ్రు, బుడిగెలు వాద్యము చేయుచు భిక్షమెత్తువారు'' అని అర్థం చెప్పారు.

ఈ కులం పేరు మొట్టమొదట 1920లో వచ్చిన సయ్యద్ సిరాజుల్ హసన్‌గారి గ్రంథంలో కనిపిస్తుంది.[1]

1. Tolubommalatavaru:- Also called Badge Jangam, earn money by exhibiting idols of leather and by a skilful contrivance making them dance to the music of cymbals and drums. They are recruited from the Munnur Caste. They are also said to be the illegitimate descendants of a Jangam father and a golla mother. —The Castes and Tribes of H.E.H. the Nizam's Dominions page 507.

తోలుబొమ్మలాటలాడే జంగాలను 'బుడ్గె జంగాలని' కూడ అంటారని హసన్‌గారు పేర్కొన్నారు. తెలంగాణాలో ఆరెవారితర్వాత తోలుబొమ్మలాటలు ప్రదర్శించేవారు బుడిగె జంగాలే కావటం ఈ అభిప్రాయాన్ని బలపరుస్తున్నది.



వీథిలో కథాగానం చేస్తున్న బుడ్గ జంగాలు

జానపద పరిశోధకుల్లో మొట్టమొదటిసారిగా ఆచార్య బి. రామరాజుగారు జానపద భిక్షుక గాయకులను గురించి వివరిస్తూ బుడిగె జంగాలను పేర్కొన్నారు.

''జంగములకే తెలంగాణమున బుడిగె జంగములని పేరు కలదు. బుడిగె అనునది వీరు వాయించెడి వాద్యమునకు పేరు....జంగములందరు శైవులు. వీరు చెప్పెడు కథలకు జంగం కథలని పేరు''1 అని తెలిపారు.

మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు బుడిగె జంగాలను ఈ విధంగా నిర్వచించారు ''దాసులందరు వైష్ణవులైనట్లే జంగాలందరు శైవులు. వీరు జంగం కథలు చెబుతారు. వీరు కథలు చెప్పేటప్పుడు 'బుడిగె' అనే వాద్యవిశేషాన్ని ఉపయోగిస్తారు. కాబట్టి వీరికి బుడిగె జంగాలనే నామం సార్థకమైంది.''2

డా.అర్.వి.యస్. సుందరం గారు బుడిగె జంగాలను గురించి "తెలుగు జానపద గాయకులలో ఎన్నదగిన వారిలో జంగాలు ఉన్నారు. వీరిని తెలంగాణాలో బుడిగె జంగాలు అంటారు. బుడిగె అన్నది వీరు వాయించే వాద్యానికి పేరు"3 అని వివరించగా, కోదాటి నారాయణరావుగారు బుడిగె జంగాలను ఈ విధంగా ప్రస్తావించారు: "హరిజనులలో, ముఖ్యంగా మాలల్లో వైష్ణవ శైవ మత అనుయాయులున్నారు. వైష్ణవ మతానుయాయులకు గురువు మాల దాసరి అయితే, శైవులలో అగ్రగణ్యులు బుడిగ జంగాలు. వీరు జంగం కథ చెప్పుతారు. రాత్రులు వేషాలు వేసుకొని, అభినయిస్తూ బొబ్బిలి కథ మొదలగునవి చెప్పుతారు. ఇట్టి కథలు మా గ్రామంలో నేను విన్నట్టు జ్ఞాపకం లేదుకాని, ఆత్మకూరు అను గ్రామంలో విన్నాను. బొబ్బిలి కథ, ఆరె మరాఠీల కథ, బలుగూరి కొండల రాయుని కథ చెపుతారు. వీరు శ్రావ్యంగా పాడుతారు. హావ భావ ప్రదర్శన బాగుంటుంది"4 అని స్వీయానుభవాన్ని గ్రంథస్థం చేశారు.

పైన పేర్కొన్న దృష్టాంతాలను బట్టి జంగం కులాల్లో కథలు చెప్పి జీవించే ఒక కులం వారిని వాళ్ళుపయోగించే 'బుడిగె' అనే వాద్యవిశేషాన్నిబట్టి 'బుడిగె జంగాలు' అంటారని తెలుస్తున్నది.

---

1. తెలుగు జానపద గేయ సాహిత్యము - పుట 805.
2. ఆంధ్ర నాటక రంగ చరిత్ర - పుట 205.
3. ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుట. 39.
4. చిన్ననాటి జ్ఞాపకాలు - పుట. 146.

బుడిగె జంగాలు కథలు చెప్పేటప్పుడు తాంబూర, డింకీ, అందెలు ఉపయోగిస్తారు. డింకినే 'గుమ్మెట' అని కూడ అంటారు. ఈ మూడింటిలో 'బుడిగె' అని దేనినంటారో తొలి పరిశోధకులయిన ఆచార్య బి. రామరాజుగారు వివరించారు: "వంతపాట పాడేవారు వాయించే వాద్యమే బుడిగె"[1] అని స్పష్ట పరిచారు. సహదేవ సూర్యప్రకారావుగారు కూడ తమ "రూపకళ" గ్రంథంలో జంగం కథలను గురించి వివరిస్తూ "జంగం కథల్ని ప్రత్యేకంగా జంగాలనే ఒక తెలుగు కులం వారు చెప్పుచుండటం చేత ఈ కథా ప్రక్రియకు 'జంగం కథ' అనే పేరు ప్రఖ్యాతమయింది. వీరు వాయించే 'గుమ్మెట' అనే వాద్యాన్ని 'బుడిగె' అంటారు. అందుకే వీరిని బుడిగె జంగాలని కూడ పిలుస్తారు"[2] అని నిర్వచించారు.



బుడిగె తాంబూర, పడిగె తాంబూర, బుడిగెలు లేక గుమ్మెట్లు

జంగాలు కథలు చెప్పేటప్పుడు ఉపయోగించే తాంబూరల్లో రెండు రకాలను స్పష్టంగా గుర్తించవచ్చు. 1. బుడిగె తాంబూర 2. పడిగె తాంబూర. బుడిగె తాంబూర కింది భాగమయిన గుమ్మి అర్ధ వృత్తాకారంతో కాస్త చిన్నదిగా ఉంటుంది. పడిగె తాంబూర గుమ్మి కాస్త పెద్దదిగా ఉండటమేకాక,

1. తెలుగు జానపద గేయసాహిత్యము - పుట. 805.
2. రూపకళ - పుట. 96.

తీగలు సవరించే మెట్ల వైపు నాగుపాము పడగలాగ తీర్చి ఉంటుంది. బుడిగె తాంబూరలను తెలంగాణా ప్రాంతపు జంగాలు ఉపయోగించగా, పడిగె తాంబూరలను రాయలసీమ, సర్కారు ప్రాంతాలవారు ఉపయోగించటం విశేషం. తందానా కథలు చెప్పే జంగాలకు బుడిగె జంగమనే కులనామం తెలంగాణా ప్రాంతంలోనే వచ్చింది. కాబట్టి బుడిగె తాంబూరలు ఉపయోగించటం వల్లనే వీరికీ పేరు వచ్చి ఉంటుందేమో అనిపిస్తుంది. కాని, బుడిగె తాంబూర, పడిగె తాంబూరలనే గుర్తింపు ఈ కులస్థుల్లో ఉన్నదే తప్ప, ప్రజల్లో లేదు. బుడిగె జంగం అనే పేరు ప్రజల వ్యవహారంలో కలిగింది. అందువల్ల వీరు ఉపయోగించే తాంబూరలవల్ల కాకుండా బుడిగెలనబడే డింకీలు వాడటం వల్లనే వీరికీ కులనామం ఏర్పడిందని చెప్పటమే సమంజసం.

పూర్వకాలంలో ధాన్యం నిలువ ఉంచటానికి గాబులు, నీళ్ళకు కాగులు, బానలు, కడవలు, అంబలికి దుత్తలు, కల్లుకు లొట్లు, ముంతలు, పాలకు దాకలు, పెరుగుకు బుడ్లు, కూరకు అటికెలు, చట్లు, ఇతర అవసరాలకు పట్వాలు, మర్వాలు, గురుగులు మొదలయిన ఎన్నో రకాల మట్టి పాత్రలను ప్రజలు ఉపయోగించేవారు. సంచార జాతులవారు కారం మొదలయినవి నూరు కోవటానికి 'గుంజిప్ప'లను కూడ కొందరు కుమ్మర్లు ప్రత్యేకంగా తయారు చేసేవారు. సిద్దెను 'తత్తెర' అంటారు. సర్కారు ప్రాంతాల్లో దీన్ని 'పిడత' అంటారు. ఇవి తాబేలు ఆకారంలో వలయాకారంగా ఉండి, మందం తక్కువగా ఉండి, రెండంగుళాల వ్యాసపు మూతి కలిగి ఉండేవి. ఇవి కుండల్లా భూమ్మీద పెట్టటానికి రావు. పొందవు. పక్కవాటుగా పెట్టాలి. అందుకే వీటి మూతికి తాడు బిగించి గోడ మేకులకు తగిలించేలా ఏర్పాటు చేసుకునేవారు.

నిఘంటుకారులు 'బుడిగ' అనే పదానికి 'ఎద్దుమీది ఒకవైపు సిద్దె, 'పిడత' అని అర్థం చెప్పారు. శబ్దరత్నాకరంలో హంస వింశతి నుంచి 'పాల బుడిగలు' అనే ఉదాహరణ చూపబడింది. ఆంధ్ర వాచస్పత్యంలో 'నిడుపాటి సన్నని మూతిగల పాత్ర' అని అర్థం ఇవ్వబడింది. అయ్యలరాజు నారాయణా మాత్యుడు హంస వింశతిలో కుమ్మరి పరిశ్రమను వర్ణిస్తూ—

తే॥ కాగు మజ్జిగముంతయు కడవ గూన
బాన వెసలయు బుడిగెలు పరపుచట్టి
కడవ ముంత కరిగె దుత్త పిడత గురిగి
కుందెలటికయు మూకుడు బిందె ప్రమిద (5.11)

మొదలయిన రకరకాల మట్టి పాత్రలతోపాటు బుడిగెలను కూడ తయారు చేసే వాడని పేర్కొన్నాడు.

వాద్య సంగీతంలో ఘటం ప్రాధాన్యత అందరికి తెలిసిందే. అలాగే ఈ 'బుడిగె' అనే కూజా లాంటి మట్టి బుడ్డికి ఒక వైపు చర్మం కూర్చి, ఒక వాద్య విశేషంగా తీర్చారు. ఈ వాద్యాన్నే డింకి లేదా గుమ్మెట అంటారు. బుడ్డిలాగ, బుడిగెలాగ ఉండటం వల్ల దీనికి 'బుడిగె' అనే ప్రచారం ఎక్కువగా ఉంది. దీన్ని ఉపయోగించి కథలు చెప్పే జంగాలకు బుడిగె జంగాలని పేరు వచ్చింది.

వీరశైవులలోని స్థావరీకులు అప్పటికే జంగం (జంగమయ్య) కులంగా స్థిరపడ్డారు. వీరశైవ మాలలు మాల జంగాలయినారు. జంగాలలో మరో తెగ ప్రత్యేక కులంగా మారి, బుడిగెలతో కథలు చెబుతూ జీవించసాగారు. జంగమయ్య, మాలజంగం కులాలనుంచి ఈ ప్రత్యేక కులాన్ని వేరుచేసి చెప్పటానికి బుడిగె జంగమనే పేరు వ్యవహారంలోనికి వచ్చింది ఈ విధంగా 'బుడిగె'అనేది ఒక కులవాచకానికి విశేషణంగా ఏర్పడింది.

1951 జనాభా లెక్కల ప్రకారం భారత రాజ్యాంగం క్రింద హైద్రాబాదు స్టేటులో "ఈ క్రింది కులాలవారు వెనకబడిన కులాలవారు (Scheduled Classes) గా నమోదుచేయబడినారు"[1] అని, పట్టికలో 32 కులాలను పేర్కొన్నారు. అందులో వరుస నెం. 4 లో 'బేడ (బుడ్గ) జంగం' నమోదు చేయబడ్డది. 1961 మరియు 1971 జనాభా సేకరణ నివేదికల్లో కూడా తెలంగాణా ప్రాంతపు షెడ్యూలు కులాల పట్టికలో వరుస నెం. 4 లోనే ఈ కులం కొనసాగుతూ వచ్చింది. బేడ జంగం, బుడిగె జంగం కులాలు పరస్పర భిన్నమయినవి. కాబట్టి ఆంధ్రప్రదేశ్ రాజపత్రంలో పొందుపరచిన The

1. ఆంధ్ర దర్శిని - పుట - 1167.

Scheduled Castes and Scheduled Tribes orders (Amendment) Act, 1975 లో వరుస నెం. 9 లోనే ఈ కులాలను బ్రాకెట్ విడదీసి వేరు వేరుగా ఇచ్చారు. 1976 కు పూర్వం తెలంగాణా ప్రాంతానికే పరిమితమైన ఈ కులం రాష్ట్రమంతటా ఉన్నట్లుగా నిర్దేశించారు.[1]

1981 జనాభా సేకరణ నివేదిక ప్రకారం రాష్ట్రంలో వీరి జనాభా 12, 024 కాని, నిజానికి రాష్ట్రమంతటా కనిపించే బుడిగె జంగాలు లక్షవరకు ఉంటారు.

## బుడిగె జంగాలకు ఉన్న మరికొన్ని పేర్లు :

బుడిగె జంగాలు ప్రధానంగా బుడిగెలు ఉపయోగించి తందానా కథలు చెప్పినప్పటికి, అనేక కళా ప్రక్రియలను ప్రదర్శిస్తారు. తత్కారణంగా గ్రామీణులు వీరిని అనేకమైన పేర్లతో పిలవటం పరిపాటి. అంతేకాకుండా వీరు తమ కులనామానికి గౌరవ విశేషణాలు జోడించి చెప్పుకోవటం కూడ సర్వసాధారణం. వీరి ఏకవ్యక్తి కళా ప్రదర్శనలు, సామూహిక కళా ప్రదర్శనల గురించి చెప్పే ముందు ప్రచారంలో ఉన్న కొన్ని పేర్లను టూకీగా తెలుపుతాను. వాటిలో ఊర

---

1. In the Scheduled Caste and Scheduled Tribes (Modification) order 1976 Budga Jangam, Beda Jangam was enumarated as Scheduled caste as it existed in the Districts of erstwhile Telangana area namely Hyderabad, Medak, Khammam, Mahaboobnagar, Nalgonda, Warangal, Nizamabad, Kareemnagar, and Adilabad Districts. The position continued to be the same till 1976, when the area restriction was removed by the Scheduled castes and Seheduled tribes order (amendment) Act, 1976. Extending the operation of the Provision to the other part of the state.

—Govt. of A.P. Social Welfare(J), Dept.
Memo. No. 1030/J1/88-5 dt. 23-3-1989.

జంగాలు, గణాయత జంగాలు, శివజంగాలు, శ్రీజంగాలు, సిరిజంగాలు, ఈత ముక్కల జంగాలు, పిరికిజంగాలు అనే పేర్లు ముఖ్యమయినవి.

## 1. ఊరజంగాలు :

వీరశైవంలోని స్థిరజంగాలు, చరజంగాలలో స్థిరజంగాలే ఊరజంగాలు. ఊరిలో స్థిరనివాసం ఏర్పరచుకున్న జంగాలు ఊరజంగాలు. వేంకటనాథకవి 'జంగాలు, కదవోని తెరనాటకపుటూరిజంగాలు' అని, వేరు వేరు రెండు కులాలుగా పేర్కొనటం వల్ల వీరశైవమత ప్రచారకులైన జంగాలకు భిన్నమైన వారు ఊరజంగాలని, వారు తెరనాటకాలాడుతారని బోధపడుతున్నది. తెరనాటకా లాడే ఈ జంగాలే తర్వాతకాలంలో జంగం కథలు చెప్పటం ప్రారంభించి ఉండ వచ్చు. తద్వారా ఊరజంగం పేరు మాసిపోయి, వీరికి 'బుడిగెజంగం' అనే కుల నామం ప్రచలితమయిపోయి ఉంటుంది. నేడు ఊరజంగమంటే ఊరూరు తిరు గుతూ, కథలు చెబుతూ పొట్టపోసుకునే బుడిగె జంగం కాక, ఊరిలో స్థిరనివా సంగా ఉండి, నిమ్న కులాలవారికి పౌరోహిత్యం నిర్వహించే జంగమయ్యకులం అనే అర్థం తెలుగుదేశంలో స్థిరపడిపోయింది.

## 2. గణాయత జంగం :

జంగం కులంనుంచి మాల జంగం ఉపకులంగా ఎప్పుడో చీలిపోయింది. 1891 నాటికి కూడ జంగాలలో రెండువిభాగాలున్నాయని థర్స్టన్‌గారు పేర్కొ న్నారు.[1]అవి 1. గణాయత జంగం. 2. స్థావర జంగం. స్థావర జంగాలే జంగ మయ్యలులేకజంగమ దేవరల పేరుతో సమాజంలో స్టిరపడగా, గణాయత జంగాలే బుడిగెలు ఉపయోగించి కథలు చెప్పటం వలన బుడిగె జంగాలనే కులనామంతో వ్యవహరింపబడ్డారు. పూర్వ కవులు పేర్కొన్న జంగం, తెరనాటకపు జంగం

---

1. In the census report 1891, it is recorded that '....only two of the sub.divisons returned are numerically impor. tant, Ganayata and Sthavara.'
—The castes and Tribes of Sothern India. Vol II, page. 450.

విభాగాలే స్థావర, గణాయత జంగాలలు ఉండవచ్చు. థర్స్టన్ పేర్కొన్న గణాయత జంగాలను గణాచారి జంగాలని సిరాజుల్ హసన్ గారు వివరించారు.[1] సర్కారు, రాయలసీమ ప్రాంతాల్లోని కొన్ని జిల్లాల్లో బుడిగె జంగాలు తమను గణాయత జంగాలుగా చెప్పుకుంటారు. వీరు బుడిగెలతో జంగం కథలను చెప్పటమే కాకుండా, పగటి వేషాలు కూడ విరివిగా ప్రదర్శిస్తారు.

## 3. శివ జంగాలు, శ్రీ జంగాలు - సిరి జంగాలు :

బుడిగె జంగాలు అనే పేరు స్థిరపడక ముందు ఇటు జంగమయ్య కులం నుంచి అటు మాల జంగం కులం నుంచి తమను వేరుగా గుర్తించటానికి వీరు ప్రచారం చేసుకున్న పేర్లవి. జంగం శబ్దం శైవుడనే అర్థాన్ని బోధించినప్పటికి, శివ శబ్దాన్ని అదనంగా చేర్చి తాము 'శివ జంగాల' మని చెప్పుకున్నారు. అలాగే జంగం శబ్దంముందు 'శ్రీ'చేర్చి తమను'శ్రీజంగాలు'గా చెప్పుకున్నారు.ఆ రోజుల్లో కళాప్రదర్శనలు ఇచ్చి, యాచించటం గౌరవంగానే ఉండేది. గ్రామీణుల ఆదరణ అపారంగా లభించేది. అందువల్ల తమ కులాన్ని ప్రత్యేకంగా, గౌరవప్రదంగా చెప్పుకోవటానికే వీరు పై విశేషణాలను చేర్చుకున్నారు. 'శ్రీ జంగాలు' అనే పేరులో శ్రీ వికృతించి 'సిరి జంగాలు'గా స్థిరపడింది. ఈ శతాబ్దం ప్రారంభం నుంచి వీరికి బుడిగె జంగాలనే పేరు స్థిరపడినా కొందరు వృద్ధులు తమ కులాన్ని పై పేర్లతో సంభావించుకోవటం అక్కడక్కడా కనిపిస్తున్నది.

## 4. ఈతముక్కల జంగాలు :

వీరిని మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి గారు తదితరులు పేర్కొన్నారు. పశ్చిమ గోదావరి జిల్లాలోని 'ఈతముక్కల' అనే గ్రామంలో పూర్వకాలం నుంచి బుడిగె జంగాలు స్థిరనివాసా లేర్పరచుకుని ఉన్నారు. జంగం కథలు

1. "The Ganachari Jangams are householders like the Sthavaras, but unlike them, wander from village to village to collecting arms."
—The Castes and Tribes of H. E. H. The Nizam's dominions - page. 387.

చెప్పటంలో వీరు తరతరాలనుంచి పేరెన్నికగన్నవారు కాబట్టి వీరు ఊరి పేరుతో ప్రసిద్ధులయ్యారు. ఈతచాపలల్లటంవల్ల వీరికీ పేరు వచ్చిందని కొందరు భావించారు. కాని, అది సరికాదు.

## 5. పిరికి జంగాలు :

బుడిగె జంగాలది పిరికి స్వభావం, కాబట్టి వీరికి పిరికి జంగాలని పేరు వచ్చింది. మొదట సంచార జీవులయిన వీరిలో నేర ప్రవృత్తి కనిపించదు. చేలల్లోని కంకులు, కూరగాయలు. మిరప, వంకాయ, సొర, మామిడి, చింత కాయలు మొదలైన ఆహారసంబంధ వస్తువులను రైతుల కన్నుగప్పి దొంగిలించే స్వభావం వీరికున్నప్పటికీ నేరాలంటే వీరికి చచ్చేంత భయం. గ్రామీణులెవరైనా బెదిరిస్తే, భయపడి, వెంటనే అక్కడినుంచి మకాం మార్చేస్తారు. ఈ కారణాల వల్లనే వీరికి పిరికి జంగాలనే పేరు వచ్చింది. కాని, ఈ పేరు ఎక్కువ ప్రచారంలో లేదు.

ఈ విధంగా వీరశైవ మతంలో పుట్టి 'జంగం' కులం ఎన్ని ఉపకులాలుగా చీలిపోయిందో ఈ ప్రకరణంలో వివరించటం జరిగింది. అలా చీలిపోయి ఏర్పడిన బుడిగె జంగం కులానికి తర్వాత కాలంలో వచ్చిన కొన్ని వ్యవహార నామాలను కూడ పేర్కొనటం జరిగింది. ఇక మూడవ ప్రకరణంలో బుడిగె జంగాలు ప్రదర్శించే వృత్తి కళలను గురించి పరిశీలిస్తాను.

మూడవ ప్రకరణం

# బుడిగె జంగాలు ప్రదర్శించే జానపద కళారూపాలు (వృత్తివేషాలు)

'కూటికోసం కోటి విద్యలు' అన్నట్లు బుడిగె జంగాలు తమ జీవనోపాధికి ఎన్నో జానపద కళారూపాలను ఆశ్రయించారు. ఏదో ఒక జానపద కళా రూపాన్ని ప్రదర్శిస్తూ పొట్ట పోసుకోవటం కాకుండా, అనేక జానపద కళా రూపాలను ప్రదర్శిస్తూ పోవటం వల్ల వీళ్ళలో వృత్తి వైవిధ్యం ఏర్పడింది. ఎవరికి అనుకూలమైన జానపద కళారూపాలను వారు అవలంబించారు. ఏ కాలంలో ఏ కళారూపం లేక ఏ వేషం ఏ ప్రాంతంలో ఎక్కువగా ప్రజామోదం పొందుతుందో ఆ కళారూపాన్ని లేక ఆ వేషాన్ని ఆ ప్రాంతంలో ప్రదర్శించటం నేర్చుకున్నారు. మొదట్లో కథాగానం చేయడమే వీరి వృత్తి అయినా, తర్వాత కాలంలో తోలుబొమ్మలాట లాడటం కొందరికి వృత్తి అయితే, వీధిభాగోతాలు ప్రదర్శించటం మరికొందరికి వృత్తి అయింది. కూచిపూడి బ్రాహ్మణులు ప్రదర్శించే 64 పగటి వేషాల్లో వీళ్ళలో కొందరు 33 వేషాలవరకు నేర్చుకొని ప్రదర్శించేవారట. అందులోనుంచి బ్రాహ్మణ వితంతువు, బ్రాహ్మణ వేషం, తుపాకి రాముని వేషం మొదలైన వేషాలను ఒక్కొక్కటిగా వేరుచేసి ప్రదర్శిస్తూ కొందరు జీవిక సాగించటం ప్రారంభించారు. మరికొందరు కాటిపాపల మొదలైన వేషాలను ప్రదర్శించటం వృత్తిగా కొనసాగించారు. ఈ విధంగా అనేక కళా రూపాలను వీళ్ళు ఆశ్రయించారు వీటిని వీళ్ళ వృత్తివేషాలుగా పేర్కొనవచ్చు.

బుడిగె జంగాల ఈ వృత్తివేషాలను ముఖ్యంగా రెండు భాగాలుగా విభజించి పరిశీలించవచ్చు. అవి I. ఒకే వ్యక్తి ప్రదర్శించే కళారూపాలు లేదా వృత్తి వేషాలు, II. సామూహిక ప్రదర్శన కళారూపాలు లేదా సామూహిక వృత్తివేషాలు.

ఒకే వ్యక్తి ప్రదర్శించే వృత్తివేషాల్లో 1. తుపాకి రాముని వేషం, 2. బ్రాహ్మణ వితంతువు వేషం, 3. బాలసంతు వేషం, 4. కోయవంతు,

5. ముత్తడిపంతు, 6. ఏకతారపంతు, 7. ఇతరాలు అనేవి చేరుతాయి. ఇక రెండవ భాగమైన సామూహిక ప్రదర్శన కళారూపాల్లో 1. బుడిగె జంగం కథలు/శారద కథలు, 2. తోలుబొమ్మలాటలు, 3. వీథిభాగోతాలు, 4. పగటి వేషాలు, 5. కాటిపాపలవేషాలు, 6. మందెచ్చువేషాలు, 7. గురప్పలవేషాలు, 8. నాటాంపంతు, 9. ఇతరాలు అనేవి చేరుతాయి.

ఆయా విభాగాల్లోని కళారూపాలను వరుసగా వివరిస్తాను.

## I. ఒకే వ్యక్తి ప్రదర్శించే వృత్తివేషాలు

### 1. తుపాకి రాముని వేషం[1]

బుడిగె జంగాలు ప్రదర్శించే ఏకవ్యక్తి కళారీతుల్లో విలక్షణమైన వేషం తుపాకి రాముడు. ఈ వేషాన్ని 'పిట్టలదొర' అనే పేరుతో కూచిపూడి భాగవతులు ప్రదర్శించేవారు. కూచిపూడి భాగవతుల పగటివేషాల స్ఫూర్తితో ఈ వేషం సృష్టి జరిగినప్పటికీ బుడిగె జంగాలీవేషాన్ని సామూహికంగా వారు ప్రదర్శించే పగటివేషాల్లో చేర్చకుండా ఒంటరిగా, ప్రత్యేకంగా ప్రదర్శిస్తూ పొట్టపోసుకుంటారు.

సమాజంలో ప్రగల్భాలు పలికేవారు తరచుగా తటస్థిస్తూనే ఉంటారు. కోతలరాయుళ్లు అద్భుతమైన ఊహాకల్పనలతో ఎదుటి వ్యక్తులను చిక్కబట్టుకొని ఊదరకొడుతుంటారు. అలాంటి వాళ్ళను చూసి, సమాజంలో నవ్వుకోవటం సాధారణ విషయం. శిష్టనాటకాల్లో విదూషకులు, వీధి భాగవతాల్లో హాస్యగాడు లేక ఆసిగాడు పేరుతో, తోలుబొమ్మలాటల్లో గంధోళిగాడు లేక కేతిగాడు పేర్లతో మనకు దర్శనమిస్తుంటారు జంగం కథల్లో, హరికథల్లో, హాస్యంకోసం పిట్టకథలు చెప్పటం ఉంది. ఈ విధంగా అన్ని జానపద కళా ప్రక్రియల్లో అవాంతరంగా హాస్యం పోషింపబడుతూనే ఉంది. పగటివేషాల్లో హాస్యంతోపాటు వ్యంగ్యవైభవం కూడ అంతర్లీనంగా ఉంటుంది. ప్రజలకు హాస్యం అందించటంతోపాటు లౌకికాంశాలతో వెన్నుతట్టటం కూడ పగటివేషాల పరమార్థం. పూర్వం కూచిపూడి బ్రాహ్మణులు ప్రదర్శించే పగటి వేషాల్లో నుంచి పుట్టుకొచ్చి,

1. అనుబంధం-1లో పూర్తి ప్రసంగపాఠం ఇవ్వబడింది.

ఒక వృత్తివేషంగా రూపొందిన తుపాకి రాముని వేషం హాస్యపోషణకు ఆలవాలం. చమత్కార సంభాషణలకు చక్కని నిదర్శనం.



ఈ వేషగాళ్ళ ఉనికి తెలంగాణా అన్ని జిల్లాల్లో ఉంది. ఏక వ్యక్తి కళా రీతుల్లో బ్రాహ్మణ వితంతువేషం కంటే ఈ వేష ప్రదర్శనలు ఎక్కువ.[1] ఈ వేషాన్ని తెలంగాణా ప్రాంతంలో 'లత్కోరు సాబ్' వేషం అనికూడ అంటారు.

---

1. ఈ వేషానికి సంబంధించిన ప్రసంగాన్ని మహబూబ్‌నగర జిల్లా షాద్‌నగర్ ప్రాంతంలోని దేవునిపల్లి వాస్తవ్యుడు సదుల రామలింగం నుంచి సేకరించటం జరిగింది.

తుపాకి రాముని వేషం ధరించేవాడు ఖాకీరంగు పాత ప్యాంటు, అదే రంగు పాత చొక్కా, తలమీద ఇంగ్లీషు వాళ్ళు ధరించే హ్యాటు, భుజం మీద కర్రతుపాకి ధరిస్తాడు. ఎడమ భుజానికి జోలె ఉంటుంది ఒక కాలి ప్యాంటు చివరను పైకి మడుస్తాడు. కొందరు వేషగాళ్ళు చిరిగిన మేజోళ్ళు, పాత బూట్లు తొడుక్కుంటారు. జేబులో బీడీలు పెట్టిన సిగరెట్ పాకెట్టు ఉంటుంది. ఈ వేషంతో గ్రామంలో ఇల్లిల్లు తిరుగుతూ, హాస్యం పుట్టించే మాటలు వల్లిస్తూ, అందరినీ నవ్విస్తూ భిక్షాటన చేస్తాడు. పిల్లలు గుంపులుగా చేరి, అతని మాటలకు ఆనందిస్తూ కేరింతలు కొడతారు.

పూర్వకాలంలో 'వెంకట్రాముడు' అనే బుడిగె జంగం ఈ వేషం వేసి, పేరు గడించటం వల్ల ఈ వేషానికి, 'తుపాకి వెంకట్రాముడు' అని అతని పేరు వచ్చిందని, ఈ వేషాన్ని ప్రదర్శించిన సదుల రామలింగం తెలిపారు. రాను రాను అందులోనుంచి 'వెంకట' అనే పదం జారిపోయి ఈ వేషం పేరు తుపాకి రాముడుగా వ్యవహరింపబడుతూ వచ్చింది తుపాకి ఆధారంగ పొట్టపోసుకోవటం వల్ల 'తుపాకి రాముడు' లేదా 'టుపాకి రాముడు' అనే పేరు జనంలో నిలిచింది.

తన దగ్గర ఉన్న కర్ర తుపాకితో కాకులు మొదలైన పక్షులకు గురిపెట్టి 'ఢాం' అని నోటితో శబ్దం చేస్తూ అందరినీ నవ్విస్తుంటాడు కాబట్టి అతణ్ణి 'పిట్టల దొర' అని పిలవటం మొదలయింది.

బుడిగె జంగాలీ వేషాన్ని 'ఫిరంగి వేషం' అని కూడ పిలుస్తారు. పరాసులు లేక పరంగీలనబడే ఫ్రెంచివారిని ఈ వేషంలో అనుకరిస్తుండటంవల్ల దీన్ని 'ఫిరంగి వేషం' అన్నారు. తందానా కథలు చెప్పేటప్పుడు వీరు బొబ్బిలియుద్ధం లోని 'ఫ్రాంసీల బుస్సీ' వేషాన్ని వర్ణించి ఉండటంవల్ల బుస్సీని తలపించే ఈ వేషాన్ని 'ఫిరంగి వేషం' అని వ్యవహరించి ఉంటారని ఊహించటానికి వీలున్నది.

తుపాకి రాముడు తన ప్రసంగాన్ని తన యుద్ధ పరాక్రమంతో మొదలు పెడతాడు. దేశాన్ని పరిపాలించే రాజువద్ద ఉన్న మంత్రులను ఏకరువుపెట్టి, అందులో అందరికంటే తానే రాజుకు సన్నిహితుడనని చెప్పుకుంటాడు. తాను గల్లా వసూలుకు బయలుదేరానని, ప్రజలందరికీ 'బంగ్లా'లు కట్టిస్తున్నానని, తన

బంగ్లా (బంగళా) వద్ద ప్రజలకు విందు ఏర్పాటు చేశానని, ఆ విందు ఏర్పాట్లను వివరిస్తాడు. తన వద్ద ఉన్న బంగారాన్ని కుక్క ముట్టితే బావిలో పారవేశానని, మీకు కావాలంటే మేలు రకానికి చెందిన వడ్లను పంపిస్తానని తన వద్ద ఉన్న వరి రకాలను పేర్కొంటాడు. తన అత్త పెళ్ళి కోసం గల్లా వసూలు చేస్తున్నానని, దేశంలోని గొప్ప గొప్పవాళ్ళు తన అత్త పెళ్ళికి వస్తున్నారని, పెళ్ళి ఏర్పాట్లు గొప్పగా చేస్తున్నానని చెబుతాడు. కాబట్టి ఊళ్ళో వాళ్ళంతా వెంటనే ఇంటికి మానెడు, ఇంటికి మానెడు ధాన్యం కొలవాలని పురమాయిస్తాడు. హాస్యం పుట్టించే విధంగా పైన పేర్కొన్న ఘట్టాలకు సంబంధించిన మాటలు వల్లిస్తూ, వాచికానికి అనుగుణమైన ఆంగికాన్ని అభినయిస్తాడు. ఈ వేషానికి సంబంధించిన ప్రసంగ పాఠానికి మించి, సమయ సందర్భానుసారంగా చమత్కారంగా భాషించి, నటించి, ప్రజల మెప్పు పొందటంలో విజయం సాధిస్తాడు.

తుపాకి రాముడు వస్తు వస్తూనే యుద్ధ వాతావరణాన్ని వర్ణిస్తాడు. "చలోప్. చలోప్. ఫ్రెండియాం. యస్. యస్. పుస్ పుస్. వాట్ వూట్. రైట్ లైట్. జల్దీ ఉటాయించాలె. ఇక్కడ జప్తి ఉటాయించాలె. గోలిదువాలె ఇక్కడ. గుండిదువాలె. సర్కార్ ఉక్కు దెచ్చినిపుడు. దండు వచ్చి ఆగితే దండుమీద్కి లడాయికి బోయిన. పొద్దంత నిన్నటిదిక్కె పోతావుంది. నిన్నటి నుంచి దండుమీద లడాయి జేసిన్నంటే.... ఒక్కొక్క గుండిడ్సి పెట్టె ఇపుడు. గుండువొయ్యి గుండ్లపల్లి చెరువుల పడ్తె నేనువొయి తుంగమడ్గుల పడ్డ. అంత పెద్ద లడాయి జేసిన్నంటె యిపుడు, నా భయాన్కి దండంతా దెంకపొయ్యింది." అంటూ తన ప్రతాపాన్ని నవ్వు పుట్టించే విధంగా చాటుకుంటాడు.

ప్రజలకు తాను కట్టించే బంగ్లాల గొప్పతనాన్ని ఈ విధంగా తెలియ జేస్తాడు: "ఇక్కడ ఊరిబైట యిపుడు సర్కారి బంగ్లల్ గట్టిస్తున్న. ఒక్కొక్కటి బంగ్లలంటె. పెద్ద పెద్ద బంగ్లలు వడ్తుతున్నాయ్. ఏడంత్రాల బంగ్లలు. బంగ్లకొక్క లక్షరూపాయల్ కర్సైపోతున్నయ్. ఉద్దాల జిలేమాల్... గాలివెడ్తె గలగల. వానవడ్తె జలజల.... తుంగవి వాసాలు....వరిగడ్డి దూలాలు. వర్యాకు కవ్వ, ఏపెవి నిచ్చెన్లు. మీదికెల్లి వానవడ్తవుంటె, బంగ్లకిందికెల్లి వానసీల్లు వడిపోతున్నయ్. అటువంటి గట్టి బంగ్లలు గట్టిపిస్తున్నయిపుడు...." అంటూ అపూర్వమైన, విచిత్రమైన బంగళాల నిర్మాణాన్ని వివరించి, వినోదం కలిగిస్తాడు.

బంగ్లా వద్ద యిచ్చే విందు విశేషాలను ఇలా తెలుపుతాడు: "బంగ్లకాడ దావత్ జెయ్యనింకె బియ్యం గొండవొయిన. చెరువుల నానబోసిన తూము కింద మంట బెట్టిన. పొట్టుపొలావ్ జేసిన. తౌడు చాయ్ జేసి పెట్టిన. చాలామందిని పిలువనంపిన బంగ్లకాడికి బోజనాలకు. మొకం కడుక్కోని రమ్మంటే, మొకం కడుక్కోకనే వొచ్చిండ్రు బోజనాలకు బంగ్లకాడికి. వాండ్లకు ఏమి కూరగాయలు వొండిపెట్న అంటె - అటువంటి కూరగాయలు మీరు గూడంగ ఎన్నడు బోంచేయలేదు. అంత మంచి కూరగాయలు జేపిచ్చిన. పొవ్వాకిత్తుల[1] పొగు సే పిచ్చిన, గాంచునూనె[2] తాలింపేసిన. ఒక సంచి ఉప్పుబోసిన. ఒక మిరపకా యేసిన. ఒక బస్తె యాపకాయ దెచ్చిన. పచ్చిపులుసు పిసికి పెట్టినానువాండ్లకు పొట్టనిండ అన్నం తినాలంటని జమ్మాకేమొ ఇస్తర్లేసిన. తుమ్మాకేమొ దొల్లలు గుట్టిచ్చిన. ముగ్గురి నడుమ ఒక్కమెతుకు ఇర్సి పెట్టిన. పొట్టనిండ దింటవుండరు. పొట్టమీద బట్టేసుకొని వచ్చిండ్రు. బట్టెందుకంటె, దిష్టితగులకుంట. మిగిలిన అన్నమంత పెంట మీద పారేస్తవుంటె కుక్కలుగూడంగ దింటలేవు.." అంటూ కనీ వినీ ఎరుగని రీతిలో భోజన పదార్థాలను వడ్డించిన, అద్భుతమైన విందును నవ్వులూరే విధంగా గబగబా చెప్పుకుపోతాడు.

తుపాకిరాముని ప్రసంగం కోతలతో నిండిపోయినప్పటికీ తన దయనీయ మైన స్థితిని కూడ రెండు మాటల్లో చెబుతాడు. "ఇంట్ల కోడికేత మంటె ఐదిత్తులు లేకుండయినయ్. మాపుదింటె రేపులేదు. రేపు తింటె మాపులేకుండయిపోయింది. అందుకొరకు ఊళ్ళల్ల గల్లా వసూలు చేస్తుండ" అని తాను భిక్షమడగటాన్ని హాస్య ప్రసంగంతో సమర్థించుకుంటాడు.

ఈ వేషధారి కొన్ని సంఘటనలను గ్రహించి, వాటిని వ్యత్యస్తం చేసి, అసహజమైన విషయాలను కూర్చి, హాస్యస్ఫోరకంగా వర్ణించి నవ్వు పుట్టిస్తాడు. తుపాకి యుద్ధానికి వెళ్ళిన సంఘటనలో తాను విడిచిన ఒక్కొక్క గుండుకు మున్నూట అరవై మంది పడిపోగా ఆ గుండువెళ్ళి గుండ్లపల్లి చెరువులో పడితే, తాను వెళ్ళి తుంగమడుగులో పడ్డానని, అది ఒక గొప్పగా చెప్పి ప్రజల్ని నవ్విస్తాడు. అలాగే భిక్షగాడైన తాను లక్షలు వెచ్చించి కట్టిన బంగ్లాలు 'గాలి

1. పొగాకు విత్తులు. 2. గ్యాసునూనె (కిరసనాయిలు).

పెడితే గలగల, వానపడితే జలజల' అని, ఆ బంగ్లాలకు 'తుంగవాసాలు, వరిగడ్డి దూలాలు, వర్ర్యాకు కప్పు, ఏపె నిచ్చెన్లు' అంటూ వర్ణించటం విన్న చుట్టూర జనం నవ్వకుండా ఉండలేరు. కుక్క ముట్టినందువల్ల గుమ్మడికాయంత బంగారం బావిలో పారవేస్తే, ఆ బంగారాన్ని తెచ్చుకోవటానికి మున్నూటరవై మంది - జుట్టుకు గుండుకట్టుకొని, కాళ్ళకు బెండు కట్టుకొని మునిగితే కాళ్ళుపైకి, తలలు లోనికి వెళుతున్నాయని వర్ణించిన సంఘటన మొదలైనవి హాస్యం పుట్టించటానికి చేసిన చమత్కార ప్రసంగాలే.

ఈ ప్రసంగం తెలంగాణా ప్రాంతానికి చెందింది కావటంతో సహజంగా తెలంగాణా యాసతో హిందూస్థానీ పద బాహుళ్యంతో నిండి ఉన్నది. జల్ది, జప్తి, సర్కార్, ఉకుమ్ (హుకుమ్), లడాయి, జెర్రంత, లత్కోర్ సాబ్, గల్లా, మాఫ్, వసూల్, బర్తీ, పౌలావ్, బస్తీ, ఉల్టాపల్టా, గల్లి, టక్కర్ మొదలైన హిందుస్థానీ పదాలెన్నో ఇందులో ప్రయోగింపబడ్డాయి. వేషం ఇంగ్లీషువాణ్ణి అనుకరించేది కాబట్టి 'యస్.యస్.ఫుస్.ఫుస్, వాట్ వూట్, రైట్ లైట్' మొదలయిన ఆంగ్ల పదాలు, ఆంగ్ల పదాలను పోలిన ధ్వనుల్ని వేషధారి తన ప్రసంగంలో సమయానుకూలంగా ఉచ్చరిస్తుంటాడు.

ఆయా ప్రాంతాల్లోని వేషగాళ్ళ ఉచ్చారణలో మాండలిక ప్రభావం సహజంగానే ఉంటుంది. ప్రసంగంలోని హాస్య ఘటనలు కూడ కొన్ని మార్పు చేర్పులతో ప్రదర్శింపబడుతుంటాయి.

ఈ విధంగా బుడిగె జంగం జీవన గవేషణకు ఆధారమైన తుపాకిరాముని వేషం, పల్లె ప్రజలకు ఉల్లమలరే హాస్యాన్ని అందిస్తూ, జానపద సరస్వతి కీర్తి కిరీటంలో కాంతులు చిందే మణిగా స్థానాన్ని పదిలం చేసుకున్నది.

## 2. బ్రాహ్మణ వితంతువు వేషం :

కూచిపూడి భాగవతులు పూర్వం 64 పగటి వేషాలు ప్రదర్శించేవారు. రానురాను వాటి సంఖ్య తగ్గుతూ వచ్చింది. ఆ పగటి వేషాల్లో ఒకటయిన 'బ్రాహ్మణ వితంతువు' వేషాన్ని బుడిగె జంగాలు జీవనోపాధికి వృత్తిగా చేపట్టారు. బుడిగె జంగాల్లో కూడ కొన్ని పగటి వేషాలు ప్రదర్శించేవాళ్ళున్నారు.

**అయితే,** వారు ప్రదర్శించే వేషాల్లో ఈ వేషం చేరదు. ఈ ఒక్క వేషాన్ని ఒంటరిగా ప్రదర్శిస్తూ పొట్టపోసుకోవటం కొందరు బుడిగె జంగాల్లో కొన్ని తరాలుగా వస్తున్నది. అధిక శాతం జంగం కథలనే చెప్పి జీవించినా, అక్కడక్కడ కొందరు ఈ వేషాన్ని వృత్తిగా స్వీకరించినవారు కనిపిస్తారు.



తెలంగాణాలోని కొన్ని జిల్లాల్లో ఈ వేషం వేస్తూ జీవించే వారున్నారు. ఏక వ్యక్తి ప్రదర్శించే కళా ప్రక్రియల్లో ఈ వేషం పరిమితంగానే దర్శన మిస్తుంది.[1]

బ్రాహ్మణ వితంతువు వేషాన్ని బుడిగె జంగాలు 'బోడి బాపనమ్మ' వేషం అని అంటారు. తెలంగాణ గ్రామీణుల్లో ఈ పేరు కూడ ప్రచారంలో ఉంది.

ఈ వేషం ధరించేవారు కొందరు శిరోముండనం చేయించుకోవటం పరి పాటి. సిగను అలాగే ఉంచుకున్నట్లయితే తలమీద కొంగు కప్పుకుంటారు. వేషధారి వితంతువులా వేషధారణచేసి, చంకకు జోలె వేసుకొని, ఇంటింటికి వెళ్ళి ఏడ్పు నటిస్తూ, ఈ వేషానికి ప్రత్యేకంగా ఏర్పరచుకొన్న మాటలను వల్లిస్తూ, భిక్షం అడుక్కుంటాడు. తాను ఏడ్చినట్లు నటిస్తూ, ఎదుటి వాళ్ళను నవ్వించటం ఈ వేషగాడి ప్రత్యేకత. తన హాస్య ప్రసంగంతో, హావభావ ప్రకట నంతో ప్రజలను ఆకట్టుకొని, వారికి వినోదం కలిగిస్తాడు. భిక్ష సేకరిస్తాడు.

బ్రాహ్మణ వితంతువు పేరు భాగీరథమ్మ. ఈమె భర్త కీ.శే. వెంకట రాయుడు. తన భర్తకు తనతో కలిపి ఏడుమంది భార్యలు. కాని, సంతానం లేదు తీర్థయాత్రలు చేస్తే సంతానం కలుగుతుందని వెంకటరాయుడు నిశ్చ యించి, తనతో ఎవరెవరు వస్తారని భార్యలను అడుగుతాడు. ఆరుమంది పెద్ద భార్యలు ఎవరు రావటానికి ఇష్టపడరు. చిన్న భార్య భాగీరథమ్మ మాత్రం వెంకటరాయుడి వెంట తీర్థయాత్రలకు బయలుదేరుతుంది. కొన్ని రోజులు తీర్థ యాత్రలు చేశాక, ఒకరోజు గంగానది ఒడ్డున విడిదిచేస్తారు. భాగీరథమ్మ వంట చేస్తుండగా వెంకటరాయుడు స్నానానికి నదిలోకి దిగి ఎంత లోతున స్నానం చేయాలని ఆమెను అడుగుతాడు. మోకాళ్ళబంటి లోతునుంచి నడుములబంటికి,

---

1. క్షేత్ర పరిశీలన చేస్తూ ఈ వేషానికి సంబంధించిన ప్రసంగాన్ని సుద్దుల పేట, నంద్యాల, కర్నూలు జిల్లాలో మోతే ఎల్లప్పవద్ద, రంగారెడ్డి జిల్లా, మీర్ పేటలో రామచంద్రం వద్ద రికార్డుచేసి, ఆ తర్వాత వ్రాసుకోవటం జరిగింది. అనుబంధంలో రామచంద్రం ప్రసంగ పాఠాన్ని ఇచ్చాను. చూడు అనుబంధం - 2.

నడుములబంటి లోతునుంచి మెడలోతులోకి - ఇలా ఇంకా లోపలికి వెళ్ళమంటూ ఆమె చెప్పగా అలా వెళ్ళివెళ్ళి, చివరికి వెంకట్రాయుడు నదిలో మునిగిపోతాడు. భాగీరథమ్మ మాత్రం పోయినవాడు తిరిగివస్తాడా అనుకొని, వండిన పదార్థా లన్నీ భోంచేసి, ప్రయాణమై ఇల్లు చేరుకుంటుంది. సవతులందరికి వెంకట్రా యుడు గంగలో కలిసిన సంగతి చెబుతుంది. అందరు ఏడుస్తారు. విధవరాండ్రు అవుతారు. ఇదీ కథ.

ఈ కథలో సందర్భాన్ని బట్టి నవ్వుపుట్టించే ఆయా విషయాలు చేరుస్తూ వెంకట్రాయుడి మరణానికి దుఃఖిస్తున్నట్లు, అంగలారుస్తున్నట్లు వేషధారి నటిస్తాడు. చేతులు చరుచుకోవటం, గుండె బాదుకోవటం, ఏడుస్తూ ప్రక్కవారి మీద ముక్కు చీదినట్లు చేయటం, గుమిగూడిన వారిలోనుంచి ఎవర్నో పట్టుకుని వెంకట్రాయుని జ్ఞాపకం చేసుకుంటూ ఏడ్వటం మొదలైన చేష్టలవల్ల జనం అబాల గోపాలం నవ్వుల్లో మునిగిపోతారు ఈ వేషం ద్వారా వినోదమే కాకుండా కపట ప్రేమను ప్రదర్శించే భార్యలకు బుద్ధి వచ్చేటట్లుగా చురకలు అంటించటం కూడ ఉంటుంది.

భాగీరథమ్మ ప్రసంగం ఇలా మొదలవుతుంది: ''ఏకోనారాయణా! అయ్యో! నాతల్లీ! వెంకట్రాయుడుండంగ నేనిట్లుంటినా? అయ్యవారు చేయెత్తు మనిషి. ఆయన ఏడగూర్చున్నా రోతల్నే గూర్చునేది! అయ్యో! రోతల గాదమ్మా! రాతల, రాతల గూర్చునేది. అయ్యవారికి మేం ఏడుమంది భార్యలం సుబ్బమ్మ, శేషమ్మ, రమణమ్మ, గాయత్రమ్మ, అలివేలమ్మ, క్రిష్టమ్మ. నా పేరు భాగీర్తమ్మ. నేనంటే అయ్యవారికి ప్రాణమంటె ప్రాణం. 'బాగీర్తా! బాగీర్తా! ఎక్కడ గూర్చున్నాగాని నాకేం లాభం? నా తొర్ర మీద గూర్చుందు రావే.' తొర్రమీద గాదమ్మా! తొడ మీద. నా తొడమీద గూర్చుందు రావే అని పిలిచేవారు'' అంటూ వెంకట్రా యుని జ్ఞాపకం చేసుకొని ఏడ్చాక భాగీరథమ్మ అతని బుద్ధి విశేషాల్ని గురించి చెబుతుంది.

''ఎటువంటి వాడు వెంకట్రాయుడు.... అయ్యో, వెంకట్రాయుడు.... భలే బుద్ధిమంతుడు. ఏం బుద్ధి అంటె శౌనకనాథుని బుద్ధీ తనబుద్ధీ ఒకటే. అయ్య వారు వెంకట్రాయుని సూపు ఏం సూపంటే మార్జాలం సూపు, వెంక ట్రాయుని సూపు, అయ్యవారు వెంకట్రాయుని నడకేం నడకంటే - వెంక

్రాయుని నడక గార్ధభం నడక. వెంకట్రాయుడు మనిషంటే మనిషి! చేయెత్తు మనిషి! ముందల బొర్ర ఉండె. ఎన్క తొర్ర ఉండె. అయ్యో....! వెంకట్రా యుడు...." అని నిట్టూర్పు విడుస్తుంది.

తీర్థయాత్రలు చేస్తే సంతానం కలుగుతుందనే విశ్వాసంతో వెంకట్రాయుడు తనవెంట ఎవరు వస్తారని భార్యలను పిలిచి అడిగినప్పుడు ఆరుగురు పెద్ద భార్యలు తమ అసమ్మతిని తెలుపుతారు. "అమ్మో! తీర్థ యాత్రలకు మేం రాము నాయనా! తీర్థ యాత్రలంటే దేశ దేశాల్ తిర్గాలె. రాజ్యంగాని రాజ్యాలు, దేశం గాని దేశాలు తిర్గాలె. కాకులు దూరని కారడవులు, చీమలు దూరని చిట్టడవులు దాటుకుంట పోవాలె. సింహాలు, మెకాలు, సిర్తపులులు, సీరికుక్కలు, ఎలు గ్గొడ్లు, తోడేళ్ళు, పాములు, తేళ్ళు ఎన్నో అడవి జంతువులుంటాయి. కొండ లెక్కాలె. నదులు దాటాలె. మాతోటిగాదు నాయనా! తీర్థ యాత్రలకు రానింకె. మేం నోరార తినేటోళ్ళం. కంట్యార పండెటోళ్ళం" అని తీర్థ యాత్రలకు రావ టానికి నిరాకరిస్తారు. అప్పుడు ప్రియపత్ని భాగీరథమ్మ మాత్రం భర్త వెంట వెళ్ళటానికి సిద్ధపడుతుంది. తీర్థయాత్రలు తిరుగుతూ తిరుగుతూ ఒకనాడు గంగ ఒడ్డున విడిది చేస్తారు. భాగీరథమ్మ వంటచేస్తూ ఉంటుంది. వెంకట్రాయుడు గంగలో స్నానానికి దిగుతాడు. అప్పుడు జరిగిన సంభాషణను భాగీరథమ్మ ఏడుస్తూ చెబుతుంది."

వెంకట్రాయుడు మోకాళ్ళ మంటి నీటిలోకి వెళ్ళి 'భాగీర్తా! ఇక్కడ స్థానం జేసుకుంటే మంచిగుంటదా?' అన్నాడు. అంటే నేను జూసి ఏమన్నానంటే 'వెంకట్రాయుడా! ఇక్కడ కప్పల వెంగిలి, చాపల వెంగిలి,కర్కోటాల వెంగిలి. అన్ని వెంగిలినీళ్లు, మురికి నీళ్ళున్నాయి. అవతలికి పోయి లోతులో స్నానం జెయ్యరాదా వెంకట్రాయుడా!' అన్నాను. అంటే అదేప్రకారంగా అయ్యవారు వెంకట్రాయుడు నడుముల్లోతు నీళ్ళల్లోకెళ్ళిపోయినాడు. వెంకట్రాయుడు అన్నాడు గదా 'ఏమే భాగిర్తా! ఇక్కడ స్నానం జేసుకుంటే మంచి గుంటదా' అన్నాడు. 'వెంకట్రాయుడా! నడుములోతు నీళ్ళల్లో స్నానం జేస్తే అదొక స్నానమా! ఇంక కొంచెం ఆసుంటపొయ్యి చెయ్యరాదా వెంకట్రాయుడా!' అన్నాను. వెంకట్రాయుడు ఎదమంటి లోతుకు దిగినాడు. 'భాగిర్తా! ఇక్కడ బాగుంటదా' అని అడిగాడు. 'ఎదమంటి నీళ్ళల్ల ఎదవస్నానం ఏంజేస్తారు. ఇంక కొంచం అవతలకిపోయి నిండుసముద్రంల స్నానం జేస్తే మనకు ముక్తి వస్తది. వెంకట్రాయుడా! మనకు సంతానం కలుగుతది' అన్నాను. అప్పుడు అయ్యవారు

వెంకట్రాయుడు కుత్కెలమంటి నీళ్ళల్ల కెళ్ళిపోయినాడు. కుత్కెలమంటి నీళ్ళల్ల కెల్లిపోయి వెంకట్రాయుడు మునుగుతూ ఉన్నాడు. మునుగుతూ ఉంటే, తడల మీద తడ తడల మీద తడ వస్తున్నది. వెంకట్రాయుడు మున్గానాం. తేలానాం. అయ్యవారు వెంకట్రాయుని జుట్టు నీళ్ళమీద టిక టిక కొట్టుకుంటున్నది. మున్గకుంట గిరగిరా తిరుగుతున్నాడు. 'పోతున్నానే బాగీర్తా! పోతున్నానే. సముద్రంల పడి పోతున్నానే బాగీర్తా!' అని అయ్యవారు చెయ్యెత్తి టాటా కొట్టి నాడు. టాటా గొడ్తే నేను జూసి ఏమన్నానంటే 'వెంకట్రాయుడా! పోతున్నావా? అటేనాం సాగరగతి. ఆటేనాం సాగరగతి' అన్న. వెంకట్రాయుడు గంగల కొట్టుకపోయినాడు'' అని చెప్పి వలవల ఏడుస్తుంది.

మరణించిన వారిని జ్ఞాపకం చేసుకొని ఏడుస్తున్నప్పుడు వారు చేసిన మంచి పనులను, వారి గొప్పతనాన్ని గుర్తుచేసుకోవటం సాధారణ విషయం. కాని భాగీరథమ్మ, వెంకట్రాయుడు తనను ప్రాణసమానంగా చూసుకొనేవాడని, అలాంటి పతిదేవుడు ఇక లేడని బాధపడుతూనే, వెంకట్రాయుని బుద్ధి, శునక నాథుని బుద్ధి అని, చూపు మార్జాలం చూపని, నడక గార్దభం నడకని, అతనికి ముందు బొర్ర, వెనక తొర్ర అని వెంకట్రాయుని వ్యంగ్యంగా మననం చేసు కుంటుంది.

వెంకట్రాయుడికి ఇష్టమైన కూరగాయలను, పచ్చళ్ళను, గుమ్మడికాయ, పెరుగు, నెయ్యి మొదలయినవాటిని ఏకరువుపెట్టి కనీళ్ల పెట్టుకుంటుంది. తరు వాత, వెంకట్రాయుడు తాను సంతానప్రాప్తికోసం తీర్థయాత్రలుచేసి గంగఒడ్డున విడిది చేయటం, తన మాటమీద వెంకట్రాయుడు లోతులోకి, ఇంకా లోతులోకి వెళ్ళి, గంగలో మునిగిపోవటం అంతా పూస గుచ్చినట్లుచెప్పి గుండెలు బాదు కుంటుంది.

జానపద కళాకారుడు వేషంలో, అక్కడక్కడ భాషలో యాసలో బ్రాహ్మణ వితంతువును అనుకరిస్తూ గ్రామీణులను అలరించాలనే ప్రయత్నం ఈ కళా ప్రక్రియలో కనిపిస్తుంది.

శునకనాథుని బుద్ధి, మార్జాలం చూపు గార్దభం నడక మొదలైన సమా సాలు అర్థంకాని వారు భాగీరథమ్మ తన భర్తను ప్రశంసిస్తుందనుకుంటారు. అర్థం చేసుకున్నవారు నవ్వాపుకోలేకపోతారు.

ఉద్దేశ్యపూర్వకంగానే ఒక పదానికి మారుగా పోలిక ఉన్న మరో పదం ప్రయోగించి హాస్యాన్ని పుట్టించటం ఈ సంభాషణలో కనిపిస్తుంది. 'రాతలో' అనటానికి 'రోతలో' అనటం తొడమీద అనటానికి, తొర్రమీద అనటంలాంటివి ఈ కోవకు చెందుతాయి. కీకరకాయ-కాకరకాయ, దొంగ వాయిలికూర-గంగ వాయిలికూర, కాలుగడ్డ - ఆలుగడ్డ, బర్రెపుర్రు - బర్రె పెరుగు, పిల్లివంటలు-పిండివంటలు, మంటమీద - వంటమీద మొ॥ ప్రయోగాలు కూడ అర్థం వికటించి నవ్వు పుట్టించటానికి కల్పించినవే.

స్నానానికి గంగలో దిగిన వెంకట్రాయుణ్ణి లోతువైపు నడిపించి, అతడు గంగలో మునిగిపోయినా చేసిన వంటకాలను మాత్రం భాగీరథమ్మ వదిలిపెట్ట లేదు. వెంకట్రాయుడు పోయాడనే బాధలో తను కూడ చచ్చిపోదామని, రెండు విస్తళ్ళ భోజనాన్ని అరగించి, లేవబోతే కట్టుకున్న పట్టుచీర పదారొక్కలుకాగా కూర్చున్న పీట మూడుముక్కలయింది. కాని, తనకు చావు రాలేదు.

వండిన వంటకాలన్నీ తిన్నా చావురాకపోయేసరికి భాగీరథమ్మ చావు కోసం ఎన్నోవిధాలుగా ప్రయత్నించింది. తన ప్రయత్నాలను ఏడుస్తూ ఆమె ఇలా చెప్పింది: "అయ్యో! ఇట్లగూడ సావు రాకపోయె అని చెప్పి ఉల్లితోటకు పోయి ఉల్లి ఆకుతోని ఉరిబోసుకున్న. అట్లగూడ నాకు సావు రాకపాయె. ఎట్ల యిన సావాలని చెప్పి కోమటింటికి ఉరికిన. కొబ్బెరబెల్లం తెచ్చి, రోట్లోవేసి మెత్తగ దంచి ఆవు నెయ్యిలో కలుపుకొని, ముద్దమీద ముద్ద, ముద్దమీద ముద్ద, ముద్దమీదముద్ద - మూడేసి ముద్దల చొప్పున మింగిన. అట్లగూడ సావు రాలేదు నాకు" అంటూ విలపిస్తుంది భాగీరథమ్మ.

భాగీరథమ్మ చేసిన ఈ చావు ప్రయత్నాలే ఈ కింద ఉదాహరించిన జానపదగేయంలో కూడ వర్ణింపబడ్డాయి:

అది నేను గూడుకుంటిమమ్మా - అమ్మా! ఆలూరు అంగడే పోతి
అంగట్ల ఆకులే గొంటి - ముచ్చటగ ముక్కెరా గొంటి
అదిగొనీ దాన్నోట్లవెడితీ - అదీ గుడ్డి గుర్రంమీద యెక్కే
నేను మంచి గుర్రంమీద ఎక్కి - అదీ ఎనకనే ఏడామడాయే
నేను ముంగట్నే మూడామడైతి - ఎక్కడోదో దండివాడు

దాని ఎత్తుకపాయె నమ్మా - అది వొయ్యేతొవ్వేంటి తల్లీ!
అది వొయ్యి నంతలో నమ్మా - నాకు గంజిమెతుకులు దిగవయ్యే
నేను కోమటింటికి ఉరికితమ్మా - నేను కొబ్బరబెల్లం దెచ్చుకుంటి
రోట్లేసి మెత్తగా దంచ్చి - నేను మూడు ముద్దలు జేసుకుంటి
మూల మడుపునీ గూసుంటీ - మూడు ముద్దలు మింగితమ్మా
నాకు అట్లగన్నా సావు రాదు - నాకు ఇట్లగన్నా సావు రాదు
ఉల్లి తోటకు బోతినమ్మా - రెండు ఉల్లికొవులు తెచ్చుకుంటి
మెడకే ఉరి బోసుకుంటీ - అట్లగన్నా సావు రాదు
నాకు ఇట్లగన్నా సావు రాదు - నీళ్లేని బాయి జూస్తినమ్మా
అండ్లనే పడదుంకబోతీ - నాకు ఏడుమందీ యారాళ్ళు
నన్ను పట్టగవచ్చిరమ్మా - వాళ్ళనే బాయిలో యేసీ
నేనైతె పైకొస్తినమ్మా"1

ఉల్లిపోగుతో ఉరిపోసుకోవటం, కొబ్బెర బెల్లం దంచి ముద్దలు చేసుకొని తినటం, నీళ్ళులేని బావిలో పడటం వంటి ప్రయత్నాలు బ్రాహ్మణ వితంతువు వేషం సంభాషణల్లోనూ జానపద గేయంలోనూ పేర్కొనబడ్డాయి. ఈ గేయం పగటి వేషంలోని సంభాషణను అనుకరించి, తర్వాత కాలంలో హాస్య గేయంగా ప్రచారంలోకి వచ్చి ఉంటుంది.

ఈ విధంగా బ్రాహ్మణ వితంతువు వేషధారి నర్మ గర్భితమైన ప్రసంగంతో హాస్యం పుట్టించి ప్రజలను అలరిస్తాడు. హావభావ విన్యాసంతో పాత్రను రక్తి కట్టిస్తాడు. జానపద కళారూపాలలో ఒక ప్రత్యేకత సంతరించుకున్న వేషంగా ఈ వేషాన్ని చెప్పుకోవచ్చు. బహురూపాలనుంచి విడివడి ఏకవ్యక్తి ప్రదర్శించే జానపద కళా ప్రక్రియగా ఈ వేషం స్థిరపడింది. పైకి హాస్యంగా కనబడినప్పటికి సంఘంలో అధికులనే వారి ఛాందసం నిరూపించి, వెక్కిరించే ప్రయత్నం కళా ప్రదర్శనద్వారా సాధించటమనేది ఈ వేషం ప్రాధాన్యతగా చెప్పవచ్చు.

---

1. పాడినవారు తూర్పాటి నాగమ్మ, వయసు 55 సం, శాబ్దిపూర్, కామారెడ్డి

## 3. బాలసంతు వేషం[1]

ఇంకా కాస్సేపటికి తెల్లవారుతుందనగా పల్లీయుల చెవుల్లో మెల్లమెల్లగా దూరుతుంది ఒక ఘంటానాదం. లయ బద్ధమైన గంటతోపాటు దీవన లిచ్చే ఓ కంఠం వినబడుతుంది. దీవన వెనువెంటనే కరుణరసప్లావితమయిన ఆర్ద్ర కథా గీతం ఆ కంఠంనుంచి జానపద కళారీతిలో జాలువారుతుంది. ఆ కంఠం ఎవరిదో కాదు-బాలసంతువానిది. తెలంగాణాలోని ప్రతి పల్లెలో అందరికీ పరిచితమయిన జానపద భిక్షుక గాయకునిది.

తెల్లవారుజామునుంచి సూర్యోదయంవరకు రెండు మూడు గంటల్లో బాల సంతువాడు భిక్షం అడుక్కోవటం పూర్తవుతుంది. జానపద భిక్షుక గాయకుల్లో ఎవరి ప్రత్యేకత వారికున్నప్పటికి బాలసంతు విలక్షణమైన భిక్షుక గాయకుడు. శుభోదయవేళ ఇంటి దీపాలు, కంటి వెలుగులు అయిన బాలలను, తెలుగు తల్లుల మనసు చల్లగా దీవించి, వారి ఆదరాభిమానాలతోపాటు భిక్ష గ్రహించి వెళ్తాడు. తెల్లవారుజామున గుడిలోని గంటలాగ మంగళప్రదమైన ఘంటానాదం వినిపించటంవల్ల జానపదులు ప్రసన్నంగా తమ పనులు చేసుకోవటానికి ఆయత్త మవుతారు. చైతన్య ప్రేరకమయిన శంఖనాదంతో ఉత్సాహం ఇనుమడించగా భిక్షంవేసి, దీవనలు మూటగట్టుకుంటారు. లేవగానే దీవనలు పొందటాన్ని ఇల్లాళ్ళు శుభారంభంగా పరిగణించి ఆనందంగా తమ తమ పనుల్లో మునిగిపోతారు.

బాలసంతు వేషాన్ని బుడిగె జంగాలు 'అలిగె పంతు' అంటారు. 'పంతు' అంటే వీరి పరిభాషలో 'వేషం' అని అర్థం.

బాలసంతు దోవతి చొక్కాలతో పాటు తలపాగా చుట్టుకొని నుదుట విభూతి రేఖలు పెట్టుకుంటాడు. భుజంమీద కావడి ఉంటుంది. దానికి రెండు వైపుల రెండు జోలెలు వ్రేలాడదీసి ఉంటాయి. రంగురంగుల గుడ్డలు కుట్టుకొని తయారు చేసుకున్న నిలువుటంగీలాంటి బొంత ధరిస్తాడు. దీనిని 'పేరిణి బొంత' అంటారు. అతడు ఎదమీద కుడివైపున శంఖం, ఎడమవైపున గంట ఉండే ఒక తాడును మెడలో వేసుకుంటాడు. కుడిచేతితో అప్పుడప్పుడు శంఖం

---

1. 'అనుబంధాలు' - 3 లో పూర్తి ప్రసంగ పాఠం ఇవ్వబడింది.

ఊదుతున్నా, ఎడమచేత గంటను ఎడతెగకుండా లయబద్ధంగా వాయిస్తూ, కుశలవుల జన్మ వృత్తాంతం కరుణ రసాత్మకంగా పాడుతాడు ఇతర భిక్షుక గాయకుల లాగ ఇంటికోపాట పాడటం కాకుండ, ఊరంతా ఒకేపాట పాడటం బాలసంతు ప్రత్యేకత.



మరువూరు కోదండరామిరెడ్డిగారు మాండలిక పదకోశంలో 'బాలసంతపు వాండ్లు'ను "విచిత్రమైన కూర్పాసము వంటి అంగి ధరించి, గంట ఊపుతూ బిచ్చం తీసుకునేవారు" అని పేర్కొన్నారు. రవ్వా శ్రీహరిగారు నల్లగొండ జిల్లా

మాండలిక పదకోశంలో, "బాలసంతోళ్ళు: ఒక కులానికి చెందినవాళ్ళు, విచిత్ర మైన అంగీ ధరించి, గంట ఊపుతూ వచ్చి, బిచ్చమెత్తుకుంటారు" అని తెలిపారు

యెల్దండ రఘుమారెడ్డిగారు ''బాలెంతతనం లేదా సంతు (సంతానం) ఇచ్చువాళ్ళు బాలసంతులు''1 అని వీరిని నిర్వచించారు.

బాలసంతు ప్రతి ఇంటిముందు 'సీతపాట' పాడుతూనే మధ్యమధ్యలో లేదా భిక్షం వేస్తున్నప్పుడు—

పాలుదాగిన నీ బాల పారాడనమ్మ - ఉగ్గుదిన్ననీ బాల ఉరుకులాడనీ
ఎన్నదిన్న నీబాల ఎదిగిరానమ్మా - హరహరా మీ బాలలను
ఆ భగవంతుడు కాపాడనీ తల్లులాల - మీ సంతానాన్ని ఆ సర్వేశ్వరుడు
చల్లగా చూస్తాడు అమ్మలాల - బాలసంతు దీవెన తప్పదమ్మా
ఇది జంగం దీవన తల్లీ!" అంటూ దీవిస్తాడు.

అంతేకాకుండ బాలెంత తనాన్ని కూడ వర్ణిస్తాడు. "అమ్మా! బాలెంత వయ్యేవు బాయికెళ్లేవు - బాలెంతవైనప్పు నీ కొలుపు గుంతల్ల ఎండివి కొడవళ్ళు యాపరిల్లాలు-బాలెంతకాయంబు పసుపుబండారు" అంటూ బాలెంతగా వర్ణించటం వల్ల, సంతానం లేనివారికి కూడ సంతానం కలుగుతుందని ప్రజలు నమ్ముతారు.

ఊళ్లోకి బాలసంతు వచ్చాడని తెలిపే శంఖానాదం, తన ఉనికిని చాటి చెప్పే ఘంటానాదం, చూపరులను ఇట్టే ఆకర్షించే రంగురంగుల పేరిణి బొంత బాలురకు సంతోషం కలిగిస్తుందనటంలో సందేహంలేదు. బాలలు సంతోషంగా ఉండాలని దీవించేవారు, సంతు (సంతానం) లేనివారికి సంతానం కలగాలని దీవించేవారు కాబట్టి వీరికి బాలసంతులనే పేరు సార్థకమైంది,

హిందూ ట్రైబ్స్ అండ్ కాస్ట్ గురించి తెలుపుతూ 1879 లోనే రెవరెండ్ ఎం.ఏ. షెర్రింగ్ గారు 'బాలసంతోష్'లను పేర్కొన్నారు.2 బొంబాయి రాష్ట్రం లోని కొల్హాపూర్ తదితర ప్రాంతాల్లో సంచరించే ఈ జాతివారు 'గోరక్‌నాథ్'ను

1. బాలసంతువారి ఉత్తర రామాయణం. భారతి, అక్టోబర్ 1977
2. Hindu Tribes and Castes - Vol. II, page 336,

కొలుస్తారని, సత్వాయి (Satwai) అనే దేవతా విగ్రహాన్ని పట్టుకొని ఇల్లిల్లు తిరుగుతూ భిక్షాటన చేస్తారని తెలిపారు. కాని ఈ లక్షణాలు తెలుగు బాలసంతుల్లో మృగ్యం. ఇలా దేవతా విగ్రహాన్ని పట్టుకొని అడుక్కోవటం తెలుగుదేశంలో 'దేవరోళ్లు' (పెద్దమ్మలవాళ్ళు) అనే కులస్థుల్లో మాత్రం కనిపిస్తుంది.

'బాల సంతోష్' కులాన్నే 'బాలసంతవాండ్లు' అంటూ కర్నూలు మాన్యువల్‌లో పేర్కొన్నారని తమ గ్రంథంలో థర్స్టన్ గారు వివరించారు.[1] వీళ్ళు బొబ్బిలికథ, కర్నూలు నవాబు కథ మొదలయిన వీర గాథలే కాకుండ, గంగా గౌరి సంవాదం మొదలయిన పురాణ కథలను కూడ చెబుతారని ఉటంకించారు. జంగం కథలు చెప్పేవాళ్ళుగానే బాలసంతులను థర్స్టన్ గారు గుర్తించారు గాని, ఉత్తర రామాయణ కథాంశమైన సీతపాట పాడే విలక్షణ భిక్షుక గాయకులుగా వీళ్ళను గుర్తించలేదు.

సయ్యద్ సిరాజుల్‌హసన్ (1920) గారు తెలుగు భిక్షుకుల్లో 'బాల సంతోష' పేరుతో వీళ్ళను పేర్కొన్నారు.[2] కథా గాయకులుగా కూడ గుర్తించారు. లక్ష్మణుని సంతతి వారుగా తమను చెప్పుకుంటారని, లవకుశులను సంతోష పెట్టడానికి లక్ష్మణుడు ధరించిన మాసికలు వేసిన పెద్ద అంగీ (Patchy gown)ని ధరించి, భుజం మీద కావడితో, గంట ఊపుతూ శంఖం ఉదుతూ యాచిస్తారని వివరించారు. వాళ్ళు ధరించే నిలువుటంగీ మీద గాజు ముక్కలు కుట్టి ఉంటాయని తెలిపారు. నేటి బాలసంతుల పేరిణి బొంతకు అద్దాలు కూర్చటం కనిపించదు.

ఆర్. ఇ. ఎంతోవెన్‌గారు కూడ బాలసంతులను పేర్కొన్నారు.

1891 జనాభా లెక్కల ప్రకారం వీరి జనాభా కేవలం 33 కాగా, 1901 ప్రకారం 1615, 1921 లో 1363 గా చూపబడింది. Census of India 1931

1. The Castes and Tribes of Southeren India Vol. 1, page. 133.
2. The Castes and Tribes of H E.H the Nizams Dominions - page 505
3. The Tribes and castes of Bombay. Vo.I.

రిపోర్టులో గులాం అహమద్ ఖాన్‌గారు ఆది హిందూ కులాల్లోని మైనర్ క్లాసులో క్రమసంఖ్య 38లో 'బాలసంతానం' పేరుతో వీరిని గుర్తించి, నిజాం రాష్ట్రంలో వీరి జన సంఖ్య 1462 అని తెలిపారు.[1]

1961-62 A.P. Tribes Enquiry committee చైర్మన్ వెన్నెలకంటి రాఘవయ్యగారు బాలసంత తెగమీద ఒక నివేదిక సమర్పించారు 1961 జనాభా సేకరణ ఆధారంగా తయారుచేసిన Ethnographic Notes లో తందానా కథలు చెప్పి జీవించేవారుగా వీరిని పేర్కొన్నారే గాని, సీతపాట పాడే వృత్తి గాయకులుగా వీరిని గుర్తించలేదు.

డా. యెల్దండ రఘుమారెడ్డి గారు వీరి వేషాన్ని, సీత పాటను బాలసంతుల ప్రత్యేకతను వివరించారు [2] చిర్రావూరు నాగభూషణాచార్యులు (1977) బాల సంతులను గురించి వివరిస్తూ వీరిని 'సరదావాళ్ళు' అనికూడ అంటారని తెలిపారు.[3] బహుశః 'శారదగాళ్ళు' అనటానికి బదులుగా సరదావాళ్ళని పేర్కొన్నారేమో! తందనా కథలు చెప్పే బుడిగె జంగాలకు శారదగాళ్ళనే పేరుకూడ బాగా ప్రచారంలో ఉంది.

డా. రావి ప్రేమలత (1983) బాల సంతువారి పుట్టుకను గురించి ఇలా తెలిపారు: "అయోధ్యలోని లక్ష్మణుడు అర్యణములోని సీతకు లవకుశలు జన్మించినారని స్వప్నము ద్వారా గ్రహించి, మారువేషములో వారిని చూసి రావలయునని నిశ్చయించుకొనెను. ఎన్ని వేషములు ధరించినను లక్ష్మణునికి తృప్తి కలుగుగలేదు. తుదకు రంగురంగుల కుచ్చుల బొంతను ధరించి, ఎడమ భుజమున జోలెను వేసుకొని, చేతిలో గంటను మ్రోగించుచు, కుడిచేతిలో శంఖమును పట్టి పూరించుచు సీతకడకు వెడలెను. ఆనాటి లక్ష్మణుని వేషధారణమునే బాలసంతువారు అనుకరించుచున్నారు"[4] అని వివరించారు. ఇందులో కావడి ప్రస్తావన లేదు.

---

1. Census of India, 1931. Vol. XXIII - page 260.
2. బాలసంతువారి ఉత్తర రామాయణం- భారతి. అక్టోబర్ 1977.
3. సంచార జాతులు - పుట. 39.
4. తెలుగు జానపద సాహిత్యము - పురాగాథలు - పుట. 151.

డా. ఎన్. యాదగిరిశర్మగారు (1986) బాలసంతులను గూర్చి వివరిస్తూ "బాలసంతులు 1. భారతగాథలు. 2. బొబ్బిలికథ. 3 కర్నూలు నవాబు కథ. 4. బాలనాగమ్మ కథ 5 వివిధ దేవతల గీతాలు. వీళ్ళు వీనుల విందుగా తమ గంట ఊపుతూ పాడుతారు" అని వ్రాశారు 1 కాని బాలసంతులు గంట ఊపుతూ కేవలం సీతపాటను మాత్రమే గానం చేస్తారు తప్ప, పైన పేర్కొన్న జంగం కథలను గంట ఊపుతూ పాడరు. బాలసంతు వేషం వేయనివారు బుడిగెలతో, తాంబూర అందెలతో పై జంగం కథలు చెప్పటం పరిపాటి.

డా. ఎన్. విజయగారు (1988) బాలసంతులను వర్ణిస్తూ 'ఎడమభుజం మీద అటు ఇటు రెండు జోలెలున్న కావడిని ధరించి, శంఖం ఊదుతూ భిక్షం అడుక్కుంటా" రని[2] తెలిపారు.

ఈ విధంగా 1879 నుంచి నేటి దాకా బాలసంతుల ప్రస్తావన ఆయా గ్రంథాల్లో చోటు చేసుకున్నది.

బాలసంతుల పాటలో ఉత్తర రామాయణం కథాంశం. అన్ని జానపద గేయాల్లో వలెనే ఈ పాటలో కూడ జానపద కల్పనా వైచిత్రి కనబడుతుంది. అవాల్మీకమైన అంశాలతో, భాస్కరాది రామాయణ కవుల కథాసంవిధానం కన్నా, భిన్నమైన కథతో బాలసంతులు ఈ పాటను నడిపిస్తారు. రాముణ్ణి కర్కశమనస్కుడుగా చిత్రించి సీత పాత్రను దయనీయమైన పాత్రగా వర్ణిస్తారు. పత్యాజ్ఞ పాటించటానికి సిద్ధమయి కీకారణ్యంలో ఏకాకిగా సీత విల పిస్తుంది. శిష్ట రచన అయిన ఉత్తర రామాయణంలో ఆశ్రమవాసుల ఓదార్పయినా సీతకు లభిస్తుంది. కాని, సీతపాటలో ఏకాకి అయిన సీత దుర్భర వేదనను అను భవిస్తుంది.

శ్రీరాముడు సీతను అరణ్యానికి తీసుకెళ్ళి తలను ఖండించమని ఆనతీ యటం, ఆ సంగతి సీతకు అయోధ్యలోనే తెలియటం, రామాజ్ఞ నెరవేరటానికి లక్ష్మణునితో అరణ్యానికి తాను సిద్ధం కావటం వంటి సంఘటనలు బాలసంతుల కల్పనలే.

1. జానపద భిక్షుక గాయకులు (అముద్రితం) - పుటలు. 126 - 136.
2. The Role of Traditional folk media in Rural areas. Page. 45.

అలాగే సీత తల నరకటానికి ఉద్యుక్తుడయిన లక్ష్మణుడు మూర్ఛిల్లి, తర్వాత మేల్కొని సీతను వదిలివెళ్ళి, జింక కనుగుడ్లను ఆనవాలుగా తీసుకెళ్ళి రామునికి చూపటం మొదలయినవి కూడ కల్పించిన అంశాలే. జంతువుల మధ్య సీత కుశుణ్ణి కనటం, తర్వాత వాల్మీకి దగ్గరకు వెళ్ళటం, వాల్మీకిని గుడ్డివాడైన ఒంటరిగానే తప్ప, ఆశ్రమాన్నిగాని, ఆశ్రమ వాసులనుగాని వర్ణించక పోవటం, సీత స్నానానికి వెళ్ళి అక్కడ కోతులు తమ పిల్లలను వళ్ళో దాచుకోవటం చూసి వెంటనే వచ్చి నిద్రిస్తున్న వాల్మీకిని లేపకుండ తన కొడుకును ఎత్తుకొని స్నానానికి వెళ్ళటం, నిద్రలేచిన వాల్మీకి ఊయలలో బాలుడు లేనందువల్ల ఎద మీది మన్నుతో మాయబాలుణ్ణి చేసి, ప్రాణాలు పోయటం మొదలయిన కథాంశాలన్నీ బాలసంతులు సృష్టించినవే.

అరణ్యంలో సీత కొడుకును కన్నట్లు, పడరాని పాట్లు పడుతున్నట్లు కలగని లక్ష్మణుడు అన్నకు తెలియకుండ రాత్రివేళ సీతమ్మను చూసి, బాలెంత మందులు, పిల్లలకు చమురు, కుట్టిన అంగీలు, కుచ్చుల కుల్లాలు ఇచ్చివద్దామని నిర్ణయించుకుని, శివుని వద్దకు వెళ్ళి గంట, శంఖు, విభూతి, జోలెలు, పేరిణి బొంత గ్రహించి, సీతమ్మ తనను గుర్తించకుండ బాలసంతు వేషంలో వెళ్ళి భిక్షమడిగి, తెచ్చినవన్నీ ఇచ్చి, మనసులో దుఃఖిస్తూ అయోధ్య చేరటం లాంటి అంశాలన్నీ బాలసంతులు కరుణరసావిష్కరణను పరాకాష్ఠకు చేర్చటానికి చేసిన కల్పనలే.

సీతపాటలో బాలసంతువారు శ్రీరాముని కఠిన చిత్తునిగా, కోపిష్ఠిగా రూపించారు. శిష్టరామాయణంలో రాముడు సీతను కేవలం వనాల్లో వదిలిరమ్మంటాడు. సీత పాటలో—

"వాళ్ళ తప్పులేదు వొంక న్యారము లేదు - వైదేవి సీతమ్మా నమ్మా....
తప్పులేని తల్లిని తలగొట్టమన్నాడు రామా - నీ వొదినా సీతమ్మ
భూలోకమాతా
కానితప్పులు జేసింది ఖండించిరారా - రాథా నా తమ్ముడా రా
లచ్చుమయ్యా"

అంటూ సీత తలనే ఖండించి ఆనవాలు తెమ్మంటాడు. సీత తలగొడితే పెద్ద లేమనుకుంటారోనని లక్ష్మణుడు అనుమానం వ్యక్తంచేస్తే, తన మాటకు ఎదురు చెప్పినందుకు ఆగ్రహావేశంతో 'సీతా నువు గూడి ఏలూ అయ్యోజ్యా" అంటూ అనుచితంగా ప్రవర్తిస్తాడు. ఈ విధంగా శ్రీరాముని నిర్దయుడిగా, ముక్కోపిగా చిత్రించి, సీత పాత్రను శిష్టసాహిత్యంలోకంటే దయనీయంగా వర్ణించి, జాన పదుల అభిమానపాత్రంగా తీర్చటమే బాలసంతుల ఉద్దేశమై ఉంటుంది.

బాలసంతులు లక్ష్మణుని ప్ాతను శిష్టరచనలలోకంటేకూడ ఉదాత్తంగా తీర్చిదిద్దారు. సీతను అరణ్యానికి తీసుకెళ్ళి, తలగొట్టి, ఆనవాళ్ళు తెచ్చి చూప మని రాముడు లక్ష్మణునికి ఆనతిస్తాడు. ఆ సందర్భంలో లక్ష్మణుడు—

"అనన్న శ్రీరామ అయ్యోజ్య రామా - తప్పులేకనె సీత తలగొడ్తె అన్న తల్లులు పెద్దలు తగదందురన్న'' అని హితవు చెబుతాడు.

దానికి రాముడు ఆగ్రహంతో—

"అట్ల ఎప్పుడన్నావో తమ్మి లక్ష్మణ - సీతమ్మ నువు గూడి ఏలు అయ్యోజ్య"

అని లక్ష్మణుని కర్ణకఠోరంగా అంటాడు. జానపదుల మనస్తత్వానికి ఈ పరుషవాక్కు అద్దం పడుతున్నది. కట్టె విరిచినట్లు పెళుసుగామాట్లాడటం, కఠోరమైన ఒట్లు పెట్టుకోవటం జానపదుల్లో ఎక్కువ.

శ్రీరాముడు కోపిష్ఠివాడని, తలగొట్టి, వెంటనే వెళ్ళి ఆనవాలు చూపక పోతే ఆగ్రహిస్తాడని సీతాదేవిని అడవిలో వదిలేసి—

"అదే బాణముతోటి గురెమెకాన్ని ఖండించి
గురి మెకం కండ్లు అరటాకు దొల్లల్ల పెట్టుకొని"—వెళ్ళి,
లక్ష్మణుడు శ్రీరామచంద్రునికి చూపిస్తాడు.

సీతాదేవి ప్రసవించినట్లు కలగని, అడవిలో సీత బాధలు తలుచుకొని విలపిస్తాడు. సీతను అడవిలో వదిలిన పాపానికి ప్రాయశ్చిత్తంగా అన్నకు తెలియకుండా, సీత తనను గుర్తించకుండా మారు వేషంలో వెళ్ళి సహాయం చేయాలని నిశ్చయించుకుంటాడు. దిగ్గన లేచి—

"ఈశ్వరుని వొద్దాకే ఎల్లే లక్ష్మణ - శివుని శంఖు గంట చేతుల బట్టిండు
ఏదుమంత గంట పందుమంత శంఖు - యీబూది రేఖలే దిద్దుకున్నాడు
పేరిణి బొంతను గట్టుకున్నాడు - ముందుకు ఏసిండు మున్నూరు జోలె
ఎనకంగ ఏసిండు ఎయినూరు జోలె" - ఇలావేషం కట్టి, అయోధ్య నగరంలోని బాలెంతలవద్ద సీతకు కావలసిన బాలెంత మందులు, శిశువుకు కావలసిన వస్తువులు తీసుకొని వెళ్ళి, అడవిలో ఉన్న సీతకు ఇస్తాడు. ఈ విధంగా శిష్ట రామాయణంలో కంటే ఈ సీతపాటలో లక్ష్మణుని పాత్రను మానవతామూర్తిగా తీర్చి దిద్దటం జరిగింది. రామునికి తెలియపరచకుండ ఏ పని చేయలేదు ఆ లక్ష్మణుడు. రామునికి తెలియకుండ సీతకు ఆపద్బాంధవుడుగా ఈ లక్ష్మణుడు ప్రవర్తించటం సముచిత కల్పన. అందువల్లనే సీతపాటలోని లక్ష్మణపాత్ర జానపదుల ఆదరాభిమానాలను చూరగొన్నది.

మొదటిసారిగా కన్నవారు కడుపునిండ కనుకున్న తల్లులవద్ద నుంచి, వారి పిల్లల అంగీలు, పొట్టి లాగులు, కుచ్చు కుల్లలు యాచించి తెచ్చుకొని తమ పిల్లలకు తొడుగుతారు ఇలా చేయటం వల్ల తమ బిడ్డలు ఏ బాలారిష్టాలు లేకుండ, ఆయురారోగ్యాలతో ఎదుగుతారని తల్లుల అచంచల విశ్వాసం. ఈ విశ్వాసం బలపడటానికి లక్ష్మణుడు అయోధ్యలోని తల్లులవద్దనుంచి కుశలవుల కోసం లాగులు, అంగీలు స్వీకరించిన ఘట్టం దోహదం చేస్తుంది.

శిష్టసాహిత్యంలో కుశలవులు కవలలు. సీత పాటలో లవుడు వాల్మీకి సృష్టించిన శిశువు. వాల్మీకి లవుణ్ణి ఎదమన్నుతో ప్రాణ ప్రతిష్ఠ చేయటానికి బాల సంతులు సృష్టించిన సందర్భం వారి కల్పనాచాతురికి 'కలికితురాయి' అని చెప్పవచ్చు. సీత స్నానానికి సముద్రానికి వెళుతూ, కోతుల వాడిలో వాటి పిల్లలను చూసింది.—

"వన రుక్షముల మీద వానరా కోతులు - పిల్లల కడుపున దాచుకొని తిరుగుతవా
ఓ ఎర్రి సీతమ్మా ఓ ఎడ్డి సీతమ్మా - గుడ్డివాని ముందు నీ కొడుకుని ఏసివస్తివా
నీ కొడుకుని ఏ మృగము మింగునో - ఏ జంతువు మింగునో" - అని కోతులు హెచ్చరించాయి.

"అన్నంత మాత్రంల ఆ తల్లి సీతమ్మ - హోరామ రామ యనుచు
నా కొడుకుని గుడ్డివానిముందు ఏసివస్తిని - కోతులకున్న బుద్ధి
నాకు లేదమ్మా
అడవి మృగాలకులేని బరువు నాకే ఆయెనా - రామ రామ నా కొడుకు
నాకు బరువైతడా" అని

సీత దుఃఖించి, మఠం దగ్గరికి వెళ్ళి, తన బిడ్డను తెచ్చుకుంటుంది. ముని నిద్ర నుంచి లేచి. తొట్టెండ్లో బాలుడు లేకపోవటంవల్ల, ఏ జంతువో ఎత్తుకపోయిందని భావించి, సీతాదేవి రాకముందే బాలుణ్ణి సృష్టించి ఉంచాలని—

"మునినాథుడు ఎడమీద మన్నుదీసిండు - అచ్చంగా బాలుని
రూపుజేసిండు
రాముని మదిలోన యాదిజేసిండు - బొమ్మకు ప్రాణాలు బోసి
నిలిపిండు."

అలా ప్రాణం పోసిన ఆ బిడ్డను ఊయలలోవేసి జోల పాడాడు. ఈవిధంగా లవుడి జన్మ వృత్తాంతాన్ని బాలసంతులు శిష్ట కథకు భిన్నంగా కల్పించి, సీత పాటను రక్తి కట్టించారు.

బాలసంతుల గంట, శంఖు నాదాలకు ఊళ్ళో ఉన్న భూత ప్రేత పిశాచ గణాలన్నీ పారిపోతాయని ప్రజల విశ్వాసం. ఈ విషయాన్ని బాలసంతులు తమ పాటలో కూడ పాడుతారు -

"ఊళ్ళ ఉన్న భూతాలు ఉరుకులాడగ - ఊళ్ళ ఉన్న దయ్యాలు
సందుల్ల దిరుగా
మా శంఖు పాడ్తుంటే మా గంట గొడ్తుంటే - కామునివి భూతాలు
కాల్వదాటెనమ్మా
ఊళ్ళ ఉన్న భూతాలు ఊరుదాటెనమ్మా - " అంటూ భిక్షమడుగుతారు.

కొన్ని సంప్రదాయ కుటుంబాల్లో పూర్వకాలం నుంచి బాలసంతు ఆగమనాన్ని శకునంగా పాటించటం ఉంది. బాలసంతుపాటలోని సీత దయనీయ మైన వర్ణన, లక్ష్మణుని ఆత్మీయతా ప్రదర్శన, మధ్యమధ్యలో బాలసంతువాని దీవనలో శుభాకాంక్ష మొదలైన ఘట్టాల్లో నుంచి తమ ఇంటిముందరికి వచ్చిన సమయంలో ఏది పాడతాడో దాన్ని బట్టి శుభాశుభాలను నిర్ణయించుకునేవారు.

బాలసంతులు పాటలో బాలెంత తనాన్ని వర్ణిస్తారు. ఈ బాలెంత ప్రస్తావనవల్ల సంతానం కానివారికి సంతానం కలుగుతుందని, సంతానవతుల సంతానం ప్రవృద్ధిమానమవుతుందని విశ్వసిస్తారు.

"నీ చిన్న కొడుకులు నీ చిన్న బిడ్డలు - పాల్దాగె కొడుకులు పరుగెత్తె బాలలు

తొట్టెండ్ల బాల ఆడేటి బాల - పాడేటి బాలనీ ఎడ్లబండి

నీ పసుల మంద పాలిచ్చె ఆవులు - పండేటి పంటలు నిండేటి గాదెలు

నీ నొష్టి కుంకుమ నీ నోము దండ - నీ కాళ్ళ కడియాలు నీ నేతిగాజులు

నీ కాళ్ళ మెట్టెలు నీ ఇంటి సిరులు - పాలుపొంగినట్లు పొంగి వర్థిల్లమ్మా" అంటూ బాలసంతు దీవిస్తే సంవత్సర కాలమంతా పిల్లా పాపలతో, పాడిపంటలతో కళకళలాడుతూ, సుఖసంతోషాలతో తులతూగుతారని ప్రజలు నమ్ముతారు.

"అర్ధరాత్రియాళ అపరరాత్రియాళ - తగిలేటి తట్టనక ముట్టేటి పురుగనక
కరిసేటి పామనక కరిసేటి కుక్కనక - ఇరిగేటి ముల్లనక పొడిచేటి ఆవనక"

కడప కడపకు తిరిగి దీవించే బాలసంతు జానపదులు ఆదరించే భిక్షుకుడు దీవనకు మారుపేరయినవాడు. వెలుగును మోసుకొచ్చె సూర్యునిలాగా దీవెనలు కొనితెచ్చె వృత్తి గాయకుడు. బుడిగె జంగాలు జీవనోపాధికి ప్రదర్శించే ఏకవ్యక్తి కళారీతుల్లో బాలసంతు వేషం ప్రజాభిమానాన్ని అధికంగా చూరగొన్న కళాప్రక్రియగా ఆదరింపబడుతున్నది.

ఇక ఈ బాలసంతు పాటలోని ఛందో విశేషాలను, భాషా ప్రయోగాలను దిఙ్మాత్రంగా ప్రదర్శిస్తాను.

## ఛందోవిశేషాలు

సీత పాటలో మధ్య మధ్య వచనం ఉన్నప్పటికీ, ఆ వచనాన్ని కూడ బాలసంతులు పాటలాగే పాడుతారు. పాట అధికాధికంగా ద్విపదాది దేశీయ పద్య ఛాయల్లో నడుస్తుంది. మంజరీ ద్విపదలు అనేకం కనిపిస్తాయి. అక్కడక్కడ ఎన్నో పాదాల్లో ద్విపదఛందం దొర్లుతుంది. త్రిశ్ర, చతురశ్ర, ఖండాది

గతుల్లో నడిచే రగడలను పోలిన పాదాలు అనేకం ఈ పాటలో ప్రయోగింపబడ్డాయి. అలాంటి కొన్ని ఉదాహరణలను ఈ కింద ఉటంకించిన పాదాల్లో చూడవచ్చు.

**ద్విపద :** ప్రతి పాదంలో మొదట మూడింద్రగణాలు తర్వాత ఒక సూర్యగణం చొప్పున ఉండే రెండు పాదాలుగల పద్యం. యతిస్థానం తృతీయ గణాద్యక్షరం. ప్రాస నియమం ఉంటుంది.

1. అయ్యేటి మైలలు ఔత ఉన్నాయి
   పొయ్యేటి మైలలు పోత ఉన్నాయి
2. మఠమంత భగ్గున మంటలే మండు
   మఠమంత బూడ్దిగా మారునో రామ.

**మంజరీ ద్విపద :** ద్విపద లక్షణాలన్నీ ఉండి, ప్రాసనియమం పాటింపబడనిదే మంజరి ద్విపద.

1. రార నా తమ్ముడ రా లచ్చుమయ్య
   కాని తప్పులు జేసె ఖండించి రార
2. అన్నన్న శ్రీరామ అయోధ్య రామ
   తప్పులేకనె సీత తలగొట్టె అన్న
3. కాకులు దూరని కారండ పడవి
   చీమలు దూరని సిచ్చండపడవి
4. ఛళ్ళున తెల్లారె బామండ్లుగూసె
   నీ నిద్ర తెల్లారె నీర్కోళ్ళు గూసె
5. ముందుకు ఏసిండు మున్నూరు జోలె
   ఎనకంగ ఏసిండు ఎయినూరు జోలె
6. సీతమ్మ గట్టేటి సిల్కు సీరేలు
   రాములు గట్టేటి రత్నాల దోతి
7. **సుట్టేడు దాసీలు సూసుకుంటుండ్రి**
   ఊరాన ఊరంత ఎత్తుకుంటుండ్రి (యతిలేదు)

వెంట వెంటనే రెండు పాదాల్లో కాకుండ ఒంటి పాదాల్లో ద్విపద లక్షణాలు అలవోకగా దొర్లిన సందర్భాలు అధికంగా కనిపిస్తాయి. అలా దొర్లిన ద్విపద పాదాలను కొన్నింటిని కింద ఉదాహరిస్తున్నాను. కొన్ని పాదాల్లో యతికి బదులుగా ప్రాస కుదురుతుంది.

1. హర హరా సీతమ్మ అయోజ్యరామ
2. బాలెంతవయ్యేవు బాయికెల్లేవు
3. గాతల్లి సీతమ్మ గాయమ్మ వారు
4. పాల్దాగె నీబాల పరుగెత్తె బాల
5. నీ నొస్టి కుంకుమ నీ నోము దండ
6. తట్టాకు గోళ్ళల్ల చిల్లె రక్తాలు
7. ఆ మాట ఇన్నాడు అన్న రామూడు
8. వల వల సీతమ్మ వలపోతదమ్మ
9. పట్టమ్మ ఓ తల్లి బాలెంతరాల
10. ఓ ఎర్రి సీతమ్మ ఓ ఎడ్డి సీత
11. అన్నంత మాత్రాన ఆ తల్లిసీత
12. మాయబాలుని జేస్తి మన్నించవమ్మ
13. అయోజ్య పట్నాన్కి అతిపాతులమ్మ
14. ముత్తైదు గాజులు పుస్తేది బలము
15. ఎల్లి పోదుము మేము తల్లి సీతమ్మ
16. ఏమమ్మ మృగాలు ఎడ్డి మృగాలు
17. వొదినెను అడవిలో వొదిలి పెట్టొస్తి
18. పండింద బాలుడు పల్కుతాలేడు
19. బొమ్మకు ప్రాణాలు బోసి నిల్పిండు
20. ఏడ్వకు ఏడ్వకు ఎర్రినా బాల

**సీస పద్య పాదాలు :-** సీతపాటలో సీస పద్యపాదంలోని పూర్వార్ధాలు అనేకం కనిపిస్తాయి. అంటే- నాలుగు ఇంద్రగణాలు కలిగిన పాదాలు ప్రయోగింపబడ్డాయి.

1. నీ సిన్నకొడుకులు నీ సిన్న బిడ్డలు
2. పండేటి పంటలు నిండేటి గాదెలు
3. నీ కాళ్ళ కడియాలు నీ కాళ్ళ మెట్టెలు
4. కాశిలో గోవుని కోసిన పాపము

**ఆటవెలది పద్యపాదాలు :-**

1. నడవ వమ్మ వొదినె నా తల్లి సీతమ్మ
2. శివుని శంఖు గంట సేతుల బట్టిండు

పై పద్య పాదాలు ఆటవెలది బేసి పాదాలు. ప్రతి పాదంలో మొదట మూడు సూర్యగణాలు తర్వాత రెండు ఇంద్రగణాలు ఉంటాయి నాలుగవ గణాద్యక్షరం యతి.

**తేటగీతి పద్యపాదం :-**

1. సీప్రుకట్టల దుమ్ము మా శెంకు పైకి (1 సూ + 2 ఇం + 2 సూ.

**త్రిశ్ర గతిలో సాగిన పాదాలు :**

1. ఊళ్ళ ఉన్న భూతాలూ ఊరు దాటెనమ్మ
కామునివి భూతాలూ కాల్వ దాటెనమ్మ

పాదంలో 8 సూర్య గణాలుండి, చతుర్థ గణాద్యక్షరానికి యతి పాటిస్తే తురగవల్గన రగడ అవుతుంది. పైపద్య పాదాల్లో చివరన ఒక సూర్యగణం లోపించింది.

**ఖండగతిలో సాగిన పాదాలు :**

ఐదేసి మాత్రల నాల్గు గణాలు కూరిస్తే, అది ద్విరద గతి రగడ పాదం అవుతుంది. మూడోగణం మొదటి అక్షరం యతి స్థానంగా ఉంటుంది. ఈ పద్య పాదం సీస పద్యపాదంలోని పూర్వార్ధం కూడ అవుతుంది.

1. గలగలా మనియేటి గళరాగి రుక్షాలు
2. వన రుక్షముల మీద వానరా కోతూలు
3. ఈ పుట్టు కల్లాలు ఈ పుట్టు అంగీలు
4. ఆ శంఖు నాదాలు ఆ గంట నాదాలు
5. ఇరిగేటి ముల్లనక కరిసేటి పామనక
తగిలేటి తట్టనక పొడిసేటి ఆవనక (యతి ప్రాసలు లేవు)

## భాషాప్రయోగాలు

నేను సేకరించిన సీతపాట తెలంగాణా మాండలిక శైలిలో సాగుతుంది. ఇందులో పామర జన వ్యవహారంలోని భాషా ప్రయోగ సరళి ఎంతో వైవిధ్యంతో ఉన్నది. పెక్కు వైకృత పదాలతోపాటు నూత్న సమాసాలెన్నో కల్పింపబడ్డాయి. అలాంటి కొన్ని పదాలకు ఈ కింద అర్థ వివరణ చూపుతున్నాను.

నరులోకము - నరలోకం
జలిమించిన - జన్మించిన
కల్లాదిత్రైలోకం - ఏడేడులోకాలు
అయ్యోజ్య - అయోధ్య
న్యారము - నేరం
యదార్తంగ - మనసారా
అరువాత - వరువాత
ఎడ్లగాడి - ఎడ్లబండి
వైదేవి - వైదేహి
కంసల్య - కౌసల్య
జామండ్లు - పక్షివిశేషం
కారుండవడవి - కారడవి
సిచ్చుండపడవి - చిట్టడవి
స్త్రానం - స్నానం
న్రాత్రి - రాత్రి
లోపట - లోపల
ఆలిశము - ఆలస్యం
సృష్టి - సుష్టి (శుచి>సుష్టి)
అగ్రం - ఆగ్రహం
అంత్రాలు - అంతస్థులు (floors)
ఎంటకుమల్లి - వెనకు మళ్ళి
ప్రసిద్ధి - ప్రసూతి
ఆకాశవేణి - ఆకాశవాణి
రైతంబు - రహితం
అరుండము - అడవి
రుక్షము - వృక్షం
అనుమాండ్లు - ఆంజనేయస్వామి
యాగ్రా పెద్దపుళ్ళు, జంబోనక్కలు, సర్పకాపాములు - అధిక్యత కోసం ఆమ్రేడితం చేసి చెప్పటం
గురిమెకం - జింక
గళరాగి రుక్షాలు - ఘనరావి వృక్షాలు

## 4. కోయపంతు

బుడిగె జంగాల భాషలో 'పంతు' అంటే వేషం. కోయదొర లేక కొండ రాజు వేషాన్ని వీరు 'కోయపంతు' అంటారు. ఈ వేషం వేసిన బుడిగె జంగాలను ప్రజలు కొండరాజులని, కోయదొరలని పిలుస్తారు. ఈ వృత్తివేషం, దానికి అవసరమైన భాషణం నియతమై ఒక కళా ప్రక్రియా లక్షణాన్ని సంతరించుకున్నాయి. అందువల్ల దీన్ని బుడిగె జంగాలు ప్రదర్శించే ఏక వ్యక్తి కళా ప్రక్రియగా పేర్కొనవచ్చు.

పట్టు పంచెనో లేక రంగు పంచెనో కట్టుకొని, నొసటి మీదినుంచి తలకు రంగు గుడ్డ కట్టుకొని, చెవులకు పెద్ద పోగులు లేదా కుండలాలు ధరించి, మెడలో పూసల దండలు వేసుకొని, భుజానికి మందుల సంచితో కొండరాజులు ప్రతి నగరంలో, పట్టణంలో ప్రత్యక్షమవుతుంటారు. రోడ్డువారగా ఫుట్‌పాత్‌ల మీద మందుల దుకాణాలు వేసుకొని కూడకనిపిస్తుంటారు. ఒంట్లో పుట్టిన రోగాలతోపాటు ఇంట్లో ఉన్న అశాంతిని, దరిద్రాన్నికూడా తొలగిస్తామని చెబుతారు. మంత్రించిన తాయెత్తులు, వనమూలికలతో చేసిన మందులు ఇస్తుంటారు.

చెయ్యిచూసి, ముఖం చూసి (ఫేస్ రీడింగ్‌చేసి), ఉన్న పరిస్థితిని చెబుతారు. భవిష్యత్తును సూచిస్తారు. భవిష్యత్తు బాగుపడటానికి కొండదేవత పేరు మీద తాయెత్తులు కడతారు. వనమూలికలు ఇస్తారు. సామాన్యుడి నుంచి వి.ఐ.పిల. వరకు అందరు, కొండ రాజులతో తాయెత్తులు కట్టించుకోవటం. మూలికలు ఇప్పించుకోవటం సర్వసాధారణం.

సినిమా తారలు, పెద్ద పెద్ద వ్యాపారస్తులు, మంత్రులు, రాజకీయ నాయకులు, కలెక్టర్లు, ఎస్.పి.లు, తదితర అధికారులు కొందరు ఈ కొండ రాజుల తాయెత్తులు, మూలికలతో, కొండదేవత అనుగ్రహంతో తమకు మేలు జరిగిందని ధృవపత్రాలు వ్రాసి ఇస్తారు కొండరాజులతో ఫొటోలు కూడ దిగుతారు. ప్రతి కొండరాజువద్ద ఇలాంటి ధృవపత్రాలు, ఫొటో ఆల్బమ్‌లు ఉంటాయి.

తాము భద్రాచలం, ఏలేశ్వరం, రంపచోడవరం, అరకులోయ మొదలైన ప్రాంతాల్లో ఉన్న అడవుల నుంచి వచ్చామని, కొండల్లో వాసం చేస్తూ కొండ దేవతను కొలుస్తామని వీరు చెబుతారు. చాలా సినిమాల్లో ఈ కొండదొరల వేషాలకు అనుకరణ కనిపిస్తుంది.

"కుర్రు మామ. కొండదేవత అన. ఈ తాయెత్తు కట్టుకో బిడ్డ. నీకేం భయంలేదు. నీకేం కష్టం రాదు. అంతా మేలే జరుగుతుంది బిడ్డ" అంటూ వీరు తాయెత్తులు కడతారు "వ్యక్తిగతమైన బాధలు, కుటుంబ బాధలు తొలగిపోతాయి. వ్యాపారం బాగా సాగుతుంది. ఉద్యోగాలలో ప్రమోషన్లు వస్తాయి. పిల్లలకు మంచి సంబంధాలు కుదురుతాయి. ఎలక్షన్లలో నెగ్గుతారు. పదవులు లభిస్తాయి." అని చెబుతారు.

1988 లో వేసవిలో పశ్చిమగోదావరి జిల్లాలోని పినకడియంలో బూతం అబ్బయ్యగారిని కలిసినప్పుడు, ఇదే వృత్తిలో ఉన్న ఆయన ఈ వృత్తి ప్రారంభాన్ని గురించి తెలిపారు ఒక మాజీ ముఖ్యమంత్రి గారు అబ్బయ్య గారిని తరచుగా పిలిపించి, కొండదేవతకు పూజలు చేయించేవారని చెప్పుకొచ్చారు.

ఇంచుమించు 40 సంవత్సరాలకు పూర్వం ఏలూరు దగ్గర ఉన్న పినకడియం గ్రామవాసి అయిన ఒక బుడిగె జంగం, పేరు బూతం రామయ్య-చిన్ననాడే ఇల్లు వదిలిపెట్టి, తిరిగి తిరిగి, కొండల్లో ఉన్న కోయ దొరల వద్దకు చేరాడు. కొన్ని సంవత్సరాలపాటు వారి శుశ్రూష చేసి, కోయ దొరగా మారాడు. రామయ్య రామరాజు అయ్యాడు. వనమూలికలు తెలుసుకున్నాడు. తర్వాత తిరిగి సంచారానికి బయలుదేరి భవిష్యత్తు చెప్పటం, వనమూలికలు ఇవ్వటం, తాయెత్తులు కట్టటం వృత్తిగా చేపట్టాడు. కొందరు కేంద్ర మంత్రులను, టాటా బిర్లాలను మెప్పించి, సంభావన పుచ్చుకొని విమానంలో హైదరాబాదుకు వచ్చాడు. ఊరికి వెళ్ళి తన వాళ్ళను కలిశాడు. అప్పుడు కొందరు బుడిగె జంగాలు శిష్యులై ఈయన విద్య నేర్చుకొని, అదే వృత్తిగా పెట్టుకున్నారు. అక్కడినుంచి ఈ వృత్తి మెల మెల్లగా రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలకు కూడ వ్యాపించింది.

సంవత్సరానికి ఒకసారి కొండ ప్రాంతాలకు వెళ్ళి వనమూలికలు సమకూర్చుకొని ఢిల్లీ, బొంబాయి, అహమదాబాదు, లక్నో, పాట్నా మొదలైన ఉత్తరాది నగరాలకు; మద్రాసు, మైసూరు, బెంగుళూరు, గోవా, త్రివేంద్రం మొదలైన దక్షిణాది నగరాలకు సంచరిస్తుంటామని ఖమ్మం జిల్లా, గంధశ్రీలో ఆ గ్రామ నివాసులైన సిరిగిరి లక్ష్మీపతిగారు, సిరిగిరి నల్లమస్తాన్‌గారు చెప్పారు.

ఉత్తరాది రాష్ట్రాలు తిరుగుతూ ఇప్పుడు బొంబాయిలో 40 కుటుంబాల వారు స్థిరపడుతున్నారని వరంగల్ జిల్లా ఏపూరు (రేపూని) వాస్తవ్యులైన పత్తి గురవయ్య, చర్ల సంజీవిగార్లు చెప్పారు. తమను ఉత్తరాదివారు 'ఆదివాసి' అని గుర్తించారని, బొంబాయిలో ఇళ్ళ స్థలాలను కూడ మంజూరు చేశారని, త్వరలో ఇళ్ళు కట్టిస్తారని వారు తెలిపారు.

కొండరాజు లేక కోయదొర వృత్తిలో ఉన్న బుడిగె జంగాలు రాష్ట్రంలోని అనేక జిల్లాల్లో ఉన్నారు. మహబూబ్‌నగర్ జిల్లాలో తిమ్మసానిపల్లె, అప్పన్న

పల్లె, గద్వాల చుట్టుపట్ల గ్రామాల్లోను, నల్గొండ జిల్లా పల్లివాడ తరితర గ్రామాల్లోను, మెదక్ జిల్లా దౌంతి, తూప్రాన్ ప్రాంతాల్లోనూ, వరంగల్ జిల్లాలో స్టేషన్ ఘన్‌పుర్, నమిలిగొండ, ఎల్ది, దాట్ల, కుమ్మరి గుంట్ల, రేపూని, అమ్మాపురం, కంతాయపాలెం, తొర్రూరులలోనూ; ఖమ్మం జిల్లా మాదేవపురం, గంధశ్రీ మొదలైన ప్రాంతాల్లోనూ; కృష్ణాజిల్లా గన్నవరం మున్నగు చోట్లలోనూ; కర్నూలు, కడప జిల్లాల్లోనూ, రంగారెడ్డి, హైదరాబాదు జిల్లాల్లో నేరెడు మెట్టు, రామకృష్ణాపురం, మల్కాజ్‌గిరి, గౌడవెల్లి, అస్మాన్‌పేట, బాలానగర్ మొదలైన ప్రాంతాల్లోను నివసిస్తున్నారు. వీరు సంవత్సర కాలంలో చాలాభాగం దేశాటనలోనే గడుపుతారు. కొందరు శివరాత్రికి, కొందరు దసరాకు ఇళ్ళకు చేరుకుంటారు. గంధశ్రీ నివాసులు ఇటీవలిదాకా మూడేళ్ళకోసారి స్వగ్రామానికి వచ్చేవారు.

గత ఐదేళ్ళనుంచి బుడిగె జంగాలు ఈ వృత్తిలో కొంత మార్పుతెచ్చారు. రోడ్డు ప్రక్కన మందుల దుకాణాలు వేసుకొని, ప్రజలను ఆకర్షించటానికి ఇప్పుడు మైకులు వాడుతున్నారు. కుటుంబానికో మైకు సెట్టు ఉంటుంది. మైకులో తమ దగ్గర ఉన్న చూర్ణాలు, గోలీలు, తాయెత్తులు మొదలయినవాటి గురించి వివరించి, ప్రజలు గుమిగూడగానే మందులను ప్యాకెట్లలో విక్రయిస్తుంటారు.

## 5. ముత్తడి పంతు

బుడిగె జంగాల భాషలో 'ముత్తడి' అంటే దేవత. 'పంతు' అంటే వేషం. 'ముత్తడిపంతు' అంటే దేవతకు సంబంధించిన స్త్రీ - అంటే 'కొండ దేవతకు పూజారిణి' అనే అర్థం వచ్చేటట్లు 'ముత్తడి పంతు' అనే సమాసాన్ని వాడుతారు. కొండదేవత ఈమె మీద ఉంటుందని, ఈమె పలుకే కొండదేవత పలుకని నమ్మకమున్నవారు భావిస్తారు.

కొండరాజు భార్య 'ముత్తడి పంతు' వృత్తిలో వెళుతుంది. ఉదయాన్నే బసవద్ద పిల్లలనో, ముసలివాళ్ళనో ఉంచి, పురుషుడు 'కొండరాజు'గా ఒక ప్రాంతానికి వెళితే, స్త్రీ 'ముత్తడి పంతు'లో నగరంలోని మరో ప్రాంతంవైపు వెళుతుంది. మధ్యాహ్నానికి ఇద్దరు బసకు చేరుకుంటారు.

ముత్తడిపంతు వేషగత్తె మంచి చీర (పట్టుచీర), మంచి రవిక ధరిస్తుంది. ముఖానికి కొంచం పసుపు రుద్దుకుంటుంది. నొసట పెద్ద కుంకుమబొట్టు పెట్టుకుంటుంది. ముక్కుకు పెద్ద ముక్కెర, మెడలో బంగారు గొలుసులు, పూసల హారాలు వేసుకుంటుంది. చేతిలో చిన్న బెత్తం పట్టుకొని పిల్లలు జడుసుకొనేలా కనిపిస్తుంది. ఆమెకు తోడుగా మరొక స్త్రీ-భుజానికి సంచి వేసుకొని ఉంటుంది. తోడుగా ఉన్న స్త్రీ ఆమె గురించి గొప్పగా చెబుతుంది. 'కొండదేవత, బెజవాడ కనకదుర్గమ్మ, సమ్మక్క, సారక్క ఆమె మీద ఉన్నారని, పిలిస్తే పలుకుతారని' చెబుతుంది. ముత్తడి పంతు స్త్రీ, ఇళ్ళల్లో స్త్రీల వద్దకు వెళ్ళి, త్రికాలాలు చెప్పి, శుభం కలిగేలా బొట్టు పెడుతుంది. కొన్నిచోట్ల కొండదేవత పూజలుచేసి దక్షిణ తీసుకుంటుంది బియ్యం, డబ్బులు గ్రహిస్తుంది.

కొండరాజు భార్యలు కొందరు మాత్రం చేతిలో తాటాకుల గ్రంథం పట్టుకొని, అందరి భవిష్యత్తు చెబుతూ, తాయెత్తులు, మూలికలు ఇచ్చి, వారిచ్చినవి పుచ్చుకుంటారు.

## 6. ఏకతార పంతు

ఏకతార మీటుతూ వెళ్ళే వేషాన్ని 'ఏకతార పంతు' అంటారు. ఇందులో ప్రధానమయింది సన్యాసివేషం. ప్రజలు ఈ సన్యాసులనే సాదులు, బైరాగులు, గోసాయిలు మొదలైన పేర్లతో పిలుస్తారు. సర్వసంగ పరిత్యాగం చేసినవాడే సన్యాసి. సాదు, బైరాగి, గోసాయిలుకూడ అలాంటివారే, ఉదరపోషణార్థం నిజమైన సన్యాసిలాగా వేషంవేసి భిక్షాటనచేసే బుడిగజంగమే 'ఏకతారపంతు'గాడు.

1920 లో హసన్‌గారు సన్యాసి వేషాన్ని ఇలా వర్ణించాడు: 'సన్యాసి కాషాయవర్ణం గుడ్డలు కట్టుకుంటాడు. మెడలో రుద్రాక్షమాల నొసట విభూతి ధరిస్తాడు. చంకలో జింకచర్మం, చేతిలో సొరకాయ కమండలం ఉంటాయి. హైందవ దేవతల పేర్లను వల్లించి భిక్షం అడుక్కుంటాడు.'[1]

హసన్ వర్ణించిన సన్యాసికి ఏకతార లేదు. అతడు కేవలం దేవతల పేర్లను వల్లించి అడుక్కుంటాడని, బైరాగులనేవారు కాషాయవస్త్రాలు ధరించి, ఏకతార మీటుకుంటూ భిక్షాటన చేస్తారని బైరాగులను హసన్ మరో కులంగా చెప్పారు.[2] కాని సన్యాసి, బైరాగివేషాలు రెండు కూడ బుడిగె జంగాలు వేసేవే.

---

1. The Castes and Tribes of H.E.H. the Nizam's dominions page. 582.
2. " "

ఈనాటి సన్యాసి వెంట్రుకలను తలమీద కొప్పుగా కట్టుకుంటాడు. గడ్డం ఉంటుంది. తెల్లపంచె కట్టుకుంటాడు. కొందరికి చొక్కా ఉండదు. శాలువాలాంటి వస్త్రాన్ని ఎడం భుజంమీది నుంచి కుడిచంక క్రిందుగా వేసుకుంటాడు. ఎడమ భుజానికి మందుల మూట లేక జోలె ఉంటుంది కుడిచేతిలో ఏకతార మీటుతూ ఉంటాడు. కొందరు కాషాయవస్త్రాలు కట్టుకునేవారు కూడ కనిపిస్తారు. కాని, రాను రాను కాషాయవస్త్రధారణ తగ్గుతున్నది.

ఈనాడు సన్యాసుల్లో అనేక కులాలవాళ్ళున్నారు. సన్యాసి వేషం వేసే బుడిగె జంగాల్లో రెండు రకాల వాళ్ళున్నారు. మొదటిరకంవాళ్ళు చేతులు చూస్తూ, జాతకాలు చెబుతూ, రోగాలకు నాటు మందులు ఇస్తూ, తాయెత్తులు కట్టేవారు; రెండవరకం వారు ఏకతారకు తోడు చిటికెలు కొడుతూ, తత్త్వాలు పాడి అడుక్కునేవారు.

తత్త్వాలు పాడే సన్యాసులు బ్రహ్మంగారి తత్త్వాలు, రామదాసు కీర్తనలు, ఏపూరి హనుమద్దాసు కీర్తనలు, యాదగిరి నరసింహస్వామి కీర్తనలు మొదలైనవి పాడతారు. 'చెప్ప లేదంటనగ పొయ్యేరు'. 'నిలువదు నిలువదు కాయం, ఇది నిముషములోపల మాయం', 'హరినామ స్మరణ చేయవె మనసా!', 'యాద గిరీంద్రా శ్రీ యాదగిరీంద్రా! మా వేదనలు బాపు స్వామి యాదగిరీంద్రా!' వంటి ఎన్నో పాటలను వీరు పాడి, భిక్షం అడుక్కుంటారు.

జాతకాలు చెప్పే సన్యాసులు పాటలే పాడకపోయినా ఏకతార మీటుతూ 'బిడ్డ, నీ ఇంట్ల మూడేండ్ల శని ఉన్నది బిడ్డ. నువు జేసిన కష్టం చేతికందుత లేదు. పడ్డ శ్రమలు ఫలమిస్తలేవు. పదిమందిల మాట సాగుత లేదు. పగవాళ్ళు పక్కలో బల్లెమైనారు. నువ్వు భయపడకు బిడ్డ. నీకు పట్టిన శని వదిలేందుకు తాయెత్తు కడతాను, నీకేమి ఫికరు లేదు. నీకు జయమవుతది బిడ్డ' అంటూ చెప్పే మాటలనే పాటలాగ పాడుతారు.

అన్ని వృత్తుల లాగానే సన్యాసి వేషంలో వెళ్ళే వృత్తిని కూడా బుడిగె జంగాలు ఇతరుల నుంచే నేర్చుకున్నారు. సన్యాసుల్లో మూడు తెగలున్నాయని హసన్ పేర్కొన్నారు. అవి 1. హర్నామ్ సన్యాసి 2. బడిగి సన్యాసి 3. గుడి సెమ్మ సన్యాసి లేక సంసారి సన్యాసి. ఇందులో హర్నామ్ సన్యాసుల మాత్ర

భాష తెలుగు కాదు. వీరు మొట్టమొదట సన్యాసులుగా గుర్తింపబడ్డవాళ్ళు. వీరిని చూసి, వీరి వేషాన్ని అనుకరించి సన్యాసి వృత్తిని అవలంబించిన తెలుగువాళ్ళే మిగిలిన బడిగి, గుడిసె సన్యాసులు. హసన్ ఈ రెంటిని వేరు వేరు తెగలుగా చెప్పారు. కాని ఈ రెండు పేర్లు బుడిగె జంగాలవే.

సన్యాసి, మసాన్‌జోగి (కాటి కాపల) బాలసంతులను హసన్ వేరు వేరు కులాలుగా భావించారు. వీరి సాంఘికస్థాయి ఒకటేనని, ఈ కులాల మధ్య వివాహ సంబంధాలు ఉన్నాయని వ్రాశారు. నిజానికి ఇవన్నీ బుడిగె జంగాల వృత్తివేషాల పేర్లే. వృత్తులెన్ని చేసినా, వేషాలెన్ని కట్టినా కులం ఒక్కటే. కాబట్టి హసన్ పేర్కొన్న బడిగి సన్యాసి, గుడిసె సన్యాసి - రెండు పేర్లవారు కూడ బుడిగె జంగాలే. హసన్ పేర్కొన్న వీరి ఇంటిపేర్లు కూడ పై విషయాన్ని నిర్ధారిస్తున్నాయి. వీరి ఇంటిపేర్లు 1. పస్తం 2. చల్ల 3. వినుకొండ 4. కల్లెం 5. నిడుగొండ 6. ఈర్ల 7. కొండపల్లి 8. రుద్రాక్షల 9. కదమంచి 10. రాసూరి- ఇవన్నీ బుడిగె జంగాల్లో కొందరికి ఇంటిపేర్లు.

1920 నాటికే చాలామంది బుడిగె జంగాలు సన్యాసి వృత్తిని అవలంబించారు. దీన్నిబట్టి చూస్తే 19 వ శతాబ్దం చివరి దశాబ్దాల్లో బుడిగె జంగాలు 'సన్యాసి' వేషాన్ని వేయటం ప్రారంభించి ఉంటారని ఊహించటానికి వీలున్నది.

ఏకతార పంతువేసే బుడిగె జంగాలు తెలంగాణాలో ఎక్కువ. మిగతా వృత్తులు రాణించని సమయంలో వీరు ఈ వృత్తితో పొట్టపోసుకుంటారు. కేవలం ఈ వృత్తిలోనే కొనసాగేవాళ్ళుకూడ ఉంటారు. తందానా కథలు భాగోతాలు, తోలుబొమ్మలాటలు మొదలైన వృత్తుల కంటే 'ఏకతార పంతు' తక్కువదనే వివక్ష వీళ్ళలో ఉంది. అయినా ఈ వృత్తి చాలా ప్రాచుర్యం పొందింది. అందువల్లనే ప్రజల్లో బుడిగె జంగాలకు సన్యాసోళ్ళు, బైరాగోళ్ళు, గోసాయిలు, గోసమోళ్ళు అనే పేర్లు ప్రచారంలో ఉన్నాయి.

## 7. ఇతరాలు

ఏక వ్యక్తి వృత్తి వేషాల్లో అంత ప్రాచుర్యంలేని వేషాలు కొన్ని ఉన్నాయి ఎక్కడో ఒకచోట ఇలాంటి వేషగాళ్ళు కనిపిస్తుంటారు. వాటిలో కప్పెర పంతు, తెల్లపంతు, చెక్కబొమ్మలాట, జంగం వాల్కం, ఛత్రాజు వాల్కం, బ్రాహ్మణవేషం మొదలైనవి చెప్పుకోదగ్గవి.

**కప్పెర పంతు :** ఈ వేషగాడు ఒక తాంబాళం (ఇత్తడి పళ్ళెం)లో ఇత్తడితో చేసిన రెండు, మూడు చిన్నబొమ్మలను, పసుపు కుంకుమలను పెట్టుకొని, పైనించి గుడ్డకప్పి ఉంచుతాడు. ఎడమచంకకు జోలె వేసుకుంటాడు. "అమ్మవార్లొచ్చింద్రు, దానం చెయ్యండమ్మా! రాయికంటి ఎల్లమ్మ, గండిపేట మైసమ్మ, మహిమగల తల్లి ముత్యాలమ్మ, బెజవాడ కనకదుర్గమ్మ, ఆదిశక్తి పరాశక్తి, అమ్మవార్లు వొచ్చింద్రు. అమ్మవార్లకు దానం జేయండమ్మ, మీ ఇంటిని అమ్మవార్లు కాపాడుతారు" అంటూ ఇల్లిల్లు తిరుగుతూ భిక్షాటన చేస్తాడు.

బుడిగె జంగాల్లో ఈ వేషాన్ని 'కప్పెర' ఇంటిపేరున్నవాళ్ళు ప్రారంభించి, కొనసాగించటం వల్ల, దీనికి పేరు వచ్చిందని తెలుస్తున్నది. తర్వాత ఇతర ఇంటిపేర్లవాళ్ళుకూడ ఈ వేషం వేసినప్పటికీ, 'కప్పెర పంతు' అనే పేరు అలాగే నిలిచిపోయింది.

**తెల్ల పంతు :-** తెల్లనిపాగా, తెల్లని దుస్తులు ధరించి, చేతిలో ఉగ్గం కట్టిన చెంబు, చంకకు జోలెతో ఈ వేషగాడు ఇల్లిల్లు దీవిస్తూ భిక్ష అడుక్కుంటాడు. తెల్లని దుస్తులు వేసుకున్నందు వల్లనే ఈ పంతుకు (వేషానికి) 'తెల్ల పంతు' అని పేరొచ్చింది.

**చెక్క బొమ్మలాట :-** నిలువెత్తు కర్రకు పై భాగపు చివరన ఒకటి ఒకటిన్నర అడుగుల పొడవున్న చెక్క బొమ్మను కీలుతో బిగిస్తారు. కాళ్ళు చేతులు కదిలేలా అమరుస్తారు. దానికి సన్నని తాడు కట్టి, చేతితో ఆ బొమ్మను ఆడిస్తారు. ఆ బొమ్మ ముందుకూ వెనకకూ కదులుతూ ఉంటే, అది కేతిగాని బొమ్మంటూ, అనిగాని బొమ్మంటూ - తోలుబొమ్మలాటలో, భాగోతాల్లో పాడే హాస్యపు పాటలతో, మాటలతో చెక్కబొమ్మలాటవాడు ప్రజలకు వినోదం కలిగిస్తాడు.

పాతిక సంవత్సరాల క్రితం శంషాబాదు (రంగారెడ్డి జిల్లా) లో సదుల గోవిందు అనే బొమ్మలాటవాడు ఈ ఆటను చూపేవాడు.[1] హైదరాబాదు వీధుల్లో

1. చిన్ననాడు ఈ ఆటను ఎన్నోసార్లు చూడటం జరిగింది.

తిరిగి యాచించేవాడు. ప్రస్తుతం అతని కొడుకులు చెక్క బొమ్మలాట వదిలి వేసి, భాగోత ప్రదర్శకులై దాసరి నారాయణరావు కళానగర్, జిల్లెల్ల గూడెం (రంగారెడ్డి జిల్లా) లో ఉంటున్నారు.

**జంగమయ్య వాల్కం :-** 'వాల్కం' అంటే 'వేషం' అని అర్థం. ఈ జంగమయ్య వేషాన్ని బుడిగె జంగాలు 'పిటికి వాల్కం' అంటారు. తెల్ల దుస్తులు ధరించి, మెడలో లింగం కాయతోపాటు రుద్రాక్షమాల వేసుకొని, నొసటన విభూతి రేఖలు పూసుకొని, ఒక చేతితో గంట ఊపుతూ, మరో చేత్తో శంఖం ఊదుతూ ఈ వేషగాడు ఇల్లిల్లు తిరుగుతాడు. ఇంటి ముందర నిలిచి, 'భంభం' అంటూ శంఖం ఊది, గణ గణ గంటకొట్టి "హరహర మహాదేవ - శంభో శంకర. జంగమయ్య జోలెలోన భిక్షమేసె తల్లులారా! జగమేలు శంకరుడు దీవించునమ్మలారా!" అనే మాటలు వల్లిస్తుంటాడు.

సంక్రాంతి పండుగనాడు జంగమయ్య గంట వాయిస్తూ "సంక్రాంతి పండుగొచ్చె సిద్దేశ్వరా - తల్లి పిల్ల చల్లగాను సిద్దేశ్వరా సాంబమూర్తి కరుణ గల్గి సిద్దేశ్వరా - కలకాలం వర్ధిల్లు సిద్దేశ్వరా" అని పాడుతూ వస్తాడని డా॥ ఎల్లండ రఘుమారెడ్డిగారు ఇదే వేషాన్ని వర్ణించారు.[1]

జంగమయ్య వేషం చాలా అరుదైన వేషం. జిల్లా కొకడో ఇద్దరో ఈ వేషగాళ్ళు కనిపిస్తారు. పూర్వం చాలామంది ఈ వేషం వేసేవారు. క్రమంగా ఇతర వేషాలవైపు అందరు మొగ్గు చూపటంతో ఈ వృత్తివేషం కనుమరుగౌతున్నది.

**భట్రాజు వాల్కం:-** ఈ వేషగాళ్ళు తెల్లని దుస్తులు ధరించి, శ్లోకాలు పద్యాలు చదువుతూ భట్రాజులమని చెప్పుకొని, ప్రజల మంచి సాహిత్యాన్ని (వండని ఆహార సామగ్రిని) స్వీకరిస్తారు.

**బ్రాహ్మణ వేషం:-** ఈ వేషాన్ని పగటి వేషాల్లో ఒకటిగా ప్రదర్శిస్తారు. ఒంటిగా ఈ వేషాన్ని ధరించి కొందరు యాచన చేస్తారు. ఒక చేతిలో కమం

1. పల్లెపదాలతో ప్రజా జీవనము - పుట 313.

దలం, మరోచేతిలో తాళపత్ర గ్రంథం, మెడలో రుద్రాక్షమాల, ఒళ్ళంతా విభూతి రేఖలు, భుజానికి ఓ సంచి, చంకలో గొడుగు ధరించి, బ్రాహ్మణుల ఉచ్చారణను అనుకరిస్తూ, బ్రాహ్మణుల జీవనసరళికి సంబంధించిన ఏదో విషయాన్ని ప్రస్తావిస్తూ భిక్షాటన చేస్తారు. ఈ వేషగాళ్ళు నూటికో కోటికో ఒకరన్నట్లుగా ఉంటారు.



ఇలా ఏకవ్యక్తి కళారూపాలు ఒకదానికొకటి విభిన్నమై, ప్రత్యేక లక్షణాలతో ప్రజలకు వినోదాన్ని కలిగించే వృత్తికళలుగా ఉనికిని కాపాడుకుంటున్నాయి. ఇక బుడిగె జంగాలు ప్రదర్శించే సామూహిక వృత్తివేషాల గురించి అనుశీలించవలసివున్నది.

# II. సామూహిక ప్రదర్శన కళారూపాలు
# (సామూహిక వృత్తివేషాలు)

## 1. బుడిగె జంగం కథలు/శారద కథలు :

ఉ॥ ఇంటిని తిమ్మరాజు కత యింటిని యీర్ల కథా ప్రసంగముల్
ఇంటిని పాండు లాలి యిబమింటిని నాయకురాలి శౌర్యమె
ప్పంటికి నంది వాక్యముల పాండు చెర్రితల నామ భాగ్యమె
న్నంటికి గల్గు నోయను నవజ్ఞుడు మూర్ఖుడు చంద్రశేఖరా!

పై పద్యం 17 వ శతాబ్దానికి చెందిన చంద్రశేఖర శతకం లోనిది. ఆనాడు జనబాహుళ్యానికి ప్రీతిపాత్రమైన తందానకథల గురించి కవి వర్ణించాడు.

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో గాయకులైన శివభక్త బృందాలను గురించి చెప్పాడు. అందులో జంగాలను పేర్కొన్నాడు. సోమన వర్ణించిన జంగాలు అప్పటికింకా కథలు చెప్పటం నేర్చుకోలేదు. అప్పుడు 'జంగం' అనేది మత వాచకమేకాని, కుల వాచకం కాదు. పాటల రూపంలో పిచ్చుకుంట్లవారు కథలు చెప్పినట్లు వర్ణించబడింది. ఆ కథలు జంగాలకు సంబంధించినవి. అంటే - వీరశైవ భక్తులకు సంబంధించినవి. జంగం కథలంటే ఆనాడు వీరశైవ భక్తుల కథలని అర్థం. వీరశైవం సన్నగిల్లిన తర్వాత మొదట 'జంగం' ఒక కులమయ్యి, ఆ తర్వాత చీలిపోయి అనేక కులాలుగా పరిణామం చెందింది. ఒక శాఖ నియమ నిష్ఠలతో కొనసాగి 'జంగం' (జంగమయ్య) లేక 'జంగం దేవర' పేరుతో స్థిరపడగా ఇతర శాఖలు మాల జంగం, బేడ జంగం, బుడిగె జంగం అనే నిమ్న కులాలయినాయి.

వీరశైవం క్షీణించటంతో నిమ్న కులాలుగా చీలిన జంగాలు నానా వృత్తులను అవలంబించారు. 16 వ శతాబ్దం ఉత్తరార్ధంలో ఉన్న బైచనేని వేంకటనాథ కవి పేర్కొన్న తెరనాటకపు టూరిజంగాలు, అయ్యలరాజు నారాయణ కవి పేర్కొన్న ఊరజంగాలు తందానా కథలతో పాటు అనేక జానపద వృత్తి కళలను నేర్చుకొంటూ, వాటిని ప్రదర్శించి పొట్ట పోసుకుంటూ బుడిగె జంగాలుగా పేరుపడ్డారు.

సోమన కాలంలో వీరశైవ కథలనే జంగం కథలని పిలిస్తే, ఈనాడు భుక్తి కోసం బుడిగె జంగాలు చెప్పే తందానా కథలే 'జంగం కథలు' అయినాయి.[1] అయితే ఆచార్య బిరుదురాజు రామరాజుగారు పేర్కొన్నట్లుగా జంగాలు మొదట్లో శివపారమ్యకథలనే చెప్పినా, రాను రాను కాలానుగుణంగా, ప్రేక్షకుల అభిరుచికి అనుగుణంగా శైవేతర కథలను కూడా చెప్పసాగారు.[2]

జానపద భిక్షుక గాయకుల్లో బైండ్లవారు ఎల్లమ్మ కథకు, బీరన్నల వారు ఎల్లమ్మ, శివ పారమ్యమైన కొన్ని కథలకు, పాండవుల వారు (తోటి కులస్థులు) మహా భారతకథలకు, దక్కలి వారు పండగ సాయన్న మొదలయిన చారిత్రాత్మక కథలకు పరిమితమై ఉండగా బుడిగె జంగాలు అన్నిరకాల జానపద కళా ప్రక్రియల ప్రదర్శకులుగా ప్రజాభిమానాన్ని చూరగొన్నారు. జానపద భిక్షుక గాయకుల్లో ఇంతటి వైవిధ్యం ఉన్నవారు లేరు.

**శారద కథలు :** శారద కథలు చెప్పేవారిని 'శారదగాళ్ళు' అంటారు. శారద కథల గురించిగాని, శారదగాళ్ళ గురించిగాని ప్రాచీన సాహిత్యంలో, శాసనాల్లో ఎక్కడా ప్రస్తావన లేదు. 1920 లో సయ్యద్ సిరాజుల్ హసన్‌గారు వీరిని ఒక కులంగా పేర్కొన్నారు. ఆచార్య రామరాజుగారు కూడ తమ సిద్ధాంత గ్రంథంలో వీరిని ఒక కులంగా గుర్తించి, వివరించారు. విజ్ఞాన సర్వస్వంలో "శారదకాండ్రు' అనే పేరుతో ఒక వ్యాసం వ్రాశారు. తర్వాత డా. మిక్కిలినేని గారు, డా॥ ఆర్. వి. యస్. సుందరంగారు, డా. ఎన్. విజయగారు, కె. వి. హనుమంతరావుగారు మొదలైన పరిశోధకులు వీరిని గురించి తెలిపారు. డా॥ ఎన్. యాదగిరి శర్మగారు 'జానపద భిక్షుక గాయకులు' అనే సిద్ధాంత గ్రంథంలో శారదగాండ్ర గురించి వివరించారు (పుటలు 79-100).

తెలుగుదేశంలో 'శారదగాళ్లు' అనే కులంవారు కథలు చెబుతారని, వారు చెప్పే కథలను 'శారత కథలు' అంటారని పూర్వ పరిశోధకులు వ్రాశారు.

---

1. తెలుగు జానపద గేయ గాథలు - పుట 24.
2. తెలుగు జానపదగేయ సాహిత్యము - పుట 805.

శారద కథలకు, జంగం కథలకు ఉన్న భేద సాదృశ్యాలను కూడా పేర్కొన్నారు. కాని, నిజానికి బుడిగె జంగాలనే శారదగాళ్ళని పిలుస్తారు తప్ప, శారదగాళ్లు వేరే కులంవారు కారు.

సర్కారు ప్రాంతంలో బుడిగె జంగాలు చెప్పే కథలను 'జంగం' కథలని పిలుస్తారు. తెలంగాణాలో ఉన్న బుడిగె జంగాలు చెప్పే అవే కథలను శారద కథలంటారు. రాయలసీమ ప్రాంతంలో ఈ కథలకే 'తందానా కథ' లని పేరు. తందానా కథలను ఈ ప్రాంతంలో 'సుద్దులు' అని కూడ అంటారు. ఈ కారణంగానే కర్నూలు జిల్లాలోని నంద్యాల పట్టణంలో పాలిటెక్నిక్ కళాశాల సమీపంలో ఉన్న బుడిగె జంగాల పేటను 'సుద్దులపేట' అని పిలుస్తున్నారు. ప్రాంత భేదాన్నిబట్టి వీరికి, వీరి కథలకు విభిన్నమైన పేర్లు వ్యవహారంలో ఉన్నాయి. అంతేకాకుండ, ఈ కథల్లో కూడ స్థూలమైన ప్రాంత భేదాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. అనివార్యంగా భాషలో యాస (మాండలిక భేదం) ఉండనే ఉంటుంది. దానికితోడు తెలంగాణా బుడిగె జంగాలు ఉపయోగించేవి బుడిగె తాంబూరాలు కాగా; రాయలసీమ, సర్కారు ప్రాంతాలవారు ఉపయో



శారద లేక తాంబూర, బుడిగెలు లేక గుమ్మెటలు

గించేవి పడిగె తాంబూరాలు. పడిగె తాంబూరాల చివర పాము పడిగె లాగ వంపు ఉంటుంది.[1] వీళ్ళు ఉపయోగించే బుడిగెల్లో (ఢింకి లేక గుమ్మెట) కూడ భేదాలున్నాయి. కొందరు ఇత్తడివి ఉపయోగిస్తే, మరికొందరు మట్టి బుడిగెలు ఉపయోగిస్తారు. ఒకే ప్రాంతంలో కొందరు మట్టి బుడిగెలు, మరికొందరు ఇత్తడివి ఉపయోగించటం కూడ కనిపిస్తున్నది.

తెలంగాణా గాయకులు తాంబూరాను 'శారద'గా సంభావిస్తారు. దాని మీద పూర్వకాలంలో శారద బొమ్మ ఉండేదట. కథా ప్రారంభంలో సరస్వతిని శారదా పేరుతో స్తుతించేవారట. అందువల్లే వీరికి శారదగాళ్ళని పేరొచ్చిందని కుల పెద్దలు చెప్పారు.[2] దరువుల్లో కూడ వైవిధ్యం ఉంది. ఒక్కొక్క ప్రాంతంవారు కొన్ని కొన్ని దరువులను ఎక్కువగా పాడుతారు. తెలంగాణాలో కూర్చొని కథ చెప్పటం అధికం. సర్కారులో నిలబడి కథ చెప్పటం ఉంది. రాయలసీమలో కథకుడు తాంబూరా వాయించకుండ చిన్న నల్ల కట్ల కట్టె చేతిలో పట్టుకొని, ఆడుతూ కథ చెబుతుంటే, వంతగాళ్ళలో ఒకడు తాంబూరా మీటగా, మరొకడు బుడిగె వాయిస్తాడు. ఇలాంటి కారణాలవల్ల బుడిగె జంగాలను ఒక్కో ప్రాంతంలో ఒక్కో పేరుతో పిలుస్తున్నారు. కాబట్టి జంగం కథలన్నా, శారద కథలన్నా, తందానా కథలన్నా- అవి బుడిగె జంగాలు చెప్పే కథలే.

1920 లో హసన్‌గారు 'శారదకాని' పేరుతో వీరిని పేర్కొంటూ, వీరు మున్నూరు కులంనుంచి ఉద్భవించిన తెగవారని చెప్పారు.[3] ఆచార్య రామరాజు గారు "మున్నూరు, ముతరాసీ మున్నగు తెలగ కులముల నుండి యుద్భవించిన జాతులందొకటి శారదకాండ్రజాతి" అని వివరించారు.[4] అప్పటినుంచి ప్రతి పరిశోధకుడు 'శారదగాళ్ళ' పేరు రాగానే వీరు మున్నూరు, ముతరాసీ కులాల

---

1. రెండవ ప్రకరణంలో ఈ విషయం వివరించబడింది.
2. డా॥ ఎన్. యాదగిరి శర్మగారు 'శారద' గురించి చర్చించారు. జానపద భిక్షుక గాయకులు (అముద్రితం) - పుటలు 79-100.
3. The Castes and Tribes of H.E.H. the Nizam's Dominions. page 505.
4. తెలుగు జానపద గేయ సాహిత్యము - పుట. 797.

నుంచి పుట్టారని చెప్పటం పరిపాటి అయిపోయింది. కాని ఇది సరికాదు. ఇదే నిజమయితే శారదగాళ్ళు బుడిగె జంగం కులానికి భిన్నమయిన కులంగా ఉండాలి. కాని, బుడిగె జంగం కులస్థులనే శారదగాళ్ళని పిలుస్తారు. శారదగాళ్ళ కులం ప్రత్యేకంగా లేదు. ఈ సందర్భంలో హసన్ చెప్పిన మరో కథనం సమంజసంగా ఉంది. "మధుమాంసాహారులయి తమ కులం నుంచి వెలివేయబడ్డ 'జంగం' జాతికి చెందినవారే ఈ శారదకానివారు" అని కూడ హసన్ చెప్పారు 1 మధు మాంసాహారులయి, నియమ నిష్ఠలను కోల్పోయిన వీరిని జంగమయ్యలు తమ కులం నుంచి వెలివేశారు. అలా వెలివేయబడ్డవారే బుడిగె జంగాలయ్యారు. బుడిగెజంగాలే శారద కథలు చెప్పటం వల్ల శారదగాళ్లుగా పిలువబడ్డారు.

శారద వరుసలు, జంగం వరుసలు వేరువేరని పూర్వపరిశోధకులు పేర్కొన్నారు. సాధారణంగా కథ వేరయినపుడు వరుసలు కూడ భిన్నంగా ఉంటాయి. కొండ్రాయుని కథలో ఉన్న వరుసకు, బొబ్బిలికథ వరుసకు భేదం ఉంటుంది. ఒక ప్రాంతంలో 'జంగం కథల'ని, మరో ప్రాంతంలో శారద కథలని ప్రచారంలో ఉండటం వల్ల పరిశోధకులు రెంటిని భిన్నమని భావించారు. నిజానికి శారద కథలు అవే, జంగం కథలు కూడ అవే. రెండూ ఒకటే.

బుడిగె జంగం కథకులు పల్లె పల్లెకు కనిపిస్తూనే ఉంటారు. జానపద కళలలో ఈ కథా ప్రక్రియకు, మిగిలిన అన్ని జానపద కళల కంటే కూడ విస్తృతమైన పరిధి, ప్రచారం ఉన్నాయి. కాలానుగుణమైన మార్పులకు గురై మిగిలిన కళాప్రక్రియలు మరుగున పడుతున్నాయి. కాని ఈ కథలు మాత్రం తమ ఉనికిని పూర్వంలాగే కొనసాగిస్తున్నాయి. పూర్వం ఒక్కొక్క దగ్గర రోజుల తరబడి కథలు చెప్పేవాను. ఈ ఆధునిక కాలంలో అంత వ్యవధిలేనివారుకూడ గంటో, రెండు గంటలో కథ చెప్పించుకొని ఆనందించటం మానలేదు. తాంబూరా, బుడిగెల వాద్య సమ్మేళనంతో కథకుడు గొంతెత్తి పాడుతూ కథలు చెబుతుంటే, ప్రతి జానపదుడు కథలో లీనమై పోతూ ఉంటాడు. పల్లెల్లో తీరిక వేళల్లో ఈ కథలు వినటానికి ప్రజలు ఎంతో ఇష్టపడుతారు.

---

1. The Castes and Tribes of H.E.H. The Nizam's Dominians - Page - 505.

సంతోష సమయాల్లోనేకాకుండ, కొన్ని శూద్రకులాల్లో ఎవరైనా మరణిస్తే బుడిగె జంగాలను పిలిపించి. రాత్రంతా కథ చెప్పించి, జాగరణ చేస్తారు.

ధేనువకొండవారి జంగం కథల్లో ఉన్న కథచెప్పే జంగాల వర్ణనను ఆచార్య బి. రామరాజుగారు ఉటంకించారు.[1] ఆ కవి విరాటపర్వాన్ని రచిస్తూ, ఉత్సాహంగా కథలు చెప్పే జంగాల కోసమే తానీ రచన చేస్తున్నట్లు చెప్పాడు. జంగాలు కథలు చెప్పే విధానాన్ని ఇలా వర్ణించాడు:

> "భారతమొక కథ చేయమనుచు నను ప్రార్థింపగ జూచి
> నే రచియింపగ బూనితి జంగమువారికి నుపకృతిగా
> నీటుగా విభూతి రేఖలు దీర్చియు నిల్వుటంగీల్తొడిగి
> వేటు రుమాలాల్ పేటు పాగాల్వ్రెల్లెవాటులొనర దాల్చి
> జోడు గుమ్మెటల్ దట్టుచు వంతలు బాడుచు మరియొకడు
> పోడిమిగా చేబూని సితారా భుజమున ధరియించీ
> గజ్జెలు మువ్వలు అందెలు పదముల ఘల్లని మ్రోయగనూ
> తఝుణుత తక యని నాట్యము సల్పుచు తంబుర మీటుచునూ
> సంగతిగా సభవారికెల్ల ప్రసంగ పూర్వకముగా
> చెంగున దుముకుచు జంగంబులకును జీవన ధనమనగా."

పై గేయంలో కవి కథ చెప్పేటప్పుడు జంగాల వేషం ఎలా ఉంటుందో వివరించాడు. కథకుడు భుజం మీద తాంబూర పెట్టుకొని మీటుతూ, అందెలు రవళిస్తూ, కాళ్ళకున్న గజ్జెలు ఘల్లున మోగుతుండగా నాట్యం చేస్తూ, ప్రసంగ పూర్వకంగా సభవారికి కథ చెబుతాడని తెలిపాడు. ఇరువక్కల వంతగాళ్ళు జంట గుమ్మెటలు వాయిస్తూ వంతపాట పాడుతారని వర్ణించాడు.

ప్రస్తుతకాలంలో కూడ బుడిగె జంగాలు ఇద్దరు లేక ముగ్గురు కలిసి కథ చెబుతారు. ప్రధాన కథకుడు కుడిచేతితో తాంబూర (శారద) మీటుతూ, ఎడమ చేతి బొటన వేలుకు వేసుకున్న అందెలు మ్రోగిస్తూ కథ చెబుతాడు. ఒకరు లేక ఇద్దరు బుడిగెలు వాయిస్తూ వంతపాట పాడుతారు. సాధారణంగా భర్త కథ

1. తెలుగు జానపద గేయ సాహిత్యము - పుట. 806.

చెబుతుంటే, అతని భార్య బుడిగె కొడుతుంది. వీళ్ళలో ఉన్న బహుభార్యత్వం వల్ల వంతపాడే వాళ్లిద్దరూ ఒక్కొక్కప్పుడు భార్యలే అయి ఉండవచ్చు. కొన్ని సందర్భాల్లో తండ్రీ కొడుకులో, అన్నదమ్ములో, బావమరుదులో జంటగా ఉంటారు. కేవలం ఇద్దరు లేక ముగ్గురు స్త్రీలు కూడ కథ చెప్పటం ఉంది. తెలంగాణాలో కంటె రాయలసీమ సర్కారుల్లో ఈ పద్ధతి ఎక్కువగా కనిపిస్తున్నది. సర్కారు ప్రాంతంలో మగవాళ్ళకు పగటి వేషాలు వేయటం వృత్తి. స్త్రీలకు కథలు చెప్పటం వృత్తి. అక్కడ రెండు మూడు తరాలనుంచి ఈ పద్ధతి కొనసాగుతున్నది.

బుడిగె జంగాల్లో వీధి భాగోతాలు ప్రదర్శించడం కూడ విరివిగా ఉంది. యక్షగానాలను భాగోతాలుగా ప్రదర్శిస్తారు. వీరు తందానా కథలకంటె 'తమది గొప్ప కళ' అని, తందానా కథకులను చిన్నచూపు చూడటం వల్ల, భాగోతం పక్కలో అయితే జనాన్ని అధికంగా ఆకర్షించే వీలున్నదనే అభిప్రాయం వల్ల తందానా కథకులు, తందానా భాగోతాలను ప్రదర్శించటం ప్రారంభించారు. భాగోతంలోలాగ వేషాలు ధరించి, తందానా దరువులతోనే కథ నడిపిస్తారు. ఈ విధంగా ఈ కథకులు జానపద రూపక ప్రక్రియా లక్షణాలతో తందానా కథలకు ఒక కొత్త రూపాన్ని సంతరించి పెట్టారు. ఈ ప్రక్రియ తెలంగాణాలో ఎక్కువగా ప్రచారంలో ఉంది. రాయలసీమలో అక్కడక్కడ కనిపిస్తున్నది. సర్కారులో మాత్రం మగవాళ్ళు పగటివేషాలు ప్రదర్శించగా, స్త్రీలు కథలు చెబుతారు. అందువల్ల ఈ తందానా భాగోతాల ప్రదర్శన అక్కడ కనిపించదు.

**బుడిగె జంగాలు చెప్పే కథలు :**

1. అపురూప రాజుల కథ, 2. అమరమేఘ మహారాజు కథ, 3. అల్లీ రాణి కథ, 4. ఆడబిడ్డ శంకరమ్మ కథ, 5. ఆరుట్ల రామచంద్రారెడ్డి కథ, 6. ఆరె మరాటీల కథ, 7. ఈడిగోళ్ళ సత్రెమ్మ కథ, 8. ఎరుకల నాంచారి కథ, 9. ఎల్లమ్మ కథ, 10. ఏక చక్రవర్తి, 11. కనకతార, 12. కమల సంగయ్య, 13. కమ్మవారి పడతి, 14. కలియుగ పొన్న, 15. కాంతామతి, 16. కాంభోజ రాజు, 17. కాటమరాజు, 18. కామమ్మ, 19. కుంభం చెన్నారెడ్డి, 20. కుమార రాముని కథ, 21. కుసుమకోమలి, 22. గాంధారి కథ, 23. గార్లమునికోట కథ, 24. గొలుసుమహారాజు, 25. గౌండ్ల అంజయ్య, 26. చిన్నమ్మ కథ, 27. జరా

సందుని కథ, 28. తలవంచని వీరుడు, 29. తాబేలు పుత్రుడు, 30. దేశింగు రాజు కథ, 31. నరకాసుర వధ, 32. నలచక్రవర్తి, 33. నల్లతంగ మహారాజు, 34. నవభోజరాజు, 35. నాగిరెడ్డి కథ, 36. నీలరూప నీలసేన కథ, 37. పంచ పాండవుల కథ, 38. పూర్వ (పురూరవ) చక్రవర్తి కథ, 39. బంగారు తిమ్మ రాజు, 40. బల్గూరి కొండయ్య, 41. బాలనాగమ్మ, 42. బీరప్ప కథ, 43. బుడ్డా వెంగళరెడ్డి, 44. బొబ్బిలి యుద్ధం, 45. బభ్రువాహన, 46 మాంధాత, 47. ముంగమోహన మహారాజు, 48. మొద్దు రామన్న, 49. మైనావతి, 50.రత్నసేనమహారాజు, 51. రాజారంపాలక, 52. రాములమ్మ లంబాడి కథ, 53. రేణిగుంట రామిరెడ్డి, 54. లక్కకోటవీరుల కథ, 55. లక్ష్మమ్మ కథ, 56. వకునూరి వెంకటరెడ్డి, 57. వీరబలవంత, 58. వేష (వేశ్య) నాగమ్మ, 59. శంఖు మహారాజు, 60. శివకుమారుని కథ, 61. శీలమూరి చిన్నమ్మ, 62. సదాశివరెడ్డి, 63. సన్యాసమ్మ, 64. సర్వాయి పాపడు, 65. సారంగధర, 66 సిరితొంద మహారాజు, 67. సుగుణావతి, 68. సుబ్బిరెడ్డి కథ, 69. సురా సింధు రాజుల కథ, 70. సూర్యచంద్ర రాజుల కథ, 71. హరిశ్చంద్ర, 72. హర్కారుబంటు, 73. కలిచెర్ల నర్సింహారెడ్డి. 74. చిన్నప్పరెడ్డి కథ, 75.పిలాయిపల్లి పాపిరెడ్డి, 76. భట్టి విక్రమార్క, 77. సవారమ్మ, 78. వందరి ఎంకన్న, 79. సరోజనమ్మ, 80. మోహిని, రుక్మాంగద, 81. ఈడిగ దేవమ్మ, 82. ద్రైవరుగారి కథ, 83. ద్రైవాదీనం కథ, 84 లక్ష్మణరాయుని కథ, 85. అప్పన్నపల్లి రైలుపడ్డకథ, 86. తెలుగు సత్తమ్మ కథ, 88. పతివూర్వ చంద్రకాంత కథ.

పై కథల్లో బొబ్బిలి యుద్ధం, కాటమరాజు, సదాశివరెడ్డి, సర్వాయి పాపడు, బల్గూరి కొండయ్య, బుడ్డా వెంగళరెడ్డి, గౌండ్ల అంజయ్య, పిలాయిపల్లి పాపిరెడ్డి మొదలయినవి చారిత్రాత్మకాలు.

నల్గొండ ప్రాంతంలో కేస్తాల అంజయ్య కథ, రేణిగుంట రామిరెడ్డి కథ, ఆరుట్ల రామచంద్రారెడ్డి కథ, వకునూరి వెంకటరెడ్డి కథ మొదలయిన చారిత్రాత్మక కథలు కూడ బాగా ప్రచారంలో ఉన్నాయి.[1]

---

1. జానపద భిక్షుక గాయకులు - పుట - 99.

కామమ్మ, లక్ష్మమ్మ, సన్యాసమ్మ మొదలయినవి కరుణ రసాత్మకాలు. బుడగె జంగం కథలలో అద్భుత రసానికి సంబంధించిన కథలే ఎక్కువ. బాలనాగమ్మ, కాంభోజరాజు, కలియుగ పౌన్న, గాంధారి, కమ్మవారి పడతి మొదలయిన కథలు ఈ కోవకు చెందుతాయి.

జంగం కథల నుంచే బుర్రకథలు పుట్టుకొచ్చాయి. బుర్రకథా పితామహుడైన పద్మశ్రీ షేక్ నాజర్ దూరదర్శన్ ఇంటర్వ్యూలో మాట్లాడుతూ, తనను బుర్రకథలవైపు మళ్ళించినవి ఈ జంగం కథలేనని, తాను జంగాల నుంచి పొందిన స్ఫూర్తితోనే బుర్రకథా ప్రక్రియను చేపట్టానని వివరించారు. అనేక ఆధునిక ఇతివృత్తాలను స్వీకరించి, బుర్రకథను ఒక నూతన ప్రక్రియగా తీర్చిదిద్ది, అపారమైన ప్రజాభిమానాన్ని చూరగొనగలిగానని తెలిపారు.

రేడియో, దూరదర్శన్ కార్యక్రమాల్లో బుర్రకథలతోపాటు బుడిగె జంగాల కథలు కూడ అప్పుడప్పుడు ప్రసారమవుతున్నాయి. తెలంగాణా గాయకులు సదుల గండయ్య, కల్లెం చంద్రయ్య, సదుల సంగయ్య; సర్కారు ప్రాంత కథకులు మిరియాల అప్పారావు, ఇప్ప గనెమ్మ మొదలయినవారు ఈ కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

తెలంగాణాలో మాలజంగాలు, రాయలసీమలో కొందరు పూసల బలిజలు కూడ పూర్వం ఈ కథలు చెప్పేవారు. ప్రస్తుతం వీళ్ళలో కథలు చెప్పే వారెవ్వరూ కనిపించటంలేదు. జంగం కథలు లేక శారద కథలు చెప్పటం బుడిగె జంగాలకే పరిమితమయిపోయింది. ముఖ్యంగా వీర, అద్భుత, కరుణ రసాత్మకంగా సాగే వీరి కథలు పల్లె ప్రజలకు వినోదాన్ని అందించే ప్రధాన సాధనాలుగా ఉన్నాయి. జంగం కథా ప్రక్రియ అత్యధిక జనాకర్షణ ఉన్న జానపద కళారూపంగా విరాజిల్లుతున్నది.

## 2. తోలుబొమ్మలాటలు

'అరవై ఆమడలు వెళ్ళి హరికథ వినాలి, తొంభై ఆమడలు వెళ్ళి తోలు బొమ్మలాట చూడాలి' అనే సామెత శిష్టకళాప్రక్రియ అయిన హరికథ కంటె కూడ తోలుబొమ్మలాటకున్న వైశిష్ట్యాన్ని చాటుతున్నది. తోలుబొమ్మలాట సంగీత సాహిత్య నాట్యచిత్ర కళల సమాహార స్వరూపమై జనరంజకత్వాన్ని కలిగిస్తున్నది.

దాదాపు క్రీస్తు శకారంభం నుంచే తోలుబొమ్మలాటలు ఛాయానాటకాల పేరుతో ప్రదర్శింపబడేవని పరిశోధకులు పేర్కొంటున్నారు 'రూపోపజీవనం' అనేదే దక్షిణ దేశంలో 'జాలమండపికా' అనే పేరుతో ప్రదర్శించే చర్మనాటక మని నీలకంఠ పండితుడు మహాభారత వ్యాఖ్యానంలో చెప్పినట్లు తెలుస్తున్నది.

13వ శతాబ్ది నుంచి తెలుగు శాసనాల్లో తోలుబొమ్మలాటల ప్రస్తావన కనిపిస్తున్నది. పాల్కురికి సోమనాథుడు "భారతాది కథల చీరమఱుగుల - నారంగ బొమ్మల నాడించువారు" అని పండితారాధ్య చరిత్రలో వర్ణించాడు. 16వ శతాబ్దంలో వచ్చిన చంద్రభాను చరిత్రలో తోలుబొమ్మలాట ప్రస్తావన చేయబడింది. చంద్రాంగద చరిత్ర (17వ శ.), నాచన సోముని ఉత్తర హరి వంశం, శ్రీనాథుని పలనాటి వీర చరిత్ర, కాకుమాని మూర్తి కవి పాంచాలి పరిణయం, అబ్బయామాత్యుని అనిరుద్ధ చరిత్ర మొదలయిన కావ్యాల్లో తోలు బొమ్మలాట వర్ణనలు చోటు చేసుకున్నాయి. ఆనాటి నుంచి ఈనాటిదాకా తోలు బొమ్మలాట కళా ప్రక్రియ కొనసాగుతూనే ఉన్నది.

గత దశాబ్దంలో ఆరుద్రగారు రచించిన 'మహాత్మగాంధి' తోలుబొమ్మ లాట ప్రభుత్వాధ్వర్యంలో ప్రదర్శింపబడింది.తూర్పుగోదావరి జిల్లా తోలుబొమ్మల కళాకారులు అనపర్తి త్రినాథరావు, తోట రంగారావు, హైదరాబాదుకు చెందిన శ్రీనివాసరావుగార్లు హైదరాబాదు నగరంలోని బేగంపేట, సనత్‌నగర్, దిల్‌సుఖ్ నగర్, అంబర్‌పేట, బాగ్‌లింగంపల్లి, పాతబస్తీ ప్రాంతాల్లో రామాయణ, భారతాల్లోని కొన్ని ప్రముఖ సన్నివేశాలను సహజమైన జానపద బాణీలో ప్రద ర్శించి ప్రజల మన్ననలను పొందారు. రాష్ట్ర సాంస్కృతిక శాఖ 1991 జూలై మొదటి వారంలో ఈ కార్యక్రమాన్ని నిర్వహించింది.

1991 ఆగస్టు, సెప్టెంబరు మాసాల్లో జర్మన్ సాంస్కృతిక ఉత్సవాలలో పాల్గొనే భారత బృందంలో తెలుగుదేశం నుంచి తోలుబొమ్మలాట వృత్తి కళా కారులను ఎంపికచేసి, ప్రదర్శన ఇప్పించారు.

పూర్వకాలంనుంచి తోలుబొమ్మలాటలను ఆరెవాళ్ళు ప్రదర్శిస్తున్నారు. ఆరెవాళ్ళనుంచి ఇతర జాతులవారు నేర్చుకున్నారు. అలా నేర్చుకున్నవాళ్ళలో బుడిగె జంగాలకు ప్రత్యేక స్థానం ఉంది. పూర్వకవులు పేర్కొన్న తెరనాటకపు

జంగాలే ఈ బుడిగె జంగాలు. 16వ శతాబ్దం ఉత్తరార్థంలో ఉన్న భైచరాజు వేంకట నాథ కవి పంచ తంత్రంలో ఊరి జంగాలు తెరనాటకాలను ఆడుతారని తెలిపాడు. 18వ శతాబ్దంలోని అయ్యలరాజు నారాయణకవి హంస వింశతిలో కులాలను వర్ణిస్తూ తెరనాటకపు జంగాలను కూడ పేర్కొన్నాడు.[1] తెరనాటక మంటే తెరలను ఉపయోగించే నాటకప్రదర్శనమని కొందరు తలచారు. కాని, అది సమంజసం కాదని తెరనాటకాలంటే తోలుబొమ్మలాటలే అని పరిశోధకులు నిర్ధారించారు.[2] సిరాజుల్ హసన్‌గారు (1920) తోలుబొమ్మలాటవారిని వర్ణిస్తూ, వీరినే బడ్గి జంగాలంటారని వివరించారు.[3]

పైన వివరించిన అంశాలవల్ల బుడిగె జంగాలు దాదాపు నాల్గు శతాబ్దాల నుంచి తోలుబొమ్మలాటలు ప్రదర్శిస్తూన్నారని చెప్పవచ్చు.

ఆరెవాళ్ళు, బుడిగె జంగాలతోపాటు తోలుబొమ్మలాటలను బళ్ళారి జిల్లాలో బలిజెలు, విశాఖ జిల్లాలో ఈటె, బొందిలి తెగవారు, గోదావరి జిల్లాల్లో తెలుగు గొల్లలు, మహారాష్ట్ర, కర్ణాటక సరిహద్దు ప్రాంతాల్లో కతుబులు అనే వారు ప్రదర్శిస్తున్నట్లు తెలుస్తున్నది.[4]

తోలు బొమ్మలాటలను ప్రదర్శించేవాళ్ళను తోలు బొమ్మలవాళ్ళు లేదా తోలు బొప్పలవాళ్ళు అని పిలుస్తారు. 'బొమ్మ' శబ్ద భవమే 'బొప్ప.' బొమ్మల > బొప్పల అయింది.

కర్ణాటక రాష్ట్రంలో - ముఖ్యంగా బళ్లారి, హోస్పేట, కోలారు జిల్లాల్లో కూడ తోలు బొమ్మలాట బాగా ప్రచారంలో ఉంది. తోలు బొమ్మలాటకు సంబంధించిన క్రీ.శ. 1521 నాటి తెలుగు శాసనం కోలారు జిల్లాలో లభించింది. బళ్లారి జిల్లాలో 'బొమ్మలాటపల్లె' అనే పేరుతో ఒక ఊరే ఉన్నదంటే ఆ

---

1. హంస వింశతి - 3-29
2. తెలుగు నాటక వికాసం - పుట - 147
3. The Castes and Tribes of H.E.H. The Nizams Dominions. page 507
4. విజ్ఞాన సర్వస్వం - 3వ సం. పుట - 948.

ప్రాంతంలో పూర్వంనుంచి ఈ కళకు ఉన్న ప్రశస్తి ద్యోతకమవుతున్నది. ఇప్పటికీ బుడిగె జంగాలు ఊర జంగాల పేరుతో ఆ ప్రాంతాల్లో తోలుబొమ్మలాట ప్రదర్శకులుగా ఉన్నారు. వీరి మాతృభాష తెలుగే అయినప్పటికీ కన్నడ భాషలో ప్రదర్శనలు ఇస్తారు. కర్నాటకలో తోలుబొమ్మలాట వారిని 'కిళ్లెక్యాతరు' అని అంటారు. తమిళనాడులో 'తోల్పావై' అంటారని ఎల్లోరా గారు తెలిపారు.[1] కర్నాటకలోని కొన్ని ప్రాంతాల్లో 'తొగలు గొంబె' అని కూడా అంటారని, కేరళలో 'తోల్ పవకూత్తు' అని, ఒరిస్సాలో 'రవన్ ఛాయ' అని పిలుస్తున్నారని తెలుస్తున్నది.[2] ఉత్తర భారతదేశంలో ప్రచారంలో ఉన్న 'కట్ పుత్లీ'కి, తోలు బొమ్మలాటకు సామ్యం ఉన్నదని, జావా మొదలైన ప్రాచ్య దేశాలకు కూడ తోలుబొమ్మలాటలు వ్యాపించాయని పరిశోధకులు భావిస్తున్నారు.

బుడిగె జంగాలు ప్రధానంగా తందానా కథలు చెప్పినప్పటికి అనేకమైన వృత్తులను అవలంబించటం పరిపాటి. తందానా కథల వృత్తిలో ఉంటూనే వీలును బట్టి కొందరు పగటి వేషాలు ప్రదర్శిస్తుంటారు. మరి కొందరు భాగోతాలను ప్రదర్శిస్తుంటారు. అలాకాకుండ బుడిగె జంగాల్లో 'నిదానకవి' అనే ఇంటిపేరున్న వాళ్లు కేవలం తోలుబొమ్మలాటలు ప్రదర్శించటానికే పరిమితమయిపోయారు. నిదాన కవి వాళ్ళతోపాటు పర్తం, వాండ్రానీ, చిత్తారి యదవల్లి, కొండపల్లి, కొమారి, పొన్నకంటి ఇంటిపేర్లవారుకూడ తోలుబొమ్మలాటలు ప్రదర్శిస్తుంటారు.

తొలి రోజుల్లో బుడిగె జంగాలు తోలుబొమ్మలను ఆరె బొప్పల వాళ్ళ దగ్గర కొనుక్కునేవారు. కొందరు 'నక్కాష్' వారి (శిల్పి పనివారు) చేత చేయించుకునేవారు. తర్వాతి రోజుల్లో వాళ్లే తయారు చేయటం నేర్చుకున్నారు. అంతేకాకుండ ఆరెవాళ్ళ బొమ్మలకంటే బుడిగె జంగాల బొమ్మలు విలక్షణమైనవి. ఆరె బొమ్మలు పార్శ్వముఖంగా ఉండే ఒక్క కంటి బొమ్మలు. బుడిగె జంగాలు తయారు చేసినవి రెండు కళ్ళుండి, ముఖం ఎదురుగా కనిపించే బొమ్మలు.

---

1. జానపద సాహిత్యం - పుట 212.
2. ఆంధ్రజ్యోతి - దినపత్రిక - వ్యాసం - 8.7.91.

తోలు బొమ్మలు తయారు చేటానికి గొర్రెతోలు, మేకతోలు వాడుతారు. పురుష బొమ్మలకు మేకతోలు. స్త్రీ బొమ్మలకు గొర్రెతోలు ఉపయోగిస్తారు. మేకతోలు కన్నా గొర్రెతోలు మెత్తగా ఉండటం వల్ల స్త్రీ బొమ్మలు తయారు చేయటానికి వాడుతామని హైదరాబాదు నగరంలోని మాదన్నపేట నివాసి, తోలుబొమ్మల ఆటగాడు నిదానకవి వెంకటేశం చెప్పారు. స్త్రీ బొమ్మతో నాట్య భంగిమలు ప్రదర్శింపవలసి ఉంటుంది. కాబట్టి మెత్తని తోలైతే అన్ని వైపులా ఒదుగుతుందని స్త్రీ బొమ్మలకు గొర్రెతోలు ఉపయోగిస్తామని చెప్పారు. పూర్వం జింకతోలు వాడేవారని, తమవద్ద ఉన్న బొమ్మల్లో ఒక జింకతోలు బొమ్మ కూడ ఉండేదని, జింకతోలు చాలా మందంగా ఉంటుందని, అందువల్ల రాను రాను ఆ తోలుతో బొమ్మలు చేయటం తగ్గిందని, అంతేకాక ఆ తోలు దొరకటం కష్టమని ఆయన చెప్పారు.

పద్మశాలీలు వాడే పక్కా రంగులను జిగురు (బంక) పాకంలో మర్దించి తోలు బొమ్మలకు వేసి నీడలో ఆరబెడతారు. బొమ్మకు వేసిన రంగులతోపాటు నగిషీగా చెక్కిన రంధ్రాలు తెరమీద వెలుగుతో అద్భుతమైన ఆభరణాలుగా భాసిస్తాయి.

తోలుబొమ్మల్లో రెండురకాలు ఉంటాయి. 1. జవబొమ్మలు, 2. ఏకాండం బొమ్మలు. జవబొమ్మలు అంటే వాటి తలలుమార్చి ఏ కథలోని ఏ పాత్రకైనా ఉపయోగించుకోవచ్చు. ఏకాండం బొమ్మలు అలా ఉపయోగించుకోవటానికి వీలు కానివి. ఏ బొమ్మకు ఆ బొమ్మే ప్రత్యేకమైనవి. ఉదాహరణకు రావణుడు, ఆంజనేయుడు, రాక్షసుడు, బ్రహ్మ మొదలైన బొమ్మలు ఇతర పాత్రలకు వాడుకోవటానికి వీలుండదు.

తోలుబొమ్మలాట బృందంలో ఐదుగురినుంచి పది మందిదాకా ఉంటారు. ఎక్కువ మంది ఉంటే తెర లోపల తిరగటానికి, బొమ్మలు మళ్ళేయటానికి స్థలం సరిపోదు. ఇద్దరు వ్యక్తులు తెరమీద బొమ్మలను ఆడిస్తూ, పాడుతూ, సంభాషణలు చెబుతూ నడిపించటానికి అవసరం. సమయానికి కావలసిన బొమ్మ సిద్ధంగా పెట్టుకొని అందించటానికి ఒకరు కావాలి. ఒకరు హార్మోనియం, ఒకరు

మృదంగం, ఒకరిద్దరు తాళాలు వాయించటానికి ఉండాలి తోలు బొమ్మలాటలో తెరమీద బొమ్మలు వేసే ఇద్దరూ సూత్రధారులే. వాద్యకారులు ఒక వైపు వాయిస్తూనే వంత పాడుతారు. ఆరె బొప్పల వాళ్ళలో స్త్రీలు స్త్రీ పాత్రలను ఆడించగా. పురుషులు పురుష పాత్రలను నడుపుతారు. బుడిగె జంగాలలో పురుషులే కథ నడిపిస్తారు.

పూర్వకాలంలో గ్రామాధికారి ఆదేశంతో చాకలివారు తెరవస్త్రాలను సమకూర్చేవారు. ఇటీవలి కాలంలో 'మేళం' వారె తెరగుడ్డలను సమకూర్చుకో వలసి వచ్చింది. తెర కట్టేటప్పుడు గుడ్డలను పలక జెమ్మడి ముళ్ళతో కుట్టేవారు. ఈ ముళ్ళు గట్టిగా. నునుపుగా ఉండి రెండు సంవత్సరాల దాకా మన్నుతాయట. ఈ ముళ్ళకు బదులుగా కొందరు ఈతముళ్ళను, తుమ్మముళ్ళను కూడ ఉపయో గిస్తారు.

తెలంగాణాలో బుడిగె జంగాలు ప్రదర్శించే తోలు బొమ్మలాటల్లో ఉత్తర గోగ్రహణం, దక్షిణ గోగ్రహణం, కీచక వధ, ద్రౌపది స్వయంవరం, బకాసుర వధ, ద్రౌపది వస్త్రాపహరణం, సుందరకాండ, అరణ్యకాండ, అంగద రాయ బారం, ఇంద్రజిత్తు, కుంభకర్ణ, రావణయుద్ధం, మైరావణ, కుమారస్వామి విజయం మొదలయినవి ముఖ్యమైనవి. తెలుగు దేశమంతటా దాదాపు పైన పేర్కొన్నవాటినే తోలుబొమ్మలాటవారు ప్రదర్శిస్తారు. కర్నాటకలోని కొన్ని ప్రాంతాల్లో రామాయణ భారత కథలతో పాటు శివజలంధర, దేవీ స్వయంవరం మొదలైనవాటిని ఆడుతారని తెలుస్తున్నది.[1]

తోలు బొమ్మలాటలకు ప్రత్యేకమైన సాహిత్యం లేదు. యక్షగానాలే వీరు ఉపయోగిస్తారు. ఎల్లదాసు రచించిన కూచకొండ రామాయణం - సుందర కాండం, వేములపల్లి విరాటపర్వం, అర్రూరు, ఇటుకలూరి పేట మీది యక్షగాలను తోలుబొమ్మలాటలుగా ప్రదర్శిస్తారు 'చిత్రారి' ఇంటి పేరుగా ఉన్న బుడిగె జంగాలు రంగనాథ రామాయణాన్ని ప్రదర్శిస్తారు.

కొందరు కవులు బొమ్మలాట కోసం ప్రత్యేంగా రచనలు చేసిన సందర్భాలు కూడ ఉన్నట్లు తెలుస్తున్నది. 1850 ప్రాంతాల్లో గంజాం జిల్లా గుజ్జువాడ నివాసి మరింగంటి భట్టరు రామానుజాచార్యుల "శ్రీరామ నాటకం", 1893 లో పర్లాకిమిడి దగ్గరలో ఉన్న పాతపట్నం నివాసి కోట వెంకటప్పయ్య శాస్త్రి 'బాణాసుర' మొదలైనవి ఈ కోవకు చెందినవి.[2]

---

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుట - 483.
2. ,, ,, ,, - పుట - 480.

తోలుబొమ్మలాట సరస్వతి ప్రార్థనతో ప్రారంభమవుతుంది. తర్వాత విఘ్నేశ్వరుని స్తుతి. పిదప సూత్రధారుడు బొమ్మలాట ఆడించే దాత వివరాలు, ఆ రోజు ఆడే ఆట వివరాలు చెప్పి, ఆటను మొదలుపెడతాడు. కేతిగాడు లేక జుట్టు పోలిగాడు, గందోళిగాడు, బంగారక్క అనే హాస్యపాత్రలు తోలుబొమ్మలాటకు ప్రత్యేకమయినవి. మధ్యమధ్య సందర్భానుసారంగా ఈ పాత్రలను ప్రవేశపెట్టి ప్రేక్షకులను కడుపుబ్బ నవ్విస్తుంటారు.

తోలుబొమ్మలాటల్లో ఎక్కువగా విరాటపర్వం, రావణ వధ ఆడిస్తుంటారు. విరాట పర్వం ప్రదర్శిస్తే వానలు కురుస్తాయని, రావణ వధ ఆడితే ఊరికీడు తొలగుతుందని ప్రజలు విశ్వసిస్తారు.

తోలుబొమ్మలాటల వారికి పూర్వకాలంలో మాన్యాలను ఇచ్చినట్లు శాసనాల వల్ల తెలుస్తున్నది. కాకతీయుల కాలంనాటి వరంగల్లు జిల్లా గూడూరు శాసనంలో కొమ్మోజు, బ్రమ్మోజు అనే వారికి మాన్యం ఇచ్చినట్లు పేర్కొనబడింది.[1] కడప జిల్లాలోని కమలాపురం తాలూకా చిడిపిరాల గ్రామాన్ని 'బొమ్మలాట రయితు' అనబడే చంద్రయ్య, బొమ్మలాట అమృతకవి అనే ఇరువురు పెద్ద చిట్టెయ్య అనేవానికి, తెరనాటకాలాడటానికి ఇచ్చారట. బొమ్మలాట విరూపాక్షుని కుమారుడు కాలుడు కృష్ణరాయలను, అచ్యుతరాయలను కొలిచి, వారి ఆదరణకు పాత్రుడయినట్లు తెలుస్తున్నది. బళ్ళారి జిల్లాలోని 'బొమ్మలాటపల్లి' కూడ బొమ్మలాట వారు సంభావనగా సంపాదించిందే అయి ఉంటుంది.[2] నాగర్‌కర్నూల్ సమీపంలోని చాకలిపల్లిలో తమ తాతలైన గగనం లక్ష్మయ్య, గగనం సోమలింగం గార్లకు తోలుబొమ్మలాటలాడినందుకు రాకాని వెంకటరామారెడ్డి అనే భూస్వామి 12 ఎకరాల కుష్కి, 5 ఎకరాల తరి పొలం మాన్యంగా ఇచ్చాడని, దాన్ని 'బొప్పలోళ్ళ మాన్యం' అంటారని మహబూబ్‌నగర్ జిల్లా, జడ్చర్ల నివాసి గగనం నర్సిమ్మ అనే బుడిగె జంగం చెప్పాడు. తమ జీవిత చరిత్రలో పైడి లక్ష్మయ్యగారు తోలుబొమ్మలాటలను వివరిస్తూ 'దోణప్ప అనే ఆయన దురదకుంట గ్రామం (అనంతపురం జిల్లా)లో బొమ్మలాటవారికి కొంత భూమిని ఇనాముగా ఇచ్చాడని, 'కేతిగాని ఇనాము (మాన్యం)' అనే పేర ఈ నాటికి ఆ ఇనాము భూమి ఉందని' తెలిపారు.[3] గత 50 సంవత్సరాల వరకు ఇలాంటి ఉదాహరణలు అనేకం కనిపిస్తాయి.

---

1. ఆంధ్ర నాటక రంగ చరిత్ర - పుట - 186.
2. తెలుగు నాటక వికాసము - పుట - 147.
3. జ్ఞాపకాలు - వ్యాపకాలు - పుట - 42.

ఈ రోజుల్లో తోలుబొమ్మలాటలు తగ్గిపోయాయి. చాలామంది బుక్తిగడువక బొమ్మల పెట్టెలను అంతకో ఇంతకో అమ్మేసుకున్నారు 100 బొమ్మలున్న తమ పెట్టెను నల్లగొండ జిల్లాలో సంచరించే 'పర్తం' ఇంటిపేరు గల బుడిగె జంగాలకు అమ్మినామని నిదానకవి వెంకటేశం చెప్పారు. ఇప్పుడు తాము కూలినాలి చేసుకుంటున్నట్లు, కొందరు పాతబట్టల వ్యాపారం చేస్తున్నట్లు ఆయన చెప్పారు. రంగారెడ్డిజిల్లా పర్తపురం నివాసి పర్తం తిరుపతయ్య దగ్గర ఇప్పటికీ తోలుబొమ్మల పెట్టె ఉన్నది. ఆ వృత్తిమాని చాలారోజులయిందని, తన కుమారులు ప్రభుత్వ ఉద్యోగాలు చేస్తున్నారని ఆయన చెప్పారు

నెల్లూరు జిల్లాలోని ఆత్మకూరులో 9 కుటుంబాలవారు ఉంటున్నారు. మేళం పెద్ద కొమారిరాజారావు (65 సం॥) వీరు లంకాదహనం, ఇంద్రజిత్ యుద్ధం, మైరావణ, పారిజాతాపహరణం మొదలయినవి ప్రదర్శిస్తారు. ఈనాడు ఆదరణ కరువైనందువల్ల కూలిపని చేసుకొని పొట్టపోసుకొవలసిన దుస్థితి ఏర్పడినట్లు ఆయన చెప్పారు.[1]

అన్ని కళలలాగానే ఈ కళను కూడ బుడిగె జంగాలు ఇతరుల (ఆరెవాళ్ళ) నుంచి నేర్చుకొని, ప్రదర్శించటంలో తమ ప్రత్యేకతను నిలుపుకున్నారు. దాదాపు 300 సంవత్సరాలకు పైగా తోలుబొమ్మలాటలను ప్రదర్శిస్తూ, గ్రామీణులను అలరిస్తూ, తమ జీవనోపాధిగా ఈ కళా ప్రక్రియను కొనసాగిస్తూ వస్తున్నారు.

## 3. వీధి భాగోతాలు :

వీధి భాగోతాలన్నా, వీధి నాటకాలన్నా, యక్షగానాలన్నా, బయలాటలన్నా ఈనాడు సమానార్థకాలే. ఇతివృత్తాన్ననుసరించి భాగవతమని, ప్రక్రియా దృష్టితో వీధి నాటకమని వ్యవహార నామాలు ఏర్పడ్డాయి. పూర్వం భాగవత కథాంశాలు ప్రదర్శించేవారే భాగవతులు. వారి ప్రదర్శనలు భాగవతాలు. 'భాగవతాలు' అనేమాట 'భాగోతాలు' అయింది. నాటకక్రమాన్ని అనుసరించి వీధిలో జరిగే ప్రదర్శన కాబట్టి వీధి నాటకమన్నారు. ఆరు బయట, బహిరంగ ప్రదేశంలో జరిగే ఆట అయినందువల్ల 'బయలాట' అన్నారు. ఈనాడు భాగవత ప్రక్రియతో యక్షగానం అభేదం పొందినప్పటికీ, భాగవతానికి మూలం యక్షగానమే.

---

1. నెల్లూరు మూలాపేటలో ముఖాముఖి - 11.5.90.

పొరుగు రాష్ట్రాల్లో కూడ ఈ కళా ప్రక్రియ కనిపిస్తున్నది. కన్నడ ప్రాంతంలో 'బయలాటం' అనే పేరుతో, తమిళ ప్రాంతంలో 'తెరుకూత్తు' అనే పేరుతో వీథి భాగోతాలు ప్రదర్శింపబడుతున్నాయి.



సురవరం ప్రతాపరెడ్డిగారు రెడ్డి రాజుల కాలంనాటి ఒక చాటువును ప్రస్తావించారు. శ్రీనాథునిదో లేక సమకాలికునిదో అయిన ఆ చాటువులో భాగోతాల గురించి ఉంది. 'భాగోతుల బుచ్చిగాడు' అచ్చపు స్త్రీలాగే స్త్రీ వేషం వేసి ఆకర్షణీయంగా ఆడుతుండేవాడని, పాడుతుండేవాడని, 'పెండెల నాగి' అనే స్త్రీ

అలాంటిదేనని, తక్కువజాతి స్త్రీలయిన 'నాగి', 'గంగి' వంటివారు కూడ స్త్రీ పాత్రలను అభినయించేవారని వివరించారు.[1] దీన్నిబట్టి బ్రాహ్మణేతరులు భాగోతాలాడటం రెడ్డి రాజులకాలానికి ముందునుంచే ఉందని తెలుస్తున్నది. చిందుల, ఆసాది భాగోతుల్లో ఇప్పటికీ ఈ పద్ధతి ఆచరణలో ఉంది. ఈ కులాల్లో స్త్రీ పాత్రలను స్త్రీలే ధరిస్తారు. బుడిగె జంగాలు, దాసర్లు, గొల్ల భాగోతుల్లో మాత్రం స్త్రీ పాత్రలను పురుషులే ధరిస్తారు. ఇలా స్త్రీ పాత్రలను పురుషులు ధరించటం వల్ల, ఆ వేషం వేయటం ఒకరోజుకే పరిమితమైపోయిన సందర్భాలవల్ల 'ఒక్కనాటి భాగోతానికి మూతి మీసాలు కొరిగించుకున్నట్లు' అనే సామెత ఏర్పడింది.

17వ శతాబ్దానికి చెందిన చంద్రశేఖర శతకంలో భాగోతుల గురించి వర్ణించబడింది.

ఉ॥ రాతిరి సూస్తి యేసములు రమ్మెముగా గురులాన మొన్న భా
గోతుల సత్తెబామ యనగూడని తాపములెల్ల సేసె మా
పాతకురాలు రాద వలపచ్చము రుక్మిణి సుద్ది కిష్ట మం
టీ తెరుగానదంచు వచియించును మూర్ఖుడు చంద్రశేఖరా!

యక్షగానాలను వీధి నాటకాలుగా మలిచింది కూచిపూడి బ్రాహ్మణులు. వీరితోపాటు వీటిని ప్రదర్శించటంతో మేలటూరి భాగవతులదే పెట్టింది పేరు.

బ్రాహ్మణేతరుల్లో ఈ కళను నేర్చుకొని ప్రదర్శించనవారిలో బుడిగె జంగాలు, దాసర్లు, చెంచులు, యానాదులు, ఎర్రగొల్లలు, చిందులు, మాస్టీలు మొదలయిన కులాలవారు ముఖ్యులు.

తెలంగాణాలో ఆరె భాష మాట్లాడే గోందళీలు కూడ వీధి భాగోతాలాడుతుంటారు. వీరి భాగోతాలు ఆరె వాళ్ళ దగ్గర ప్రదర్శించినా, తెలుగు వాళ్ళు కూడ చూసి ఆనందిస్తారు.[2]

---

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - పుట - 168.
2. 'ఆరె జానపద సాహిత్యం'లో 'గోంధళే వీధి భాగోతాలు' - పుట - 195.

రాయలసీమలోని కల్యాణదుర్గం, మడకసిర, ధర్మవరం, ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాల్లో, బళ్ళారి జిల్లాలోని తాలూకాల్లో 'కప్పగల్లు ఆసాది వారు' అనే కులం వారు 'జల్రక్రీడ', లేక 'కంసాసుర వధ' మొదలయిన వీధి భాగోతాలను కన్నడ భాషలో ప్రదర్శించేవారని తెలుస్తున్నది.[1]

బుడిగె జంగాలలో తోలు బొమ్మలాట మేళాలకన్నా, భాగోతం మేళాలు ఎక్కువ. బ్రాహ్మణేతర భాగోతుల్లో మిగతా కులాలవారికంటే బుడిగ జంగాలే భాగోతాలను ఎక్కువగా ప్రదర్శిస్తారు. తెలంగాణాలోని ప్రతి జిల్లాలో వీరి బృందాలు ఒక్క వర్షాకాలంలో తప్ప, సంవత్సరమంతా ఆటలాడటంలో మునిగి ఉంటాయి.

బుడిగె జంగాల భాగోతాలు రెండు రకాలు 1. యక్షగాన రచనలను భాగోతాలుగా ప్రదర్శించటం. 2 తందానా కథలను భాగోతాలుగా ప్రదర్శిం చటం.

పూర్వకాలం నుంచి కవులు రచించిన యక్షగానాలను అభ్యసించి, వీధి భాగోతాలుగా ప్రదర్శించటం వీళ్ళలో అనూచానంగా వస్తున్నది. వీరు ప్రదర్శించే యక్షగానాలలో బెడుదూరు హరిశ్చంద్ర, పురుషోత్తమ దాసు రచించిన ప్యారా వారపురం మైరావణ చరిత్ర, మద్దాం కాశీపతియాచార్యుని సికిందరాబాదు శత కంఠ రామాయణం, వెంకట దాసుని వెంకటరావు పురం చిరుతొండ నాటకం, కోటపురి ధర్మాంగద చరిత్ర, వేములపల్లి విరాటపర్వం, వేములపల్లి గరుడా చలం, చుక్కలూరు రామనాటకం మొదలయినవి ఉన్నాయి. ఇవేకాకుండ చంద్రహాస, ప్రహ్లాద చరిత్ర, ప్రభావతీ విలాసం, సుగ్రీవ విజయం, శంబరాసుర వధ, బాణాసుర, రామదాసు మున్నగు యక్షగానాలతో పాటు చెర్విరాల బాగయ్య గారు రచించిన అనేక యక్షగానాలను వీరు ప్రదర్శిస్తారు. ఒకే కథను ఎక్కువ మంది కవులు వ్రాసినప్పుడు, తమకు అనుకూలమైన యక్షగానాన్ని వీరు ఎన్ను కుంటారు. ఒక ఆట ఆడుతున్నప్పుడు ఆయా సందర్భాల్లో తమకు నచ్చిన మరొక కవి దరువులను కూడ వీరు మధ్య మధ్య పాడుతుంటారు.

---

1. జ్ఞాపకాలు - వ్యాపకాలు పుట - 43.

యక్షగానాలను అభ్యసించి, ప్రదర్శించటం కంటే తమకు కంఠపాఠంగా ఉన్న తందానా కథలను భాగోతాలుగా ఆడటం సులువు. కాబట్టి పది, పదిహేను సంవత్సరాలనుంచి బుడిగె జంగాలు తందానా కథలను భాగోతాలుగా ప్రదర్శిస్తు న్నారు. కేవలం బుడిగె (డింకి), తాంబూరాలతో ఇద్దరు ముగ్గురు కలిసి కథలు చెప్పటం కన్న, వేషాలు కట్టి, భాగోతం పక్కీలో ప్రదర్శించటం జనరంజకంగా ఉంటుందనే ఆలోచనతో వీరు ఈ ప్రక్రియను చేపట్టారని చెప్పుకోవచ్చు. వీరు చెప్పే తందానా కథలన్నీ ఈ విధంగా వీధి భాగోతాలుగా మార్చి, ప్రక్రియలో విలక్షణాన్ని తీసుకువచ్చారు.

వీధి భాగోతాల్లో మొదట సరస్వతీస్తుతి కాగానే, వినాయకుని ప్రార్థన చేస్తారు. తర్వాత బాలకృష్ణుడు, ఆ తర్వాత రంభవేషాలు వస్తాయి. కవులు వ్రాసిన యక్షగానాల్లో ఈ పాత్రలు ఉండవు. అయినా మొదట ఈ వేషాలను ప్రవేశపెట్టటం వీరి సంప్రదాయం. బాలకృష్ణుని వేషం పిల్లలకు శిక్షణలాంటిది. బాల్యంనుంచే ప్రదర్శనకు అవసరమైన అవగాహనను, యోగ్యతను కలిగించటా నికి పిల్లలచేత ఈ వేషం వేయిస్తారు. బాలకృష్ణుని వేషం నేర్చుకున్న తర్వాత వేసేది రంభవేషం. రంభవేషంలో రాణించినట్లయితే అతనికి భవిష్యత్తులో నాయకి వేషం లభిస్తుంది. నాయకి వేషాన్ని 'మేటి' వేషమంటారు. ఆ వేషం వేసేవాణ్ణి 'మేటి వేషగాడు' అని అంటారు. నాయకుని వేషగానికన్నా నాయకి వేషగానికి ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. కోమలమైన స్వరం, లలితమైన ముఖం, హావభావ విన్యాసానుకూలమైన శరీరం ఉన్నవానికి నాయకి వేషం ఒప్పుతుంది.

రంభవేషం నిష్క్రమించిన తర్వాత ముఖ్యపాత్రల ప్రవేశంతో కథ ప్రారంభమవుతుంది. సూత్రధారుడు పాత్రలను సభకు పరిచయం చేయటమే కాకుండ, సందర్భానుసారంగా హాస్యం చేస్తూ, ప్రేక్షకులను నవ్విస్తూ, ప్రదర్శ ననురక్తి కట్టిస్తాడు. చివరన మంగళహారతితో భాగోతం సమాప్తమవుతుంది.

వీధి భాగోత కళాకారుల ఆహార్యం, ఆటపాటల గురించి పూర్వ పరిశోధ కులు వివరించటంవలన వాటిని నేను మళ్ళీ ప్రస్తావించటం లేదు.[1]

---

1. (i) ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుటలు. 496 - 506.
(ii) జానపద భిక్షుక గాయకులు (అముద్రితం) - పుటలు 137 - 160.

పూర్వకాలంలో ఊళ్ళో ఉన్న పటేండ్లు. పట్వారీలు, పెద్దకాపులు మొదలయినవారు సంభావనలిచ్చి భాగోతాలు ఆడించేవారు. భాగోతం ప్రదర్శనానికి కావలసిన ఏర్పాట్లు చూడవలసిందిగా చాకలి, మంగలివారిని ఆదేశించేవారు. ఏర్పాట్లలో లోటుపాట్లేమయినా జరిగితే వీళ్ళకు తిట్లు తప్పేవికావు. ఈ నేపథ్యం లోనే 'పైకం భాగోతం వారికి, తిట్లు చాకలి మంగలివారికి' అనే సామెత ఏర్పడింది. ఒక దశాబ్దం నుంచి పద్ధతి మారింది. పూర్వంలాగ భాగోతాలు ఆడించే వాళ్ళు కరువయ్యారు. మేళంవాళ్ళే టికెట్లు పెట్టుకొని భాగోతాలాడుతున్నారు. భాగోతాలాడటంవల్ల గిట్టుబాటు కానందున, కూలినాలి చేసుకోవటానికి, ఇతర వృత్తులకు అలవాటుపడుతున్నారు.

బుడిగె జంగాలు అనేక కళలను ప్రదర్శిస్తున్నప్పటికీ వీళ్ళలో ఎక్కువ మంది పదర్శించేవి భాగోతాలే. ఒక్క తాలూకాలోనే ఎన్నో బృందాలు కనిపిస్తాయి. కోస్తాంధ్ర బుడిగె జంగాల్లో పగటి వేష ప్రదర్శనం ఎక్కువ. అలాగే తెలంగాణా బుడిగె జంగాల్లో భాగోత ప్రదర్శనలు ఎక్కువ. భాగోతాలు ఆడే కులాల వాళ్ళెందరో ఉన్నా, బుడిగె జంగాలు భాగోత ప్రదర్శనల్లో కూడ బాగా రాణించి ప్రజలమెప్పుపొందుతూ బ్రతుకుతెరువు సాగిస్తున్నారు.

### వీధి భాగోత కళాకారిణి - ఆజన్మ బ్రహ్మచారిణి మగ దుస్తులు వేసుకునే మంగశెట్టి

తెల్లని పంచె కట్టుకొని, చొక్కా, చొక్కామీదినుంచి కోటు తొడుక్కొని, ఎర్రని తలపాగా తలకు చుట్టుకొని, కళ్ళకు అద్దాలు పెట్టుకొని, చేతిలో కర్ర పట్టుకున్న 70 ఏళ్ళ ఆ వ్యక్తిని చూస్తే, స్త్రీ అని ఎవరూ పోల్చుకోలేరు. పురుషుడే అనుకుంటారు. ఆమె ఆజన్మాంతంవరకూ మగ దుస్తుల్లోనే జీవనం సాగిస్తున్నది - పేరు మంగశెట్టి.

సమాజంలో పెళ్ళి చేసుకోకుండా బ్రహ్మచారులుగానే జీవితం గడిపేవారు అక్కడక్కడ కనిపిస్తుంటారు. ఈ విషయంలో పురుషులకంటే స్త్రీలది తక్కువ సంఖ్యనేమో అనిపిస్తుంది. తక్కువ కులాల వారిలో, సంచార జాతుల్లో ఇలా బ్రహ్మచారులుగా ఉండేవాళ్ళు అరుదు. అందులో స్త్రీలు బ్రహ్మచారిణులుగా ఉండటం అనేది అసలు కనిపించదు. ఈనాడు స్త్రీ-పురుష భేదంలేకుండా యువతీ

యువకులు దుస్తులు ధరించటం నగరాల్లో, పట్టణాల్లో కనిపిస్తూంటుంది. ఒక స్త్రీ పెళ్ళి చేసుకోకుండా బ్రహ్మచారిణిగా ఉంటూ - జీవితాంతం మగదుస్తులు వేసుకోవటం అపూర్వం, అపురూపం. ఇలాంటి అపురూపమైన వ్యక్తి మంగశెట్టి. మహబూబ్‌నగర్ జిల్లాలోని కల్వకుర్తి సమీపంలో ఉన్న మసిగుంట్ల పల్లె ఈమె నివాసం. ఈమె మంచి వీధి భాగోత కళాకారిణి. తండ్రి పేరు డొక్కా రామేశం. ఇతడు వీధి భాగోతాలు ప్రదర్శించటంలో దిట్ట. ఈయనకు ఇద్దరు కొడుకులతో పాటు ముగ్గురు కూతుళ్ళు కలిగారు. అందులో ముద్దుల చిన్న కూతురు మంగశెట్టి.

త్రవ్వకొని వండకుండా అలాగే తినే గడ్డల్లో అన్నింటికంటే రుచికరమైన చిన్నగడ్డ జోగలగడ్డ. తల్లి ఈమెను ముద్దుచేసి, పిలిచేటప్పుడు జోగల గడ్డతో పోల్చి ఈ కింది పదం పాడేదట:

జోడు జోడు జొన్నగింజ
కడమ జోడు కందిగింజ
ఆరె చెట్టు కింద అరవై జోగళ్ళు
అడ్డాము రావోయ్ నా బుడ్డ జోగల.

ఈమె పుట్టుపేరు మంగమ్మ. ఈమెకు పదేళ్ళ ఈడు వచ్చాక తండ్రి చదువనూ వ్రాయనూ నేర్పి, యక్షగానాలను కంఠతా పట్టించాడు. తండ్రి, అన్నదమ్ములు ప్రదర్శించే భాగోతాల్లో మంగమ్మ తొలిరోజుల్లో బాలకృష్ణుని వేషం, ఆ తర్వాత రంభ వేషం కట్టేది. చిందుల భాగోతాల్లో స్త్రీలు కూడా వేషధారణ చేస్తారు. ఆడవేషాలే కాకుండ మగవేషాలను కూడ కడతారు. బుడిగె జంగాల్లో స్త్రీలు వేషాలు వేయరు.ఆడ-మగ వేషాలను పురుషులే వేస్తారు. కాని, మంగమ్మ విషయం ప్రత్యేకమైంది. అప్పటికీ ఇప్పటికీ బుడిగె జంగాల కులంలో మాత్రం వేషం కట్టిన స్త్రీ మంగమ్మ ఒక్కతే. మంగమ్మకు చిన్నప్పటినుంచి భాగోత ప్రదర్శనలంటే మక్కువ ఎక్కువ. యక్షగానాలన్నీ ఆమెకు కంఠస్థంగా ఉండేవి. ఏ యక్షగానంలో ఏ పాట, ఏ పద్యం కావాలన్నా ఆమె టక్కున అందించేది. ఈ విషయంలో కొడుకులకన్నా ఆమె మిన్నగా ఉండేది. అందువల్ల వేషం కడతానంటే తండ్రి కాదనలేకపోయాడు.ఆమె కంఠం శ్రావ్యంగా ఉండటం వల్ల, భాగోతాలన్నీ కరతలామలకం అవటంవల్ల ఆమె మెల్లమెల్లగా రంభ

వేషంనుంచి నాయకి వేషం కట్టటం ప్రారంభించింది. పూర్తిగా కళలో లీనమై పోయింది.

ఆ రోజుల్లోనే ఆమె మనసు మార్చుకొని పెళ్ళి మానేసింది. ఒక స్త్రీగా ఈ కళను ఆరాధిస్తూ పురుషులను తలదన్నే కళాకారిణిగా జీవించాలని సంకల్పించింది. చీర, రవికకు బదులు మగ దుస్తులను కట్టటం ప్రారంభించి, 'శెట్టప్ప'గా రూపుదాల్చింది. ఆమె పట్టుదలను ఎవరూ సడలించలేకపోయారు. 'శెట్టప్ప' లేక 'మంగశెట్టి' అని అందరూ పిలువసాగారు. మగవాడిగానే ఆమెను సంభావించి, అన్నా, తమ్మీ, కొడుకా మొదలైన మగవరుసలతో సంబోధించేవారు.

భాగోతాలు ప్రదర్శించటంలో మంగశెట్టిది పెట్టింది పేరు. మంగశెట్టి వేషం కడుతుందంటే చుట్టుపట్ల ఉన్న గ్రామ ప్రజలు గుంపులు గుంపులుగా చూడవచ్చేవారు. మంగశెట్టి మగ దుస్తుల్లో జీవించటాన్ని ఆమె దీక్షను ఆ ప్రాంతాల్లో ఉన్న గ్రామీణులు జీతగాడు మొదలుకొని దొరవారివరకు చిన్నా పెద్దలందరూ గౌరవించేవారు. రోజంతా మగ దుస్తుల్లో ఉండే మంగశెట్టి భాగోతాల్లో స్త్రీ వేషాలు ధరించేది. ఆమెను స్త్రీ వేషంలో చూడాలని ప్రజలు కుతూహలపడేవారు. ఆమెను చూసి అన్ని కులాల స్త్రీలు గర్వపడేవారు. దీక్షను అభినందించేవారు.

గరుడాచలం ప్రదర్శిస్తే, మంగశెట్టి చెంచిత వేషం వేసేది. చంద్రహాసలో విషయ, దేవయానిలో దేవయాని, రుక్మిణీ కళ్యాణంలో రుక్మిణి, బాణాసురలో ఉష, భస్మాసురలో మోహిని మొదలైన వేషాలు ఈమెకు మంచి పేరు తెచ్చి పెట్టాయి. నాయకి వేషమే కాకుండా ఆ తర్వాత కాలంలో అవసరం వచ్చినపుడు నాయకుని వేషాలు కూడ ఆమె ధరించేది. గత పది సంవత్సరాల నుంచి ఆమె వేషాలు వేయటం లేదు. వృద్ధాప్యం ఆవరించింది. శక్తి చాలటం లేదు.

'అందరి స్త్రీలలాగా పెళ్ళి చేసుకొని పిల్లా పాపలతో జీవించక బ్రహ్మచారిణిగా ఉండిపోవటానికి కారణాలేమిటి?' అని ప్రశ్నించినపుడు ఆమె 'చిన్నప్పటినుంచి నాకు భాగోతకళమీద గాఢమైన ఆసక్తి కలగటంవల్ల, నా వేషాన్ని చూసి ప్రజలు ముగ్ధులై ఆదరాభిమానాలను వర్షించటంవల్ల పెళ్ళి కంటె కూడ నాకు ఈ కళమీదనే దృష్టి మళ్ళింది. అంతవరకు మా కులంలో మగవాళ్ళే

ప్రదర్శించే వేషాన్ని కట్టి ఒప్పించటమే కాకుండ నేను కూడ మగవాడి దుస్తుల్లోనే జీవించాలని పట్టుదల వచ్చింది. ఎవ్వరేమనుకున్నా లెక్కచేయకుండా ధైర్యంగా నేననుకున్న బాటలో నడిచాను. నా అన్నదమ్ముల పిల్లలను, అక్కలపిల్లలను నా పిల్లలనుకున్నాను. వాళ్ళుకూడ భాగోతాలు ప్రదర్శించి పేరు తెచ్చుకున్నారు" అని మంగశెట్టి తెలిపింది. బుడిగె జంగాల భాగోత కళా ప్రదర్శనల్లో ఒక చరిత్ర సృష్టించింది.

## 4. పగటి వేషాలు :

బుడిగె జంగాలు ప్రదర్శించే జానపద కళల్లో పగటివేషాల సంప్రదాయ మొకటి. పగటివేషగాళ్ళనే బహురూపులవాళ్ళు అంటారు. పగటిపూట వేషాలు ధరించి తమ కళానైపుణ్యాన్ని ప్రజలముందు ప్రదర్శిస్తారు కాబట్టి వీళ్ళకు 'పగటివేషగాళ్ళు' అని పేరొచ్చింది. ఒకే వ్యక్తి ఆయా సందర్భాల్లో అనేక వేషాలను ప్రదర్శించటం వల్ల 'బహురూపి' అనే పేరు స్థిరపడించి. ఈనాడు 'బహురూపులవాళ్ళు' లేక 'బైరూపుళోళ్ళు,' 'పగటివేషగాళ్ళు' అనే పేర్లు పర్యాయపదాలుగా వ్యవహారంలో ఉన్నాయి. ఆంధ్రప్రదేశంలోని అన్ని జిల్లాల్లో వీళ్ళు కనిపిస్తారు. జానపద కళల్లో విశేషంగా జనాదరణ పొందిన ఈ పగటి వేషాల ప్రక్రియ పొరుగు రాష్ట్రాల్లో కూడ తన ఉనికిని నిలుపుకుంది. కర్నాటక ప్రాంతంలో 'బహురూపి' లేక 'హగలు వేషద ఆట' అని, తమిళనాడు ప్రాంతంలో 'పగల్ వేషం' అని ప్రాచుర్యం పొందింది. బహురూపియా పేరుతో మహారాష్ట్ర, రాజస్థాన్, గుజరాత్ మొదలైన ఉత్తరాది రాష్ట్రాల్లో కూడ ఈ జానపద కళారూపం ప్రదర్శింపబడుతున్నది.

పూర్వకాలంలో వేగులు తమను గుర్తుపట్టరాని విధంగా వేషాలు వేసుకొని, పట్టపగలే ప్రజల మధ్య సంచరిస్తూ, వారి మనోభావాలను తెలుసుకొనేవారు. రాజులు కూడ స్వయంగా ప్రచ్ఛన్న వేషధరులై ప్రజాభిప్రాయాన్ని తెలుసు కొనేవారు. ఇలా ప్రారంభమైన పగటివేషాలే కళాంశాల అలంబనతో వినోద ప్రదమైన వృత్తిగా మారి ఉంటాయని ఊహించవచ్చు. రాను రాను పగటి వేషాలు ఒక కళా ప్రక్రియగా పరిపూర్ణరూపం సంతరించుకున్న తర్వాత లాక్షణికులు లక్షణాలు ఏర్పరిచారు. పగటివేషాలే బహురూపాలయినాయి. అర్వాచీన కాలంలో పగటివేషాలకు, బహురూపాలకు ఒకే అర్థం స్థిరపడింది.

**లాక్షణికుల నిర్వచనాలు :-** భరతకోశంలో "నానా వేషధరం యత్ర ద్బహురూపమితీరితమ్" అని చెప్పబడింది. ఒకే వ్యక్తి అనేక రూపాలు ధరిస్తే, అతణ్ణి 'బహురూపుడు' అన్నారు.

జాయపసేనాని నృత్త రత్నావళిలో బహురూపాన్ని దేశి నృత్తంగా 10 శ్లోకాల్లో నిర్వచించాడు. ఆహార్య, వాచిక, ఆంగికాభినయాల చేత ఆయా లోకా వస్థలను నిరూపించటమే 'బహురూపము' అని చెప్పాడు.[1]

**పూర్వ కవుల ప్రయోగాలు:-** 'బహురూపము' అనే మాట పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో తొలిసారిగా పేర్కొన్నాడు. తరువాతి కవుల కావ్యాల్లో కూడ ఈ ప్రయోగం కనిపిస్తున్నది.[2] యథావాక్కుల అన్న మయ్య సర్వేశ్వర శతకం, శ్రీనాథుని శృంగార నైషధం, పిన వీరన శకుంతలా పరిణయం, జక్కన విక్రమార్క చరిత్ర, మంచన కేయూర బాహుచరిత్ర, కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, అయ్యలరాజు నారాయణామాత్యుని హంస వింశతి మొదలయిన కావ్యాల్లో 'బహురూపి' లేదా బహురూపము అని పేర్కొనబడింది.

పగటి వేషాలు వృత్తిగా ప్రారంభమయిన విషయాన్ని ఇలా చెబుతారు: పల్లావఝ్ఝల వెంకట్రామయ్య అనే బ్రాహ్మణుడు మైసూరు ప్రాంతం నుంచి ఆంధ్రదేశానికి వచ్చి, కృష్ణా జిల్లాలోని వీరంకిలాకుకు మైలు దూరంలో ఉన్న గడ్డిపాడు (ఈనాడు హనుమంతాపురం) అగ్రహారీ బ్రాహ్మణులకు పగటి వేషాలను నేర్పాడు. వేద విద్యలను అధ్యయనం చేసినవారు, సదాచార సంపన్నులు అయిన గడ్డిపాడువారు పగటి వేషాలను వృత్తిగా స్వీకరించి, 64 వేషాలతో ఈ వృత్తిని సుసంపన్నం చేశారు. కృష్ణానదికి ఆనకట్ట కట్టక పూర్వం ఆ మెట్టభూమిలో పంటలు పండించలేక ఆర్థికంగా చితికిపోయిన కూచి పూడి బ్రాహ్మణులు, సమీపంలోని గడ్డిపాడు భాగవతుల నుంచి పగటి వేషాలను నేర్చుకొని, ధన సంపాదనకు దాన్ని వృత్తిగా తీర్చుకున్నారు. తర్వాత గడ్డి

1. తెలుగు నాటక వికాసము - పుట. 164.
2. తెలుగు నాటక వికాసము - పుట. 162 - 163.

పాడువారికి శుశ్రూష చేసి క్రిష్టపాడు జంగాలు, ఊతముక్కల జంగాలు ఈ విద్యను నేర్చుకున్నారు. మొదట్లో గడ్డిపాడువారు సాత్త్విక ప్రధానాలయిన వేషాలను ప్రదర్శించగా, జంగాలు తామస ప్రధానమయిన రాక్షసాదుల వేషాలను ప్రదర్శించటంలో పేరు తెచ్చుకున్నారు.[1]

గడ్డిపాడు, కూచిపూడి భాగవతులు, బుడిగె జంగాలేకాక గొల్ల భాగవతులు, కొంతమంది విశ్వబ్రాహ్మణులు కూడ ఈ పగటివేషాల ప్రదర్శనలు ఇస్తున్నట్లు తెలుస్తున్నది.[2]

తెలంగాణా ప్రాంతంలో మాత్రం ఈనాడు బ్రాహ్మణులెవ్వరూ పగటి వేషాలు ప్రదర్శించటంలేదు. ఏ జిల్లాలో చూసినా బుడిగె జంగాలే పగటి వేషాలను ప్రదర్శిస్తున్నారు. అందుకే తెలంగాణా జిల్లాల్లో కొన్నిచోట్ల బుడిగె జంగాలను కులనామంతో కాకుండ ఈ వృత్తి నామంతోనే ప్రజలు గుర్తిస్తారు. 'పగటి వేషగాళ్ళు' లేదా 'బైరూపులోళ్ళు' అని వీరిని పిలుస్తారు. 'బహురూపుల' అనేది బుడిగె జంగాల వృత్తేకాని చాలామంది పరిశోధకులు భావిస్తున్నట్లు అదొక ప్రత్యేక కులం కాదు.

కోస్తాంధ్రప్రాంతంలో బుడిగె జంగం పురుషులు మేళంగా ఏర్పడి పగటి వేషాలు ప్రదర్శిస్తారు. వాళ్ళ స్త్రీలు తందానా కథలు చెప్పటంలో ప్రసిద్ధులు. రాజమండ్రి పుష్కరాలపేట వాస్తవ్యులు విభూతి భవానీలింగంగారి బృందం పగటి వేషాలు ప్రదర్శించటంలో పేరెన్నికగన్నది.

పూర్వకాలంలో కూచిపూడి భాగవతులు 64 పగటి వేషాలను ప్రదర్శించేవారట. రానురాను అవి 33 కు తగ్గినాయని ప్రస్తుతం ఉపలభ్యమవుతున్న ఈ 33 వేషాలను విద్వాన్ చింతలపాటి లక్ష్మీ నరసింహశాస్త్రిగారు ఈ క్రింది విధంగా పేర్కొన్నారు:[3]

---

1. 'గడ్డిపాడు భాగవతులు' - వ్యాసం - నటన - ఆగస్టు, సెప్టెంబరు 1948. ఈ విషయాన్నే డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు 'తెలుగు నాటక వికాసము'లోనూ, చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రిగారు 'కూచిపూడి భాగవతులు'లోను ఉటంకించారు.
2. కూచిపూడి భాగవతులు - పుట. 7.
3. కూచిపూడి భాగవతులు - పుట. 7.

1. బైరాగి వేషం, 2. బుడబుక్కల, 3. పఠాను, 4. పకీరు, 5. సోమయాజులు-సోమిదేవి, 6. అర్ధనారీశ్వర, 7. బ్రాహ్మణ వితంతువు, 8. కోమటి, 9. పంతులు, 10. సాతాని, 11. జంగం, 12. బేతాళ, 13 శక్తి, 14. దేవర పెట్టె, 15. ఎరుకలసాని, 16. బోగపుసాని, 17. దొమ్మర, 18. కోయ, 19. గయ్యాళి పెళ్ళాం, 20. దాదినమ్మ, 21. ముదుసలి మొగడు, 22. కాశీ కావడి, 23. పిట్టలదొర, 24. వానాలమ్మ, 25 అత్తాకోడళ్ళు, 26. బ్రహ్మంగారి తత్త్వాలు, 27. భట్రాజు, 28. లింగబలిజ 29. బోడిగాడు, 30. సింగి-సింగడు, 31. దాష్టిక పంతులు, 32. మరాఠీదండు, 33. శారదవేషం.

బుడిగె జంగాలు కూడ మొదట్లో రోజుకొక్క వేషం చొప్పున 32 వేషాలు ప్రదర్శించేవారు. ఆ తర్వాత కాలంలో రోజుల సంఖ్యను తగ్గించి ఉదయం కొన్ని వేషాలు, సాయంత్రం కొన్ని వేషాలు చొప్పున చూపేవారు. వీరు చూపే పగటి వేషాల్లో మొదటి ప్రదర్శనగా 'బాలకి - బైరాగి' వేషాలు చూపితే, చివరన 'పోటు వేషం' చూపేవారు. 'పోటు వేషం' అంటే దొంగ వేషం. ఆ దొంగను పగ్గాలతో కట్టి అటు ఇటు పట్టుకుంటారు. ఆ దొంగ నాలుకకు శూలం గుచ్చుతారు. శూలం నుంచి రక్తం కారుతున్నట్లుగా రంగు పులుముతారు. ఆ దొంగ అటూ ఇటూ లాగుతున్నట్లు, నాల్గువైపులనుంచి పగ్గాలు గుంజి పట్టి అతణ్ణి అదుపు చేస్తునట్లు నటిస్తారు. ఈ వేషాన్ని మేళంలోని 'మేటి'కడతాడు. గ్రామీణులంతా గుంపులు గుంపులుగా చేరి ఈ వేషాన్ని చూస్తారు.

**బుడిగె జంగాలు ప్రదర్శించే 32 వేషాల్లో కొన్ని వేషాలు :**

1. బాలకి బైరాగి, 2. బోడి బాపనమ్మ, (బ్రాహ్మణ వితంతువు) 3. శుక్రాచారి, 4. సిద్ధివేషం, 5. బ్రాహ్మణ వేషాలు, 6. కోమటి 7. జంగమయ్య, 8. రాధా రుక్మిణి, 9. మోహినీ భస్మాసుర, 10. భీమాంజనేయ సంవాదం, 11. వడ్డెర వేషాలు, 12. లంబాడి వేషాలు, 13. సింగి, సింగడు-ఎరుకల వేషాలు, 14. బుడబుక్కలవాడు, 15. చెంచువేషాలు, 16. రామలక్ష్మణ-శూర్పణఖ వేషాలు, 17 మందుల వాళ్ళు, 18. గారడి వేషాలు, 19. కాశికావడి, 20. అత్తాకోడళ్ళు, 21. అర్ధనారీశ్వర, 22. ఫకీరు, 23. అరబ్బీ, 24. పిట్టలదొర, 25. పోటు వేషం.

ఇందులో కొన్ని మాత్రమే బుడిగె జంగాలు నేడు ప్రదర్శిస్తారు. బ్రాహ్మణ వితంతువు, పిట్టలదొర వేషాలను ఏక వ్యక్తి కళా ప్రక్రియగా ప్రత్యే

కంగా ప్రదర్శిస్తూ బుడిగె జంగాల్లో కొందరు పొట్ట పోసుకుంటున్నారు. పగటి వేషాల్లో వీరు సామూహికంగా ప్రదర్శించే వేషాల్లో ఏకనారీశ్వరుడు, సిద్ధివేషం, రామలక్ష్మణులు, జాంబవంతుడు, కృష్ణార్జునులు మొదలైనవి ముఖ్యమైనవి.

పగటి వేషగాళ్ళు ఆయా పాత్రలకు తగిన వేషాన్ని, వేషానికి తగిన భాషను, భాషకు తగిన భావాభినయాన్ని ప్రకటించి ప్రదర్శనను రక్తికట్టిస్తారు. బ్రాహ్మణ వితంతువు, పిట్టలదొర (తుపాకీ రాముడు) మొదలయిన వేషాలకు ప్రత్యేకమైన దీర్ఘ ప్రసంగం ఉంటుంది. గ్రామాంతరాల్లో ఆ ప్రసంగాన్నే ఆ వేషానికి వల్లెవేస్తుంటారు.[1] పగటి వేషాలన్నింటికి కూడ ఇలాంటి ప్రసంగాలు ఉంటాయి. అయితే అవి చాలా సంక్షిప్తంగా ఉంటాయి. ఉదాహరణకు పగటి వేషాల్లోని వడ్డిర ప్రసంగాన్ని అనుబంధం-లో చూడవచ్చు.

శ్రీకృష్ణార్జునులు, శ్రీకృష్ణ జాంబవంతులు, రామాంజనేయులు, రామ లక్ష్మణులు, వాలిసుగ్రీవులు మొదలయిన వేషాలకు ప్రత్యేకమైన ప్రసంగాలు ఉండవు. ఈ వేషాలకు యక్షగానాల్లోని సంవాదపు దరువులను పాడుతుంటారు. కొన్ని రోజులు వేషాలన్నీ వరుసగా గ్రామ ప్రజలకు చూపించి, చివరన ఇల్లిల్లు అడుక్కోవటం వీరి పద్ధతి. ఆ గ్రామంలో దాత స్థాయినిబట్టి డబ్బు, ధాన్యం, వస్త్రాలు, పశువులు (మేకలు, గొర్లు, ఆవులు, గేదెలు మొ॥), వెండి, బంగారం మొదలైనవాటిని సంభావనగా పుచ్చుకుంటారు.

రాజమండ్రిలో 'విభూతి వేంకటలింగం మరియు విభూతి భవానీలింగం యక్షగానబృందం' ఉంది. 'యక్షగాన బృందం' అని పేరు పెట్టుకున్నా, వీరిది పగటివేష సంప్రదాయమే. వీరు అర్ధనారీశ్వరం అనే శివలీలలు ప్రద ర్శిస్తారు. ఇందులో శివుడు పార్వతికి అర్ధశరీరాన్ని ఇవ్వటం, శివతాండవ స్తోత్రం, గరళభక్షణం, గంగావతరణం, గజాసుర వృత్తాంతం, దక్షయజ్ఞం, లింగోత్పత్తి, మార్కండేయ స్తోత్రం, మహిషాసురమర్దనీ స్తవం ప్రదర్శిస్తారు. ఇవేకాకుండా పగటి వేషాలను కూడ చూపుతారు. దూరదర్శన్‌లో ఈ బృందం పగటి వేషాల్లో ఒకటైన 'మందులోళ్ళ' ప్రదర్శన ఇచ్చారు. రేడియో కార్య క్రమాల్లో కూడ వీరు పాల్గొన్నారు. ఈ బృందం త్రివేండ్రం, బొంబాయి, మద్రాసు, హోస్‌పేట, హంపి, రవీంద్రభారతి (హైదరాబాదు) మొదలయిన చోట్ల ప్రదర్శన లిచ్చారు. వీరు ప్రధాని శ్రీ పి. వి. నరసింహారావు, ముఖ్యమంత్రులు శ్రీ టి. అంజయ్య, శ్రీ ఎన్. టి. రామారావుగార్లతో సన్మానాలు, ప్రశంసాప త్రాలు అందుకున్నారు.

---

1. ప్రసంగ పాఠాలు అనుబంధంలో ఇవ్వబడ్డాయి.

కోస్తాంధ్రలోని పగటి వేష కళాకారుల బృందాల్లో తూర్పుగోదావరి జిల్లా కొత్తకోట మండలంలోని రావులపాలెం మిరియాల అప్పారావు బృందం చెప్పుకో దగ్గది. విజయవాడ కేదారీశ్వర పేటలోనూ. ఏలూరు బాలిశెట్టి వారి వీధిలోను ఈ కళాకారులు నివాసాలు ఏర్పరచుకున్నారు.

వైవిధ్యం : తెలంగాణా, రాయలసీమ, కోస్తాంధ్ర ప్రాంతాల్లో సంచరించే పగటివేషాల బృందాలన్నీ ఒకే పద్ధతిలో కాకుండ. వేషాల ఎన్నికలో ప్రదర్శనా విధానంలో విలక్షణాన్ని చూపుతాయి. తూర్పు గోదావరి జిల్లాలోని గోకవరం, ముమ్మిడివరం, రాజోలు, అనపర్తి మొదలయిన ప్రాంతాల్లో సంచరించే గోకవరం వాస్తవ్యులు యడవల్లి అప్పారావు, ఆయన కుమారుడు సింహాచలం బృందం వారు పూర్వం ఒక్కొక్క గ్రామంలో 32 రోజులు 32 వేషాలు ప్రదర్శించేవారట. ఇప్పుడు మారిన పరిస్థితులకు అనుగుణంగా పది వేషాలు మాత్రం ప్రదర్శిస్తు న్నారు. వీరు రంభ, శుకమహర్షి, బుడబుక్కలవేషం, సాతాని వేషం, మందుల వేషం, కృష్ణ జాంబవంత, రామ పరశురామ, భీమాంజనేయ యుద్ధం, అర్ధనా రీశ్వర, రామలక్ష్మణ తాటకి వేషాలు వరుసగా ప్రదర్శించి, చివరి రోజున శక్తి వేషంతో గ్రామ ప్రజల దగ్గర సంభావనలు అడుక్కుంటారు.1

ఏలూరుకు చెందిన మిరియాల రామలింగయ్య (58 సం॥) బృందం వారు యావదాంధ్రదేశం సంచరిస్తూ భారత భాగవత రామాయణాలకు, పురాణాలకు సంబంధించి శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, రావణాసురుడు, అంజనేయుడు, హిరణ్యా కశిపుడు, జాంబవంతుడు, అర్ధనారీశ్వరుడులాంటి పౌరాణిక వేషాలను గ్రామాల్లో ప్రదర్శిస్తామని చెప్పారు.2

నల్లగొండ, రంగారెడ్డి జిల్లా ప్రాంతాల్లో పగటి వేషాలు ప్రదర్శించే వారిలో రేవెల్లె నర్సిహ్మ (50 సం॥) బృందం చెప్పుకోదగ్గది. వీళ్ళు ప్రదర్శించే వాటిలో ఏకనారీశ్వర, సిద్దివేషం, జాంబవంత, రామాంజనేయ, బుడబుక్కల, బోడి బాపనమ్మ మొదలైన వేషాలు ముఖ్యమైనవి. ఇప్పుడు పగటి వేషాలు తగ్గించి, అప్పుడప్పుడు లేదా పంటలకాలంలో పగటి వేషాలకు మారుగా వీధి భాగవతాలు ప్రదర్శిస్తున్నారు. భుక్తి గడవక ఈ బృందంలోని పగటి వేషగాళ్లు పాత బట్టల వ్యాపారానికి అలవాటుపడుతున్నారు.3

---

1. అమలాపురంలో 21-8-1988 నాడు జరిపిన ఇంటర్వ్యూ సారాంశం.
2. ఏలూరు సమీపంలోని 'పినకడియం'లో ముఖాముఖి- తేది 20-5-1989.
3. భూదాన్ పోచంపల్లిలో ముఖాముఖి - మే, 1990. (నల్గొండ జిల్లా)

**బుడిగె జంగాలు - పగటి వేషాలు :** బుడిగె జంగాలు బహురూపి వేషాలను లేక పగటి వేషాలను ప్రదర్శించటం నేర్చుకుని దాదాపు మూడు నాల్గు తరాలు అయినాయని కులవృద్ధులు తెలిపారు. నిజాం రాష్ట్రంలో బహురూపులు ఉన్నట్లు సయ్యద్ సిరాజుల్ హసన్‌గారు 1920 లోనే వ్రాశారు.[1] లంబాడి, కోమటి, వృద్ధస్త్రీ (బహుశః బ్రాహ్మణ వితంతువు వేషం కావచ్చు), నాట్యకత్తె మొదలైన వేషాలు అద్భుతంగా ప్రదర్శిస్తారని వివరించారు. ఈ బహురూపులు ముతరాసి కులం నుంచి ఉద్భవించారని పేర్కొన్నారు. అంటే 1920కి ముందే పగటివేషాలు ప్రదర్శించే బ్రాహ్మణేతరులు తెలంగాణాలో ఉన్నారని తెలుస్తున్నది. బుడిగె జంగాలు మున్నూరు, ముతరాసి కులాలనుంచి ఉద్భవించారని హసన్ వ్రాశారు కాబట్టి, వారు పేర్కొన్న బ్రాహ్మణేతర బహురూపులు బుడిగె జంగాలే అయి ఉంటారని ఊహించటానికి వీలున్నది.[2] అంతేకాక కూచిపూడి బ్రాహ్మణుల వద్ద పగటివేషాలు నేర్చుకున్న మొట్టమొదటి బ్రాహ్మణేతరులు జంగాలే కావటం ఈ సందర్భంలో గమనించదగ్గది. అందువల్ల బుడిగె జంగాలు ఇంచుమించుగా ఈ శతాబ్దారంభం నుంచే పగటివేషాలు ప్రదర్శిస్తున్నారని చెప్పవచ్చు.

ఈవిధంగా కూచిపూడి బ్రాహ్మణులు పగటి వేషాలను ఒక వృత్తిగా చేపట్టి, ఒకప్పుడు ఆంధ్రదేశాన్ని అలరించినప్పటికీ అధ్యతన కాలంలో బుడిగె జంగాలు పగటి వేషగాళ్ళుగా, బహురూపులుగా పేరుబడిపోయి ఈ ప్రక్రియను తమ స్వంతం చేసుకున్నారు. తమ స్వంతబాణీతో తెలుగునాట ఊరూరా ప్రదర్శనలిస్తూ అబాలగోపాలాన్ని వినోదాంబుధిలో ఓలలాడిస్తున్నారు.

## 5. కాటి పాపల వేషాలు :

జానపద భిక్షుక గాయకుల్లో కనికట్టు విద్యతో ప్రజలను ఆకట్టుకొని అడుక్కునేవాళ్ళు కాటి పాపలు. సాధారణ భిక్షుక గాయకులలాగ ఊళ్ళో తిరిగి అడుక్కోవటం కాకుండా శవ సంస్కార సమయాల్లో యాచించే హక్కు

---

1. The Castes and Tribes of H.E H. The Nizam's Dominions - Page - 506.
2. బుడిగె జంగాల వృత్తి వేషాల్లోని 'శారదకాని' ప్రస్తావన వచ్చినప్పుడు హసన్ 'వీరు మున్నూరు, ముతరాసి కులాల నుంచి పుట్టుకొచ్చారని' చెబుతారు.

ఉంది. ఇంద్రజాల ప్రదర్శనలు ఇవ్వటం వీరి ప్రత్యేకత. బుడిగె జంగాలు ప్రదర్శించే సామూహిక కళల్లో కాటిపాపల వేషమొకటి. వీరు రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లో ఉన్నప్పటికి తెలంగాణా జిల్లాల్లో పిరివిగా కనిపిస్తారు. వేషధారణలో కూడ తెలంగాణా కాటిపాపలు ప్రత్యేకత కనబరుస్తారు.



**నిర్వచనం :**

కాటిపాపల వేషాన్ని బుడిగె జంగాలు 'కిట్టుపంతు' అని అంటారు. 'గిట్టు' అనే పదం నుంచి వచ్చిన 'కిట్టు' పదానికి వేషార్థంలో వీరు ఉపయోగించే

'పంతు' పరిభాషాపదాన్ని చేర్చి 'కిట్టు పంతు' అనే పదబంధం నిర్మించుకున్నారు. కిట్టుపంతు అంటే 'గ్రామస్థులు చనిపోయినప్పుడు అడుక్కునే వేషం' అని అర్థం.

**కాటిపాపడు - కాటికాపరి :**

కాటి పాపడు అనే సమాసానికి తెలుగు నిఘంటువులు, మాండలిక పద కోశాలు 'కాటి కాపరి, గొల్లవాడు, వల్లకాటియందు కాపురముండువాడు' అని అర్థాలు చూపుతున్నాయి. బహువచన రూపానికి (కాటిపాపలవాండ్రు) 'హస్త లాఘవ విద్య చూపెడు అటవికులు, గారడి (జాలవిద్య) చేయు ఒక జాతి, అటవిక జనులు' అని అర్థాలు చెబుతున్నాయి.

కాటి పాపడు, కాటి కాపరి సమాసాలను నిఘంటుకారులు పర్యాయ పదాలుగా చూపారు కొందరు పరిశోధకులు కూడ ఈ రెండింటిని అభిన్నార్థం లోనే ప్రయోగించారు. డా॥ ఎన్. విజయగారు జానపద వృత్తి గాయకులను పేర్కొంటూ, వీరిని 'కాటిపాపల' అని కాకుండా 'కాటి కాపరి' పేరుతో వివరించారు.[1] కె.వి. హనుమంతరావుగారు కాటి పాపల వేష ధారణను వివరిస్తూ "తెలంగాణాలో 'కాటి పాపలు' తలపై నిటారుగా పైకిలేచిన ఇత్తడి రేకులతో కూడిన కిరీటాన్ని ధరిస్తారు కోస్తా ఆంధ్రలోని 'కాటి కాపరులు' వీధి నాటకాల్లో ధరించే కిరీటాల్లాంటివాటిని ధరిస్తారు"[2] అని వ్రాశారు. తెలంగాణాలో కాటి పాపలని పిలువబడుతున్నవారే, కోస్తాంధ్రా ప్రాంతాల్లో కాటి కాపరి పేరుతో వ్యవహరింపబడుతున్నారు ప్రాంతాన్నిబట్టి వేషధారణలో భేదం తప్ప, కాటి పాపల, కాటి కాపరి భిన్నం కావు.

**ప్రాచీన కావ్యాల్లో ప్రస్తావన :**

వృత్త్యర్థంలో లేక కులార్థంలో 'కాటి పాపల' ప్రయోగం ప్రాచీన సాహిత్యంలో మొట్టమొదట పాల్కురికి సోమనాథుని బసవపురాణంలో కనిపిస్తున్నది.[3]

---

1. The role of traditional folk media in rural areas. p. 47.
2. కాటి పాపలు - ఆంధ్రప్రభ - 25-11-1990.
3. కాటిపాపడు పని గాచుచునుండు - బసవపురాణం - 4-318.

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానంలో కూడ 'కాటిపాపని' ప్రస్తావనం ఉంది.[1] అయ్యలరాజు నారాయణామాత్యుడు హంసవింశతిలో తిరునాళ్ళ వేడుకల సందర్భంగా కులాలను వర్ణిస్తూ కాటి పాపలను పేర్కొన్నాడు.[2]

## ఇతర నామాలు

**సుడిగాడు సిద్ధ** : కాటి పాపలను 'సుడిగాడు సిద్ధ' పేరులో జె. ఎస్. ఎఫ్. మెకంజీగారు Indian Antyquary (1873) రెండవ సంపుటంలో పేర్కొన్నారు. గంగాధికార వక్కళిగ కులానికి చెందిన వీరు చీలిపోయి, ఒక ప్రత్యేక కులంగా ఏర్పడ్డారని, తమ కులపెద్ద అయిన 'సుడిగాడు సిద్ధ' పేరే వీరి కులనామంగా నిలించిందని, దేశాటనం చేస్తూ శ్మశానాల్లో శుల్కాన్ని గ్రహించి బ్రతుకు వెళ్ళదీస్తుంటారని మెకంజీగారు వ్రాశారు.[3] ఈ విషయాన్నే చిర్రావూరు నాగభూషణాచార్యులు తమ గ్రంథంలో పేర్కొన్నారు.[4]

1901 మైసూరు జనాభా గణన నివేదికలో సుడిగాడు సిద్ధ కులాన్ని పేర్కొన్నారు. వీరు జోగులవంటి ద్రిమ్మరులని, ఒకప్పుడు శ్మశానానికి అధిపతులయి శ్మశాన శుల్కాన్ని గ్రహించేవారని, ఆ వృత్తినే తరతరాలుగా అనుసరిస్తున్నారని తెలుపబడింది.[5]

థర్స్టన్‌గారు (1903) 'శ్మశానం' అనే అర్థంలో ఉన్న 'సుడిగాడు' నుంచి 'సుడిగాడు సిద్ధ' అనే వీరి కులనామం ఏర్పడిందని వ్రాశారు. ఊరూరు తిరుగుతూ శ్మశాన శుల్కం స్వీకరించి జీవిస్తారని, ఒక లోహపు గంటతోపాటు, కర్రగంట కూడ వీరు ధరిస్తారని, ఈ గంటలు చూసి ప్రజలు వీరిని గుర్తిస్తారని వివరించారు.[6]

---

1. కాటి పాపని కేల కరుణ నీ మీద - హరిశ్చంద్రోపాఖ్యానము.
2. హంస వింశతి - 3-29.
3. The Castes and Tribes of Southern Indian - vol. VI. page. 405.
4. సంచార జాతులు - పుట - 21 (1977)
5. The Castes and Tribes of Southern India - Vol. II. page. 405.
6. The Castes and Tribea of Southern India - Vol. II - page. 405.

తెలంగాణా నుంచి వెళ్ళి బొంబాయి నగరంలోని ములుందు, పార్లె, శాంతాక్రూజ్ మొదలయిన ప్రాంతాల్లో నివసిస్తున్న బుడిగె జంగాలను కలిసి నపుడు అక్కడ తమను సుడిగండిసిద్ధ లేక మసాన్‌జోగి అని కూడా పిలుస్తా రని చెప్పారు 'సుడిగాడు సిద్ధ' అనేదే 'సుడిగండ్ సిద్ధ'గా మార్పు చెందింది. సుడిగాడు సిద్ధ కులం కర్నాటక రాష్ట్రంలో షెడ్యూలు కులంగా (వరుస నెం. 98)గా గుర్తించబడింది.

**మసాన్‌జోగి :** కాటి పాపలకున్న మరో పేరు మసాన్‌జోగి. శ్మశాన పదమే 'మసాన్'గా మారింది. ఈ కులనామం మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాల్లో వ్యవహారంలో ఉంది. ఆర్. పి. రసెల్, హీరాలాల్‌గార్లు (1916) మధ్య రాష్ట్రాల్లో వీరిని 'మసానియా' అంటారని తెలిపారు.[1] హసన్‌గారు (1920) 'మసాన్‌జోగి' శీర్షికన కాటిపాపలను వివరిస్తూ మసాన్‌జోగినే 'కాటిబాగులోడు' లేక కాటిపాపల అని అంటారని వ్రాశారు.[2]

**కాటిపాముల :** గులాం అహమద్‌ఖాన్ (1933)గారు వీరిని కాటిపాముల పేరుతో గుర్తించి, నిజాంరాష్ట్రంలో 1931 జనాభా గణన ప్రకారం వీరి జనాభా 5962గా నమోదు చేశారు.[3]

**తాటిపాముల :** గులాం అహమద్‌ఖాన్‌గారు కాటిపాపలను కాటిపాముల వారన్నట్లుగానే కొన్ని ప్రాంతాల్లో వీరిని 'తాటిపాముల'వారని అంటారని తెలుస్తున్నది. కిరీటంలో ఇత్తడిరేకులకు మారుగా తాటిఆకులను అలంకరించుకోవటం వల్ల, వీరి ప్రదర్శనలో కనికట్టు కట్టి పాములను తీయటంవల్ల, కాటిపాపల-

---

1. The tribes and castes of the central provinces of India Vol. 1 London-1916 - Page. 389.
2. The Castes and Tribes of H.E.H. The Nizam's Dominions. Page. 504.
3. Census of India . 1913 Vol. xxiii-part I Report - page. 260.

తాటిపాములకున్న శబ్దసామ్యంవల్ల ప్రజలు వీరిని తాటిపాములవారని వ్యవహరించి ఉంటారు. ఇప్పుడుమాత్రం వీరిని 'తాటిపాముల'వారని పిలవటం కనిపించదు.

తెలుగు కాటిపాపల ప్రత్యేకత : ఆయా ప్రాంత భేదాలనుబట్టి వీరిని కాటిపాపల, కాటికాపరి, సుడిగాడుసిద్ధ, 'మసాన్‌జోగి', మసానియా మొదలయిన పేర్లతో పిలుస్తున్నప్పటికి, వేషభాషల్లో భేదాలున్నప్పటికి వీరి వృత్తి మాత్రం ఒక్కటే. అయితే పొరుగు రాష్ట్రాల్లోని వారికంటే తెలుగు దేశంలోని కాటి పాపలు ఇంద్రజాల విద్యను కూడ ప్రదర్శిస్తూ ఒక ప్రత్యేకతను సాధించారు. సుడిగాడు సిద్ధ, మసాన్ జోగి పేర్లతో వ్యవహరింపబడుతున్న ప్రక్క రాష్ట్రాల భిక్షుకులు జాల విద్య ప్రదర్శిస్తున్న దాఖలాలు లేవు. పూర్వకాలం నుంచి వస్తున్న శ్మశాన శుల్కం స్వీకరించటం మాత్రమే వారు అనూచానంగా కొనసాగిస్తూ వస్తున్నారు.

థర్స్టన్‌గారి వరకు వీరు ఇంద్రజాల విద్యలు ప్రదర్శిస్తారనే విషయం చెప్పబడలేదు. 1920 నుంచి వీరిని గారడి విద్యలను ప్రదర్శించే వారుగా పరిశోధకులు పేర్కొన్నారు.[1] బుడిగె జంగాలు బ్రాహ్మణ వితంతువు, తుపాకి రాముడు మొదలయిన వేషాలతోపాటు పగటి వేషాలను భాగవతాలను కూచిపూడి బ్రాహ్మణులనుంచి, తోలుబొమ్మలాటలను ఆరె వాళ్ళనుంచి నేర్చుకున్నట్లుగానే ఈ గారడి విద్యలను వీరు విప్రవినోదులనుంచి నేర్చుకున్నారని ఊహించటానికి వీలున్నది. బుడిగె జంగం వృద్ధులను ఈ విషయమై అడిగినప్పుడు పూర్వం నుంచి జాలవిద్య ప్రదర్శన కాటిపాపల వేషంతో ప్రదర్శించేవారుకారని, విప్ర వినోదులను, సాధనా శూరులను చూసి; వారి హస్తలాఘవం, కనికట్టు, ఇంద్ర జాల విద్యలను నేర్చి, కాటి పాపల వేషానికి అన్వయించటం జరిగిందని చెప్పారు. పాముల వాళ్ళ ప్రదర్శనలో కనిపించే, కడుపులో నుంచి నాణాలు తీయటం మెదలయిన ఒకటి, రెండు అంశాలుకూడ కాటి పావల ప్రదర్శనలో దర్శనమిస్తాయి.

---

1. The Castes and Tribes of H.E.H The Nizam's Dominions page - 503.

## ఐతిహ్యాలు :

కాటిపాపల పుట్టుకను గురించి అనేక ఐతిహ్యాలు ప్రచారంలో ఉన్నాయి. అందులో ప్రధానమయింది హరిశ్చంద్రుని కథ. ఈ కథలో కాటికాపరి అయిన వీరబాహుని సంతతివారే కాటిపాపలని కొందరు చెప్పుకోగా, కాటికాపరిగా మారిన హరిశ్చంద్రుని నిజాయితీ రుజువయిన తర్వాత ఈ వృత్తిలో కొనసాగారని మరి కొందరు చెప్పుకుంటారు. కాటి పాపల్లో పై రెండు వాదాలు విరివిగా ప్రచారంలో ఉన్నాయి.

మరో కథలో పూర్వం మున్నూరు కాపు కులానికి చెందిన ఒక బాలుడు చనిపోగా, వాడి తల్లిదండ్రులు గర్భ దారిద్ర్యంలో ఉండి, శ్మశాన శుల్కం చెల్లించలేని స్థితిలో ఉంటారు. శివపార్వతులు ఆ దంపతులను కరుణించి, అక్కడికి వచ్చి బాలుణ్ణి బ్రతికించి, అతణ్ణి శ్మశాన జోగిని (కాటి పాపని) చేసి, శ్మశానానికి రక్షకుడుగా నియమిస్తాడు. ఆనాటినుంచి అతని సంతతివారు అదే వృత్తిగా చేసుకొని జీవించసాగారు.[1]

మరో ఐతిహ్యం ఇలా ఉంది: హరిశ్చంద్రుడు కాటికాపరిగా ఉన్న కాలంలో ఒకనాడు చనిపోయిన గొల్ల, కుర్మ కులాలకు చెందిన ఇద్దరి శవాలను శ్మశానానికి తీసుకొచ్చారు. అందులో గొల్లవాడు తిరిగి బ్రతుకుతాడు. శ్మశానంలో తిరిగి ప్రాణం వచ్చింది కాబట్టి అతణ్ణి ఆనాటినుంచి కులస్థు లందరు కాటికాపరి పేరుతో పిలువసాగారు. అతడు కాటికాపరి వృత్తినే కొనసాగించాడు. అందువల్లనే కాటికాపర్లు తాముగుడిసె (బుడిగె) జంగం కులస్థులయినప్పటికి తమను గొల్ల కులస్థులుగా చెప్పుకుంటారు. పూర్వకాలంలో వీరు శ్మశానం వద్దనే ఉండేవా. ఆ తర్వాతరు కాలంలో వీరు శ్మశానాలను వదలి ఊరిబయట కాపురముండటం ప్రారంభించారు.[2]

---

1. The Castes and Tribes of H. E. H. The Nizam's Dominions - page. 504.
2. The Role of Traditional Folk media in rural areas : page 48.

ఈ కథలన్నీ పరిశోధకులు కాటిపాపల వారివద్ద సేకరించినవే. ఆయా ప్రాంతాల్లో ఆయా కథలు ప్రచారంలో ఉండటంవల్ల కాటిపాపల పుట్టుకకు సంబంధించి ఏది సత్యమో, ఏది కల్పితమో ఇదమిత్థంగా చెప్పటానికి వీలు లేకపోతున్నది.

హరిశ్చంద్రుని కథలో వసిష్ఠ విశ్వామిత్రులు ప్రతిజ్ఞల పర్యవసానమే హరిశ్చంద్రుని పాట్లు. హరిశ్చంద్రుని సత్యసంధత నిరూపించబడ్డాక, భార్యా బిడ్డలతో అతడు తిరిగి రాజ్యానికి - స్వర్గానికి వెళ్లాడు. కాబట్టి హరిశ్చంద్రుని సంతతివారు కాటి కాపరులు కావటమనేది సత్యదూరం. హరిశ్చంద్రుడు వీర బాహుని దగ్గర చేరేకంటె ముందునుంచే కాటికాపరి వ్యవస్థ ఉన్నది. అందువల్ల హరిశ్చంద్రునితో ఈ వృత్తి ప్రారంభం కావటం లేదు. వీరబాహుడు కాటికాపరి కాబట్టి అతని సంతతి వారమని చెప్పుకోవటంలో ఔచిత్యమున్నది.

రెండవ ఐతిహ్యంలో కాటి పాపడు సమానార్థానికి అనుగుణమైన కథ చెప్పబడింది, కాటిని కాపాడే బాలుడే కాటి పాపడు అయ్యాడు.

బుడిగె జంగాలు ప్రదర్శిస్తున్న జానపద కళారూపాలన్నీ జంగం కులంగా ఏర్పడ్డాక నేర్చుకొని, తరతరాలుగా కొనసాగిస్తున్నవే. పాల్కురికి సోమనాథుడు కాటి పాపలను పేర్కొనటంవల్ల ఆయన కాలానికే కాటి పాపలవారున్నట్లు తెలుస్తున్నది. కాటిపాపలు వీరశైవ మతావలంబకులయి జంగాలుగా మారినప్పటికీ తమ వృత్తిని మాత్రం కొనసాగించి ఉండాలి. లేదా వీరశైవం క్షీణించిన తర్వాత కులంగా ఏర్పడిన దశలో కాటిపాపల వృత్తిని స్వీకరించయినా ఉండాలి. కులంగా ఏర్పడ్డ తర్వాత జంగాలు ఈ వృత్తిని స్వీకరించినట్లయితే, వీరశైవం కంటే ముందునుంచి కాటి పాపల వృత్తిని అవలంబించే మరొక కులం కూడ ఉండాలి. ఉదాహరణకు బుడిగె జంగాలు పగటివేషాలు, వీధి భాగవతాలను బ్రాహ్మణుల నుంచి నేర్చుకున్నారు. అలాగే భాగవత దాసర్లు, చిందులవాళ్ళు కూడా వీధి భాగవతాలను నేర్చుకున్నారు. తమ తమ ప్రత్యేకతలతో వీధి భాగవతాలను వీళ్ళు ప్రదర్శిస్తున్నప్పటికీ, వీళ్ళంతా వేరు వేరు కులాలవాళ్ళు. భాగవతాలను ప్రదర్శించేవాళ్ళల్లో (కూచిపూడి) బ్రాహ్మణులున్నారు ఒకరి తర్వాత ఒకరు, ఒకరిని చూసి మరొకరుగా నేర్చుకున్న జంగాలు, దాసర్లు, చిందులు మొదలయిన కులాలవాళ్ళున్నారు. ఈ విధంగా కాటిపాపల వృత్తిని చేసేవారు బుడిగె జంగాలే

కనిపిస్తారు. కాని, ఏ ఇతర కులం కాటి పాపల వృత్తిలో లేరు. కాబట్టి కాటి పాపలే వీరశైవ స్వీకారంతో జంగాలయి ఉంటారని భావించవచ్చు. తర్వాత కాలంలో విప్రవినోదులనుంచి ఇంద్రజాలం నేర్చుకొని కాటి పాపల వృత్తిని జనామోదం కోసం తీర్చిదిద్ది ఉండవచ్చు. కాటిపాపల వృత్తితోపాటు కాలానుగుణంగా జంగాలు ఇతర కళాప్రక్రియలను అనుసరిస్తూ వచ్చారని భావించవచ్చు.

**వేషం :** 'కాటి పాపడు నల్లరంగు కలిగిన పొడవాటి గౌను ధరిస్తాడు. తలమీద పొడవాటి కిరీటాన్ని ధరిస్తాడు. ఆ కిరీటం నెమలి ఈకలతో అంగుళం పొడవు, పావు అంగుళం వ్యాసం ఉన్న చిన్న చిన్న ఇత్తడి రేకులతో అలంకరింపబడి ఉంటుంది. మెడలో పూలదండలు వ్రేలాడదీసుకోవటంతో పాటు రుద్రాక్షమాలను కూడ వేసుకుంటాడు. నడుముకు గణ గణ మనే చిరుగంటలను కట్టుకుంటాడు. నొసలు మధ్యన కిరీటపు రాగిరేకు మీద కృష్ణుని బొమ్మకాని, ఆంజనేయ స్వామి బొమ్మకాని ఉంటుంది. నొసట విభూతి రేకలు పెట్టుకుంటాడు. లేదా పిడక బూడిదను విభూతిగా పెట్టుకుంటాడు. పొడవైన ఒక ఇనుప గంటను మోగిస్తూ ప్రజలను ఆకట్టుకుంటాడు' అంటూ హసన్ గారు (1920) కాటి పాపని వేషాన్ని వర్ణించారు. ఇప్పటికీ కాటి పాపడు తలకు రుమాలు చుట్టి, దాని మీద ఇత్తడి రేకులతో చేయబడిన కిరీటాన్ని ధరించి, ముఖానికి పసుపు రుద్దుకొని నల్లబొట్టు పెట్టుకుంటాడు. మెడలో రుద్రాక్షమాల, నొసట విభూతిరేకలు ఉంటాయి. ఎర్రటి రుమాలును లేదా శాలువాను మెడ మీద నుంచి ఎదమీద రెండు వైపులకు వేసుకుంటాడు. పంచెకట్టు, మోకాళ్ళ కింది దాకా ఉన్న జలతారు షేర్వానీ లాంటి దాన్ని ధరించి, దానిమీద చిరుగంటలు వ్రేలాడే తోలు పట్టీని నడుముకు కట్టుకుంటాడు. చేతితో ఊపే పెద్ద గంట, అప్పుడప్పుడు ఊదే ఒక శంఖం కూడ ధరిస్తాడు. కావడి బద్దకు చివరన జోలె, ప్రదర్శన వస్తు సరంజామా ఉన్న ఒకటి రెండు సంచులు తగిలించుకొని కావడిని భుజం మీద పెట్టుకుంటాడు.

తాత ముత్తాతల నుంచి సంక్రమిస్తున్న ఇత్తడి రేకుల కిరీటాన్ని పోగొట్టుకున్నవారు, వీధి భాగవతాల్లో ధరించే కిరీటం లాంటి దాన్ని తలకు అలంకరించుకుంటారు. అదీలేని వాళ్ళు కేవలం తలపాగతో సరిపుచ్చుకుంటారు. షేర్వానీ కూడ లేకుంటే పాత కోటు తొడుక్కుంటారు. ఎర్రని రుమాలు లేదా శాలువాను

కుడి భుజం మీది నుంచి తిప్పి, ఎడమ చంకకింది నుంచి తీసి కడుపుమీద ముడి వేసుకుంటారు. ఎడమ చేత గంట వాయిస్తారు. కుడిచేతిలో ఇత్తడి, రాగి కట్లు వేసిన నల్లటి చేతి కఱ్ఱ (దాన్నే పొన్నుకఱ్ఱ అంటారు) ఉంటుంది. ముఖానికి వసువు పూత, నల్లబొట్లు, విచిత్రమైన కిరీటం, రంగుల దుస్తులు, బుఱ్ఱమీసాలు, గుబురు గడ్డం, గంటల గణగణ, శంఖనాదాలతో కాటి పాపలు భీతి గొలుపు తుంటారు.

హాసన్‌గారు వర్ణించినదాన్నిబట్టి కిరీటంలో నెమలి ఈకలు కూడ' అలంకరించుకునేవారని తెలుస్తున్నది. రాగి రేకులకు బదులుగా తాటి ఆకులను కూడ కిరీటంలో ధరించేవారని తాటి పాముల నామోత్పత్తి తెలుపుతున్నది. ఇదంతా కాలంతో పాటు వస్తున్న మార్పుల ప్రభావమే.

ఇది సామూహిక కళా రూపం కాబట్టి ఇద్దరు అంతకంటే ఎక్కువ మంది ప్రదర్శనలో పాల్గొంటారు.

**ప్రదర్శన :** గంటల చప్పుళ్ళకు తోడు శంఖనాదం విని ప్రజలు ప్రోగవ గానే జోలెలో నుంచి పుర్రెను, రెండు ఎముకలను (గొర్రెలేక మేక కాలి ఎముకలు) బయటకుతీసి ప్రదర్శన ప్రారంభిస్తారు. నోట్లో నుంచి గచ్చకాయ లను, తేళ్ళను, కప్పలను, చిన్న చిన్న విగ్రహాలను, నాణాలను తీసి అద్భు తాన్ని సృష్టిస్తారు. కళ్ళనుంచి మేకులను తీసి చూపిస్తారు. ప్రదర్శన ముగిశాక ఊరంతా తిరిగి భిక్షం అడుక్కుంటారు.

ఊళ్ళో ఎవరయినా చనిపోయినప్పుడు, వారి శవయాత్రతో వెళ్ళి తమ మామూలును వసూలు చేసుకుంటారు. ఇవ్వని పక్షంలో తాము బొందలోనో, కాష్టంపైనో పడుకుని, ఇచ్చేదాకా కదలరు.[1]

---

1. ఈ తతంగాన్నంతా డా. ఎన్. యాదగిరిశర్మగారు విపులీకరించారు. జానపద భిక్షుక గాయకులు (అముద్రిత పిహెచ్.డి. సిద్ధాంతవ్యాసం) పుట. 120.

**శాసనం :** కాటి పాపల వద్ద ఒక రాగి శాసనం ఉంటుంది. ఇది వీరబాహుని నుంచి ముందు తరాలకు సంక్రమిస్తూ వచ్చిందని[1] కొందరు, "శ్రీ పంచదాయా కుల పవిత్రుండును, టికెలి యాగోద్భవుండును, సుబ్బనింగు పుత్రుడునగు బాలాజీచే కాశిలో వ్రాసిన ధర్మ శాసనము"[2] అని కొందరు చెప్పుకుంటారు. ఇందులో ముందుగా ఛప్పన్న దేశాలను పేర్కొని, ఆ తర్వాత కాటి పాపలకు ఏయే కులాలవాళ్ళు ఎంతెంత శ్మశానశుల్కం చెల్లించాలో వివరించబడి ఉంటుంది. వీరివద్ద ఉన్న శాసనాల్లో ప్రాంత భేదాన్ని బట్టి అందులో ఉన్న కులనామాల్లో, తీసుకోవలసిన శుల్కంలో ఎక్కువ తక్కువలు, చిన్న చిన్న మార్పులు కనిపిస్తాయి. ఉదాహరణకు ఒక శాసనంలో "బ్రాహ్మణుడు చనిపోతే వెయ్యి టంకాలు, కోమటికయితే కొంత బంగారం లేక రూపాయలు, రాజులు - బంగారం మంచంకోళ్ళు, గొల్లకురుమలు - గొర్లు మేకలు, కాపులు కరణాలు - చాటెడుగింజలే కాకుండ పాత వస్త్రం, విశ్వకర్మలు, సాలెవారు - నూటపదహార్లు, వస్త్రం"[3] అని ఉండగా మరో శాసనంలో "బ్రాహ్మణులు పాతిక, క్షత్రియ రాజులు పాతిక, కాపులు కమ్మవారు యలమ యాదవ రాజులు ఇంటికి మానెడు ధాన్యం, సాలెవారు దేవాంగులు ఇంటికి పాతిక"[4] అని పేర్కొనబడింది.[5]

కాటి పాపలు కేవలం కాటివద్ద యాచించటానికి పరిమితం కాకుండా ఇంద్రజాల విద్యతో తమ జీవనోపాధిని విస్తృతపరచుకొని గ్రామాల్లో ప్రజల మధ్య ప్రదర్శనలు ఇవ్వటం ప్రారంభించారు. పొలం పనుల్లో రెక్కలు ముక్కలు చేసుకొని చెమటోడ్చి పనిచేసే పల్లీయులకు కాటి పాపల అద్భుత ప్రదర్శన మానసికోల్లాసాన్ని, ఉత్సాహాన్ని కలిగించే ఆనంద రసగుళిక. కుతూహల

---

1. The role of Traditional Folk media in rural areas. Page. 47.
2. ఆంధ్రప్రభ - కాటిపాపలు (వ్యాసం) - 25.11.1990.
3. జానపద భిక్షుక గాయకులు (అముద్రిత సిద్ధాంతవ్యాసము) - పుట 121.
4. ఆంధ్రప్రభ 25.11. 19990 - కాటిపాపలు (వ్యాసం).
5. నేను సేకరించిన శాసనం పూర్తి పాఠాన్ని అనుబంధం - 5 లో చూడవచ్చు.

భరితంగా, విస్మయ వినోద జనకంగా ఉంది, ప్రజలు ఎక్కువగా ఇష్టపడే కళా రూపంగా ఈ ప్రదర్శన రూపుదిద్దుకున్నది.

ఎనిమిది శతాబ్దాల కంటే ముందునుంచే కాటిపాపలు ఉన్నట్లు ఆధారాలు ఉన్నాయి. 19 వ శతాబ్దం దాకా కేవలం కాటి కాపరులుగా ఉన్న వీరు 20 వ శతాబ్దారంభం నుంచి ఇంద్రజాలవిద్యను తమ వృత్తికి అన్వయించుకొని ప్రజలను అలరిస్తూ వచ్చారు. ప్రత్యేకమైన వేషధారణతోనూ, అద్భుతమైన కళాప్రదర్శన తోనూ కాటిపాపలు జానపదుల హృదయాల్లో తమస్థానాన్ని వదిలం చేసుకున్నారు.

## 6. మందెచ్చు వేషాలు :

బుడిగె జంగాల వృత్తి వేషాల్లో 'మందెచ్చు' వేషం ప్రత్యేకమైంది. సాధారణంగా బుడిగె జంగాలు సర్వకుల భిక్షకులు. మందెచ్చులు మాత్రం ఆశ్రిత కులభిక్షకులు. యాదవులను ఆశ్రయించి వీరు బ్రతుకుతారు. 'మందెచ్చు' వృత్తిలో ఉన్నవారు ఇతర వృత్తివేషాల జోలికి పోరు బుడిగె జంగాల్లో కథలు చెప్పేవారు భాగోతాలు ఆడటం, భాగోతాలవారు మరో వృత్తి చేపట్టటం కనిపిస్తుంది. కాని మందెచ్చులు మాత్రం అదే వృత్తిలో స్థిరంగా ఉంటారు.

'మందెచ్చు' పేరు 'మందహెచ్చు' అనే సమాసం నుంచి వచ్చింది. యాదవుల మేకల, గొర్ల మందల వద్ద మందెచ్చులు కథలు చెబితే, సంవత్సరమంతా మందలు రోగాలు రాకుండ, ఏ కీడు లేకుండ పెరిగిపోతాయని యాదవుల విశ్వాసం. మందలు హెచ్చాలని కథలు చెబుతూ యాదవులను ఆశ్రయించే వీరికి 'మందెచ్చు' లని పేరొచ్చింది.

**ఐతిహ్యం :** మందెచ్చు వృత్తి గాయకుల పుట్టుకను గురించి కుల వృద్ధులు ఒక ఐతిహ్యం చెబుతారు. పూర్వం ఒక బుడిగె జంగం స్త్రీకి ఒక యాదవునికి సంబంధం ఏర్పడి, సంతానం కలిగింది. తననే నమ్ముకొని ఉన్న ఆమెకు యాదవుడు తన మందలోనుంచి కొన్ని మేకలను, గొర్లను ఇచ్చాడు. నాటినుంచి ఆ వంశంవారు యాదవులను ఆశ్రయిస్తూ, వారి గోత్రాలను పొగడుతూ మందెచ్చులుగా వ్యవహరింపబడ్డారు.

**పూర్వ పరిశోధకులు :** శబ్ద సామ్యంవల్ల వీరికి 'మందపిచ్చులు' అనే వ్యవహార నామం కూడ ఏర్పడింది. అయ్యలరాజు నారాయణామాత్యుడు హంస వింశతిలో అన్ని కులాలతో పాటు వీరిని 'మందపిచ్చులు' (3-29) అని పేర్కొన్నాడు. 1920 లో హసన్ వీరిని గురించి తెలుపుతూ - కేవలం యాదవులను యాచిస్తారని, ఒగ్గు వాయిస్తూనో నగారా కొడుతూనో మంధచుట్టూ ఆడతారని వివరించారు[1] ఆధునిక పరిశోధకుల్లో డా. ఎన్. విజయ, డా. ఎన్. యాదగిరి శర్మగార్లు కూడ వీరిని గురించి వ్రాశారు.

మందెచ్చులకు 'పొడపోత్రపోళ్ళు' అనే పేరు కూడ ప్రచారంలో ఉందని, ఈ పేరు పొరపాటున వచ్చి ఉంటుందని డా. ఎన్. విజయగారు అభిప్రాయ పడ్డారు.[2] మందెచ్చు వద్ద పొడల పొడల మేకపోతులు ఉండటంవల్ల అతనికి పొడపోతులవాడని పేరువచ్చి, క్రమంగా అదే 'పొడపోత్ర పోళ్ళు'గా మారి ఉంటుందని భావించవచ్చు ఏవో కొన్ని ప్రాంతాల్లో తప్ప ఈ పేరు ఎక్కడా వినిపించటం లేదు.

తగరు జోగులు లేక తగిట జోగులు అనే పేరుకూడ వీరికి ఉందని డా॥ ఎన్. యాదగిరి శర్మగారు తెలిపారు.[3] కాని, ఈ పేరు కూడ ఎక్కువ ప్రచారంలో లేదు.

బుడిగె జంగాల్లో తూర్పాటి, ఉబది (విభూతి), సిరివాటి మొదలైన ఇంటి పేర్ల వారిలో కొన్ని కుటుంబాలవారు ఆయా ప్రాంతాల్లో మందెచ్చులుగా ఉన్నారు. వీరికి వతన్లు ఉంటాయి. రాగి శాసనం ఉంటుంది. ఒక్కో ప్రాంతాన్ని ఒక్కో కుటుంబం పంచుకుంటుంది. ఎవరి ప్రాంతంలోని గ్రామాలను వారు సంచరిస్తూ, యాదవులను అడుక్కుంటారు.

---

1. The castes and Tribes of H.E H. The Nizam's Dominions Page 507.
2. The Role of Traditional Folk media in Rural Areas- Page 64.
3. జానపద భిక్షుక గాయకులు (అముద్రితం) పుట - 383.

ప్రదర్శన : ఉప్పల (రంగారెడ్డి జిల్లా) నివాసి తూర్పాటి మల్లయ్య (60 సం॥) మందెచ్చు వృత్తి గాయకుడు తమ ప్రదర్శన గురించి ఈ క్రింది విధంగా వివరించారు. మందెచ్చులు గ్రామానికి వచ్చి, పెద్ద గొల్లను కలిసి కథ ఏర్పాటు చేయమని అడుగుతారు. అతడు మందలన్నీ ఫలానా రోజు ఫలానా చోటుకు తేవాలని యాదవులందరికి తెలియజేస్తాడు. నిర్ణయించిన రోజు సాయంత్రానికి మందలన్నీ ఒక చోటుకు చేరతాయి. మందచుట్టూ వలయంగా అక్కడక్కడ గుంజలు పాతి, తాడుతో అల్లిన వలలను చుట్టూరా కడతారు. దీనివల్ల జీవాలు (మేకలు, గొర్రెలు) చెల్లాచెదురై పోకుండ, అందులోనే మందగా ఉంటాయి

మందెచ్చుల వద్ద అర్ధగజం, గజం పొడవున్న యాదవ దేవతల తోలు బొమ్మలు ఇంచుమించు 20,30 ఉంటాయి.మల్లన్న,బీరన్న, అచ్చయ్య,గంగమ్మ మొదలైన బొమ్మలు అందులో ఉంటాయి. ఆ బొమ్మలకు సన్నని కట్టెలు అమర్చి మంద చుట్టూ పాతుతారు. తర్వాత ఒగ్గు, కొమ్ము తాళాలు వాయిస్తూ యాదవ దేవతలకు సంబంధించిన కథలు చెబుతారు. కొన్ని సందర్భాల్లో తాళాలకు బదులుగా నగారా ఉపయోగిస్తారు. దీన్ని 'పొలికథ' అంటారు. మందకు రోగాలు రాకుండా ఉండటానికి, పరంపరాభివృద్ధిగా మంద పెరగటానికి, మంద చుట్టూ తిరిగి మంత్రాలు వేసి, అక్షింతలు పొలి జల్లుతారు. దీనితో యాదవ దేవతలు అహర్నిశలు మందను కాపాడతాలని నమ్ముతారు.

ఒక్కొక్కప్పుడు గ్రామంలోని యాదవులంతా ఒకే మందగా కాకుండ. ఎవరి మంద దగ్గర వారు మందెచ్చులతో కథ చెప్పించుకోవటం కూడ ఉంటుంది,

మందల దగ్గర రాత్రి కథ చెప్పి, పొలిజల్లిన తర్వాత మందెచ్చులు ఊళ్ళో ఉన్న యాదవుల ఇంటింటికి వెళ్ళి వాళ్ళ గోత్రాలు చెబుతారు. వారి వద్ద మేకలను, గొర్లను, వస్త్రాలను. ధాన్యం మొదలైన వాటిని అడుక్కుంటారు. ఆ ఊళ్ళో మందెచ్చులు ఉన్నన్ని రోజులు యాదవులే వారికి భోజన వసతి కల్పిస్తారు. ఇంటికొకరు ఇద్దరు చొప్పున రోజూ భోజనాలు చేస్తారు. ఈ విధంగా ఆ ఊరంతా అడుక్కుని మరో ఊరుకు బయలుదేరతారు.

వీరు తొలిరోజుల్లో మందకు పొలిజల్లటం గోత్రాలు చెప్పటంతో తమ వృత్తిని ప్రారంభించి, రాను రాను ఎర్ర గొల్లలు చెప్పే ఒగ్గు కథలను కూడ నేర్చుకొని చెప్పటం ప్రారంభించి ఉంటారని భావించవచ్చు.

**మందెచ్చులు చెప్పే కథలు :**

1. ఎర్ర నూకరాజు కథ 2. ఎల్లమ్మ కథ 3. ఐతం రాజు కథ 4. ఒల రాజు కథ 5. కరియావుల రాజు కథ 6. కాటమరాజు కథ 7. కొమురన్న కథ, 8. గంగురాజు కథ, 9. గిరిజావతి కథ, 10. దొనుకొండగంగ కథ. 11. నల్లముకురాజు కథ, 12 నల్లమేడరాజు కథ, 13. పల్లికొండరాజు కథ, 14. పాపమ్మ కథ, 15. పెద్దమ్మ కథ, 16 పెద్దిరాజు కథ, 17. పోతురాజు కథ, 18. పోలరాజు కథ, 19. బీరప్ప కథ, 20 బొల్లావు కథ, 21. మల్లన్న కథ, 22. మాంధాత కథ, 23. మాత కథ, 24. సిరితొండరాజు కథ.

ఈ కథలన్నీ దాదాపుగా ఒగ్గు కథలే. కాబట్టి మందెచ్చులు తర్వాత కాలంలో ఈ కథలు నేర్చుకొని, గోత్రాలు చెప్పే తమ వృత్తికి అదనపు ఆకర్షణగా చేర్చుకొని ఉంటారు.

మందెచ్చు వృత్తిలో ఉన్న బుడిగె జంగాలు చాలా తక్కువగా ఉంటారు. జిల్లాకు రెండు మూడు కుటుంబాలవారికన్నా ఎక్కువ ఉండరు. మహబూబ్ నగర్ జిల్లాలో మన్యం కొండ సమీపంలోని ఓబలాయపల్లె నివాసి తూర్పాటి శంకరయ్య (55 సం॥) నాగర్ కర్నూల్ ప్రాంతాల్లో నివసించే ఊబది రామయ్య (50 సం॥) చెప్పుకోదగినవారు. నల్లగొండ జిల్లా మిర్యాలగూడెం పరిసర ప్రాంతాల్లో సిరివాటి రామదాసు అనే మందెచ్చు పర్యటిస్తాడు. వరంగల్, ఖమ్మం, కర్నూలు మొదలైన జిల్లాలో వీరు కనిపిస్తారు.

## 7. గురప్పల వేషాలు

బుడిగె జంగాల సామూహిక వృత్తికళల్లో 'గురప్పల' వృత్తి ఒకటి వీరు సర్వకుల యాచకులు. ఈ వృత్తిలో వెళ్ళేవారు చాలా తక్కువ. అన్ని జిల్లాల్లో కూడ వీరు కనిపించరు. రంగారెడ్డి నల్గొండ, వరంగల్ మొదలైన జిల్లాల్లో కొన్ని కుటుంబాలవారు సంచరిస్తుంటారు.

'గురప్పల' వృత్తి పుట్టుకను గురించి చౌటుప్పల (నల్గొండ జిల్లా)లో కడమంచి చంద్రయ్య (65 సం॥) ఈ క్రింది విధంగా చెప్పాడు. పూర్వం 'గురప్ప' అనే మందెచ్చు ఉండేవాడు. మందెచ్చు వృత్తిలో తిండికి అరకొరగా ఉండేది. ఈ కారణంగా అతడు మందెచ్చు వృత్తిని అనుకరిస్తూ, దేవతా విగ్రహాలను బుట్టలో పెట్టుకొని అడుక్కోవడం ప్రారంభించాడు.తర్వాత ఏకవ్యక్తిగా కాకుండ ఒక మేళాన్ని ఏర్పాటు చేసుకొని, సామూహికంగా వెళ్ళటం మొదలు పెట్టాడు. నాటినుంచి అతని వంశీయులు ఈ వృత్తిని కొనసాగించారు. అది మొదలుగా ఈ వృత్తికళాకారులు అతని పేరుతోనే "గురప్పవాళ్ళు", "గురప్పలవాళ్ళు' 'గుర్రప్పలవాళ్ళు' అని వ్యవహరింపబడ్డారు.

హసన్ (1920)లో గురప్పల వారి గురించి వివరించారు. గురప్పలు పూజగొల్ల సంతతివారమని చెప్పుకుంటారని, వీరు అమ్మవారు లేక ఎల్లమ్మ విగ్రహానికి చీర-రవిక తొడిగి, ఇత్తడి ఆభరణాలు అలంకరించి, వెదురుగంపలో పెట్టుకొని తలమీద మోస్తూ, దేవత మీద పాటలు పాడుతూ, ప్రజలకు జోస్యం చెబుతూ అడుక్కుంటారని హసన్ తెలిపారు.[1] డా ఎన్. విజయగారు (1988) కూడ గురప్పలను పేర్కొన్నారు.[2]

గురప్పలు ప్రస్తుతం సమ్మక్క, సారక్క, లేక అమ్మవారి బొమ్మలు ప్రదర్శించి అడుక్కుంటున్నారు. దేవతను గంపలో నెత్తికెత్తుకోవటం కాకుండ కావడిలో కూడ తెస్తుంటారు. కావడికి ఒక వైపు జోలె ఉంటుంది మరోవైపు వెదురు బుట్ట (పెట్టెలాంటి ఆకారం) లో దేవత విగ్రహాలు ఉంటాయి. అందులో ఎల్లమ్మ, సమ్మక్క, సారక్క, ముత్యాలమ్మ మొదలయిన దేవతా విగ్రహాలతో పాటు చిన్న గంట, పసుపు, కుంకుమ ఉంటాయి. పసుపును అందరికి బొట్టుగా పెడతారు.

---

1. The Castes and Tribes of H E H. The Nizam's Dominions. P. 506.
2. The Role of Traditonal Folk media in Rural Areas. Page - 46.

నలుగులు, ఐదుగురు కలిసి ఈ వృత్తిలో వెళుతుంటారు. ఒకడు డోలు వాయిస్తుంటే ఒకడు తాళాలు కొడుతుంటాడు. ఒకడు కావడిని భుజాన మోస్తుం టాడు. వాని చేతిలో త్రిశూలం ఉంటుంది మరొకడు ఒక చేతిలో అమ్మవారికి గొడుగు, మరోచేతిలో కొరడా పట్టుకుంటాడు వీరు గజ్జెల పొట్టిలాగులు తొడు క్కొని కాళ్ళకు గజ్జెలు కట్టుకుంటారు. నొసట పెద్ద బొట్టు ఉంటుంది.

ఒగ్గు కథ మాదిరిగా పాడుతూ వీరు భిక్ష సేకరిస్తారు.

"సమ్మక్క దయలు మీకు సాలగల్గానీ సాలగల్గానీ
సారక్కా మీ మీద కరుణా జూడనీ కరుణా జూడానీ
అమ్మవారి కొలువూలు మీర్ జేయరమ్మ మీర్ జేయరమ్మా
అన్ని కష్టాలు మీకు తీరునోయమ్మా తీరునోయమ్మా"

అంటూ పాడుతారు. పిల్లలకు పెద్దలకు రక్షగా వసుపుబొట్టు పెడతారు. ఇంట్లో కీడు తొలగటానికి కొందరు వీరితో పటాలు వేయించుకుంటారు. అమ్మ వారి కొలువు (పూజలు) చేయించుకుంటారు.

## 8. నాటాం పంతు :

విప్రవినోదులు, సాధనాశూరులు, పాములవాళ్లు, కాటిపాపలు మొదలైన జానపద వృత్తి కళాకారులు కనికట్టు ప్రదర్శనలు ఇస్తుంటారు వీళ్ళే కాకుండా అనేకులు అనేక రకాలుగా ఇలాంటి ప్రదర్శనలు ఇస్తుంటారు. చుట్టూ గుమి గూడిన వారిలో అక్కడొకరిని ఇక్కడొక్కరిని గురించి "ఇతడు ముసలివాడా? పిల్లవాడా? ఇదిగో ఈయన కట్టుకున్నది తెల్లపాగా? ఎర్రదా?" అంటూ ప్రశ్నలు అడుగుతుంటే కళ్ళకు గంతలు కట్టుకున్న మరొకడు సరిగ్గా సమాధానాలు చెబు తుంటాడు. చూస్తున్న జనం ఆశ్చర్యచకితులవుతుంటారు. వాళ్ళను నమ్మి, వాళ్ళమ్మే మందులూ మాకులు కొనుక్కొని వెళుతుంటారు. లేదా ప్రదర్శన చూసి తోచింది దానం చేస్తుంటారు. ఈ వృత్తి కళాకారులు తమలో తాము కొన్ని సంకేతాలు ఏర్పరచుకొని, వాటిని అనుకున్న ప్రకారం వరుసక్రమంతో ప్రదర్శించటం వల్ల, ప్రేక్షకుల కళ్ళముందే అద్భుతాన్ని సృష్టించగలుగు తున్నారు. ఇలాంటి కొన్ని సంకేతాలను ఆధారం చేసుకొని, జాతకాలు చెప్ప టమే బుడిగె జంగాల 'నాటాం పంతు.'

ఏకతార పంతులో ఒక్కడే మీటూతూ ప్రజలకు జాతకాలు చెబుతుంటాడు. 'నాటాం పంతు'లో ఇద్దరు - భార్యాభర్తలు పాల్గొంటారు. అయితే భర్త ఒక ఇంటివాళ్ళకు జాతకం చెబుతూ ఉంటే, భార్య పక్కింటి వారివద్ద మాట్లాడుతూ, భర్త జాతకం చెబుతున్న వారి వివరాలు సేకరించి సంకేతాల ద్వారా భర్తకు తెలియజేస్తుంది. దీన్నే బుడిగె జంగాల భాషలో 'నాటాం' అంటారు. 'పంతు' అంటే 'వేషం' అని అర్థం. చేతుల కదలిక ద్వారా భార్య దూరం నుంచి తెలియజేస్తున్న సంకేతాలను అర్థం చేసుకొని, భర్త వారికి జాతకం చెబుతుంటాడు. నీకింత మంది కొడుకులని, ఇంతమంది కూతుర్లని, ఇంతకుముందు ఇలా జరిగిందని, అలా జరిగిందని చెప్పగానే ఆ గృహస్థుడు ఆశ్చర్యపోయి పూర్తిగా విశ్వసిస్తాడు.

కొన్ని సందర్భాలల్లో ఆమె వివరాలు తెలుసుకొనివచ్చి, అతనితో చెప్పి, ఫలానా ఇల్లు అని చూపుతుంది. ఆ ఇంటికి వెళ్ళి నాటాం పంతు జాతకం చెప్పి వారికి నమ్మకం కలిగిస్తాడు ఇంటికి వచ్చిన పీడ వదిలించమని, కుటుంబ సభ్యుల్లో ఎవరైనా అనారోగ్యంగా ఉంటే, వారిని బాగు చేయమని, సంతానం లేకుంటే సంతానం కలిగేలా చేయమని గృహస్థు అడుగుతాడు. దానికి నాటాం పంతు కొబ్బరికాయలు, నిమ్మకాయలు, కల్లు, సారలు, కోడిపుంజు మొదలైనవి తెప్పించి, వారిమీదనుంచి దిగతుడిచి తీసివేస్తాడు. తాయెత్తులు కట్టి చూర్ణాలు, గోలీలులాంటి మందులు ఇస్తాడు.

నాటాం పంతులో ఒక్కొక్కసారి వివరాలు సేకరించటం అతని భార్యకు పీలుకాకపోవచ్చు. వివరాలు సేకరించినా, సంకేతాలు అందించటానికి అవకాశం చిక్కకపోవచ్చు. కొన్ని సందర్భాల్లో అతనికి సంకేతాలు అందుకునే అదను చిక్కకపోవచ్చు. ఇలాంటి ఇబ్బందులవల్ల ఈ నాటాం వంతుగాళ్ళు ఈ వృత్తిలో వెళ్ళటానికి ఇష్టపడరు. భార్యాభర్తలు వేరు వేరుగా వెళ్తుంటారు. భర్త ఏకతార పంతులో వెళ్తే, భార్య ముత్తడి పంతులో వెళ్తుంది.

## 9. ఇతరాలు :

సామూహిక వృత్తి కళల్లో కూడ అంత ప్రసిద్ధంకానివి కొన్ని ఉన్నాయి. ఎక్కడో ఒకచోట ప్రదర్శింపబడేవి, ఇటీవలి కాలంలో కొత్తగా నేర్చుకొన్నవి ఈ కోవకు చెందుతాయి. వాటిలో బుడిగె జంగాలు హరికథలు చెప్పటం, రుంజ వాయించటం, కొజ్జావేషాలు వేయటం చెప్పుకోదగ్గవి.

**హరికథలు :** బుడిగె జంగాల్లో యడవల్లి, మోతె, పెల్లూరి మొదలైన ఇంటి పేర్లవారు తమ పూర్వీకులు ప్రదర్శించే కళలన్నీ వదిలిపెట్టి, హరికథలు చెప్పటం నేర్చుకున్నారు. హార్మోనియం, తబలా, వాయులీనం మొదలైనవి నేర్చుకున్నారు. గత 15 సంవత్సరాలుగా వీరు ఈ వృత్తిని చేపట్టారు. మహబూబ్‌నగర్ జిల్లాలోని పెబ్బేరులో మోతె బాలస్వామి, మోతె ఆంజనేయులు, వారి బంధువులూ హరికథలు చెబుతారు. నర్సింగాయపల్లె, దాని పరిసర గ్రామాల్లో హరికథలు చెప్పే బుడిగె జంగాలు ఉన్నారు. అదే జిల్లాలోని ముని మోక్షం (హన్వాడ మండలం) వాస్తవ్యులు పొన్నకంటి రాములుగారు (50 సం॥) కూడ ఈ వృత్తిని అవలంబించారు. రంగారెడ్డి జిల్లా రామకృష్ణాపురంలో ఉన్న పర్తం నరసింహగారు మంచి హరికథకుడు.

**రుంజ జంగాలు :** శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల్లో జంగాలు కొందరు రుంజ వాద్యకారులుగా ఉన్నట్లు తెలుస్తున్నది. దేవాలయాల్లో, తిరునాళ్ళల్లో రుంజ వాయించి, ప్రజల మన్ననలు పొందుతున్నారు. శ్రీకాకుళం జిల్లా నివాసి విభూతి మల్లయ్యగారు రుంజ వాయించటంలో ప్రసిద్ధులు. వీరిని రాష్ట్ర ప్రభుత్వం కూడ సన్మానించింది. శక్తి దేవాలయాల్లో వీరు పూజారులుగా ఉంటారని, వీరికి ఇనాం భూములు ఉన్నాయని, బేడజంగం సంఘాధ్యక్షులు రాచమల్లు వెంకటేశ్వర్లుగారు (ఒంగోలు) చెప్పారు.

వనసలు, రుద్రాంగులు, కుమ్మర్లు మొదలైన కులాలవారితోపాటు జంగాలు కూడ రుంజవాళ్ళుగా ఉన్నారని, అంపోలు, అడపం (శ్రీకాకుళం జిల్లా) నివాసి విభూతి ఆంజనేయులు అనే జంగం రుంజ వాయించటమే వృత్తిగా పెట్టుకున్నాడని డా॥ ఎన్. యాదగిరి శర్మగారు తెలిపారు.[1]

**కొజ్జావాల్కాలు :** 'వాల్కం' అంటే 'వేషం' అని, 'కొజ్జవాల్కాలు' అంటే 'కొజ్జావేషాలు' అని అర్థం. వీధి భాగోతాలు ఆడే బుడిగె జంగాలు వాటికి ఆదరణ కరువైనందువల్ల జీవనోపాధికి కొజ్జావేషాలు నేర్చుకున్నారు. నిజమైన కొజ్జా వాళ్ళలాగా వేషాలు మార్చి, హైదరాబాదుతోపాటు బొంబాయి, సూరత్,

---

1. జానపద భిక్షుక గాయకులు (అముద్రితం) - పుటలు - 290, 291.

మైసూరు, బెంగుళూరు మొదలైన మహా నగరాలకు వెళ్ళి అడుక్కుంటారు. ఇంటింటికి సామూహికంగా వెళ్ళి, కొజ్జా వాళ్ళలాగా మాట్లాడుతూ ఇచ్చింది తీసుకుంటారు. పురుడయిన ఇల్లు కనిపిస్తే లోనికివెళ్ళి, శిశువుకు 'దిష్టి' తీసి, ఆశీర్వదించి, 100, 200 రూపాయల వరకు పుచ్చుకుంటారు. ఈ వేషాలు వేసే బుడిగె జంగాలు హైదరాబాదు, బొంబాయి నగరాల్లో నివసిస్తున్నారు.

పైన వివరించిన సామూహిక ప్రదర్శనా కళలన్నీ విలక్షణమైన ప్రక్రియా భేదాలతో జానపదులకు అభిమాన పాత్రమైనాయి. బుడిగె జంగాల ప్రజ్ఞా పాటవాలకు ఈ కళా ప్రక్రియలు దర్పణాలు. సంగీత సాహిత్య నాట్యశిల్ప చిత్ర కళల సమాహార స్వరూపాలైన జానపద కళలను బహుముఖాలుగా, అనేక రకాలుగా, అశేష ప్రజానురంజకంగా ప్రదర్శించే బుడిగె జంగాలు అభినందనీయులు. తర్వాత ప్రకరణంలో వీరి ఆచార సంప్రదాయాలను చూద్దాం.

# నాలుగవ ప్రకరణం

# ఆచార సంప్రదాయాలు

ఆచారానికి, సంప్రదాయానికి అవినాభావ సంబంధం ఉంది. ఆచరించేదే ఆచారం. ఒక వ్యక్తి ఆచరిస్తే అది 'అలవాటు' అవుతుంది. ఒక సమూహం ఆచరిస్తే అది ఆచారం అవుతుంది. సామూహిక ఆచారాలు ఆ సమూహం శ్రేయస్సుకోసం కట్టుబాటుకోసం ఏర్పడుతూ ఉంటాయి. ఆచారాలు ఒక కులాన్ని లేక జాతిని ఇతర కులాలవారి నుంచి, జాతులనుంచి వేరుచేస్తుంటాయి. అందుకే ఒక్కొక్క కులాచారాలు ఒక్కొక్క విధంగా ఉంటాయి. ప్రతి కులానికి, ప్రతి జాతికి ఆచారాల్లో భేదం ఉన్నట్లుగానే ఆయా ప్రాంతాల్లోని ఒకే కులంవారిలో కూడ స్వల్పభేదాలు కనిపిస్తాయి. ఆచరింపబడుతున్న ఆచారాలు సదాచారాలుగా రూపు దిద్దుకున్నప్పుడు అవి సంప్రదాయాలుగా సమాజంలో పరిగణింపబడతాయి.

''పారంపర్యముగా గాని, సమకాలికముగ సంఘములో అమలులో ఉండు అలవాట్లచేతగాని లేదా మత నియమములచేతగాని ఏర్పడునవి ఆచారములు"[1] అని విజ్ఞాన సర్వస్వం నిర్వచించింది. ఇంకా సంప్రదాయంగా పరిణతి చెందని ఆచారాలు పారంపర్యంగా వస్తుంటాయని, వర్తమానంలో కూడ శ్రేయోదాయకమైన విధానాలు కొన్ని ఆచారాలుగా మారుతుంటాయని దీనివల్ల తెలుస్తున్నది.

డా॥ సి. నారాయణరెడ్డిగారు ఆచార సంప్రదాయాలకున్న భేదాన్ని ''ఆచారము ప్రధానముగ ఆచరణకు సంబంధించినది. సంప్రదాయము ఆలోచనకు సంబంధించినది. కాని వ్యవహారమునందీ రెంటికంతగా భేదము పాటింపబడుటలేదు"[2] అని వివరించారు. ఆచారాలే తరతరాలుగా ఆచరింపబడుతూ సంప్రదాయాలుగా నిలుస్తున్నందువల్ల ఈ రెంటికున్న భేదాన్ని ప్రజలు ఎక్కువగా పట్టించుకోవటంలేదని భావించవచ్చు.

---

1. విజ్ఞాన సర్వస్వము-సంపుటి-10-పుట-284.
2. ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయము-ప్రయోగములు-పుట-3.

డా॥ సి. వసుంధరగారు సంప్రదాయాలను గూర్చి చర్చిస్తూ "పూర్వాచార ముల సారమే, ప్రతి కృతియే సంప్రదాయము. ఆచార సంప్రదాయములు రెండును ఒకదానితో నొకటి విడరాని సంబంధము గలవి'' అని విశదీకరించారు.1 దీన్నిబట్టి సారభూతమై, నిగ్గుదేలిన ఆచార సంచయమే సంప్రదాయం అవుతుందని స్పష్టపడుతున్నది.

ఆటవిక, సంచార జాతుల్లో కులపెద్ద కులస్థులందరిమీద తిరుగులేని అధిపత్యం కలిగి ఉంటాడు. ఏ కులస్థునికైనా ఆచార నియమోల్లంఘన చేయరాని పని. నాగరక సమాజపు అదుపాజ్ఞలుగాని, అధికార నిర్బంధాలుగాని వీరి ఆచారాలమీద ఎలాంటి ప్రభావం చూపవు. పుట్టుకనుంచి గిట్టేవరకు ఉన్న అన్ని సందర్భాలకు - ఎలా నడుచుకోవాలో చెప్పే నియమ నిబంధనల్లాగా ఆచారాలు ఉంటాయి. వాటిని ఆ తెగవాళ్ళంతా తు-చ తప్పక ఆచరించవలసిందే.

ఒక జాతి ఆచార సంప్రదాయాలే ఆ జాతి సంస్కృతికి దర్పణం వంటివి. ఒక కులం లేక తెగ సంస్కృతి గురించి చెప్పాలంటే వారి ఆచార సంప్రదాయాలను అధ్యయనం చేయవలసి ఉంటుంది. ఈ దృష్టితో బుడిగె జంగాల ఆచార సంప్రదాయాలను ఈ ప్రకరణంలో పరిశీలించవలసి ఉన్నది.

ఇందులో ప్రసూతి, నిశ్చితార్థం, వివాహం, చావు, ఆరాధనా పద్ధతుల్, కుల పంచాయతులు మొదలైనవి ఆచారాలు కాగా; పండగలు, ఇంటి పేర్లు, నమ్మకాలు, వేట, వైద్యం మొదలైనవి సంప్రదాయాలు. వీటి పరిశీలన ఈ కింది వరుస క్రమంలో ఉన్నది.

1. ప్రసూతి ఆచారాలు, 2. సమర్త ఆచారాలు, 3. నిశ్చితార్థం, 4. వివాహాచారాలు, 5. చావు - కర్మకాండ, 6. ఆరాధనా పద్ధతులు, 7. కుల పంచాయతులు, 8. పండగలు, 9 నమ్మకాలు, 10. ఇంటిపేర్లు 11. వేట, 12. వైద్యం.

---

1. తెలుగు జానపద సాహిత్యము - స్త్రీల గేయములలో సంప్రదాయము - పుట - 41.

## 1. ప్రసూతి ఆచారాలు :

మనిషి పుట్టగానే అతణ్ణి స్వజాతి ఆచారాలు చుట్టుముడతాయి. వాటితో చెట్టపట్టాలు వేసుకొని చివరి మజిలీ దాకా నడవక తప్పదు. కళ్ళు తెరిచినప్పటి నుంచి, కన్నుమూసేదాకా కలిసినడిచే ఆచారాలను కాదని జీవించటం కష్టం. మనిషి సంఘజీవి. సంఘం నియమాలకు ఆలవాలం. ఆ నియమాలే ఆచారాలు. కాలానుగుణంగా సమాజం, సమాజంలోని ఆచారాలు మారుతూనే ఉంటాయి. శిష్ట సమాజంలో తరతరాలకు అంతరం కనిపిస్తూనే ఉంటుంది. శిష్ట సమాజానికి దూరంగా ఉన్న అనాగరక తెగల్లో ఈ మార్పు అంత తొందరగా రాదు. శిష్ట సమాజాల్లో 50, 60 సంవత్సరాల్లో వచ్చే మార్పులు ఈ తెగల్లో రావటానికి రెండు, మూడు శతాబ్దాలు కావాలి. అందుచేత వీరిలో ఉండే ఆచారాలు తరతరాలుగా అవిచ్ఛిన్నంగా ఆచరింపబడుతూ కొనసాగుతుండటంవల్ల ప్రాచీన సమాజానికి ప్రతిబింబంగా వీళ్ళు మిగిలివుంటారు.

### (1) శిష్ట సాహిత్యంలో కనిపించే ప్రసూతి ఆచారాలు :

శిష్ట సాహిత్యంలో శుద్ధాంతాల్లో జరిగే ప్రసూతి ఆచారాలు వర్ణింపబడ్డాయి. శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యంలో ఈ వర్ణన చేశాడు. రక్షగా బూడిదతో రేఖ గీయటం, తెల్ల ఆవాలు చల్లటం, భూతబలి ఇవ్వటం, ఉప్పు నిమ్మ చిగుళ్ళు వాడటం, గవలధూపం వేయటం, గండతైలం పెట్టటం, కాయం తయారుచేసి ఇవ్వటం మున్నగు ఆచారాలు పాటించినట్లు ఇందులో కనిపిస్తుంది—

తలయంపి ధవళ నిద్రాకుంభ మిడువారు
  రక్షా భసిత రేఖ వ్రాయువారు
గౌర సర్షపరాజి కలయ జల్లెడివారు
  బలి విధానంబుల బరగువారు
లవణంబు నింబ పల్లవము ద్రిప్పెడువారు
  ప్రేము మంచంబుతో పెనుచువారు
గవల ధూపంబు సంఘటియించువారును
  మంచి మట్టెడద యోజించువారు
కదని దీపించువారును గండ తైల
మందుకొనువారు గాయంబులందువారు
పాడువారును పరిహాసమాడువారు
నైరి శుద్ధాంత సతులరిష్టాలయమున. (2-70)

సింహాసన ద్వాత్రింశికలో కూడ ప్రసూతి ఆచారాలకు సంబంధించిన వర్ణన చేయబడింది. ప్రసవం అయిన తర్వాత దాదులు శిశువును - కాచి చల్లార్చిన నీళ్ళతో స్నానం చేయించి, కాటుక, చుక్కబొట్టు పెడతారు. గడపకు వెలుపల తలవాకిట ప్రదేశంలో తవుడు, నిప్పులు, ప్రత్తి గింజలు పోస్తారు. వేప రెమ్మలు నీళ్ళల్లో వేస్తారు. పురిటింటికి రక్షణ గట్టి చేస్తారు. వాయనాలకు వనితలను రప్పించి, వాళ్ళు తెచ్చినవి తీసుకొని వాళ్ళకు పచ్చ కర్పూరపు వలుకులు పెట్టిన విడియాలు (తాంబూలాలు) ఇవ్వటం ఈ కింది పద్యంలో వర్ణించబడింది.

క్రమమున దాదులక్కడను ముప్పటిలిన
జలకంబు దేర్చి యా చెలువసుతుని
కొనరగ కాటుకయును చుక్కబొట్టును
పాటించి యా గడపకు వెలువట
పొదికిళ్ళ తవుడు నిప్పులు ప్రత్తిగింజలు
నిడియడ్డముగ బెట్టు పడిసివైచి
వేపరెమ్మలు నీళ్ళపెసలలోపలనించి
కావులు పురిటింట గట్టిచేసి
వాయనములకెల్ల వనితల రప్పించి
వారుదెచ్చినయవి వరుసనంది
పచ్చకప్పురంబు బలుకులు వెట్టి వి
డియములిచ్చిరింపు నయముగలుగ. (1.59)

ఈవిధంగా శిష్టసాహిత్యంలో సందర్భానుసారంగా కవులు ప్రసూతి ఆచారాల వర్ణనలు చేసినట్లు గమనింపవచ్చు.

## (2) జానపద సాహిత్యంలో....

జానపద సాహిత్యంలో ప్రసూతి ఆచారాల వర్ణన విరివిగా కనిపిస్తుంది 'కుశలవకుచ్చుల చరిత్ర' జానపదగేయంలో వర్ణింపబడ్డ ప్రసూతి ఆచారాలను ఆచార్య బిరుదురాజు రామరాజుగారు తమ సిద్ధాంత గ్రంథంలో ఉటంకించారు.[1]

---

1. తెలుగు జానపదగేయ సాహిత్యము - పుట - 757.

రుష్యాశ్రమంలో సీత ప్రసవించినప్పుడు జరిపిన ఆచారాలు ఈ కింది విధంగా ఉన్నాయి. బిడ్డపుట్టగానే ఇంతులు దర్భలు బొడ్డుపైన ఉంచి, బొడ్డు కోశారు. "మీరు పుడతారని మీ తండ్రి బంగారపు చేటలు చేయించాడు" అంటూ పుణుకులు చేటలోపోసి, పట్టుచీరల పొత్తిళ్ళు పరిచి, బాలుణ్ణి పవళింపబెట్టి 'బిడ్డ మాది, గడ్డ మీది' అని పలికారు. బాలింతకు స్నానం చేయించేచోట ముందుగానే ముత్యాల పీటవేసి 'రావే జానకి రమ్మ'ని పిలిచారు. ఆమెకు నడికట్టు కట్టి, కుడిపాదంతో కూర్చుండబెట్టారు. ఉల్లివేసి కాచిన నూనెతో సీతకు శిరసంటారు. పచ్చాకు (హరితపత్రం), కచోరాలు వేసిన శొంటి పిండి నలుగుపెట్టి స్నానం చేయించారు. 'కొట్టు కాయం' కొట్టి తెచ్చారు. అప్పుడే కాచిన ఆవులపాలు తెప్పించారు. పాదరక్షలు తొడిగించి, బొడ్డు కోసిన కత్తిని, వేప కొమ్మలను పట్టుకోవటానికి యిచ్చి, ఆమెను తూర్పుకు ముఖంచేసి నిలుచోబెట్టారు. సూర్యునికి మొక్కమన్నారు. 'ఏటనేట చూలింత బాలింత - దయచేయుము భాస్కరా!' అని సీత మొక్కింది. అక్కడున్న అతివలకు పసుపుకుంకుమ లిచ్చారు. జానకి వేడుకతో ఆకులు, పోకలు, కాయలు, పళ్ళు ఇచ్చింది.

బారసాలనాడు బావిలో చేద వేయించేటప్పుడు అతివలు సీతను తీసుకొచ్చి చేద వేయించారు. పొత్తిళ్ళ బట్టలు తడిపించారు. అక్కడ ముగ్గులు పెట్టారు. ఆకులు పెట్టారు. సీతతోపాటు కాంతలందరూ కప్పకు మొక్కి శీఘ్రమే లోనికి వచ్చేశారు.

ఇలాగే కథాగేయాల్లో, జంగం కథల్లో సందర్భం వచ్చినప్పుడు కథకులు ప్రసూతి ఆచారాలను వర్ణించే 'నమూనా'లు కనిపిస్తాయి.

### (3) ఇతర తెగల్లో, కులాల్లో....

శిష్ట సమాజంలో ఉన్న సీమంతం, జాతకర్మ, నామకరణం, డోలారోహణం మొదలైన ఆచారాలన్నీ మానవ నాగరికతాజన్యమైన పరిణామాలు. సంస్కరింపబడిన పూర్వాచారాల నవ్యరూపాలు. అనాగరక తెగలవాళ్ళు ఈ పద్ధతులకు అతీతులు. పూర్వాచారాలను యధాతథంగా ఆచరించటంలోనే వాళ్ళకు శ్రద్ధ. అనాగరక తెగల్లో ఏ జాతికి ఆ జాతి విలక్షణమైన ఆచారాలు ఉన్నాయి. ఆ విధంగానే ఒక కులంలోని ఆచారాలు మరో కులాచారాలకు భిన్నంగా

ఉంటాయి. ఆయా తెగలను, కులాలను గమనించినట్లైతే ప్రసూతి ఆచారాల్లో ఎంతో వైవిధ్యమున్నట్లు కనిపిస్తుంది.

తెలుగుదేశంలోని ఎరుకల తెగను, తమిళ దేశంలో కొరవలని, కన్నడ దేశంలో కొరచలని పిలుస్తారు. వీళ్ళు ఆచరించే పద్ధతులను 'కువాడ్ సంప్రదాయం' అంటారు ఈ సంప్రదాయంలో పురిటి సమయంలో స్త్రీకి చేసే ఉపచారాలన్ని పురుషునికి చేస్తారు.[1] ఎరుకల స్త్రీ ప్రసవ వేదన ఆరంభమగుటతోనే భర్తకు తెలియచేస్తుంది. అతడు తక్షణమే ఆమె వస్త్రాలు కొన్ని ధరించి, కుంకుమ బొట్టు పెట్టుకొని, పక్క గదిలోనికో, గుడిసెలోనికో వెళ్ళి, పొడవైన వస్త్రాన్ని కప్పుకొని పడుకుంటాడు. జన్మించిన శిశువును స్నానమాడించి తెచ్చి తండ్రి ప్రక్కనే పడుకోబెడతారు. ఇంగువ, బెల్లంతో చేసిన కాయం తల్లికి బదులుగా తండ్రికే ఇస్తారు తండ్రిని శయ్యమీదినుంచి కదలనీయక అతనికేది అవసరమైనా అతని వద్దకే తెచ్చి ఇస్తారు. 9 వ రోజున శిశువుకు నామకరణం చేస్తారు. ఈ ఆచారాన్ని బట్టే 'కొరవ స్త్రీకి శిశువు జన్మించినపుడు ఆమె భర్త కొరవన్ ఇంగువ తినాలి' అని తమిళంలో సామెత ఉన్నట్లు తెలుస్తున్నది.

యానాది తెగలో పురిటిస్త్రీకి మొదటి మూడు రోజులు ఆకుల కషాయం ఇచ్చి, ఆ తర్వాత ఆహారం పెడతారు.

కోయ తెగలో 7 రోజులు శౌచం పాటించి, ఆదే రోజున నామకరణం చేస్తారు.

కోయ తెగవాళ్ళమని చెప్పుకొనే ఖోండ్ తెగలో తల్లి శిశువు బొడ్డు కోస్తుంది. శౌచం మూడు రోజుల వరకు పాటిస్తారు. శిశువు జన్మించిన ఆరు నెలలకు నామకరణం జరిపిస్తారు. దీన్ని 'గాడుతువ' అంటారు.[2]

చెంచు తెగలో శిశువు జన్మించిన వెంటనే బొడ్డును అమ్ముతో కోస్తారు. 6 లేదా 7 దినాలు జాతాశౌచం అవలంబిస్తారు. 10 లేదా 12 రోజులకు నామకరణం చేస్తారు.

---

1. తెలుగు విజ్ఞాన సర్వస్వం - సంపుటి - 10 - పుట 249.
2. విజ్ఞాన సర్వస్వం - సంపుటి - 10 - పుట 337.

సవరలు శిశువు జన్మించిన పదవ రోజున ముక్కుకుట్టి, కేశఖండన చేసి, అదేరోజు నామకరణం చేస్తారు.

దొమ్మరివాళ్ళు జాతాశౌచం ఆరురోజుల వరకు పాటించి పురిటి శుద్ధినాడు కప్పకు మొక్కుతారు. ఆ రోజే నామకరణం కూడ జరుగుతుంది.

బోయకులంలో 'మాయి ముంత'ను ఇంటిముందు పాతేసి, దానిమీద ఒక గంపను బోర్లిస్తారు. బాలెంతకు కాయంపెట్టే ఆచారం లేదు. కస్తూరి మ్రింగిస్తారు. శిశువు పుట్టిన మూడవ రోజున నామకరణం చేస్తారు. బాలెంత 11వ రోజు బావి ముట్టుకుంటుంది.

లంబాడా తెగలో నొప్పులు వచ్చిన వెంటనే ఆమెను ఇంట్లోని గుంజకు ఆనిచ్చి కూర్చోబెట్టి, కట్టేసి, ఒంటరిగా వదలిపెడతారు. ఆమె ప్రసవించి, శిశువు బొడ్డును తానే కోస్తుంది. తర్వాత స్నానానికి ఏర్పాటుచేసిన స్థలంలో శిశువును తీసుకెళ్ళి కూర్చుంటుంది. ఇతర స్త్రీలు వేన్నీళ్ళు తెచ్చి, ఆమెను అంటుకోకుండా ఉండి నీళ్ళుపోస్తే, ఆమె స్నానం చేస్తుంది. ఆమె స్నానం చేశాకా ఆశౌచం పాటిస్తారు. (కొబ్బెర) కుడుకులు, బెల్లం కలిపి దంచి ఆమెకు కాయంగా ఇస్తారు. 5 రోజుల వరకు ఆమెకు ఆహారానికి బదులుగా 'కుడుక బెల్లం' తినిపిస్తారు.

హోపి ఆదివాసుల్లో నామకరణం ఇరవయ్యో రోజున జరుగుతుంది. షోషోన్ తెగల్లో నలభై రోజులు తల్లిని బిడ్డను దూరంగా ఉంచి, ఆ తర్వాత నామకరణం జరుపుతారు. ఓమహా ఇండియన్లలో ఎనిమిదవ రోజే బిడ్డను అందరికి పరిచయంచేసి నామకరణం జరుపుతారు.[1]

తెలుగుదేశంలోని బైండ్ల, మందుల, గంగిరెద్దుల, దాసరి మొదలైన కులాల్లో రకరకాలైన ప్రసూతి ఆచారాలు ఆచరణలో ఉన్నాయి.

### 4. బుడిగె జంగాల ప్రసూతి ఆచారాలు :

బుడిగె జంగాల్లో ఉన్న ప్రసూతి ఆచారాలు విలక్షణమైనవి. 'అపుత్రస్య గతిర్నాస్తి' అన్న ఆర్యోక్తిని అనుసరించే 'పుత్రుడు లేకుంటే పుట్టగతులు లేవు'

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుట - 244.

అనే సామెత పుట్టింది. సమాజంలో కూతురు కంటె కొడుకు కావాలనే అభిలాష మెండు. బుడిగె జంగాల్లో కూడ ఈ నమ్మకం ఉంది. 'కొడుకు పుట్టి కుల ముద్ధరిస్తాడు. బిడ్డ (కూతురు) పుట్టి బిరుదు నిలుపుతుంది' అంటారు.

జానపద కథల్లో ఉన్నట్లు సంతానం లేకుంటే పడరానిపాట్లు పడటం, కన్న దేవుళ్ళకు మ్రొక్కటం వీళ్ళలో కూడ ఉంది. దేవుళ్ళకు ముడుపులు కట్టటం, తాయెత్తులు కట్టుకోవటం, మంత్రించిన విభూతిని నీళ్ళలో వేసుకొని త్రాగటం, మంత్రించిన బొట్టు పెట్టుకోవటం, మంత్రకాని దగ్గరకు వెళ్ళి 'తీసేయించుకోవటం' మొదలైన ప్రయత్నాలు చేస్తారు. దేవుళ్ళకు 'వెండి కోరమీసాలు వెండి నామాలు మొదలైనవి చేయిస్తామని, సంతానం కలిగినట్లయితే గుడికివచ్చి పుట్టెంట్రుకలు తీయిస్తామని, నీ పేరు పెట్టుకుంటా' మని మ్రొక్కుకుంటారు. దేవుడి దగ్గరకొచ్చి దాసంగం (దాస సంఘం) పెడతామని మ్రొక్కుకుంటారు. దాసంగం అంటే ఐదుగురు దాసులను పిలిచి భోజనాలు చేయించటం. కొన్ని సందర్భాల్లో వైద్యుల వద్ద మందులు తినడం కూడ ఉంది.

గర్భిణీ స్త్రీకి సీమంతం చేయటం, ఆమెకు ఇష్టమైన వంటలుచేసి పెట్టటం, ఆమె కాలు కదపకుండ జాగ్రత్తగా చూసుకోవటం లాంటివి శిష్ట సమాజంలోనే కాని, కష్టజీవులైన ఈ సంచార జాతుల్లో సాధ్యం కాదు. ఆమె కనేవరకు కాయ కష్టం చేసుకుంటూనే ఉంటుంది. మొదటి కాన్పైనా, తండ్రిగారింట్లో చేయాలనే ఆచారం వీళ్ళకు లేదు. బుడిగె జంగాల్లో గర్భిణి అయిన కూతురును ఒక్కసారి కల్లు దుకాణానికి తీసుకెళ్ళి, తృప్తిగా ఆమెకు కల్లుత్రాగించటం ఒక ఆనవాయితి.

బుడిగె జంగాలకు కాన్పులు చేయటానికి మంగలి, చాకలి స్త్రీలు కాక కులస్థురాలైన మంత్రసానే ఉంటుంది. వీళ్ళు సంచార జీవనులు కాబట్టి కులస్థురాలైన ఆ మంత్రసాని ఏ ఊళ్ళో ఉంటే, కనటానికి ఇంకొక నెల ఉందనగానే ఆ ఊరెళ్ళి మంత్రసాని గుడిసె దగ్గర తమ గుడిసె వేసుకొని ఉంటారు. ఆ మంత్రసాని కుటుంబం మరో ఊరికి మారితే వాళ్ళ వెంటనే గర్భిణి కుటుంబం కూడ వెళుతుంది.

వీళ్ళవి మూడు వంకర్లతో అర్ధ చంద్రాకారంలో వేసుకున్న గుడిసెలు. గర్భిణీ స్త్రీకి నొప్పులు మొదలైనప్పటినుంచి, ప్రసవం జరిగిన 9 రోజుల వరకు రావటానికి పోవడానికి కొంచెం సందు ఉంచి ఆ ఇంటిమీద బొంతనో, దుప్పటినో లేక ఏదైన బట్టనో మరుగుగా ఉండటానికి కప్పుతారు.

నొప్పులు రాకుండా ప్రసవం కాకుండా బాధపడుతూ ఉంటే దగ్గరలో ఉన్న మంత్రగాని వద్దకు వెళ్ళి, ఇత్తడి చెంబులోనో, రాగి చెంబులోనో మంత్రించిన నీళ్లుతెచ్చి ఆమెకు కొంచెం త్రాగించి, ఆ చెంబు క్రింద పెడితే మైల అవుతుందని ఆ గుడిసె మీద పెడతారు. కాసేపు అయిన తర్వాత మళ్ళీ కొంచెం నీళ్లు త్రాగిస్తారు.

ఆమెకు నొప్పులు వచ్చి ప్రసవం అవుతున్నప్పుడు గుడిసె వెలుపల నిలబడి కొందరు స్త్రీలు కంచు తలె (తళియ > తలె) తీసుకుని మ్రోగించుకుంటూ "శివుడొచ్చె, శివుడొచ్చె, శివుడొచ్చె, దేవుడొచ్చె, దేవుడొచ్చె, దేవుడొచ్చె సామి సామి సామి....'' అంటూ ప్రసవం జరిగేవరకు నినాదాలు చేస్తారు.

'ప్రసవించు' అనే అర్థంలో 'నీళ్ళాడు' అనే పదబంధం వీళ్ళ వ్యవహారంలో ఉంది. 'నీరాడు' అనే పదం దీనికి సమానార్థకం. 'ఉత్కలాడు' అనే పలుకుబడి కూడ ఎక్కువగా వాడకంలో ఉంది. 'ఉదకములాడు' అనే సమాసమే 'ఉత్కలాడు' అనే పదబంధంగా మారింది. ఈ పదబంధాలకు 'స్నానం చేయు' అనేది సామాన్యార్థం. 'ప్రసవించింది' అనే ప్రయోగం వీళ్ళ నోళ్ళల్లో నలిగి 'ప్రసిద్ధయింది' అనే రూపాన్ని పొందింది

**కొల్లు :**

ప్రసవం జరిగిన తర్వాత 'కొల్లు' తయారు చేస్తారు. 'కొల్లు' అంటే బాలెంతరాలుకు స్నానం చేయించటానికి తయారుచేసిన గుండ్రని కాలువ మధ్య భాగం. నిఘంటువులో 'కొల్లుకట్ట', 'కొల్లుకుంట' అనే రెండు సమాసాలకు కూడ 'నీటిగుంట', 'వంపు'అనే అర్థాలు ఉన్నాయి.గుడిసెకు ఎదురుగాకొన్ని అడుగుల దూరంలో దాదాపు 2 మీటర్ల వ్యాసంతో 6 అంగుళాల వెడల్పు, 4, 5 అంగుళాల లోతు కలిగిన ఒక గుండ్రని కాలువను త్రవ్వుతారు. వేప మండలు తెచ్చి ఆ గుండ్రని కాలువ కట్ట మీద చుట్టూరా నాటుతారు. నట్టనడుమ మూరెడు గొయ్యి త్రవ్వి మాయినంత (మావి > మాయి) ఒక ముంతలో పెట్టి ఆ గొయ్యిలో దాన్ని సరిగ్గా, నిలువుగా పెట్టి, దానిమీద వేపరెమ్మలు వేసి, పూడ్చుతారు. పూడ్చిన తర్వాత దానిమీద ఒక పల్చటి బండను పెడతారు 'మాయి ముంత'ను సక్రమంగా పెట్టకుండా వంకర టింకరగా పెట్టి పూడ్చినట్లయితే శిశువు పాలు

కక్కుకుంటుందని విశ్వసిస్తారు. అందువల్ల ఆ ముంతను సరిగ్గా నిలువుగా పెడతారు. ప్రసవం జరగగానే గనుమ (గడప) దగ్గర (గుడిసె ముందు భాగంలో) కొడవలి లేక వేట కర్ర, పొర్కట్ట (పొరక కట్ట - పొరకలతోచేసిన కట్ట - చీపురు కట్ట) చెప్పు, పెంక (పెనం) వేసి ఉంచుతారు. బూడిద తీసుకొని ఇంటి చుట్టూరా గుండ్రంగా రేఖగా పోస్తారు. దీన్ని 'పొత్తి' లేక 'పొత్తికట్టటం' అంటారు.[1] ఇలా చేస్తే భూత ప్రేతాలు తల్లీ బిడ్డలకు సోకవని నమ్ముతారు.

బాలెంతరాలును స్నానం చేయించటానికి గూడెంలోని వాళ్ళు ఇంటికొక్క కడవ నీళ్ళు కాచి తెస్తారు. నీళ్ళు కాచేటప్పుడు అందులో వేపాకు, వాయిలాకు వేస్తారు.

బాలెంత చేతుల్లో కమ్మలకత్తి (వెదురుగడకు చివరన కట్టి ఈత రెబ్బలు (మట్టలు) కోయటానికి ఉపయోగించే చిన్న కొడవలి), ఎప్పుడూ వేపమండలు పట్టుకోవాలి. స్నానానికి వచ్చేటప్పుడు ఆమె గుడిసె బయటికి రెండడుగులువేసి నిలిచి ఉంటుంది. అప్పుడు మంత్రసాని ఆమె చేతిలోని వేపమండలు, కమ్మల కత్తిమీద కొన్ని నీళ్ళు చల్లగా, వాటిని నొసటి కానించి బాలెంత మ్రొక్కుతుంది. తర్వాత మళ్ళీ రెండడుగులువేసి నిలబడాలి. మళ్ళీ మంత్రసాని నీళ్ళు చల్లుతూ ఉంటే మ్రొక్కి, తిరిగి రెండడుగులువేసి కొల్లులో నిలబడుతుంది మూడవసారి మంత్రసాని వేపమండలమీద, కొడవలిమీద నీళ్ళు చల్లగా బాలెంత మ్రొక్కుతుంది. ఈవిధంగా మూడుసార్లు మ్రొక్కిన తర్వాత ఆమెకు స్నానం చేయిస్తారు. స్నానంచేసి ఇంట్లోకి వెళ్ళేటప్పుడు మళ్ళీ మూడుసార్లు మ్రొక్కి లోపలికి వెళ్ళాలి.

**నామకరణం :**

దీన్ని 'పురుడు' అని అంటారు. శిశువు పుట్టిన మూడవరోజున 'పురుడు' జరుపుతారు. ఆ రోజు ఉదయాన్నే గృహస్థుడు ఇద్దరు, ముగ్గురు కులస్థుల్ని షికారి (వేట)కి పంపుతాడు. వాళ్ళు తప్పకుండా చేపలు, ఎండ్రకాయలు, ఎలుకలు పట్టుకొస్తారు. ఉడతలు, ఉడుములు దొరికినా దొరకకపోయినా పరవాలేదు.

1. రక్షా భస్మిత రేఖ.

అదేరోజు బుడిగె జంగాల ఆచారం ప్రకారం మగపిల్లవాడు పుడితే 5 రూపాయలు, ఆడపిల్ల పుడితే 3 రూ॥లు కులానికి ఇస్తారు. కులస్థులు ఆ డబ్బుతో అందరికీ కల్లు వస్తే కల్లు, అందుకు సరిపోకుంటే బీడీలు కొనుక్కొని పంచుకుంటారు. మంత్రసానికి మాత్రం డబ్బులు ఇవ్వకుండ ఆమెకు 'కడుపు నిండ కల్లు' పోయించి, భోజనం పెడతారు. వారంరోజులదాకా మంత్రసాని బాలెంతకు ఉపచారాలు చేస్తూ ఉంటుంది. గూడెం పెద్దకు, ఇతర ముఖ్యులకు, వేటకు వెళ్ళిన వాళ్ళకు, స్నానానికి నీళ్ళు పెట్టినవాళ్ళకు - ఇంటి యజమాని 'ముంతకల్లు' ముట్టిస్తాడు. కొందరు కులస్థుల్లో ఇంటి కొతర్ని పిలిచి భోజనాలు చేయిస్తారు.

కులమంతా కలసి 'నీ కొడుకుకు లేదా కూతురుకు ఏం పేరు పెట్టా'వని తల్లిదండ్రులను అడుగుతారు. అప్పుడు తల్లిదండ్రులు పేరు చెబుతారు. సాధారణంగా తాతపేరో, నాయనమ్మ, అమ్మమ్మ పేరో పెడతారు. లేదా ఇంటిదేవతల పేర్లు ఎల్లమ్మనో, పోశమ్మనో, నాగమ్మనో అని మొదలైన పేర్లు పెడతారు. దేవునికి మొక్కితే పుట్టిన శిశువులకు ఆయా దేవుళ్ళ పేర్లు వెంకటయ్య, అంజయ్య, హనుమంతు, నర్సింహ, యాదగిరి, రామయ్య, తిరుపతయ్య, మల్లయ్య మున్నగు పేర్లు పెడతారు. తురక దేవుళ్ళను మొక్కితే మైబూబు, ఉసేను, జాంగీరయ్య, మస్తానయ్య మొదలైన పేర్లు పెడతారు. పిల్లలు పుట్టి చావగా చావగా కలిగిన సంతానమైతే కొన్ని ప్రత్యేకమైన పేర్లు పెడతారు. పుట్టిన బిడ్డను విస్తర్లో వేసి, తీసుకొని ఇస్తారయ్య లేక ఇస్తారమ్మ అని పేరు పెడతారు. పెంటకుప్పమీద పడుకోబెట్టి, తీసుకొని 'పెంటయ్య' అని, ఎవరి కొంగులోనో వేసి తీసుకుని 'భిక్షమయ్య' అని పేర్లు పెడతారు. మహబూబ్ నగర్ జిల్లాలోని కౌకుంట్లలో ఒక బుడిగె జంగం కులస్థుని పేరు జోలయ్య. పిల్లలు బ్రతకకుంటే ఈయన పుట్టాక ఇతణ్ణి ఒకరి జోలెలో వేసి, తిరిగి తీసుకుని 'జోలయ్య' అని పేరు పెట్టారట.

**కొల్లు కూడప్పటం :**

పురుడు (నామకరణం) నాడు చీకటి పడ్డాక ఈ తతంగం ప్రారంభమవుతుంది. వేటకు వెళ్ళి తెచ్చిన వాటిలో చేపల చారు, ఎండ్రకాయల చారు, ఎలుకలచారు వేరువేరుగా కాస్తారు. అన్నం వండుతారు. మూడు చిన్న చిన్న

పలుగురాళ్ళు తెచ్చి కడిగి, వాటికి పసుపు, కుంకుమ బొట్లుపెట్టి ఒక చేటలో పెడతారు. మూడు పెద్ద మర్రి ఆకులుగాని, మోదుగఆకులుగాని తెచ్చి వాటిలో కొంచం కొంచం అన్నం, చేపలు, ఎండ్రకాయ, ఎలుక మాంసం ముక్కలు పెట్టి ఆ చేటలోనే ఉంచుతారు. దీన్ని 'ఎడ' పెట్టటం అంటారు. 'భూతబలి' కోసం తయారుచేసే ఆహారాన్నే ఎడ అంటారు. చేటలో మూడు ఎడలు, మూడు బొట్లు పెట్టిన పలుగురాళ్ళతోపాటు ఒక దీపంత కూడ పెడతారు. అంతకు ముందే ఎల్లిపాయలు పొట్టుతీసి, వాటిని దారాలకు గుచ్చి మూడు దండలు తయారుచేస్తారు. ఈ దండలను, పలుగురాళ్ళను లింగాలు అంటారు. ఈ మూడు ఎల్లిపాయ దండలు కాకుండా శిశువు మణికట్లకు కూడ ఎల్లిపాయదండలు కడ తారు. మగపిల్లవాడైతే ఎల్లిపాయలహారం మొలతాడుగా కడతారు. తర్వాత బాలెంతకు ఎడలు, దీపం పెట్టిన చేట చేతికిచ్చి, ఆమెకు ఒక బట్టను నిండుగా కప్పి, కొల్లు దగ్గరకు తీసుకెళ్ళి మూడుసార్లు ప్రదక్షిణం చేయించి, తూర్పుకు గాని లేక పడమరకుగాని ముఖంపెట్టి కొల్లు మధ్యలో కూర్చోపెడతారు. మాయి ముంత గోయికి దగ్గర్లోనే మరో మూరెడు గొయ్యితీసి అందులో ఒక ఎడను, బొట్టుపెట్టిన పలుగురాళ్ళను, ఒక ఎల్లిపాయలదండ (లింగం)ను పెట్టి పూడ్చే స్తారు. మరో ఎల్లిపాయల దండను బాలెంత మంగళసూత్రం త్రాడుకు కడతారు మిగిలిన మూడవ ఎల్లిపాయల దండను-మొగపిల్లవాడైతే ఆడకుక్కకు, ఆడపిల్ల అయితే మగకుక్కకు కడతారు. ఒక ఎడను ఆ కుక్కకు తినిపిస్తారు. మూడవ ఎడను బాలెంత కొంచెం తిని, మిగిలింది ముగ్గురు చిన్నపిల్లలకు తినిపిస్తుంది. పుట్టింది మగపిల్లవాడైతే ముగ్గురు బాలికలకు, ఆడపిల్ల అయితే ముగ్గురు బాలు రకు తినిపిస్తుంది. తర్వాత అక్కడే భూమిమీద నిప్పులు పోసి వాటిమీద నూనె బొట్లువేస్తే పొగలేస్తుంది. అప్పుడు బాలెంత ''సమురు(నూనె) ధార నువు దీస్కో-పాల ధార నాకియ్యి'' అంటూ మూడుసార్లు అని భూమాతను మ్రొక్కుతుంది. తర్వాత పొంగులొట్టి కల్లుతో సాక పెట్టి ''కల్లు ధార మవ్వు దీస్కో-పాల ధార నాకియ్యి'' అంటూ మూడుసార్లు అని మళ్ళీ భూదేవిని మ్రొక్కుతుంది. నీళ్ళు సాక పెట్టి ''నీళ్ళధార నువ్వు దీస్కో-పాలధార నాకియ్యి'' అంటూ మూడుసార్లు అని మళ్ళీ భూదేవిని మ్రొక్కుతుంది. మ్రొక్కిన పిదప ఆమెను ఇంట్లోకి తీసుకు వెళతారు. కొల్లు చుట్టూ నాటిన వేపమండలను కాలువలో వేసి, పైె మట్టితో పూడ్చివేస్తారు. ఇంతటితో కొల్లు పూడ్చే తతంగం అయిపోతుంది. మర్నాడు ఉదయం వంట చేసిన బూడిదను మాయిముంత బండమీద పోస్తారు.

ఈ కులంలో కొంతమందికి మాత్రం కొల్లు తయారుచేసే ఆచారం లేదు. వీళ్ళలో బాలెంతకు పారాడు నీళ్ళ స్నానమే ఉంటుంది. అంటే, బాలెంత స్నానం చేసిన నీరు కొల్లుకట్ట లేదు కాబట్టి భూమ్మీద పారుతుంది. వీళ్ళు మాయిముంత గొయ్యిలో పెట్టకుండా దూరంగా పారవేస్తారు.

**చన్నీళ్ళు ముట్టటం :**

బాలెంతను ఏడవరోజుగాని, 9 వ రోజుగాని చన్నీళ్ళు ముట్టిస్తారు. అత్తనో, అక్కనో, వదిననో, ఎవరో ఒకరు చిన్న కుండ తీసుకెళ్ళి లేదా చెంబు తీసుకెళ్ళి బావిలో ముంచుకొని తెస్తుంటే - బాలెంత కొన్ని అడుగుల దూరం వెళ్ళి ఆ నీళ్ళ కుండను లేదా చెంబును ఎత్తుకొచ్చి ఇంటిదగ్గర దింపుతుంది. దీన్నే 'చన్నీళ్ళు ముట్టటం' అంటారు. చన్నీళ్ళు ముట్టటంతో ఆమె తిరిగి తన పనులు తాను చేసుకోవటం ప్రారంభిస్తుంది.

**దొండాకు పసరు :**

'పురుడు'నాడు అనగా 3 వ రోజు శిశువుకు దొండాకు పసరు. గ్రుడ్డు లోని చంద్రం (తెల్లనిది) కలిపి ఒక కాచిప్పనిండ త్రాగించి, కొంచెం వంటికి పట్టించి స్నానం చేయిస్తారు.

**పుల్లలు వేయటం :**

9 వ రోజు శిశువుకు స్నానం చేయించిన తర్వాత పుల్లలు వేస్తారు. చింతమాను బెరళ్ళ ముక్కలు తెచ్చి నిప్పుపెట్టి, అందులో దబ్బనం లేక సూదిని ఎర్రగా కాల్చి, శిశువు బొడ్డుచుట్టూ నిలువుగా బొడ్డుకు అటు ఒక వాత, ఇటు ఒక వాత పెడతారు. అడ్డంగా బొడ్డుమీదభాగాన రెండు వాతలు, బొడ్డు కిందిభాగాన రెండు వాతలు పెడతారు. దీన్నే పుల్లలు వేయటం అంటారు. పుల్లలు వేశాక కలినీళ్ళను శిశువు ముఖం మీద చల్లుతారు.

**బాలెంత ఆహారం :**

మిరియాలు, ఎండుమిరపకాయలు వేగించి, ఎల్లిపాయలు వేసి దంచి చేసిన పొడిని, ఎల్లిపాయలు వేసి కాగబెట్టిన నువ్వులనూనె లేక కుసుమనూనెను అన్నంలోకి యిస్తారు. ఇంచుమించు వారం రోజులు ఈ విధంగా ఇస్తారు. వాతాన్ని పోగొట్టి, బాలెంతకు శక్తి నివ్వటానికి 4, 5 రోజులదాకా ఉదయం, సాయంత్రం రెండు పూటలు బాలెంత ఎచ్చాలతో తయారుచేసిన 'కాయం' తినిపిస్తారు.

**బాలెంతకాయం :**

బాలెంత కాయానికి ఈ కింది "ఎచ్చాలు" (దినుసులు) వాడతారు 1. సొంటి. 2. మిరియాలు. 3. పిప్పళ్ళు. 4. మోడి. 5. వాయులవంగాలు. 6. అజామోదం. 7 చంద్రవామ (కురసానివామ) 8. సూర్యవామ. 9. మంచి వామ. 10. ఆకుపత్రి. 11. అకులకర్ర. 12. నులికాయ. 13. మంద్రపసుపు. 14. యాకెల్లిపాయ. 15. కుంకుమపువ్వు. 16. జాజికాయ 17. జాపత్రి. 18. రసకర్పూరం లేక చండూరం. 19. కరక్కాయ మొ॥

వీటిలో వామ, జాజికాయ, జాపత్రి, కుంకుమ పువ్వు, కరక్కాయ, ఎల్లిపాయలు కాకుండా మిగతావన్నీ పెనంమీద వేగించి పొడిచేస్తారు. ఎల్లిపాయలు వేసి మరగబెట్టిన నువ్వులనూనె లేక కుసుమ నూనెను ఆ పొడిలో పోసి ముద్ద చేస్తారు. దాన్ని రోజూ ఉదయం, సాయంత్రం బాలెంతకు 4 లేక 5 రోజులదాకా తినిపిస్తారు. దీన్నే 'బాలెంత కాయం' అంటారు. ఈ బాలింత కాయాన్నే (బాలింత మందును) తెలంగాణాలో "పెద్దమందు" అంటారని ఆచార్య బిరుదురాజు రామరాజుగారు తెలిపారు. పిప్పళ్ళు, శొంఠి, మిరియాలు, లవంగాలు, పత్రి, తాటి బెల్లం, ఇంగువ మున్నగు దినుసులతో ఈ మందు తయారు చేస్తారని, వారు గేయభాగాలను ఉదహరించారు.[1]

**ఆచారాల అంతరార్థం :**

ప్రసూతి ఆచారాల్లో సంఘ జీవులైన మనుషుల్లోని పరస్పర సహకారం, అధ్యాత్మిక దృష్టి, ఆరోగ్య సూత్రాలు ఇమిడి ఉన్నాయి. కొన్ని ఆటవిక తెగల్లో ప్రసవం అయ్యేటప్పుడు ఆమె ఒంటరిగా గూడెంకు దూరంగా వెళ్ళి "ప్రసవపు చెట్టు" దగ్గర ప్రసవించాలి. ప్రసవం జరిగాక అందరూ వచ్చి ఆమెను, బిడ్డను గూడెంకు తీసుకొస్తారు. ప్రసవ సమయంలో లంబాడా కులంలో కూడా దాదాపు ఇలాగే చేస్తారు. బుడిగె జంగాల్లో ఆ విధంగా కాకుండా గూడెంలో అందరూ సహకరించటం ఉంది. వేటకు వెళ్ళి చేపలు, ఎండ్రకాయలు, ఎలుకలు మొదలైనవి పట్టుకొని రావటం, పురుడు ఆనందంలో తాము పాలు పంచుకోవటం, స్నానానికి ఇంటికి కడవచొప్పున నీళ్ళు పెట్టటం లాంటివి సహజీవనాన్ని తెలియజేస్తున్నాయి.

---

1. తెలుగు జానపద గేయ సాహిత్యము - పు. 783.

ప్రసవ సమయంలో స్త్రీలు గుడిసె వెలుపల కంచు తలె మ్రోగించటం వల్ల ఆ మ్రోతకు కంటున్న స్త్రీ ప్రసవ వేదననుంచి మనసు మరల్చుకోగలుగుతుంది. అంతేకాకుండా ఆమె బాధతో చేస్తున్న మూలుగులు, అరుపులు ఇతర్లకు వినపడకుండా ఉంటుంది. కంచుతలె మ్రోగిస్తూ దేవుణ్ణి ప్రార్థించటం, ప్రసవం అనాయాసంగా జరగాలని తమ వంతు ఆత్మీయతను ప్రకటించుకోవటమే.

వలుగురాళ్ళను లింగాలుగా భావించటం శైవ సంప్రదాయాన్ని సూచిస్తున్నది. భూమాతకు ధూపదీప నైవేద్యాలు పెట్టి శిశువు వర్ధిల్లటానికి సమృద్ధిగా పాలు పడాలని పూజించటం, భూతబలిగా ఎదను పెట్టటం లాంటివి ఆధ్యాత్మిక దృష్టిని తెలియజేస్తాయి. పెరుగుతున్న చిన్న పిల్లలకు ఎద పెట్టటంలో తన శిశువు కూడ వాళ్ళలాగే పెరిగి పెద్ద కావాలనే ఆకాంక్ష గోచరమవుతున్నది. కుక్కను భూతప్రేతాలకు ప్రతినిధిగా తలచి దానికి శాంతి చేయటం వల్ల భూతప్రేతాలు శాంతించి తల్లి బిడ్డలను పీడించవనే భావన ద్యోతకమవుతున్నది. గుడిసె గనుమవద్ద వేట కర్ర, చీపురుకట్ట, చెప్పు, పెనం లాంటివి ఉంచటం వల్ల, ఇంటి చుట్టూరా బూడిదతో పొత్తి కట్టటం వల్ల భూతప్రేతాలు ఇంట్లోకి ప్రవేశించవని, బాలెంత చేతిలో లేక నడుముకు కమ్మలకత్తి ధరించటంవల్ల ఆమెను ఏ భూతప్రేతాలు ఆవేశించవని వీళ్ళు విశ్వసిస్తున్నట్లు బోధపడుతున్నది.

ఆరోగ్య విషయాలకు వస్తే రోగ క్రిములను నశింపచేసే గుణం కలిగిన వేపాకులను, ఎల్లిపాయలను, వాయిలి ఆకులను విరివిగా వాడతారు. శిశువు మణికట్లకు ఎల్లిపాయల దండకట్టటం, మగపిల్లవాడైతే మొలత్రాడుగా ఎల్లిపాయల దండ కట్టటం, బాలెంతరాలు తన మెడలో మంగళసూత్రానికి ఎల్లిపాయల దండ కట్టుకోవటం లాంటివి చేయటం వల్ల రోగ క్రిములు నశించి తల్లీ బిడ్డ ఆరోగ్యంగా ఉండగలుగుతారు. అంతేకాక, వెల్లుల్లిపాయలు పుటం పెట్టినవి తింటే సమృద్ధిగా పాలు పడుతాయి. బాలెంత చేతిలో ఎప్పటికీ వేపమండలు పట్టుకొని ఉండటం, కూర్చున్నా పడుకున్నా ప్రక్కనే పెట్టుకోవటం వల్ల కూడ రోగక్రిములు నశిస్తాయి. నీటిలో వేపాకులు, వాయిలాకులు వేసి కాచి స్నానం చేయించటంవల్ల రోగ జీవులు నశించటమేకాక శరీరానికి వేడి పుట్టటానికి వీలు కలుగుతున్నది. 'కొల్లు కట్ట' చుట్టూ వేపమండలు నాటటంవల్ల, బాలెంత స్నానంచేసే చోటును శుభ్రపరచినట్లవుతుంది. బాలెంతరాలు శారీరకంగా

బలహీనురాలై ఉండడంవల్ల రోగక్రిములు నిరాటంకంగా ప్రభావం చూపించ టంతో వెంటనే రోగగ్రస్థురాలయ్యే ప్రమాదాల్ని ఈ వేపమండలు పట్టుకునే ఆచారంవల్ల అరికట్టగలుగుతున్నారు. 'కొల్లుగుంట' ఏర్పాటు చేయడంవల్ల బాలెంత స్నానంచేసిన నీళ్ళు అందులో నిలిచి ఇంకిపోయి పరిసరాలు శుభ్రంగా ఉంటాయి. శారీరకంగా బలహీనురాలైన బాలెంతరాలుకు, 'బాలెంతకాయం' తినిపించటంవల్ల శరీరంలో వేడిపుట్టి బలం పుంజుకుంటుంది. జీర్ణశక్తి వర్ధిల్లి, ఎక్కువ ఆహారాన్ని తీసుకోగలుగుతుంది. బిడ్డకు కావలసిన పాలు సమృద్ధిగా లభ్యమవుతాయి. శిశువుకు పుల్లలు (వాతలు) వేయటంవల్ల తాగినపాలు బాగా జీర్ణమవుతాయని నమ్ముతారు. దొండాకు పసరు, గుడ్డు సొన తాగించి, శరీరానికి పట్టించటంవల్ల శిశువు శరీరం నునుపు దేరుతుందని, కురుపులులాంటివి లేవవని విశ్వసిస్తారు.

అనాగరిక తెగల్లో, కులాల్లో అనూచానంగా వస్తూన్న ఇలాంటి ప్రసూతి ఆచారాలు చాలావరకు నాగరికతా వాసన సోకని ప్రాచీన మానవ జీవన విధానాన్ని తలంపుకు తెస్తాయి. అయినా, ఆ ఆచారాల్లో సహజీవనం, ఆధ్యాత్మిక దృష్టి, ఆరోగ్య సూత్రాలు అంతర్లీనంగా నిబంధించబడి ఉన్నాయి.

## 2. సమర్త ఆచారాలు :

చిన్నారి పొన్నారి బాల్యానికి, పండు వెన్నెల లాంటి నిండు యవ్వనానికి మధ్య ఉన్నదే నవ యౌవన దశ. కౌమార యౌవనావస్థ అంటే ఇదే. ఆడపిల్ల సమర్త కావటం, మగవాడికి నూనూగు మీసాలు రావటం ఈ దశలోని శారీరక పరిణామాలు. సమర్త అవటంతోనే ఆడపిల్ల 'పెద్దమనిషి' అయిపోతుంది. శారీరకమైన ఈ మార్పుల వల్ల ఆమె మానసికావస్థ కూడ మారుతుంది. శరీరం ఏ విధంగా రంగులు దేరుతుందో తదనుగుణంగా మనసుకూడ ఎదిగి పొంగులు వారుతుంది. ఆమె నూతన వ్యవస్థలోకి అడుగు పెడుతుంది. స్త్రీగా రూపుదిద్దు కుంటుంది.

మగవాడు మీసాలు వచ్చి పెద్దవాడు కావటం కూడ వయోవస్థలో చెప్పుకో దగ్గ పరిణామమే అయినా ఆడపిల్ల పెద్దమనిషి కావటం స్థావర సమాజంలోవలెనే సంచార జాతుల్లో కూడ ఆనందోత్సాహాలకు ఆలవాలం అవుతుంది. అందువల్లే అన్ని ఆచారాల్లాగే సమర్త సందర్భాల్లో కూడ కొన్ని ప్రత్యేకమైన ఆచారాలు కొనసాగుతున్నాయి.

పెళ్లిపాటలు, వ్రతాలపాటలు ఉన్నంత విరివిగా సమర్త పాటలు లేవు. ఆచార్య రామరాజుగారు ఒక సమర్త పాటను 'తెలంగాణా పల్లె పాటలు'లో ప్రకటించారు. ఈ కింద ఇస్తున్న ఆ పాటలో సమాజంలో ఉన్న నాటి సమర్త ఆచార వ్యవహారాలు కనిపిస్తాయి.

సువ్వియనుచు పాడరమ్మా - సుందరాంగులు చూడరమ్మా
నవ్వుమాట గాదు కొమ్మా - నాతి సంర్తలాడెనమ్మా
యవ్వనంబు చాలదమ్మా - ఏమి ఎరుగని బాలికమ్మా
తెల్లచీరె కట్టెనమ్మా - తోయజాక్షి ఎరుగదమ్మా
తల్లి జూచి చెప్పెనమ్మా - తలవంచి నవ్వెనమ్మా
విప్రవరుని బిలువరమ్మా - విడియము సమర్పించరమ్మా
విప్పి పంచాంగము చూడగనే - యుక్తమైన నక్షత్రమానె
బాసురాంగి అత్తవారికి - శుభరేఖలు పంపేరమ్మా
పచ్చి కొబ్బెర పంచదార - పణతులందరు త్రొక్కిరమ్మా
పచ్చి శెనగలు పంచదార - పంచిపెట్ట సాగిరమ్మా[1]

సమర్త అయితే స్త్రీ వైవాహిక జీవితానికి అర్హురాలవుతుంది. 'సమరత' అనే తత్సమానికి రూపాంతరమే 'సమర్త.' తొలి మూడు పర్యాయాలు రుతుమతి కావటాన్నే సమర్త అంటారు. సమర్తకు సమానార్థకాలుగా పెద్దమనిషి, రజస్వల, పుష్పవతి, ఈడు మీరుట, ఈడేరుట అనే మాటలు వ్యవహారంలో ఉన్నాయి. సమర్త అయిన పిల్లను వేరుగా కూర్చోబెట్టటం వల్ల 'పిల్ల సమర్త అయింది' అన్నట్లుగా 'పిల్ల మూలకు కూర్చున్నది' అని అంటూంటారు. 'రుతుమతి అగు అనే అర్థంలో ఉన్న అంటగు, బట్టగు, ముట్టగు, కొంగుమాయు, బహిష్టగు, దూరముండు అనే ప్రయోగాలు సమర్త తర్వాత రుతుమతి అయితే వాడతారు. 'రుతుమతి'కి పర్యాయంగా ఆత్రేయి, ఉదక్య, రాక అనే పదాలుకూడ నిఘంటువుల్లో ఇవ్వబడ్డాయి.

---

1. తెలంగాణా పల్లె పాటలు - మొదటిభాగం - పుట - 109.

సమర్త ఏ రోజు అవుతుందో చెప్పటం కష్టం, అయినా వారంలోని ఏడు రోజుల్లో ఒక్కొక్క రోజు సమర్త అయితే ఒక్కొక్క ఫలం ఉంటుందని విశ్వసించే ఒక గేయాన్ని ఆర్.వి.యస్. సుందరంగారు ఉదాహరించారు:

ఆదివారమునాడు అతిరోగియౌను
సోమవారంనాడు సుదతి పతివ్రత
మంగళవారంనాడు మతిమంతురాలు
బుధవారము నాడు బుద్ధిమతియౌను
బేస్తవారమునాడు పుత్రవతి యౌను
శుక్రవారమునాడు శుభము సంపదలు
శనివారమునాడు సతి పేదరాలు.[1]

## (1) శిష్ట సాహిత్యంలో సమర్త ప్రస్తావన :

శిష్ట సాహిత్యంలో సమర్తను వర్ణించిన సందర్భాలు ఒక్క 'రాధికా సాంత్వనము'లో తప్ప-మృగ్యమే అనవచ్చు. ముద్దు పళని రాధికా సాంత్వనంలో ఇళాదేవి సమర్తను విపులంగా వర్ణించింది. ఈనాటికీ వీటిలో కొన్ని ఆచారాలు ఆచరింపబడుతున్నా, ఆనాటి సమాజంలోని సమర్త ఆచారాలకిది సమగ్ర వర్ణన అని చెప్పవచ్చు.

శుభదినాన సరస రుచిరాన్న భోజనం చేసిన తర్వాత ఇళాదేవి ఈడు మీరింది. "మన యశోదను పిలిచి ఇళ పుష్పవతి అయిందనిచెప్పి బహుమతులు పొందండి రోహిణీదేవిని రప్పించి, ఇవి సమర్త చిహ్నాలేనా కావా? తెలుసుకోండి.

చుట్టపక్కాలకు శుభలేఖలు రాసి పంపటానికి మామగారికి ఈ వార్త చెవిన వేయండి. దినశుద్ధి లగ్నం చూసి చెప్పటానికి గర్గుని పిలిపించండి. కలికి లత కూనవంటి ఇళ పుష్పవతి అయింది. సాంబ్రాణి, మధుర మధువు, మంచి ఖర్జూరాలను తెప్పించండి" అని రాధ పర్యవేక్షించగా వనితలు ఎవరి పనులు వారు చేశారు. అంటు ఉన్నవాళ్ళను మాత్రమే తాకటానికి నియమించి రాధ, ఇళను రత్నాల పీట మీద కూర్చోబెట్టింది. బ్రాహ్మణ ముత్తైదువలచేత పాటలు

---

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుట. 244.

పాడించింది. ఇళ విరిమేనుకు నలుగుపెట్టింది. కుంకుమ బొట్టు పెట్టింది. చల్లని పన్నీట స్నానమాడించింది. తడి ఒత్తి, కురులార్చి, జడవేసింది మెరుగైన పావడాను, దాని మీద చెంగావి కోకను కట్టించింది. రవికె తొడిగించింది. సొమ్ములు అలంకరించింది. జడలో జాజులు తురిమింది. ఇళను ఇంట్లో అరుగు మీద కూర్చోబెట్టి పాలు, పళ్ళుఇచ్చింది.వనితలను చిమ్మిలి[1]కొట్ట నియమించింది.

ఒకవైపు భేరి మొదలైన వాద్యాలు మోగుతూండగా రాధ ఇళను ఒడిబ్రాలు కట్టి, బంధుమిత్రాప్తులకు కుంకుమ, కర్పూరం, కస్తూరి, కుసుమాలు ఇచ్చింది. తర్వాత ఇళను తన పడకింటిలోపలికి తీసికెళ్ళి, మొల్ల పూల పాన్పు మీద పడుకోబెట్టి, దగ్గరలో వేపకొమ్మలు, బెత్తం ఉంచి జాగరం చేయటానికి స్త్రీలను నియమించింది. మాంత్రికుల్ని పిలిపించి, ఇంటిచుట్టూ యంత్ర తంత్రాలను చేయించింది. దారి భూతాలు చొరకుండా బూడిదను చల్లించింది.

మరునాడు వేడుకచేసి 'పిట్టు'[2] పెట్టింది. ఐదవరోజు తరుణులకు పసుపు నూనె ఇచ్చింది. ఇళను 'పెండ్లరుగు' మీద కూర్చోబెట్టగా ఆ తరుణులందరు సంపెంగనూనె అంటి ఇళను స్నానం చేయించారు. తర్వాత ఇంతులతోకూడి రాధ ఇళను అలంకరించింది ఒక భామ సుగంధ ధూపంతో ఇళ కురులను ఆర్చింది. ఒక లేమ ఆమెకు జడ వేసింది. ఒక కలికి కస్తూరి తిలకం దిద్దింది. ఒక కాంత మేను మీద బుక్కా చిలికింది. ఒక అతివ కెంపు పట్టు పావడాను కీలించింది. ఒక బోటి రైక ముడిపెట్టింది. ఒక చెలువ బంగారు కోక కట్టించింది. ఒక చాన మణిభూషణాలను భూషించింది. ఒక తరుణి నిలువుటద్దం చూపెట్టింది. ఒక రమణి మేనుకు గంధం పూసింది. ఒక పడతి అగరు ధూపం వేసింది. ఆ తర్వాత అదే రోజున అనసూయాది పేరంటాళ్ళు ఇళా మాధవులకు శోభనం చేశారు.[3]

---

1. నువ్వులు, బెల్లం కలిపి దంచి చేసెడి ముద్ద. రూపాంతరం - చిమ్మిరి.
2. వంట పాత్రలో నీళ్ళుపోసి, ఆ పాత్రకు వాసెన (ఆవిరి పోకుండ ఎసటి కుండ మూతికి కట్టిన గుడ్డ)ను కట్టాలి. ఆ నీళ్ళ పాత్రను పొయ్యిమీద పెట్టి, జొన్నలను రవ్వగా కొట్టి, అందులో బెల్లం వేసి దంచిన పిండి ముద్దను వాసెన మీద ఉంచి మూతపెట్టాలి. నీళ్ళు మరిగి వచ్చే ఆవిరి వేడికి వాసెన మీదుంచిన పిండి ఉడుకుతుంది. తర్వాత ఆ పిండిని కాచిన నేతిలో కలిపి ఉండలు చెయ్యాలి. దీన్నే 'పిట్టు' అంటారు. సమర్తయిన వాళ్ళకు బలం కోసం పిట్టు తయారుచేసి ఇస్తారు.
3. రాధికాసాంత్వనము - ప్రథమాశ్వాసము - 69 - 78 పద్యాలు.

## (2) జానపద సాహిత్యంలో సమర్త ప్రస్తావన :

జానపద సాహిత్యంలో సీత సమర్త అనే పాటలో సమర్త ఆచార వ్యవహారాలు చోటు చేసుకున్నాయి.

సీత సమర్త గేయంలో సీత జనకుని ఇంటి నుంచి అయోధ్యకు వచ్చిన తరువాత సమర్త అయింది. జోడు కూడి ఆడుతున్నప్పుడు, ఒక చేడియ చూచి, సీత సమర్తయిందని చెప్పింది. ఈ విషయం తెలిసి కౌసల్య వచ్చి కోడలిని చీర చూపుమని అడిగింది. సీత సిగ్గుతో శిరసటువంచి ఇటు కొద్దిగా చీరను చూపింది. కౌసల్య సంతోషించి వెంటనే విప్రులను పిలిచి, పంచాంగం చెప్పుమన్నది. "హస్త నక్షత్రం, పంచమి, సోమవారం, శుభ ముహూర్తం కాబట్టి, ఈమె పరమ పతివ్రత అవుతుంది. కొడుకులను కంటుంది. రాణి అయి రాజ్యం పాలిస్తుంది". అని చెప్పారు. తర్వాత కౌసల్య పేరంటాళ్ళను పిలువనంపింది. సీతకు పసుపు రుద్ది బంగారు పట్టుచీర కట్టించారు. చంద్రకావి రవిక తొడిగారు. కాటుక, కస్తూరి తిలకం తీర్చారు. అద్దం చూపెట్టారు. నాల్గు దిక్కులా మాణిక్యపు దీపాలు వెలుగుతూండగా, చుట్టూ పూలబంతులు కట్టారు. సువ్విపాటలు పాడుతూ చిమ్మిలి దంచారు. బంగారు పళ్లెరాల్లో తయారుచేసి పెట్టిన చిమ్మిలి ఉండల్ని కౌసల్య పంచి పెట్టించింది. తాను చేసిన పిండివంటలు, పులగం, పాయసాలను అందరికీ పెట్టింది. మూడవ దినం సమర్త వేడుకలన్నీ చేసి, నాల్గవనాడు సీతకు జలకమార్చారు. తర్వాత పసుపు నూనె పంచి, సీతను అలంకరించి సీతారాముల శోభనం చేశారు.[1]

'రుక్మిణి సమర్త' పాటలో కూడ ఇంకా కొన్ని ఆచార వ్యవహారాలు కనిపిస్తాయి. ఈ పాటలో రుక్మిణి సమర్త వేడుకలు ఈ విధంగా వర్ణింపబడ్డాయి:

12 సంవత్సరాల వయసులో రుక్మిణి సమర్త అయింది. ఆ రోజు సౌభాగ్యకరమైన మాఘమాసం, శుద్ధ పంచమి, శుక్రవారం పగలు, హస్త నక్షత్రం, సింహలగ్నం. భోజనం చేసిన తర్వాత రుక్మిణి సమర్త కాగానే వేడుకలు ఆరంభమయ్యాయి. సన్నాయిమేళంవాళ్ళు భజంత్రీలు వాయించారు.

---

1. స్త్రీల పాటలు - పుట - 53.

వేశ్య కన్యలు మృదంగాలు, వీణలు శ్రుతి కూర్చి పాడారు. చిమ్మిలి, నానబెట్టిన శనగలు, పొంగడాలు రుక్మిణికి ఇచ్చారు. పాయసాన్నం, దోసె, మధుర పదార్థాలు, వడలు, పులిహోరలను పెట్టారు. ఐదవ రోజున స్నానం చేయించారు. ఆశ్రిత బంధువులకు భోజనాలు చేయించారు. పువ్వుల పాన్పుమీద రుక్మిణిని కూర్చోబెట్టి ముత్తైదువలు పాటలు పాడారు. చామంతి, జాజి, దవనం, మల్లె, సంపెంగ పూలతో ఆమె కురులను అలంకరించారు. అగరు వేశారు. గంధం పూశారు. పన్నీరు చల్లారు. అత్తరు, జవ్వాది రాశారు. అరటి, పంపర పనస, జామ, నారికేళం మొదలైన పళ్లు ఇచ్చారు. పచ్చ కర్పూరం, కుంకుమ పువ్వులతో జాపత్రివేసి తాంబూలం ఇచ్చారు. ఈ విధంగా నాలుగు సమర్తల దాకా కేళిగా వేడుకలు చేశారు.[1] ఈ పాటను పిల్లాంశెట్టి కోదండరాముడు అనే ఆయన రచించాడు. 'పెద్దల గ్రంథముల్ శోధించి చెప్పా'నని పాటలో చెప్పుకున్నాడు. ఈ పాటలో నెల్లూరు శ్రీరంగనాయకుల ప్రస్తావన ఉంది. కాబట్టి ఈయన నెల్లూరు ప్రాంతంవాడే అయివుంటాడు. అందువల్లే ఈ పాటలో తమిళ వంటకాలు దోసె, వడలు మొదలైన పదార్థాలను పేర్కొనటం జరిగింది.

సమర్త ఆచారాలు ప్రపంచమంతటా ఆయా జాతుల్లో, ఆయా తెగల్లో రకరకాలుగా పాటింపబడుతున్నాయి. కొన్ని ఆదిమజాతుల్లో నవ యౌవనంలోకి అడుగుపెట్టగానే పురుషులకు కత్తి, విల్లంబులు, శిరోభూషణాలు మొదలైనవి ఇస్తారట. కొన్ని తెగల్లో మగపిల్లలు ఈ వయసులో తమ పళ్ళకు నల్లరంగు వేసుకుంటారట. అంగవైకల్యం ఆచారంగా ఉన్న జాతుల్లో పన్ను ఊడగొట్టుకుంటారని తెలుస్తూంది. చెయెన్నె తెగల్లో తండ్రి తన కూతురు సమర్త అయిన విషయాన్ని 'ఓహో! అందరూ వినండహో!' అని ప్రకటిస్తాడట.[2] కేరళలోని నాయర్ కులంలో పుష్పవతి అయినప్పుడే 'తాళికట్టు కళ్యాణం' జరిపిస్తారు.[3] మరికొన్ని జాతుల్లో గాజు పూసల దండలు మెడలో వేస్తారు. కొన్ని జాతుల్లో గాజులు తొడిగిస్తారు. బంగారు గాజులు, బంగారు పూసలహారం మొదలైన ఆభరణాలు ధరింపచేస్తారు.

---

1. మిన్నేరు. పుట - 45.
2. ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుట - 245.
3. తెలుగు విజ్ఞాన సర్వస్వం - సం. 10 - పుట - 710.

## (3) తెలుగుదేశంలోని కొన్ని తెగల్లో, కులాల్లో సమర్త ఆచారాలు :

తెలుగుదేశంలోని సంచార జాతుల్లో, కొన్ని కులాల్లో రజస్వలాచారాలు రకరకాలుగా ఉన్నట్లు తెలుస్తున్నది. విలక్షణమైన కొన్ని కులాల ఆచారాలను ఇక్కడ తెలియచేస్తున్నాను.

**మాల జంగం :**

ఈ కులంలో రజస్వల అయిన అమ్మాయిని ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన స్థలంలో కూర్చోబెడతారు. నిత్య కార్యక్రమంలో పాల్గొననీయరు. 5.9.11 వ రోజుల్లో స్నానం చేయిస్తారు. 13 వ రోజు రజస్వల శుద్ధిస్నానం చేయిస్తారు. కూరలేని అన్నం, మాంసం, తీపి ఆహారంగా ఇస్తారు. కూర్చున్న రోజుల్లో కులస్థుల్లో ఎవరో ఒకరు తీపి వంటకాలు చేసిపెడతారు. 13 వ రోజు లేపేనాడు కోడినో, మేకనో, గొర్రెనో కోస్తారు. అందరికీ విందు చేస్తారు. కల్లు సారా పోయిస్తారు. అమ్మాయికి గాజులు వేయించి కొత్తబట్టలు కట్టిస్తారు. సాయంత్రం కులస్త్రీలకు తాంబూలాలు ఇస్తారు. రెండవసారి 11 రోజులు, మూడవసారి 4 రోజులు కూర్చోబెడతారు. ఋతుమతి కాలాన్ని అంటుగా భావించే ఆచారం ఈ కులంలో ఉంది.[1]

**మాల దాసరి :**

ఈ కులంలో రజస్వల అయితే ఇంట్లోనే ఒక మూల పీటవేసి కూర్చోబెడతారు. సాయంత్రం ముత్తైదువల్ని పిలుస్తారు. వాళ్ళు అమ్మాయి నొసటికి గంధం, ఒంటికి పసుపు పూసి హారతి పడతారు. ఆ రాత్రి విందు జరుగుతుంది. సమర్తమైల 9 రోజులు పాటింపబడుతుంది. అమ్మాయికి అన్నం, నీళ్ళు ఇచ్చే పాత్రల్ని వేరుగా ఉంచుతారు. పెళ్లైనపిల్ల పెద్దమనిషి అయితే 5 వారాలు కూర్చోబెడతారు. ఆమెకు అన్నం, కూర, నెయ్యి, పాలు, కొబ్బర, బెల్లం ఇస్తారు. కొత్తబట్టలు కట్టిస్తారు. ఆమెనెవ్వరూ ముట్టుకోరు. ఎవరైనా ముట్టుకున్నట్లైతే మైలస్నానం చేయవలసి ఉంటుంది.[2]

---

1. Ethnographic notes - on Mala Jangam. Vol.II. Part-V.B - Page. 10.
2. Ethnographic notea on Mala Dasari ,, ,, Page. 23.

సిందోల్లు (చిందుల వాళ్ళు) :

ఈ కులంలో సమర్త అయిన అమ్మాయిని మేనమామగారింటి వద్ద ప్రత్యేకంగా వేసిన గుడిసెలో కుర్చోబెడతారు. అంటుస్నానం చేసేదాకా 5 రోజుల వరకు అమ్మాయి అక్కడే ఉంటుంది. రెండు రోజులకొకసారి స్నానం చేయిస్తారు. 6 వ రోజు తల్లిదండ్రుల ఇంటికి తీసుకొస్తారు. అక్కడ స్నానం చేయించి కొత్త చీర, రవిక కట్టిస్తారు. గొర్రెనో మేకపోతునో కోసి అందరికి విందు చేస్తారు. అమ్మాయిని లేపిన తర్వాత ఆమెను కూర్చోబెట్టిన గుడిసెను, అది వేసిన (కట్టిన) వానిచేతనే కాల్చివేయిస్తారు. రెండవసారి రజస్వల అయితే కేవలం ఒక్కరోజే అంటు పాటిస్తారు. ఆ తర్వాత రుతుమతి కాలంలో అంటు పాటించే ఆచారం వీళ్ళకు లేదు 1

బోయ :

వేపమండలు, కానుగమండలతో గుడిసెవేసి, సమర్త అయిన అమ్మాయిని అందులో కూర్చోబెడతారు. 5 రోజులు మైల పాటించి, అదే రోజు ఆ అమ్మాయి చేత ఆ కొమ్మల్ని తీయించి కాలబెట్టిస్తారు. వేరెవ్వరూ ఆ కొమ్మల్ని ముట్టుకో కూడదు. విందులు చేయటం, కల్లు సారా తాగటం మామూలే.

ఎరుకల :

ఈ కులంలో రాయలసీమ, తెలంగాణా ప్రాంతంలో ప్రత్యేకంగా వేడుక ఉండదు. 3 రోజులు మైల పాటిస్తారు. ఆంధ్రప్రాంతంలో 8 రోజులు పాటిస్తారు. సాయంత్రం పేరంటం జరుగుతుంది. అమ్మాయి కాళ్ళకు పసుపు, నొసటికి గంధం పూస్తారు. పాటలు పాడుతారు. పేరంటాళ్ళకు తాంబూలాలు ఇస్తారు. శుద్ధి రోజున కోడిని కోస్తారు. విందు చేస్తారు. కూర్చున్న రోజుల్లో అమ్మాయికి పప్పన్నం, కొబ్బరి, బెల్లం ఆహారం ఇస్తారు. ఈ కులంలో రుతుమతికాలం అంటుగా పాటింపబడదు.2

---

1. Ethnographic Notes - Vol. II. Part V - B (10). Page. 34. on Sindhollu.
2. Ethnographic Notes - Vol. II Part V - B (8) Page. 11. on Erukala.

**డోమ్ లేక డొంబర (దొంబ దాసరి) :**

శ్రీకాకుళం, విశాఖపట్నం ప్రాంతాల్లో నివసించే ఈ కులంలో సమర్త ఆచారాలు విలక్షణంగా ఉన్నాయి. సమర్తను వీళ్ళు 'మైనరు తీరుట' అంటారు. తల్లి సోదరుని కొడుకు (మేనబావ) చేత మర్రిచెట్టు కొమ్మలతో వేయించిన గుడిసెలో ఆమెను కూర్చోబెడతారు. 9 రోజులు అంటుగా పాటిస్తారు. 10 వ రోజు స్నానం చేయించి సమర్త వేడుకలు చేస్తారు. 10 వ రోజు 'దాసరి' అనే మతగురువును (బహుశః ఇతడు మాల దాసరి అయి ఉంటాడు) కార్యక్రమం నిర్వహించటానికి ఆహ్వానిస్తారు. గుడిసెకు ఎదురుగా ఒక మామిడి కొమ్మను, ఒక నేరేడు కొమ్మను పాతిస్తారు. 5 కుండల్లో నీళ్ళు నింపి, ఆ కొమ్మల ముందు భాగంలో పెడతారు. మతగురువు మంత్రాలు చదివి, మామిడి కొమ్మను నీళ్ళలో ముంచి అమ్మాయిమీద, ఆ కుండలమీద చిలకరిస్తాడు. అప్పుడు ఆ నీళ్ళను ఆమె స్నానానికి ఉపయోగిస్తారు. తర్వాత ఆమె ఆ కొమ్మలు పట్టుకొనిరాగా వాయిద్యాలు మ్రోగిస్తూ సమీపంలోని కొండవాగు దగ్గరకు ఆమెను తీసుకు వెళతారు. కులంలోని ఒక వయసుమళ్ళిన స్త్రీ ఆమె వెంటవుండి తీసుకెళుతుంది. ఆ వాగువద్ద కొంత ప్రదేశాన్ని శుద్ధిచేసి, అక్కడ బురదతో ఒక లింగాన్ని చేస్తారు. గంగాదేవిని పూజించి, భూతప్రేత పిశాచాలపీడ వదలటానికి ఆ అమ్మాయి ఒక గ్రుడ్డును గంగలో వేస్తుంది.

కొండవాగులో అక్షింతలు వేస్తుంది. తర్వాత వేడినీళ్ళతో స్నానంచేసి, బట్టలన్నీ ఉతుక్కొంగానే ఇంటికి వస్తారు. మామిడి, నేరేడు బెరళ్ళు, ఆవుపేడ, నీళ్ళల్లో కలిపి చల్లి ఇంటిని శుద్ధిచేస్తారు. అమ్మాయి వెంటఉన్న స్త్రీ, ఆ అమ్మాయి కట్టిన మైలచీరను తీసుకుంటుంది. ఆ స్త్రీ సమర్త గుడిసె కొమ్మలన్నీ తీసి కాల్చివేస్తుంది. చివరిరోజు అందరికీ విందు చేస్తారు. అమ్మాయికి కొత్త చీర కట్టిస్తారు. రెండవసారి రజస్వల అయినప్పుడు 7 రోజులు మైల పాటిస్తారు. 8 వ రోజు మైలస్నానం చేసినదాకా ఆమె యింట్లో పాత్రలు ముట్టుకోకూడదు.[1]

**దొమ్మరి :**

దొమ్మరి కులస్థులు రజస్వల అయిన కన్యను 7 దినాలపాటు గుడిసెలో కూర్చుండబెట్టి, ఆమె పక్కన ఒక ఇనుపముక్కను ఉంచుతారు. 8 వ నాడు రజస్వల శుద్ధి అయినతర్వాత ఆ గుడిసెను తగులబెడతారు.[2]

---

1 Ethnographic Notes. Vol. II. Part. II - 3 (9) page 13.

2. తెలుగు విజ్ఞాన సర్వస్వం - 10 - పుట - 438.

ఇంకా బైండ్ల, దాసరి, గంగిరెద్దుల, మిత అయ్యలవారు మొదలైన కులాల్లో కూడ ఇంచుమించు ఇలాంటి ఆచారాలే ఉన్నాయి. డెక్కలి, మొండి, మాష్టి, లంబాడీ మొదలైన కులాల్లో సమర్త అంటు పాటించరని తెలుస్తున్నది. సమర్త అయిన అమ్మాయి మామూలుగా పూర్వంలాగే తిరుగుతుంది.

ఈ విధంగా సమర్త ఆచారవ్యవహారాలు ఆయా తెగల్లో కులాల్లో భిన్న విధాలుగా ఆచరింపబడుతున్నా అంతరాంతరంగా ప్రవహించే మూలసంస్కృతి మాత్రం భిన్నత్వంలో ఏకత్వంగా అలరారుతూంటుంది.

**(4). బుడిగె జంగాల సమర్త ఆచారాలు :**

బుడిగె జంగాల్లో ఆడపిల్ల రజస్వల కాగానే తమ గుడిసె ప్రక్కనే మరో చిన్న గుడిసె వేస్తారు. స్త్రీలు అమ్మాయిని గుడిసెలోనికి తీసుకెళ్ళి తలమీద కొబ్బరికుడుక పెట్టి రెండు చేతులతో వత్తి, వగలగొట్టి, ముక్కలు చేసి, బాలికలకు పంచి, ఆమెకు కూడ ఇస్తారు. ఆ అమ్మాయిని ఆమె కోసం ప్రత్యేకంగా వేసిన చిన్న గుడిసెలో కూర్చోబెడతారు. కమ్మల కత్తి ఎప్పటికి ఆమె చేతిలో ఉండాలి. లేదా నడుముకు దోపుకోవాలి. ఆమెను కూర్చోబెట్టి, గనుమదగ్గర వేటకర్రు, చీపురుకట్ట మొదలైనవి వేస్తారు. ఆమెను కూర్చోబెట్టిన గుడిసెచుట్టూ బూడిదతో పొత్తి (రక్షారేఖ) కడతారు.

పెద్దమనిషి అయిన అమ్మాయికి కూరలేని పప్పన్నం పెడతారు. పెసరపప్పు లేక కందిపప్పును బియ్యంతో కలిపి వండి పెడతారు. గూడెంలోని స్త్రీలు తలా ఓ కొబ్బరి కుడక చొప్పున తెచ్చి ఇస్తారు. పెద్దమనిషి అయిన అమ్మాయి బెల్లంతో కలుపుకుని కొబ్బెర (కుడుకబెల్లం)ను తింటుంది. ఈ కుడుకబెల్లం తినటం వల్ల నడుముకు సత్తువ రావటమేకాకుండా స్తనసౌభాగ్యమూ, శరీరానికి నునుపు వస్తుందని అంటారు. కూర్చున్న 7 వ రోజు లేక 9 వ రోజు లేక 11 వ రోజున లేపి 'కుండల్లో కలుపుతారు.'

**కుండల్లో కలపటం :**

చద్ది గంజిని వేడిచేసి, అందులో కొంచెం ఉప్పు కలిపి, కొంత అన్నం వేసి కలిపి ఆమె దోసిట్లో 3 సార్లు పోసి త్రాగిస్తారు. తర్వాత ఆమెతో నీళ్ళ

కుండను ముట్టిస్తారు. దీన్నే 'కుండక్లో కలపటం' అంటారు. దీనితో రజస్వల శుద్ధి అయి, యథాపూర్వంగా ఆమె పనిపాటల్లో పాల్గొంటుంది. రుతుమతి కాలాన్ని ఈ కులంలో అంటుగా భావించరు.

మొదటిసారి 11 రోజులు కూర్చోబెట్టిన వాళ్ళు రెండవసారి 9 రోజులు, మూడవసారి 7 రోజుల ప్రకారం కూర్చోబెడతారు. మొదటిసారి 9 రోజులు కూర్చోబెడితే రెండవసారి 7 రోజులు, మూడవసారి 5 రోజులు కూర్చోబెడతారు. కొందరు వరుసగా 7, 5, 3 రోజుల చొప్పున కూడ కూర్చోబెడతారు. బేసి సంఖ్య రోజుల్లోనే లేపటం చాలా కులాల్లో కనిపిస్తుంది.

పెద్దమనిషి అయిన అమ్మాయిని లేపిన తర్వాత ఆమెను కూర్చోబెట్టిన గుడిసెను, ఆమెకు పరిచిన చాపను, కప్పుకున్న బొంత లేక దుప్పటిని కూడ తీసుకెళ్ళి దూరంగా పారవేస్తారు. ఇవన్నీ పారవేస్తే, భూతప్రేత పిశాచాలవల్ల కీడు ఉండదని నమ్ముతారు. దొమ్మరి, దొంబదాసరి, బోయ, సిందోల్లు మొదలైన కులాల్లో సమర్త గుడిసెను కాల్చివేస్తారు.

బుడిగె జంగాల్లో బాల్య వివాహాలు ఎక్కువ. వివాహం జరిగాక కూడ పెద్దమనిషి అయ్యేంతవరకు అమ్మాయి తల్లిగారింట్లోనే ఉంటుంది. అధికాధికంగా పెళ్ళైన తర్వాతనే సమర్త అవుతుంటారు పెళ్ళైన తర్వాత పెద్దమనిషి అయినట్లయితే, ఆమె అత్తమామలు వచ్చి, తమ వియ్యంపులకు (కన్య తల్లిదండ్రులకు), కులపెద్దకు, ఇష్టమైనవాళ్ళకు కల్లు, సారాయి పోయించి, భోజనాలు పెట్టాలి. పెళ్ళికాని పిల్ల తల్లిదండ్రుల వద్ద పెద్దమనిషి అయితే, ఆమె తల్లిదండ్రులు ఈ ఖర్చులు పెట్టే ఆచారం లేదు. సమర్త సందర్భంగా మేకనో, గొర్రెనో కోసి విందులు చేసే పద్ధతి వీళ్ళలో లేదు. పేరంటాళ్ళ కార్యక్రమం లేదు.

**ఆచారాలు - అంతరార్థం :**

సమర్త కాగానే వేరుగా కూర్చోబెట్టటం ఆచారం. పుష్పవతి అయిన ఆడపిల్ల మరో కొత్త వ్యవస్థలోకి అడుగు పెడుతుంది. శారీరకమైన మార్పులు, తదనుగుణంగా మానసికమైన ఎదుగుదల ఆమెలో కలుగుతుంది. స్త్రీగా తాను వహించబోయే బరువు బాధ్యతలకు ఆమె ఇప్పుడే సిద్ధమవుతుంది. సమర్త కాలంలో

ఆమెను ఎవ్వరూ అంటుకోటానికి వీలులేకుండ నియమరూపంలో ఆచారాలు ఏర్పడ్డాయి. రజస్వల కాగానే శరీరంలో జరిగిన నూతన పరిణామానికి అందో ళన చెందకుండ స్థిమితపడటానికి ఈ వేరుగా ఉంచటం దోహదం చేస్తుంది. బల వర్థకమైన మంచి ఆహారం ఇవ్వటంవల్ల ఆమె శరీరంలో శక్తి పుంజుకుంటుంది. భావిజీవితాన్ని ఎదుర్కోటానికి అమెలో ఆత్మ విశ్వాసం కలుగుతుంది. స్నాన పానాదులు మంచి ఆహారం, అలంకరణ వల్ల అమె వన్నె చిన్నెలతో కన్నెగా అలరిస్తుంది.

సమర్త ఫలం చూడటానికి శిష్ట సమాజంలో బ్రాహ్మణులను రప్పిస్తారు. చెడు వార తిథుల్లో సమర్త అయితే నవ గ్రహాలను పూజించటం, ఇష్టదైవాన్ని అర్చించటం ఉంటుంది. సంచార జాతుల్లో, తెగల్లో ఈ పద్ధతి ఆచరింపబడదు. ఈ సందర్భంలో పేరంటాళ్ళకు పసుపునూనె ఇవ్వటం, తాంబూలాలు (ఆకు పోకలు) ఇవ్వటం ఆచారాలు.

సువ్వి పాటలు పాడుతూ చిమ్మిలి దంచటం సంప్రదాయం. సమర్త రాలుకు పిట్టు పెట్టటం లేదా కొబ్బరిబెల్లం దంచి ముద్దలుచేసి ఇవ్వటం కూడ ఉంది. పాలు, పళ్లు ఇస్తారు. పులగం, పులిహోర, తీపి వంటలు పెడతారు. ఈ ఆహారం వల్ల ఆమె శరీరం శక్తివంతమవటమే కాకుండా ఆమె అందం కూడ ఏపారుతుంది.

సమర్త అయిన అమ్మాయి దగ్గర వేపమండలు, బెత్తం, కొడవలి మొద లైనవి ఉంచటం వల్ల, చుట్టూ మంత్రించిన బూడిదతో రక్షరేఖ ఏర్పరచటం వల్ల భూతప్రేతపిశాచాలు దగ్గరకు రావని, వాటి పీడ ఉండదని నమ్ముతారు. అంతేకాకుండా ఈ గుర్తులవల్ల ఆ ఇంట్లో లేదా ఆ వైపు సమర్తరాలు ఉన్నదని తెలిసిపోయి ఇతరులు తదనుగుణంగా నడుచుకుంటారు.

కొన్ని తెగల్లో, కులాల్లో రజస్వల అయిన అమ్మాయికోసం వేసిన గుడి సెను దూరంగా పారవేయటమో, కాల్చివేయటమో చేస్తారు. ఇలా చేస్తే కీడు పోతుందని విశ్వసిస్తారు. ఆరోగ్యరీత్యా ఇందువల్ల పరిసరాలు శుభ్రం చేసినట్లు కూడ అవుతుంది. కొన్ని కులాల్లో రజస్వల గుడిసెను వేప, కానుగ, నేరేడు మండలతో వేస్తారు. ఆ ఆకుల నీడకూడ ఆరోగ్యదాయకమై ఉండవచ్చు.

పుష్పవతి కాగానే కులాచారాలను అనుసరించి అమ్మాయిని రకరకాల ఆభరణాలతో అలంకరిస్తారు. పూసల దండలు మెడలో వేస్తారు. మట్టి గాజులు తొడిగిస్తారు. కొందరు బంగారు గాజులు తొడిగిస్తారు. బంగారు పూసలహారం మెడలో వేస్తారు. ఇవన్నీ సుమంగళికి గుర్తులు. సమాజంలో పునిస్త్రీలను, కన్నెలను వితంతువులనుంచి వేరుగా చూస్తారు.

సాధారణంగా పూర్వకాలంలో పెళ్ళయ్యాకనే సమర్తలు అయ్యేవారు. ఇళాదేవి, సీతాదేవి సమర్తలు అలాగే వర్ణింపబడ్డాయి. అనేక తెగల్లో, కులాల్లో కూడ పెళ్లైన తర్వాతనే సమర్త అయినట్లు తెలుస్తున్నది. అంతవరకు పావడా (లంగా)లవంటి దుస్తులు ధరించినా, సమర్తనాడు కొత్తచీర, రవికె కట్టించటం ఆచారంగా ఉంది. అప్పటినుంచి వాళ్ళు చీర కట్టుకోవటం ప్రారంభిస్తారు.

సమర్త శుద్ధినాడు కోడి, మేక, గొర్రెలను కోయటం కొన్ని కులాల్లో ఆచారంగా ఉంది. సమర్త కీడు పోవటానికి ఇలా చేస్తారు. అంతేకాకుండ కూతురు సమర్త అయ్యిందన్న సంతోషం ప్రకటిస్తూ మధుమాంసాలతో విందులు చేయటం ఆచారంగా కనిపిస్తున్నది. మధుమాంసాలు వాడని కులాల్లో మధురాహారాలు, పిండివంటలు చోటు చేసుకుంటాయి. పేరంటం ద్వారా, వేడుకలు విందుల ద్వారా తమ కూతురు సమర్తయిందన్న సంగతి అందరి దృష్టిలోకి వస్తుంది. అమ్మాయికి పెళ్ళి కానట్లైతే సంబంధాలు కుదుర్చుకోవటానికి ఇందువల్ల వీలవుతుంది.

మేనరికాలు పాటించే కొన్ని సంచార జాతుల్లో రజస్వల కాగానే అమ్మాయిని మేనమామ గారింట్లో కూర్చోబెట్టటమో లేదా మేనబావచేత సమర్త గుడిసె వేయించటమో చేస్తారు.

వయస్సువచ్చినా సమర్త కానివాళ్ళకు 'చెమ్మ చెక్క చేరెడేసి బుక్క' అనే గేయంలో 'చిట్కా' ఉన్నదని ఆచార్య బి. రామరాజుగారు వివరించారు.[1] ఎర్రపూలు పూసే చెమ్మ చెట్టు బెరడు (రత్నాల చెమ్మచెక్క)ను చూర్ణం చేసి చేరెడు చొప్పున బుక్కితే సమర్తకాని అమ్మాయి 'రంగులేస్తుంది.' అంటే సమర్త అయి శరీరం నునుపు దేరుతుందని భావం.

---

1. తెలుగు జానపద గేయ సాహిత్యము - పుట - 786.

చెడు వార తిథుల్లో సమర్త అయినవాళ్ళు ఆ దోషం తొలగటానికి నవ గ్రహాలను పూజించి, ఇష్టదైవాన్ని ఆరాధించే ఆచారం ఉన్నట్లు ఒక జానపద గేయంవల్ల తెలుస్తున్నది.[1]

## 3. నిశ్చితార్థం

సాంఘికాచారాల్లో నిశ్చితార్థంకూడ చెప్పుకోదగ్గ ఆచారమే. ఒకరికొకర్ని వధూవరులుగా నిర్ణయించేది ఈ రోజే. జీవిత భాగస్వామిని, సహధర్మచారిణి కాబోతున్న వధువును వరునిపక్షంవాళ్ళు ఎన్నికచేస్తే, భర్తను (భరించేవాడు) లేక నాథుణ్ణి వధువుపక్షంవాళ్ళు ఎన్నుకుంటారు. ఆడ-మగ ఇద్దర్నీ ఆలుమగ లుగా నిశ్చయించి తాంబూలాలు పుచ్చుకుంటారు. వివాహంలాగ నిశ్చితార్థం కూడ కన్యాదాత గృహంలో జరిగే కార్యక్రమం. వరునిపక్షంవాళ్ళొచ్చి వధువును చూసి, పెళ్ళి నిశ్చయించి తాంబూలాలు పుచ్చుకోవటం ఆచారం. శిష్టసమాజంలో నిశ్చితార్థం రోజున అమ్మాయికి ఉంగరమో, గొలుసో, కాళ్ళకు వెండి పట్టాలో వేయటం కొన్ని కులాల్లో ఆచారంగా ఉంది. అందువల్లే నిశ్చితార్థాన్ని 'ముద్రా రోహణం' అంటారు. ఆ రోజు అమ్మాయికి కొత్త బట్టలు పెడతారు. నిశ్చితా ర్థాన్ని 'తాంబూలాలు పుచ్చుకోవటం', 'పూలు - పండ్లు పెట్టటం' అనే వాడుక కూడ ఉంది.

జానపద భిక్షుక గాయకుల్లో వరసేవా వివాహాలే ఎక్కువ. కాబట్టి, నిశ్చి తార్థం రోజునుంచి వరుడు అత్తమామలకు ఊడిగం చేయవలసి ఉంటుంది. వరుని తల్లిదండ్రులు కూడ వియ్యంపులకు సేవలు చేయక తప్పదు.

బుడిగె జంగాలు నిశ్చితార్థాన్ని 'ఇడెం బెట్టటం', 'పిల్లను చూడటం'లేదా 'పిల్లని అడగటం' అంటారు 'పిల్లకు మాట ముచ్చట అయింది', 'పిల్లకు కల్లు పోయించారు' అని కూడ నిశ్చితార్థానికి సమానార్థకాలుగా వాడుతారు. 'ఇడెం' అనేది 'తాంబూలం' పర్యాయపదమైన 'విడియం', 'పీడెం' నుంచి పుట్టిందే.

వీళ్ళలో మేనరికాలు ఉన్నాయి. కాబట్టి కొందరు పుట్టినప్పుడే పేరుపెట్టు కుంటారు. పిల్లలు బ్రతకనప్పుడు మేనత్త వచ్చి, పుట్టిన బిడ్డను కొంగులో వేసు

---

1. మిన్నేరు - పుట - 96.

కొని, నా కొడుకుకు చేసుకుంటానని చెబుతుంది. పెరిగిన తర్వాత పుట్టినప్పుడే నిర్ణయించుకున్నట్లు మేనరికపు పెళ్ళి చేస్తారు.

**పిల్ల మాది అనిపించుకోవటం**

సంచార జీవనంలో రెండు కుటుంబాలు కలిసి ఉంటున్న సందర్భంలో పిల్ల పుట్టినప్పుడు లేదా నాల్గైదేళ్ళ వయసులో సంబంధం నిశ్చయించుకుంటారు. సెంద్రలకు (దేశాటనం) వెళ్ళినప్పుడు, కథలమేళం, భాగవతపుమేళం ఏర్పాటు చేసుకొని ఇతర గ్రామాల్లో తిరుగుతున్నప్పుడు, వేటకు వెళ్ళిన సందర్భాల్లో, తాగిన సమయాల్లో - స్నేహం పెరిగి ఒకరి కొడుకుకు ఒకరి కూతుర్ని ఇవ్వాలని నిర్ణయాలు తీసుకుంటారు. ఇది 'ఇడెం' బెట్టటానికి ముందే చేసుకున్న ఒప్పందం. ఆడపిల్ల ఐదారేళ్ళు ఉండగానే మగపిల్లవాని తల్లిదండ్రులు 'ఆ ఆడ పిల్ల మాది' అనిపించుకుంటారు. పిల్ల తల్లిదండ్రుల్ని కల్లు దుకాణానికి తీసుకు వెళ్ళి, వాళ్ళకు కల్లు ముట్టించి (ఇచ్చి), పిల్లను మా కొడుకుకు చేసుకుంటామని చెబుతారు. పిల్ల తల్లిదండ్రులు కూడ ఇందుకు ఇష్టపడ్డట్లయితే ఆ కల్లు తాగుతారు. దీనికి సాక్ష్యం ఉండాలని మగపిల్లవాని తల్లిదండ్రులు ఒక కులస్థునికి కూడ కల్లుముంత ఇచ్చి, తమ సంబంధం గురించి చెబుతారు. దీన్నే 'పిల్ల మాది అనిపించుకోవటం' అంటారు. కొందరు పిల్లకు గాజులు వేయించి 'పిల్ల మాది' అనిపించుకుంటారు. ఈ ఒప్పందం జరిగిన తర్వాత ఆ పిల్లను ఇతరులకు ఇవ్వటానికి వీలుండదు. పిల్ల మాది అనిపించుకున్న తర్వాత కొంతకాలానికి (పిల్లలకు 10, 12 ఏళ్ళు వచ్చిన తర్వాత) 'ఇడెం' (నిశ్చితార్థం) పెడతారు.

పిల్ల పెద్దదైన తర్వాత పిల్ల మాది అనిపించుకున్నవాళ్ళు ఏ ఊళ్ళో ఉన్నా పిల్ల తల్లిదండ్రులు వాళ్ళ దగ్గరకు తాము స్వయంగానైనా వెళతారు, లేదా ఒక మనిషిని పంపిస్తారు. ఆ వెళ్ళిన మనిషి 'ఏమయ్యా! ఫలానా వాళ్ళ పిల్లను మీది అనిపించుకున్నారంట. ఇప్పుడు పిల్ల పెద్దదైంది. తిండి తినేదైంది. బట్ట కట్టేదైంది. మరి ఇడెంబెట్టుకొని పెళ్ళిచేసుకొమ్మని పిల్లతల్లిదండ్రులు అంటున్నరు' అని చెబుతారు. మగపిల్లవాని తల్లిదండ్రులు వీలు చూసుకొని, ఫలానా రోజు వస్తామని చెబుతారు. చెప్పిన ప్రకారం వెళ్ళి ఇడెం పెడతారు.

**పుల్లవిరుపు :**

ఒకవేళ ఆ పిల్లను చేసుకోవటం తమకిష్టం లేకుంటే 'అప్పుడేదో చిన్నప్పుడు చేసుకుందామని అనుకున్నాం. కాని ఇప్పుడు మాకాపిల్ల వద్దు. ఆ పిల్లను ఎవరికైనా ఇచ్చుకోమని చెప్పు' అని వరుని తండ్రి కులాచారం ప్రకారం ఒక పుల్ల (పుడక)ను తీసుకొని విరిచేస్తాడు. దీన్నే 'పుల్లవిరుపు' అంటారు. దీని నుండే పుల్లవిరుపు మాటలనే నుడికారం తెలుగులో ఏర్పడి ఉంటుంది. దీనితో ఆ పిల్లను ఇతరులకు ఇవ్వటానికి వీలవుతుంది. పుల్ల విరువనంతవరకు ఆ పిల్ల వాళ్ళ పేరుమీదనే ఉంటుంది. ఒకవేళ మగపిల్లవాని తల్లిదండ్రుల్ని సంప్రదించకుండ వేరే ఎవరికైనా పిల్లను ఇచ్చినట్లయితే ఈ విషయం తీవ్రమై, పెద్ద పంచాయతులకు దారి తీస్తుంది. ఆ కుల పంచాయతీలో ఆడపిల్లల తల్లిదండ్రులదే తప్పవుతుంది.

**ఇడెం :-**

చిన్ననాటి ఒప్పందాలు లేనివాళ్లు తమ కొడుకుకు పెళ్ళి చేయాలనుకున్నప్పుడు తమ పరిచయంలో ఉన్న లేదా తమ బంధువుల పరిచయంలో ఉన్న కుటుంబాల్లో నుంచి సంబంధం చేసుకోవాలనుకుంటారు. ముందు తాము సంబంధానికి వెళ్ళే కుటుంబం మంచి చెడ్డల్ని విచారిస్తాను వాళ్ళకు పెళ్ళయిన కూతుళ్ళు, కొడుకులు ఉంటే, వియ్యంపులతో ఏ విధంగా తిరుగుతున్నారో, పరాయి ఇంటి బిడ్డ అయిన తమ కోడల్ని ఏ విధంగా చూసుకుంటున్నారో గమనిస్తారు. అన్ని విధాల నచ్చిన తర్వాత వాళ్ళ అమ్మాయిని తమ కోడలుగా చేసుకోవాలనుకుంటారు.

పిల్లని అడిగేముందు గూడెం పెద్దతో ఈ విషయమై మాట్లాడి సలహా తీసుకుంటారు. ఏ రోజు ఇడెం పెట్టాలో ఆ కుల పెద్ద నిర్ణయిస్తాడు. వేరే గూడెంలో పిల్లను అడుగుకోవటానికి వెళుతున్నప్పుడు వరుని తల్లిదండ్రులు కుల పెద్దను, తమకు తోచిన ఇద్దరు ముగ్గురు ఇతర పెద్దల్ని తమవెంట తీసుకు వెళతారు. ఉన్న గూడెంలోనే సంబంధం చేసుకుంటుంటే అక్కడ వున్న కుల పెద్దను, ఇతర ప్రముఖ కులస్థుల్ని సంప్రదిస్తారు.

ఇడెం పెట్టే రోజు తెల్లవారుజామున వరుని తల్లిదండ్రులు గూడెం పెద్ద మనుషులతో సహా అందర్నీ పిలుచుకువచ్చి వధువు ఇంటి ముందర కూర్చో

బెడతారు. అందరు కూడిన తర్వాత కుల పెద్ద వరుని తండ్రిని ఇంటి పేరు పెట్టి పిలిచి ఇలా అడుగుతాడు : (ఉదాహరణకు వరుని తండ్రి ఇంటి పేరు తూర్పాటి, అతని పేరు రామయ్య అయితే రామయ్యను కుల పెద్ద 'తూర్పాటాయనా!' అని సంబోధిస్తాడు).

"[1]ఆ...ఏం తూర్పాటాయనా! ఇంతమంది కులాన్ని పస్తమోని (వధువు తండ్రి ఇంటి పేరు పస్తం) ఇంటికాడ కూడవెట్నెవ్. ఏమి సంగతి? యాడ్కొచ్చినవ్?" అని అడుగుతాడు. అప్పుడు వరుని తండ్రి (తూర్పాటి రామయ్య) ఇలా అంటాడు: "అయ్యా! కులానికి శనార్తి.[2] కూసున్న పెద్దోల్లకు చిన్నోల్లకు పబ్బతి. మేము, మా తాత ముత్తాతల కాంచి గక్కడగా దక్షిణానికి.... (ఊళ్ళ పేర్లు పేర్కొంటాడు) గా ఊళ్ళల్ల, గీ తూర్పుకు...., ఉత్తరాదికి .., పడ్మర కెల్లి....గా ఊల్లల్ల బతుక్కుంట, బతుక్కుంట ఇప్పుడు గీ గడ్డకు చేరినం. మా తాతెట్ల బత్కిండో మీ పెద్దలకు దెల్సు. ఇగ మేము మీ కండ్లముందల బత్కుతున్నం. మేము మంచోల్లమో చెడ్డోల్లమో మీకు దెల్సిన సంగతే. మేము కొట్లాడిందీ, దండ్గల్ పెట్టుకున్నదీ,[3] ద్రోహాల్ జేసిందీ, ఒగన్ని చెయ్యెత్తి కొట్టిందీ, మందిని ముంచిందీ, పదిమంది కులస్తులకు సాయంజేసిందీ అంత మీ చేతులున్నది. నా కడుపుల 'బుర్రకాయంత'[4] పిలగాడు పుట్టిండు. వానికి ఓ పిల్లను జూసి కల్లుపోపిత్తామనుకున్న. గీడ పస్తమోనింట్ల అంబలున్నదని[5] వచ్చిన. అతడు నాయంత కులస్తుడు అంబ్యాత్కుడు.[6] మా ఇద్దర్కి గలుస్త దని వొచ్చిన" అని అంటాడు. అప్పుడు కుల పెద్ద వధువు తండ్రిని ఉద్దేశించి "ఏమయ్యా, పస్తమాయనా! గా కులస్తుడు తూర్పాటాయన గట్లనుకొచ్చిండు. మరి నువ్వేమంటవ్? మీ యింట్ల బుడ్డెదంబలున్నదంట.[7] పోస్తవేమో అని వొచ్చిండు" అని అంటాడు.

---

1. 24.4.1988 రోజున నల్గొండ జిల్లా బ్రాహ్మండ్ల పల్లిలో జరిగిన బుడిగె జంగాల నిశ్చితార్థం (ఇడెం) సందర్భంలో గమనించిన కార్యక్రమం. ఉద్ధరించిన భాగాలు ఆనాడు రాసుకున్నవే.
2. శరణార్థి - నమస్కారానికి బదులుగా వాడతారు. వీరశైవాచారం.
3. కులపంచాయతుల్లో కుల పెద్ద విధించే జరిమానాలను 'దండ్గ' అంటారు.
4. నిశ్చితార్థం రోజున వధూవరుల్ని బుర్రకాయతో పోల్చుతారు.
5. పెళ్లికానిపిల్లను నిశ్చితార్థం రోజున అంబలితో పోల్చుతారు.
6. అమాయకుడు.
7. పెళ్లికాని కూతురు.

అప్పుడు వదువు తండ్రి (పస్తం ఎల్లయ్య) "నాయనా! కులానికంత దండం. పెద్దలకు పది వేల నమస్కారం. అందరికి శనార్తి. కులపాదం నా తల మీద. కులం కుక్కలమంటి సముద్రం మోకాల్లమంటి. కులమిడ్చిన మనిషి లేడు, వనమిడ్చిన కోతిలేదని పెద్దలంటారు. ఆ జంగాము[1] తూర్పాటాయన నా యింటి కొచ్చినాడూ. సరె మంచిదె. అందరిలక్క నాకో బుర్రకాయంత పిల్లున్నది. పిల్ల ఉన్న యింటికి, ముల్లె ఉన్న ఇంటికి పదిమందొస్తుంటరు. పిల్ల ఉంటె పదిమంది ఆశవర్తరు. అడివిల్ల[2] ఎన్ని రోజులున్న పరాయింటి సొత్తె. నా పిల్లని కులానికియ్యకుంటె ఇంట్లబెట్టుకుంటనా? చేసుకున్న పిల్లకు తలకు సమురు, వంటికి బట్ట, కడుపునిండ తిండి ఉంటెసాలు అత్తపోరు, మామపోరు, మగనిపోరు లేకుండ మంచిగ జూసుకుంటె సాలు. మా గుణబావకాలు మీ కందరికెర్కనే. గంతె నాయన నేను కోరుకునేది" అని చెబుతాడు. 'నీ కూతురును వాళ్ళకివ్వటం నీ కిష్టమేనా? మరి చెప్పు' అని పెద్ద మనుషులు అడుగుతారు. తన కూతురును ఇవ్వటానికి ఇష్టపడితే సరేనంటాడు. లేకుంటే "నాయనా! శాపలకు[3] బ్రామ్మండ్లకు పొంతన కాదు. మాకు, వాళ్ళకు సరిపోదు. నా పిల్లను వాళ్ళకివ్వను" అని అంటాడు.

ఒకవేళ పిల్లను ఇవ్వటానికి తండ్రి ఒప్పుకుంటె తర్వాత తల్లిని అడుగుతారు. అప్పుడు తల్లి "ఇస్తిమయ్యా! పిల్లనిస్తిమి. కాని నా పిల్లని గోవులక్క సాదుకున్న. ఒగరిలెక్క నా పిల్లకు పెక్కు జిత్తులు లేవు. నా పిల్లకు ఇచ్చులు గచ్చకాయలు[4] తెల్వవు. గంట్లు మారముండ్లు[5] రావు. మరి పిల్లనిస్తె మా సుట్టాలు పిల్లని ఎట్ల జూసుకుంటరో, పెద్దలు జెప్పండి. నా పిల్ల కులం పిల్ల. నా పిల్లని కులం చేతులల్లబెడ్తున్న" అని అంటుంది. తర్వాత కుల పెద్దలు పిల్ల

1. సాటి కులస్థుడు.
2. ఆడపిల్ల.
3. చేపలకు.
4. రంధ్రాన్వేషణ, గూఢార్థాలు.
5. మొండిగా ఎదురు మాట్లాడే దురుసు ప్రవర్తన.

పెదనాన్న, చిన్నాన్నలను, మేనమామలను వరుసగా అడుగుతారు. వాళ్ళు "అయ్యా కనుకున్నోంది కూతురు, కాసుకున్నోంది అంబలి. కనుకున్న పొట్ట. వాళ్లిచ్చినంక మాటక్కైతె మేముంటము. ఏం పర్వలే. ఇచ్చిన పిల్లను అరిశెరలు[1] పెట్టకుంద, బట్టకు పొట్టకు తక్వగాకుండ చూస్కోంటెజాలు. పరాయి పిల్ల అనుకోకుండ కడ్పులబుట్టిన బిడ్డలక్క జూస్కుంటె బిపాయె. ఇరమాను[2]శెక్కపరమాన్కు అత్కాలంటె ఎంత కష్టపడాలె? పిల్లకు పని తెల్వకుంటె నేర్పుకోవాలె. పిల్లను బాదలుపెట్టకుండ మంచిగ చూసోకోవాలె. మీరంత పెద్దలు. నాల్గు జూసినోల్లు. సుట్టపక్కాలకు బుద్దులు జెప్పండి" అని చెబుతారు.

వధువు పక్షం వాళ్ళు చెప్పిన తర్వాత కులపెద్దలు వరుని పక్షం వాళ్ళను అడుగుతారు. పిల్లవాని తండ్రిని, తల్లిని, అన్నను, వదినను అడుగుతారు. "ఏమయ్యా! ఏమమ్మా! పట్టింద్రా పిల్లని?"[3]అని ఆడిగితే "ఆ....పట్టినం" అంటారు.

**బుద్ధి మాటలు :**

పిల్లను ఇవ్వటానికి, పిల్లను చేసుకోవటానికి ఉభయులు ఇష్టపడ్డ తర్వాత కులపెద్ద వరుని పక్షం వాళ్ళకు బుద్ధి చెబుతాడు. "సరె పిల్లని బట్టినారూ! మాకందరికి ఆనందమె. కాని పట్టిన పిల్లకు నెత్తికి సమురు, వంటికి బట్ట, కడుపుకు తిండి తక్కువగాకుండ జూసుకోవాలె. ఆ పిల్ల ఏమన్న తప్పుజేస్తె కడ్పులపెట్టుకోవాలె. పనిరాకుంటె నేర్పిచ్చుకోవాలె. కొడుకుకు బుద్ధిజెప్పుకోవాలె. కోడలికి బుద్ధిజెప్పుకోవాలె. ఏలు[4] మనదే, కన్ను మనదే. పట్వె[5] పల్గకుండ పాలు పోకుండ జూసుకోవాలె. (అత్తను ఉద్దేశించి) కుండకాడ, చాటకాడ ఏం జరిగినా మగడు రాంగనె జెప్పగూడదు. బిచ్చానికిపొయ్యొస్తడో, శెంద్ర[6] పొయ్యొస్తడో,

---

1. అరిచెఅలు
2. ఇతర వృక్షం.
3. సంబంధం చేసుకోవటాన్ని 'పిల్లని పట్టుట' అంటారు.
4. వ్రేలు.
5. చిన్న కుండ.
6. దేశాటనం.

మ్యాళంలకేలొస్తడో, యాట[1] వొయ్యొస్తడో రాంగనె జెప్పగూడదు. జెర్ర దమ్ముదిన్నంక జరిగిన సంగతి జెప్పి దాన్ని సరిదిద్దుకోవాలె. పిల్ల కానితవ్వు జేస్తే, ఎంత జెప్పినా ఇనకుంటె కులానికి జెప్పి మూతి మీద గొట్టిపియాల్నె. నీ బిడ్డ గిట్ల జేస్తున్నదని సుట్టపోన్కి జెప్పాలె. మామ అద్దుల[2] మామ, అత్త అద్దుల అత్త, ఎవరి పద్ధతులల్ల వాల్లుండాలె'' అని చెప్పి వధువు పక్షం వాళ్ళకు కూడ బుద్ధి చెబుతాడు: ''పిల్లకు అరైన పోరైన కులంలబెట్టి మాట్లాడుకోవాలె. పిల్లదే తప్పైతే 'గట్లగాదుబిడ్డ గిట్ల' అని బుద్ధిజెప్పుకోవాలె. ఎవరిదైన సంసారమే. సంసారం అతికిచ్చిందే గొప్పతనం. తీగ పందిరెక్కినట్లు వాల్లు పైకిరావాలె. మీ బిడ్డ మంచిగ సంసారం జేస్తె మీగ్గూడ పేరొస్తది. మీ సుట్టాలు సంసారి మనుషులే. మీరుగూడ సంసారి మనుషులే.[3] కలసిమెలసి మంచిగుండండి" అని బుద్ధి చెబుతారు.

**చింతాకు జీడాకు[4] :**

చుట్టాలకుచేసే సేవావిధులను గురించి వరునికి, వరుని తండ్రికి కుల పెద్ద ఇలా చెబుతాడు. "తూర్పాటాయనా! పస్తమోని దెగ్గెర పిల్లను బట్టినవ్. సరె. మరి సుట్టపోన్కంత చింతాకు జీడాకు తెచ్చిపెట్టాలె. వాగు పొంటిపొయ్యి ఇన్ని శాపపిల్లలు[5], నాలుగెండ్రకాయలు తెచ్చియ్యాలె. యాటకువోతె ఓ ఎల్కపిల్ల[6] లేకపోతే ఓ తోడ్పిగాడు[7] తెచ్చియ్యాలె. పుల్సు[8] గాసుకుంటె దోకాయదు[9] పుల్సు నీ సుట్టపోన్కి పొయ్యాలె. ఇంత అసర[10]గావాలె. కావిడికి ఎదురురావాలె. కనిగల్లి తిర్గాలె. కడ్పుల జొర్రినట్లుండాలె'' అంటూ చేయవలసిన సేవలను వివరిస్తాడు.

**చెయ్యిసాక్షి :**

బుద్ధులు చెప్పిన తర్వాత వరుని తండ్రిని 'చెయ్యిసాక్షి' వెయ్యమంటారు. వరుని తండ్రి లేచి వియ్యంపుల ఇంటిపేర్లు (తూర్పాటి, పస్తం) కాక ఇతరమైన

---

1. వేట. 2. హద్దులో. 3. మర్యాదస్తులు. 4. జీడి + ఆకు. రాయిరప్ప అన్నట్లు చింతాకుజీడాకు. బుడిగె జంగాలు చింతాకును పులుసుకోసం వాడుతారు. 5. చేపలు. 6. అడవి ఎలుక. 7. ఉడత. 8 పులుసు లేక చారు. 9. దోకాయ - సగం కొబ్బెర చిప్పకు రెండు రంధ్రాలు చేసి, సన్నదైన మూరెడు కట్టె గుచ్చి చేసిన తెడ్డు. 10. ఆస్రా ఉర్దూపదం. సహాయం అనే అర్థంలో.

ఇంటిపేర్లు ఉన్న (ఉదా॥ వాం్రడాసి, కప్పెర, కదమంచి, ఈబుది, రేవెల్లి మొ॥) ఐదుగురి చేతుల్లో చెయ్యివేసి, ఒక్కొక్కరితో "పస్తమోల్ల ఇంటిబిడ్డ తూర్పాటోల్ల ఇంటికోడలు" అని సాక్షి పెడతాడు. దీన్నే 'చెయ్యి సాక్షి' వెయ్యటం అంటారు. చెయ్యి సాక్షివేసి కులాచారం ప్రకారం 2 రూ॥లు కులానికి ఇస్తాడు. వధువు తండ్రి ఒక రూపాయి కులానికి ఇస్తాడు.

**కోరుకున్నవాళ్ళు :**

చెయ్యిసాక్షి వేసిన తరువాత వధువుతండ్రి దెగ్గెటోల్లని (బంధువుల్ని) కోరుకుంటాడు. వీళ్ళంతా సాయంత్రం వరుని తండ్రి యిచ్చే విందులో పాల్గొనే వాళ్ళు. వధువుకు పెదనాన్నలు, పెద్దమ్మలు, చిన్నాన్నలు, చిన్నమ్మలు, మేనత్తలు, వాళ్ళ భర్తలు, మేనమామలు వాళ్ళ భార్యలు కోరుకొనబడతారు. వీళ్ళతోపాటు కులపెద్ద, అతన్ని అనుసరించే ఒకరిద్దరు పెద్దలు కూడ కోరుకున్న వాళ్ళలో ఉంటారు. కోరుకున్నవాళ్ళు చుట్టుపట్ల గ్రామాల్లో ఉంటే సాయంత్రం విందుకు వాళ్ళను పిలుస్తారు. చాలాదూరంలో ఉండి, రావటానికి వీలులేనట్లయితే మందినిబట్టి మనిషికింత అని కులపెద్ద చెప్పగా - ఆ డబ్బును వరుని తండ్రి వధువు తండ్రికి యిస్తాడు. వాళ్ళకు నిశ్చితార్థపు విందుయిచ్చే బాధ్యత డబ్బు తీసుకున్న వధువు తండ్రిదే అవుతుంది.

**కల్లు పోయించటం :**

ఆరోజు సాయంత్రం వరుని తండ్రి చుట్టాలను కులస్థులను అందర్ని కల్లు దుకాణానికి పిలుచుకొనిపోతాడు. కులాచారం ప్రకారం ఇంటికొక్క ముంత కల్లు ఇస్తాడు. తన చుట్టాలను, కోరుకున్నవాళ్ళను ఒకవైపు కూర్చోబెట్టి వాళ్ళు కోరినంత కల్లు, సారా, గుడ్లు, మాంసం ఏర్పాటు చేస్తాడు. కోరుకున్న వాళ్ళు ఎంత తాగుతున్నదీ ఎంత తింటున్నదీ కులపెద్దలు గమనిస్తూ ఉంటారు. కోరుకున్న వాళ్ళతోపాటు కులపెద్దలకు కూడ తాగుడు, తినుడు తప్పదు. కొందరు పిల్ల తల్లిదండ్రులు "మాకు బరండి (బ్రాండి) గావాలె తెప్పి" అని చుట్టాన్ని కోరుతారు. చుట్టం వెంటనే బ్రాండి తెప్పించి ఇస్తాడు. పిల్ల తల్లి దండ్రులు కోరింది తెచ్చి ఇవ్వకుంటే పిల్లవాని తల్లి దండ్రులది తప్పవుతుంది. కోరుకున్నవాళ్ళు పిల్లపక్షంవాళ్ళుకాబట్టి తమకుతాగుడో, తినుడో తక్కువైతే పిల్ల తల్లిదండ్రుల్ని అడుగుతారు. అప్పుడు వెంటనే వాళ్ళు చుట్టానికి చెప్పి, కావలసి

నవి తెప్పించి కోరుకున్న వాళ్ళకు ఇప్పిస్తారు. ఈ విధంగా బాగా తిని, తాగి మత్తులో తూలుతున్న పిల్ల తల్లిదండ్రుల్ని వరుని పక్షం వాళ్ళు జాగ్రత్తగా ఇంటికి చేర్చాలి. దీనితో నిశ్చితార్థం కార్యక్రమం ముగుస్తుంది.

నిశ్చితార్థం రోజున వధువుకు కొత్త బట్టలు పెట్టటం లాంటిది ఏదీ ఉండదు. ఎలాంటి కార్యక్రమం ఉండదు. ఆ రోజు కూడ యథాపూర్వకంగా అమ్మాయి ఊళ్ళోకి భిక్షానికో, చేల్లోకి కూలికో కూడ వెళ్ళివస్తుంది. సాయంత్రం మాత్రం ఆ అమ్మాయికి కూడ కల్లు, గుడ్లు, మాంసం తినిపిస్తారు.

**తెగదెంపులు :**

నిశ్చితార్థం అయిన తర్వాత కొంతకాలానికి ఏవో కారణాలవల్ల సంబంధం ఇష్టం లేకుంటే కులపంచాయతీ ద్వారా తెగతెంపులు చేసుకుంటారు. వధువు పక్షం వాళ్ళకు వరుని పక్షం వాళ్ళ ప్రవర్తన నచ్చకుంటే, నిశ్చితార్థం నాడు కల్లుపోయించటానికి అయిన ఖర్చులన్నీ తిరిగి వరునిపక్షం వాళ్ళకు చెల్లిస్తారు. వరుని పక్షంవాళ్ళకే ఇష్టం లేనట్లయితే వధువు పక్షంవాళ్ళు కల్లు పోయించిన డబ్బు తిరిగి చెల్లించవలసిన అవసరం ఉండదు. 'మాకిసంబంధం వద్దని, ఆ పిల్లను వేరెవరికైనా ఇచ్చుకోవచ్చునని, ఈ విషయమై ఎలాంటి అభ్యంతరం లేదని'వరుని తండ్రి కులస్థులముందు పుల్ల విరువాలి. పుల్ల విరిస్తే ఆ సంబంధం తెగిపోయినట్లుగా భావిస్తారు.

## 4. వివాహ ఆచారాలు

వివాహం విపులమైన కార్యక్రమాలతో కూడుకున్న ప్రబలమైన సాంఘికాచారం. సంస్కృతికి దర్పణం. మానవుని జీవితంలో అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించుకున్న ఘట్టం వటవృక్షంలా ఎదిగి కుటుంబ వ్యవస్థకు నీడనిచ్చే పటిష్ఠమైన ఆచారం. చతుర్విధ పురుషార్థాల సాధనకు స్త్రీని, పురుషుణ్ణి కలిపే సాంఘికానుబంధం. వివాహానికి పర్యాయపదమైన 'కల్యాణం', వివాహం శుభప్రదమైందని, పవిత్రమైందని తెలియజేసే ప్రయోగం. 'భార్య' అనే అర్థంలో ప్రయోగించే ధర్మపత్ని, సహధర్మచారిణి అనే ప్రయోగాలు - ధర్మ నిర్వహణలో స్త్రీ పురుషునికి పరిపూర్ణత కోసం ఇచ్చే తోడ్పాటును తెలియచేస్తాయి. 'అర్ధాంగి,' జీవిత భాగస్వామిని అనే పర్యాయపదాలు స్త్రీ పురుషుల అన్యోన్యా

ధారాన్ని, సహజీవనాన్ని, జీవన సాఫల్య సిద్ధికి స్త్రీ పురుషునికి, పురుషుడు స్త్రీకి పరస్పర పూరకాలని తెలుపుతాయి.

షోడశ సంస్కారాల్లో ముఖ్యమైన సంస్కారం వివాహమే. వివాహ సంస్కారమే గృహస్థాశ్రమానికి ఆధారం. ఆశ్రమ ధర్మాల్లో గృహస్థాశ్రమానికి ప్రాచీనులు ఇచ్చిన స్థానాన్నిబట్టి వివాహ వ్యవస్థ ఎంత ప్రాముఖ్యం సంతరించుకున్నదో గ్రహించవచ్చు. "జీవకోటికి వాయువు ఎలా ముఖ్యాధారమో గృహస్థాశ్రమం కూడ అన్ని ఆశ్రమ ధర్మాలకు ముఖ్యాధారం. బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాసాశ్రమాలవారు గృహస్థాశ్రమం, నుంచే జ్ఞానాన్ని ఆహారాన్ని పొందుతున్నారు. అందువల్ల గృహస్థాశ్రమం శ్రేష్ఠమైంది. స్వర్గాన్ని, ఐహిక సుఖాల్ని కోరేవాళ్ళు గృహస్థాశ్రమాన్ని ఆశ్రయించాలి"[1] అని మనువు గృహస్థాశ్రమ వైశిష్ట్యాన్ని ఉగ్గడించాడు.

సమాజంలో వివాహంలేని స్త్రీనిగాని, పురుషునిగాని చిన్నచూపు చూడటం ఉంది. మోక్షసాధనకు గృహస్థ జీవనమే ఉత్తమమైన మార్గమని గాఢంగా విశ్వసించటమే దీనికి కారణం.

స్త్రీ పురుషుల మధ్య నెలకొనే సాంఘిక సంబంధమే వివాహ బంధం. ఆటవిక, నాగరిక దశల్లో ఒక జలగా పుట్టి, సన్నని ప్రవాహంగా ముందుకు కదిలి, వాగుగా సాగి, మహానది రూపాన్ని పొందిన వివాహవ్యవస్థలో ఎంతగానో వైవిధ్యం చోటుచేసుకుంది. ప్రపంచంలోని అనాగరక, నాగరక సమాజాల్లోని వివాహ పద్ధతులను పరిశీలిస్తే వివాహం విశ్వరూపం సాక్షాత్కరిస్తుంది. మన సంస్కృతికి అద్దంపట్టే రామాయణ, భారతాది గ్రంథాల్లో, పురాణాల్లో అనాటి సమాజంలో నెలకొన్న వివాహవైవిధ్యాన్ని దర్శింపవచ్చు.

ధర్మశాస్త్రకారులు చెప్పిన అష్టవిధ వివాహాలను పరిశీలించినట్లయితే, వివాహ పరిణామ దశలను, ఆయా నాగరక స్థాయీభేదాలలో వున్న సమాజా

---

1. మనుస్మృతి - అధ్యాయం 3 - శ్లోకం. 77-79.
తెలుగు జానపద సాహిత్యము - స్త్రీల గేయములలో సంప్రదాయము - పుట - 192 లోని ఉటంకింపు.

ల్లోని వివాహ పద్ధతులను గుర్తింపవచ్చు. పైశాచి, ఆర్ష, ఆసుర, రాక్షస, గాంధర్వ మొదలైనవి వివాహపు అతి ప్రాచీన (పరిణామ) దశలని, తర్వాత కాలంలో సమాజంలో అవసరాన్నిబట్టి, సాంఘిక స్థాయినిబట్టి వీటిని ఆచరించారని చెప్పటానికి అవకాశం ఉంది. బ్రాహ్మ, దైవ, ప్రాజాపత్య వివాహాలతో పాటు వీటికి కూడ స్మృతికారులు ఆమోదముద్ర వేశారంటే, అనాటి సమాజంలో వాటి ప్రాబల్యం విశదమవుతున్నది. ఈనాటి సమాజంలో కూడ అట్టడుగు సమాజం నుంచి అత్యంత నాగరికుల వరకు వివాహ పద్ధతులను గమనిస్తే, వివాహ వ్యవస్థ పుట్టినప్పటినుంచి నేటివరకు వున్న పద్ధతులు ఎన్నో ఆచరణలో వున్నట్లు కనిపించకపోవు.

'పెళ్ళి' అనే పదానికి అనేక పర్యాయ పదాలున్నాయి. వాటిని గమనించినట్లయితే పూర్వాచారాలు కొన్ని తెలియవస్తాయి.

'పెండ్లి' అనే సమాసంలో 'పెణ్' అంటే స్త్రీ, 'ఇల్' అంటే ఇల్లు. ఈ రెండు కలిసి పెండిలి - పెండ్లి - పెళ్ళి అయిందని తాపి ధర్మారావుగారు చెప్పారు.[1]

'వివాహం' సమాసంలో 'వి' అనే ఉపసర్గ, 'వహ్' అనే ధాతువు ఉన్నాయి. 'మోసుకొని పోవుట' అని దీని కర్థం. 'ఆచారపరంగా వధువును వరుడు ఇంటికి మోసుకొని పోవుట' అని అర్థం చెప్పవలసి ఉంటుంది.

'వరారోహ' అనేది 'భార్య' అనే అర్థంలో వాడతారు. వర + ఆరోహ అంటే 'వరుణ్ణి (వధువు) ఆరోహించింది' అనే అర్థమే సహజంగా వుంటుంది. 'ఉద్వాహం' అనే సమాసానికి పైకెత్తుట, మోయుట అని అర్థాలు ఉన్నాయి.

పెళ్ళి పూర్వాచారాల్లో పెళ్ళికూతురును ఎత్తుకొని (మోసుకొని) పోవటం ప్రబలమైన ఆచారంగా ఉండటంవల్ల ఈ ప్రయోగాలు సిద్ధించాయని చెప్పవచ్చు.[2] నేడు కూడ అనేక సంచార జాతుల్లో పెళ్ళికూతురును ఎత్తుకుపోయే ఆచారం కనిపిస్తుంది.

---

1. పెళ్ళి - దాని పుట్టుపూర్వోత్తరాలు - పుటలు 85.
2. పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలు - పుట 85.

'పరిణయం' అనే పర్యాయపదం కూడ పెళ్ళికూతురును నడిపించుకు తీసుకుపోవటాన్ని సూచిస్తుంది. పెళ్ళి కూతురును కొనుక్కొని నడిపించుకుపోయే ఆచారమే సప్తపది అయివుంటుందని కొందరి అభిప్రాయం.

పాణిగ్రహణం, సప్తపది, సన్నెకల్లు తొక్కటం మొదలైన ఆర్యాచారాలు; మంగళసూత్రధారణ, ఐరేనిపూజ మొదలైన ద్రవిడాచారాల సమ్మేళనమే సంపూర్ణ వివాహతంతుగా పరిణమించింది.

వివాహాచారాల్లో ముందుజరిగేది నిశ్చితార్థం. కాని ఈనాడు వివాహంనాడే ఈ తంతు జరిపిస్తారు. నలుగుపెట్టటం, తలంటుస్నానం, అలంకరణ, సువ్వి పాటలు పాడుతూ కొట్నాలు దంచటం, మైలపోలు, ఐరేణిపూజ, వరునివక్షం వాళ్ళ విడిది, ఎదురుకోళ్ళు, కన్యాదానం, సన్నెకల్లు, మాంగల్య ధారణం, తలంబ్రాలు, అరుంధతీ దర్శనం, సప్తపది, పత్రిగింజలు అలుకుట, తలుపు దగ్గరిపాటలు, పూలచెండ్లాట, తాంబూలం అందుకోవటం, వసంతం ఆడటం, నాకబలి, బువ్వంబంతి, అంపకాలు - ఆ తర్వాత శోభనం మొదలైనవి ఆంధ్రుల వివాహాచారాల్లో ముఖ్యమైనవి. పదారునాళ్ళ పండుగతో వివాహకార్యక్రమాలు ముగుస్తాయి.

## (1) శిష్ట సాహిత్యంలో :

శిష్ట సాహిత్యంలో ఆంధ్రుల వివాహాచారాలను మొట్టమొదటగా వర్ణించిన వాడు తిక్కనార్యుడు. విరాటపర్వంలో ఉత్తరాభిమన్యుల వివాహవర్ణన చేశాడు. వధూవరుల్ని తెరవద్ద నిలపటం, తెర ఎత్తటం, తలంబ్రాలు పోసుకోవటం, పాణిగ్రహణం, తర్వాత విరాటుడు అరణంగా ధన కనక వస్తువాహనాదుల్ని ఇవ్వటం వర్ణించాడు.[1]

ఆముక్త మాల్యదలో శ్రీకృష్ణదేవరాయలు గోదాదేవి శ్రీరంగనాధుల కల్యాణాన్ని వర్ణించాడు. ముత్తైదువలు వధూవరులను జలక మార్చటం, మధుపర్కం ఇవ్వటం, కన్యాదానం, తలంబ్రాలు, మంగళ సూత్రధారణ,

1. విరాట పర్వం - పంచమాశ్వాసం - పద్యాలు - 389-403.

కంకణధారణ, లాజలు వేల్చుట, సప్తపది, అరుంధతీ దర్శనం ఇత్యాదుల్ని వర్ణించాడు.[1]

విజయ విలాసంలో చేమకూర వెంకటకవి సుభద్రార్జునుల వివాహ సందర్భంలో వధూవరుల కంకణధారణ, నలుగుపెట్టుట, కల్యాణ వేదిక మీద కుల దేవతను తెచ్చినిల్పుట, ఐరేని పూజ, బాసికాలు, వరుని ఊరేగింపు, మధుపర్కం, కన్యాదానం, మంగళ సూత్రధారణ, తలంబ్రాలు తర్వాత నాగవలి అనే తంతును క్రమంగా వర్ణించాడు.[2]

వివాహ సందర్భంలో జరిగే వేడుకలను, వైదిక కార్యాలను, కన్యాదానం, మాంగల్య ధారణం, లాజహోమం, సప్తపది మొదలైనవాటిని ప్రాచీన ప్రబంధ కారులు కళాపూర్ణోదయం, పార్వతీ పరిణయం, మన్నారుదాస విలాసం, ముక్తి కాంతా పరిణయం, చంద్రాంగద చరిత్ర మున్నగు కార్యాలలో విపులంగా వర్ణించారు.[3] విక్రమార్క చరిత్రలో జక్కన దాదాపు 70 పద్యాల్లో (4 ఆ. 131-200) వివాహ మహోత్సవ వర్ణన చేశాడు.

## (2) జానపద సాహిత్యంలో, ఇతర తెగల్లో కులాల్లో :

జానపద సాహిత్యంలో పెళ్ళి ఆచారాలకు సంబంధించిన పాటలు విరివిగా ఉన్నాయి స్థిర జీవనులైన గ్రామీణ ప్రజల పరిణయాచారాలకు అనుగుణంగా వెలసిన పాటలు కోకొల్లలు. నలుగు పాటలు మొదలుకొని తలుపు దగ్గరి పాటల వరకు ఇత్యాది సందర్భాల్లో ఒక్కో అంశానికి చెందిన పెక్కు పాటలు ఉన్నాయి.

సంచార తెగల్లో వివాహ పద్ధతులు విలక్షణమైనవి. చిత్ర విచిత్రమైన వివాహ విధానాలు వీళ్ళలో కనిపిస్తాయి. పైశాచ, రాక్షస, ఆసుర, గాంధర్వ వివాహాలు వీళ్ళలో పాటింపబడతాయి కన్య తల్లితండ్రులకు పైకముగాని,

---

1. ఆముక్త మాల్యద - సప్తమాశ్వాసం - పద్యాలు 54 నుంచి 71 వరకు.
2. విజయ విలాసం - తృతీయాశ్వాసం - పద్యాలు - 75-129.
3. తెలుగు జానపద సాహిత్యము - స్త్రీల గేయములలో సంప్రదాయము - పుట. 239.

పశువులుగాని యిచ్చి పెళ్ళాడటం, వరుడు అత్తమామలకు ఊడిగంచేసి వధువును పొందటం, కన్యను ఎత్తుకొనిపోయి పెళ్ళిచేసుకోవటం, యువతీ యువకులు ఇష్ట పడి అడవుల్లోకి వెళ్ళి గడిపివచ్చి భార్యాభర్తలుగా మెలగటం మొదలైన వివాహ పద్ధతులను ఆటవిక, సంచార తెగల వాళ్ళు ఆచరిస్తారు. కొన్ని తెగల్లో పెళ్ళికి ముందే యువతీ యువకులు యధేచ్ఛగా కలుసుకునే 'బస'ల ఏర్పాటు ఉంటుంది. గోండీలలోని 'దంగిబస' దొంబ దాసరులలోని 'షాండీ'లు ఇలాంటివే.

వివాహాచారాల్లో "కన్యాశుల్కం' ప్రాచీనకాలం నుంచి అన్ని కులాల్లోనూ ఉన్నదే. గత శతాబ్దపు చరిత్రపుటల్లో కన్యాశుల్కం ఉధృతాన్ని గమనింప వచ్చు. మనుస్మృతిలో కన్యాశుల్కాన్ని (దీన్నే 'ఓలి' అంటారు) శూద్రులలో కూడ ఉండరాదని నిషేధించాడంటే, మనువుకంటే ముందునుంచే ఓలి లేదా కన్యాశుల్కం ఆచారం విస్తృతంగా ప్రచారంలో ఉన్నదని చెప్పవచ్చు. నాగరక సమాజాల్లో క్రమంగా ఓలి ఆచారం నిషేధింపబడుతూ వచ్చినా ఆదిమ, సంచార తెగల్లో మాత్రం ఈ ఆచారం ఆచరింపబడుతూనే ఉంది. 13 వ శతాబ్దంలో శిష్ట కులాల్లో ఓలి ఆచారం ఉన్నట్లు శాసనాధారాలవల్ల తెలుస్తున్నది.[1]

"మా కులంబున ఓలి మాడలు కలవు" అని బాలచంద్రుడు అన్నట్లు పల్నాటి చరిత్రలో ఉంది. వెలమలలో ఆనాడు ఓలి ఆచారం ఉన్నట్లు దీనివల్ల తెలుస్తున్నది.[2]

'తెఱవ' అనే పదానికి 'శుల్కంతో కొన్న స్త్రీ' అని అర్థమని, కన్నడంలో కన్యలకిచ్చే శుల్కాన్ని 'తెఱవు' అంటారని తిరుమల రామచంద్రగారు వివ రించారు.[3]

ఓలి ఆచారమే నాగరక కులాల్లో 'తల్లి చీర' ఆచారంగా పరిణమించిం దని ఈ క్రింది గేయంవల్ల తెలుస్తున్నది:

---

1. తెలుగు శాసనాలు (500 - 1500) సామాజిక, సాంఘిక అధ్యయనం - పుట. 224. (అముద్రితం)
2. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - కాకతీయ యుగము - పుట. 49.
3. సాహితీ సుగతుని స్వాగతం - పుట. 15.

"ఓ లేమి తెచ్చారు ఓ పెద్దలారా
అరుగుమీద అరవై ఓలి ముప్పై
తల్లి గట్టె చీరతోటి తగునమ్మ ఓలి"[1]

'ఓలిచ్చి కట్టుకున్న పెళ్ళాం', 'ఓలి తక్కువని గుడ్డిదాన్ని పెళ్ళాడితే నెలకు ముప్పై కుండలు పగులగొట్టినట్లు'. 'ఓలి ఇచ్చిన మొగుడికంటె కూలి ఇచ్చిన మొగుడెక్కువ' మొదలైన జనవ్యవహారంలో ఉన్న పలుకుబళ్ళు, సామెతలవల్ల సమాజంలో ఓలి ప్రాధాన్యం తేటతెల్లం అవుతున్నది.

చాలా తెగల్లో, కులాల్లో ఓలి సర్వసాధారణంగా 9 రూ॥లు నుంచి 25 రూ॥ల వరకు ఉంటుంది. ఓలిని ఆయా తెగల్లో, కులాల్లో ఆయా పేర్లతో పిలుస్తారు. చనుబాలు ముష్టి (బుడిగె జంగాలు), పాలవిందు, జొల్లటంక (దొంబదాసరి), సుఖ్ (గోండ్) మొదలైన పేర్లు వాడుకలో ఉన్నాయి. సీతారామ కల్యాణం పాటలో వల్లియులు ఓలిని 'సుగుమంచి' అని పేర్కొన్నట్లు దొణప్ప గారు తెలిపారు.[2] వీళ్ళలో విడాకులు, మారుమనువులు కూడ తేలికగా జరిగిపోతుంటాయి. పునర్వివాహాలను చీర రవికె, చీర కట్టింపు, ఉడికి (మాలజంగం) మొదలైన పేర్లతో పిలుస్తారు. ఈ జాతుల్లో వితంతు వివాహాలు, పునర్వివాహాలు ప్రాచీనకాలంనుంచికూడ నిషేధింపబడలేదు.

మేనరికాలు అన్ని కులాల్లోను ఆచరింపబడతాయి. ఆపస్తంబుడు, బోధాయనుడు మొదలైన సూత్రకారులు మేనరికాలను అంగీకరించినట్లు తెలుస్తున్నది.[3] ఈ తెగల్లోనూ, కులాల్లోనూ మేనరికాలు ఉన్నాయి. అక్క కూతురును చేసుకోవటం కూడ ఆచారంగా ఉంది. వీళ్ళలో గోత్రం ఉండదు. ఇంటి పేరు మాత్రమే ఉంటుంది. ఒకే ఇంటి పేరు వున్న వాళ్ళ మధ్య వివాహాలు నిషేధం. భార్య చనిపోయినప్పుడుగాని, నిస్సంతులైనప్పుడుగాని, భార్య సోదరిని చేసుకునే ఆచారం ఉంది. సంచార జాతుల్లో బహుభార్యాత్వం సర్వసాధారణం కాబట్టి

1. సెలయేరు - పుట 94 - స్త్రీలగేయములలో సంప్రదాయము - పుట 209.
2. జానపద కళాసంపద - పుట 71.
3. తెలుగు విజ్ఞాన సర్వస్వం - సం. 10 - పుట 621.

అక్కా- చెల్లెళ్ళను చేసుకునే పద్ధతి విరివిగా కనిపిస్తుంది. గోండ్, లంబాడీ. తోడా, ఖాసా, దొంబ దాసరి మొదలైన తెగల్లో అగ్రజుడు చనిపోతే అతని భార్యను తమ్ముడు చేసుకోవటం ఆచారం.[1]

మాలజంగం, మాలదాసరి, దొంబదాసరి, సవ్రు, ఎరుకల, బోయ, చెంచు, దొమ్మరి, కోయ, ఖోండ్, పనియన్, చెరుమ, మొండి, యానాది, గోండ్, గదబ మొదలైన తెగల్లో, కులాల్లో రకరకాల వివాహాచారాలు కనిపిస్తాయి. వాటిలో కొన్నింటిని పరిశీలిద్దాం.

**మాలజంగం :**

వీళ్ళలో ఓలి 25 రూపాయలు. కన్యాదాత గృహంలో పెళ్ళి జరుగుతుంది. వీళ్ళు శైవులు కాబట్టి వధువు తండ్రి వరుడికి శివలింగాన్ని ఇవ్వటం ఆచారం. పెళ్ళి పెద్దగా ఉన్న కులం పెద్ద ఆ శివలింగాన్ని వరుని మెడలో వేస్తాడు. మాలజంగాలు వితంతు వివాహాలను 'ఉడికి' అంటారు. ఇందులో ఓలి సగమే కట్టాలి. అంటే 12.50 రూ॥లు ఉంటుంది. పుస్తె, మట్టెలులాంటివి మారు మనువులో ఉండవు. చీర రవిక తెచ్చి వధువుకు కట్టిస్తారు. కుల పంచాయతీ ద్వారా విడాకులు పుచ్చుకుంటారు.[2]

**మాలదాసరి :**

వీళ్ళ కులపెద్ద దాసరి. ఓలి 25 రూ॥ల నుంచి 100 రూ॥ల వరకు ఉంటుంది. పెళ్ళి రోజు వరుడు వెలుగుతున్న జ్యోతిని తలమీద పెట్టుకొని దేవాలయానికి వెళ్ళి కొబ్బరికాయ, బెల్లం సమర్పించి పూజిస్తాడు. పెళ్ళి వరుని గృహంలో జరుగుతుంది. కాబట్టి వధువు పక్షం వాళ్ళు పెళ్ళికి ఒక రోజు ముందే వచ్చి ఉంటారు. వాళ్ళ విడిదిని 'దిగుమగిళ్ళు' అంటారు. గుడిలో వధూవరులు దండలు మార్చుకున్న తర్వాత వరుని ఇంటి ముందు ఏర్పాటుచేసిన పెళ్ళి పందిరిలో అక్షింతలు పోసుకోవటం, మట్టెలు పెట్టి పుస్తె, కట్టటంతో పెళ్ళి ముగుస్తుంది. వితంతు వివాహాల్లో, పునర్వివాహాల్లో సగం ఓలి చెల్లిస్తారు.[3]

---

1. తెలుగు విజ్ఞాన సర్వస్వం - సం. 10 - పుట - 621.
2. Ethnographic Notes. Vol. II part V.B. (10).
3. Ethnographic Notes. Vol. II. Part V - B (10)

**దొంబ దాసరి :**

ఓలిని 'జొల్లటంక' లేక 'పాలవిందు' అంటారు. రూపాయలైతే 20 నుంచి 60 లేదా ఒక మేక, 5 కుంచాల బియ్యం ఓలిగా కన్య తల్లిదండ్రులకు ఇవ్వవలసి ఉంటుంది. యువతీ యువకులు పెళ్ళికాకముందు 'షాండీ' (కలిసే చోటు) లలో యథేచ్ఛగా కలుసుకోవచ్చు. వధూవరుల తల్లిదండ్రులలో ఎవరైనా పెళ్ళికి అభ్యంతరం చెప్పినట్లయితే, వాళ్ళిద్దరూ అడవుల్లోకి పారిపోయి పెళ్ళి చేసుకుంటారు. కొన్ని రోజుల తర్వాత ఇంటికి తిరిగి వచ్చాక కులపెద్ద వేసే జరిమానా (100 రూ॥ల నుంచి 200 రూ॥ల వరకు) భరిస్తే, వాళ్ళ పెళ్ళికి గుర్తింపు వస్తుంది. వితంతు వివాహంలో వరుడు ఆమె ఇంటికి వెళ్ళి ఒక చీర ఇస్తాడు. అప్పటినుంచి ఇద్దరూ కలిసి ఉంటారు. కులస్తులంతా వారిని భార్యాభర్తలుగా గుర్తిస్తారు. ఈ సందర్భంలో ఎలాంటి విందు ఉండదు. భర్త చనిపోతే, ఆమె భర్త తమ్ముణ్ణి లేదా తనకు ఇష్టమైన వాణ్ణి చేసుకోవచ్చు.[1]

**సప్రు :**

వరుని తండ్రి, వధువు తండ్రిని ఇంటి ముందరికి వెళ్ళి పిల్లనివ్వమని అడుగుతాడు. అతడు సమ్మతిస్తే, ఒక కల్లుకుండ తెచ్చి ఇంటి ముందర పెడతాడు. కులస్థులంతా వచ్చి పిల్లనిచ్చింది తెలుసుకొని అందరూ కల్లు తాగుతారు. ఓలి 20 రూ॥లు ఉంటుంది. పెళ్ళి రెండు రోజులు జరుగుతుంది. మొదటి రోజును 'ముద్దొబాడ' (కల్లు పోయించటం) అంటారు. ఈ పద్ధతిలో కాకుండా గాంధర్వ పద్ధతిలో పెళ్ళి చేసుకునే ఆచారం కూడ ఉంది. ఇద్దరూ ఇష్టపడితే, ఒక గదిలోకి వెళ్ళి తలుపు పెట్టుకుంటారు. ఇది చూసిన కులస్థుడెవరో కొంత సేపటికి వెళ్ళి తలుపు కొడతాడు. తలుపు తెరచుకొని యువతీ యువకుడు బయటికి వస్తారు. తలుపుకొట్టిన వారికి బహుమతి ఇస్తారు. కులస్థులంతా వచ్చి సమావేశమై వాళ్ళ వద్ద జరిమానా తీసుకుని, విందు చేసుకుని, వాళ్ళను భార్యాభర్తలుగా గుర్తిస్తారు.[2]

---

1, 2. Ethnographic notes. Vol. II. Part V - B (9)

**కోయ :**

ఈ కులంలో వరుని గృహంలో వివాహం జరుగుతుంది. ఓలి 6 రూ॥లు 21 శేర్ల బియ్యం. మొదటి రోజు అరివేని కుండలు, పాలకొమ్మ పూజ ఉంటుంది. రెండవ రోజు తలంబ్రాలు, పుస్తె కట్టటం ఉంటుంది. వితంతు వివాహాలను 'చీరకట్టించుట' అంటారు.1

**ఎరుకల :**

వధువు ఇంటిముందు ఇద్దర్ని కూర్చోబెట్టి రెండు నీళ్ళ కుండలు పెడతారు. తర్వాత ఆ కుండల నీళ్ళు వధూవరుల మీద పోసి స్నానం చేయిస్తారు. కొత్త బట్టలు ఇచ్చే పద్ధతి లేదు. మొదటి రోజు 'దేవుని ఊటమ్' (కులదేవత పూజ) ఉంటుంది. వితంతు వివాహాన్ని 'చీర కట్టింపు' అని అంటారు.2

దొమ్మరి కులంలో యువతీయువకులు స్వేచ్ఛగా తిరుగుతారు. పెద్దలు కుదిర్చే పెళ్ళిలో వధువు తల్లిదండ్రులకు ఓలి చెల్లించి చీర రవిక ఇవ్వాలి. మైసమ్మ దేవత సన్నిధిలో, బసవి ఆధ్వర్యంలో పెళ్ళి జరుగుతుంది. బాసికాలు కట్టుట, తాళి కట్టుట, తలంబ్రాలు పోయుట మొదలైన తతంగం ఉంటుంది. కోయకులంలో వరుని తల్లిదండ్రులు మూడు, నాలుగు కుండల కల్లును, కొత్త బట్టలను, ఒక పందిని తీసుకొని వధువు ఇంటికి వెళ్ళి అక్కడ వివాహం జరుపుతారు. వధువు మెడలో తాళిబొట్టును కులపెద్ద అయిన పటేలు కట్టటం ఈ కులంలో ఆచారం. ఓలి ఆచారం ఉంది. ఓలి చెల్లించనివారు పటేలు అనుమతితో కన్యను లేవదీసుకుపోయి పెళ్ళి చేసుకుంటారు. చెంచులు ఆవుపేడతో వలయాకారంగా కొంత ప్రదేశాన్ని అలికి దానిమధ్య విల్లును పెడతారు. దాని చుట్టూ వధూవరులు ప్రదక్షిణం చేసిన తర్వాత కులస్థులందరు అక్షింతలు వేసి ఆశీర్వదిస్తారు తదనంతరం విందు జరుగుతుంది. తాను ప్రేమించిన కన్యను యువకుడు అడవికి తీసుకెళ్ళి పెళ్ళి చేసుకునే పద్ధతికూడ చెంచుల్లో ఉన్నది. 'కూయి' భాష మాట్లాడే ఖోండ్ జాతిలో ఓలిగా అత్తవారికి ఒకచీరె, కొంచం బియ్యం

---

1, 2. Ethnographic notes. Vol. II. part V-B (9).

ఇచ్చి కల్లు పోయించాలి. వివాహం వరుని ఇంటివద్ద జరుగుతుంది. కాళ్ళగోళ్ళు తీయటం, కంకణబంధం మొదలైన సంస్కారాలు జరుగుతాయి. వివాహానికి పూర్వం వరుని పక్షంవాళ్ళు సమయం కనిపెట్టి కన్యను దొంగతనంగా తీసుకొని పోతున్నప్పుడు ఇరుపక్షాలవారికి రాళ్ళతోనూ, కర్రలతోనూ కృత్రిమ పోరాటం జరగటం ఆచారంగా ఉన్నది. మలబారు, నీలగిరి ప్రాంతాల్లో నివసించే పనియన్ జాతిలో కులపెద్ద అయిన 'జమ్మీ' వధూవరుల తలలమీద, పాదాల మీద నీటిధార పోస్తాడు. పెళ్ళి కుమారునికి బదులుగా అతని బంధువైన ఒక స్త్రీ వధువు మెడలో తాళి కడుతుంది. అల్లుడు మామగారికి ప్రతి యేటా మామూలు చెల్లించటం వీళ్ళ కులాచారం. కేరళ లోని చెరుమ (చెరుముక్కల్) కులంలో కన్యాశుల్కాన్ని వరుని సోదరి చెల్లిచటం ఆచారం. వరుడు ఉంగరంతో కూడిన నులితాడును వధువు మెడలో కడతాడు.[1] తెలంగాణాలో మొండి కులంలో వింత ఆచారం ఉంది. యువతీ యువకులు జంటగా ఏర్పడి జీవిస్తుంటారు. వాళ్ళ పిల్లలు పెరిగి పెద్దయిన తర్వాత తమ కుమారుడు మరో యువతితో కలిసినప్పుడు వీళ్ళ పెళ్ళి జరుగుతుంది. అంటే కుమారునికి జోడీ దొరికినప్పుడు తల్లిదండ్రుల పెళ్ళి జరిపిస్తారు. పెళ్ళిలో మాంగల్యధారణ, తలంబ్రాలు మొదలైన ఆచారాలు పాటింపబడతాయి కులస్థులందరికీ విందు జరుగుతుంది.

ఇలాగే గదబ, గోండ్, యానాది మొదలైన అనేక తెగల్లో రకరకాలుగా వింత వింత వివాహ విధానాలు ఆచరింపబడుతున్నాయి.

## 3. బుడిగె జంగాల వివాహాచారాలు :

బుడిగె జంగాలు కూడ సంచార జీవనులే కాబట్టి వివాహాచారాలు సంచార జాతుల ఆచారాలను పోలి ఉంటాయి. కాని, కన్యను లేవదీసుకునిపోయి పెళ్ళి చేసుకునే ఆచారం వీళ్ళలో నిషేధం. తల్లితండ్రులే పెళ్ళి ఏర్పాటు చేస్తారు. తలిదండ్రుల అదుపాజ్ఞల్లోనే కన్య ఉంటుంది. ఒక్కొసారి వధువుకు వరునిమీద ఇష్టంవున్నా, తల్లి తండ్రుల అయిష్టంతో ఆ సంబంధం విడాకులకు దారితీస్తుంది. వీళ్ళలో వరసేవా విధానం, ఓలి, మ్యార, వూట, విడాకులు, మారుసునువు మొదలైన పద్ధతులు కొనసాగుతున్నాయి. వీళ్ళ పెళ్ళి వ్యవస్థను పరిశీలిస్తే స్త్రీకి

1. తెలుగు విజ్ఞాన సర్వస్వం - సంపుటం - 10.

అధికృత కనిపిస్తుంది. వధువుకోసం వరుడు సేవలు చేయాలి. ఓలి చెల్లించాలి. అత్తమామలు చెప్పినట్లు నడుచుకోవాలి. కాని, ఇన్ని నిర్బంధాలున్నా వాళ్ళు భార్యాభర్తలుగా స్థిరపడిన తర్వాత భర్తదే అధికృత అవుతుంది. అతని నిర్ణయాలే కుటుంబ నిర్ణయాలుగా ఉంటాయి.

బుడిగె జంగాల్లో చాలావరకు బాల్యవివాహాలే జరుగుతుంటాయి. వీళ్ళ వివాహాలు నిరాడంబరంగా జరుగుతాయి ఒక ఊళ్లో స్థిరనివాసం లేకుండా సంచార జీవనం చేస్తుంటారు కాబట్టి, వియ్యంకులు ఇష్టపడి నిర్ణయించుకున్న ఊరికి తమ గుడిసెలతో వచ్చి, అనుకున్న రోజున పెళ్ళి జరిపిస్తారు. బ్రాహ్మణుని సంప్రదించటం వీళ్ళలో లేదు.

నిశ్చితార్థం అయిన కొంతకాలానికి పెళ్ళి పెట్టుకోవాలనుకున్నప్పుడు వరుని తల్లిదండ్రులు, వధువు తల్లిదండ్రులు ఏ ఊళ్ళో ఉన్నారో అక్కడికివెళ్ళి 'కల్లు కలుపుకుంటారు.' వియ్యంకులు ఉభయులు కల్లు దుకాణానికి వెళ్ళి, పరస్పరం కల్లు పోయించుకోవటాన్నే 'కల్లు కలుపుకోవటం' అంటారు. పెళ్ళి ఏ ఊళ్ళో పెట్టుకుంటే అనుకూలంగా ఉంటుందో ఇద్దరూ మాట్లాడుకొని ఒక నిర్ణయానికి వస్తారు. వధువు ఏ ఊళ్ళో ఉంటే, వరుని పక్షంవాళ్ళు ఆ ఊళ్లోకి వచ్చి పెళ్ళి చేసుకునిపోతారు. కాని, అప్పుడప్పుడు వధువుపక్షంవాళ్ళు - ఉన్న ఊరు తమకు నచ్చకుంటే, ఇతర గ్రామంలో పెళ్ళి చేసుకోవాలనుకుంటారు. కొన్ని సందర్భాల్లో వరుని ఇంటివద్ద కూడ పెళ్ళి జరుగుతుంది. కాని, సాధారణంగా కన్యాదాత గృహంలోనే పెళ్ళి జరుగుతుంది.

పెళ్ళికి ఒకరోజు ముందు వరుని తల్లిదండ్రులు, వధువు ఉన్న ఊరికి వచ్చి 'బిరాడు[1]' (కులస్థుల గూడెం)లో 'తిక్కటి' వేసుకుంటారు. భూమిమీద మూడు (త్రి) కట్టెలు నిలిపి, వాటిమీద ఈత చాపలు వేసి కట్టి, గుడిసె తయారుచేస్తారు. దీన్నే 'తిక్కటి' అంటారు.

---

1. 'గుడారు' పదానికి పర్యాయ పదమైన 'బిడారు' వర్ణ వ్యత్యయంతో 'బిరాడు' (ర, డ అభేదం) అయ్యింది.

**చాపమీది మాట :**

పెళ్ళిరోజున తెల్లవారుజామున వరునిపక్షంవాళ్ళు కులపెద్ద, చిన్నా పెద్దా కులస్థులందరితో వెళ్ళి వధువు ఇంటిముందు కూర్చుంటారు. వరుని తండ్రి ఒక కొత్త ఈతచాపను తెచ్చి వధువు ఇంటిముందు పరిస్తే దానిమీద కులపెద్ద, ఇతర ప్రముఖ కులస్థులు కూర్చుంటారు. పెళ్ళయిన తర్వాత చిక్కులు రాకుండ వధూవరుల తల్లిదండ్రులు ఇప్పుడే కులపెద్దల ముందు మాట్లాడుకుంటారు. ఈనాడు తీసుకున్న నిర్ణయాలే, ఒప్పందాలే తర్వాతికాలంలో ప్రామాణికంగా ఉంటాయి. దీన్ని 'సాపమీది మాట' అని అంటారు.

వధువు తండ్రి తన కూతురును చేసుకున్నాక వియ్యంపులు ఏయే పద్ధతుల్లో ఉండాలో చెబుతాడు. తన కూతురు ఇద్దరు పిల్లలకు తల్లి అయ్యేదాకా తనతోపాటే సంచారం చేస్తూ తన గుడిసె పక్కన గుడిసె వేసుకోవాలని నిబంధన పెడతాడు. వరుని పక్షంవాళ్ళు బుద్ధిమంతులు కారని అనిపిస్తే తన కూతురుకు చమురు, తిండి, బట్టలకు లోటులేకుండా చూసుకుంటామని హామీ ఇచ్చేందుకు ఒక పెద్దమనిషి మధ్యవర్తిగా ఉండాలని కోరుతాడు. వరుని చిన్నాన్న లేక పెదనాన్న లేక మేనమామలతో తనకు వ్యక్తిగతమైన కక్షలవల్ల పడనట్లయితే వాళ్ళు ఈ సంబంధం విషయంలో ఎట్టి జోక్యం చేసుకోవద్దని, ఏ మాటా మాట్లాడకూడదని ఆంక్ష విధిస్తాడు. కొట్లాడినా, తిట్లాడినా తనకు, తన వియ్యంపునకే సంబంధంకాని పైన పేర్కొన్న వాళ్ళెవ్వరూ మధ్యలో రావద్దని పెద్దలముందు చెబుతాడు. ఈ షరతులన్నీ ఒప్పుకొని వరుని తండ్రి తనకేమైనా అభ్యంతరాలుంటే కులంముందు వెలిబుచ్చుతాడు. ఉదాహరణకు వధువు అక్కా తాకట్లు పెట్టేదని, ఆమెతో కలిసిమెలసి ఉన్నట్లయితే వధువు మనసు చెడిపోయి సంసారం చేయదని, కాబట్టి ఈ సంబంధంలో ఆమె జోక్యం చేసుకోరాదని కోరుతాడు. వరుని తండ్రి షరతులన్నీ ఒప్పుకునేముందు కొన్ని సవరింపులు కూడ కోరుతాడు. వరుని తండ్రి తన కూతురు ఇద్దరు బిడ్డలకు తల్లి అయ్యేదాకా తన వెంటనే ఉండాలని షరతుపెడితే, దాన్ని సంవత్సరానికి తగ్గించాలని లేదా సంతానం కాగానే వేరుగా పంపాలని వరుని తండ్రి కులపెద్దతో చెబుతాడు. ఇవన్నీ గమనించి ఉభయుల గుణాలు తెలుసు కనుక ఉచితమైన కొన్ని నిబంధనలను కులపెద్ద నిర్ణయిస్తాడు.

**నేవింపులు :**

'నియమం' అనే పదానికి వికృతి అయిన 'నేమం' నుంచే నేమించు - నేవింపు రూపం వచ్చింది. చుట్ట పక్కాలకు ఎవరి పద్ధతుల్లో వాళ్లు ఉండాలని కులపెద్దలు చెప్పే మాటలనే 'నేవింపులు' అంటారు. నిశ్చితార్థం రోజున చెప్పి నట్లుగానే కులపెద్దలు చుట్టపక్కాలకు బుద్ధులు చెబుతారు. వధూవరుల తాత ముత్తాతల సంగతులు, వాళ్ళ మంచి చెడ్డలు గుర్తు చేస్తారు. వధూవరుల తల్లి దండ్రుల గుణాలను ఏకరువు పెడతారు. వధువు తండ్రి ఇంతకుముందు తన పెద్ద కూతుళ్ళను ఇచ్చి ఏవిధంగా ప్రవర్తించింది, కుమారులకు పెళ్ళి చేసి కోడళ్ళను ఏవిధంగా చూస్తున్నది సమీక్షించి, ఆ సందర్భాల్లో దొర్లిన పొరపాట్లు ఇకముందు చేయకూడదని కులపెద్ద హెచ్చరిస్తాడు. అలాగే వరుని తండ్రి ఇంతకుముందు ఇచ్చి పుచ్చుకున్న సంబంధాలలో ఏవిధంగా ప్రవర్తించాడో గుర్తు చేసి, అక్కడ జరిగిన పొరపాట్లు ఈ సంబంధంలో పునరావృత్తి కాకుండా చూసుకోవాలని బుద్ధి చెబుతాడు. ఇటు వధువు తల్లికి, అటు వరుని తల్లికి కూడ బుద్ధులు చెబుతాడు. లోగడ జగడాలు పెట్టుకునే మనిషైతే అలాంటి బుద్ధి విడ నాడాలని, తమ సంతానం యోగక్షేమాలు కోరాలని చెబుతాడు. కొడుకులు, కూతుళ్ళు ఎదిగి వచ్చిన ఈ వయసులో ఇంకా కయ్యాలమారి బుద్ధులు ఉండ కూడదని, తెలివి కలిగి ఉండాలని చీవాట్లు పెడతాడు. వరుని అన్నకు, అతని భార్యకు కూడ విదులు బోధిస్తాడు. కొత్తగా వచ్చే కోడలిని సోదరి లాగ చూసు కోవాలని చెబుతాడు.

**ఓలి :**

చాపమీద మాట, నేవింపులు అయిపోయిన తర్వాత వరుని తల్లిదండ్రులు చిన్న పళ్ళెంలో పసుపు, కుంకుమ, ఆకులు, వక్కలు పెట్టుకొని - కులపెద్దను వెంట బెట్టుకొని వియ్యంపుల గుడిసెలోకి వెళతారు. తమ వియ్యంపులైన వధువు తల్లి దండ్రులకు బొట్టుపెట్టి, ఆకు వక్కలతో పాటు 9 రూ॥లు ఓలి చెల్లిస్తారు. ఓలినే 'సనుబాల ముష్టి' (చనుబాల ముష్టి) అని అంటారు. తల్లి 9 నెలలు మోసి కని, చనుబాలిచ్చి పెంచినందుకు ఈ తొమ్మిది రూపాయలు చెల్లిస్తారని అంటారు. పూర్వకాలంలో చేసిన ఈ 9 రూ॥ల ఓలి ఆచారం తరతరాలుగా అలాగే 9 రూ॥లు గానే కొనసాగుతున్నది. రంగారెడ్డి జిల్లాలోని చేవెళ్ళ, మహరాజ్‌పేట ప్రాంతాల్లో బుడిగె జంగాలు 9 రూ॥ల నుంచి 90 రూ॥లకు పెంచినట్లు తెలుస్తు

న్నది. గత ఏడినిమిది సంవత్సరాలనుంచి ఈ కులంలో మొదటిసారి పెళ్ళయ్యే కన్యకు ఓలితోపాటే 250 రూ॥ల నుంచి 1000 రూ॥ల దాకా కన్యాశుల్కం కూడా చెల్లించటం ఆచారం అయ్యింది.

**కులాచారం[1] :**

ఓలి కట్టిన తర్వాత వధూవరుల్ని ఎవరింటిదగ్గర వాళ్ళను ముత్తైదువలు పసుపు రాసి, స్నానం చేయించి, పాతబట్టలే వేసి గుడిసెలో కూర్చోబెడతారు. బుడిగె జంగాల్లో పెళ్ళికి వంటలు చేసి భోజనాలు చేయించే పద్ధతి లేదు. ఆ బిరాదు (బుడ్గ జంగాల గూడెం) లో ఎన్ని కుటుంబాలు ఉన్నాయో కనిపెట్టి కులపెద్ద వరుని తండ్రివద్ద - బియ్యానికి, పప్పుకు, కల్లుకు డబ్బు తీసుకుంటాడు. ఆ డబ్బులోనుంచి అందరికి సరిపోయే విధంగా బియ్యం తెప్పిస్తాడు. గూడెంలో పెళ్ళయిన వాళ్ళకు మాత్రమే ఈ బియ్యంపొందే హక్కు ఉంటుంది. ఈ హక్కునే 'ఆచారం' లేదా 'బొట్టు' అంటారు. ఎన్ని కుటుంబాలు ఉన్నాయో లెక్కించి తలో శేరో, రెండు శేర్లో బియ్యం వేసేటట్లు ఒకరిని నియమిస్తాడు. వరుని తండ్రి ఇచ్చిన డబ్బులోనుంచి రెండుమూడు శేర్ల కందిపప్పు, చింతపండు, మొదలైనవి తెప్పిస్తాడు. బియ్యానికి, పప్పులకుపోను మిగిలిన డబ్బుతో సాయంత్రం కల్లు కొని కులస్థులందరికి సమానంగా పంచుతాడు. పప్పు, చింతపండు మొదలైన సామగ్రితో ఇద్దరు ముగ్గురు యువకులు వధువు ఇంటిముందు పెద్ద పొయ్యిచేసి (దీన్నే గాలి/గాడి పొయ్యి అంటారు), దానిమీద పప్పుచారు కాచి, సాయంత్రం కులస్థులందరికి సమానంగా పంచుతారు.

**గాజులు వేయించటం :**

కులాచారం ప్రకారం కులస్థులంతా బియ్యం వేసుకున్న తర్వాత, మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో వరుని పక్షంవాళ్ళు ఒకరిద్దరు ముత్తైదువలు, వధువు పక్షంవాళ్ళు ఇద్దరు ముగ్గురు ముత్తైదువలు కలిసి వధువును గాజులు వేయించటానికి గాజుల దుకాణం ఉన్న పక్కూరికి తీసుకెళతారు. అలా తీసుకువెళ్ళేప్పుడు పెళ్ళిపిల్లకు గొంగడిగాని, దుప్పటిగాని కొప్పెర పెట్టి తీసుకు వెళతారు. పక్కూరి గాజుల దుకాణంలో గాజులు వేయించుకున్నాక, అందరు

1. కులస్థులకున్న హక్కు. దీన్నే 'కులం బొట్టు' అని కూడ అంటారు.

కలిసి ఆ ఊరి కల్లు దుకాణానికి వెళ్ళి, వధువుతో సహా అందరూ కల్లు తాగుతారు. ఈ ఖర్చులన్నీ వరుని తండ్రే భరిస్తాడు. కల్లు తాగిన తార్వాత బయలుదేరి బిరాడుకు వచ్చేసరికి పొద్దు వాలిపోతుంది. ఆ సమయంలో కులస్థులందరు ఆచారంగా వచ్చిన కల్లు తాగి ఉంటారు. వధువు తల్లిదండ్రులు, బంధువులు కూడ కల్లు, సారా తాగి ఉంటారు. రాత్రి 7, 8 గంటల ప్రాంతంలో పెళ్ళితంతు ప్రారంభిస్తారు.

**పుస్తెకట్టుట :**

పెళ్ళికి ముందు ఎదుర్కోళ్ళు ప్రారంభమవుతాయి. తిక్కటిలో ఉన్న వరుణ్ణి తీసుకురావటానికి వధువు పక్షంవాళ్ళు బయలుదేరుతారు. ఒక రుమాలు (తలపాగ)ను గాని, దుప్పటినిగాని ముందు ఒకరు, వెనుక ఒకరు రెండు చేతులతో పైకెత్తి పట్టుకుని నడుస్తుండగా, దానిక్రింద హారతిపళ్ళెం పట్టుకుని ముత్తయిదువలు వస్తుంటారు. దాని ముందుభాగంలో కొందరు తంబూరా డింకిలతో గానం చేస్తూ నడుస్తారు. కొన్ని సందర్భాల్లో హార్మోనియం, మద్దెల, తాళాలు మొ॥ వాయిస్తూ ఏ భాగవతంలోనివో పాటలు పాడుతారు. వరుని పక్షంవాళ్ళు కూడ ఈ విధంగానే ఆటపాటలతో ఎదురొస్తారు. ఇరుపక్షాలు కలుసుకొని కుంకుమ, బూడిద చల్లుకుంటారు. తర్వాత అందరు కలిసి వధూవరుల్ని తీసుకొచ్చి, వధువు ఇంటిముందు పరిచిన కొత్త ఈతచాపమీద ఎదురెదురుగా కూర్చోబెడతారు. కులపెద్ద పౌరోహిత్యం చేస్తాడు. ఒకవేళ కొత్త చీర, కొత్త దోవతి తెచ్చినట్లయితే వధూవరులకు కట్టిస్తారు. లేకుంటే వాళ్ళదగ్గర ఉన్న దాపుడుచీర (దాచిపెట్టుకున్న జలతారు పట్టుచీర), దాపుడు పంచె కట్టిస్తారు.[1]

వరుని పక్షంవాళ్ళు అక్షింతల కోసం పసుపు కలిపిన బియ్యాన్ని ఒక పళ్ళెంలో తెచ్చిస్తారు. రెండు కుడుకలు, మూడు నాలుగు ఖర్జూరపళ్ళు, మూడు నాలుగు పోకలు, కొన్ని తమలపాకులు కూడ పౌరోహిత్యం నెరపుతున్న కులపెద్దకు తెచ్చిస్తారు. కులపెద్ద "తారాబలం, చంద్రాబలం, దీర్ఘామాయూ, దీర్ఘామాయూ...." అంటూ ఉచ్చారణలో బ్రాహ్మణుని అనుకరిస్తూ ఆకుపోకలు

1. భాగవతాలు, పగటివేషాలు మొదలైనవి ప్రదర్శించి ఊరివాళ్ళ వద్ద భిక్షంగా అడుక్కున్న జలతారు పట్టుచీరలు, ధోవతులు.

అందుకోమంటాడు. ఆకు, పోక, ఖర్జూరపండు అందుకున్న తర్వాత, కొబ్బరి కుడుకలో పాలుపోసి వధూవరులతో తాగిస్తాడు. ఆ కుడుకను వధువు సోదరులు తీసుకుంటారు. తర్వాత వధువు తండ్రితో ''కన్యాదానం ఇస్తిని'' అనిపించి, వరునితో ''కన్యాదానం తీసుకుంటిని'' అనిపిస్తాడు. "ధర్మేచ, అర్థేచ,కామేచ, మోక్షేచ నాతి చరామి'' అని వధువుతో అనిపించి "నాతి చరితవ్యం'' అని వరునితో అనిపించి, కాలికి మట్టెలు (కంచువి) పెట్టించి, మంగళసూత్రాన్ని కట్టిస్తాడు. వధూవరులచేత పరస్పరం తలంబ్రాలు పోయించిన తర్వాత అందరు అక్షింతలు వేస్తారు.

వరుని పక్షంవాళ్ళు వధువుకు బంగారు మంగళసూత్రం, కంచు మట్టెలు, వెండి ముంజేతి కడియాలు మాత్రం తప్పకుండ తేవలసివుంటుంది. తమ కూతురుకు కొందరు తల్లిదండ్రులు అరణంగా ఒక ఆవునో, ఒక బర్రె (గేదె)నో, ఒక మేకనో ఇస్తారు. 5 లేదా 10 తులాల వెండి సందె కడియం, ఒక చీర మొదలైనవి ఇస్తారు. మేనమామలు కూడ తమకు తోచింది అరణంగా ఇవ్వటం ఉన్నది. పెళ్ళికొచ్చిన కులస్థులంతా కట్నాలు వేస్తారు. ఒక రూపాయి నుంచి మొదలుకొని ఐదు రూ॥లవరకు కులస్థులు అటు వధువు పేరుమీద, ఇటు వరుని పేరుమీద కట్నాలు వేస్తారు (ఇస్తారు).

పెళ్ళి కార్యక్రమాల్లో వధూవరుల్ని తయారుచేయిటం, నలుగుపెట్టి స్నానాలు చేయించటం, మంగళారతులు పట్టుకోవటం, చాపమీదికి రావటం మొదలైన సందర్భాల్లో విధవలనే కాకుండా, పునర్వివాహం చేసుకున్న స్త్రీలను కూడ రానివ్వరు.

**చుట్టాలబంతి :**

పెళ్ళి జరిగిన మరునాడు చుట్టాలబంతి ఉంటుంది. ఉదయం వధూవరుల్ని ముత్తైదువలు పసుపురుద్ది స్నానం చేయిస్తారు. ఒడివాల బియ్యం (ఒడిబ్రాలు) వండి, పచ్చిపులుసుచేసి ముత్తైదువలకు భోజనాలు చేయిస్తారు. వధూవరుల్ని వరుని ఇంటికి (తిక్కటికి) తీసుకువస్తారు. నిశ్చితార్థం రోజున కోరుకున్నవాళ్ళకు ఈరోజు కూడ విందు ఉంటుంది. దీన్నే 'సుట్టాలబంతి' అంటారు. వధువు పక్షం చుట్టాలందరూ వరుని ఇంటికి వస్తారు. వరుని తండ్రి విందులో

తిని-తాగే చుట్టాల సంఖ్యను గమనించి, కొన్ని కుండల కల్లు తెప్పిస్తాడు. కొన్ని సీసాల సారాయి తెప్పిస్తాడు. ఆరోజు అన్నదమ్ముల్నిగాని అల్లుళ్ళనుగాని వేటకు వంపుతాడు. వేటలో ఏవైనా జంతువులు (ముంగీసలు, అడవిపిల్లులు, ఏదు పందులు, నక్కలు మొదలైనవి) దొరికితే, లేదా ఉడుములు, ఎలుకలు, ఉడతలు మొదలైనవి పట్టుకొస్తే . వాటిని వండించి చుట్టాలకు తినటానికిఇస్తాడు. శనగలు, బజ్జీలు మొదలైనవి ఇప్పిస్తాడు. వధువు పక్షం చుట్టాలందరూ ఎంత తాగాలనుకుంటే అంత తాగుతారు. ఈ విందులో కులపెద్ద, ఇతర ప్రముఖులు కూడ పాల్గొంటారు. ఈవిధంగా వధువు బంధువులందరికీ ఇచ్చే విందు (సుట్టాల బంతి) ముగుస్తుంది.

మరునాడు 'నెత్తిపట్ల కల్లు' ఉంటుంది. సుట్టాలబంతి నాడు బాగా తాగి, తిన్నందువల్ల మరునాడు నెత్తి పట్టినట్లుగా (భారంగా) ఉంటుందట. ఆ తల భారం తగ్గాలంటే మళ్ళీ కల్లు తాగాలని, వరుని తండ్రిచేత ఖర్చు పెట్టించి, వధువు తల్లిదండ్రులు తాగుతారు.

**మ్యారి :**

సుట్టాలబంతి తర్వాత వధువు తల్లిగారింట్లో ఉంటుంది. వరుని తల్లి దండ్రులు కొన్ని నెలలు దేశాటనం చేసివచ్చి అక్కడ దిగుతారు. (దిగటం అంటే గుడిసె వేసుకోవటం.) మరునాడు వధువు తల్లిదండ్రులకు కల్లు పోయించి, వరుని తండ్రి తన కోడలును తనింటికి తెచ్చుకుంటాడు, దీన్ని 'పిల్లను తోలు కోవటం' అంటారు. పిల్ల అత్తవారింట్లో ఉన్నా, 'చాపమీది మాట' ప్రకారం వరుడు, అతని తల్లిదండ్రులు 'మ్యారి' తిరగాలి. ఒక సంవత్సరం లేదా రెండు సంవత్సరాలపాటు వధువు తల్లిదండ్రుల వెంటనే వీళ్ళు కూడ తిరుగుతూ జీవిం చాలి. ఒకరిద్దరు పిల్లలు పుట్టేదాక కూడ వెంట ఉండే ఒప్పందాలు ఉంటాయి. వరుడు ఒక్కడే గాని, అతని తల్లిదండ్రులతో గాని, వధువు తల్లిదండ్రులతో పాటే ఒప్పుకున్న సమయందాకా నియమం ప్రకారం సంచారం చేస్తూ జీవించ టాన్నే 'మ్యారి' అంటారు.

మ్యారి సమయంలో వధువుకు పొద్దున్నే చద్దన్నం పెట్టాలి. భోజనాల వేళకు అందరితో పాటు ఆమె కూడ భోజనం చేస్తుంది. మళ్ళీ మధ్యాహ్నం

మూడుగంటల ప్రాంతంలో అన్నమైనా పెట్టాలి లేదా రొట్టైనా ఇవ్వాలి. అన్నం రొట్టె లేనట్లయితే అంబలి అయినా పొయ్యాలి. తిరిగి రాత్రి భోజనం అందరితో కలిసిచేస్తుంది. ఈ విధంగా కుటుంబంలోని అందరూ రోజుకు రెండుసార్లు చాలీ చాలని తిండి తిన్నాగాని కోడలికి మాత్రం నాలుగుసార్లు విధిగా భోజనం ఏర్పాటు చెయ్యాలి. కోడలికి ఏమాత్రం తిండి తక్కువైనా ఆమె తల్లి దండ్రులు వియ్యంపులమీద కులపంచాయతి పెడతారు. కోడలికి కడుపు నిండ తిండి పెట్టలేకపోతున్నందుకు కులపెద్ద వరునిపక్షంవాళ్ళది తప్పని నిర్ధా రిస్తాడు. అందువల్ల ఏది ఏమైనా కోడలికి నాలుగుపూటలా ఉండేటట్లు జాగ్రత్త తీసుకుంటారు.

మ్యార కాలంలో వరుడు అత్తమామలకు చాకిరీ చేయవలసి ఉంటుంది. వాళ్ళ పొయ్యిలోకి కట్టెలు తేవాలి వేటచేసి తెచ్చిన జంతువుల మాంసం పెట్టాలి. లేదా ఒక ఎలుకనో, ఉడతనో, చేపలో పట్టుకొచ్చి ఇవ్వాలి. పులుసుగా వాడుకునే చింతాకు తెంపుకొచ్చి ఇవ్వాలి. చింతకాయలు, మామిడికాయలు, సీతాఫలకాయలు మొదలైనవి సందర్భాన్నిబట్టి తెచ్చి ఇస్తుండాలి.

కొత్త వంటలు వచ్చినప్పుడు, 'కొత్త పెట్టుకోవటం' అనేది గ్రామీణ ప్రజలకు ఆచారం. సంక్రాంతి పండుగ అలాంటిదే. రైతు కుటుంబాల్లో కొత్త ధాన్యం ఇల్లు చేరినప్పుడు, తెల్లవారు జామున ముత్తైదువలతో దంపించి పండగ చేస్తారు. పల్లెల్లో దంపుడు మరలు వచ్చాక కూడ సంప్రదాయకమైన కుటుంబాల్లో ముత్తైదువల చేత ధాన్యం పట్టింపించి, పండగచేసే ఆచారం కొనసాగించటం కనిపిస్తుంది. కొన్ని గిరిజన జాతులవాళ్ళు కంది కొత్త, కొఱ్ఱంగి (వరి) కొత్త, మామిడి కొత్త, ఇప్ప కొత్త అనే పేర్లతో పండగలు చేసుకుంటారు.[1]

రైతులే కాకుండా రైతులదగ్గర అడుక్కునే అన్ని కులాలవాళ్ళు కూడ 'కొత్త పెట్టుకుంటారు.' బుడిగె జంగాల్లో 'మ్యార'లో ఉన్న అల్లుడు తాను అడుక్కొచ్చుకున్న కొత్త ధాన్యాన్ని అత్తమామలకు కూడ కొత్త పెట్టుకోవ టానికి ఇవ్వాలి.

1. రెండవ ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక : పుట 83.

ఒక ఊరునుంచి మరో ఊరుకు వెళుతుంటే తమ గుడిసెల్ని విప్పుకొని సామానంత కావళ్ళతో మోస్తారు. గుడిసె విప్పటంలో అల్లుడు మామకు సహాయం చెయ్యాలి. వడివడిగా ముందుకెళ్ళి తన కావడిని ఒకచోట దింపి, ఎదురువచ్చి మామ కావడిని మోసుకెళ్ళాలి. కొత్త ఊళ్ళో గుడిసె వేసుకోవటంలో మామకు సహకరించాలి. మామ ఏపని చెప్పినా వినాలి. ఈ విధంగా అల్లుడు మ్యారకాలంలో అత్తమామల సేవ చేయాలి.

పూట :

మ్యారలో తన కొడుకును అత్తమామల దగ్గరవుంచి వరుని తల్లిదండ్రులు దేశాటనానికి వెళ్ళిపోతారు. కొన్ని నెలల తర్వాత వచ్చి తన కొడుకును అత్త మామలు కష్టపెడుతున్నారని తెలిస్తే కులపంచాయతి పెడతారు. తన భార్య తన మాట వినటం లేదని, అత్తమామలు ఎంతసేవచేసినా ఒప్పక, బాధిస్తున్నారని వరుడు చెప్పినట్లయితే కులపంచాయతి పెడతారు. వరుడు ఇలా చెప్పకుండ అత్తమామలు, భార్య అనుకూలంగా ఉన్నారంటే కులపంచాయతి అవసరం ఉండదు. కులపంచాయతిలో అల్లుణ్ణి అత్తమామలు పెట్టరాని బాధలు పెట్టినట్లు రుజువయితే, కులపెద్ద మ్యారను రద్దుచేసి 'పూట' ఏర్పాటు చేస్తాడు. ఒక మధ్యవర్తి (కులపెద్ద లేదా కులప్రముఖుడైనా కావచ్చు) వెంట సంచారం చేస్తూ వధూవరులు జీవించటాన్నే 'పూట' అంటారు. తాను ఏ ఊరికి వెళితే ఆ ఊరికి వధూవరులను తీసుకెళుతూ ఉభయుల గుణాలను ఆ మధ్యవర్తి గమనిస్తాడు. మూడు నాల్గు నెలల్లో ఎవరిది తప్పో, ఎవరిది ఒప్పో నిర్ణయించి ఉభయుల తల్లిదండ్రులకు తెలియజేస్తాడు సాధారణంగా మధ్యవర్తి ఆ వధూవరులను తనవెంట తిప్పుకుంటూ, బుద్ధిచెప్పి, పొరపాట్లు దిద్ది, వాళ్ళను జీవితంలో స్థిరపడేలా చేస్తాడు. ఆయన ప్రయత్నం కూడ ఫలించకుంటే వాళ్ళకు విడాకులు తప్పవు. 'మ్యార' సమయంలో అత్తమామలకు సేవచేసినట్లు 'పూట'లో వరుడు మధ్యవర్తిగా ఉన్న పెద్దమనిషికి సేవలు చేయక తప్పదు.

మ్యారలో అత్తమామలను సంతోషపెట్టి, భార్యను బాగా చూసుకున్నట్లయితే అతడు వేరుగా వెళ్ళి జీవించవచ్చు. అతనికి పూట చేయవలసిన పని ఉండదు. అలాగే పూటలో ఉన్నప్పుడు ఏ తగాదాలు రాకుంటే ఏలాంటి అంక్ష లేకుండా అతడు యదేచ్ఛగా దేశాటనం చేయవచ్చు. స్వేచ్ఛగా బ్రతకవచ్చు.

**సోబన బంతి/ బందార్తం :**

శోభనం సందర్భంలో వియ్యంపులకు వాళ్ళ దగ్గరి బంధువులకు 'బంతి పెట్టాలి' అంటే, విందు ఇవ్వాలి. అందువల్లే శోభనకార్యాన్ని 'సోబన బంతి' అని పిలుస్తారు, దీనికే బందార్తం (బంధార్థం) అని పేరు. ఆలుమగల శారీరక అనుబంధం కోసం ఇచ్చే విందు కావటంవల్ల ఈ వాడుక కలిగింది. ఈ విందు నిశ్చితార్థం విందులాగా, సుట్టాలబంతి లాగా ఉంటుంది. కులపెద్ద ఆ పిల్లను చూసి 'పెద్ద పిల్లయింది. పర్వాలేదు. ఇల్లు జెయ్యండి' అని అంటే, వరుని తల్లిదండ్రులు వియ్యంపులకు విందు ఏర్పాటు చేసి శోభనం జరిపిస్తారు. శోభనాన్ని 'ఇల్లు చెయ్యటం, ఒక్కటి చెయ్యటం, ఇంట్లకు జొరగొట్టటం' అని కూడ అంటారు.

**విడాకులు :**

ఇతర తెగల్లోలాగానే బుడిగె జంగాల్లో కూడ విడాకులు అధికంగా జరుగుతుంటాయి. పెళ్ళి రోజునుంచే కులపంచాయతులు ప్రారంభమవుతాయి. పెళ్ళి కార్యక్రమాల్లో, కల్లు సారా తాగే విషయంలో తగాదాలు పెట్టుకుంటారు. మ్యార సమయంలో, పూట సమయంలో కూడ చీటికి మాటికి కుల పంచాయతులు తప్పవు. వరునికి ఇష్టంలేక విడాకులిస్తున్నట్లయితే అతనికి పెళ్ళి ఖర్చులేవీ తిరిగి చెల్లించనవసరం ఉండదు. కులపెద్ద ముందు 'నాకీ పెళ్ళాం వద్ద'ని, 'వదిలేస్తున్నాన'ని చెప్పి, 'రూపాయిపావలా' ఆమె కొంగులో కట్టినట్లయితే లేదా నిండుకులంలో ఆమె కిచ్చినట్లయితే విడాకులిచ్చినట్లవుతుంది. కులపంచాయతిలో మొదటినుంచి చివరిదాకా వరుని పక్షం వాళ్ళదే తప్పయితే, భార్యని పెట్టరాని బాధలు పెట్టినట్లు రుజువయితే కూడ వరునికి ఎలాంటి నష్టపరిహారం ఇవ్వబడదు. పైగా, కులం ఖర్చుల నిమిత్తం అయిన దబ్బంతా అతడే భరించి, కులపెద్ద విధించే జరిమానాలు కూడ చెల్లించాలి. వధువుకు లేదా ఆమె తల్లిదండ్రులకు ఈ సంబంధం ఇష్టంలేకుంటే, వరునికి పెళ్ళి ఖర్చులు చెల్లించి విడాకులు తీసుకుంటారు. ఉభయులకు జరిగిన కులపంచాయతిలో తప్పంతా వధువుదీ, ఆమె తల్లిదండ్రులదే అయితే వరునికి పెళ్ళి ఖర్చులు చెల్లించి, కులం ఖర్చులు, జరిమానాలు భరించవలసి ఉంటుంది. చాలా సందర్భాల్లో వధూవరులు పరస్పరం ఇష్టపడుతున్నా-వాళ్ళ తల్లిదండ్రుల మాట పట్టింపులవల్ల బలవంతంగా ఆ సంబంధాలు తెగిపోతూ ఉంటాయి.

**మారు మనువు :**

కుల పంచాయతి ద్వారా విడాకులు పొందినవాళ్ళు మళ్ళీ పెళ్ళి చేసుకుంటారు. దీన్నే 'మారు మనువు' అని అంటారు. మారు మనువును 'చీరయిక (చీర రవిక)' అనటమే ఎక్కువ ప్రచారంలో ఉంది. చీర రవిక కార్యక్రమం ఒక్క రోజులోనే పూర్తవుతుంది. పిల్లను చేసుకోవాలనుకునేవాళ్ళు ఉదయాన్నే వచ్చి కులపెద్దను, కులస్థులను వధువు ఇంటి ముందు కూర్చి, పిల్లను తమకివ్వాలని అడుగుతారు. ఆడపిల్ల విడాకులు పొందినదైనా, వరుడు మాత్రం లోగడ విడాకులు పొందినవాడైనా కావచ్చు; లేదా ఇంతకుముందు పెళ్ళికాని వాడైనా అయిఉండవచ్చు. నిశ్చితార్థం రోజున చెప్పినట్లుగానే కులపెద్ద ఈనాడు కూడ బుద్ధులు చెబుతాడు. క్రితం సంబంధాలను దృష్టిలో పెట్టుకొని ఉభయులు అన్యోన్యంగా ఉండి జీవించాలని బోధిస్తాడు. తర్వాత వరుని తండ్రి చెయ్యి సాక్షి వేస్తాడు. మారు మనువు చేసుకుంటున్న పిల్లను 'సగమోలి పిల్ల' అంటారు. మొదటిసారి పెళ్ళిలో 9 రూ॥లు ఓలి ఉంటుంది. కాబట్టి ఇప్పుడు సగం ఓలి అంటే 4½ రూ॥లు వధువు తల్లిదండ్రులకు చెల్లిస్తారు. ఈ సగమోలి స్త్రీలను పెళ్ళి ఇత్యాది సందర్భాల్లో హారతి పట్టనివ్వరు. చాప తొక్కనివ్వరు.

సాయంత్రం చీరయిక కార్యక్రమం ఉంటుంది. వధువు తల్లిదండ్రులకు కల్లు సారా పోయించాలి. కులాచారం ప్రకారం కులస్థులందరికి బియ్యం వేసుకోవటానికి, కల్లుకు వరుని తండ్రి డబ్బు ఇస్తాడు. చీకటిపడ్డాక పెళ్ళి ప్రారంభమవుతుంది. ఇప్పటికి వధూవరులతోసహా అందరూ కల్లు, సారా తాగి ఉంటారు. పెళ్ళికూతురుకి అత్తవారు ఒక చీర (కొత్తది లేక పాతది) తెస్తారు. ఆ చీర కట్టించి పెళ్ళిపిల్లను చేస్తారు. వరుణ్ణి తయారుచేశాక - వధూవరులను వధువు ఇంటి ముందు ఒక చాప పరిచి దానిమీద కూర్చోబెడతారు. కులపెద్ద పౌరోహిత్యం చేస్తాడు. కుడుకలో నీళ్ళుపోసి, అందులో బంగారు ముక్కెరవేసి, నీళ్లను వధువుతో తాగిస్తారు. కుల పెద్ద ''తారాబలం, చంద్రాబలం, దీర్ఘామాయూ, దీర్ఘామాయూ'' అని మంత్రం చదవగా వధూవరులు పరస్పరం తలంబ్రాలు పోసుకుంటారు. తర్వాత అందరూ అక్షింతలు వేస్తారు.

వధూవరులకు ఇద్దరికీ ఇది రెండవ పెళ్ళి కాబట్టి పెళ్ళి కాగానే శోభనం ఏర్పాటుచేస్తారు. వీళ్ళల్లో విడాకులు ఎంత త్వరగా తీసుకోవచ్చో, మారు మను

వులు కూడా అంత తొందరగా కుదురుతాయి. ఈ మారు మనువు కూడ బెడిసి కొట్టవచ్చు. వివాదాలు వస్తే రెండవ సంబంధంలో కూడ విడాకులు తీసుకొని మూడవ సంబంధం చేసుకోవచ్చు అందువల్ల పిళ్ళలో మారు మనువులు మళ్ళీ మళ్ళీ జరిగినవాళ్ళే ఎక్కువ శాతం ఉంటారు.

కులపంచాయతులు జరుపుకొని విడాకులు తీసుకుంటారు. కులపంచాయతీలో జరిగిన ఖర్చులు వందలు, వేలు వధువు తల్లిదండ్రుల మీద, వరుని తలిదండ్రుల మీద మోపబడుతుంటాయి. అందువల్ల పిల్లను మారు మనువు ఇస్తున్నప్పుడు, పిల్ల తల్లిదండ్రులు ఆ డబ్బును వరుని వద్ద కన్యాశుల్కంగా తీసుకుంటారు. పూర్వకాలంలో ఈ కులంలో మారు మనువుకు వెళ్ళే స్త్రీ తల్లిదండ్రులకు 'సగమోలి' 4½ రూ॥లు ముట్టిస్తే సరిపోయేది. కాని, ప్రస్తుతకాలంలో 1000 రూ॥ల నుంచి 3000 రూ॥ల దాకా చెల్లించవలసి వస్తున్నది.

ఈ కులంలో వితంతువివాహాలు కూడ ఉన్నాయి. భర్త సోదరులు ఈమెను మాతృతుల్యంగా చూడటంవల్ల ఇతర వ్యక్తితో సంబంధం కుదిరినప్పుడు ఇద్దరికి పునర్వివాహం జరిపిస్తారు. ఈ తంతుకూడ 'చీరైక' కార్యక్రమంలాగా జరుగుతుంది.

## 5. చావు - కర్మకాండ

'జాతస్యమరణం ధ్రువమ్' అని గీతాకారుడన్నట్లు పుట్టిన ప్రతి మనిషి మరణించక తప్పదు. పంచ భూతాలవల్ల ఏర్పడిన శరీరం తిరిగి పంచభూతాల్లోనే కలుస్తుంది కాబట్టి మరణించటాన్ని ''పంచత్వం పొందటం'' అన్నారు. ప్రాణాలు వాయువులో కలువగా - శరీరం దహనం వల్ల అగ్నిలోనూ, ఖననం వల్ల భూమిలోనూ కలిసిపోతుంది. అస్థికలు పుణ్యతీర్థాల్లో నిమజ్జనం చేయబడతాయి. మనిషి పంచత్వాన్ని పొందటాన్ని వేమన 'గాలి గాలి గలిసె గగనంబు గగనంబు' అనే పద్యంలో చక్కగా వివరించాడు.

మన మధ్య తిరుగుతూ తిరుగుతూ మట్టైపోయిన మనిషి మనతో ఏర్పడిన అనుబంధాలకు అనుగుణంగా ఆవేదన కలిగిస్తాడు. ఈ ఆత్మీయతకు గుర్తుగా చనిపోయినవాళ్ళను స్మరించుకోవటానికే కాకుండా, వాళ్ళ ఆత్మలు మధ్యలో తిరుగకుండ నేరుగా పరలోకానికి వెళ్ళాలని 'అపర కర్మల' ఆచారం ప్రారంభమయింది.

మనిషి ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసినా శరీరంలో ఆత్మ గుప్తంగా ఉంటుందని, అది గాలిలో తిరుగుతూ ఆ వ్యక్తి నివసించిన పరిసరాల పట్ల, పూర్వ జీవితంపట్ల ఆసక్తి చూపుతుందని ప్రాచీన మానవుడు నమ్మాడు. ఈజిప్షియనులు మమ్మీలవద్ద సకల పదార్థాలను ఉంచటానికి, హిందువులు శ్రాద్ధ కర్మలు నిర్వర్తించటానికి కారణం ప్రాచీన మానవుని ఆ విశ్వాసమే.1 పితృలోకాలకు వెళ్ళని ఆత్మలు ఇతరులనే కాకుండా, కుటుంబీకులను కూడా బాధిస్తాయనే విశ్వాసం సమాజంలో ఉండటంతో వారి ఆత్మలను పిండ ప్రదానాలచేత శాంతింపచేయటానికి శ్రాద్ధ కర్మలు రూపుదిద్దుకున్నాయి.

అపర కర్మలు విభిన్న పద్ధతుల్లో ప్రపంచమంతటా ఆచరింపబడుతున్నాయి. మన దేశంలో కులమతానుగుణమైన సంప్రదాయ విధానాల్లో ఈ సంస్కారాలు చేయబడుతున్నాయి. షోడశ సంస్కారాల్లో అపర కర్మ చివరిది కాబట్టి, దీనిని అంతిమ సంస్కారం అన్నారు. అపర కర్మల్లో ఖననం, దహనం, భద్రపరచుట, కుళ్ళబెట్టుట మొదలైనవి ముఖ్యమైనవి.

ఖననం చేసే పద్ధతి ప్రాచీన కాలంనుంచి కొనసాగుతూ వస్తున్నది. ఇప్పటికీ శూద్రకులాల్లో, ఆటవిక అనాగరక తెగల్లో, వీరశైవుల్లో ఈ పద్ధతే అమల్లో ఉన్నది. సన్యాసులను ఖననం చేయటం పరిపాటి. క్రైస్తవ, ఇస్లాం మతావలంబకులకు ఖననం తప్పనిసరి.

వైదిక ఆర్య సంప్రదాయంగా దహన పద్ధతి ప్రారంభించబడింది. అగ్రకులాల్లో ఈ పద్ధతే ఆచరణలో ఉన్నా, అవివాహితులను ఖననం చేయటం ఆచారంగా కనిపిస్తున్నది. ఆధునిక కాలంలో మహా నగరాల్లోని స్థలాభావం వల్ల దహనంచేసే పద్ధతి ఈనాడు అందరికీ అనివార్యమవుతున్నది. విద్యుద్దహన యంత్రాల వాడకం ఈ విషయాన్ని నొక్కి చెబుతున్నది.

పూర్వకాలంలో భద్రపరచటం అనే పద్ధతి కూడ ఉన్నట్లు తెలుస్తున్నది. చనిపోయినవారిని తైలాలు పూసి భద్రపరిచేవారు. మైనం తదితర లేపనాలు పట్టించి భద్రపరిచినవే ఈజిప్టులోని మమ్మీలు. దశరథుని మరణానంతరం అతని

1. తెలుగు జానపద గేయ గాథలు - పుట 93.

శరీరాన్ని భరతుడు వచ్చేవరకు తైలంలో భద్రపరిచినట్లు భాసుని ప్రతిమానాటకం వల్ల తెలుస్తున్నది. ఆధునిక ప్రపంచంలో విజ్ఞానశాస్త్ర ప్రగతివల్ల ప్రముఖులు మరణించినప్పుడు వాళ్ళ శరీరాలను కొన్ని రోజులవరకు చెడిపోకుండ ఉంచ గలిగే వైద్య సదుపాయం సమకూడింది.

చనిపోయిన తర్వాత శవాలను కుళ్ళబెట్టే పద్ధతి కూడ ఆచరణలో కని పిస్తున్నది. జొరాస్ట్రియను మతస్థులు (పార్శీలు) చనిపోయిన తర్వాత వాళ్ళ శరీరాలను నీరు, నిప్పు, మన్ను అంటకుండ ఏర్పాటు చేసిన 'శబ్దరహిత కూపాల'[1] లోని ఇనుప కమ్మీలపై ఉంచుతారు. ఈవిధంగా శవాలను ప్రత్యేకమైన ఒక ప్రదేశంలో వదిలివచ్చుట భారతీయార్యులలో ఉండి, పిదప అది మధ్య ఆసియాలోని ఈరానీల్లో (జొరాస్ట్రియనులు) కొనసాగి ఉండవచ్చునని డా॥ నీ. వసుంధరారెడ్డి గారు ఊహించి, విరాటపర్వంలోని "ఇది శతవృద్ధు". (1-178) అనే పద్యాన్ని ఉదాహరించారు.[2] న్యూగినీలోని పపువా గిరిజనులు చనిపోయిన తర్వాత శవాన్ని చెట్టుమీద ఉంచే పద్ధతిని ఈనాటికి ఆచరిస్తున్నట్లు తెలుస్తున్నది.[3]

సాధారణంగా హరిజన గిరిజన తెగల్లో ఖననం చేయటమే ఆచరణలో ఉంది. బుడిగె జంగం, మాల జంగం, మాల దాసరి, చిందుల, పంబాల (Pambada or Pambanda), డొమ్ (డొంబరి), మాతంగి, బోయ, చెంచు, యానాది మొదలైన కులాల వాళ్ళలో ఖననం చేసే విధానమే పాటింపబడు తున్నది. మితా అయ్యలవార్లు, బైండ్ల, గొడారి (Godari), గోండ్ మొదలైన హరిజన గిరిజన కులాల్లో కూడా ఉన్నత కులాల్లో ఉన్న మాదిరిగా దహన సంస్కారమే ఆచరింపబడుతున్నది.

---

1. విజ్ఞాన సర్వస్వము సంపుటి - 10 - పుట. 153.
2. తెలుగు జానపద సాహిత్యము - స్త్రీల గేయములలో సంప్రదాయము (ద్వితీయ ముద్రణ) పుట. 325.
3. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆంగ్లశాఖలో ఆచార్యులు శ్రీ వసంత్ జోసఫ్‌గారు చెప్పారు. వీరు ఆ దేశంలో పర్యటించి వచ్చారు.

చనిపోయినవారిని నిలువుగా పడుకోబెట్టటం, బొందకూడ అలాగే త్రవ్వి పెట్టటం అత్యధిక కులాల్లో ఆచరణీయమై ఉండగా వీరశైవ మతంలో పుట్టిన కొన్ని కులాల్లో మరణించినవారిని కూర్చోబెట్టటం, బొందకూడ సమచతుర్భుజాకారంలో త్రవ్వి - అలాగే కూర్చోబెట్టి ఖననం చేయటం ఉంది. ఈ పద్ధతి బలిజ, వీరముష్టి, మాతంగి, జంగం (ఆంధ్రలో జంగందేవర), మాల జంగం బుడిగె జంగం కులాల్లో కొనసాగుతున్నది. మహబూబ్‌నగర్, కర్నూలు జిల్లాల్లో తప్ప మిగతా తెలంగాణా జిల్లాల్లోని బుడిగెజంగాల్లో ఈ పద్ధతి ఆచరింపబడటం లేదు. కర్ణాటకలోని బళ్ళారి, హొస్పేట, కోలారు జిల్లాల్లోనూ, కర్ణాటకకు ఆనుకొని ఉన్న తెలుగుదేశం ప్రాంతాల్లోనూ బుడిగె జంగం కులస్తుల్లో వీరశైవ సంప్రదాయమే ఆచరణీయంగా ఉంది. ఈ పద్ధతి లేనిచోట్ల శవాన్ని ఈత చాపలో చుట్టుకొని తీసుకెళ్ళి, వెల్లకిల పడుకోబెట్టి ఖననం చేస్తారు. ఈ విధానం యానాదుల్లో కూడ కనిపిస్తుంది. యానాదులు మరణాన్ని అతి సహజమైన ఒక సంఘటనగా భావించి, చనిపోయినవారిని చినిగిపోయిన ఈతచాపలో చుట్టి తీసుకెళ్ళటం ఉన్నది. కొన్ని ప్రాంతాల్లోని యానాదులు ఖననంగాని, దహనంగానీ ఏదీ చెయ్యకుండా శవాన్ని వదిలిపెట్టిరావటం (పారవేయటం) ఆచారం.[1]

కోయలు శవాలను దహనం చేస్తారు ఆవునో, ఎద్దునో బలియిచ్చి దాని తోకను మరణించినవాని చేతిలోనూ, ప్లీహాన్ని నోట్లోనూ పెడతారు. భార్య పుస్తెను అతని ప్రక్కన పెడతారు. దహనానంతరం బూడిద పోగుచేసి, ముద్దలా చేసి, ఒక కన్నంలో పెట్టి, దానిని రాతిపలకతో మూస్తారు. దానిమీద రాళ్ళను నిలువుగా నిల్చోపెడతారు. అదే సమాధి.[2]

సవరలు మనిషికి రెండు ఆత్మలుంటాయని నమ్ముతారు. మొదటిది శుద్ధ (పెద్దది). రెండోది సోన్న (చిన్నది). చిన్నదే ప్రాణం. అది మనిషి చనిపోవటంతో పోతుంది. పెద్దది అతడు జీవించివుండగానూ అటు తర్వాతనూ కూడ ఉంటుంది. మనిషి మరణించినప్పుడు అతని ఆ ఆత్మ ఛాయారూపం ధరిస్తుంది. ఆ రూపంలోనే అంతర్లోకాలకు వెళుతుంది. కాని, అక్కడుండే

---

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుట. 253.
2. ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర 1 పుట. 40.

పెద్దలు (పితృదేవతలు) రానివ్వరు. అందుచేత భూమి మీదికి తిరిగి వచ్చి, గౌరీ (పెద్ద) కర్మ జరిగి పోతులను బలి వేసేవరకు ఇక్కడే సంచరిస్తూ తిండి కోసం. బట్టకోసం, పొగాకుకోసం, తాగుడుకోసం బంధువులను వేధిస్తుంది. తనకు కలిగే బాధలూ చీకాకులూ వారికీ కలిగిస్తుంది. గౌరీ కర్మ జరుగగానే, అది పరలోకానికి పోయి పెద్దలతో చేరుతుంది 1

మరణిస్తున్న వ్యక్తి పరలోకాలకు చేరుకోవటానికి, భూత ప్రేతాల వల్ల జీవించి వున్న వారికి ఎలాంటి కీడు కలుగకుండ ఉండటానికి కొంత తంతు జరుపబడుతుంది. మరణిస్తున్న వ్యక్తి పునీతుడు కావటానికి గంగాతీర్థం, తులసి తీర్థం పోయటం, పుణ్య సంపాదనకు గోదానం చేయటం, మరణించాక తలగడ చెంత దీపం పెట్టటం, ఇంటి ముందర ఆరని మంట వేయటం ఈ తంతులో భాగమే.

**బుడిగె జంగాల్లో చావు తంతు :**

బుడిగె జంగాల్లో చావటానికి కొన్ని రోజుల ముందునుంచీ ముసలి వాళ్ళయితే వారికిష్టమైన ఆహారాన్ని పెడుతుంటారు. సాధారణంగా ఎల్లెలుకలు (అడవి ఎలుకలు), ఈతకల్లు మొదలయినవాటిని వారు కోరుతారు. నోరారా తిన కుండ చనిపోయినట్లయితే వాళ్ళు తప్పకుండ దయ్యాలు అవుతారని బుడిగె జంగాల నమ్మకం. దూర దూరానవున్న తమ దగ్గరి బంధువులను పిలిపిస్తారు. చిన్న కొడుకు కాని, చిన్న కూతురుగాని దూరంగావుంటే వెంటనే పిలిపిస్తారు. తల్లి దండ్రులకు చివరి సంతానం మీద మక్కువ ఎక్కువని దీనివల్ల తెలుస్తున్నది.

ప్రాణం పోతువ్న దశలో 'జీవగంజి' పోస్తారు. శిష్ట కులాల్లో గంగా తీర్థం పోసినట్లుగానే గంజికాచి బొట్టుబొట్టుగా పోస్తారు. ఒక్కొక్కరే ముందుకు వచ్చి మోకాలు మీద ఆనించుకొని ''ఇది నీ చిన్న కొడుకుది.... ఇది నీ పెద్ద కొడుకుది.... కూతురిది... కోడలుది...." అంటూ గంజి పోస్తారు.

---

1. ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర - 1 పుట 47.

మరణించిన తర్వాత ఒక పాతిన గుంజకు ఆనించి కూర్చోబెడతారు తొడలమధ్యన చేతిమీద చెయ్యి ఉంచి, అందులో విభూతి పండు పెడతారు. నొసట విభూతి రేఖలు పూస్తారు. ప్రక్కన దీపం వెలిగిస్తారు. అగరువత్తులు కాలుస్తారు. ఇంటిముందు పిడకలతో గాని, కట్టెలతోగాని ఆరకుండ మంట వేస్తారు.

రావలసిన వాళ్ళందరూ వచ్చాక శవయాత్రకు ఏర్పాట్లు చేస్తారు. ప్రతి బుడిగె జంగం గుడిసెలో సామాను పెట్టుకోవటానికి ఒక చిన్న పీట ఉంటుంది. ఈ పీట దాదాపు 3,4 అడుగులు సమానమైన పొడవు వెడల్పులతో చిన్న నులక మంచంలాగ ఉంటుంది. పొడవైన పచ్చికట్టెలు (కోలలు) కొట్టుకొచ్చి, ఆ పీట కింద పొడవుగా రెండు కట్టెలు (శవాన్ని మోయటానికి) కడతారు. నాల్గువైల నుంచి కట్టెలు కట్టి, గుడిలాగ గుమ్మటం కడతారు. తమ దగ్గర ఉన్న దాపుడు వస్త్రాలను[1] చుట్టూరా కట్టి శిఖరం మీద ఇత్తడి చెంబును బోర్లిస్తారు.

శవయాత్రలో భార్య మరణిస్తే భర్త ముందునడవాలి. పురుషుడు మరణిస్తే అతని పెద్ద కుమారుడు, విధవరాలు మరణిస్తే ఆమె చిన్న కుమారుడు ముందు నడవాలి. మూడుకర్రముక్కలతో లేదా వెదురుబద్దలతో త్రికోణాకారంలో చేసిన ఉట్టిలో కూడువండిన అటిక,[2] దాని మూతమీద కాలుతున్న అగరువత్తులు గుత్తి పెట్టుకుని వెనకకు మరలి చూడకుండ ముందుకు నడవాలి. ఈ విధంగా నడవటాన్ని 'తలగోరు పట్టటం' అంటారు. తలగోరు పెట్టేవాని నడుముకు కమ్మకత్తి[3] దోపుతారు. కొత్తకుండ ఎడమచేతితో పట్టుకొని బావి దగ్గరకెళ్ళి, స్నానం చేసి, తడిబట్టలతో (ధోవతి ఒక్కటే ఉంటుంది.) నీళ్ళు తెచ్చి మంటమీద వేడి చేస్తారు. బావికి వెళ్ళేటప్పుడూ గంట ఊపుతూ, శంఖం ఊదుతూ కులస్థుడు వెంట ఉంటాడు. శవయాత్రలో డప్పులు కొట్టటం ఉండదు. దానికి బదులుగా గంట, శంఖునే ఉపయోగిస్తారు.

---

1. గ్రామస్థుల వద్ద కళాప్రదర్శన సందర్భంలో అడుక్కొన్ని దాచిపెట్టుకున్న పట్టుచీరలు, శాలువాలు.
2. కూరవండటానికి వాడే చిన్నకుండ.
3. ఈతకమ్మ కోసే చిన్న కొడవలి.

ఇంటి ముందరి మంటలో ఒకవైపు నీళ్ళు కాగుతుంటాయి. తలగోరు పట్టేవానిచేత తిరుగవేసిన హస్తంతో కొత్త ఆటికలో ఐదుసార్లు బియ్యం పోయించి, కొంత పసుపు వేయించి మరోప్రక్క ఉడకపెడతారు. నీళ్ళు కాగిన తర్వాత శవంతోపాటు మిగిలిన జీవిత భాగస్వామి(ని) ని కలిపి, పసుపు పెట్టి స్నానం చేయిస్తారు. బట్టలు మార్చిన తర్వాత శవాన్ని గుడిలాటి పాడెలో కూర్చోబెడతారు. చనిపోయిన వారి సొమ్ములు ఏమైనా ఉంటే వాటిని అలంకరిస్తారు.

పాడెను మరణించినవారి పాలివాళ్ళు లేదా అదే ఇంటిపేరున్న వాళ్ళు లేపి, తలగోరు పట్టినవాని వెనకాల నడుస్తారు. తర్వాత కులస్థులు క్రమంగా భుజం మార్చుకుంటారు. ఒక కులస్థుడు గంట వాయిస్తూ శంఖం ఊదుతుంటాడు. 'హర హరా! శివ శివా! మహాదేవ!' అంటూ బొందవైపు నడుస్తారు. బుడిగె జంగాలు సంచార జీవనులు కాబట్టి, కుటుంబంవాళ్ళ బొందలన్నీ ఒక ఊరనే ఉండవు. దేశాటనలో ఉండగా ఎక్కడ చనిపోతే అక్కడే ఖననం చేస్తారు. ఊరి శ్మశానానికి దూరంగా, ఊరి బయట ఉన్న చవుడునేలల్లో లేదా వాగు అంచుల్లో వీళ్ళు ఖననం చేస్తుంటారు.

సర్వసామాన్యంగా ఊళ్ళల్లో మాదిగవాళ్ళు లేక బేగరివాళ్ళు బొందలు త్రవ్వుతారు. కాని వీళ్ళలో కులస్థులే బొంద త్రవ్వవలసి ఉంటుంది. ఇద్దరు ముగ్గురు వెళ్ళి బొంద త్రవ్వుతారు బొంద తవ్వినవాళ్ళకు తర్వాత ప్రత్యేకంగా కల్లు, సారా ఏర్పాటు చేస్తారు.

బొందను సమీపించాక ఒకచోట శవాన్ని దింపుతారు. దీన్నే 'దింపుడు కళ్ళం' అంటారు. ఇక్కడ తలగోరు పట్టినవాడు పాడెచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేస్తూ, కూడు వండిన ఆటికను వెనకాల వీపువైపున ఎడమచేత్తో పట్టుకొని, కొంచం కొంచం కూడును వదులుతుంటాడు. చివరి ప్రదక్షిణంలో ఆటికను పగులకొట్టి మొత్తుకుంటాడు. తర్వాత శవం మీద అలంకరించిన సొమ్ములను వలుచుకున్నాక, మొదట పాడెను లేపినవాళ్ళే మళ్ళీ లేపుతారు. బొంద చుట్టూ పాడెతోపాటు దాయాదులందరూ మూడుసార్లు ప్రదక్షిణం చేశాక

బొందకు పడమటి ప్రక్కన పాడెను దింపుతారు సందెడు తంగెడి పొరక తెచ్చి బొందలో కింద పరుస్తారు. ఉప్పు పోస్తారు. శవంమీద అలంకరించిన దాపుడు వస్త్రాలు చుట్టి, ఉత్తరానికి ముఖం ఉండేవిధంగా బొందలో పెడతారు. తర్వాత పాడెమీద బోర్లించి తెచ్చిన ఇత్తడి చెంబులో బావినీళ్ళు తెచ్చి, అందులో విభూతి వేసి, కులపెద్ద దాయాదులందరిచేత మూడు మూడుసార్లు తీర్థం శవం మీద పోయిస్తాడు. దాయాదులు, కులస్థులు, అందరూ అంతిమ దర్శనం చేసుకున్న తర్వాత మన్ను వేస్తారు. బొంద త్రవ్వినవాళ్ళు మిగతా మట్టితో బొంద పూడ్చి దిమ్మె కడతారు.

త్రోవలో ఉన్న వాగు మడుగులోగాని, బావిలోగాని దాయాదులంతా స్నానంచేశాక, కులస్థులందరితోపాటు అందరు కలిసి మరణించిన వారి ఇంటి ముందుకు చేరుతారు. సాయంత్రం అయ్యేసరికి కల్లు దుకాణానికి వెళ్తారు. అక్కడ కులాచారం పాటింపబడుతుంది. చనిపోయినవారి ఇంటివాళ్ళు పెళ్ళయిన ప్రతి కులస్థునికి తలా ఒక ముంతకల్లు ఇవ్వటం కులాచారం. వియ్యంపులు లేక ఇతర బంధువులు ఎవరైనా ఉంటే చావు జరిగిన కుటుంబీకులకు కల్లు త్రాగిస్తారు. దీన్నే 'చేదుబాపటం' అంటారు.

ఇంటివద్ద పాత్రలన్నీ శుద్ధి చేసుకుంటారు. ఇంట్లో వాకిట్లో పెండనీళ్ళతో అలుకుతారు. ఆ రాత్రి పచ్చిపులుసుతో అన్నం తినటం పద్ధతిగా ఉంటుంది.

చీకటి ముసిరిన వెంటనే ఇంటివాడు ఒకరిద్దరు కులస్తులతో బొంద దగ్గరకు వెళ్ళి, వరిపొట్టుతోగాని, పిడకలతోగాని మంటపెట్టి ఇంటికి వస్తారు. ఇలా మంటపెట్టటాన్ని 'ఇంగలం వేయటం' అంటారు. ఒకప్పుడు అగ్ని సంస్కారం అనగా దహనాచారం ఉండేది. శైవులైన తరువాత ఖననాచారం వచ్చింది. దాని జ్ఞాపక చిహ్నమే ఈ ఇంగిలం వేయటం కాబోలు. ఇంగలం వేయటంవల్ల చనిపోయిన వ్యక్తి దయ్యం కారని వీళ్ళ నమ్మకం.

**దినకర్మ :**

మూడవ రోజున దినకర్మ చేస్తారు. అందువల్లే దీన్ని ''మూడొద్దులు'' లేక ''దినాలు'' అని అంటారు. బుడిగె జంగాలలో మూడొద్దులతోనే శ్రాద్ధ కర్మలన్నీ ముగుస్తాయి. ఆ తర్వాత ఎలాంటి కర్మకాండ ఉండదు. మాసికాలు,

వార్షికాలు వీళ్ళలో పాటింపబడవు. ఈ దినాన బంధువులు, కులస్థులు కొందరు వేటకు వెళ్ళి చేపలు, ఎండ్రకాయలు, ఎలుకలు, ఉడతలు మొదలైనవి పట్టుకొని వస్తారు పుంటి కూర, గునుగుకూర, దొగ్గలికూర. చంచలి కూర మొదలైన ఆకు కూరలు తెంపుకొస్తారు. చచ్చిన స్థలంలో ఒక కోడిని బలి ఇస్తారు. కొత్త అటికలో వీటన్నిటినీ వండి, విస్తరిలో పెట్టుకొని, వస్త్రంలో చుట్టుకొని, గంట శంఖులు వాయించుకుంటూ బొంద దగ్గరకు వెళతారు. దీన్నే 'కూడు వేయుట' అంటారు. మొదట బొందచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేస్తారు. బొంద వద్ద తలవైపున ఒక అడుగులోతు చిన్న గొయ్యితీసి, దాయాదులందరూ ఒక్కొక్కరే ఎడమ చేత్తో కొంచం కొంచం కూడు తీసి ఆ గొయ్యిలో వేస్తారు. కల్లుతో, సారాతో సాకపెడతారు తీర్థం పోస్తారు. తర్వాత ఆ గొయ్యిని పూడ్చి, దాని మీద ఒక బండను తెచ్చి కప్పుతారు. మిగిలిన కూడును గుడ్డలోని విస్తరిని విప్ప దీసి, బొందమీద ఉంచుతారు రకరకాల పళ్ళను పెడతారు. బీడీ, చుట్ట ముట్టించి అక్కడ ఉంచుతారు. బొంద మీద ఇవన్నీ పెట్టాక అందరూ మొక్కుతారు. కొంచం దూరంగా వెళ్ళి కూర్చుంటారు. దీన్ని 'పిట్టకు పెట్టటం' అంటారు. చనిపోయినవారి ఆత్మ పక్షిరూపంలో వచ్చి తిని పోతుందనే విశ్వాసమే దీనికి కారణం.

కూడు వేసే సందర్భంలో చెంచువాళ్లు కాకులో, కుక్కలో, మరే ఇతర జంతువులో తింటే, జీవుడు ఆ జంతువులో ప్రవేశించాడని భావిస్తారు. ఏ జంతువులూ, పక్షులూ ముట్టకపోతే భగవంతుడిలో ఐక్యమయ్యాడని తలుస్తారు. పిండం మీద ఈగలు ఎక్కువగా వాలితే జీవుడు పిశాచం అయ్యాడని తీర్మానించుకుంటారు. అటువంటప్పుడు నేల మీద బొమ్మగీసి ప్రార్థిస్తారు.[1]

ఖోండులు దహనం చేసిన మరునాడు బియ్యం వండి దహనం చేసిన స్థలంలో పెట్టి, మృతుని ఆత్మను ఆ ఆహారం తినమనీ, దయ్యం కావద్దనీ ప్రార్థిస్తారు.[2]

---

1. ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర 1. పుట . 35.
2. ...............అదే...........పుట - 53.

బుడిగె జంగాలలో కాకి కంటే గద్ద ముట్టితేనే మంచిదని భావిస్తారు. పిట్ట రావటం ఆలస్యమయితే చనిపోయిన వ్యక్తి కుటుంబ సభ్యులు బొంద దగ్గరకు వెళ్ళి మళ్ళీ మొక్కుతారు. త్వరగా పిట్ట ముట్టాలని ప్రార్థిస్తారు. "అక్కడికిక్కడికి ఎక్కడికి పోకుండ, ఎవరి ఇళ్ళల్లోకి పోకుండ కలల్లో నీడల్లో రాకుండ స్వర్గానికి చేరుకో. మమ్మల్ని బాధపెట్టకు" అని మొక్కుతారు. దయ్యమై ఎవరినీ బాధింపకుండ స్వర్గానికి వెళ్ళి దేవుడై పోవాలని వాళ్ళ అభిప్రాయం. పిట్ట ముట్టటం ఆలస్యమైతే కులస్థుల్లో గుసగుసలు ప్రారంభమవుతాయి. చనిపోయినవ్యక్తి పిసినారి అనో, నోరారా తిన్నవాడు కాదనో, అన్యాయస్థుడనో, తన సంతానం మీద ఇంకా మమకారం వీడలేదనో, తన జీవిత భాగస్వామి(ని) పెట్టిన బాధలు పడలేకనే చచ్చారనో. రకరకాలుగా అనుకోవటం - అందువల్ల తప్పకుండ దయ్యం అవుతారని భావించటం వీళ్ళలో సర్వసాధారణం.

పిట్ట(లు) ముట్టాక మిగిలినదాన్ని తీసుకెళ్ళి వాగులోనో, చెరువు వొడ్డునో నీటిలో పెట్టి పైనుంచి ఒక బండ పెడతారు. దీన్ని 'జల్దిలోకలపటం' అంటారు. బహూశః జలంలో కలపటమే జల్దితో కలపటం (జలధిలో కలపటం) అయివుండ వచ్చు. జల్దిలో కలిపాక దాయాదులందరు గంగ (నీటి)లో మునుగుతారు. శిరోముండనం చేయించుకునే ఆచారం బుడిగె జంగాలలో లేదు. రేవులో భార్య చనిపోయినవారికి మొలతాడు తెంపి విధురుణ్ణి చేయటం లేదా భర్త చనిపోయిన వారిని గాజులు పగులగొట్టి బొట్టు తుడిచి విధవను చేయటం జరుగుతుంది. విధవను చేసిన తర్వాత ఇతర విధవరాళ్ళు ఆమెను తెల్లచీరతో, తలనిండ ముసుగుతో ఇంటికి తీసుకువస్తారు. ఆ ఇంటి ఆడబడుచు అందరికంటే ముందుగా వచ్చి పెండనీళ్ళు చల్లి, అలికి ఇంటిని శుద్ది చేస్తుంది. అన్నం వండటానికి, అంబలి కాయటానికి వాడే 'కలికుండ'ను పారేస్తుంది. గుడిసెలో మూలన ఒక దీపం పెడుతుంది.. బంధువులు, కులస్థులు, అందరు ముందు ఆ ఇంటికి వచ్చి దీపానికి మొక్కుతారు. దీపం కదలకుండా వెలుగుతున్నట్లయితే మరణించిన వారు నేరుగా స్వర్గానికి వెళ్ళారని, అటు ఇటు కదులుతున్నట్లయితే దయ్యం అవుతారని నమ్ముతారు. తర్వాత ఆ ఇంటివారు పచ్చి పులుసుతో అన్నం తింటారు. కులాచారం ప్రకారం కులస్థులందరికి విందుచేస్తారు.

మరునాటి నుంచే దయ్యాల మొక్కు ప్రారంభమవుతుంది. ఈ విషయాన్ని ఆరాధనా పద్ధతుల్లో వివరిస్తాను. ఇంతటితో చావు తంతు ముగుస్తుంది.

పట్టణాల్లో ఉండే బుడిగె జంగాల్లో అత్యధికుల్లో ఈ విధానాలే కొనసాగుతున్నాయి. హైదరాబాదు నగరంలో కూడ బుడిగె జంగాల చావు తంతు ఈ విధంగానే కనిపిస్తుంది. అత్యధిక కులస్థుల్లో వీరశైవ పద్ధతుల్లో కాకుండా పడుకోబెట్టి పాడె తీసుకెళ్ళటం, ఖననం చేయటం జరుగుతున్నది. కొన్ని ధనిక కుటుంబాల్లో ఖననానికి బదులుగా దహనం చేయటం కూడ ప్రారంభమయింది. నాగరక జీవన ప్రభావం వల్ల పూర్వాచారాలకు మెలమెల్లగా స్వస్తి చెప్పటం జరుగుతున్నది.

ఇతర శూద్ర కులాల దినకర్మ రోజున బుడిగె జంగాలు భిక్షుకగాయకులుగా మరణించినవారి గురించి పాడి అడుక్కుంటారు. స్త్రీయో, పురుషుడో చనిపోయినవారినిబట్టి తగిన విశేషణాలతో కీర్తిస్తారు. తాంబూర మీటుతూ, అందెలు వేస్తూ కథకుడు పాడుతుండగా డింకి వాయిస్తూ కథకుని భార్యనో, సోదరుడో, ఇతర వ్యక్తో వంత పలుకుతుంటారు. వంత పాటగాడు లేనప్పుడు ఒక్కడే పాడుతాడు. దీన్ని పెద్దల (పితృదేవతల) పేరుమీద 'పొగిడింపు' అంటారు.

పొగిడింపు పాట

చనిపోయిన వ్యక్తి కొడుకును ఉద్దేశించి పాడిన పాటను పూర్తిగా ఈ కింద ఉదాహరిస్తున్నాను.[1]

హరహర మాదేవ హరహరమాదేవ - అయ్యయ్యో దైవాము హరహర మాదేవ
ఏడయ్య మీ నాయనా ,, - ఏడ గానారాడూ ,,
పాణం బొయ్యేటప్పుడు ,, - జీవి వొయ్యేటప్పుడు ,,
నిన్ను ఏమంట బిలిసిండు ,, - నీకు ఏమేమి జెప్పిండు ,,
ఎమినోళ్ళు ఒచ్చిండ్రు ,, - ఎదమీద యున్నారు ,,
రెట్టలకు తాళ్ళేసి ,, - ననుగుంజుతున్నారు ,,
మాటాలు బందాయె ,, - మరి సూపులున్నాయి ,,
చెయ్యి సైగలతోటి ,, - చెప్పేను బుద్ధూలు ,,

1. పాడినవారు : సిరిసాల భీమయ్య, కల్లెం చంద్రయ్య.
బుడిగె జంగం కాలనీ, జంగం మెట్, హైదరాబాదు తేది 3-2-1990.

పోతున్న నా కొడుకా ,, - నేనెల్లి పోతున్నరా ,,
ఇల్లుందు పదిలాము ,, - జాగుందు పదిలాము ,,
తమ్మ్యూలు పదిలాము ,, - పిల్లాలు పదిలాము ,,
అక్కచెల్లెండ్రాకు ,, - దిక్కునీవే కొడుకా ,,
కంచెంత బలగాము ,, - నేనొదిలి పోతున్నా ,,
చూసుకో నా కొడుక ,, - కాపాడు నా కొడుక ,,
చెప్పిందు మీ నాయన ,, - పాణంబొయ్యేటప్పుడు ,,
మా నాయన లేదంట ,, - ఏ తొవ్వ జూసేవు ,,
మా నాయన రాదంట ,, - ఏదారి జూసేవు ,,
పని ఉంది అని జెప్పి ,, - పల్లెకే బొయ్యిండా ,,
తిరిగొస్తనని జెప్పి ,, - తీర్థాల కెల్లిండా ,,
ఎదురెదురు జూసేవు ,, - ఏడయ్య మీ నాయనా ,,
కనరాని లోకానికి ,, - కదిలి పోయిందు ,,
పాపాల దేవుడూ ,, - పాపుకొని పోయిందు ,,
దోషకారి దేవుడూ ,, - దోసుకొని పోయిందు ,,
చూడవోతె మీ నాయనా ,, - చూపులకు కనవడదు ,,
చక్కని రూపులు ,, - చెక్కలకు దాపాయె ,,
మానంటి భుజమూలు ,, - మంటమ్మ పాలాయె ,,
చెర్కంటి చేతూలు ,, - చెదలమ్మ పాలాయె ,,
కల్వారేకులవంటి ,, - కన్నూలెక్కడవాయె ,,
పిలువయ్య నాయ్నని ,, - పిలిచీన పలుకాడు ,,
ఓ నాయ్న రంగయ్యా ,, - ఇయ్యాళ దినమందు ,,
నీ కొడుకులొచ్చిరి ,, - నీ బిడ్డలొచ్చిరి ,,
నాయ్నా నాయ్నంట ,, - నిను బిల్సుతున్నారు ,,
ఒక్కమాటైన జెప్పయ్య ,, - ఒక్క పలుకైన పల్కయ్య ,,
పిలిచీన పలుకాడు ,, - ఎతికిన దొరుకాడు ,,
మానేడు మానేడు ,, - మల్లెపూల తోని ,,
తూమేడు తూమేడు ,, - తుమ్మి పూలతోని ,,
ఊరికి ఉత్తరానా ,, - ఊడాల మర్రికాడ ,,

తులశమ్మ గుడికాడ ,, - నాలుగు మూలల ,,
చిన్నారి ఇల్లుగట్టే ,, - చిత్రాల ఇల్లుగట్టె ,,
భూమేమొ ఇల్లాయె ,, - భూతల్లి తల్లాయె ,,
తన చెంబెడు నీళ్ళు ,, - తన బుక్కెడు బువ్వ ,,
భూతల్లి మరుగాయె ,, - అతనికి కరువాయె ,,
అవుతోక వట్టిండు ,, - ఆకాశమెల్లిండు ,,
గోవుతోక వట్టిండు ,, - దేవలోక మెల్లిండు ,,
మా నాయ్న వస్తడాని ,, - ఏ తొవ్వ జూసేవు ,,
ఏ గుంపులున్నాడు ,, - ఏ దోస్తుల్ల యున్నాడు ,,
కొట్లాడిపోతేను ,, - తిట్లాడిపోతేను ,,
నాయనా నాయ్నంటా ,, - నువ్వెల్లి గీమ్‌లాడి[1] ,,
చెయ్‌వట్టి తోల్‌కొచ్చి ,, - చెంబేడు నీళ్ళిచ్చి ,,
తలెగడిగి బువవెట్టి ,, - తినుమంట జెప్పయ్య ,,
పండుగన పబ్బాన ,, - మీరంత కూర్చొని ,,
తినుకుంట తాగుకుంట ,, - కలగలిసి మీరుంటే ,,
ఇంతోడి[2] బలగాము ,, - సంతోష పడుతుంటె ,,
ఏడయ్య మీ నాయన ,, - ఏడ ఉన్నాడయ్యే ,,
నాయనా నాయ్నంట ,, - ఎవ్వర్ని బిలిచేవు ,,
గద్ద గొట్టిన సందాము ,, - కూలిండు మీ నాయనా ,,
చెట్టునుండి పండోలె ,, - రాలిండు మీ నాయనా ,,
ఇయ్యాళ్ళ మీ నాయనా ,, - ఇగ మీకు ఉంటేను ,,
మీ కెంత దిటముండు ,, - మీకెంత బలముండు ,,
కొడుకులకు ఎడబాసి ,, - కోడండ్ల కెడబాసి ,,
మనుమలకు ఎడబాసి ,, - మనుమరాండ్లకెడబాసి ,,
అందరికి ఎడబాసి ,, - కైలాస మెల్లిండు ,,
మీ సొమ్ము దిననింకె ,, - ఆ బ్రహ్మరాయలేదు ,,
మీ బట్ట గట్టనింకె ,, - తానోసుకోలేదు ,,

1. గీములాడి - బతిమిలాడి, 2. ఇంతటి.

| | | | |
|---|---|---|---|
| అందుకే దేవుడు | ,, | - అతన్ని బిలిసిండు | ,, |
| హరిహరి అన్నాడు | ,, | - వైకుంఠ మెల్లిందు | ,, |
| శివశివ అన్నాడు | ,, | - శివునిలో కలిసిండు | ,, |
| దేవ దేవన్నాడు | ,, | - దేవునిలో నిలిసిండు | ,, |
| ఇయ్యాళ్ళ దినమందు | ,, | - పెద్దమనిషి దినమందు[1] | ,, |
| కొడుకులూ ఉండెపట్కె[2] | ,, | - బిడ్డాలు ఉండెబట్కె | ,, |
| మా నాయన లేడంట | ,, | - మా జంగాల బిలిపించి | ,, |
| సువర్ణ దానమిచ్చి | ,, | - ఎండిచ్చి[3]పొగిడించి[4] | ,, |
| గోదానం భూదానం | ,, | - గొప్పగా సదివించి | ,, |
| ధాన్యాలు ధనమిచ్చి | ,, | - వస్త్ర దానాలిచ్చి | ,, |
| మా నాయన లేడంట | ,, | - మైసాక్షి పొగలేసి | ,, |
| పేర్ పేర్న పొగిడించి | ,, | - పేరు నిలబెట్టిరి | ,, |

ఈ విధంగా బుడిగె జంగాలు కరుణ రసాత్మకంగా ఈ గేయాన్ని పాడుతూ కుటుంబీకుల్ని శోకంలో ముంచేస్తారు. బంధువుల్లో ఆత్మీయతను పొంగిస్తారు. మరణించిన వ్యక్తి కళ్ళముందర ఉండి ఆ మాటలు అంటునట్లుగా చిత్రించి, అనుబంధాలు గుర్తొచ్చి, కంటనీరు పెట్టేలా వర్ణిస్తారు. వేదాంత ధోరణిలో ఓదార్పు కూడా కలిగిస్తారు. ఇలా పాట దీర్ఘంగా కొనసాగుతూ బంధు వర్గాన్ని అందులో లీనమయ్యేటట్లు చేస్తుంది.

ఈ గేయాన్ని బుడిగె జంగాలు ఎక్కడ పాడినా, ఎవరు పాడినా ఒక్క లాగే పాడుతారు. కేవలం పేర్లు మాత్రం మార్చుతారు. హైదరాబాదులో స్వకులస్థుల దినకర్మ రోజున కూడ ఈ పాటను పాడి, వాళ్ళ దగ్గర సైతం అడుక్కుంటారు.

బుడిగె జంగాలలాగా బైండ్లవాళ్ళుకూడ ఈ సందర్భంలో పాడి అడుక్కుంటారని డా॥ సిహెచ్. యాదయ్యగారు ఇలాంటిదే ఒక బైండ్ల పాటను

1. తద్దినం, 2. ఉండటంవల్ల, 3. వెండి యిచ్చి.
4. ఇలాంటి సందర్భాల్లో బుడిగె జంగాలతో ఈ పాట పాడించుకొని పితృ దేవతల పేరుమీద దానం చేయటాన్ని ''పొగిడించటం'' అని అంటారు.

ఉదాహరించారు.[1] డా. సి వసుంధరగారు వారి చిన్నాన్న మరణకాలంలో బుడిగె జంగం కులస్థురాలైన రాసూరి బుగ్గమ్మ పాడిన గేయాన్ని ఉటంకించారు.[2]

దినకర్మనాడే కాకుండా ఇతర సందర్భాల్లో కూడా మరణించినవారిని స్మరించుకోవటానికి కొందరు వీళ్ళచేత ఈ పాట పాడించుకుంటారు.

## 6. ఆరాధనా పద్ధతులు

ప్రాణికోటి మీద ప్రబలమైన ప్రభావాన్ని చూపించే పంచ భూతాలే ఆదిమానవుని మొదటి దేవుళ్ళు. అవ్యక్తంగా, విస్మయాస్పదంగా కనిపించేవన్నీ మనిషికి దేవుళ్ళయ్యాయి. అతని భయం నుంచి దేవుళ్ళు పుట్టుకొచ్చారు. అతనికి మేలుచేసిన భూతాలు దేవుళ్ళయ్యాయి. శరీరానికి అంతం ఉందిగాని ఆత్మ చావదనే భావనవల్ల మనిషి ఆత్మారాధన పట్ల మిక్కిలి భయ గౌరవాలు ప్రదర్శిస్తూ వచ్చాడు. పితృదేవతల ఆత్మలు జంతురూపంలో సంచరిస్తాయనే విశ్వాసమే జంతు పూజావిధానానికి దారి తీసింది. ఈ విధానమే కులదేవతా పద్ధతిగా రూపుదిద్దుకున్నది. ఆత్మలు ప్రేతాత్మలుగా మారి పీడిస్తాయనే భయంతో వాటిని శాంతింపచేసి, ప్రసన్నం చేసుకోవాలని మనిషి ప్రయత్నించాడు. ప్రేతాత్మలు శాంతించినట్లయితే మేలు చేస్తాయని విశ్వసించాడు. కాబట్టి ప్రేతాత్మలను అదుపుచేసే ఒక శక్తిని కల్పించుకొని ఆరాధించటం మొదలు పెట్టాడు. అదే మాత్రారాధనకు మార్గం వేసింది.

బుడిగె జంగాలలో ఉన్న ఆరాధనా పద్ధతులను ప్రధానమైన రెండు విభాగాలుగా చేయవచ్చు. అవి A. దేవతారాధన. B. ప్రేతారాధన. దేవతారాధనలో I మాతృదేవతలు II. కులదేవతలు III. సిగాలు IV. ఇతర దేవుళ్ళు V. శిష్టదేవతలు VI. మహమ్మదీయ దేవుళ్ళు - అనేవాటిని ఉప విభాగాలుగా పరిశీలింపవచ్చు. వీటిలో కొన్ని రకాలు చూపవచ్చు. ఉదాహరణకు I. మాతృ దేవతల్లో 1. మైసమ్మ, 2 పోశమ్మ, 3. ఎల్లమ్మ మొదలయినవి. II. కుల దేవతల్లో 1. జమ్ములమ్మ, 2. ఎల్లమ్మ, 3. పెద్దగోసాయి తాత.

---

1. జానపద విజ్ఞానంలో బవనీలు - ఒక పరిశీలన - పుట. 57.
2 తెలుగు జానపద సాహిత్యము - స్త్రీల గేయములలో సంప్రదాయము - పుట. 328.

B భాగమైన ప్రేతారాధనలో I. సకినాలు, II. పారబోసుకోవటం, III దయ్యాలను చంపించుట IV. భూతవైద్యులు.

I. సకినాల్లో రకాలుగా 1. చాటసకినం, 2. కుండ సకినం, 3. తలె సకినం, 4. దండ సకినం, 5. పేను సకినం పేర్కొనవచ్చు.

## A. దేవతారాధన

I. **మాతృదేవతలు :** మొట్టమొదటి సరూప దేవత తల్లిదేవత. ఆ దేవ ఆరాధించటమే మాతారాధనం. 'స్త్రీ శక్తి స్వరూపిణి' అనే భావన ఈ శక్తి తను పూజకు ఆధారమయింది. ఆ స్త్రీ శక్తి కాళి, చండి, భైరవి మొదలైన పేర్లతో ఆరాధింపబడింది రాను రాను లెక్కకు మిక్కిలిగా వివిధ నామాలతో మాతా రాధన విశ్వరూపమెత్తింది. దయ్యాలను పారదోలే దేవతలు, రోగాలను పోగొట్టే దేవతలు, సంతానం కలిగించే దేవతలు - ఈ విధంగా అనేక దేవతలు ఆరాధింప బడుతున్నారు. ఊరి బయట మైసమ్మ, ఊళ్ళో ఎల్లమ్మ, పోశమ్మ దేవతలే కాకుండా కులానికో దేవత, ఇంటికో దేవత - ముత్యాలమ్మ, అంకమ్మ, గండెమ్మ మరిడమ్మ, మారెమ్మ, ఈదెమ్మ, చౌడమ్మ ఇత్యాదిగా గ్రామ గ్రామానికి వైవి ధ్యంతో దేవతారాధన జరుగుతున్నది. జానపదులు సృష్టించుకున్న ఈశ్వరుని ఏడుగురు కూతుళ్ళు ప్రాంత భేదాలను బట్టి అనేక నామాలతో ఆరాధింపబడు తున్నారు. ఏడుగురు అక్కచెల్లెళ్ళ ఏకైక అనుజుడు పోతురాజు కూడ పూజ లందుతున్నాడు.

ఆర్యదేవతల్లాగా జానపద దేవతలకు పెద్ద పెద్ద విగ్రహ ప్రతిష్ఠాపనలు, పూజాదికాలు, ఆడంబరం మొదలైనవేవీ ఉండవు. చిన్న చిన్న రాళ్ళే దేవతలు. పలకరాళ్ళే దేవతా విగ్రహాలు. ఒకచోట వేపచెట్టు ఎల్లమ్మ అవుతుంది మరో చోట పుట్టనే ఎల్లమ్మ అవుతుంది.

కోయలు ఒక అడుగు లోహపు ముక్కను ఒక వెదురు బొంగులో పెట్టి, జనసంచారం లేనిచోట అతి రహస్యంగా దాస్తారు. అదే వేల్పు. ఈ వేల్పును ప్రత్యేక సందర్భంలో కొలుస్తారు. అంటు రోగాలు వ్యాపించినప్పుడు, పంటలు చెడిపోయినప్పుడు ఈ వేల్పును ఊరేగిస్తారు.[1]

1. ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర 1. పుట. 39.

బుడిగె జంగాలు వేపచెట్టును, పాముల పుట్టను ఎల్లమ్మ దేవతగా కొలుస్తారు. అర తులం వెండితో ఎల్లమ్మ, పోశమ్మ, జమ్మలమ్మ దేవతల పతకాలు చేయించుకొని, సంవత్సరానికోసారి పచ్చకొమ్మలతో గుడికట్టి ఆరాధిస్తారు. పతకం లేనట్లయితే పచ్చికొమ్మలతో కట్టిన చిన్న గుడిలో పసుపు కుంకుమలే దేవత అవుతాయి.

బుడిగె జంగాలు కొలిచే మాతృదేవతల్లో మైసమ్మ, పోశమ్మ, ఎల్లమ్మ ముఖ్యమైన దేవతలు. మైసమ్మను గ్రామంలోని మైసమ్మ గుడికి వెళ్ళి కొలువగా పోశమ్మను మాత్రం కులమంతా కలిసి ప్రత్యేకమైన పచ్చటి ఆకుల గుడికట్టి సామూహికంగా కొలుస్తారు. ఎల్లమ్మ దేవతను ఏ కుటుంబానికా కుటుంబమే ఇంటి దేవతగా ఆరాధిస్తారు.

### 1. మైసమ్మ :

గ్రామీణుల్లో మైసమ్మకు మొక్కని వాళ్ళుండరు. గ్రామంలో ప్రత్యేకంగా మైసమ్మ గుడులుంటాయి. వేపచెట్టు, మైసమ్మ గుడి కలిసి ఉండటం పరిపాటి. చెరువు కట్ట మైసమ్మ, పుట్ట మైసమ్మ, తాటి మైసమ్మ, కోట మైసమ్మ, బంగారు మైసమ్మ, జడల మైసమ్మ మొదలైన పేర్లతో ఆయా స్థలాల్లో మైసమ్మను జానపదులు ఆరాధిస్తారు. హైదరాబాదు నగరంలో గండిపేట మైసమ్మ (కట్టమైసమ్మ) చార్మినార్ బంగారు మైసమ్మ (ఈమెనే భాగ్యలక్ష్మి అంటున్నారు) ప్రసిద్ధమైన దేవతలు. నిజాం నవాబు హయాంలో గోల్కొండకోటలో కోట మైసమ్మను నిలిపారు. ఈ గుడి ఇప్పటికీ ఉంది.

ప్రతి రైతు తన పొలంలో కొన్ని రాళ్ళుపేర్చి మైసమ్మ గుడి కడతాడు. సంవత్సరానికోసారి పంటల సమయంలో మైసమ్మను ఆరాధిస్తుంటాడు. ఇంతే కాక మైసమ్మను గ్రామ ప్రజలంతా కలిసి సామూహికంగా యాడాదికోమారు మొక్కుతారు. గ్రామం తరపున మైసమ్మ బలికి 'దున్నపోతు'ను వదలటం సంప్రదాయం. మైసమ్మ ఉత్సవాల సమయంలో కోళ్ళు, గొర్రెలు బలి ఇవ్వటం సర్వసాధారణం.

బుడిగె జంగాలు కూడ మైసమ్మను ఆరాధిస్తారు. గ్రామంలో ఉండే మైసమ్మ గుడికి వెళ్ళి, తాము మొక్కుకున్నట్లుగా కొబ్బరికాయతోనో, బోనంతోనో, కోడిని బలియిచ్చో పూజిస్తారు.

## 2. పోశమ్మ:

'గత్తర' లేక 'కలరా'ను 'మారెమ్మ' అని ఆరాధించినట్లుగానే మశూచి అనే అంటువ్యాధిని 'పోశమ్మ' అనే పేరుతో కొలుస్తారు. రోగ తీవ్రతనుబట్టి పోశమ్మ అనేక పేర్లతో వ్యవహరింపబడుతున్నది. చెమటకాయంత ప్రమాణంలో (Chicken-pox) అయినట్లయితే 'తట్టమ్మ' లేక 'ఆటపాటలమ్మ' అని, అక్కడొక కుండ, ఇక్కడొక కుండ అయినట్లయితే 'గజు(పు/తు)లమ్మ' అని, చిన్న చిన్న కుండలయినట్లయితే 'ముత్యాలమ్మ' అని, తీవ్రతరంగా, దట్టంగా పెద్ద పెద్ద కుండలతో అయినట్లయితే 'నల్లపోశమ్మ' అని పిలుస్తారు. పోశమ్మనే 'తల్లి' లేక 'అమ్మవారు' అని కూడ అంటారు. రెండు పదాలను కలిపి 'అమ్మ తల్లి' అనటం కూడ ఉంది.

బుడిగె జంగాలు గూడెమంతా కలిసి పోశమ్మను సామూహికంగా కొలుస్తారు. ఈ ఉత్సవాన్ని 'పోశమ్మ బోనాలు' అని పిలుస్తారు, అందరు కలిసి ఒకరోజు నిర్ణయించుకుంటారు. సాధారణంగా మంగళవారమో లేక శుక్రవారమో అయితే శుభమని భావిస్తారు. గుడిసెలకు ఒకప్రక్కగా తంగేడు కొమ్మలతోనో, సీతాఫలచెట్టు కొమ్మలతోనో చిన్న గుడిని నిర్మిస్తారు. కొందరి దగ్గర ఉండే పోశమ్మ వెండి పతకాలను[1] తెచ్చి, ఆ గుళ్ళోపెట్టి పసుపుకుంకుమలతో బొట్లు పెడతారు. బోనంకుండకు చుట్టూరా పసుపు కుంకుమలతో బొట్లుపెట్టి, కుండ మూతివద్ద వేపమండలుపెట్టి, మీద నూనెదీపం వెలిగిస్తారు. బోనాలు ఎత్తుకొని స్త్రీలు వస్తుండగా పురుషులు తమవద్ద ఉన్న తంబూరాలు, గుమ్మెట్లు, మద్దెలలు, హార్మోనియంలు, తాళాలు వాయిస్తూ, తందానా కథలు చెప్పేటప్పుడు పాడే దేవతల స్తుతిపాటలు, వీధి భాగవతాల్లో ఉండే దేవతల స్తోత్రగీతాలు పాడుతారు. బోనాలు ఎత్తుకున్న స్త్రీలు ఈ క్రింది పాట పాడుతూ గుడివైపు సాగుతారు:

---

1. పావుతులంనుంచి తులం పరిమాణం వెండితో ఎల్లమ్మ, పోశమ్మ దేవతల పతకాలు చేయించుకుని, ఒక అడుగు పొడవున్న చిన్న జోలెలో గవ్వలు పసుపువేసి గుడిసెలో పైభాగాన తగిలిస్తారు. దీన్ని 'దేవుని జోలె' అంటారు.

"అయ్యయ్యో జనులారా! మా పోశమ్మ కేమైన తెచ్చినారా!
మా పోశమ్మ కేమైన తెచ్చినారా! ॥అయ్యయ్యో!॥
పసుపు కుంకుమ తెచ్చినాము - మేమానందాని కొచ్చినాము ॥మేమా॥
కాయా శెక్కెర తెచ్చినాము మేమానందాని కొచ్చినాము
మేమానందాని కొచ్చినాము ॥కాయా॥ ॥అయ్యయ్యో॥
నీళ్ళ సాకలు తెచ్చినాము - మేమానందానికొచ్చినాము ॥మేమా॥
కల్లూ సాకలు తెచ్చినాము - మేమానందానికొచ్చినాము ॥మేమా॥
బెల్లం సాకలు తెచ్చినాము మేమానందానికొచ్చినాము ॥క॥ అయ్యయ్యో॥
జోడాకాయలు తెచ్చినామూ - మేమానందానికొచ్చినాము
మేమానందాని కొచ్చినాము ॥జోడా॥ ॥అయ్యయ్యో॥
కోడిపుంజులు తెచ్చినామూ - మేమానందానికొచ్చినాము
మేమానందానికొచ్చినాము ॥కోడి॥ ॥అయ్యయ్యో॥
యాటాబోనం తెచ్చినాము - మేమానందానికొచ్చినాము
మేమానందానికొచ్చినాము ॥యాటా॥ ॥అయ్యయ్యో॥

సంవాద రూపంలో ఉండే మరోపాటను కూడ ఈ సందర్భంలో స్త్రీలు పాడుతారు.

తెల్లచీరలు కట్టి తెల్లరైకాలు తొడిగి
యాడికి పోతావు - వెయిగండ్ల పోశమ్మ
తమ్ముని కి తానామడుగ
నాసాటి చెల్లెండ్లకు సారెల్ల బోనమడుగ
సారెల్ల బోనమడుగ - సక్కాని రత[1]మడుగ ॥తెల్ల॥
కోడిపుంజులతోటి - కొబ్బరికాయల తోటి
నీ పూజా కొస్తిమమ్మ - నీ పూజకొస్తిమి ॥తెల్ల॥
యాపరిల్లల చీరగట్టి - అంజనేయుని వెంటబెట్టి
యాడికి పోతావు - వెయిగండ్ల పోశమ్మ
కొత్తబట్ట కోసమయ్యి - సాలె ఇంటికి నేనుబోదు
సల్వబట్టల కొరకు - సాకలింటికి నేను బోదు ॥తెల్ల॥
సక్కాని కుడుక లిత్తుము - సన్నంపు బియ్యమిత్తుము
యాడికి పోతావు - వెయిగండ్ల పోశమ్మ ॥తెల్ల॥

---

1. రథము.

కులపెద్ద పూజారిగా ఉండి పోశమ్మకు 'ఎద' సమర్పిస్తాడు. దేవతకు గాని, దయ్యానికిగాని అన్నము, బలిజంతువుల అవయవాలు వండి రాశిగా పోయటాన్ని ఎద అంటారు. మేక/గొర్రె ఉంటే బలి ఇస్తారు. కొందరు బోనం చేశాక ఇంట్లోనే బోనం దగ్గర కొబ్బరి కాయకొట్టి, కోడిని బలి ఇస్తారు. పూజలు అయిపోయిన తర్వాత పోశమ్మ వెండి పతకాలు ఎవరివివాళ్ళు తీసుకెళ్ళి ఇంట్లో 'దేవుని జోలె'లో భద్రపరుచుకుంటారు.

సంవత్సరానికోసారైనా పోశమ్మను బలులచేత తృప్తిపరచనట్లయితే 'అమ్మతల్లి' (Small pox) అయి, నానా యాతనకు గురి చేస్తుంది. చంపుకు పోతుంది' అని నమ్ముతారు. గ్రామీణులు కూడ పోశమ్మకు ప్రతిసంవత్సరం తప్పకుండ మొక్కుతారు.

మశూచి రోగి వ్యాధి తీవ్రత హెచ్చినప్పుడు "నల్లపోశమ్మ తల్లీ! నా కండ్లు పోకుండ బాగచేసినట్లయితే నీకు వెండి కండ్లు జేయించి మొక్కుతా"నని, "నీ రూపు (పోశమ్మ రూపంగల వెండి పతకం) చేయించి ప్రతియేట తప్పకుండ పూజలు చేస్తాన"ని ప్రార్థిస్తారు. పావు, అరతులం చొప్పున పోశమ్మ రూపు వెండి పతకాలు చేయించుకొని పెద్దలు పిన్నలు మెడలో ధరిస్తారు.

**3. ఎల్లమ్మ :**

బవనీలు, ఆసాదివాళ్ళు ఆరాధించే శక్తి స్వరూపమే ఎల్లమ్మ. ఈ దేవతను ఆరాధించటంవల్ల ఒక సంచార తెగకు 'ఎల్లమలవాళ్ళు' అనే కులనామం ఏర్పడింది.[1] ఒగ్గు కథల్లో ప్రధాన కథ ఎల్లమ్మ కథే. పరశురాముని తల్లి అయిన రేణుకాదేవి ఎల్లమ్మ. హైదరాబాదు నగరంలో బల్కంపేట ఎల్లమ్మ ప్రసిద్ధిగన్న దేవత.

'క్రీడాభిరామం'లో సింహాసన ద్వాత్రింశికలో 'ఏకవీర' అనే దేవతను జానపదులు పూజించినట్లు పేర్కొనబడింది. ఈ ఏకవీర రేణుక అవతారమని అంటారు. రేణుకాదేవే 'మాహురం' అనే గ్రామంలో ఉండటంవల్ల 'మాహురమ్మ' అని పేరొచ్చింది. ఆమెనే ఎల్లమ్మ పేరుతో జనంలో ప్రాచుర్యాన్ని పొందింది.[2]

---

1 Tbe Scheduled Castes and Scheduled Tribes arders (Amendment) Act, 1976. Serial No. 21 in S.C's List.

2. ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుట 279.

బుడిగె జంగాలు కూడ ఎల్లమ్మను ఆరాధిస్తారు. తూర్పాటి, కడమంచి, కల్లెం, పస్తం, సదుల మొదలైన ఇంటిపేర్లవాళ్ళు ప్రధాన దేవత ఎల్లమ్మనే కుటుంబంలో ఎక్కువ మందికి ఎల్లమ్మ, ఎల్లయ్య అనే పేర్లు పెట్టుకుంటారు.

ప్రధాన దేవతగా ఎల్లమ్మను కొలిచేవాళ్లు ఎల్లమ్మ వెండి రూపులు చేయించి, దేవుని జోలెలో భద్రపరుచుకుంటారు. ఈ విధంగా ఎల్లమ్మ దేవత ఇంట్లో కొలువుండి కుటుంబాన్ని రక్షిస్తుంది. సంవత్సరానికొకసారి ఎల్లమ్మ దేవతకు పూజలు చేస్తారు. సాధారణంగా సంక్రాంతి పండుగ కంటె వారం పది రోజుల ముందుగాని, తర్వాత గాని మొక్కుబడిగా ఉత్సవం జరుపుతారు వేపచెట్టును ఎల్లమ్మగా భావించటం, పుట్టను ఎల్లమ్మ పుట్టగా భావించి పూజించటం కూడ కనిపిస్తుంది.

ఎల్లమ్మ దేవతను బుడిగె జంగాలు రెండు పద్ధతుల్లో ఆరాధిస్తారు. ఒకటి బలి ఇచ్చి ఆరాధించటం; రెండు, బలి లేకుండ ఆరాధించటం. కొందరి ఇంటి దేవత అయిన ఎల్లమ్మను 'బాపనింటి ఎల్లమ్మ' అని అంటారు. ఈ ఎల్లమ్మకు బలి ఉండదు. టెంకాయ, బెల్లం బువ్వ బోనంతో పూజిస్తారు. బలి విధానం లేకుండ, మధుమాంసాలు లేకుండ శాకాహారాన్ని ఎడపెట్టటంవల్ల ఈ దేవతకు 'బాపనింటి ఎల్లమ్మ' అనే పేరు వచ్చింది.

బలి విధానంతో ఆరాధించే ఎల్లమ్మను కొందరు 'రాయికంటి ఎల్లమ్మ' అని, కొందరు 'ఫిరంగి ఎల్లమ్మ' అని, తూర్పాటి ఇంటిపేరుగా ఉన్నవాళ్ళు 'ఇసంపల్లి ఎల్లమ్మ' అని పిలుస్తారు. ఈ ఎల్లమ్మ దేవతకు కోళ్ళు, గొర్రెలు బలి ఇస్తారు. బూరెల దోర్నం, పొంగులొట్టి కల్లు, తొట్టెల మొదలైనవి మొక్కునుబట్టి సమర్పిస్తారు. ఫ్రెంచివాళ్ళు తెలుగు గడ్డమీద అడుగుపెట్టి నప్పుడు ఎల్లమ్మ వాళ్ళను నానా యాతనకు గురిచేసి, కొందరిని చంపుకు పోయిందట. నాటినుంచి ఆమెను 'ఫిరంగి ఎల్లమ్మ' అని పిలిచారట. 'తూర్పాటి' ఇంటి పేరున్న వాళ్ళలో రెండు శాఖలు ఏర్పడ్డాయి. 'రెడ్డిపల్లి' తూర్పాటి వాళ్ళు బాపనింటి ఎల్లమ్మను ఆరాధించగా, ఇసంపల్లి తూర్పాటివాళ్ళు ఇంటి దేవత అయిన 'ఇసంపల్లి ఎల్లమ్మ'ను ఆరాధిస్తారు.

## II. కుల దేవతలు

కులదేవతా పద్ధతిని ఆంగ్లంలో టోటమిజం అంటారు. పితృదేవతల ఆత్మలు పశుపక్ష్యాదుల రూపంలో సంచరిస్తాయని విశ్వసించి, మానవుడు జంతు పూజా పద్ధతిని అవలంబించాడు. ప్రాచీన మానవులు గణాలు గణాలుగా జీవిస్తున్న దశలోనే ఒక్కో గణానికి ఒక్కో జంతువు (టోటమ్) దేవతగా ఏర్పడింది. గణాలకు, ఆ పిదప తెగలకు ఈ పద్ధతి వ్యాపించి నేటిదాకా కొనసాగింది. కొన్ని గోత్రాల వ్యుత్పత్తిని విచారించినట్లయితే అవి ఒకప్పటి టోటమ్‌లని గుర్తించవచ్చు. కులాచారాల్లోను అనేక టోటమికాంశాలు నిక్షిప్తమై ఉన్నాయి.[1] కులానికంతా ప్రత్యేకమైన ఒక టోటమ్ ఉండవచ్చు. లేదా ఒక తెగకు ఒక టోటమ్ ఉండవచ్చు. ప్రాచీన మానవుని 'గణం' అవశేషమే నేటి 'ఇంటిపేరు' లేక 'కుటుంబనామం' అని చెప్పవచ్చు. ఆనాడు పరిమిత సంఖ్య కలిగిన గణానికి, తెగకు ఈనాడు పరిధి విస్తృతమయింది. కాబట్టి కులానికి, తెగకే కాకుండా ఒకే ఇంటిపేరు కలిగిన కుటుంబాల వారికంతా ఒకే టోటమ్ ఆరాధనీయమైంది. అత్యధిక సంఖ్య కలిగిన ఇంటిపేర్లు కలిగిన వాళ్ళల్లో టోటమ్ ఒకటే అయినా, ఆరాధనలో విలక్షణత్వం ఏర్పడింది.

టోటమ్ జంతు రూపంలోనే కాకుండ వస్తురూపంలోనో, చెట్టు, పుట్ట, పిట్టరూపంలోనో ఆరాధింపబడుతున్నది కొన్ని తెగల్లో ప్రత్యేక మైన సందర్భాల్లో జంతురూపంలోని దేవత (టోటమ్)ను ఆరాధించి, వధించి తినటం కనిపిస్తున్నది.[2] కాని, చాలా తెగల్లో దాన్ని చంపటం, తినటం నిషిద్ధం.

అనేక తెగల్లో, కులాల్లో జంతు పూజాపద్ధతి లక్షణాలు కనిపిస్తాయి. ఖోండ్ తెగలో చేప, పీత, గూబ, లేడి మొదలైన జంతువులు కులదేవతలుగా ఉన్నాయి. రాజ్‌గోండ్ తెగలలో తాబేలు, ముళ్ళపంది, పెద్దపులి, పాము కుల దేవతలు.[3] గదబ తెగవారు నాగుపామును ఆరాధిస్తారు[4] ఖాశీ తెగవారు కోడిని

---

1. తెలుగు జానపద గేయగాధలు - పుట. 154.
2. తెలుగు జానపద గేయగాధలు - పుట. 231.
3. ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర 1 - పుటలు 52. 54.
4. విజ్ఞాన సర్వస్వం - సంపుటి 10 - పుట. 339.

దేవతగా పరిగణిస్తారు.[1] కుక్కుట గోత్రీకులైన రెడ్లు, గౌండ్లవారు, బొందిలీలు కోడిని టోటమ్‌గా పూజిస్తారు.[2]

బుడిగె జంగాలలో 'సిరివాటి' ఇంటిపేరున్న వాళ్ళ కులదేవత తాబేలు. 'రేవెల్లె' ఇంటిపేరున్నవాళ్ళు వరాహాన్ని పూజిస్తారు.

కొండ్యాల గోత్రీకులైన ముక్కాగ్రవంశపు రెడ్లకు కొర్రలు, సొర కాయల గోత్రం రెడ్లకు సొరకాయ, మందపాటి ఇంటిపేరున్న కాకతి సంబంధ క్షత్రియులకు గుమ్మడికాయ అఖాద్యవస్తువులు.[4] ఈ విధంగానే బుడిగె జంగాలలో సిరివాటి ఇంటి పేరున్నవాళ్ళకు తాబేలు, రేవెల్ల ఇంటిపేరున్న వాళ్ళకు వరాహం, పొన్నకంటి ఇంటిపేరున్న వాళ్ళకు పొన్నకంటి కూర, సిరిగిరి ఇంటి పేరున్న వాళ్ళకు చిర్రికూర అఖాద్యవస్తువులుగా ఉన్నాయి.

తాబేలు కుల దేవతగా ఉన్న సిరివాటి ఇంటిపేరు వాళ్ళు జమ్ములమ్మ పేరుతో ఆ దేవతను ఆరాధిస్తారు. తాబేలు రూపంలో ఉన్న వెండి పతకాన్నే జమ్ములమ్మ దేవత పేరుతో కొలుస్తారు. జమ్ములమ్మ, ఎల్లమ్మ, ఈదెమ్మ మొదలైన దేవతలను ఏకుటుంబానికాకుటుంబం, ఎవరి వీలువెంబడి వాళ్ళు ఆరాధిస్తుంటారు. అయినా బుడిగె జంగాలలో ఇంటి (కుల) దేవతను ఆరాధించే విధానం అందరికీ ఒక్కటిగానే ఉన్నది.

గుడిసె గడప దగ్గర లోన మరుగుగా ఉండటానికి నిండా దుప్పటిగాని, బట్టగాని కప్పి, లోపల వెండి పతకాలను పూజించి, ఎడపెడతారు. ఉపవాసంతో పూజచేసి తర్వాత ఉపవాసం విడుస్తారు. ఉపవాసాన్నే 'ఒక్కపొద్దు ఉండటం' అంటారు. ఇత్తడి పాత్రలో వండిన బోనం, కొబ్బరికాయ సమర్పిస్తారు. బాప నింటి ఎల్లమ్మకు బలి ఉండదు. ఇతర దేవతలకు కోళ్ళు, గొర్రెలు బలి ఇస్తారు. దేవతదగ్గర వెలిగే దీపాన్ని ఇతర కుటుంబాలవాళ్ళు చూడకూడదని వీళ్ళలో అంత

1. విజ్ఞాన సర్వస్వం - సంపుటి - పుట. 335.
2. తెలుగు జానపద గేయగాథలు - పుటలు - 149, 150.
3. తెలుగు జానపద గేయగాథలు - పుటలు - 147, 149.

రాయికంటి ఎల్లమ్మను మ్రొక్కే కొందరు పుట్టదగ్గరకు బోనం తీసుకెళ్ళి, పుట్టనే ఎల్లమ్మగా భావించి, ఎడపెట్టి బలి ఇస్తారు.

వస్త్రం, తూర్పాటి ఇంటిపేర్ల వాళ్ళు కొందరు గుడిసెలో దిగంబరంగా ఉండి ఎల్లమ్మను పూజిస్తారు. అందువల్ల ఈ ఎల్లమ్మను 'బరిబిత్తల' లేక 'బనిబత్తల' ఎల్లమ్మ అని పిలుస్తారు. నగ్నత్వంతో ఉండే ఎల్లమ్మ విగ్రహం ఒకటి అలంపూరు బ్రహ్మేశ్వరాలయంలో ఉన్నదని ఆర్. వి. యస్. సుందరం గారు వ్రాశారు.[1] బహుశః జానపదుల్లో కొందరు నగ్నరూపిణి అయిన ఎల్లమ్మను ఇలా దిసమొలతో పూజించే పద్ధతిని ఆచరించేవారేమోనని ఊహించటానికి వీలున్నది.

పెద్ద గోసాయి తాత :

బుడిగె జంగంగా పుట్టి బుడిగె జంగాలకే దైవమైనవాడు పెద్ద గోసాయి. పూర్వకాలంలో ఒక బుడిగె జంగం గోసాయి వేషంలో జీవించేవాడు. ఆయన ఇంటిపేరు 'ఇప్ప'. ఆయన భార్య పేరు చిత్తారమ్మ. ఆ దంపతులు వృద్ధులై కులస్థులందరి చేత ఎంతో గౌరవింపబడేవారు. అందరు అతణ్ణి పెద్ద గోసాయి తాత అనేవాళ్ళు. జీవనోపాధికి ఎక్కడికి వెళ్తున్నప్పుడైనా గోసాయి తాతను పలకరించి వెళ్ళినట్లయితే బాగా భిక్షం దొరికేది. గ్రామీణులవద్ద ధాన్యం, పట్టు చీరెలు, మేకలు, గొర్రెలు, ఆవులు, వెండి బంగారాలు పొందేవాళ్ళు. తాత ఆశీర్వాదం పొంది సంవత్సరమంతా ఏ బాధలు లేకుండ సుఖంగా గడిపేవాళ్ళు. ఆ దంపతులు గతించిన తర్వాత వారిని దేవతలుగా పూజించటం సంప్రదాయంగా పరిణమించింది.

ఏదైనా ఆపద సంభవిస్తే "పెద్ద గోసాయి తాతా! ఈ ఆపదనుంచి కాపాడినట్లయితే నీకు యాట, పొంగులొట్టి కల్లుతో మొక్కుకొని, కులస్థులను నా యింటిముందు చేయి కడిగిపిస్తా" అని ప్రార్థించి ముడుపు కడతారు. భాగవతం మేళం ఒక జట్టుగా ఏర్పడి, చుట్టుపట్ల గ్రామాల్లో ఆడటానికి ఉపక్రమించే ముందు గోసాయికి 'తమకు ఆటలు బాగా సాగి పల్లీయుల ఆదరణ పుష్కలంగా

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుట 279.

లభించాలని మొక్కుకుంటారు. భాగోతాలు ఆడటం అయిపోయి, జట్టు విడిపోయేటప్పుడు మొక్కిన ప్రకారం ఆరాధిస్తారు. బ్రతుకుదెరువుకోసం దూర ప్రాంతాలకు వలస (శెంద్ర) వెళ్ళేటప్పుడు కూడ ఇలాగే మొక్కుతారు. పెద్ద గోసాయిని మొక్కి ఊళ్ళోకి భిక్షానికి వెళ్తే, జోలె నిండుతుందని నమ్ముతారు. అందువల్ల 'జోలె'ను పెద్ద గోసాయికి ప్రతిరూపంగా గౌరవిస్తారు. పూజలో జోలెనే గోసాయికి ప్రతిమగా ఉంచుతారు.

భార్యాభర్తలు ఉపవాసం ఉండి గోసాయిని పూజిస్తారు. గూడెంలో ఉన్న వృద్ధ స్త్రీనితెచ్చి చిత్తారమ్మగా కూర్చోబెడతారు. ఆమెకు పసుపు పూసి కుంకుమ బొట్టు పెడతారు. ఇంటి జోలెను పెద్ద గోసాయిగా నిల్పుతారు మోదుగ లేక మర్రి ఆకులతో కుట్టిన విస్తళ్ళలో అన్నం, బలి జంతువు గుండె, కాలేయం, కను గ్రుడ్లు మొదలైన అవయవాలను ఎడ పెడతారు. గుగ్గిలం, మైసాక్షి పొగవేస్తారు. అగరువత్తులు కాలుస్తారు. పొంగులొట్టికల్లుతో, సారతో సాకలు పెట్టి మొక్కుతారు. పెద్ద గోసాయికి చుట్ట వెలిగించి పెడతారు. తర్వాత ఐదు వేరువేరు ఇంటి పేర్లుగలవాళ్ళు ఆ చుట్టను ఒక్కొక్కదమ్ము లాగుతారు. 'ఇప్ప' ఇంటి పేరుగలవాళ్ళుంటే వారికి మొదటిసారి చుట్టలాగే అవకాశం ఇస్తారు. పెద్ద గోసాయి తాత 'ఇప్ప' వంశస్థుడు కాబట్టి ఇలా గౌరవిస్తారు. ఆ గూడెంలో 'ఇప్ప' ఇంటి పేరున్నవాళ్ళు లేకుంటే ఎవరైనా మొదటగా లాగుతారు. ఒక్కొక్కప్పుడు గూడెంలో రెండు మూడిళ్ళే ఉన్నప్పుడు, ఐదు ఇంటిపేర్లవాళ్ళు లేనప్పుడు, ఒక కులస్థుడే ఐదుసార్లు చుట్ట లాగుతాడు. ఇలా లాగినచుట్ట గోసాయి తాతకు ముట్టినట్లేనని భావిస్తారు. పెట్టిన ఎడనుంచి చిత్తారమ్మగా కూర్చున్న స్త్రీ తింటుంది. ఆమెకు తృప్తికలిగే విధంగా కల్లు, సారా, మాంసం పెడతారు. "చిత్తారమ్మ తల్లీ! మా పూజలు ఒప్పినవా తల్లీ? గోసాయి తాతకు తృప్తేకదా?" అని అడుగుతారు. "ఒప్పినాను. నాకు సంతోషమైంది" అని ఆమె అనటంతో పూజ ముగిసినట్లుగా భావిస్తారు. పూజ ముగిసిన తర్వాత ఆ ఎడను కుటుంబం వాళ్ళు తింటారు. వెంటనే కులస్థులకు తలా ఒక ముంత కల్లు ఇచ్చి, భోజనాలు చేయిస్తారు. సంవత్సరానికోసారి పెద్దగోసాయికి మొక్కితే భిక్షం సమృద్ధిగా దొరికి, పిల్లాపాపలతో సంతోషంగా ఉంటామని విశ్వసిస్తారు.

## III. సిగాలు :

సిగం బహువచన రూపమే సిగాలు. 'సిగం' అంటే దేవత ఆవేశించటం. పూనకం వచ్చుట, సిగమెత్తుట, సిగం నిండుట, సిగం ఊగుట, పెయినిండుట

అనేవి సమానార్థకాలుగా వ్యవహరించబడుతున్నాయి. సివమెత్తే స్త్రీలను సివసత్తు లంటారు.[1] సివమెత్తినప్పుడు సివసత్తులు వెంట్రుకలు విరబోసుకొని, చేతిలో వేపరిల్లలు పట్టుకొని, ముందుకూ వెనుకకూ ఊగుతూ తామే దేవతగా మాట్లాడుతారు. దయ్యంపట్టిన వ్యక్తిని వేపరెమ్మలతో, వెదురు బెత్తంతో కొడుతూ సివసత్తి, దయ్యాన్ని గూడెం పొలిమేరలు దాటగొడుతుంది. కొన్ని సందర్భాల్లో హఠాత్తుగా సిగం నిండుతూ దయ్యం పట్టిన వ్యక్తిని గుర్తించి దయ్యాన్ని పార ద్రోలుతుంది. మరికొన్ని సందర్భాల్లో బాధితవ్యక్తిని ఆమె దగ్గరికి తీసుకెళితే, లేదా ఆమెను ఇంటికి తీసుకొస్తే సిగం నిండి చెబుతుంది. సిగం నిండటానికి కూర్చున్న ఆమెముందు నిప్పులమీద గుగ్గిలం, మైసాక్షి వేసి పొగబెట్టగానే ఆమె మీదికి దేవత ఆవేశిస్తుంది. వేపరిల్లలు చేతికిచ్చి భక్తులు సందేహాలను అడుగుతుంటారు.

బుడిగె జంగాలలో ప్రతి గూడెంలో ఒకరిద్దరు సివసత్తులుంటారు. దేవతలు కోపం చేసినప్పుడు, దయ్యాలు పట్టినప్పుడు వాటిని శాంతింపచేయటానికి, పారద్రోలటానికి ఈ శివసత్తులు పూనుకుంటారు. స్త్రీలు ఎల్లమ్మ, మైసమ్మ, ఈదెమ్మ, ఆంజనేయస్వామి, నరసింహ్మస్వామి సిగాలు నిండుతారు. మగవాళ్ళు ఆంజనేయస్వామి, నరసింహస్వామి సిగాలు మాత్రం నిండుతారు.

## IV. ఇతర దేవుళ్ళు :

**ఆంజనేయస్వామి :** మాతృదేవతలు, కులదేవతలు కాకుండ బుడిగె జంగాలు పూజించే ఇతర దేవుళ్ళలో ఆంజనేయస్వామి ముఖ్యమైన దేవుడు. 'అనుమాండ్లు' అను పేరుతో ఆంజనేయస్వామిని బాలామంది పూజిస్తారు. వెండి పతకాలు చేయించుకొని పిల్లలు, పెద్దలు మెడలో ధరిస్తారు. అవి ధరించటం వల్ల భూతప్రేతాలు పీడించవనే విశ్వాసం వీళ్ళలో ప్రబలంగా ఉంది. ఆంజనేయస్వామిని ఆరాధించేవాళ్ళు, ఆంజనేయస్వామి పూనకం వచ్చేవాళ్ళు 'ఉడత'ను చంపరు. తినరు.

## V. శిష్ట దేవతలు :

జానపద దేవతలతోపాటు బుడిగె జంగాలు శిష్ట దేవతలైన స్థానిక దేవతలను కూడ పూజిస్తారు. ఆయా సందర్భాల్లో దేవస్థానాలకు వెళ్ళి మొక్కులు

1. 'శివశక్తి' అనే సమాసమే 'సివసత్తి' అయింది.

తీర్చుకుంటారు. తమ పిల్లలకు వారి పేర్లే పెట్టుకుంటారు. వాళ్ళ పేర్లు గమనించినట్లయితే వాళ్ళలో ఉన్న శిష్ట దేవతారాధన విదితమవుతుంది. చిత్తూరు జిల్లా ప్రాంతంలో తిరుమల వేంకటేశ్వరుడి ప్రభావంతో వెంకటయ్య, వెంకటమ్మ అనే పేర్లు వ్యవహారంలో ఉన్నట్లే మహబూబ్‌నగర్ జిల్లాలో మన్యంకొండ వేంకటేశ్వరుని ప్రభావంతో ఈ పేర్లే ప్రచారంలో ఉన్నాయి. విశాఖ, కర్నూలు, నల్గొండ జిల్లాల్లో సింహాచలం, అహోబిలం, యాదగిరి ప్రభావంతో సింహాచలం, నరసింహ, నర్సమ్మ, యాదయ్య, యాదమ్మ పేర్లు వినిపిస్తాయి. కరీంనగర్ జిల్లా రాజరాజేశ్వరుని ప్రాంతం కాబట్టి రాజయ్య, రాజమ్మ, రాజలింగం పేర్లు పెట్టుకుంటారు. గోదావరి జిల్లాల్లో చాలామంది బుడిగె జంగాలకు మరిడయ్య, మరిడమ్మ అనే పేర్లు ఉంటాయి. వరంగల్, ఖమ్మం ప్రాంతాల్లో సమ్మక్క, సారక్క పేర్లే ఎక్కువ. ఆ ప్రాంతంలో భద్రాచలం ఉండటం వల్ల భద్రయ్య, భద్రమ్మ, రామయ్య, రాములమ్మ అనే పేర్లు పెట్టుకోవటం పరిపాటి.

### VI. మహమ్మదీయ దేవుళ్ళు :

హిందూ దేవతలనే కాకుండ తెలుగువాళ్ళు ముస్లిం దర్గాలకు, పీర్లకు కూడ మొక్కుతారు. తమకు సంతానం కలిగితే ఆ పేర్లే పెట్టుకుంటారు. బుడిగె జంగాలలో కూడ ఈ పద్ధతి కనిపిస్తున్నది. ఈ ప్రభావంతో వచ్చిన కొన్ని బుడిగె జంగాల పేర్లను ఇంటిపేర్లతో సహా ఇక్కడ పేర్కొంటున్నాను.

| | |
|---|---|
| హైదరాబాదు జిల్లా | - బాబాషర్ఫొద్దీన్ దర్గ - పస్తం బాబయ్య, కడమంచి బాబయ్య |
| ఇతరాలు | - మోటం ఉసేను, కడమంచి మదారు, పస్తం పకీరు, బాజె కతాలు. |
| రంగారెడ్డి జిల్లా | - జహంగీర్ పీర్ దర్గ - తూర్పాటి జంగయ్య. |
| నల్గొండ జిల్లా | - కడమంచి లతీఫ్ (నేరడగ్రామం), మోటం మొగులాలి (పల్లివాడ). |
| మహబూబ్‌నగర్ జిల్లా | - యడవల్లి చిన్న లతీఫ్ (నాగర్ కర్నూల్ తాలూకా), బీమమ్మ (బీబీ ఫాతిమా, కోయిలకొండ), కల్లెం ఇస్మాలు (కల్వకుర్తి), మోటం మైబూ (జడ్చర్ల). |
| వరంగల్ జిల్లా | - భూతం దస్తగిరి (దాట్ల). |
| ఖమ్మం | - సిరిగిరి నల్ల మస్తాన్ (గంధశ్రీగ్రామం). |

పైన తురుష్క దేవుళ్ళ ప్రభావంతో వచ్చిన పేర్లలో మచ్చుకు కొన్ని పేర్కొనటం జరిగింది. అన్ని జిల్లాల్లోనూ, ముఖ్యంగా తెలంగాణా జిల్లాల్లో ఇలాంటి పేర్లు విరివిగా కనిపిస్తాయి.

## B. ప్రేతారాధన

మరణించిన వాళ్ళ ఆత్మలు తిరిగివచ్చి, పూర్వ నివాసాల్లో చేరి దయ్యాలుగా మారుతాయని, వాళ్ళు నివసించిన గుడిసెలు కాల్చివేయటం వల్ల లేదా ఆ ఊరునుంచి మరో ఊరికి వెళ్ళటం వల్ల ప్రేతాత్మల నుంచి తప్పించుకో వచ్చునని నమ్ముతారు. దయ్యం పట్టినట్లయితే వాటిని బలుల ద్వారా తృప్తి పరిస్తే హాని చేయవని తలుస్తారు. భూత వైద్యులచేత దయ్యాలను చంపించి, పీడ వదిలించుకుంటారు.

శిష్ట కవులు తమ స్వప్నంలో దేవుడు ప్రత్యక్షమై తమకు అంకితంగా కృతులు రచించుమని కోరినట్లు తమ కావ్యాల్లో పేర్కొన్నారు. ఆ స్వప్న వృత్తాంతాన్ని విశ్వసించి కొందరు కవులు భగవదాదేశాలను నెరవేర్చారు. అలాగే జానపదుల స్వప్న వృత్తాంతాలు కూడ వాళ్ళకు శిరోధార్యాలు. స్వప్నాల్లో దర్శనమిచ్చి దేవతలు ఆగ్రహించినా, అనుగ్రహించినా వాటిని శిరసావహించటం జానపదులకు అవశ్యం. చనిపోయిన వ్యక్తి జ్ఞాపకాలే కలలకు కారణమై ప్రేతాత్మ ఊహకు ఊపిరి పోశాయి. దేవతలు కలలో ఆదేశించినట్లుగానే దయ్యాలు కూడ కలలో కనిపించి భయపెట్టి బలులు కోరుతాయి. సంచార జాతుల్లో, తెగల్లో దేవతల మ్రొక్కుకన్నా దయ్యాలను మ్రొక్కే పద్ధతి విపుల మయిపోయింది. దేవతల పూజ దయ్యాల మ్రొక్కు అనటమేకాని వీళ్ళ ఆరాధన పద్ధతుల్ని పరిశీలిస్తే రెండింటికి మౌలిక విధాన మొక్కటే.

ఋడిగె జంగాలలో దేవతారాధనకంటే దయ్యాల మ్రొక్కే ఎక్కువ ప్రాధాన్యాన్ని పొందింది. వీళ్ళు జీవితాంతం దయ్యాల మ్రొక్కులతోనే గడుపు తారు. పిన్నవయసులో చనిపోయినవాళ్ళు, చంపబడిన వాళ్ళు, రోగిష్టి, పిసినారి, బాలెంత మొదలైన వాళ్ళు చనిపోతే, తప్పకుండ దయ్యాలవుతారని భావిస్తారు. అందువల్ల ఇలాంటి వ్యక్తులు చనిపోయిన సందర్భంలో పాడె కట్టకముందే కుల పెద్ద ఒక్కడే శవం దగ్గరకెళ్ళి, శవం కళ్ళల్లో సూదులు గుచ్చుతాడు. లేదా

జీడి, సున్నం కలిపి కళ్ళల్లో పోస్తాడు. ఈ విధంగా చేయటం వల్ల చనిపోయిన వాళ్ళు దయ్యం కారని అభిప్రాయపడతారు. ఖననం చేసిననాడు. మునిమాపున వెళ్ళి, బొంద దగ్గర మంట వేసి రావటంవల్ల కూడ చనిపోయినవాళ్ళు దయ్యమయ్యే అవకాశం ఉండదని విశ్వసిస్తారు.

గూడెంలో ఎవరికైనా స్వప్నంలో కనబడి "నాకు ఆకలిగా ఉన్నది. ఒక్క ఖుక్క పెట్టు" అని అడిగినట్లయితే, లేదా గొంతుపట్టి పిసికినట్లయితే, లేదా చెయ్యిపట్టి లాగినట్లయితే - ఆ చనిపోయిన వ్యక్తి దయ్యం అయినాదని నిశ్చయించుకుంటారు గూడెంలోని ఎవరికైనా రోగమొచ్చినా, నొప్పి కలిగినా దానికి కారణం చనిపోయిన వ్యక్తి దయ్యం కావటమేనని తీర్మానించుకుంటారు. ఒక్కోసారి చీకట్లో-చనిపోయిన వ్యక్తి కనిపించినట్లు, మాట్లాడుతూ మాట్లాడుతూ మాయమయినట్లు, 'నిన్ను తీసుకుపోతా' అని అన్నట్లు, కులస్థులు కులపెద్దకు ఫిర్యాదు చేస్తారు. కడుపులో విపరీతమైన నొప్పివస్తే, గుండెలో లాగినట్లయితే దయ్యం పట్టినట్లుగా నిర్ధారిస్తారు. కొన్ని సందర్భాల్లో దయ్యంపట్టినవాళ్ళు మతిస్థిమితం లేకుండ పిచ్చి పిచ్చిగా మాట్లాడుతుంటారు. మతిలేని స్థితిలో ఇతర బాషా పదాలు (ఉదా॥ ఉర్దూ, లంబాడీ, ఎరుకల) మాట్లాడుతుంటారు. 'నేనే ఫలానా దయ్యాన్ని' అని చెబుతూ శివమెత్తినట్లు ప్రవర్తిస్తారు. బాపని దయ్యమో, లంబాడి దయ్యమో, చాకలి దయ్యమో నేనంటూ ప్రేలాపిస్తారు. బావివైపో, వాగువైపో, ఊరివైపో పరుగెత్తుతుంటారు. ఇలాంటి సమయాల్లో గూడెంలో ఉన్న 'శివసత్తి' శివమెత్తి వేప మండలతో ఆ దయ్యాన్ని పొలిమేర దాక వెళ్ళి పారద్రోలుతుంది. మంత్రగాడు (భూతవైద్యుడు) ఉన్నట్లయితే, మంత్రించి బొట్టుపెట్టి, దయ్యాన్ని పారదోలి గూడెం వాళ్ళ భయాన్ని పోగొడతాడు.

కలల్లో రావటం, చీకట్లో కనిపించటం, రోగాలు పుట్టించటం, భీతావహాలను చేయటం, గూడెంలోని కులస్థులను అల్లకల్లోలం చేయటం చూసి, కులపెద్ద చనిపోయిన వ్యక్తి కుటుంబ పెద్దను పిలిచి "నీ దయ్యాన్ని నువ్వు శాంతింపజేసుకో. గూడెం మీదికి రానియ్యకు" అని చెబుతాడు. వెంటనే ఆ కుటుంబ పెద్ద కులస్థులను, కులపెద్దను పిలిచి 'సకినం' చూస్తాడు. దయ్యం ఎవరిదో నిర్ధారించలేనప్పుడు బాధితుడే 'సకినం' పెట్టిస్తాడు.

**I. సకినాలు :**

'శకునం' అనే పదానికి వికృత రూపమే 'సకినం.' మనిషిని బాధిస్తున్నది దయ్యమో, దేవుడో అని తెలుసుకోవటానికి, ఆ దయ్యం లేక దేవుడితో ముఖాముఖిగా మాట్లాడి అభిప్రాయం తెలుసుకోవటానికి, శాంతికోసం ఉపచారాలు నిర్ణయించటానికి 'సకినం' తోడ్పడుతుంది. బుడిగె జంగాలలో ఈ సకినం ఒక పటిష్టమైన ప్రక్రియా విధానంగా ఆచరింపబడుతున్నది. సకినాలు అనేకరకాలుగా ఉన్నాయి. (1.) చాట సకినం. (2.) కుండ సకినం. (3 ) తలె సకినం. (4.) దండ సకినం (5.) పేను సకినం అనే ఐదు పద్ధతులు ముఖ్యమైనవి.

**(1.) చాట సకినం :-**

బాధితుని[1] గుడిసె ముందర కులపెద్దతోపాటు కులస్థులందరు గుమిగూడి కూర్చుంటారు. ఇంటిముందు గజం స్థలంలో పెండతో అలుకుతారు. ఆ అలికిన స్థలంలో తడి ఆరిన తర్వాత అరకిలో జొన్నలు కుప్పగా పోసి, వాటి మీద నిండనీళ్లున్న ఒక పెద్ద ఇత్తడి చెంబును పెడతారు. ఆ చెంబుమీద ఒక చేటను బోర్లగిస్తారు. కుటుంబపెద్ద కాళ్లు చేతులు ముఖం కడుక్కొని, పసుపు కుంకుమ తెచ్చి చేటకు నాల్గైదు బొట్లు పెడతాడు. కులపెద్ద ఆ చేటమీద ఒక కులస్థుణ్ణి కూర్చోమని నియమిస్తాడు దీన్ని సకినం మీద కూర్చోవటం అంటారు. సకినం మీద కూర్చున్నవాడు రెండు పాదాలను చెంబు మూతి మీద ఉన్న చేట పైన పెట్టి, కాళ్లు ముడుచుకొని కూర్చుని, రెండు చేతుల వేళ్ళను ఇరువైపుల భూమికి ఆనించి ఉంటాడు.

అప్పుడా కుటుంబి "అమ్మా! తల్లీ! మా యింట్ల మనిషి అకస్మాత్తుగా పడిపోయింది. మరి నువ్వు దేవతవా? దయ్యానివా? చెప్పుతల్లీ! దండం జేస్త" అని అంటాడు. తర్వాత కులపెద్ద "అమ్మా! తల్లీ! బాలను/బాలుణ్ణి! బాధ పెట్టకు. నీ బుక్క ఏముందో, నువ్వు తీసుకొని పోదువుగాని, నువ్వు దేవతవైతే గిర్రున కుడికి తిరుగాలె. లేకపోతే నువ్వు దయ్యానివైతే గిర్రున ఎడమకు తిరుగాలె" అని కోరుతాడు. కులపెద్ద కోరినట్లు కుడికి తిరిగితే దేవత అనీ, ఎడమకు తిరిగితే దయ్యమని నిర్ధారించుకుంటారు. తిరుగకుండ అలాగే నిలబడి ఉన్నట్ల -

---

1. బాధితురాలు లేక బాధితుడు.

యితే శరీరంలో పుట్టిన రోగమని నమ్ముతారు. కాని ఎటువైపో ఓవైపు తిర గటం సర్వసాధారణం.

తిరగటంతో దేవత అని తేలితే "అమ్మా! తల్లీ! నువ్వు ఎల్లమ్మవా! మైసమ్మవా? ఎల్లమ్మ దేవతవైతే కుడికి తిరుగు, మైసమ్మవైతే ఎడమకు తిరుగు" అని కులపెద్ద కోరుతాడు. ఎటు తిరగకుండ నిలుచుంటే, మరో రెండు దేవతల పేర్లు చెప్పి, కుడి ఎడమలు నిర్దేశిస్తాడు. దేవత పేరు తెలియగానే ఇంటివాడు "అమ్మా! నీకు మొక్కుతానని ముడుపు కట్టినుంటి. చేతిలో పైసలేక మొక్క లేదు. నాది తప్పయింది. చెంపలేసుకుంట. అందుకే కోపం జేసినవా తల్లీ! ఇప్పుడు అప్పో సప్పో జేసి మొక్కుతా. నా మనిషికి వెంటనే బాగ్గావాలె'' అని ప్రార్థిస్తాడు. దేవత ఏమి కోరుతుందో సకినం ద్వారా తెలుసుకుంటారు. "అమ్మా! బాలుడు (కుటుంబి) తన మనిషికి బాగైతే, ఒక కోడి, జోడ కొబ్బరి కాయలు, పొంగులొట్టి కల్లుతోని మొక్కుతాడు. ఒప్పకోతల్లీ! ఒప్పకొని రేపు ఈపాటికి మనిషి లేచి కూర్చోవాలె. నీ మాయ చూపించు తల్లీ! ఈ వస్తువులు ఒప్పకుంటే కుడికి తిరుగు. ఒప్పకోకుంటే ఎడమకు తిరుగు'' అంటాడు. దేవత ఒప్పకుంటే ఒప్పందం ప్రకారం దేవతకు మొక్కు దీర్చుకుంటారు. దేవత ఒప్పకుంటే "ఇవి సరిపోవా తల్లీ! మరి నీకు ఇంకేం కావాలె? గొర్రెపోతు ఆరం (హారం అంటే బలి) పెడుదుమా?'' అని అడిగి, ఆ ప్రకారం ఆ దేవతను తృప్తి పరుస్తారు.

దేవత కాకుండ దయ్యం అయినట్లయితే, ప్రతిసారి రెండు పేర్లు చెబుతూ తిరగమంటాడు. సాధారణంగా ఆమధ్య చనిపోయిన మనిషి పేరే తేలుతుంది. అను మానం ఉన్న చనిపోయినవాళ్ళ పేర్లన్నీ దయ్యాలుగా పేర్కొంటారు. ఎన్ని ఎక్కువ దయ్యాలు ఆ మనిషిని పడితే, అన్ని జంతువులను బలి ఇవ్వవలసి ఉంటుంది. దయ్యం కోరికనుబట్టి కొబ్బరికాయలు కోళ్ళు, ఒకటి రెండు పందులు, ఒకటి రెండు గొర్రెలు మొక్కుకుంటారు.

### (2) నకుండ కినం :

అలికి, కుప్పగా పోసిన గింజలమీద నిండు కుండ పెడతారు. దానికి వసుపు, కుంకుమబొట్లు పెట్టి మొక్కుతారు. ఇద్దరు కులస్థులు ఆ కుండను చెరొకవైపు తమ హస్తాలతో అదిమిపట్టి వంగినిలబడతారు. చేట సకినంలో లాగ

కులపెద్ద ఎడమకు, కుడికి కుండ కదలాలని అడుగుతుంటాడు. ఆ కదలికల ఆధారంగా దేవతనా, లేక దయ్యమా అనే విషయం నిర్ణయిస్తాడు. అదే విధంగా బలి జంతువులను కూడ నిర్ణయించటం జరుగుతుంది.

### (3) తలె సకినం :

'తళియ' అనే పదమే 'తలె' అయింది. వెడల్పు మూతిగల పాత్రను 'తలె' అంటారు. కంచు తలెగాని, ఏదైనా కంచంగాని తీసుకొని, దానికి బొట్లు పెట్టి మొక్కిన తర్వాత, ఒక కులస్థుడు గొంతుకూర్చుని, రెండు హస్తాలతో దాన్ని పట్టుకుంటాడు. తలెలో నిండుగా నీళ్ళు పోస్తారు. కులపెద్ద అడుగుతుంటాడు. పాత్రలో నీళ్ళు తొణకటాన్ని, నిశ్చలంగా ఉండటాన్ని ఔను, కాదనే జవాబులుగా స్వీకరిస్తారు. ఈ విధంగా దేవతో, దయ్యమో అనే విషయాన్ని, బలి జంతువులను నిర్ణయిస్తారు.

### (4) దండ సకినం :

పూసల దండ, పగడాల దండ, వెండి గొలుసులలో ఏదో ఒకటి గ్రహించి, సకినం చూస్తారు. దండ కదలకుండ ఉండటాన్ని, ముందు వెనకలకు, ప్రక్కలకు ఊగటాన్ని, ఔను, కాదనే జవాబులుగా పరిగణిస్తారు. మిగిలిన తతంగం మామూలే.

### (5) పేను సకినం :

ఒక కులస్థుని హస్తంలో కాస్తంత బూడిదను పోస్తారు బాధితుని నెత్తిలో ఒక పేను తీసి, ఆ బూడిదలో వేసి కలిపేస్తారు ఆ బూడిదలో నుంచి పేను బయటికి వెళ్ళే దిక్కులను బట్టినిర్ణయాలు తీసుకుంటారు. ''దేవతవైతే తూర్పు దిక్కుకు నడవాలె. దయ్యానివైతే పడమట దిక్కుకు నడవాలె'' అంటూ పేను బూడిద నుంచి బయటికి వెళ్ళేదాకా చూస్తారు. పేను నడకను జవాబుగా తీసుకుంటారు తర్వాత మరో ప్రశ్నవేసుకొని, ఆ పేనును తిరిగి బూడిదలో కలిపి, బయటికి వచ్చేదాకా చూస్తారు. ఈ విధంగా పేను సకినం ద్వారా నిర్ణయాలు తీసుకొని దయ్యాలమ్రొక్కు అమలు చేస్తారు.

సకినాల ద్వారా దయ్యమై పట్టటానికి కారణాలను కూడ తెలుసుకుంటారు. వియ్యంపులు తన కూతురును రాచి రంపాన పెడుతున్నందుకు, తన పాలివాడు తనకు అన్యాయం చేసినందుకు, తన శత్రువైనందువల్ల అతని మీద పగ తీర్చు

కునేందుకు దయ్యమై పట్టానని, చంపుకు పోతానని దయ్యం అభిప్రాయపడు తున్నట్లు సకినాల ప్రశ్న జవాబుల్లో తేలుతుంది. తను జీవించి ఉన్న కాలంలో నోరారా తినటానికి దొరకనందున, పిల్లల మీద మనసులాగుతున్నందున కూడ దయ్యమైనానని సకినంలోని సంభాషణలో సారాంశంగా ఉంటుంది.

II. పారబోసుకోవటం :

సకినాల ద్వారా దయ్యాలకు ఒప్పుకున్న ప్రకారం బలి పెట్టటాన్నే 'పారబోసుకోవటం' అంటారు. సకినం పట్టిన తర్వాత వారం లోపున దయ్యాలకు మ్రొక్కు చెల్లించుకుంటారు. ఆ రోజు గూడెంలోని జనమంతా కుల పెద్ద నిర్ణ యించిన స్థలానికి వస్తారు. బలి జంతువులు (కోళ్ళు, మేకలు, గొర్రెలు, పందులు మొక్కుకున్న సంఖ్యలో), బియ్యం, మూడు నాల్గు కొత్త కుండలు, కావలసిన తదితర వస్తువులు తీసుకొని ఆ స్థలానికి వస్తారు. పారబోసుకునే స్థలాన్ని వాగు పక్కనో, చెరువుపక్కనో, గుట్టకిందనో, పెద్ద రావిచెట్టు కిందనో నిర్ణయించు కుంటారు.

సీతాఫలం చెట్టు కొమ్మలో, తంగేడు కొమ్మలో, వాయిలి కొమ్మలో ఏదో ఒక చెట్టు కొమ్మలు తెచ్చి, దయ్యానికి చిన్నగుడి కడతారు. గుళ్ళో కొత్త దీపం తలో దీపం పెడతారు. నేల మీద పసుపు కుంకుమలతో బొట్లు పెడతారు. నిప్పుల మీద గుగ్గిలం, మైసాక్షి వేస్తారు. అగరువత్తులు ముట్టిస్తారు. జంతువులను బలి ఇస్తారు. కొబ్బరికాయలు కొడతారు. నిమ్మకాయలు కోస్తారు. మోదుగ, మర్రి ఆకులతో కుట్టిన విస్తళ్లు పరిచి, అన్నం రాశిగా పోసి, ఎడ పెడతారు. బలి ఇచ్చిన జంతువులను వండి, మాంసాన్ని, వాటి గుండె, కాలేయం, మెదడు, కనుగ్రుడ్లు ముఖ్యావయవాలను ఎడమీద ఉంచుతారు. ఈ అవయవాలు దేవత లకూ, దయ్యాలకూ ప్రీతిపాత్రమైనవని భావిస్తారు.[1] పొంగులొట్టి కల్లు, సారాలతో సాక పెడతారు. మగ దయ్యమైతే బీడీలు, చుట్టలు కాల్చి మట్టిలో దూర్చి నిలబెడతారు. ఆడదయ్యామైతే ఆకు పోకలు పెడతారు.

---

1 ''గుండె, మెదడు, కాలేయము మొదలగు వానిలో నాత్మయుండునను భావనయే బలిపశువు చంపబడినపు డా యా యంగములే ప్రత్యేకముగా దేవతల కాహారభూతములగుటకు కారణము.'' తెలుగు జానపద గేయ గాథలు - పుట 231.

ఎడ సిద్ధం చేశాక దయ్యం పట్టిన వ్యక్తితో మొక్కిస్తారు. "నువ్వు కోరిన విధంగా మొక్కుతున్నాం. తృప్తిగా తిని, వెళ్ళిపో, నన్ను బాగు చెయ్యి" అని వేడుకున్న తర్వాత, కుటుంబం వాళ్ళంతా వచ్చి ఒక్కొక్కరే సాకలు పెట్టి మొక్కుతారు. ఆ తర్వాత దయ్యం పట్టిన వారికి ఆ ఎడలో నుంచి తిని పిస్తారు. కుటుంబ సభ్యులంతా తింటారు. పిదప కులస్థులంతా తాము కుట్టి ఉంచుకున్న విస్తరాకుల్లో తింటారు. మిగిలింది ఇంటికి తీసుకుపోతే దయ్యం వెంట వస్తుందని నమ్ముతారు. కాబట్టి వండిందంతా మిగలకుండా అందరికీ పెట్టేస్తారు. అందరు తిన్న తర్వాత కొంత దూరం వెళ్ళి, కొంతసేపు కూర్చుం టారు. కులపెద్ద వెనుకకు తిరిగి, దారికడ్డంగా ముళ్ళకంపను వేస్తాడు. ఇలా వేయటంవల్ల దయ్యానికి దారి తెలియక వెంటరాదనేది వాళ్ళ విశ్వాసం. కూర్చున్న దగ్గర ఒక కొబ్బరికాయను కొట్టి, చిన్న చిన్న ముక్కలు చేసి తలా ఒకటి ఇస్తారు. ఆ కొబ్బరిముక్కను నమిలి మింగకుండ ఊసివేయాలి. ఇలా ఊస్తే దయ్యం ఇక తమకు సోకదని అభిప్రాయపడతారు. అక్కణ్ణుంచి నేరుగా కల్లుదుకాణానికి వస్తారు. నిండులొట్టి కల్లుతెచ్చి, దయ్యం పట్టిన వ్యక్తితో ఒక్క గుక్కలో తాగిపిస్తారు. పారబోసుకున్నవాడు పేదవాడైతే కులస్థులకు తలా ఒక ముంతకల్లు ఇప్పిస్తాడు. ఉన్నవాడైతే తలా రెండు ముంతల కల్లు ఇప్పిస్తాడు. కల్లు తాగిన తర్వాత గూడెం చేరుకుంటారు.

### III దయ్యాలను చంపించటం :

చనిపోయినవాళ్ళ ఆత్మలుమాత్రం చావకుండ తిరుగుతాయని, ఆ ఆత్మలే దయ్యాలవుతాయని మనిషి విశ్వసించి, దయ్యాల బాధనుంచి విముక్తి కోసం ప్రయత్నించాడు. ఆ ప్రయత్నంలో ఫలించిన అంశమే మంత్రవిద్య. "ఆత్మా రాధన ఎపుడు స్థిరపడెనో, అప్పుడే ఆత్మశక్తిని అదుపుననుంచుకొనుటకు మంత్ర కలాపము, తాంత్రిక పద్ధతి (Magic and Sorcery) జనించినది. వీనివలన ఆత్మలను ప్రభావితము చేసి, వానిని కూడ మానవులవలెనే జూచి, ప్రాచీన మానవుడు వానిని లొంగదీసుకొనగలితిననుకొనెను. అట్లు చేయుటలో నా యాత్మలను లేదా పిశాచములను భయపెట్టుట, ప్రీతులను జేయుట, వానిశక్తిని తగ్గించుట, వాని నాజ్ఞాపించుటవంటి సర్వవిధములైన పద్ధతులకు స్థానము కలిగినది."[1]

---

1. తెలుగు జానపద గేయ గాథలు - పుట - 93, 94.

ప్రేతాత్మ పీడ నిరోధానికి ఒకవైపు భగవద్రూప ఆరాధన మొదలుకాగా, మరోవైపు మనిషి మాంత్రిక తాంత్రిక శక్తుల ఉపాసన చేశాడు. ఈ శక్తులవల్ల ప్రేతాత్మలను అధీనంలోకి తెచ్చుకోవాలన్నదే అతని ప్రయత్నం దయ్యాలవల్ల ఏర్పడిన భయాన్ని పోగొట్టుకోవటమే కాకుండ మంత్ర విద్యతో ఆ దయ్యాలనే భయపెట్టసాగాడు. ఈ దృష్టితోనే మనిషి చనిపోయి దయ్యమైనాడని నమ్మితే ఆ దయ్యాన్ని వెంటనే చంపించాలని బుడిగె జంగాలు ప్రయత్నిస్తారు.

**(1) మందు త్రాగటం :**

దినకర్మ చేసిన మరునాడే ఆ ఇంటివాడు కులపెద్దను, మరో కులస్థుడ్ని వెంటబెట్టుకొని భూతవైద్యుని దగ్గరకు వెళ్ళి, చనిపోయిన మనిషి దయ్యం 'అయ్యాడా? కాలేదా?' అని తెలుసుకుంటాడు. ఒకవేళ దయ్యం అయినట్లయితే అక్కడే చంపిస్తాడు. ఈ సంగతి తెలిసి, గూడెం వాళ్ళు దయ్యం బాధ తప్పిందని నిర్భయముంగా ఉంటారు. ఇలా వెళ్ళి దయ్యాన్ని చంపించటాన్నే వీళ్ళు 'మందు త్రాగటం' అంటారు.

**(2) తంగెడి దేవర :**

సకినంలో 'ఫలానా వారిదీ దయ్యం' అని తెలిస్తే సంబంధిత వ్యక్తులు వెళ్ళి భూతవైద్యునిచేత దయ్యాన్ని చంపించుకుంటారు. పారబోసుకోవటానికి అయిన ఖర్చులన్నీ ఎవరి దయ్యమైతే వాళ్ళే భరించుకోవాలి. ఆ మనిషికి ఎన్ని దయ్యాలు సోకితే, ఆయా దయ్యాలవాళ్ళు అయిన ఖర్చులన్నీ సమానంగా భరించుకోవాలి. కులస్థులకు సంబంధించని దయ్యం పట్టినట్లయితే, అంటే ఇతర కులాల దయ్యం సోకినట్లయితే, దాన్ని 'తంగెడిదేవర' అంటారు. తంగెడి దేవర ఆవహిస్తే, దానికి వారసుడు లేడు కాబట్టి పారబోసుకున్నవాడే ఆ ఖర్చు లన్నిటిని భరించుకోవాలి.

**(3) దయ్యాల వివాదాలు :**

బుడిగె జంగాలలో దేవతారాధన కంటే ప్రేతారాధనే ఎక్కువయినందు వల్ల, వాళ్ళలో వాళ్ళకు అనేక వివాదాలు కలుగుతుంటాయి. దయ్యాలకు సంబంధించిన పంచాయతులు కూడ విరివిగా జరుగుతుంటాయి. సకినంలో ఫలానావాళ్ళ దయ్యమనే నిర్ణయాన్ని తత్సంబంధీకులు సమ్మతించకుంటే, భూతవైద్యుని

వద్దకైనా ఎరుకల గద్దె దగ్గరకైనా వెళ్ళి, ఆ దెయ్యమెవరిదో తేల్చుకుంటారు. అప్పుడు అంతవరకైన ఖర్చులు, పారబోసుకోవటానికైన ఖర్చులు మొత్తం ఎవరి దయ్యమైతే వాళ్ళ నెత్తిమీద పడతాయి. సకినం పట్టిన తర్వాత ఆ గూడెం మనిషి మరో గూడెంకు వెళ్ళినట్లయితే, దయ్యం అతనివెంట వస్తుందనే నమ్మకంతో ఆ గూడెం పెద్ద, దయ్యాన్ని వెంట బెట్టుకొని తన గూడెం వచ్చాడని అతని మీద దండగ (జరిమానా) విధిస్తాడు.

### (4) మొండి దయ్యం :

ఒకసారి భూతవైద్యుని దగ్గర చంపించినా మళ్ళీ బ్రతికివచ్చే దయ్యాలు కూడ ఉంటాయి అప్పుడు మళ్ళీ పాతపాట మొదలవుతుంది. సకినం పట్టటం పారబోసుకోవటం, మరో మంచి భూతవైద్యుని దగ్గరకెళ్ళి చంపించటం జరుగు తుంది. ఇలాంటి దయ్యాలను 'మొండి దయ్యాలు' అంటారు. మొండి దయ్యాల కుటుంబాలవాళ్ళు కులస్థుల వేధింపులకు గురవుతూ, చీటికి మాటికి డబ్బు గుమ్మ రించుకుంటూ చితికిపోయిన సంఘటనలు బుడిగె జంగాలలో ఎక్కువగానే కనిపిస్తాయి.

### IV. భూతవైద్యులు :

బుడిగె జంగాలలో దయ్యాలను చంపేవాళ్ళు కూడ అక్కడక్కడ కని పిస్తారు. భూతవైద్యులైన వీళ్ళను బుడిగె జంగాలు 'కాళ్కదార్లు' అంటారు. 'దయ్యం' అనే అర్థమిచ్చే 'కాళ్కం' పదంమీద 'దారి' ప్రత్యయం చేరి 'కాళ్క దారి' అయి బహువచనంలో 'కాళ్కదార్లు' అవుతుంది. వీళ్ళకులంలో ఒకప్పుడు 'దయ్యాల రంగప్ప' అనే భూతవైద్యుడు ఎంతో ప్రసిద్ధికెక్కాడు. ప్రస్తుతం రంగారెడ్డి జిల్లా, ఇంద్రేశం గ్రామంలో 'భారతకవి చంద్రయ్య' అనే బుడిగె జంగం దయ్యాలను చంపుతాడు. అతణ్ణి అందరు 'బాబా' అని పిలుస్తారు. ప్రతి ఆదివారం మాత్రమే ఇతడు శివమెత్తి దయ్యాలను చంపుతాడు. పటాన్‌చెరు (పొట్లచెరువు)కు సమీపంలోని భానూరులో కూడ ప్యార్ల లక్ష్మయ్య అనే బుడిగె జంగం దయ్యాలను చంపుతాడు. మెదక్ సమీపంలోని యూసుఫ్‌పేటలో వాంద్రాని అంజయ్య అనే ఆయన భూతవైద్యుడు. గజ్వేలు మండలం మాసాయి పేట గ్రామ నివాసి కప్పెర లింగయ్య కూడ భూతవైద్యుడే. ఇబ్రహింపట్నం వాస్తవ్యుడైన మోటం సాయిలు దయ్యాలను చంపుతాడు. నల్గొండ జిల్లా,

చౌటుప్పల్ పస్తం ఎల్లప్ప మంచి 'కాళ్ళదారి' అని పేరు తెచ్చుకున్నాడు. మహబూబ్‌నగర్ జిల్లా, బాలానగర్ నివాసి కొండపల్లి సాయిలు భూతవైద్యుడని ప్రసిద్ధి. అతడు ఈమధ్యనే మరణించాడు. అన్ని జిల్లాల్లోనూ అక్కడక్కడ భూతవైద్యులైన బుడిగె జంగాలు ఉన్నారు.

బుడిగె జంగాలు కులేతరులైన భూతవైద్యుల దగ్గరకు విరివిగా వెళ్తుంటారు. మహబూబ్‌నగర్ జిల్లా కౌకుంట్లలోనూ, గౌరారం, బిజినెపల్లి గ్రామాల్లోనూ మహమదీయులు భూతవైద్యులుగా ఉన్నారు. నల్గొండజిల్లా నాగారం, మెదక్ జిల్లా దౌలతాబాదు మొదలైన చోట్లలో ఉన్న భూతవైద్యుల దగ్గరకు బుడిగె జంగాలు వెళ్తుంటారు. ఆయా జిల్లాల్లో అనేకచోట్ల ఎందరో భూతవైద్యులు ఉన్నారు.

దయ్యాలను చంపేటప్పుడు భూతవైద్యులు మంత్రాలు చదువుతూ బేతాళుణ్ణి, ఆంజనేయస్వామిని రప్పిస్తారు. ప్రక్కన 'అంజనం' చూసేవాడు తాను చూస్తున్న విషయాన్ని పైకి చెబుతుంటాడు. భూతవైద్యుని ఆదేశాలను ఆంజనేయస్వామికి, ప్రశ్నలను దయ్యానికి తెలుపుతుంటాడు. వాళ్ళమాటలను భూతవైద్యునికి వివరిస్తుంటాడు. భూతవైద్యుని ఆదేశానుసారం ఆంజనేయస్వామి దయ్యాన్ని పట్టటానికి వెళ్తాడు. నివసించిన ఇల్లు, ఆ చుట్టుపట్ల, బంధువులవద్ద వెదుకుతాడు. చెట్లులో, తొర్రలో, పుట్టలో, పొదలో, బావిలో, పాడుపడిన ఇళ్ళల్లో ఎక్కడ దాక్కున్నా దయాన్ని పట్టుకొస్తాడు. ఆంజనేయస్వామి ఎక్కడెక్కడ తిరిగేది, ఏమి చేసేది అంతా అంజనం చూసేవాడు వివరిస్తుంటాడు. దయ్యం మొండికెత్తితే ఆంజనేయస్వామి బెత్తంతో దాన్ని దండించి తెస్తాడు. మారాము చేసినా, విడిచిపెట్టమని విన్నపాలు చేసినా దయ్యాన్ని వదలకుండా ఈడ్చుకొస్తాడు. దయ్యాన్ని పూర్వశరీరంతోనే గుర్తిస్తారు. అంటే ఎవరు దయ్యమయ్యారో ఆ వ్యక్తి శరీరమే దయ్యానికుంటుంది. అంజనం చూసేవాడు ఆ దయ్యం రూపాన్ని వర్ణించి చెబుతుంటాడు. దయ్యం ఆడా, మగా, నల్లని రూపా, ఎర్రనిరూపా, మనిషి పొట్టివాడా, పొడుగా, పంచె కట్టుకున్నాడా, లాగు తొడుక్కున్నాడా మొదలైన విషయాలను తెలియచేస్తాడు. ఉదాహరణకు దయ్యం ఎత్తు గురించి అక్కడ ఈ కింది విధంగా సంభాషణ సాగుతుంది.

భూతవైద్యుడు : మనిషి పొట్టివాడా? పొడుగా?

అంజనం చూసేవాడు : మనిషి కొంచం పొట్టిగానే కనిపిస్తున్నాడు.

కుటుంబంవాళ్ళు : మనిషి పొట్టిగా ఎందుకుంటాడు. పొడుగే.

భూతవైద్యుడు : మనిషి పొడుగ్గా ఉంటాడు. బాగచూడు.

అంజనం చూసేవాడు : అవునవును. మనిషి పొడుగే. ఆంజనేయస్వామికి భయపడి వొంగి వొంగి వస్తుంటే పొట్టిగా కనపడ్డాడు. ఇప్పుడు నిలబడి ఉన్నాడు. పొడుగే. -వివరాలన్నీ ఈ విధంగానే మాటిమాటికి సరిదిద్దుకుంటారు.

భూతవైద్యులు ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా దయ్యాలను చంపుతుంటారు. కొందరు పట్టుకొచ్చి దయ్యాన్ని కొత్త కుండలో వేసి, కుండమూతికి కొత్తగుడ్డ గట్టిగా కట్టి, గోధుమపిండితో దట్టించి, అగ్నిలో కాలుస్తారు.

ఇంద్రదేశంలో భారతకవి చంద్రదయ్య కోడిపుంజును బలి ఇచ్చి, దాని కంఠ సరం తీసి, అందులోనికి దయ్యాన్ని దింపి, చిన్న మట్టి గురిగిలో వేసి, మూత బిగించి, అగ్నిలో కాల్చివేస్తాడు.

గౌరారంలో అంజనంలోనే దయ్యాన్ని కాల్చేస్తారు. అంజనం చూసేవాడు ఆంజనేయస్వామి దయ్యాన్ని కాలుస్తున్నాడని చెబుతాడు. కాని, దయ్యాన్ని ప్రత్యేకంగా కాల్చే తంతు బయట ఏదీ ఉండదు.

కొందరు దయ్యాన్ని సీసాలోకి దింపి, ఊరికి దూరంగా తీసుకెళ్ళి భూస్థాపితం చేస్తారు. కేరళలోని మోప్లా జాతిలోనూ ఈ పద్ధతి ఉన్నట్లు తెలుస్తున్నది.[1]

అంజనం వేసే పద్ధతులు కూడ భిన్నంగా కనిపిస్తాయి. ఒకరు అరచేతిలో కాటుక, నూనె కలిపి రుద్దుకొని అందులో చూస్తారు. కొందరు పింగాణి సాసర్ మీద కాటుక, నూనె రుద్ది చూస్తున్నారు. మరికొందరు ఒక దీపం పెట్టి ఆ దీపంలో చూస్తారు. ఈ విధంగా అంజనం చూడటం అనేక విధాలుగా ఉంటుంది.

---

1. విజ్ఞాన సర్వస్వం - సంపుటి - 10 - పుట. 580.

# 7. కుల పంచాయతులు

కుల పంచాయతీ విధానం బుడిగె జంగాల్లో అనివార్యమైన దినచర్యలాగా విరివిరిగా పాటింపబడుతున్నా, ఇతర తెగల్లోకూడ ఈ ఆచారం అనేక పద్ధతుల్లో ఆచరణలో ఉంది. 'కుల పెద్ద' సంప్రదాయం దాదాపు అన్నితెగల్లో కనిపిస్తుంది. కులపెద్ద పంచాయతిలో తీర్పు చెప్పటమే కాకుండ జననం, వివాహం, మరణం ఇత్యాది అన్ని సందర్భాల్లో 'పెద్ద'గా ఉండి, ఆచారాలను పాటించటంలో పర్యవేక్షణ చేస్తుంటాడు.

ఆదిలాబాదు జిల్లాలో అధికంగా నివసిస్తున్న 'గోండ్' తెగలో కుల పెద్దను 'పటేల్' అంటారు. ఈయన తీర్చే కులసభ పేరు 'సైయనా.' ఈ కుల సభ తీర్మానాన్ని ధిక్కరించినవాళ్ళకు జరిమానాలు తప్పవు. తీవ్రమైన విషయాల్లో కులం నుంచి వెలివేయటం కూడ ఉంది.[1] 'సవరలు' కులపెద్దను 'గామెంగో' అని పిలుస్తారు.[2] కులంలోని తగాదాలన్నీ ఇతడు పరిష్కరిస్తాడు. దొమ్మరలు తమ కులపెద్దను 'ముత్తీగురు' అని పిలుస్తారు. తగాదాలు పరిష్కరించటమే కాకుండా దైవిక, సాంఘిక వ్యవహారాల్లోకూడ 'ముత్తీగురు'వే వాళ్ళకు పెద్ద.[3] బోయ వారిలో ఒక గూడెంకుగాని, కొన్ని గూడెంలకు కలిపిగాని ఒక కులపెద్ద ఉంటాడు. ఇతడు ఆస్తి పంపకం, విడాకుల వంటి వివాదాలు పరిష్కరిస్తాడు.[4] చెంచులు తమ కులపెద్దను పెద్దమనిషి అంటారు.[5] కులంలోని తగాదాలను ఈయన తీర్చుతుంటాడు. యానాది, ఎరుకల, కోయ మొదలైన తెగల్లో కులపెద్ద ఆచారం ఉంది. మందుల, దాసరి, వీరముష్టి, గంగిరెద్దుల, వడ్డెర, పూసల మున్నగు కులాల్లో కూడ తమ తగాదాలను కులపెద్ద ద్వారా పరిష్కరించుకొనే ఆచారం పాటింపబడుతున్నది.

---

1. విజ్ఞాన సర్వస్వం పుట-315 సంపుటి-10
2. ,, ,,-763 ,,
3. ,, ,,-438 ,,
4. ,, ,,-567 ,,
5. ,, ,,-378 ,,

## (1) బుడిగె జంగాల కులపంచాయతులు

బుడిగె జంగాల్లో కులపెద్దను 'పెద్దమనిషి' అంటారు. పెద్దమనిషి ఇతర ఆచారాల్లోకూడ 'పెద్ద'గా ఉన్నప్పటికి పంచాయతీలు చెప్పటమే ఎక్కువ కాబట్టి ఈయనను 'న్యాయగాడు' అని పిలుస్తారు. మహారాష్ట్రలో నివసిస్తున్న బుడిగె జంగాల కుల పెద్దను 'బుద్ధిమంతుడు' అంటారు.

'పంచాయతి' అనే పదానికి 'న్యాయము తీర్చెడి ఐదుగురు మధ్యవర్తుల సంఘము' అని నైఘంటికార్థం. 'కుల పంచాయతి' అంటే కులపెద్ద సమక్షంలో కులస్థులముందు వాది ప్రతివాదులు తమ వివాదాన్ని వినిపించగా, సాక్ష్యాలను విచారించి, కులపెద్ద తీర్పుచెప్పటం. బుడిగె జంగాలు కులపంచాయతికి సమానార్థకాలుగా 'న్యాయం', 'తగువు' అనే పదాల్ని కూడవాడతారు.

నాగరక సమాజంలో వ్యక్తుల మధ్య ఎలాంటి తగాదాలు వచ్చినా వాటి పరిష్కారానికి న్యాయస్థానాలు ఉన్నాయి. కాని సమాజానికి దూరంగా గిరిగీసుకుని జీవించే బుడిగె జంగాలు తమలో తాము కలహించుకొన్నా, ఎలాంటి తగాదాలు వచ్చినా కులపంచాయతీలోనే తీర్మానం చేసుకుంటారు. కులపెద్దే వాళ్ళకు న్యాయమూర్తి. కులపంచాయతీ తీర్పుకు ఎదురులేదు. ప్రతి చిన్న విషయానికి పంచాయతి పెట్టటం, చీటికి మాటికి కులస్థులను కూర్చోబెట్టి తగాదాలు పరిష్కరించుకోవటం వీళ్ళకు పరిపాటి. అందువల్ల దాదాపు గూడెంలో ప్రతిరోజు ఏదో ఒక పంచాయతి జరుగుతూనే ఉంటుంది. వీళ్ళ పంచాయతీలు గమనిస్తే ప్రతివాడు ఎల్లప్పుడు ఏదో ఒక తగాదాలో చిక్కుకొని ఉంటాడని చెప్పవచ్చు. వీళ్ళ జీవన విధానంలో పంచాయతీలు అతి ప్రధానమైనవి.

ఈ కులపంచాయతీ పద్ధతి కొన్ని కులాల్లోనూ, అన్ని తెగల్లోనూ ఉన్నప్పటికీ, బుడిగెజంగం కులంలో ఉన్నంత పట్టింపు, పటిష్ఠమైన పద్ధతి ఇతర కులాల్లో కనిపించదు. బుడిగె జంగాల కుల పంచాయతీ పద్ధతిలో వ్యవస్థితమైన విధానం కనిపిస్తుంది. వీళ్ళు ఏర్పరచుకున్న నియమ నిబంధనలు పంచాయతి పద్ధతిని వీలైనంతగా సూత్రబద్ధం చేయటానికి దోహదం చేశాయి. పొట్టకోసం పాటుబడటానికి వెచ్చించే సమయంకన్నా, పట్టుదలకోసం పంచాయతీలు ఆడటానికి వీళ్ళు ఎక్కువ సమయాన్ని వెచ్చిస్తున్నారంటే పంచాయతీలకు

పీళ్ళచ్చే ప్రాధాన్యం తేటతెల్లమవుతున్నది. 'తనువుకు నూరేండ్లు, తగువుకు వెయ్యేండ్లు' అనే సామెత పంచాయతులు వీళ్ళ జీవితాలను ఎంతగా ప్రభావితం చేశాయో తెలుపుతున్నది.

తగాదాలు రావటానికి చెప్పుకోదగ్గ కారణాలతో పాటు ఏ స్వల్ప కారణ మైనా అయ్యి ఉంటుంది తాగినప్పుడు మాటామాటా పెరిగి అయినాకావచ్చు, తన అభిప్రాయాన్ని ఎదుటివాడు ఖండించినప్పుడు అసహనంతోనయినా కావచ్చు, పొత్తులో సంపాదించుకున్నది పంచుకునేటప్పుడైనా కావచ్చు, భిక్షాటన సందర్భా ల్లోనూ, వేటకు వెళ్ళిన సందర్భాల్లోనో కావచ్చు. వియ్యంపులై కూతురునో, కొడుకునో వెనకేసుకొని మాట్లాడిన సందర్భంలోనైనా కావచ్చు. తిట్టుకోవటాలు, కొట్టుకోవటాలు, నిందలు మోపుకోవటం, దొంగతనాలు - ఇలాంటి ఏకారణం వల్లగాని తగాదాలు చెలరేగుతాయి.

ఈ కుల పంచాయతుల్లో ఊరివాళ్ళ జోక్యం, ప్రమేయం ఉండటం బుడిగె జంగాలు ససేమిరా ఒప్పుకోరు. వాదిగాని, ప్రతివాదిగాని ఊరివాళ్ళతో లేక పోలీసువాళ్ళతో ఫిర్యాదు చేసినట్లయితే కులపెద్దలు అతని మీద తప్పు మోపుతారు. అందువల్ల ఎలాంటి పంచాయతీ అయిన కులస్థులోనే తీర్చుకోవలసి ఉంటుంది.

ఒకవేళ వాది ప్రతివాదులు ఫిర్యాదు చేయకున్నా, ఊరివాళ్ళు జోక్యం చేసుకొనే అవకాశం లేకుండా ఈ తగువులను తమ ఇళ్ళ మధ్యలో ఏ చెట్టు కిందనో చేసుకుంటారు. లేదా- ఊరికావల మర్రిచెట్టు కిందనో, వేపచెట్టుకిందనో, ఏదో నీడపట్టున ఈ కులపంచాయతీలు జరుపుతుంటారు. ఒక పంచాయతి ఒకటి, రెండు రోజులు జరగవచ్చు. లేదా వారం రోజులు జరగవచ్చు. సాధారణంగా ఏదైనా పంచాయతీ జరుగుతుంటే కులస్థులంతా భిక్షాటన, వేట మొదలైన పనులు మానుకొని అందరు పంచాయతిలో కూర్చుంటారు.

బుడిగె జంగం కులపంచాయతీ విధానం తరతరాలుగా కొనసాగుతున్నది. ఈ విధానం వీళ్ళ జీవనంతో పెనవేసుకుపోయి ఒక వ్యవస్థగా రూపు దిద్దుకు న్నది. ఈ పంచాయతీ వ్యవస్థకు నిర్దిష్టమైన కొన్ని అంగాలు ఏర్పడ్డాయి. ఈ కుల పంచాయతీ పద్ధతిని స్థూలంగా కొన్ని విభాగాల కింద చూపవచ్చు. అలా

ఒక వ్యవస్థగా ఇది ఏర్పడటానికి కారణం ప్రతి బుడిగె జంగం పరస్పర వివాదాలను, తగువులను అనివార్యంగా పంచాయతిలో పరిష్కరించుకోవలసి ఉండటమే. ఏ చిన్న తగాదా ఏర్పడినా, ఏ వివాదం సంభవించినా, ఏ కొట్లాట జరిగినా తప్పకుండా పంచాయతీ పెట్టి తీరవలసిందే. ఎప్పటి వివాదాలు అప్పుడే తీర్చుకోవలసిందే. కాని ఒక్కొక్కప్పుడు తనకు పంచాయతి ఆడటానికి అనువు కానప్పుడు 'పుల్ల' ఇచ్చి నెలనుంచి ఆరునెలల దాకా వాయిదా పెట్టుకోవచ్చు. ఆ వాయిదా ప్రకారం వచ్చి తిరిగి పంచాయతీ ఆడి, వివాదాన్ని పరిష్కరించు కోవాలి. కొందరు పంచాయతీ జరిగే చోటు మార్చుకుంటారు. ఒకే గూడెంలో ఉండేవాళ్ళైనా వాది ప్రతివాదుల్లో ఏ ఒక్కరికి ఇష్టం లేకున్నా స్వంత గూడెంలో పంచాయతీ ఆడకుండ ఇతర గూడెంలో ఆడుతారు, రెండు వేర్వేరు గూడెంలకు చెందిన వాళ్ళ మధ్య వివాదం వస్తే ఆ రెండు గూడెంలు కాక మరో గూడెంకు వెళ్ళి అక్కడ పంచాయతీ చేసుకుంటారు. మొత్తం మీద కుల పంచా యతి మాత్రం తప్పదు.

ఇద్దరు కులస్థుల మధ్య వివాదం జరిగినప్పుడు - ఆ ఇద్దరూ కులంలో 'ముచ్చిలిక' ఇచ్చి మాట్లాడుకోవాలి. ఒకరు ముచ్చిలిక ఇచ్చి మరొకరు ఇవ్వ దలచుకోనప్పుడు, ముచ్చిలిక ఇవ్వని వ్యక్తి, మొదటి వ్యక్తి ముచ్చిలికను తీసికెళ్ళి అతనిచేతిలో పెట్టి 'తప్పైపోయింద'ని క్షమాపణ అడగాలి. అప్పుడు పంచాయతి ఆడవలిసినపని ఉండదు. అలా ముచ్చిలిక తీసికెళ్ళి చేతిలో పెట్టి, క్షమాపణ అడగటాన్ని 'శనాత్రి' (శరణార్థి) పెట్టటం అంటారు. 'శనాత్రి' పెట్టటం నామోషీగా అనిపిస్తే, లేక పంచాయతి ఆడటానికి పౌరుషం పొంగి వస్తే, అప్పుడు పంచాయతి ఆడటం తప్పదు.

ఎవరైనా కులానికి వచ్చి మాట్లాడుకోనట్లయితే, ముచ్చిలిక ఇవ్వనట్లయితే, అతణ్ణి కులపెద్దలు 'కులమెత్తి' (కులం వెలితి) పెడతారు. అందే అతణ్ణి కులంలో నుంచి వెలివేస్తారు. సొంగముంత బందు' అంటారు. ఇవన్నీ కులా చారానికి సంబంధించిన నిబంధనలు. కులాచారం ప్రకారం బుడిగె జంగాల గూడెంలోని ప్రతి ఒక్కడు ఉదయం లేవగానే కులపెద్దను పలకరించాలి. ఆ తర్వాత కులస్థులందరు ఒకరినొకరు పరస్పరం పలుకరించుకోవాలి. ఇంటి ముందరికి ఎవరొచ్చినా వాళ్ళకు సొంగ (చొంగ - సొంగ) ఇవ్వాలి.[1]

---

1. చొంగ అంటే మట్టితో చేసిన పొగతాగే గొట్టం. అందులో పొగాకు పొడిని కొంచం తడిచేసి నింపి, నిప్పువేసి పొగలాగుతారు. తాగుతారు.

మట్టి సొంగలకు బదులుగా మోదుగ ఆకులతో చుట్టచుట్టి, అందులో పొగాకు నింపుకొని, అగ్గిముట్టించుకొని కూడ త్రాగేవారు. ఈ సొంగనే చిల్మ్ (చిలుము) అని కూడ అంటారు. ఈ రెండు పదాలు కలిపి సొంగసిల్మ్ (చొంగ చిలుము) అనికూడ వాడతారు. సొంగ ఇవ్వటం, తీసుకోవటం కులస్థునిగా గౌర వించినట్లు భావిస్తారు. సొంగవాడకం తగ్గాక ఆ స్థానంలో బీడీలు వచ్చాయి. ఇంటిముందరకి కులస్థులు వచ్చినట్లయితే వాళ్ళకు బీడీ ఇవ్వటం ఆచారం.

బుడిగె జంగాల ఆచారం ప్రకారం వాళ్ళలో ఏ కార్యం జరిగినా- అంటే పురుడు, నిశ్చితార్థం (ఇడెం), పెళ్ళి, చావు, తగువు మొదలైన సందర్భాల్లో ప్రతి కుటుంబానికి ముంత (ముంతెడు) కల్లు ఇస్తారు. నిశ్చితార్థం, పెళ్ళి మొదలైనవాటికి బొట్టు పెట్టి పిలుస్తారు. అయితే కులం నుంచి వెలివేసిన వ్యక్తికి ఈ ఆచార గౌరవాలు ఆపి, అతణ్ణి కుల బహిష్కారం చేస్తారు. అతనికి 'సొంగ' ఇవ్వరు. 'ముంత' ఇవ్వరు. 'బొట్టు' ఉండదు. అతని కుటుంబంతో ఎవరూ మాట్లాడకుండా కట్టడి చేస్తారు. 'అతని కూతురును ఎవరు పెళ్ళి చేసుకోవద్దు. అతని కొడుకుకు ఎవరు పిల్లనీయవద్దు. అతని ఇంటి ముందరికి ఎవరూ వెళ్ళ వద్దు. అతడు ఇచ్చే సొంగసిల్మ్ ఎవరూ తీసుకోవద్దు' అని కులపెద్దలు నిర్ణయి స్తారు. ఒకవేళ ఎవరైనా ఈ నియమాలకు వ్యతిరేకంగా ప్రవర్తించి, అతణ్ణి దగ్గరకు తీసినట్లైతే అలాంటి వ్యక్తిని కూడ కులం నుంచి వెలివేస్తారు. కఠోర మైన ఈ వెలికి ఒంటరిగా బ్రతుకలేక వెలివేయబడ్డ వ్యక్తి కులపెద్ద దగ్గర తన తప్పు ఒప్పుకొని 'దండ్గ' పెట్టి తన పంచాయతి మాట్లాడుకొని తిరిగి కులంలో కలుస్తాడు. అందువల్ల కులస్థులందరు తమ తగాదాలను పంచాయతీలో అని వార్యంగా పరిష్కరించుకోవాలి.

**పంచాయతీ అంగాలు :** బుడ్గ జంగాల పంచాయతులను పరిశీలించినట్ల యితే ఏ పంచాయతీకైనా సర్వసామాన్యమైన 7 అంగాలు ఉన్నట్లు గుర్తించవచ్చు.

1. పుల్ల లేక ముచ్చిలిక. 2. కోరడి. 3. సాలు. 4. ప్రమాణాలు - సాక్ష్యాలు. 5. సాటువలు. 6. తీర్పు - తప్పులు - దండ్గలు. 7. ముగింపు.

(1) **పుల్ల లేక ముచ్చిలిక:** ''పుల్ల'' అనేదానికి సామాన్యార్థం 'పుడక.' 'ముచ్చిలిక' అనే పదానికి నిఘంటువు 'వాది ప్రతివాదులు మధ్యవర్తులకు వారి తీర్పు ఒప్పుకొని యెదమని వ్రాసియిచ్చెడు ఒడంబడిక' అనే అర్థాన్ని ఇస్తున్నది. ఇద్దరి మధ్య కలహం జరిగినప్పుడు మరో కులస్థుణ్ణి (మధ్యవర్తిని) పిలిచి ఒకరి మీద ఒకరు వాదిప్రతివాదులు పరస్పరారోపణలు చేసుకొని ఆ మధ్యవర్తికి 'పుల్ల' (పుడక) ఇస్తారు. దీన్నే 'ముచ్చిలిక' (ముచ్చిరిక) ఇవ్వటం అంటారు. పుల్ల కట్టటం లేక ముచ్చలిక ఇవ్వటమంటే - ఆ సమయంలో భూమిమీద నుంచి ఒక గడ్డిపరకనో, వేపరెమ్మ పుల్లనో, ఏదోఒక సన్నని పుడకనో అంగుళమంత విరిచి, చేత పట్టుకొని - అవతలివ్యక్తి తనమీద చేసిన అన్యాయాన్నో అక్రమానో అవమానాన్నో ఫిర్యాదుగా చెప్పి, అతణ్ణి కులంలో 'తప్పనిపిస్తా'నని ఆ పుల్లను మధ్యవర్తి చేతిలో పెడతారు. దీనికి జవాబుగా ప్రతివాది "అయ్యా! నేను వాది చెప్పినట్లు ఏ తప్పు చెయ్యలేదు. ఇతని జోలికి నేను పోలేదు. ఇతడే నామీద దౌర్జన్యం చేశాడు. ఇతణ్ణే కులంలో తప్పనిపిస్తాను'' అని ఒక పుల్ల విరిచి ఆ మధ్యవర్తి చేతిలో పెడతాడు. వాది, ప్రతివాది ఇచ్చిన పుల్లల్ని (ముచ్చిలికల్ని) పట్టుకొన్న వ్యక్తిని 'పుల్లదారి' అంటారు. ఒక్కొక్కసారి ఈ పుల్లకు బదులుగా చేతికి ఉన్న ఉంగరాన్ని కూడ ముచ్చిలికగా ఇస్తారు. పుల్ల లేదా ముచ్చిలిక అనే అర్థంలో 'కత్పు' అనే పదాన్ని కూడ వాడతారు. అందువల్ల 'పుల్లదారి'ని 'కత్పుదారి' అని కూడ అంటారు. వాది, ప్రతివాది ముచ్చిలికలు ఇచ్చిన తర్వాత పుల్లదారి కులస్థులను పిలిచి ఈ విషయాన్ని అందరికి తెలియజేస్తాడు. రాత్రివేళ కొట్లాట జరిగి ఈ ముచ్చిలికలు ఇచ్చినట్లయితే కులస్థులంతా వాది ప్రతివాదిని శాంతింపజేసి, కొట్లాట మాన్పి ఒకర్నొకరు తిట్టుకోకుండా, కొట్టుకోకుండా కట్టడిచేసి, ఉదయాన మాట్లాడదామని వాయిదా వేస్తారు. ఉదయాన్నే వాది, ప్రతివాది, కులస్థులంతా పంచాయతీకి కూర్చుంటారు.

(2) **కోరడి :**

కొన్ని ప్రాంతాల్లో దీన్ని 'కోరడ' అని అంటారు. ఈ కోరడి, కోరడ అనే పదాలు 'కోయట' నుంచి ఏర్పడి ఉంటాయి. ఇంచుమించుగా యాభై సంవత్సరాలకు పూర్వమైతే కొట్లాట జరిగినా లేదా వివాదం జరిగినా గూడెంలోనే ఉన్న కులపెద్దనే ఉభయులను విచారించి, తప్పొప్పులు నిర్ణయించి - తప్పు తేలిన వారిమీద నామమాత్రపు 'జరిమానా' విధించేవాడు. ఈ జరిమానానే 'దండగ'

(దండుగ) (దండగ-దండ్గ) అని అంటారు. దండ్గగా వచ్చిన డబ్బుతో కులస్థు లందరు కలిసి కల్లు లేక సారా కొనుక్కొని తాగేవారు. కాని ఇటీవల యాభై సంవత్సరాల నుంచి బుడిగె జంగాల్లో న్యాయం చెప్పటం వృత్తిగా పెట్టుకొన్న వాళ్ళు తయారయ్యారు. వాళ్ళను 'న్యాయగాళ్ళు' అని అంటారు. సాధారణంగా గూడెంపెద్ద అనగా కులపెద్దనే 'న్యాయగాడు'గా ఉంటాడు. సంచార జీవనులైన బుడిగె జంగాలు తాత్కాలిక సెలవుల (సెంద్రల) వద్ద కొట్లాడుకున్నా, అక్కడ 'ముచ్చిలిక పాబంది' చేసుకొని ఆ తగవును వాయిదా వేసుకుంటారు. సంవత్సరానికి ఒకసారి స్వస్థానాలకు వచ్చాక వలసలో జరిగిన తగాదాలను కులపెద్ద సమక్షంలో పరిష్కరించుకొనేవారు. అయితే సంచార జీవనం తగ్గి, క్రమంగా స్థిరజీవితానికి అలవాటుపడుతున్న దశలో వృత్తి న్యాయగాళ్లు బయలు దేరారు. ఏ ఊళ్లోనైనా కులస్థులు కొట్లాడుకొని ముచ్చలికలు ఇచ్చుకొన్న తర్వాత, ఆ తగువు తీర్పు చెప్పటానికి వేరే గ్రామాల్లో నివసిస్తున్న న్యాయ గాళ్ళలో తమకు కావలసినవారిని వాది ప్రతివాదులు కోరుకుంటారు. అప్పుడు కోరుకున్న న్యాయగాళ్ళ సంఖ్యను బట్టి పుల్లదారి వాది ప్రతివాది దగ్గర సమా నంగా డబ్బు తీసుకొని, అందులోనుంచి కోరుకున్న న్యాయగాళ్ళకు ఖర్చుల నిమిత్తం డబ్బు పంపుతూ ఈ పంచాయతీకి వాళ్ళను రమ్మని మనిషి ద్వారా కబురుపంపుతాడు. దీన్నే 'కోరడి' అంటాడు. కొన్ని జిల్లాల్లో ఇద్దరు మనుషులను పంపుతారు. కాబట్టి కోరడిని 'జోడ'అనికూడా అంటారు. (జోడ-జంట) కోరడితీసు కొన్నట్లయితే ఆ న్యాయగాడు పంచాయతీ తీర్పు చెప్పటానికి తప్పకుండ రావలని ఉంటుంది. రాని పక్షంలో కోరడి ముట్టకూడదు. కోరడి డబ్బులు తీసుకొని కూడ రానట్లయితే తీవ్రమైన తప్పుగా పరిగణిస్తారు. ఈవిధంగా కోరడి పంపి పిలి పించుకొన్న న్యాయగాళ్ళందరు వచ్చిన పిదప పంచాయతీ ప్రారంభమవుతుంది.

**(3) సాలు :**

ఉదయం లేవగానే పంచాయతి జరిగే స్థలంలో గూడెం పెద్దమనిషి, మిగతాకులస్థులు, ఇతర గ్రామాలనుంచి వచ్చిన కోరుకున్న న్యాయగాళ్ళు, వాదుకాళ్ళు, సాక్షిగాళ్లు, అందరూ కూర్చొని ఉంటారు. వాది ప్రతివాదులు కులం వాళ్ళు చెప్పిన మాట వినక మొండికిపడేవాళ్లైతే - వాళ్ళ దగ్గర దడావత్ (Deposit) గా వెయ్యో, రెండువేలో సందర్భాన్నిబట్టి, వాది ప్రతివాదులను బట్టి తీసుకొని, పంచాయతీ తీర్పు తర్వాత లెక్కలు చేసి, ఖర్చులుపోను దడావత్

డబ్బులో ఏమైనా మిగిలితే వాళ్ళకు తిరిగి ఇచ్చేస్తారు. దడావత్ పెట్టినా మిగతా ఖర్చులు మాత్రం యథాప్రకారం తీసుకుంటారు. వాది, ప్రతివాది చెప్పినట్లు నడుచుకునే వాళ్ళైతే ఈ దడావత్ తీసుకోవలసిన అవసరం ఉండదు.

'సాలు' ప్రారంభానికి ముందు న్యాయగాళ్ళ భోజనానికి అయ్యే ఖర్చులను, సాయంత్రం కులం వాళ్ళకయ్యే కల్లు, సారా ఖర్చులను దృష్టిలో పెట్టుకొని పుల్లదారి వాది ప్రతివాదులనుంచి సమానంగా డబ్బు అడిగి తీసుకొంటాడు. న్యాయగాళ్ళకు కోళ్ళను కోసి, భోజనాలను ఏర్పాటు చేయటానికి ఒక మనిషిని నియమిస్తాడు. పంచాయతీలో ఉన్నవాళ్ళు త్రాగటానికి బీడీలు తెప్పించి అందరికీ ఇస్తాడు. అయ్యినట్టి ఖర్చులన్నీ వ్రాసి లేక వ్రాయించి ఉంచుతాడు. వాది ప్రతివాదులు పుల్లదారికి డబ్బు ఇచ్చాక న్యాయగాళ్లు మొదట ముచ్చిలిక ఇచ్చినవాణ్ణి 'సాలు' చెప్పమని అడుగుతారు. 'సాలు' అంటే వివాదం ఏ విధంగా మొదలయ్యిందో, ప్రతివాది తనను ఏ విధంగా తిట్టాడో లేక కొట్టాడో - తాను కూడా ఏ విధంగా ప్రవర్తించాడో అనే విషయాన్ని క్రమంగా వివరించటం. కొట్లాట పూర్వాపరాలను పూసగుచ్చినట్లు వరుస (చాలు) క్రమంలో చెప్పటమే సాలు. దీనివల్లనే 'సాలు చెప్పు ధర్మరాజా అంటె దుద్దెబ్రరె నాదే అన్నాడట' అనే సామెత పుట్టి ఉండవచ్చు. సాలు చెప్పేటప్పుడు మొదట ముచ్చిలిక ఇచ్చిన వాది పక్షం వాళ్ళందరూ వరుసగా చెబుతారు. భార్య, భర్త, కొడుకు, కోడలు, అన్నదమ్ములు - అందరూ ఎవరెవరు ఆ వివాదానికి సంబంధించి చెప్పదలుచుకున్నదంతా చెబుతారు. ఒక పక్షం వాళ్ళ సాలు కొన్ని సందర్భాల్లో కొన్ని రోజుల దాకా వెళుతుంది. సాలు ఎన్ని రోజులు జరిగినా ప్రతిరోజూ మాత్రం పుల్లదారి ఖర్చులకు కావలసిన డబ్బులు వాది ప్రతివాదుల వద్ద సమానంగా తీసుకుంటూనే ఉంటాడు. ఖర్చులు చేస్తూనే ఉంటాడు.

వాది పక్షం వాళ్లు సాలు చెబుతున్నప్పుడు ప్రతివాది పక్షం వాళ్లు ఆటంకం కలిగించరాదు. తమమీద తప్పులు చెబుతున్నాడని అనిపిస్తే అక్కడ ఆపి వాది "నా మీద లేనిపోనిది కల్పించి చెబుతున్నాడని, ఇది తప్పనిపిస్తా"నని ముచ్చిలిక ఇస్తాడు. ''ఒకవేళ దానికి సాక్ష్యం తెచ్చినట్లయితే నేను తప్పస్థుణౌతా''నని చెబుతాడు. ''తప్పస్థుడు'' అనే మాట 'తప్పు చేసినవాడు' అనే అర్థంలో ఈ సందర్భంలో తప్పకుండా ప్రయోగిస్తారు.

వాది పక్షం వాళ్ళందరు సాలు చెప్పటం పూర్తయితే ప్రతివాది పక్షం వాళ్ళ సాలు చెప్పటం మొదలుపెడతారు ఇక అప్పుడు వాది పక్షంవాళ్ళు మళ్ళీ ఏదైనా చెప్పదలుచుకుంటే ప్రతివాది పక్షం సాలు అయిపోయిన తర్వాత కుల పెద్దల అనుమతి తీసుకొని చెప్పవలసి ఉంటుంది.

సాలు చెప్పేటప్పుడు అసలు విషయం టూకీగా చెప్పకుండా తాతలు తండ్రుల సంగతులు, ఉదయాన నిద్రలేచింది మొదలుకొని రాత్రివరకు తాము చేసిన ప్రతిపని సవివరంగా చెబుతారు. అందువల్ల సాళ్ళు చెప్పటానికే కొన్ని రోజులు పడుతుంది.

ఈ విధంగా ఉభయపక్షాలు సాలు చెప్పటం పూర్తికాగానే న్యాయగాళ్ళు సాక్షులను పిలుస్తారు. వీళ్ళను 'సాక్షిగాళ్ళు' అని అంటారు.

### 4. ప్రమాణాలు (ఇమానాలు) - సాక్ష్యాలు :

కొట్లాట జరిగినప్పుడు సాక్షులెవరు లేకుండ వాది, ప్రతివాది ఇద్దరే ఉన్నట్లయితే కులపెద్దలు 'ఇద్దట్లో ప్రమాణం - ముగ్గుట్లో సాక్ష్యం' అని ప్రమాణాలు పెడతారు. ప్రమాణం చేయటాన్ని తెలంగాణా ప్రాంతపు బుడ్గ జంగాలు 'ఇమానం చేయటం' అంటారు. ప్రమాణ పద్ధతిలో ఒకడు ప్రమాణం చేస్తే రెండవవాడు తప్పుచేసినవాడై పంచాయతీలో అయ్యిన ఖర్చులన్నీ భరించుకోవాలి. ప్రమాణం పెట్టినవాడు తన ఇష్టప్రకారం ఏదో ఒక పద్ధతిలో ప్రమాణం పెడితే రెండవవాడు ఆ ప్రమాణాన్ని చెయ్యాలి. ఇద్దరిలో అబద్ధం ఆడినవాడు సర్వనాశనం అవుతాడని నమ్ముతారు.

ప్రమాణానికి ముందు న్యాయగాళ్ళు అబద్ధపు ప్రమాణాలు చేస్తే ఇల్లు నాశనమౌతుందని, 'పామునైనా పట్టవచ్చు - పచ్చటి కొమ్మపట్టరాదు' అని, నిజాన్ని ఒప్పుకోండని ఎన్నోవిధాలుగా చెబుతారు. లోగడ అబద్ధపు ప్రమాణాలు చేసి, నాశనమైనవాళ్ళ ఉదాహరణలు చెబుతారు.

ప్రమాణాలు అనేక రకాలుగా ఉంటాయి. వాది, ప్రతివాది ఏ పద్ధతి ప్రమాణాన్ని ఇష్టపడితే ఆ ప్రమాణాన్ని పెడతారు ముఖ్యంగా వీటిని 6 విభాగాలుగా చూపవచ్చు.

1. పచ్చటి కొమ్మ ప్రమాణం, 2. సంతానం మీద ప్రమాణం
3. గుడి కొట్టటం - గుళ్ళో దీపం ఆర్పటం
4. గడ్డపార దుయ్యటం, 5. నూనె దేవటం
6. బాణి కట్టటం.

**పచ్చటి కొమ్మ ప్రమాణం :**

నిండు కులసభలో వేపకొమ్మవేసి "ఈ కొమ్మ పట్టుకొని ఇమానంగా ఉన్నదున్నట్లు చెప్పు. అబద్దం అప్పటిది. నిజం ఎప్పటిది లోకంలో కడుపు నిండ కునుక్కున్నోళ్లు ఉన్నారు. చేతులారా పెట్టుకున్నోళ్ళున్నారు. నిజం నిజమే. అబద్ధం అబద్ధమే. నీళ్ళు నీళ్ళే-పాలు పాలే. యదార్థంగా (వాస్తవంగా) ఉన్నదున్నట్లు చెప్పు' అని అంటారు. కొందరు వేప కొమ్మతోపాటు పెండ ముద్ద, పసుపు, కుంకుమ తెచ్చిపెట్టి ప్రమాణం చేయమంటారు. ప్రమాణం చేసేవాడు వాటిని పట్టుకొని తాను నిర్దోషినని, ఏ తప్పు చేయలేదని ప్రమాణం చేయాలి.

**సంతానం మీద ప్రమాణం :**

ఈ పద్దతిలో ప్రమాణం చేసేవాడు తన కూతురునో, కొడుకునో అందరి లోకి తెచ్చి, చంకకు ఎత్తుకొని, వాళ్ళ నెత్తిమీద చేయిపెట్టి ప్రమాణం చేసి చెబుతాడు.

**గుడి కొట్టటం - గుళ్ళోదీపం ఆర్పటం :**

ఈ ప్రమాణాలు సాధారణంగా ఆంజనేయ స్వామి గుడిలోకాని, మైసమ్మ దేవత గుడిలోకాని చేస్తారు. ఈ పద్ధతి ప్రమాణం చేయించేవాడు 'అనుమాండ్ల పాదాలు కొట్టు' మంటాడు. ప్రమాణం చేసేవాడు స్నానంచేసి, తడిబట్టలతో వచ్చి, ప్రమాణం చేసి, ఆంజనేయ స్వామి పాదాలకు తాకుతాడు. దీన్నే గుడి కొట్టటం అంటారు. దీనికి బదులుగా 'గుళ్ళో దీపం ఆర్పే ప్రమాణం' కూడ చేస్తారు. వాది, ప్రతివాదులు స్నానం చేసి వచ్చాక, ప్రమాణం చేయించేవాడు గుళ్ళో దీపం వెలిగిస్తాడు. ప్రమాణం చేసేవాడు తడిబట్టలతో వచ్చి ప్రమాణం చేసి గుళ్ళోని దీపాన్ని ఆర్పుతాడు.

గుళ్ళో అప్పు పత్రం చించివేయటం కూడ ఒక ప్రమాణమే. అప్పు పత్రంతో ఉన్నది ఒప్పుకోక, డబ్బు ఇచ్చేది లేదని మొండికేస్తే 'రశీదు తప్పితే మసీదు' అంటూ ఈ ప్రమాణం పెడతారు. డబ్బు ఇచ్చినవాడు గుడిలో పత్రం వేసి 'ప్రమాణం చేసి చింపివేయ' మంటాడు. అప్పు తీసుకున్నవాడు 'నేను అతనికి డబ్బు ఇచ్చేదిలేదు. ఇది వాస్తవం' అని ప్రమాణంచేసి ఆ పత్రాన్ని చింపి వేస్తాడు.

**గడ్డపార దుయ్యటం :**

ఈ పద్ధతిలో తాను ఏ తప్పూ చేయలేదని, తాను నిర్దోషినని చెప్పి ఎర్రగా కాల్చిన గడ్డపారను చేతితో లేక రెండు చేతులతో దూసి చేతులను పెండలో పెట్టాలి. చెయ్యి కాలినట్లయితే అబద్ధం ఆడుతున్నాడని పంచాయతీ ఖర్చులన్నీ అతనిమీదవేసి, అబద్ధపు ప్రమాణం చేసినందుకు 'దండ్గ' తీసుకుంటారు. చెయ్యి కాలనట్లయితే అతడు నిర్దోషి అని భావిస్తాడు.

**నూనె దేవటం :**

పొయ్యిమీద బాణలి లేదా కొత్త కుండ పెట్టి అందులో నూనెపోసి వేడి చేస్తారు. నూనె సలసల కాగుతున్నప్పుడు అందులో ఒక ఉంగరం వేస్తారు. ప్రమాణం చేసేవాడు మరుగుతున్న ఆ నూనెలో చేయి పెట్టి, ఉంగరాన్ని తీసి న్యాయగాని చేతిలో పెట్టాలి. చెయ్యి కాలనట్లయితే అతడు నిర్దోషి, కాలితే అతడు దోషి.

**బాణి కట్టటం :**

ఈ 'బాణి' అనే పదానికి 'పద్ధతి' అనేది సామాన్యార్థమయినా 'కట్టడి చేయటం' అనే పలుకుబడిగా ఇది వాడబడుతున్నది. వాది, ప్రతివాదుల్లో ఒకడు తాను ప్రమాణం చేయక, ప్రమాణం చేసినవాణ్ణి ఒప్పుకోక మొండికేస్తే 'బాణి' కడతారు. కొన్ని సందర్భాల్లో వాది ప్రతివాదులిద్దరూ ఏకాభిప్రాయంతో ఈ ప్రమాణ విధానాన్ని కోరుకుంటారు.

ఈ పద్ధతిలో కులపెద్దలు వారంరోజుల సమయం ఇచ్చి, ఆ వారం రోజుల్లో వాది ప్రతివాదులకు, వారి కుటుంబ సభ్యులకు ఎలాంటి హాని జరిగినా, ఎలాంటి కీడు జరిగినా - అలా జరిగినవాడిదే తప్పని నిర్ణయిస్తారు ఇరువక్షాలకు

కూడ హాని జరిగితే దామాషా పద్ధతిలో తప్పుల ప్రకారం ఖర్చయిన డబ్బు మోపి దండ్గ తీసుకుంటారు. ఉభయులు బాణి కట్టటానికి ఒప్పుకున్న తర్వాత న్యాయ గాళ్ళు కులస్థుల్లోంచి ఇద్దరు నిజాయితీపరుల్ని ఏరి, వాదివెంట ఒకరిని, ప్రతి వాదివెంట ఒకరిని వారం రోజులుపాటు వాళ్ళకు జరిగే అపకారాలను కనిపెట్ట టానికి ఉండమని నియమిస్తారు. వాది ప్రతివాదులు ఎక్కడికి వెళ్ళినా వీళ్ళు వాళ్ళ వెంటనే వెళుతుంటారు. ఈ విధంగా అహర్నిశలు కనిపెట్టి, వారాంతంలో జరిగిన సంఘటనలను న్యాయగాళ్ళకు వివరిస్తారు. ఈ వారం రోజుల్లో వాది ప్రతివాదుల కోడిపిల్లను గద్ద ఎత్తుకుపోయినా, వాళ్ళ కుటుంబంలో ఎవరికైనా తేలు కుట్టినా, పాము కరిచినా, ఎవరితోనైనా కొట్లాట జరిగినా, ఎవరైనా కొట్టినా, చెట్టుమీదనుంచి కింద పడినా, కాలికి తట్టుతాకి కిందపడ్డా, కాలు విరి గినా, చెయ్యి విరిగినా, ఒంటికి దెబ్బ తగిలినా ఇంట్లో ఎవరైనా చచ్చినా, వాళ్ళ వస్తువులేవైనా దొంగిలింపబడినా, చేపలు పడుతున్నప్పుడు జెల్ల, ఇంగి లీకం కుట్టినా. ఎలాంటి కీడు కలిగినా, హాని జరిగినా, ఆపద వచ్చినా, కష్టం సంభవించినా అతడిదే తప్పని నిర్ణయిస్తారు

**సాక్ష్యాలు :**

వివాదం జరిగినప్పుడు వాది, ప్రతివాది ఇద్దరే ఉన్నట్లయితే, పైన తెల్పిన ప్రమాణాల్లో ఏదో ఒకటి చేస్తారు. నూనె దేవటం లాంటి ప్రమాణాలు సాధార ణంగా రంకు పంచాయతుల్లో ఎక్కువగా పాటింపబడతాయి. ఇద్దరు కొట్లాడు కున్నప్పుడు, వివాదం జరిగినప్పుడు సాక్షులు ఉన్నట్లయితే, న్యాయగాళ్ళు వాళ్ళని పిలిచి విచారిస్తారు. సాక్షులకు కూడ వాది ప్రతివాదులు ప్రమాణాలు పెడతారు. కొందరు 'పదిమంది ఉన్న చోటనే పరమాత్ముడున్నా' డని, 'నియ్యి తెంతనో బర్కతంత నీ సత్యప్రమాణంగా చెప్పు' అని సాక్షులతో అంటారు. కొన్ని సందర్భాల్లో వేపకొమ్మ విరిచివేసి 'అది పట్టుకొని చూసింది చెప్పు' అని కోరతారు. మరికొన్ని సందర్భాల్లో వేపకొమ్మకు తోడు పెండముద్ద, పసుపు, కుంకుమ కూడ తెచ్చిపెట్టి, 'వాటిని పట్టుకొని సత్యప్రమాణంగా చెప్పు' అని అంటారు.

ఈ విధంగా సాక్షులు తాము చూసింది వివరిస్తూ వాది ప్రతివాదుల్లో ఎవరిది దురుసు స్వభావమో, ఎవరిది శాంతమో తమ దృష్టితో వ్యాఖ్యానిస్తారు.

సాళ్ళు, ప్రమాణాలు, సాక్షులు చెప్పటం పూర్తయ్యాక ఇక న్యాయగాళ్ళ న్యాయశోధన మొదలవుతుంది. వాది ప్రతివాది పక్షాలు చెప్పిన సాళ్ళను పునర్విమర్శన చేస్తూ 'సాటువలు' చెబుతూ 'కొళ్ళ'ను లెక్కిస్తారు.

**(ర) సాటువలు :**

'సాటువ' అనే పదానికి 'సామ్యము' అని నైఘంటికార్థం. పంచాయతుల్లో సందర్భానికి తగినట్లుగా జనవ్యవహారంలో ఉన్న కథను గాని, లోగడ జరిగిన సంఘటనను గాని పోల్చి చెప్పటాన్ని 'సాటువ' అంటారు. బుడిగె జంగం కుల పంచాయతీ చేసే న్యాయగాళ్ళకు అంతవరకు జరిగిన పంచాయతులన్నీ సాటువలే. తాము స్వయంగా చూసిన సంఘటనలే కాకుండా, తాము స్వయంగా చేసిన పంచాయతులే కాకుండ ఇతరుల వలన విన్నవి కూడ సందర్భానుసారంగా సాటువలుగా చెబుతారు. వీళ్లు చెప్పే సాటువల్లో రామాయణ, భారత, భాగవత, పురాణాలకు సంబంధించిన ఉదాహరణలే కాకుండా, పంచతంత్రం కథలు, భట్టి విక్రమార్కుని కథలు, తెనాలి రామలింగని కథలు మొదలైన సంప్రదాయ కథలకు సంబంధించిన ఉదాహరణలు కూడ చోటు చేసుకుంటాయి. ముఖ్యంగా ఈ కులంలో అసంఖ్యాకంగా జరిగిన పూర్వపు పంచాయతులను సాటువలుగా చెప్పటం ఎక్కువ.

వాది ప్రతివాదుల సాళ్లు విన్న తర్వాత, సాక్ష్యుల కథనం అయిన తర్వాత న్యాయగాళ్లు ఆ రెండు సాళ్ళను కలిపి ఎక్కడ ఎవరిది తప్పో చర్చిస్తూ వస్తారు. దీన్నే 'సాలు పట్టుక రావటం' అంటారు. ఆ పంచాయతీలో ఎంత మంది న్యాయగాళ్ళు ఉన్నా ఒక్క న్యాయగాడే సాలు పట్టుకొస్తాడు. మరో న్యాయగాడు ఎదురుగా ఉండి తప్పులు నిర్ణయించటానికి ఆలనితో చర్చిస్తూ ఉంటాడు. ఈ ఇద్దరు న్యాయగాళ్ళు చేసే చర్చలో ఎక్కడైనా అన్యాయమనిపిస్తే మిగిలిన న్యాయగాళ్ళు చర్చలో పాల్గొని తమ దృష్టిలో అది తప్పో ఒప్పో తేల్చుతారు. ఈ విధంగా తేల్చే తప్పునే 'కొడి' అంటారు. ఈ 'కొడి'ని నిర్ణయించేటప్పుడు దానికి తగినట్లుగా న్యాయగాడు ఒక సాటువ చెబుతాడు. సాలు పట్టుకు రావటం పూర్తయ్యేసరికి వాదివి ఎన్ని కొళ్ళు వచ్చాయో, ప్రతివాదివి ఎన్ని కొళ్ళు వచ్చాయో తెలుస్తుంది. చివరగా మొత్తం పంచాయతీని సమీక్షిస్తూ ఒక సాటువ చెప్పి, ఆ సాటువను న్యాయగాడు వాది ప్రతివాదులకు అన్వయించి చూపి మొత్తంమీద ఎవరి దెంత తప్పో ఎత్తి చూపుతాడు.

(6) తీర్పు - తప్పులు - దండ్గలు :

సాలు పట్టుకొచ్చిన తర్వాత ఎవరివి ఎన్ని కొళ్ళు వచ్చాయో చూసి ఆ దామాషాలో తప్పులు నిర్ణయిస్తారు. ఈ దామాషా పద్ధతినే 'పాళ్ళు' అని అంటారు. కొళ్ళనుబట్టి ఎవరిమీద ఎన్ని పాళ్ళు పడాలో తేల్చుతారు. ఉదాహరణకు ఒకరి మీద రెండు పాళ్ళు. మరొకరి మీద మూడుపాళ్ళు. లేదా వాది ప్రతివాదికి చెరిసగం. లేదా ఒకరిదే తప్పు తేలితే మొత్తం ఖర్చులు ఒకరిమీదనే వేస్తారు. పంచాయతీలో ఖర్చయిన డబ్బును ఎవరివెన్ని తప్పులో నిర్ణయించి వేసిన తర్వాత ఆయా తప్పులు చేసినందుకు కులకట్టుబాటు ప్రకారం దండ్గ (దండుగ - దండగ) మోపుతారు. అంటే జరిమానా విధిస్తారు.

ఆ దండ్గల వివరాలు ఈ క్రింది విధంగా ఉంటాయి:

1. సాటి కులస్థుణ్ణి అనరానిమాట అన్నందుకు (తిట్టినందుకు) నోటివట్టం 2 రూపాయలు.
2. అబద్ధానికి ఆరు: అబద్ధం ఆడినట్లైతే 6 రూపాయలు.
3. కులస్థుణ్ణి కొట్టటానికి చెప్పులేపినాగాని, చెప్పుతోగాని కొట్టినా 24 రూపాయలు.
4. సాడి దండ్గ : సాడి (చాడి) అంటే కొండెములు చెప్పటం, తాకట్లు చెప్పటం. తాకట్లు చెప్పి ఇద్దరికి కొట్లాట పెట్టినందుకు 24 రూపాయలు.
5. దొంగ తప్పు : కులస్థుని ఇంట్లో దొంగతనం చేసినట్లైతే 24 రూపాయలు
6. హకాం తప్పు : సాటి కులస్థుణ్ణి చెయ్యెత్తి కొట్టినందుకు 24 రూపాయలు.
7. రంకు తప్పు : మగవానికి 24 రూపాయలు.

'మగనాలి వడుచు' రంకు చేస్తే ఆమె భర్త 12 రూపాయలు పెట్టాలి.

'పుట్టింటిపిల్ల' రంకు చేస్తే ఆమెతండ్రి 12 రూపాయలు పెట్టాలి.

స్త్రీ ఇతర కులస్థునితో రంకు చేసినట్లైతే 'కుండచాట తీసేసుకొని' 24 రూపాయలు దండ్గ పెట్టాలి.

**కుండ చాట తీసెయ్యటం :**

ఇది శిష్ట సమాజంలో ఉన్న ప్రాయశ్చిత్త కార్యానికి రూపాంతారం. ఆడది పరాయి కులస్థునితో రంకు చేస్తే కులం పోయిందని భావించి ఈ తతంగం

జరుపుతారు. ఇంట్లో ఉన్న కుండలు, చేటలు, సిబ్బి, గుంజిప్ప, గుత్పకట్టె, తెడ్డు, బుర్రకాయ మొ॥ తీసుకెళ్లి పారవేసి వచ్చి 24 రూ॥ల దండ్గ పెట్టి కొత్తవి కొనుక్కొచ్చుకోవాలి. కులపెద్ద వచ్చి బంగారంతో ఆమె నాలుక కాల్చి, విభూతి నోట్లో వేస్తాడు. ఆమె వంటచేసి 5గురు కులస్థులకు వడ్డించాలి. అప్పుడు ఆమె కులంలో కలిసినట్లవుతుంది.

(7) ముగింపు :

పంచాయతీ తీర్మానం ఐన తర్వాత తప్పులు వేసుకొని, దండ్గలు పెట్టిన తర్వాత వాది ప్రతివాదులు చుట్టపక్కాలో, అన్నదమ్ములో, బంధువులో అయినా లేదా తోటి కులస్థులైనా న్యాయగాళ్ళు వాళ్ళకు బుద్ధులు చెప్పి కలిసి ఉండేటట్లు చేస్తారు. మనసులో ఉన్న కోపతాపాల్ని పోగొట్టి, వాళ్ళను కలుపుతారు. చిన్న వాళ్ళచేత పెద్దవాళ్ళ కాళ్ళు మొక్కిస్తారు. పరస్పరం మాటలు కలిపి, మాట్లాడి పిస్తారు. కొందరు ఇలా కలుసుకోవటానికి ఇష్టపడనట్లయితే, ఎంత చెప్పినా వినిపించుకోనట్లయితే - అలాంటి వాది ప్రతివాదులకు కట్టుదిట్టాలు పెడతారు. ఒకరి జోలికి మరొకరు రాకుండా, ఒకరి పరోక్షంలో మరొకరు ఊసెత్తకుండా నిబంధన పెడతారు ఒకవేళ కులం పెట్టిన నిబంధన పాటించనట్లయితే తర్వాత జరిగే పంచాయతీ ఖర్చులన్నీ అతనిమీదే మోపబడతాయని కట్టుదిట్టంచేసి పత్రాలు వ్రాస్తారు. ఇలాంటి సందర్భంలోనే కాకుండా ప్రతి పంచాయతీ, అది ఏ రకం పంచాయతీ అయినా తీర్మాన పత్రాలు వ్రాయించి ఇవ్వటం తప్పనిసరి.

ఈ విధంగా తీర్మానం అయిన కొన్ని పంచాయతులు తర్వాత జరిగే కొన్ని సంఘటనలవల్ల తిరగబడతాయి. వాది ప్రతివాదులు తిరిగి పుల్లలు కట్టుకొని పంచాయతులు ఆడుతారు. కొన్ని సందర్భాల్లో కొందరు న్యాయగాళ్ళు వాదినో ప్రతివాదినో రెచ్చగొట్టి, నీకు అన్యాయం జరిగిందని చెప్పి మళ్ళీ తగువులు ఆడ టానికి వాళ్ళను ఉద్యుక్తులను చేస్తారు. తిరిగి వరుసక్రమంలో పంచాయతీ జరుగు తుంది.

వర్గీకరణ :

బుడ్గ జంగాల పంచాయతుల సరళి, వైవిధ్యం, వ్యవస్థ గమనిస్తే అసలు వీళ్ళకు వివాదం కాని విషయం అంటూ ఉంటుందా అనిపిస్తుంది. ప్రొద్దున్నే లేచి పలకరించకుంటే ఒక కొడి. అంటే తప్పు. సొంగపిల్మ్మ లేదా బీడి ఇవ్వకుంటె

కొడి. బొట్టు పెట్టి పిలువకుంటే కొడి. భిక్షాటనకు కలిసి వెళితే అప్పుడే ఏదో పొరపొచ్చం వచ్చిందని కొడి. పిల్లనిచ్చే దగ్గర కొడి. పిల్లను పట్టిందగ్గర ఏదో కొడి. పురుడు, పెళ్ళి, చావు మొదలైన సందర్భాల్లో, ఆచారాల్లో ఏమాత్రం పొరపాటు జరిగినా కొడి. ముంత ముట్టజెప్పకున్నా కొడి. చచ్చి దయ్యమైనాదని కొడి. కథలు చెప్పి, భాగోతాలు ఆడి, సంపాదించి తెచ్చుకున్నది పంచుకునే దగ్గర ఎన్నో వివాదాలు. రంకు విషయాలకు సంబంధించిన తగాదాలు ఉండనే ఉన్నాయి. కొడి దొరకంగానె ఒకరిమీద ఒకరు పుల్లలు కట్టుకోవటం, పౌరుషంతో పంచాయతులు ఆడటం....ఒక చక్రభ్రమణంలా కొనసాగుతుంటుంది. ఈవిధంగా వీళ్ళ పంచాయతుల్లో అనంతమైన వైవిధ్యం కనిపిస్తుంది. అయితే స్థూలదృష్టితో వీళ్ళ పంచాయతులను ప్రధానంగా 4 రకాలుగా వర్గీకరించవచ్చు.

1. చుట్టపక్కాల పంచాయతులు, 2. కొట్టుకున్న పంచాయతులు, 3. రంకు పంచాయతులు, 4. ఇతరాలు (వాద జంగలు, లావాదేవీలు, మ్యాళాలు - పంపకాలు, దయ్యాల పంచాయతులుమొదలైనవి.)

## (1) చుట్టపక్కాల పంచాయతులు :

ఇవి వియ్యంపుల పంచాయతులు. కొత్తగా పెళ్ళయిన భార్యాభర్తలకు సంబంధించిన వివాదాలు. వీళ్ళవి బాల్యవివాహాలయినందువల్ల భార్యాభర్తలకు మానసిక పరిణతి ఏర్పడని కారణాన ఆరంభంలో అనేక వివాదాలు వస్తుంటాయి. తల్లిదండ్రుల ఆజమాయిషిలో పిల్లలు ఉండి, వాళ్ళు చెప్పినట్లల్లా చేస్తుంటారు. అందువల్ల పిల్లనిచ్చిన వాళ్ళకు, పిల్లను చేసుకున్నవాళ్ళకు మధ్య చీటికి మాటికి పంచాయతులు జరుగుతూనే ఉంటాయి. ఈ కులంలో కన్యాశుల్కం ఉన్నందువల్ల పిల్లనిచ్చినవాళ్ళదే పైచేయిగా ఉంటుంది. పిల్లకు ఏ మాత్రం కష్టం కలిగినా, పిల్ల తల్లిదండ్రులు వియ్యంపుల మీద పంచాయతీకి దిగుతారు. అత్తగారింట్లో తినటానికి తిండి లేకున్నా అప్పోసప్పోచేసి కోడలికి కడుపు మాడకుండా తిండి పెట్టాలి. నెత్తికి చమురు, తినటానికి తిండి, కట్టటానికి బట్ట కోడలికి తక్కువ కాకూడదు. ఆమెను కొట్టకూడదు, తిట్టకూడదు. పని రాకుంటే నేర్పుకోవాలి. తెలియకుంటే చెప్పుకోవాలి. ఇలా కోడలిని చూసుకోని పక్షంలో మాటిమాటికి పంచాయతులు జరుగుతాయి. ఇద్దరు పిల్లల తల్లయ్యేదాకా ఈ నిబంధనలు కొనసాగుతాయి. పిల్లకు అత్త ఆరడి, మామపోరు, మగని బాధ ఉన్నా, తిండికి బట్టకు లోటు కలిగినా ఆమె తల్లిదండ్రులు ఆమెను అత్తవారింటికి పంపకుండ

తమ ఇంట్లోనే ఉంచుకొని వియ్యంపుల మీద పంచాయతీ ఆడుతారు. ఇలా పిల్ల తల్లిదండ్రులు ఇంట్లో ఉంచుకోవటాన్ని 'వెనకేసుకోవటం' అంటారు. తల్లి దండ్రులు ఇతర గ్రామాల్లో ఉన్నట్లయితే, పిల్లకు అత్తవారింట్లో బాధ అనిపించి నప్పుడు భర్తకు, అత్తమామలకెవ్వరికీ చెప్పకుండ వీలు చూసుకొని పారిపోయి తల్లిదండ్రుల వెనక పడుతుంది. అప్పుడు పంచాయతీ తప్పదు.

కొన్ని సందర్భాల్లో పిల్లను అత్తవారింట్లో అన్నివిధాలా బాగా చూసు కున్నా ఆమెకు ఇష్టంలేకనో లేదా తల్లిదండ్రులకు తమ కూతుర్ని ఆ ఇంట్లో సంసారం చేయించటం ఇష్టంలేకనో ఏదో కారణాన వెనకేసుకొని పంచాయతులు ఆడతారు.

ఈ పంచాయతుల్లో సర్వసాధారణంగా తీర్పులు మూడు రకాలుగా ఉంటాయి.

1 ఇరుపక్షాల మీద వాళ్ళ తప్పుల ఆధారంగా ఖర్చులు మోపినా - వియ్యం పులకు, పెండ్లి పిల్ల, పెండ్లి పిల్లవానికి బుద్ధులుచెప్పి కొన్ని నియమాలు పెట్టి, వాళ్ళ సంసారం కుదురుకునేలా పరిష్కరిస్తారు. ఇలా ఇద్దరు పిల్లలు పుట్టేదాకా పంచాయతులు జరుగుతూనే ఉంటాయి. ఆ తర్వాత వాళ్ళ సంసారం సర్దుకుంటుంది.

2. కొన్ని సందర్భాల్లో పిల్లదే తప్పయి ఆమెకు మగడితో కాపురం చేయటం ఇష్టంలేకుంటే పంచాయతీ ఖర్చులన్నీ పిల్ల తల్లి దండ్రుల మీద వేయ టమే కాకుండా, పిల్లవాని పెళ్ళి ఖర్చులు కట్టించి (ఇప్పించి), విడాకు లిప్పిస్తారు.

3. కొన్ని సందర్భాల్లో పిల్లవాడు, అతని తల్లి దండ్రులు పిల్లను బాధలు పెట్టినట్లయితే పిల్ల పిల్లవానితో కాపురం చేయనని పట్టుపడితే, అయిన ఖర్చులు పిల్లవాని మీదవేసి, పెళ్ళి ఖర్చులు కట్టించకుండానే విడాకు లిప్పిస్తారు.

(2.) కొట్టుకున్న పంచాయతులు:

వీటిని బుడిగె జంగాలు 'ఖూనీ పంచాయతులు' అంటారు. 'ఖూనీ' పదానికి 'హత్య' అనే అర్థంలో కాకుండ 'రక్తపాతం' అనే అర్థంలో వాడుతారు. ఇద్దరు కులస్థులకు లేక కులస్థుల్లో ఇరువర్గాలకు జరిగిన కొట్లాటలో తలలు పగలటం, కాళ్ళు చేతులు విరగటం జరిగితే దాన్ని "కూని (ఖూని-కూని) పంచాయతీ' అంటారు. సాటి కులస్థుని ఇంటి మీదికి వెళ్ళి దౌర్జన్యం చేసి కొట్టటాన్ని 'హకాం చేయటం' అంటారు.

కొట్లాడుకొని ఉభయులు కులానికి ముచ్చలిక ఇచ్చిన వెంటనే కులస్థులు దెబ్బలు తగిలినవాళ్ళకు 'కాయం' ఏర్పాటు చేస్తారు. 'కాయం' అనే పదానికి 'వాతమును హరించుటకై బాలెంతలకిచ్చేడి మందు' అనే అర్థం కూడ నిఘంటువు ఇస్తున్నది. కాని బుడిగె జంగాలు దెబ్బలు తిన్నవాని గాయాలు త్వరగా మానటానికి ఇచ్చే ప్రత్యేకమైన ఆహారాన్ని కాయం అంటారు. వీళ్ళిచ్చే కాయం ఇలా ఉంటుంది:

నల్లకోడిని తెచ్చి కుంపటెచ్చం, జాజికాయ, జాపత్రి లాంటి దినుసులతో వండి దెబ్బలు తగిలిన వాళ్ళకు తినిపిస్తారు. మేకపాలలో వాడ్యాలు అనే గింజలు కలిపి త్రాగిస్తాడు. నల్లమేక తలకాయ, పంది తలకాయ వండి "షోర్వా" (చారు) పోస్తారు. గోదుమ జావ ఆహారంగా ఇస్తారు. ఇప్పపువ్వుసారా లేక బ్రాందితో పొట్టెలు మాంసం, కోడిగ్రుడ్లు తినిపిస్తారు. ఈ ప్రత్యేకమైన ఆహారాన్ని 'కురాకు (ఖురాక్)' అని కూడ పిలుస్తారు.

చాలా సందర్భాల్లో ఈ కూనీ పంచాయతుల్లో ఒకటి, రెండు పందులను కోసుకుని గాయపడినవాళ్ళకు తలకాయ యిచ్చి, కులస్థులంతా పోగులు (కుప్పలు) వేసుకుంటారు.

పంచాయతీ నాలైదు రోజులనుంచి వారం, పది రోజుల దాకా జరుగుతుంటుంది. గాయపడినవాళ్ళు ప్రతిరోజూ మధుమాంసాలను తెచ్చుకొని తిని తాగుతుంటారు. ఈ ఖర్చులన్నీ తప్పు తేలినవాడు భరించవలసి ఉంటుంది. కాబట్టి తాము తిన్నదానికి, తాగినదానికి సాక్ష్యం పెడతారు. తాము తింటున్నప్పుడు, తాగుతున్నప్పుడు ఒకరిద్దరు కులస్థులను పిలిచి వాళ్ళకు 'సారాపావు' ఇచ్చి సాక్ష్యం

పెడతారు. ఈ కులస్థులు కొట్లాటలో గాయపడ్డవాళ్ళు తిన్నది, తాగిందీ నిజమే నని, తాము చూశామని సాక్ష్యం చెబుతారు. వీళ్ళ సాక్ష్యంతో కాయానికి అయిన ఖర్చులన్నీ లెక్కకు వస్తాయి.

దెబ్బలు తిన్నవానిది తప్పేమీ లేనట్లయితే కొట్టినవాడు 'హకాం చేసి నాడ'ని, ఆ దెబ్బలన్నీ 'హకాం దెబ్బ'లని అంటారు. కులంలో ఖర్చయిన డబ్బుతోపాటు కాయంకు అయిన ఖర్చులు కూడ దౌర్జన్యపరునిమీద వేస్తారు. కొట్టిన దెబ్బలు మానటానికి ఎంత ఖర్చవుతుందో అంచనావేసి దెబ్బలుతిన్న వానికి కురాకుగా ఇప్పిస్తారు. ఉభయులకు దెబ్బలు తగినట్లయితే తదనుగుణంగా తీర్పు చెబుతారు.

**(3) రంకు పంచాయతులు :**

వీటిని 'లంజ పంచాయతులు' అని అంటారు. మగవాడు సాటి కులస్థుని భార్యతో లేక పెళ్ళికాని యువతితో రంకు చేసినప్పుడు లేక ఆడది ఏ మగవాడి తోనో రంకుచేసినప్పుడు కులస్థుల దృష్టికివస్తే ఈ పంచాయతులు జరుగుతాయి.

గూడెంలోని ఆడ-మగ ఎవరేగాని రంకు చేయటం ఎవరికంట పడినా వెంటనే వాళ్ళు ఆ విషయాన్ని కులపెద్దకు చెప్పాలి. అతడు పంచాయతీ పెట్టిస్తాడు. తెలిసి చెప్పకపోయినట్లైతే కొంతకాలానికి రంకు బయటపడి పంచాయతీ జరిగినప్పుడు ఈ చెప్పనివాళ్ళకు కూడ తప్పులు, దండ్గలు విధిస్తారు.

లంజరికం బయటపడ్డ వెంటనే సంబంధిత వ్యక్తులు వాది ప్రతివాదులై ముచ్చిలికలు ఇచ్చుకుంటారు. ఒకటో, రెండో పందుల్ని తెచ్చి కోసుకొని కులమంతా ఆచారం ప్రకారం పాళ్ళు వేసుకుంటారు.

పంచాయతీలో కూర్చున్న పిదప సాక్ష్యాధారాలతో రుజువైతే ఆడ మగ ఇష్టాఇష్టాలనుబట్టి, పరిస్థితులనుబట్టి తీర్పు చెబుతారు. పెళ్ళయిన స్త్రీని 'మగనాలి పడుచు' అంటారు పెళ్ళికాని పిల్లను 'పుట్టింటిపిల్ల' అంటారు. మగనాలి పడుచు రంకు చేసినట్లయితే పంచాయతీలో ఎవరి తప్పులనుబట్టి వాళ్ళకు శిక్షలు వేసి ఆమెకు బుద్ధిచెప్పి మగనితో కాపురం చేయిస్తారు. ఒకవేళ మగనాలి పడుచు తన మొగుణ్ణి ఒల్లక రంకు మగణ్ణే కోరుకొని, అతడితోనే కాపురం చేస్తానని పట్టు

పట్టితే - తొలిమగడు పిల్లకు ఇచ్చిన కన్యాశుల్కంతో పాటు, పెళ్ళి ఖర్చులను కూడ అతనికి రంకు మగడు కట్టివ్వవలసి ఉంటుంది. ఆ డబ్బుతోపాటు కులం ఖర్చులు కూడ రంకుమగడే భరించాలి. పుట్టింటి పిల్లతో రంకాడిన సందర్భంలో రంకుమగడు బ్రహ్మచారి అయిన పక్షంలో పిల్ల తల్లిదండ్రులకు కన్యాశుల్కం ఇచ్చి కట్టుబాటు ప్రకారం పెళ్ళి చేసుకోవాలి. ఇంతకుముందే అతనికి భార్య ఉన్నట్లయితే పంచాయతీ ఖర్చులు భరించి, దండగ పెట్టాలి. ఇక ఆ పిల్లతో అతనికి ఎలాంటి సంబంధం ఉండదు. ఒకవేళ రెండవ భార్యగా ఆమె అంగీకరిస్తే కులపద్ధతి ప్రకారం తల్లిదండ్రులకు కన్యాశుల్కం యిచ్చి పెళ్ళిచేసుకోవాలి.

(4) **ఇతర పంచాయతులు :** ఈ విభాగంలో భార్యాభర్తల వివాదాలు, అన్నదమ్ముల తగాదాలు మొదలైన అనేక చిన్న చిన్న తగువులు చేరినా వీటిలో 1. వాదజగడాలు, 2. లావాదేవీలు, 3. మ్యాళాలు-పంపకాలు, 4. దయ్యాల పంచాయతులు ముఖ్యమైనవి.

(1) **వాద జగడాలు :** ఓర్వలేనితనంతో, ఒకరంటే ఒకరికి గిట్టనప్పుడు అనుకోకుండా స్పర్థలు వచ్చినప్పుడు - ఇంటి పక్కవాళ్ళతో లేక గూడెంలోని వాళ్ళతో ఆయా సందర్భాల్లో అమ్మలక్కలకు వచ్చే వివాదాలు. చిన్నపిల్లల దగ్గర వచ్చే కొట్లాటలు కూడ ఈ కోవలోకి వస్తాయి.

(2) **లావాదేవీలు :** అప్పు ఇచ్చిన దగ్గర, తీసుకున్న దగ్గర కూడ అనేకమైన పంచాయతులు జరుగుతుంటాయి.

(3) **మ్యాళాలు-పంపకాలు :** తందానా కథల భాగవతాలు ఆడటానికి, వీధి భాగవతాలు (యక్షగానాలు) ఆడటానికి, తోలుబొమ్మలాటలు ప్రదర్శించటానికి జట్లుగా ఏర్పడతారు. ఈ జట్టునే మ్యాళం (మేళం) అంటారు. ఈ ప్రదర్శనలుచేసి వీళ్ళు సంపాదించిన డబ్బులు, ధాన్యం, వస్త్రాలు, ఆవులు, మేకలు మొదలైనవి పంచుకోవటంలో సర్వసాధారణంగా వివాదాలు ఏర్పడుతుంటాయి. వీటిని పంచాయతుల ద్వారానే పరిష్కరించుకుంటారు. వేటచేసి తెచ్చుకున్న జంతువుల మాంసాలు పంచుకొనేటప్పుడు కూడ కొట్లాడుతుంటారు. పూర్వం ఎండ్రకాయ కొండు (ఎండ్రకాయ కొండు అంటే ఎండ్రకాయ వ్రేలు) దాచి పెట్టుకున్నందుకు ఏడు వందలు, ఎలుక తొంటి ఎక్కువగా తిన్నందుకు ఏడు వందల రూపాయల పంచాయతులు జరిగినాయట.

(4) **దయ్యాల పంచాయతులు :** మరణించిన తర్వాత మనిషి దయ్యం అవుతాడని బుడిగెజంగాలు ప్రగాఢంగా నమ్ముతారు. దయ్యమై ఇతర్లను బాధిస్తారని, ఇతర్లను చంపుకుపోతారని వీళ్ళ విశ్వాసం. గూడెంలో మనిషి మరణించిన తర్వాత ఎవరికి ఎలాంటి బాధ కలిగినా- అంటే కడుపునొచ్చినా, కాలునొచ్చినా ఏ అపాయం జరిగినా, కీడు జరిగినా - అది ఆ మనిషి దయ్యమయ్యి చేస్తున్నాడని భావిస్తారు. దయ్యం తాలూకు కుటుంబ పెద్దతో వివాదాలు పడుతుంటారు. ఆ వివాదాలను పంచాయతుల ద్వారా పరిష్కరించుకుంటారు. 'ప్రేతారాధన' శీర్షికలో ఇందుకు సంబంధించిన మరికొన్ని విషయాలను చూడవచ్చు.

**కొందరు న్యాయగాళ్ళు**

1. కీ. శే. దొక్క జానకిరాం - బాదెపల్లి - మహబూబ్‌నగర్ జిల్లా వాస్తవ్యుడు. వందలకొద్ది పంచాయతులు చేశాడు. 70 ఏళ్ళ వయసులో 1950 ప్రాంతంలో మరణించాడు.
2. కీ.శే. పొన్నకంటి గోవిందు - ఈయన జడ్చర్ల మండలం - మహబూబ్‌నగర్ జిల్లా 70 ఏళ్ళు జీవించి, 1967 ప్రాంతంలో మరణించాడు. ఈయన 'చేదు బీరకాయ' అనే పేరుతో ప్రసిద్ధి కెక్కాడు.
3. కీ.శే. పొవ్వాణం జమ్మిశెట్టి - బొల్లెపల్లి - నందనం - భువనగిరి మండలం నల్గొండ జిల్లా.
4. కీ.శే. ఇప్ప పెద్ద కన్నయ్య - ఇబ్రహీంపట్నం - రంగారెడ్డి జిల్లా.
5. కీ.శే. రాచూటి గురవయ్య - బూత్‌పూర్ - మహబూబ్‌నగర్ జిల్లా.
6. సిరిగిరి రామయ్య - 58 సంవత్సరాల వయస్సు - బాపూజీనగర్ - సికిందరాబాదు.
7. కప్పెరి గండయ్య - వయస్సు 65 సం॥ సంగారెడ్డి - మెదక్ జిల్లా.
8. వాంబ్రాసి సాయిలు - 56 సం॥ మెదక్.
9. ఊబిది గంగారాం - 55 సం॥ పిట్లం - నిజామాబాదు జిల్లా.
10. మాదెనం చంద్రయ్య - 48 సం॥ ఆర్మూర్ - ,,
11. చేకి చంద్రయ్య - 60 సం॥ ఎల్లారెడ్డి - ,,
12. పస్తం రామస్వామి - 48 సం॥ బ్రాహ్మండ్లపల్లి - నల్గొండ జిల్లా.

13. రేవెల్లె భిక్షపతి - 60 సం॥ ఇంద్రాల, నల్గొండ జిల్లా.
14. ఇనుగొండ బుగులయ్య - 55 సం॥ శీర్లవంచ, కరీంనగర్ జిల్లా.
15. మోటం మల్లయ్య - 55 సం॥ నేరేడుమెట్టు, రంగారెడ్డి జిల్లా.
16. మోతె ఎల్లప్ప - వయస్సు 50 సం॥ నంద్యాల, కర్నూలు జిల్లా.
17. కొండపల్లి ఈశ్వరయ్య - వయస్సు 60 సం॥ కర్నూలు జిల్లా.
18. సిరిగిరి నల్లమస్తాన్ - వయస్సు 62 సం॥ గంధశ్రీ, ఖమ్మం జిల్లా.
19. సిరిగిరి లక్ష్మీపతి - వయస్సు 50 సం॥ ఖమ్మం జిల్లా.
20. నరికూటి సుబ్బయ్య - వయస్సు 52 సం॥ దాట్ల, వరంగల్ జిల్లా.
21. తూర్పాటి పినవీరయ్య - 64 సం॥ ఎన్మామ్ల, వరంగల్
22. భూతం అబ్బయ్య - వయసు 48 సం॥ పినకడియం, ఏలూరు- పశ్చిమ గోదావరి జిల్లా.
23. పంచాది వెంకన్న - వయసు 58 సం॥ పిఠాపురం - తూ. గోదావరి జిల్లా.

**కొన్ని ఉదాహరణలు (కుల పంచాయతులు) :**

**1. నల్లా వాళ్ళ పంచాయతి :** ఇది రామన్నపేట మండలంలోని మునిపంపుల గ్రామ వాస్తవ్యులైన నల్లా సోదరులు సీతారాములు, యాదగిరి, లక్ష్మయ్య అనువాళ్ళకు, కల్లెం నర్సింహకు మధ్య 1984 లో జరిగిన పంచాయతి. ఇంటిపేరుకు సంబంధించిన వివాదం. 'నల్ల' ఇంటిపేరును 'నన్నపండ్ల' అని పిలుస్తున్నందుకు వచ్చిన తగాదా. ఈ పంచాయతి దాదాపు సంవత్సరంపాటు కొనసాగింది. ఎన్నోసార్లు తీర్పు చెప్పబడింది. తీర్పు జరిగిన ప్రతిసారి తమకా తీర్పు ఒప్పలేదంటూ వాదో - ప్రతివాదో అభ్యంతరం చెప్పి అనేక పర్యాయాలు పంచాయతి ఆడారు. చివరిసారిగా ఈ పంచాయతికి నల్గొండ, రంగారెడ్డి, హైదరాబాదు, వరంగల్, కరీంనగర్ జిల్లాలోని 30 వివిధ గ్రామాలనుంచి 120 మంది న్యాయగాళ్లు వచ్చి తీర్మానం చేశారట.

**2. 'ఇల్లాలి కోసం ఇద్దరు మొగుళ్ళ తయ్యాలు' :** ఈ శీర్షికతో 31 ఆగస్టు 1988 నాడు ఉదయంలో వచ్చిన ఈవార్త, వరంగల్ జిల్లా బచ్చన్నపేట మండలంలోని ఆలంపూర్ గ్రామనివాసి సిరువాటి ఐలయ్య భార్య పంచాయతికి సంబంధించింది. ఐలయ్య భార్యపేరు లింగమ్మ. వీరికి నల్గురు పిల్లలు. అయితే 13 ఏళ్ళ క్రితం వానరాశి చంద్రయ్య అనే ఆయన లింగమ్మను పెళ్ళి

చేసుకొని, సరిపడక విడాకులిచ్చాడు. తర్వాత ఆమెను ఐలయ్య పెళ్ళి చేసుకున్నాడు. ఇప్పుడు చంద్రయ్య లింగమ్మ కలుసుకుంటున్నారని, వారిద్దరిమధ్య అక్రమ సంబంధం ఉన్నదని వివాదం చెలరేగింది. ఈ కులపంచాయతి లక్సెట్టిపేట, మంచిర్యాల, గోకర్‌పల్లి, బచ్చన్నపేటలో అనేక పర్యాయాలు జరిగి, చివరికి పరిష్కారం చేయబడింది.

## 8. పండుగలు

బుడిగె జంగాలు భిక్షాటన చేసేవారు కాబట్టి, పండుగలనాడు అడుక్కొని తినటమే కాని, ఇళ్ళల్లో పండుగ చేసుకోవటం ఉండదు. సంవత్సరానికోసారి 'పోశమ్మ' బోనాలు చేసుకోవటమే వీరికి పెద్ద పండుగ. ఇంటి దేవతకు మొక్కిన రోజుకూడ పండగనే.[1]

కొత్త ధాన్యం వచ్చినపుడు గ్రామీణులు 'కొత్త పెట్టుకోవటం' అనే పండుగను చేసుకుంటారు. బుడిగె జంగాలు కొత్త గింజలు వచ్చినప్పుడు మూడు చేరెళ్ళ గింజలు తీసి ఇంటిదేవతకు ముడుపు కడతారు పంటల కోతలన్నీ ముగిశాక ముడుపుకట్టిన గింజలను, సరిపడే ధాన్యంలో కలిపి, బియ్యం పట్టించి, ఆ రోజు పండుగ చేసుకుంటారు. ఇంటి దేవతను ఆరాధిస్తారు. కోడిని బలియిచ్చి, కొబ్బరికాయ బోనంతో కొలుస్తారు. ఈ పండగకు కూతుళ్ళను, అల్లుళ్ళను పిలుచుకుంటారు. కల్లు సారాలతో విందు చేసుకుంటారు.

సంక్రాంతిని కీడు పండుగగా భావిస్తారు. సంక్రాంతి రోజున 'బెల్లంబువ్వ' వండుకొని తింటారు. మరునాడు శికారి (వేట) కి వెళ్ళి, అడవి జంతువులను పట్టుకొచ్చుకొని విందు చేసుకుంటారు. సంక్రాంతి, ఉగాది, దసరా పండుగలకు ముందురోజున పందిని చంపుకొని పోగులు వేసుకుంటారు. అదే వారికి పండుగ సంబరం.

శెంద్ర[2]కు వెళ్ళేనాటి ముందురోజున గాని, శెంద్ర నుంచి తిరిగివచ్చిన మరునాడుగాని, మేళంగా ఏర్పడి కళా ప్రదర్శనలకు బయలుదేరే ముందురోజు

---

1. చూడు. ఇదే ప్రకరణంలోని 'ఆరాధనాపద్ధతులు'లో 'దేవతారాధన.'
2. దేశాటనం (వలస).

గాని, తిరిగివచ్చిన మరునాడుగాని పందిని చంపుకొని విందు చేసుకోవటం వీరికి ఆనవాయితీ. ఊళ్ళో పిచ్చికుక్క తిరిగిన సందర్భంలో తమ వేటకుక్కలను ఊరికుక్కలు కరవటం వల్ల - దానికి విరుగుడుగా పందిని చంపుకొని కుక్కలకు కూడ పెట్టి, వారు తింటారు. పిచ్చికుక్క కాటుకు పంది మాంసాన్ని, రక్తాన్ని విరుగుడుగా భావిస్తారు. పందిని చంపుకోవటాన్ని వీరు 'జీవాన్ని కొట్టుకోవటం' అంటారు. 'జీవం' అంటే 'జంతువు' అని అర్థం.

ఇప్పుడిప్పుడు పట్నాల్లో, నగరాల్లో స్థిరనివాసాలు ఏర్పరచుకుంటున్న బుడిగె జంగాల్లో పండుగలు జరుపుకునే తీరులో మార్పులు కనిపిస్తున్నాయి.

## 9. నమ్మకాలు

నమ్మకాలు అనేక రకాలు. 'జిహ్వాకోరుచి పుర్రెకోబుద్ధి' అన్నట్లు రక రకాల మనస్తత్వాల వారికి రకరకాలైన నమ్మకాలు ఉంటాయి. నమ్మకాలు వ్యక్తిగత విలక్షణాన్ని కలిగి ఉన్నప్పటికీ కొన్ని జాతులకు, తెగలకు సంప్ర దాయంగా వస్తున్న సామూహిక విశ్వాసాలు కూడ ఉంటాయి. జానపదుల నమ్మకాల్లో మూఢ నమ్మకాలే ఎక్కువైనా ఆరోగ్య విషయ నిక్షిప్తాలు, ఆచార ప్రదర్శనాలు కూడ కనిపిస్తాయి. కులదేవతారాధనా పద్ధతిలో తినకూడని వస్తు వులనీ. చంపకూడని జంతువులనీ ఎన్నో నమ్మకాలను ఏర్పరచుకుంటారు. నమ్మకాలు, శకునాలు, ఆంక్షల రూపంలో తరతరాలుగా ఆచరింపబడుతూ వస్తున్నాయి.

తెలుగు సాహిత్యంలో వివిధ విశ్వాసాల ప్రస్తావన మహాభారతం మొదలు కొని అన్ని యుగాల్లోని కావ్యాల్లోనూ దర్శనమిస్తుంది. నమ్మకాల పుట్టుపూర్వోత్త రాలను, స్వభావాన్ని, విభాగాలను చర్చిస్తూ డా. ఆర్.వి.ఎస్. సుందరంగారు 151 నమ్మకాల పట్టికను ఉదాహరించారు.[1] డా. మసన చెన్నప్పగారు 'విశ్వా సాలు, శకునాలు' శీర్షికల క్రింద కొంత చర్చించారు.[2]

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుటలు. 256 - 274.
2. ప్రాచీన కావ్యాలు - గ్రామీణ జీవన చిత్రణ - పుటలు 269 - 282.

జానపద సాహిత్యంలో నమ్మకాలకు సంబంధించిన గేయా లనేకం. ఈ కింది గేయంలో ఆంశల రూపంలో ఉన్న నమ్మకాలను చూడవచ్చు.

"రోటి కాడ చిట్టును తొక్క వద్దన్న
సందె కాడ దీపంబు పెట్టేటి వేళ - సప్పుడు కాకుండ పెట్టి రమ్మన్న
మాపుకాడ దీపంబు మలిపెటప్పుడు - మళ్ళి చూడకుండ మలిపిరమ్మన్న."[1]

శకునాలు కూడ నమ్మకాల ఆధారంగా ఏర్పడ్డవే. పల్లె ప్రజలు కాకి శకునాన్ని తప్పకుండ పాటిస్తారు. పెరట్లో కాకి కూస్తే చుట్టాలొస్తారని వాడుక. ఒక పల్లెపడుచు కన్నవారి రాకకోసం కాకమ్మని కూయమని బ్రతిమాలటం ఈ కింది గేయంలో కనిపిస్తున్నది.

"కాకమ్మ నీ కాల కట్టేను గజ్జె - రత్నాల మా వార్ని రాగుయ్యేకాకి
కాకమ్మ కూతలు కల్లలూ గావు - కన్నవారొచ్చేటి వేళలూ గావు
కాకమ్మా కాకమ్మా - చుట్టాలొచ్చారు చూచిపో
పక్కాలొచ్చారు పారిపో - నీ కాళ్ళకు గజ్జెలు కడతా
కాలు తీసి ఖంగున గంతెయ్యి"[2] అంటూ ఆ పల్లెపడుచు కాకమ్మ కూత మీద సంపూర్ణమైన విశ్వాసాన్ని వ్యక్తం చేస్తుంది.

ఈ కింది గేయంలో ఇతర పక్షుల కూతలను కూడ శకునంగా పరిగణించటం కనిపిస్తుంది.

కట్టమీద కంజు గూసే - పుట్టమీద పుంజుగూసే
రామలక్ష్మణ బండలమీద - సీత్వ[3]పలుకులు పలికినదమ్మ[4]

అత్తవారింటికి వెళ్ళటం ఇష్టపడని ఒక యువతి తుమ్మటం, కుమ్మరి పచ్చి కుండలతో ఎదురు రావటం, జంగంపిల్లి ఎదురు రావటం, చాకలి పచ్చి బట్టలతో

---

1. మిన్నేరు - పుట. 182.
2. మిన్నేరు - పుట 183.
3. తీతువు పిట్ట.
4. పాడినవారు: తూర్పాటి నాగమ్మ (60 సం॥) శాబ్దిపూర్, కామారెడ్డి (4-12-1985).

ఎదురు రావటం మొదలైన శకునాలు జరిగితే బాగుంటుందని, ఇక తాను తల్లి గారింట్లోనే ఉండవచ్చని భావించటం ఈ కింది గేయంలో వర్ణించబడింది.

"అమ్మా! నేను చిన్నదాన్ని అల్లుడొాస్తె అంపబోకు
ఢిల్లీ కోట సల్లగుంటె దినానికి టంకం తెస్తా
సద్దిగట్ట గుడ్డలేదు సాగనంప పొద్దెలేదు
ఇరుగు పొరుగు అక్కల్లారా! ఒక్కటే తుమ్మ అ........చ్ఛీ
మా యత్త మా యత్త మా యత్తగారు
నన్ను దోలుకపోవచ్చినారు
ఊళ్లో ఉన్న ఓ కుమ్మరన్నా! పచ్చికుండలు ఎదురుగా తెమ్మీ!
ఊరు తిరిగే ఓ జంగుపిల్లీ! దోవకడ్డం నువ్వన్న రావే!
గూడెంలోనున్న ఓ చాకలన్నా! పచ్చిబట్టలు ఎదురుంగ తేరా!
వాడనున్నా ఓ యక్కలారా! ఒక్క తుమ్మునన్న తుమ్మంగ రారే!"[1]

అంటూ ఏదో ఒక శకునం జరిగితే తల్లిగారింట్లోనే ఉండిపోవచ్చనే ఆమె ఆరాటం ఈ గేయంలో కనిపిస్తున్నది. ఈ విధంగానే జానపద గేయాల్లో విశ్వాసాలకు, శకునాలకు సంబంధించిన పెక్కు గేయాలు చోటు చేసుకున్నాయి.

గ్రామీణుల్లో ఉన్న ఎన్నో నమ్మకాలు బుడిగె జంగాల్లోనూ ఉన్నాయి. వాటికితోడు వీరి తెగకు ప్రత్యేకమైన కొన్ని నమ్మకాలుకూడ కనిపిస్తాయి. వీరిలో ఆచరణలో ఉన్న కొన్ని నమ్మకాలను ఈ కింద చూపుతున్నాను.

1. పురుడైన ఇంటికి భూతప్రేతాలు వస్తాయి. అందుకే గుడిసె చుట్టూ మంత్రించిన బూడిదతో పొత్తి కడితే (రక్షాభసితరేఖను ఉంచితే) భూత ప్రేతాలు రావు.
2. గడప వద్ద కొడవలిగాని, కత్తిగాని వేస్తే లోనికి దయ్యాలు రావు.
3. సమర్త అయినవారిని కూర్చోబెట్టిన గుడిసెను కాల్చివేస్తే భూతాల పీడ వదులుతుంది
4 పెళ్ళిలో వరుణ్ణి భూతాలు ఆవహించకుండ నడుముకు కమ్మకత్తి దోపుతారు.

1. మిన్నేరు - పుట. 181.

5. ఖననం చేసిన నాటి రాత్రివెళ్ళి బొంద వద్ద మంట వేస్తే, చనిపోయిన వారు దయ్యం కారు.
6. చనిపోయిన వాని కంట్లో సూదులు గుచ్చినా లేక సున్నం పెట్టినా దయ్యం కాడు.
7. నిండు చూలాలు, బాలెంత, రోగిష్టి, పిసినారి చనిపోతే తప్పకుండా దయ్యం అవుతారు.
8. దయ్యం పట్టిన వారికి కడుపులో పిసికినట్లు, గుండె గుంజినట్లు అవుతుంది.
9. పందులో, మేకలో, కోళ్ళో బలి యిస్తే దయ్యం శాంతించి వదలి పెడుతుంది.
10. ఒక బిరాళ్లో (బుడిగె జంగాల గూడెంలో) ఎవరికైనా దయ్యం పట్టే, ఆ బిరాడు వారెవ్వరూ మరో బిరాడుకు వెళ్ళకూడదు. అలా వెళితే, దయ్యం వారి వెంటనే వస్తుంది.
11. పాము మంత్రం వేసేవాళ్ళు భోజనం చేస్తున్నప్పుడు ఎవ్వరైనా నాగన్న, నాగమ్మ, పాపయ్య, పాపమ్మ, పాము, తేలు అనే మాటలు అంటే వెంటనే భోజనం వదిలేసి చెయ్యి కడుక్కుంటారు.
12. ఫలానా వాళ్ళకు పాము కరిచిందని చెప్పినవాళ్ళను పాము మంత్రగాడు వెంటనే చెంపదెబ్బ కొడతాడు. ఇతణ్ణి ఇక్కడ చెంపదెబ్బ కొడితే, అక్కడ పాము కరిచినవానికి విషం తగ్గుతుంది.
13 మంత్రగాళ్ళు, శివసత్తులు తద్దినాలు, రజస్వల, పురుడు మొదలైన సందర్భాల్లో ఏర్పాటు చేసే భోజనాలను తినరు.
14 కుల పంచాయతుల సందర్భంలో తప్పు చేయనివారు కాగుతున్న నూనె బాణలి దేవినా చెయ్యి కాలదు. తప్పు చేసిన వారి చెయ్యి మాత్రమే కాలుతుంది.
15. జోలె, చీపురుకట్ట, రోలు, రోకలి, చేటలను కాలితో తన్నరాదు. కాలు తగిలితే వెంటనే మొక్కాలి.
16. అన్నానికి పట్టిన ఎర్రచీమలను అలాగే తింటే కళ్లు బాగా కనిపిస్తాయి.
17. ఉసులు పట్టు (మెడ నరాలు లాగి పట్టినప్పుడు) తొలి చూలు సంతానం ఉదయం, సాయంత్రం ఎడమకాలితో దిగదుడిస్తే తగ్గుతుంది.
18 ఎవరికైనా ఏదైనా ఇస్తానని ఆశ పెట్టి ఇవ్వకపోతే కంటికి కురుపులు అవుతాయి. వీటిని 'ఆశ కురుపులు' అంటారు. అందరికీ పప్పు బెల్లాలు పంచితే ఆశకురుపులు పోతాయి.

19. ఏదు (ముళ్ళ పంది) కొయ్యలు తెచ్చి ఆ ఇంటి చూరులో ఒకటి, ఈ ఇంటి చూరులో ఒకటి జొనిపి ఉంచితే ఆ రెండిళ్ళ వారికి మధ్య తరచుగా కయ్యాలు జరుగుతుంటాయి.

20. కొల్లు పూడ్చేటప్పుడు మాయి ముంతను సక్రమంగా పెట్టకుండా వంకరటింకరగా పెట్టినట్లైతే శిశువు పాలు కక్కుకుంటుంది.

**శకునాలు :**

అశుభాలు :-

1. తుమ్మితే
2. నాగుపాము, జెర్రిపోతు అడ్డమైతే
3. కుమ్మరి కొత్తకుండలతో అడ్డమైతే
4. నక్కకూత వినిపిస్తే
5. బ్రాహ్మణుడుగాని, బ్రాహ్మణ వితంతువుగాని ఎదురుగా వస్తే
6. వెంట్రుకలు విరబోసుకొని ఏడుస్తూ ఎవరైనా స్త్రీ ఎదురుగా వస్తే
7. తుపాకి చప్పుడు వినిపిస్తే
8. పార, గడ్డపారతో ఎవరైనా ఎదురైతే
9. శవసంస్కారంచేసి శ్మశానం నుంచి వస్తున్న జనం ఎదురైతే
10. చాకలి ఉతికిన బట్టలమూటతో ఎదురొస్తే
11. ఉడుము అడ్డమైతే

శుభాలు :-

1. పొడె ఎదురైతే
2. చాకలి మైలబట్టలతో ఎదురైతే
3. నక్క అడ్డమైతే
4. దారిలో ఎదురువడిన ఉడుమును చంపుకొనిపోతే

**శకునోపచారాలు :-**

1. వీరి సంచార జీవనంలో ఒక ఊరినుంచి మరో ఊరికి వెళ్ళేటప్పుడు నాగుపాము గాని, జెర్రిపోతుగాని, కొత్తకుండలు గాని అడ్డమైతే, పోదలుచుకున్న ఊరికి కాకుండ దిక్కు మార్చి మరో ఊరికి వెళ్తే శుభమౌతుంది.

2. రాత్రి నక్కకూత వినిపిస్తే, తెల్లవారుజామున లేచి గుడిసెల్లో చాట కొడతారు. ఇలా చాటకొట్టటం వల్ల నక్కకూత వల్ల కలిగే అశుభానికి మారుగా శుభం కలుగుతుంది.
3. ఉడుము ఎదురైతే అశుభం. దాన్ని చంపుకొని వెళ్తే శుభం.
4. 'తుమ్ముకొక్క గడియ' అని, తుమ్మితే ప్రయాణం ఆరోజుకు ఆపుకొని మరునాడు బయలుదేరుతారు. అత్యవసరమైతే కొంతసేపు కూర్చొని బీడి గాని, చొంగగాని తాగాక ప్రయాణం ప్రారంభిస్తారు.

ఈ విధంగానే బుడిగె జంగాల్లో అనేక విశ్వాసాలు ఆచరింపబడు తున్నాయి. ఆంశల రూపంలో, శకునాల పేరుతో అంధ విశ్వాసాలెన్నో తర తరాలుగా వస్తున్నాయి. మచ్చుకు కొన్ని పైన వివరించటం జరిగింది.

## 10. ఇంటిపేర్లు

'ఆడవాళ్లకు రెండు, మగవాళ్ళకు ఒకటి' అనే పొడుపు కథకు విడుపు 'ఇంటిపేర్లు.' 'ఇంటిపేరు కస్తూరివారు, ఇంట్లో గబ్బిలాల కంపు', 'ఇంటిపేరు క్షీరసాగరం వారు, ఇంట్లో మజ్జిగ చుక్కకు గతిలేదు' అనే సామెతలు ఇంటి పేరుకూ, ఇంటి పరిస్థితికీ చుక్కెదురు అని చెప్పటానికి ఏర్పడ్డవే. 'పేరుగొప్ప కాని ఊరు దిబ్బ' అనే అర్థంలో ఈ సామెతలు స్థిరపడ్డాయి.

పుట్టిన ప్రతివారికి తల్లిదండ్రుల లేదా పెద్దల అభిరుచినిబట్టి పేరు పెట్ట బడుతుంది. షోడశ కర్మల్లో నామకరణం ఒకటి. వ్యక్తికి పేరుపెట్టటం వల్ల అతని అస్తిత్వాన్ని గుర్తించినట్లవుతుంది. వ్యక్తుల పేర్లు అనేక రకాలుగా ఏర్పడు తుంటాయి. ముద్దుపేర్లు, పొట్టిపేర్లు, పెట్టుడుపేర్లు, మార్చుకున్న పేర్లు, బిరుద నామాలు, సంకేతనామాలు ఇత్యాదిగా పేర్లు వ్యవహారంలో కనిపిస్తాయి.

మానవుని అస్తిత్వానికి వ్యక్తిపేరు ఉన్నట్లే, సమాజంలో కుటుంబం అస్తిత్వానికి ఇంటిపేరు తప్పని సరి. సమాజంలో కుటుంబం అతి చిన్న విభాగం. ఒక కుటుంబం పెరిగి పెరిగి అనేక కుటుంబాలుగా వృద్ధి పొందుతుంది. అలా ఏర్పడిన కుటుంబాలన్నీ ఒకే వంశంకిందకి వస్తాయి. ఆ వంశంలోని కుటుం బాలవారికంతా ఒకే ఇంటిపేరు ఉంటుంది. ఆ వంశానికి మూలపురుషుడిపేరే

గోత్రనామంగా ఉంటుంది. కాలక్రమేణా అనేక కారణాలవల్ల ఇంటిపేరు మారినా గోత్రనామం మాత్రం మారకుండా ఉంటుంది.

తెలుగు వారి యింటిపేర్ల మీద పరిశోధన చేసిన డా. తేళ్ళ సత్యవతిగారు ఇంటిపేరును ఈ విధంగా నిర్వచించారు: "మానవ సమాజం అనేక వ్యక్తుల, అనేక కుటుంబాల సమూహం. ఈ సమాజంలో కుటుంబం ఒక ప్రాథమికమైన ఘటకం. ఒక కుటుంబాన్ని ఒక సమూహం నుండి గాని, ఇతర కుటుంబాల నుండి గాని వేరు చేసేదే కుటుంబ నామం - ఇది గృహనామంతో వాడుకపడి ఉంటుంది. సమాజంలోని వ్యక్తులను వ్యక్తిగతంగా గుర్తించడానికి ఇంటి పేరు అవసరం ఎంతైనా ఉంది."1

మానవుని జీవనగతికి నవనవోన్మేషమైన ఉత్సాహాన్ని, ఊపిరిని, జీవితం పట్ల ఆసక్తిని, ఆకర్షణను 'నా' అనే భావన కలిగిస్తుంది. 'నా' అనే విత్తునుంచి పుట్టిన మధురబంధాలతో కట్టివేయబడ్డ పరిమితమైన వ్యక్తుల సమూహమే కుటుంబం. పరస్పర అపేక్ష, ఆత్మీయతలకు పరాకాష్ట కుటుంబ వ్యవస్థ. స్మృతుల్లో మోక్షసిద్ధికి పరమోత్కృష్టసాధనంగా చెప్పబడిన గార్హస్థ్యానికి కుటుంబమే ఆధారం. తరతరాల సంస్కృతికి వాహికగా, నవ్యసంస్కృతికి భూమికగా కుటుంబస్థానం బలపడింది. అలాంటి కుటుంబానికి ప్రత్యేకతను సంతరించి పెట్టేదే ఇంటిపేరు.

ఇంటిపేర్లు ప్రపంచమంతటా వ్యవహారంలో ఉన్నాయి. ఆంగ్లంలో ఇంటి పేరును సర్‌నేమ్ (Surname) అంటారు. పాశ్చాత్యుల్లో వ్యక్తిపేరులో మొదట తెగను సూచించే పదం, తర్వాత వ్యక్తి నామం, ఆ తర్వాత కుటుంబ నామం కనిపిస్తున్నది. ఉదా॥ గేయస్ జూలియస్ సీజర్. అంతేకాకుండా వ్యక్తి నామంలో తండ్రి పేరు చేర్చుకునే పద్ధతి కూడ ఉంది. ఉదా॥ హెన్రీ రాబర్ట్‌సన్. ప్రాచ్య దేశాల్లోని అరబ్బుల్లో వ్యక్తి నామాలైన అల్ బాగ్దాదీ, బెన్‌హర్, ఇబన్ అబ్బాస్ మొదలైన పేర్లలో అల్, బెన్, ఇబన్ అనేవి ఇంటిపేర్లు. చైనాలో జింగ్,టుంగ్, పాంగ్ మొదలైనవి ఇంటిపేర్లుగా కనిపిస్తాయి. జపాన్‌లోనూ యామ, సుకి,

1. తెలుగువారి ఇంటిపేర్లు - పుట 27.

ఇకె, ఓక మొదలైన వాటివల్ల ఇంటిపేర్ల సంప్రదాయం ఉన్నట్లు తెలుస్తున్నది. ఉత్తర భారతీయుల్లో చాలావరకు వృత్తి నామాలే ఇంటిపేర్లుగా ఉంటాయి. మొదట తండ్రిపేరు, తర్వాత వ్యక్తి నామం, ఆ తర్వాత ఇంటిపేరు ఉంటుంది. ఉదా॥ మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధి, దామోదర్ వినాయక సావర్కర్. తమిళంలో ఇంటిపేరుకు బదులుగా వ్యక్తి నామానికి ముందు తండ్రి పేరు ఉంటుంది. ఉదా॥ చంద్రశేఖర వెంకటరామన్, రామస్వామి వెంకటరామన్. కన్నడదేశంలో తెలుగువాళ్ళలాగే ఇంటిపేరు వ్యక్తి నామానికిముందు ఉంటుంది, ఉదా॥ కడకలు చెన్నప్ప మొదలైనవి.[1]

బ్రాహ్మణుల్లో ఇంటిపేర్లే కాకుండ గోత్రం, శాఖ, ప్రవర అనేవి ఉంటాయి. బ్రాహ్మణేతరుల్లో కొందరికి ఇంటిపేరుతోపాటు గోత్రనామంకూడా ఉంటుంది. కాని, ప్రవర శాఖాభేదాలు ఉండవు. హరిజన గిరిజన కులాల్లో గోత్రాలు ఉన్నట్లు కనిపించదు. గోత్రానికి బదులుగా సట్టం (చట్టం లేక గణం) అక్కడక్కడ కనిపిస్తుంది. వీళ్ళలో ఇంటిపేర్లు మాత్రం అందరికీ ఉంటాయి.

గోత్రం, ప్రవరలను ఈ కింది విధంగా నిర్వచించారు:

గోత్రం:- "గోత్రమనగా నొక శాఖకు మూలపురుషుడని కాని, ఋషికి చెందిన పుత్ర పౌత్రాది పరంపరయనికాని చెప్పవచ్చును."[2]

ప్రవర:- "గోత్ర గణము యొక్క మూలపురుషునితో సహా తన ఆత్మ బంధువులయు, సనాతన మహర్షులయు పేర్లను గలిపి తనను ఆ కుటుంబమునకు చెందినవాడనని చెప్పుకొనుట. ప్రవరయందు ఒకటి మొదలు ఏడ్గురు ఋషుల వరకు ఉందురు. 19 గురు ఋషులు చేరిన ప్రవర కూడ కలదు."[3]

ఈ రంగంలో జరిగిన పరిశోధనలను సమీక్షించి డా. తేళ్ళ సత్యవతి గారు వ్యవహారంలో ఉన్న తెలుగువారి ఇంటి పేర్లను 1. గ్రామనామసూచి, 2. వ్యక్తినామసూచి, 3. పౌరుష లేక బిరుదనామసూచి అని మూడు విధాలుగా విభజించారు. మూడవ విభాగంలో ఆయుధసూచి, కులసూచి, జంతుసూచి, వాద్యసూచి, వృక్షాలతాసూచి, వృత్తిసూచి, సంస్కృతిసూచి, ఇతరాలు అని విభజించి పరిశీలించారు.[4]

---

2. తెలుగువారి ఇంటిపేర్లు - 29-53.

2-3. విప్రుల ఇండ్లపేర్లు - శాఖలు - గోత్రాలు - పుట. 58.

4. తెలుగువారి ఇంటిపేర్లు.

(i) **బుడిగె జంగాల ఇంటి పేర్లు :**

పరిమితమైన బుడిగె జంగాల ఇంటి పేర్లను పరిశీలించినట్లయితే వాటిని ఈ కింది విధంగా విభజింపవచ్చు.

1. మత సంబంధ గృహనామాలు, 2. సంస్కృతి సంబంధ గృహ నామాలు, 3. గ్రామ నామ సంబంధ గృహనామాలు, 4. వృక్ష సంతతి సంబంధ గృహనామాలు 5. జంతు పక్షి సరీసృప సంబంధ గృహనామాలు, 6. ఆయుధ, అవయవ, ఆభరణ సంబంధ గృహనామాలు 7. ఇతరాలు.

(1) **మత సంబంధ గృహనామాలు :** వీరశైవ మతావలంబకులైన జంగాలే కాలక్రమేణా అనేక తెగలుగా చీలిపోయి ప్రత్యేకమైన కులాలుగా ఏర్ప డ్డారు. బుడిగె జంగాలు ఒక కులంగా ఏర్పడినా చాలాకాలం వరకు వీళ్ళు శైవులుగానే ఉన్నారు. మద్యమాంసాహారులైనప్పటికి శివభక్తి వీడలేదు. వీర శైవ జంగాలనుంచి విడివడిన కాలంలో వీళ్ళలో ఐదే ఇంటిపేర్ల వాళ్ళుండేవారని అనుశ్రుతంగా వస్తున్నది. అవి సిరిగిరి, విభూతి, ప్రసాదం, రుద్రాక్షల, కప్పెర అనేవి. తొలి దశలోనే ఏర్పడిన మత సంబంధ గృహనామాల్లో పర్వతం, ఒంటెద్దు, సంకు, దూపం, సిరిసాల, సిరివాటి ముఖ్యమైనవి.

(2) **సంస్కృతి సంబంధ గృహనామాలు :** కళలు సంస్కృతిలో భాగం. కవిత్వానికి సంబంధించిన రెండు ఇంటిపేర్లు వీళ్ళలో కనిపిస్తున్నాయి. అవి నిదానకవి, భారతకవి అనేవి. కళా ప్రదర్శన వల్ల ఏర్పడిన ఇంటిపేర్లలో చిత్తారి, బొమ్మిల (బొమ్మల) అనేవి కనిపిస్తున్నాయి. చిత్తారి (చిత్తరువు) ప్రాకృతంలో చిత్తఆర. సంస్కృతంలో చిత్రకార. ఇది చిత్ర ప్రదర్శన వల్ల ఏర్పడి ఉంటుంది. బొమ్మలాట ప్రదర్శన వల్ల 'బొమ్మల' ఏర్పడి ఉండవచ్చు.

సదుల (చదువుల), ఈర్ల (వీరుల - వీర్ల), ఈర్నాల (వీరణాల), కడ మంచి, కిన్నెర, ముగ్గు, పేర్ల పొవ్వాణం (పోహణ) మొదలైనవి సంస్కృతిలో పుట్టిన గృహనామాలుగా చెప్పుకోవచ్చు.

(3) **గ్రామనామ సంబంధ గృహనామాలు :** ఊరు, కల్లు, కొండ, గిరి, పల్లి, పాడు, ఏరు, గట్టు, సాల, చెర్ల మొదలైన పదాలు భౌగోళిక స్వరూపం ఆధారంగా ఏర్పడ్డాయి. ఇలాంటి పదాలు అనుబంధాలుగా లేదా పర పదాలుగా ఉన్న ఇంటిపేర్లు విరివిగా కనిపిస్తాయి.

ఊరు :- ఊరు మీద ఔపవిభక్తిక ఇకారం చేరిన 'ఊరి' పదం పర పదంగా ఉన్న ఇంటిపేర్లు: చెన్నూరి, దుద్దుకూరి, పెల్లూరి, రాసునూరి, రాసూరి (రాచూటి).

కంటి/గంటి : శిలార్థంలో ఉన్న 'కల్లు' మీద ఔపవిభక్తికం చేరి ఏర్పడిన రూపమే కంటి. పొన్నకంటి, కోడిగంటి.

కొండ/ గొండ : తాటికొండ, వినుకొండ, నిడుగొండ, నిండుగొండ.

గిరి : సిరిగిరి

పల్లి/వల్లి/పల్లె : కొండపల్లి, కొమాండ్లపల్లి, చర్లపల్లి, ఎదవల్లి, రేవల్లె

గట్టు : గట్టు + లు గట్లు ఔపవిభక్తికంచేరి గట్ల అవుతుంది. ఎదురుగట్ల.

మట్ట : మట్ట + లు మట్లు -మట్ల : జీడిమట్ల

పాడు : ఔపవిభక్తికరూపం 'పాటి' చేరిన ఇంటిపేర్లు:

కాన్పాటి, తూర్పాటి, బైల్పాటి, పాలపాటి

పాటి/ వాటి : సిరివాటి

ఏఱు (ఏటి) : ఆలేటి, పానేటి

చెర్ల : చెర్ల, శేజెర్ల

పఱ్ఱు > పర్తి > వర్తి : పఱ్ఱి (పఱ్ఱి), బోడపర్తి, ఎలవర్తి

సాల : సిరసాల

'మీది' పరపదంగా ఉన్న ఇంటిపేరు - పాటిమీది.

ఏక పదాలైన గ్రామనామ సంబంధ గృహనామాలలో కోండ్ర, మోతె, వేముల మొ॥ చేరుతాయి.

(4) **వృక్ష సంతతి సంబంధ గృహనామాలు :** ఈ విభాగంలో చెట్లు, మొక్కలు, దుంపలు, జిగురు, ఆకులు, కాయలు మొదలైన వృక్ష సంతతి ఆధారంగా ఏర్పడిన ఇంటిపేర్లు చేరుతాయి.

చెట్లు : ఇప్ప, గంధం, టేకి, మామిడి ఒద్ది, బల్గోల (బల్ + కోల - గట్టికర్ర).

మొక్కలు : కల్లెం, గంజాయి

దుంపలు : అల్లం

జిగురు : ఇంగువ

ఆకులు : వత్రి

కాయలు : పత్తి, మిరియాలు, రుద్రాక్షల

తోట, తోపు అనే అర్థంలో 'వనం' అనే ఇంటిపేరు కనిపిస్తుంది.

(5) **జంతువులు, పక్షులు, సరీసృప సంబంధ గృహనామాలు :**

జంతువులు: అశ్వ, ఒంటెద్దు, మ్యాకల (మేకల)

జంతు సంబంది: చల్ల (మజ్జిగ)

సరీసృపాలు: నాగుల

(6) **ఆయుధ, అవయవ, ఆభరణ సంబంధ గృహనామాలు :**

ఆయుధాలు:- కోదండం, వానరాసి (ఆనరాసి)

అవయవాలు:- గడ్డం, డొక్క, కప్పెర

ఆభరణాలు:- కడెం

(7) **ఇతరాలు :** గగనం, భూతం, మాదెనం, మోటం, కౌమారి, చెలిమండ్ల (సనమండ్ల), నరికూటి (నరికేటి), నూనె, కర్రె, ఉప్పు, గువ్వ మొదలైన ఇంటి పేర్లు ఈ విభాగంలో చేరుతాయి.

(ii) **ఇంటి పేర్ల వివరణ పట్టిక :**

ఈ వివరణ పట్టికలో అక్షరాదిక్రమంలో ఇంటి పేర్లు, సంబంధ వాచకం, వ్యాప్తి, అర్థం, విశేషాలు వరుసగా ఇవ్వబడ్డాయి.

1. అల్లం - వృక్ష సంబంధ సూచి - తెలంగాణా - దుంప.
2. అశ్వ - జంతుసూచి - మెదక్, రాయలసీమ (గుంతకల్లు), కర్నాటక.
3. ఆలేటి-గ్రామనామసూచి- తెలంగాణా-కాపుల్లో కూడ ఇంటి పేరు. 'ఆలేటి' కుటుంబాల్లో నల్గురైదుగురు అన్నదమ్ముల చొప్పున ఉంది, పక్షుల్లాగా గుంపులు గుంపులుగా నివసించటంవల్ల కులస్థులు వీళ్ళను 'ఆలేటి పిట్టలు' అని పిలుస్తుంటారు.
4. ఇంగువ - వృక్ష సంబంధ సూచి - సర్కారు ప్రాంతం.
5. ఇప్ప- వృక్షసూచి - తెలంగాణా - మధూకవృక్షం. ఇప్పపువ్వుతో 'సారా' తయారుచేస్తారు. రోజూ వెళ్ళి సారా కోసం ఇప్పపువ్వు తెచ్చుకొన మరిగి నందువల్ల ఈ పేరు వచ్చి ఉండవచ్చు.

6 ఈబుది - చూ. విభూతి.

7. ఈర్ల - రూపాంతరాలు (వీరుల - వీర్ల - ఈర్ల) - పౌరుషనామసూచి.

8. ఈర్నాల - (రూ వీరణాల) - బిరుదనామసూచి.

9. ఉప్పు - పౌరుషనామసూచి. సర్కారు-కమ్మల్లో, కరణాల్లో కూడ ఉంది.

10. ఊబిది - చూ. విభూతి.

11. ఊర - (ఊరు మీద ఔపవిభక్తిక రూపం) - గ్రామనామసూచి. తెలంగాణా - బుడిగె జంగాలు అనేక కుటుంబాలు కలిసి సంచారజీవనం చేస్తుంటారు. ఊరికి దూరంగా పిళ్ళ గూడెం ఉంటుంది. ఒక కుటుంబం వాళ్ళు ఊళ్ళోనే గుడిసె వేసుకొని, ఊరి ప్రజలతో కలిసిపోవటంవల్ల ఈ ఇంటిపేరు ఏర్పడింది. నల్గొండజిల్లా పోచంపల్లి ప్రాంతంలో ఈ కుటుంబం ఉంది.

12. ఎడవల్లి-గ్రామనామసూచి-బ్రాహ్మణుల్లో కూడ ఇంటిపేరు రాయలసీమ.

13. ఎదురుగట్ల - పర్వతసూచి - వెదుళ్ళ గట్టు.

14. ఎలమర్తి - గ్రామనామసూచి. రాయలసీమ (నంద్యాల).

15. ఒంటెద్దు - జంతుసూచి - ఒకటే ఎద్దు - సర్కారులో జంగం దేవర్లకు, తెలంగాణాలో గంగిరెద్దుల వాళ్ళకు కూడ ఈ ఇంటి పేరు ఉంది. సామూహికంగా కాక ఒంటి కుటుంబమే సంచారం చేస్తున్నప్పుడు కులస్థులు 'ఒంటెద్దు పోకడ' అనే అర్థంలో ఈ పేరుతో పిలిచి ఉండ వచ్చు. లేదా వాళ్ళ దగ్గర ఒకటే ఎద్దు పెంపుడు జంతువుగా ఉండటం వల్ల కూడ ఈ పేరు స్థిరపడి ఉండవచ్చు.
మెదక్‌లో ఈ కుటుంబం కనిపించింది.

16. ఒద్ది - ఒక జాతి చెట్టు - హైదరాబాదు.

17. కడెం (రూపా. కడియం) - ఆభరణ సూచి. గ్రామనామ సూచికూడ కంకణం. సర్కారు. తెలంగాణా వీరముష్టులలో ఇంటిపేరుగా ఉన్నది.

18. కడమంచి. బిరుదనామ సూచి. కులేతరుల్లో ఉన్న కట్టమంచి, కూచి మంచి, జనమంచి, శంకరమంచి లాంటిది. మంచి ప్రవర్తన కలిగి ఉండటం వల్ల ఈ పేరు వచ్చి ఉంటుంది. "మంచి - వరిపొలాల్లో కొద్ది ఎత్తుగా" పోసిన మట్టిదారి అని అర్థం' అంటూ డా॥ డి. సి. రెడ్డిగారు

వివరించారు.[1] 'కట్టమంచి' అనేది జలసూచకగృహ నామమని పేర్కొన్నారు. 'కడమంచి' ని గ్రామ సూచిగాకాక బిరుదనామ సూచిగానే చెప్పవచ్చు. (కొన్ని ప్రాంతాల్లో కదవంచి, కదకంచి అనికూడా వ్యవహరిస్తున్నారు.)

19. కట్టె - కడమంచి వాళ్ళలో ఒక చట్టం. 'కట్టెకడమంచి' అని. అన్నదమ్ములు ఎక్కువగా ఉన్న కడమంచి కుటుంబంలో తగాదాలు వచ్చినప్పుడు చీటికిమాటికి కట్టె అందుకొని కయ్యానికి కాలు దువ్వటం వల్ల ఈ చట్టానికి ఈ పేరు వచ్చింది.

20. కప్పెర - అవయవసూచి - సం. కర్పర - పుర్రె, భిక్షాపాత్ర. శివుడు భుజించే పాత్ర శైవుల ఇంటి పేరయింది. బుడిగె జంగాలకు మొదట ఐదే ఇంటి పేర్లుండేవట. ఆ ఐదింటిలో ఇదొకటి. రాయలసీమలో గొల్లవారి ఇంటిపేరుగా కూడ ఉంది.

21. కర్రె (కఱ్ఱె) నల్లని - వ్యక్తి శరీరం రంగునిబట్టి వచ్చినపేరు. నెమలికొండ - వరంగల్ జిల్లాలో ఈ కుటుంబం కనిపించింది.

22. కల్లెం - (కళ్లెం) ఖలీనం - గుర్రంనోటికి తగిలించి తిప్పే సాధనం. కాపుల ఇంటిపేరుగా కూడ ఉంది. వృక్షసూచికూడ.

23. కల్యాణం - శుభం, వివాహం - 'కల్లెం'కు బదులుగా సంస్కృతీకరించి, మార్చుకున్న ఇంటిపేరు.

24. కాన్పాటి - (కానుపాటి) - గ్రామనామసూచి.

25. కాళహస్తి - మతసంబంధ సూచి - రాయలసీమ, కర్నాటక.

26. కిన్నెర - వాద్య సూచి - ఒక జాతి వీణ. పండితారాధ్య చరిత్రలో శివభక్తుని ఇంటిపేరుగా పేర్కొనబడింది.

'కిన్నెర బ్రహ్మయ్య గ్రిక్కరించితివొ - కన్నడ బ్రహ్మయ్య కను మొరంగితివొ' (పుట 208).

'కిన్నెర బ్రహ్మయ్య కేశిరాజయ్య - కన్నడ బ్రహ్మయ్య గణదాసి శరణు' (పుట 243).

27. కొండపల్లి - గ్రామనామసూచి.

28. కొమాండ్ల పల్లి - గ్రామనామసూచి - తెలంగాణా.

---

1. చిత్తూరు జిల్లా గ్రామనామాలు : భాషా సామాజిక పరిశీలన. పుట. 87.

29. కొమారి - వ్యక్తినామ సూచి - కొమారి బిచ్చయ్య జహీరాబాదులో కౌన్సిలర్‌గా పనిచేశారు

30. కోంద్ర (రూ. కొంద్ర) - చుట్టుదున్నిన చాలుగల నడిమి మడి, పొలం గ్రామనామ సూచి. రాయలసీమ.

31. కోడిగంటి - గ్రామనామసూచి - తెలంగాణా.

32. కోదండం - ఆయుధ సూచి - ధనుస్సు - తెలంగాణా. రాయలసీమలో కులేతరుల్లో ఈ ఇంటిపేరు కనిపిస్తున్నది.

33. కోళ్ళ - పక్షిసూచి - కోడి బహువచన రూపం - హైదరాబాదు. కాపు, చాకలివాళ్ళ ఇంటిపేరుగా కూడ ఉంది.

34. గంజాయి-వృక్షసూచి-మత్తు కలిగించే ఒక మొక్క. వరంగల్, ఖమ్మం.

35. గంధం (రూ. గంధోటి) వృక్షసూచి. సువాసన - చందనపు చెక్క అరగదీయగావచ్చిన లేపన ద్రవ్యం వరంగల్, ఖమ్మం. చాకలి, బలిజ, వైశ్య, బ్రాహ్మణ కులాల్లో కూడా ఇంటిపేరు.

36. గగనం - పంచభూతాల్లో ఒకటి - ఆకాశం - జంగమదేవరల్లో కూడా ఇంటిపేరు.

37. గడ్డం - అవయవ సూచి - చిబుకం - బోయ, పద్మశాలీలలో ఇతర హరిజనకులాల్లో కూడా ఇంటిపేరు.

38. గానుగ - నూనెతీయు యంత్రం. సర్కారు ప్రాంతం. వృక్షసూచి కూడ (కానుగ చెట్టును సర్కారు ప్రాంతంలో గానుగచెట్టు అంటారు).

39. గుప్ప - నివాసస్థల సూచి - గుహ - హైదరాబాదు.

40. గోటూరి - గ్రామనామసూచి - తూ.గో.జిల్లా - సర్కారు.

41. చర్ల (చెరువు + లు - చెర్లు ఔపవిభక్తిం చేరి, చెర్ల) గ్రామనామసూచి. రేపూని - వరంగల్.

42. చర్లపల్లి - గ్రామనామసూచి - తెలంగాణా - సర్కారు.

43. చల్లా (రూ సల్లా) జంతు సంబంధ సూచి - మజ్జిగ. పల్లివాడ - నల్గొండ, శీర్లవంచ - కరీంనగర్. బ్రాహ్మణుల్లో, ఇతర హరిజనుల్లోనూ ఉంది.

44. చిటిముటి - వృక్షసూచి. ఎమ్మిగనూరు - రాయలసీమ.

45. చిత్తారి - (రూ. చింతల), సం. చిత్రకార - ప్రా. చిత్త అర - వృత్తి సూచి. చిత్రమ్ - చిత్తరువు - చిత్తారు - చిత్తారి - తెలంగాణా.

46. చెన్నూరి - గ్రామనామసూచి - వరంగల్, కరీంనగర్.
47. చెలిమండ్ల (రూ. సనమండ్ల) - తెలంగాణా.
48. జీడిమట్ల - గ్రామనామసూచి.
49. టేకి - వృక్షసూచి - తెలంగాణా.
50. డొక్క- అవయవసూచి - బిరుదనామం ఉదరం. రుద్రాక్షల ఇంటిపేరు వాడు పగటివేషాలు ప్రదర్శించేవాడట. అతడు పొడవాటి కత్తిని మింగి చూపే విద్యలో దిట్ట. ఒకసారి ప్రదర్శన యిస్తుండగా కత్తి తెగి డొక్కలో పేగులన్నీ బయటపడి మరణించాడు. అప్పటినుంచి వాళ్ళ ఇంటిపేరు 'డొక్క'గా వ్యవహారంలోకి వచ్చింది. బ్రాహ్మణుల్లో, మాల మాదిగల్లో కూడా ఈ ఇంటిపేరు ఉంది.
51. తాటికొండ - గ్రామనామసూచి - తెలంగాణా, రాయలసీమ.
52. తూర్పాటి - నివాసస్థల సూచి - తూర్పు + పాడు మీద ఔపవిభక్తిక రూపం చేరింది.
53. దుద్దుకూరి (రూ. దుద్దుర్కి) - గ్రామనామసూచి - తెలంగాణా.
54. ధూపం - వృక్షసూచి-సుగంధ ద్రవ్యాలనుంచి వచ్చేపొగ. రాయలసీమ.
55. నరికూటి (రూ. నర్కూటి) పౌరుషనామం - నరికేటి - దాట్ల - వరంగల్. కూడు ఔపవిభక్తికరూపం కూటి వరపదంగా చేరిన ఆరెకూటి, జొన్న కూటి, వట్టికూటి, వరికూటిలాంటి కులేతరుల ఇంటిపేర్ల వంటిది కాదిది.
56. నాగుల - నాగు (త్రాచు)కు బహువచనరూపం - సరీసృప సూచి. వీళ్ళ తొలి ఇంటిపేరు వానరాసి. నాగపూజ చేయటంవల్ల ఈ పేరు స్థిర పడిఉంటుంది.
57. నిడుగొండ (రూ.నిరుకొండ, నిండుగొండ) గ్రామనామసూచి - బ్రాహ్మ ణుల్లో కూడా ఇంటిపేరుగా ఉంది.
58. నిదానకవి - బిరుదనామసూచి - నిదానంగా కవిత్వం చెప్పటంవల్ల కలిగిన బిరుదనామమే ఇంటిపేరుగా మారిందట. హైద - రంగారెడ్డి - కర్నూలు, ఖమ్మం.
59. నూనె - తైలసూచి. కమ్మ, కోమట్లలో కూడా ఉంది.
60. పంచాది - వృత్తి సూచి. బుడిగె జంగాల్లో పంచాయతులు తీర్మానం చేయటంవల్ల కొందరు వృత్తి న్యాయగాళ్ళకు వచ్చిన పేరే ఇంటిపేరుగా మారుతున్నది. పంచాది ఎర్రన్న-భోగాపురం, పిఠాపురం-తూ.గో.జిల్లా.

61. పత్తి - వృక్షసంబంధ సూచి (రూ. ప్రత్తి) కమ్మ, కోమట్లు, పద్మశాలీల్లో, ఇతర హరిజన కులాల్లో ఇంటిపేరు.

62. పత్రి - వృక్షసంబంధ సూచి - పూజకు ఉపయోగించే బిల్వదళం మొదలైనవి. బ్రాహ్మణుల్లో, జంగందేవర్లలో కూడా ఇంటిపేరు.

63. పర్తం - (రూ. పర్వతం) చూ. పర్వతం.

64. పర్వతం - గిరిసూచి. వీరశైవ సంప్రదాయంలో పర్వతం అంటే శ్రీశైలం - అదే ఇంటిపేరుగా నిలిచింది.

65. పల్లె (రూ. పల్లి) - నివాస స్థలసూచి - బిద్ద, ముక్క.

66. పస్తం (రూ. ప్రసాదం) చూ. ప్రసాదం.

67. పాటిమీది - నివాస స్థల సూచి. హైదరాబాదు.

68. పానేటి - గ్రామనామసూచి - తెలంగాణా కాపు, గొల్ల, చాకలి, కంసాలి, బలిజ, మాల మొదలైన అనేక కులాల్లో ఇంటి పేరుగా కనిపిస్తున్నది (రాయలసీమలో).

69. పాలపాటి - గ్రామనామ సూచి - సర్కారు ప్రాంతం.

70. పెల్లూరి - గ్రామనామసూచి - తెలంగాణా, రాయలసీమ.

71. పేర్ల (రూ. ప్యార్ల) - ఆభరణ సూచి - బిరుదనామం. నామం, కీర్తి, హారం. సర్కారులలో కోమట్ల ఇంటి పేరుగా కూడా ఉంది.

72. పొన్నగంటి - గ్రామనామసూచి - తెలంగాణా.

73. పొవ్వాణం - బిరుద నామం - పోషణ శబ్దం నుంచి వచ్చి ఉంటుంది. పోహణ శబ్దానికి కూర్పు, నేర్పు, సామర్థ్యం అని అర్థాలు. పగటి వేషాలు వేయటం వీళ్ళ వృత్తి. ఆ ప్రదర్శనల్లో పొందిన పేరే ఇంటి పేరై ఉంటుంది. ఇందిరాల - నల్లగొండ జిల్లా.

74. ప్రసాదం (రూ. పస్తం). మతసూచి. శ్రీశైల మల్లికార్జునుని ప్రసాదం తేవటం వల్లనో, పంచటం వల్లనో ఈ పేరు కలిగింది. బుడిగె జంగాల తొలి ఐదు పేర్లలో ఇదొకటి. వీళ్ళలో గవ్వాల, డేర అనే రెండు చట్టాలు ఉన్నాయి.

75. బల్గొల (బల్ + కోల - బలమైన కర్ర) - వృక్షసూచి. మూడు వంకర్లతో అర్ధచంద్రాకారంలో ఉండే బుడ్గ జంగాల ఈత చాప గుడిసెలో వంకర్ల మీద వాడే అడ్డకర్ర. అంకోల (ఊడుగు) వృక్షపుకోల - నంద్యాల - రాయలసీమ.

76. బాజె - వృత్తి సూచి - కడమంచి వాళ్ళలో ఇదొక చట్టం - 'బాజెకడ మంచి' అని. కాషాయ వస్త్రాలు ధరించి, ఇత్తడి పళ్ళెంలో చిన్న చిన్న దేవతా విగ్రహాలు, పసుపు కుంకుమ పెట్టుకొని, వాటిపై వస్త్రం కప్పు కొని, గ్రామీణులకు జ్యోతిష్యం చెబుతూ, మంత్ర తంత్రాలు చేసే వృత్తిని 'బజా' పంతు అంటారు. కడమంచి ఇంటిపేరు ఉన్నవాళ్ళల్లో కొందరు ఈ వృత్తిని అవలంబిస్తారు. మొదటి ఇంటిపేరుకు 'బాజె' అనేది విశేషణంగా చేరి, క్రమంగా అదే ఇంటిపేరుగా స్థిరపడుతున్నది. తెలంగాణా ప్రాంతం.

77. బాదిగ - కూలి, అద్దె అర్థాల్లోవాడే 'బాడిగ'ను పోలిన పదం - రాయల సీమ. కర్నాటక.

78. బూతం (భూతం రూపాంతరం)-పినకడియం-ప. గో. జిల్లా, తెలంగాణా.

79. బైల్పాటి (బయలు + పాడు) - నివాసస్థల సూచి - వీరికి మొదట వాన రాని ఇంటిపేరుగా ఉండేది. తర్వాత ఈ ఇంటిపేరు స్థిరపడింది.

80. బొమ్మల (రూ బొమ్మిల). వృత్తి సూచి. బొమ్మలాట ప్రదర్శనవల్ల ఏర్పడిన ఇంటిపేరు. దాట్ల, వరంగల్ - ములంద (బొంబాయి), నాసిక్, మహారాష్ట్ర.

81. బోదపర్తి - గ్రామనామసూచి - సర్కారు ప్రాంతం.

82. బోదపట్ల - గ్రామనామ సూచి - సర్కారు.

83. భారతకవి (రూ. బార్తక్రె) - బిరుదనామం - భారత కథలను ప్రజా రంజకంగా చెప్పటం వల్ల ఈ పేరు వచ్చి ఉంటుంది.

84. మాదెన (మాదెనం) - వ్యక్తి నామ సూచి-హైదరాబాదు-నిజామాబాదు-ఖమ్మం.

85. మామిడి - వృక్షసూచి - మెదక్, కర్నాటక, ఆర్వేల నియోగులలో, తెలంగాణా రెడ్లలో కూడా ఈ ఇంటిపేరు కనిపిస్తున్నది.

86. మేకల (రూ. మ్యాకల)- జంతుసూచి. వానరాని వీళ్ళ తొలి ఇంటి పేరు. మేకలు పెంచినందువల్ల ఈ పేరొచ్చింది. కమ్మ, కాపు, గొల్ల, చెంచు, తొగట, యానాది, వెలమల్లో కూడా ఇది ఇంటిపేరుగా ఉంది.

87. మిరియాల - వృక్షసంబంధ సూచి - బ్రాహ్మణ, వైశ్య, కమ్మ, బలిజ, పద్మశాలీలలో కూడా ఇంటిపేరుగా ఉంది.

88. ముగ్గు - సంస్కృతి సూచి - రంగవల్లి-

1. శివరాత్రినాడు కొమరెల్లిలో మల్లన్న భ్రమరాంబల కల్యాణం జరుపుతారు. కల్యాణం జరిపించే చోటంతా శుభ్రపరిచి, అక్కడ రాత్రి పది గంటలనుంచి నలుగురైదురు భక్తులు రంగురంగుల ముగ్గులు వేస్తారు. ఈ విధంగా తెల్లవారు జామున 4 గం॥ వరకు రంగవల్లులు తీర్చి, తర్వాత ఆ ముగ్గులో మల్లన్న, భ్రమరాంబల పెళ్ళి జరిపిస్తారు. పెళ్ళి జరిగాక విగ్రహాలను గుళ్ళోకి తీసుకెళ్ళిన తర్వాత, అంతవరకు చుట్టూ గుమిగూడిన భక్తులు ఒక్కసారిగా ఆ ముగ్గులోకి దూకి ఆనందంగా ఎగురుతారు. తర్వాత ఆ ముగ్గును చేత్తో తీసుకొని భద్రపరచుకుంటారు. మళ్ళీ శివరాత్రి వచ్చేదాకా ఆ ముగ్గును ఇంట్లో జాగ్రతచేసి విభూతిగా ధరిస్తుంటారు. ఆ విభూతి ధరించినట్లయితే భూతప్రేత పిశాచాలు సోకవని నమ్ముతారు. క్రిక్కిరిసిన ఆ జనంలో ముగ్గులో దూకి, ముగ్గు తీసుకొని ఆ గుంపు నుంచి బయటపడటం సులభం కాదు. శక్తినంతా కూడగట్టుకొని చేయవలసిన పని.

2. ముగ్గులు వేయటం మంత్రశాస్త్రంలో ఒక భాగం. భూతవైద్యులు పిండి, పసుపు, కుంకుమలతో బీజాక్షరాలు కలిగిన యంత్రాలను ముగ్గులుగా వేసి మంత్రోపచారాలు చేస్తారు. బుడిగె జంగాలలో ప్రతిగూడెంలో ఒకరిద్దరు భూతవైద్యులు ఉండటం సర్వసాధారణం.

89. మోటం - మోట, కపిల.

90. మోటూరి - గ్రామనామ సూచి - సర్కారు

91. మోతు - (రూ. మోతుబరి) - బిరుదనామసూచి - సర్కారు.

92. మోతె - గ్రామనామ సూచి - వైశ్యుల్లో, బ్రాహ్మణుల్లో కూడా ఇంటిపేరుగా ఉంది.

93. రామూటి (రూ. రాసూరి) - గ్రామనామ సూచి - మహబూబ్‌నగర్ జిల్లా.

94. రాసునూరి - గ్రామనామసూచి - నల్గొండ - రంగారెడ్డి, హైదరాబాదు.

95. రుద్రాక్షల - వృక్ష సంబంధ సూచి - వీరశైవులు రుద్రాక్షమాలలు ధరిస్తారు. తొలి ఐదు ఇంటి పేర్లలో ఇదొకటి. కర్నాలలో, పద్మశాలీలలో కూడ కనిపిస్తుంది - రాయలసీమ.

96. రేవెల్లె (రూ. రేవెళ్లి) - గ్రామనామ సూచి - తెలంగాణా.
97. వనం - వృక్ష సంబంధ సూచి - గన్నవరం - కృష్ణాజిల్లా-సర్కారులో బ్రాహ్మణులలో కూడా ఇంటిపేరుగా ఉంది.
98. వానరాసి (రూ. ఆనరాసి, వాండ్రాసి) - వీళ్ళలో ఆవుల, బర్ల అని రెండు సట్టాలు ఉన్నాయి.
99. వినుకొండ - గ్రామనామ సూచి - తెలంగాణా ప్రాంతం.
100. విభూతి (రూ. ఈబుది, ఊబిది) - మతసూచి - శైవులు ధరించే భస్మం. తొలి ఐదు పేర్లలో ఒకటి.
101. వేముల - గ్రామనామసూచి - వేము (వేపచెట్టు) బహువచన రూపం. కల్వకుర్తి - మహబూబ్‌నగర్, నల్గొండ తెలంగాణా.
102. శేజర్ల - గ్రామనామ సూచి.
103. సంకు - (సంకుల) - సంస్కృతి సంబంధ సూచి-శంఖం - బాలసంతు వాడు. జంగం దేవర, భిక్షాటనలో శుభసూచకంగా ఊదేది. కొన్ని కులాల శవ సంస్కార, కర్మకాండల్లో జంగం, కాటిపాపల వాళ్ళు పూరించేది.
104 సదుల (రూ. చదువుల) - విద్యాసూచి - తెలంగాణా.
105. సావుకారి-(రూ షాహుకారి) బిరుదనామం - తెలంగాణా - షాహుకారిత్వం నెరపటంవల్ల వచ్చింది. కదమంచి ఇంటిపేరున్నవాళ్ళలో కొత్తగా ఏర్పడిన చట్టం. ఇంటిపేరైన 'కదమంచి'కి విశేషణంగా ఉండి (సావు కారి కదమంచి), రాను రాను ఇదే ఇంటిపేరుగా స్థిరపడుతున్నది.
106. సిరిగిరి - మత సంబంధ సూచి - శ్రీగిరి, శ్రీశైలం - మొట్టమొదటి ఐదు ఇంటి పేర్లలో ఇదొకటి.
107. సిరివాటి - మతసంబంధ సూచి - వాటి - చోటు, వాటిక - తోట, ఇండ్ల వరుస, చోటు, సిరివాటి(క) - పవిత్రమైన చోటు - శ్రీశైలం.
108. సిరిసాల - మతసంబంధ సూచి - శాల - సాల - గృహం, సదనం, ప్రాంగణం. సిరిసాల - పవిత్రమైన చోటు.
109. గంట - సంస్కృతి సంబంధ సూచి. బాలసంతువాడు, జంగంవాడు, కాటి పాపలవాడు భిక్షాటనలో, శవ సంస్కార సమయాల్లో ప్రయోగించేది. కోలారు జిల్లా - కర్నాటక.
110. తిరుపతి - తూర్పాటికి రూపాంతరం. చూడు - తూర్పాటి. కర్నాటక.

111. తిరుపాత - తూర్పాటికి రూపాంతరం.

112 పూజారి - వృత్తి సూచి. కుల పెద్దగా ఉండి ఆరాధనా సమయాల్లో పూజలు నిర్వహించటంవల్ల వచ్చిన పేరు. కోలారు జిల్లా - కర్నాటక.

113. మోడెం - మోటం రూపాంతరం. చూడు, మోటం. కోలారు జిల్లా కర్నాటక.

114. శూలం - ఆయుధ సూచి - శివాయుధం. కోలారు జిల్లా.

(iii) **సమీక్షణం :**

వ్యక్తి నామాలు సమాజంలో ఆయా వ్యక్తులను గుర్తించటానికి పని కొస్తాయి. వాటిని విశ్లేషిస్తే అంతర్లీనంగా ఉన్న సంస్కృతి, సంప్రదాయాలు, ఆయా కాలాల్లోని మానవుల జీవన విధానాలు స్పష్టపడతాయి. వ్యక్తి నామాల్లో ప్రధానంగా సంప్రదాయ ఆలోచనా విధానం తేట పడుతుంది. అంతేకాని, వ్యక్తి నామాల్లో ఆ పేరుకు తగిన అర్థానుకూల గుణగణాలుంటాయని చెప్పలేము. పేరు పెట్టినవాళ్ళ అభిరుచిని మాత్రమే వ్యక్తి నామాలు వ్యక్తం చేస్తాయి. గుణనిధి అని పేరున్నవాడు దుర్గుణనిధి కావచ్చు. నిగమశర్మ పేరుగలవాడు నేతి బీరకాయ కావచ్చు. తిక్కన్న, పోతనలాంటి పేరుగలవాళ్ళు ఆచంద్ర తారార్కమైన కీర్తిని గడింపవచ్చు. ఇంటిపేర్లు ఆ కుటుంబానికి సంబంధించిన అనేక విషయాలను తెలియజేసేవిగా ఉంటాయి. ఆ కుటుంబపు సంస్కృతిని తెలియజేస్తాయి. ఆ కుటుంబం జీవించిన పరిసరాలను, పరిస్థితులను పట్టి చూపుతాయి.

పై దృష్టితో చూసినట్లయితే బుడిగె జంగాల ఇంటిపేర్లలో సిరిగిరి, పర్వతం, విభూతి, ప్రసాదం, రుద్రాక్షల, కప్పెర, సంకు, సిరివాటి మొదలైన ఇంటిపేర్లు శివపారంపర్యాలు. కుల వాచకమైన జంగం శబ్దంతోపాటు ఈ ఇంటిపేర్లు కూడ ఒకప్పుడు వీళ్ళు వీరశైవ మతావలంబకులని నిర్ధారిస్తున్నాయి.

అశ్వ, ఒంటెద్దు, మేకలవంటి జంతువాచకాలు ఇంటిపేర్లుగా ఏర్పడటం వల్ల వీళ్ళు ఆయా జంతువుల్ని పెంచినట్లుగా చెప్పవచ్చు. బతుకుదెరువు కోసం ఒక ఊరినుంచి మరో ఊరికి వెళుతున్నప్పుడు సామాను మోయటానికి గుర్రాన్ని ఉపయోగించటం నేటికి ఉంది. తందానా కథలు, భాగవతాలు,

బొమ్మలాటలు, పగటివేషాలు తదితర జానపద కళల్ని ప్రదర్శించి ఆవుల్ని, మేకల్ని, గొర్రెల్ని దానంగా పుచ్చుకోవటం సర్వసాధారణం. పర్యవసానంగా వీళ్ళల్లో మేకలు, గొర్రెలు పెంచేవాళ్ళుకూడా ఎక్కువగానే కనిపిస్తారు.

వృక్షసంబంధ వాచకాలైన ఇంటిపేర్లు కులేతరుల్లో కూడ కనిపించగా 'యాపాకు' అనేది 'కదమంచి' వాళ్ళ చట్టంగా ఏర్పడింది. వేపచెట్టును పూజించే ఆచారం వీళ్ళకు ఉండటమే దీనికి కారణం

మొదట్లో వీళ్ళు సంచార జీవనులు. ఊరికి దూరంగా గుడిసెలు వేసుకొని నివసిస్తూ ఉంటారు. పొట్ట గడవటం కోసం దూరప్రాంతాలకు వలస వెళ్ళినా పంటకాలంలో మళ్ళీ పుట్టి పెరిగిన గ్రామ ప్రాంతాలకు రావటం తప్పదు. అందు వల్ల వీళ్ళ ఇంటిపేర్లలో గ్రామనామాలు కూడా చోటు చేసుకున్నాయి.

బుడిగె జంగాలు అనేక జానపద కళల్ని ప్రదర్శిస్తారు. రాను రాను అవే వాళ్ళ వృత్తులుగా పరిణమించాయి. వృత్తి సూచకాలు ఇంటిపేర్లుగా కూడ మారుతాయి. కాని అలాంటివి వీళ్ళలో తక్కువ. చిత్తరువు ప్రదర్శనవల్ల 'చిత్తారి,' బొమ్మలాట లాడటంవల్ల 'బొమ్మల,' ముగ్గులు వేయటంవల్ల 'ముగ్గు' మొదలైనవి ఈ కోవకు చెందుతాయి. నిదానంగా కవిత్వం చెప్పటంవల్ల 'నిదాన కవి', భారత కథాగానం చేయటంవల్ల 'భారతకవి,' మంచి ప్రవర్తనవల్ల కదమంచి, పేరుగాంచటంవల్ల 'పేర్ల,' కళా ప్రదర్శనలో ప్రోత్సహించటంవల్ల 'పొవ్వాణం' మొదలైన బిరుదనామాలు ఏర్పడ్డాయి. ఊర్ల (వీరుల - వీర్ల), ఊర్నాల (వీరణాల), నరికూటి (నరికేటి), డొక్క మొదలైనవి పౌరుష నామాలుగా స్థిరపడ్డాయి.

కులాంతర సంపర్కంవల్ల ఏర్పడిన ఇంటిపేర్లు వీళ్ళలో చాలా ఉన్నాయి, ఊర, ఎదురుగట్ల, ఒద్ది, కోళ్ళ, గుప్ప, చర్ల, పాటిమీది, పొన్నకంటి, మాదెన, మోటం, రాసునూరు మొదలైనవి ఈవిధంగా ఏర్పడ్డ ఇంటిపేర్లే.

బుడిగె జంగాలు రాష్ట్రమంతటా వ్యాపించి ఉండటమే కాకుండా కర్నాటక, మహారాష్ట్ర ప్రాంతాల్లో కూడ నివాసాలు ఏర్పరచుకున్నారు. తెలంగాణాలోనే కనిపించే ఇంటిపేర్లలో ఊర, ఒద్ది, కొమాండ్లపల్లి, కోళ్ళ, గుప్ప,

పాటిమీది, పొన్నకంటి, రాసునూరి మొదలైనవి ఉన్నాయి. కేవలం ఆంధ్ర ప్రాంతం (సర్కారు)లో కనిపించే ఇంటిపేర్లలో ఇంగువ, ఉప్పు, కడెం, మోతు, మోటూరి, గోటూరి, వనం, బోడపుత్రి, బోడపట్ల మొదలైనవి చెప్పుకో వచ్చు. రాయలసీమ ప్రాంతంలో దాదాపు తెలంగాణాలో ఉన్న ఇంటిపేర్లే ఉన్నాయి. కాళహస్తి, చిటిముటి, బాదిగ మొదలైనవి ఈ ప్రాంతానికి పరిమిత మైన ఇంటిపేర్లుగా చెప్పవచ్చు.

మహారాష్ట్రలో నాసిక్, షోలాపూర్ మొదలైనచోట్లలోనూ, బొంబాయిలోని ములంద్, వైల్‌పార్లే తదితర చోట్లలోనూ వలసవెళ్ళిన బుడగజంగాలు నివాసా లేర్పరచుకున్నారు. వీళ్ళంతా తెలంగాణాలోని మెదక్, కరీంనగర్, రంగారెడ్డి జిల్లాలవాళ్ళు. ఏలూరు దగ్గర వున్న పినకడియం నుంచి, వరంగల్‌లోని దాట్ల, కుమ్మరిగుంట్ల, రేపూని, అమ్మాపురం నుంచి కొందరు, ఖమ్మం జిల్లా గంధశ్రీ, మహదేవపురం (మదిరి తాలూకా) మొదలైన ప్రాంతాల నుంచి కొందరు బుడిగె జంగాలు వెళ్ళి బొంబాయిలోని శాంతాక్రుజ్ మొదలైన ప్రాంతాల్లో నివాసాలు ఏర్పరచుకున్నారు.

కర్నాటకలో దక్షిణ దిశగా రాయచూరు, బళ్లారి, గంగావతి, హొస్పేట, కోలారు తదితర ప్రాంతాలలోనూ, పశ్చిమంగా బీదరు, యాదగిరి మొదలైన ప్రాంతాల్లోనూ బుడిగె జంగాలు నివసిస్తున్నారు. వీళ్ళ మాతృభాష తెలుగే అయినా కన్నడంలో కథలు చెబుతారు. రాష్ట్ర, రాష్ట్రేతర బుడిగె జంగాల మధ్య సంబంధాలు కూడా కొనసాగుతున్నాయి. రాయలసీమవాళ్ళకూ, కర్నాటక వాళ్ళకూ మధ్య సంబంధాలు ఉండగా, తెలంగాణా - మహారాష్ట్రవాళ్ళకు మధ్య ఇచ్చిపుచ్చుకోవటాలు నడుస్తున్నాయి. రాష్ట్రేతర బుడిగె జంగాల ఇంటి పేర్లు అధికాధికంగా తెలంగాణా ప్రాంతానివే కనిపిస్తాయి.

ఇంటి పేర్లు, ఊర్ల పేర్లు పరస్పర జన్యజనకాలు. చాలావరకు వ్యక్తి నామాలనుబట్టి, కుటుంబ నామాలనుబట్టి గ్రామ నామాలు ఏర్పడినట్లే, గ్రామ నామాలనుబట్టి కుటుంబ నామాలు ఏర్పడుతుంటాయి. ఇంటిపేర్ల అధ్యయనంతో ఆసక్తిగొలుపే భాషా సామాజిక అంశాలెన్నో ఆవిష్కరించటానికి వీలున్నది.

# 11. వేట

ఆది మానవునికి వేట జీవనాధారం. మానవ పరిణామ చరిత్రలో అన్ని కాలాల్లోనూ మానవుడు వేటను విడనాడకుండ కొనసాగిస్తున్నాడు. ఒకవైపు సమాజం నాగరక జీవన విధానాన్ని అనుసరిస్తుంటే, మరోవైపు నాగరికతకు దూరమై ఆటవిక జీవనాన్ని గడుపుతున్న జాతులవారు తరతరాలుగా వేటను జీవనోపాధిగా అవలంబిస్తున్నారు. ఆది మానవునితో మొదలైన వేట ఆధునిక కాలంవరకు ఇలా కొనసాగుతూనే ఉంది. శిష్ట సమాజం వేటను సప్తవ్యసనాల్లో ఒకటిగా చేర్చింది. అయినా రాజులు వినోదం కోసం, ఆటవికులు భుక్తికోసం వేటాడటం పరిపాటి.

తెలుగు కావ్యాల్లో అక్కడక్కడ వేట వర్ణనలు కనిపిస్తాయి. రాజులు వినోదం కోసం వేటకు బయలుదేరినట్లు కవులు వర్ణించారు. బోయలు, చెంచులు మొదలైన ఆటవిక జాతుల వారు కూడ వేటాడినట్లు వర్ణనలు ఉన్నాయి. రాజులు వేటకు బయలుదేరేటప్పుడు వేటగాళ్ళు వారిని అనుసరించటం సర్వ సాధారణం.

తాళ్ళపాక పెద తిరుమలచార్యులు వేంకటేశ్వర వచనాల్లో 'గంటవేట'ను ప్రస్తావించాడు. నాచన సోమనాథుడు ఉత్తర హరివంశంలో హంస డిభకుల వేటను, శంకర కవి హరిచంద్రోపాఖ్యానంలో హరిశ్చంద్రుని వేటను వర్ణించారు. పిల్లలమర్రి పినవీరభద్రుడు, కొరవి గోపరాజు, అల్లసాని పెద్దన, ధూర్జటి, పొన్నగంటి తెలగన్న, చంద్రభాను చరిత్రను రచించిన తరిగొప్పుల మల్లన్న, పాలవేకరి కదిరీపతి, మట్ల అనంతరాజు, అయ్యలరాజు నారాయణామాత్యుడు మొదలైన కవులందరు వేటను వర్ణించినవారే.

సాంబోపాఖ్యానం ద్వితీయాశ్వాసంలో 23 పద్యాల్లో వేట వర్ణించబడిందని సురవరం ప్రతాపరెడ్డిగారు పేర్కొన్నారు. కేయూరబాహు చరిత్రలో ఎలుకల వేట, పెంపుడు డేగలు, వేటకుక్కలు ప్రస్తావించబడ్డాయి (3-295).

వేటను వివిధ కవులు వివిధ రకాలుగా వర్ణించారు. వేటగాళ్ళు, వేట కుక్కలు, వేట పరికరాలు, వేటల రకాలు. వేటాడే విధానం మొదలైన అంశాలు ఈ వర్ణనల్లో చోటుచేసుకున్నాయి.

**వేట పరికరాలు :-**

పరికరాలు లేనిదే వేట సాగదు, పరికరాలు లేకుండ వేటకు వెళ్ళటం పిరుడు కత్తిలేకుండ యుద్ధానికి వెళ్ళటంలాంటిది. అందువల్ల వేటలో పరికరాలు అత్యావశ్యకమైనవి. వేటను వర్ణించినపుడు పరికరాలనుకూడ వర్ణించక తప్పదు. దుష్యంతుడు వేటకు వెళ్ళేటప్పుడు ఉరులు, జిగురు కండె, తెరలు, బోనులు, వారు వారెనలు, మళ్ళు, వలలు, పేట్లు, గోళ్ళు, దీములు మొదలైన పరికరాలను ఆటవికులు తెచ్చారని పిల్లలమర్రి పిన వీరన వర్ణించాడు[1]

ధూర్జటి తిన్నడు వేటకు వెళ్ళే సందర్భంలో అనేక వేట పరికరాలను పేర్కొన్నాడు. తెరచీర కట్టలు, ప్రోగు చుట్టలు, దొడ్డివల, లేటివల, కుందేటి వల, పందివల, సవదండవల, మకరివల, ఎలుకలవల మొదలైన వలలతోపాటు ఉరులు, ఉరిగోలలు, బోనులు, చిక్కాలు, జిగురు కండెలు, దీపుత్రాళ్ళు, వొడి త్రాళ్ళు, తలముళ్ళు మొదలైనవి తీసుకొని వెళ్ళినట్లు చెప్పాడు.[2] చంద్రబాను చరిత్రలో తరిగొప్పుల మల్లన పెక్కు వేట పరికరాలను వర్ణించాడు. వలలు, ఉరులు, సిడులు, పిసులు, వంకర దుడ్డులు, పందిపోట్లు, దీములు, గొర కత్తెర్లు, జిగురు మోకులు, బోనులు, గాలి ఉరులు, బొంగులు, మిడివిళ్ళు, ఐంధాలు, కొమ్ములు, పాయలు, వల్లెత్రాళ్లు, చివ్వల తడికలు మొదలైన పరిక రాలను వేటలో ఉపయోగించారని తెలిపాడు.[3]

వంకర గుదియలు, వలత్రాళ్ళు, ప్రోగుత్రాళ్ళు, ఆకు తడికెలు, మవ్వంపు టురులు, చిక్కాలు, జిగురు కండెలు, గాలపు చివ్వ మొదలైన పరికరాలను పాలవేకరి కదిరీపతి పేర్కొనగా,[4] పొన్నగంటి తెలగన్న కుందేటి వలలు, ఎలుకల వలలు, సవదండ వలలు, పందిటి వలలు, మకిల వలలు మొదలైన వలలను వర్ణించాడు.[5]

---

1. శకుంతలా పరిణయము - 1 - 116.
2. శ్రీకాళహస్తి మాహాత్మ్యము - 3 - 46.
3. చంద్రభాను చరిత్ర - 2 - 21.
4. శుక సప్తతి - 1 - 256.
5 యయాతి చరిత్ర - 1 - 10.

**వేట కుక్కలు :**

వేటలో పరికరాలు ఎంత అవసరమైనవో వేటకుక్కలు కూడ అంత అవసరమైనవే. వేటగాళ్ళకు వేటకుక్కలు ప్రాణప్రదమైనవి. అందుకే వాటి రూపాన్నిబట్టి, స్వభావాన్నిబట్టి ప్రేమతో పేర్లు పెట్టుకుంటారు. స్వారోచి మృగయా విహార వర్ణనలో అల్లసాని పెద్దన 18 వేటకుక్కల పేర్లను ఒక చంపకంలో చెప్పాడు. ఆ పద్యం-

పులియడు బూచిగా దసురపోతుల రాజనుమంతిగాడు చెం
గలువ సివంగి భైరవుడు కత్తెర సంపగి వెండిగుండు మ
ల్లెలగుది వాయువేగి చిటిలింగడు సాళ్వడు వత్సనాభి యే
కలము:లమిత్రి గబ్బియనగా గలవాని గ్రహించి ఉద్ధతిన్.[1]

ఇలాగే చంద్రభాను చరిత్రలో మల్లన 15 వేట కుక్కల పేర్లను ఇచ్చాడు. అవి- జాతర, పుట్టచెండు, నెరజాణ,గయ్యాళి,కరాళి.దిట్ట,చింబోతు, తుపాకి, జోగి, సుఖభోగి, తుటారి, తలారి, మారి, సంగాతి, లకోరి అనేవి.[2]

వేట కుక్కల పేర్లను పేర్కొనకపోయినా వేటను తమ కావ్యాల్లో వర్ణించిన కవులు వేట కుక్కలు చేసే వేటను వర్ణించకపోలేదు. పిల్లలమర్రి పినవీరన వేటకుక్కల విహారాన్ని ఈ కింది విధంగా వర్ణించాడు-

సీ॥ గళనాళముల ద్రుంచె కారుపోతుల కొన్ని
తోలాడె కొన్ని శార్దూలములను
ఎలుగుల కొన్ని మేనుల నఖంబుల వ్రచ్చె
చమరీ మృగంబుల చంపె కొన్ని
ఘోరప్రాణముల చేసి కూల్చె దుప్పుల కొన్ని
చెండె మన్నుల కొన్ని గుండెలవియ
కరచె పందుల కొన్ని కంఠరాంతరములు
కొండ గొరియల మన్ని కొనియె కొన్ని

తే॥ చటుల గతి కొన్ని కణుజాల సంహరించె
వెంటబడి కొన్ని శశముల విత్తు మాన్చె
కొన్ని జింకల ప్రేవుల గ్రుచ్చివైచె
కుక్కలాటవికంబులు ఉక్కు మిగిలి.[3]

1. మను చరిత్ర - 4.32.
2. చంద్రభాను చరిత్ర - 2.24.
3. మనుచరిత్ర - 4.32.

ఈ విధంగానే శుకసప్తతిలో జాగిలాల వేట (1-260), కకుత్స్థ విజయంలో పందులకు జాగిలాలకు జరిగిన జగడం(4-76) వివరంగా వర్ణించబడింది.

**మృగయా విహారం :**

వేట పరికరాలు, వేట కుక్కల సహాయంతో రాజులు, వేటగాళ్ళు వేటాడిన విధానాన్ని కవులు వివరంగా వర్ణించారు. పిన వీరన దుష్యంతుని మృగయా వైదుష్యాన్ని చక్కగా వివరించాడు. అలాగే అల్లసాని పెద్దన స్వరోచి మృగయా విహారాన్ని, ధూర్జటి తిన్నడి వేటను, మట్ల అనంత భూపతి కకుత్స్థుని వేట విన్యాసాన్ని కళ్ళకు కట్టినట్లుగా రచించారు.

**వేటల రకాలు :**

వేటలు పలురకాలు. ధూర్జటి తిన్నడు చేసిన వేటలను వర్ణిస్తూ తెరవేట, జాగిలాల వేట, దీము వేట, డేగ వేట, ముంగి వేట, ఏదు వేట, సివంగి వేట, ఇర్రివేట, గంటవేట, ఎద్దువేట మొదలైన వేటలను పేర్కొన్నాడు.[1] దీము వేటలో పశుపక్ష్యాదులను పట్టటానికి పశుపక్ష్యాదులనే నియమిస్తారు. వలలు పన్ని పట్టటాన్ని 'తెరవేట' అంటారు. అడవిలో ఒకవైపున వలలు పన్ని, లేదా కందకాలు తీసి వాటిమీద ఆకులు కప్పి, మరోవైపునుంచి గంటలు, ఢంకాలు, కొమ్ములు, తప్పెట్లు మొదలైనవి వాయిస్తూ అల్లరి చేస్తూ, వలలు పన్నిన వైపుకు జంతువులను జోపటాన్ని 'గంట వేట' అంటారు. భూమి మీదచేసే ఈ వేటలతోపాటు చేపలవేట కూడ చెప్పుకోదగ్గది. దీము వేటలో ధూర్జటి మూడు విభాగాలు చూపాడు.[2] సివంగులు, కుక్కలు, కృష్ణ కురంగాలు, ముంగిసలు, ఎద్దులు జంతు విభాగం లోనివి కాగా; విడివేటకు ఎన్నదగిన విహంగ విభాగంలో సెలకట్టెలు, సాళువలు, డేగలను చేర్చాడు. పాది వేటకు పనికివచ్చే పతంగాలైన పూరేడు, కారుకోడి, కేరజం, కౌజు, కక్కెర మొదలైన వాటిని మూడవ విభాగంలో చెప్పాడు.

---

1. శ్రీకాళహస్తి మాహాత్మ్యం - 3-47.
2. ,, ,, 3-46.

కొరవి గోపరాజు దేగవేట, చేపలవేటతో పాటు జింకలు, మనుబోతులు, కణజులు, లేళ్ళు, ఇర్లు, దుప్పులు, ఏకలాలు, ఎలుగులు, పులులు మొదలైన జంతువుల వేటలను పేర్కొన్నాడు[1] దేగ వేటలో కేరిజాలు, పూరేళ్ళు, పాలగుమ్మలు, వెలిచెలు, బెగ్గురు పిట్టలు, కొంగలు, కొక్కెరలు, కక్కెరలు, కారుకోళ్ళు, గోరువంకలు, చెమరబోతు, కౌజు మొదలైన పక్షులను వేటాడినట్లు వర్ణించాడు. చేపలవేటలో క్రొరమీనులు, వాలుగలు, పాపరలు, మారుపులు, బేదసాలు, గెండెలు, వెలిమట్టలు, కొడిపెలు, బొక్కెమట్టలు, రొయ్య, పరిగ, ఇంగిలికం, చీరచింపు జెల్ల, నారజెల్ల, కుంటముక్క అనే చేపల రకాలను పేర్కొన్నాడు.

నన్నెచోడుడు కూడ కుమార సంభవంలో గాలంతో చేపలు పట్టటాన్ని వర్ణించినట్లు తెలుస్తున్నది.[2]

మట్ల అనంత భూపతి తెరవేట, దీమువేట, బోనువేటలను వర్ణించాడు.[3] వలలు పన్నటం, కాపుగప్పటం, సీసపు గుళ్ళతో ఇర్రుల కొంకులకేసి కొట్టటం, ఉరులు పెట్టటం మొదలైన పద్ధతులను తెలిపాడు. పందులవేటను వివరంగా విరచించటమే కాక, ఇర్రులవేట, మనుబోతు వేట. మాతంగం వేటలను కూడ ప్రస్తావించాడు.

అయ్యలరాజు నారాయణామాత్యుడు చేపల వేటలో ఉపయోగించే పరికరాలను, వలలను, చేపల పేర్లను వివరించాడు.[4] కొడమ, త్రిద్ద కొడమ, ద్రొబ్బుడు, పటం, చాప, ఎత్తెల, గూడ, జల్లిగూడ, లుంటగాలం, సురుగాలం, ఒసుకు, గొరకు మొదలైన పరికరాలను, మెదవల, సన్నపువల, డొంకవల, మిందముక్కిడి వల, దాటుడు వల, ఎద వల, కుండె వల మొదలైన వలలను పేర్కొన్నాడు. జాలరి పట్టే చేపల రకాలను ఒక సీస పద్యంలో వర్ణించాడు. ఆ పద్యాన్ని ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

---

1. సింహాసన ద్వాత్రింశిక - ప్రథమాశ్వాసం - 265 - 270 పద్యాలు.
2. కాకతీయుల కాలంనాటి సామాజిక జీవితం - పుట 164.
3. కకుత్స్థ విజయము - చతుర్థాశ్వాసం - 71 - 98 పద్యాలు.
4 హంస వింశతి - 4 - 184, 185.

సీ॥ కొరద దాసరి కొయ్య కొర్రమీ నులస ము
చ్చంగి బేడిసి జెల్ల చారమీను
వాలుగ ముకుదొమ్మ వల్లిక తట్ట పు
త్రడి కాసు పూమీను కడిసెలంబు
పక్కె చిత్తర సీరు పాపెర వలుగు మీ
నరుజు నిల్లెపు చేప ఆకు జెల్ల
మినీ కల్లురుజు నడమీను తొల్లిక రాతి
గొరక మా పురమును కుంటముక్కు

తే॥ మోర పక్కెర దొందును కూరముక్కు
పుల్లురుజు గెజ్జె గెండయు బొమ్మదాయ
అల్లెద మ్మువ్పుచేపయు గొల్ల దొందు
పరిగె రొయ్యాది యగు మీల పట్టు నతడు.[1] ఇందులో కవి 40 కి పైగా చేపల పేర్లను చెప్పాడు. నేడు కొన్ని పేర్లు తెలియనప్పటికి, వాడుకలో ఉన్న పేర్లే ఎక్కువగా ఉన్నాయి.

తెలుగు కవులు సందర్భానుసారంగా చేసిన వేట వర్ణనలను పరిశీలిస్తే- వేట సాంగోపాంగాలు, దాని విస్తృతి, వైవిధ్యం ప్రకటితమౌతాయి.

## బుడిగె జంగాల వేట

ఎన్ని రకాలైన జానపద కళారూపాలను ప్రదర్శిస్తున్నాగాని బుడిగె జంగాలు ఒక్క రోజు వేట లేనిదే ఉండలేరు. వేట వీరికి సంప్రదాయంగా వస్తున్న వృత్తి. తరతరాలుగా కొనసాగుతున్న వ్యాపకం. రోజూ ఎలుకలో్నో, ఉడతలో్నో, ఉడుమునో, తాబేలునో, ముంగిసనో - ఏదో ఒకటి పట్టుకొచ్చు కొని తిన్నదాకా వీరికి తృప్తిఉండదు. అందుకే వేట వీరికి ఆరో ప్రాణం. వలలు, బోనులు, ఉరులు మొదలైనవి వీరికి సిరులు. వేటకుక్కలే వీరికి ఆప్త మిత్రులు. ఎలుకల పెంటలు (లాగలు), ఉడుములు ఉండే చోట్లు, ముంగిసల పుట్టలు, నక్కల పొక్కలు, ఏదుల స్థావరాలు, ఇతర జంతువుల గవ్వలు, గుట్టగవ్వలు, కాలువలు, వాగులు, మడుగులు, చెరువులు, ఎండ్రకాయల

1. హంస వింశతి - 4 - 187.

గవ్వలు మొదలైనవి వీరికి నిత్యదర్శనీయ స్థలాలు. అడవంతా వీరి మనో ఫలకం మీద చిత్రంలాగా కనిపిస్తుంది. స్నేహితులు, బంధువులు జ్ఞప్తిలో ఉన్నట్లే ఈ వేట స్థలాలు వీరికి ఎప్పుడూ స్ఫురణలో ఉంటాయి. వీరి వేట విధానాలను గమనించినట్లయితే వేటకూ వీరి జీవనానికి ఉన్న అవినాభావసంబంధం బోధపడుతుంది.



బుడిగె జంగాల వేట పరికరాలు

తరతరాలుగా వేట నిత్యకార్యక్రమంలో ఉండటంవల్ల కలిగిన అనుభవంతో వీరు ప్రతివేటను ఒక ప్రక్రియగా తీర్చారు. అనంతవైవిధ్యం ఉన్న వేటలో ఏ సందర్భంలో ఏం చేయాలో, ఏ పరికరాన్ని ఎప్పుడు, ఎక్కడ ఉపయోగించాలో, ఏ వేటను ఎలా మొదలుపెట్టి, ఎలా ముగించాలో మొదలైన అంశాలను దృష్టిలో పెట్టుకొని నిర్దుష్టమైన వేట విధానాలను రూపొందించుకున్నారు.

వేటను బుడిగె జంగాలు 'యాట' లేక 'షికారి' అని అంటారు. ఏ వేట చేసినా ఇద్దరు లేక అంతకంటె ఎక్కువ మంది కలిసి వెళ్ళటమే అధికం. ఇక వీరు చేసే ఒక్కొక్క వేటను వరుసగా వివరిస్తాను.

## (1) తాబేళ్ళ షికారి

తాబేలును బుడిగెజంగాలు 'కురుంగాడు' అని పిలుస్తారు. ఇది 'కూర్మ' శబ్దం నుంచి వచ్చింది. ఈ షికారి అనేక విధాలుగా ఉంటుంది.

**దొంటి గాలం :** పొడవైన కర్రకు పొడుగాటి గాలం కట్టి, పచ్చి కొమ్మలతో కట్టిన తడక అడ్డంపెట్టుకొని, బావిలో పట్టుతప్పని స్థలంలో కూర్చొని, తాబేలు పైకి తేలినప్పుడు - తాబేలును గాలంతో లాగి పడతారు.

**దుంకి పట్టుట :** బావిలో చాటుగా కూర్చొని తాబేలు పైకి తేలినపుడు వెంటనే నీటిలోకి దూకి తాబేలును పడతారు.

**చెరువు దేవుట :** చెరువులో వల ఊడ్చి పడతారు.

**పొడుపు షికారి :** చెరువులోగాని, మడుగులో గాని చేతులతో తొణుకులు కొట్టి నీటిని అల్లకల్లోలం చేస్తారు. అప్పుడు తాబేళ్ళు అక్కడక్కడ బురదలో కూరుకుంటాయి. అప్పుడు ఒక కర్రతో బురదలో దగ్గర దగ్గరగా పొడిచి కర్రకు తాబేలు తాకుతుందేమో చూస్తారు. కర్రకింద తాబేలు తాకితే బురదలో చేతులు వేసి తాబేలును పట్టి పైకి తీస్తారు.

**కోపు షికారి :** నీళ్ళల్లో తాబేలు కదలికను తుంగ, గడ్డి కదలటాన్ని బట్టి, పసిగట్టి వెళ్ళి పట్టుకుంటారు.

**నీటి బుడగలు చూసి పట్టుట :** తొణుకులు కొట్టి నీటిని అల్లకల్లోలం చేసిన తర్వాత తాబేలు పూడిన చోట నీటి మీద బుడగలు లేస్తాయి. బుడగలు లేచినచోట మునిగి తాబేలును పట్టితీస్తారు.

**జాడ షికారి :** వేసవిలో చెరువులు, మడుగులు ఎండిపోతే అందులోని తాబేళ్లు గుబురు పొదల్లోకి వెళ్ళిపోతాయి. అప్పుడు వాటి అడుగుల జాడలను చూసుకుంటూ వెళ్ళి వాటిని పట్టుకుంటారు.

### (2) ఉడతల షికారి

ఉడతను బుడిగె జంగాలు 'తోడ్సిగాడు' అంటారు. ఉడతల షికారిలో వలతో పట్టటం, దోర్నాలు అనగా ఉరులు (ఉచ్చులు) వేసి పట్టటం అనే పద్ధతులు ముఖ్యమైనవి. ఉడతలు పట్టటానికి ఉపయోగించే వలను ప్రత్యేకంగా అల్లుతారు. ఎలుకలు పట్టటంలో కూడ ఈ వలను ఉపయోగిస్తారు. కొందరు మీటును ఉపయోగించి కూడ ఉడతలను పడతారు. కాని, ఈ పద్ధతి చాల తక్కువ. చెట్టుకు ఉడత ఎక్కినప్పుడుగాని, పొదలో ఉన్నప్పుడు గాని 'పాటు' చూసి (ఉడత ఏ వైపుకు వెళ్ళే అవకాశాలు ఉన్నాయో చూసి) ఆ వైపున వల

కడతారు. రెండో వైపు నుంచి దాన్ని జోపుతారు. చెట్టుపైన ఉంటే రాళ్ళతో కొట్టి దిగేలా చేస్తారు. వలవైపు అదలించి వలలో పడగానే పట్టుకుంటారు.

ఉచ్చులతో అయితే ఉడత చెట్టుమీద ఉన్నప్పుడు చెట్టు కాండానికి ఉరులు చుట్టూరా చుట్టి చాటుగా కూర్చుంటారు. ఉడత దిగుతున్నప్పుడో, చెట్టు ఎక్కుతున్నప్పుడో కొన్ని సందర్భాల్లో ఉచ్చుల్లో చిక్కుకుంటుంది. ఈ ఉచ్చులు గుర్రంతోక వెంట్రుకలతో తయారు చేస్తారు.

## (3) ఎలుకల షికారి

ఎలుకను బుడిగె జంగాలు 'ఉన్నానిగాడు' అని, మూషిక శబ్దభవమైన 'మూస్కెం' అని అంటారు. ఎలుకల వేటలో కర్రు, లొట్టి, వల, కుక్కలను ఉపయోగిస్తారు. ఎలుకలు ఉంటున్న పెద్ద కన్నాన్ని 'పెంట' అని అంటారు. దాని చుట్టుపట్ల ఐదారు గజాల దూరంలో అక్కడక్కడ కొన్ని కన్నాలు ఉంటాయి.



ఎలుకల వేటలో ఊదరగొట్టటం

ఎలుకల షికారిలో ఉపయోగించే లొట్టి (మట్టి ముంత)కి అడుగున సన్నని గుండ్రని రంధ్రం చేస్తారు. లొట్టిని ఎండిన ఆకులు, పొరకతో దట్టించి నింపుతారు. పిడకల్ని చించి అందులో పోస్తారు ఎలుక పెంట చుట్టుపట్ల ఉన్న అన్ని కన్నాలు కప్పి, ప్రధానమైన కన్నమైన 'పెంట' దగ్గర త్రవ్వుతూ పోయి,

ఎలుకలు తమ రక్షణార్థం అడ్డంగా మట్టితో ఏర్పరచుకొన్న మట్టి పొరను తొల గిస్తారు. ఈ మట్టి పొరనే 'తుక్కు' అంటారు. తుక్కు పడవేసి కన్నంలో లొట్టి మూతిని ఉంచి చుట్టూరా పొగరాకుండా మట్టితో కప్పుతారు. గుండ్రంగా లొట్టి అడుగున తొలిచిన చిన్న రంధ్రం గుండా దూదితో అగ్గి ముట్టించి, దమ్ము బాగా పెంచి ఊదటం ప్రారంభిస్తారు. ఇలా ఊదటంవల్ల లొట్టిలో నింపినపొరక కాలి, పొగ ఎలుక కన్నంద్వారా లోపల అంతా వ్యాపిస్తుంది. ఈ విధంగా ఒకరి తర్వాత ఒకరు ఊదుతారు. లొట్టి మూతి నుంచి దట్టమైన పొగ పెంటలోనికి పోయి ఎలుకలు ఉక్కిరిబిక్కిరై చచ్చిపడుంటాయి. ఊదర గొట్టటం అయి పోయిన తర్వాత కన్నాన్ని త్రవ్వుతూ పోయి చచ్చిపడున్న ఎలుకల్ని తీసు కుంటారు. చాలాసార్లు పొగ లోపల అలుముకోగానే ఎలుకలు ఆత్మ రక్షణకు తయారుచేసుకొని ఉంచిన సన్నని భూమి పొరను గుద్ది, కన్నం చేసుకొని ఉరుకు తాయి. అలా ఉరికేటప్పుడు అక్కడక్కడ కట్టిన వలల్లో చిక్కుకుంటాయి. లేదా బరిగెలు చేత పట్టుకొని నిలబడ్డ వాళ్ళు వెంటబడి తరిమికొట్టి చంపుతారు. పెంటమీద కాచుకొని ఉన్న వేట కుక్కలైనా పడతాయి.

**త్రవ్వి పట్టటం :** ఒక్కొక్కప్పుడు ఊదర లేకుండానే కన్నం పొడు గుతా త్రవ్వుతూ వెళతారు. దానితో ఎలుకలు బయట పడి ఉరికి వలలో చిక్కుకుంటాయి. కొన్ని కుక్కలకు చిక్కుతాయి. మరికొన్నింటిని బరిగెలతో కొడతారు.

## (4) ఉడుముల షికారి

ఉడుమును 'వలెంగాడు' అని అంటారు. ఉడుములవేట మూడు, నాల్గు రకాలుగా ఉంటుంది.

**శివ్వయాట :** సన్నని పొడుగాటి వెదురు కర్రనే 'శివ్వ' (చివ్వ>శివ్వ) అని అంటారు. దాని చివర్లో ఉచ్చు కట్టబడి ఉంటుంది. ఉడుము బండరాతి కింది గవిలోనో, పుట్టలోనో, బావి తెట్టెలోనో ఉండటం తెలుసుకొని - చెట్ల కొమ్మలతో ఒక తడక తయారు చేసుకొని దాని వెనకాల మాటు పెట్టుకొని శివ్వ సిద్ధం చేసుకొని ఉంటాడు. ఉడుము బయటకు రాగానే దాని తలకు ఉచ్చువేసి లాగుతాడు.

**ఊదర యాట :** గవిలో ఉడుము పడ్డాక, ఆ గవి మూతికాడ సన్నని ఎండు పొరక దట్టంగా పేర్చి నిప్పు రాజేసి, రెండుచేతుల్లో చిన్నచిన్న పచ్చి మండలు నిండుగా పట్టుకొని ఊదరగొడతారు. గవి లోపల దట్టంగా పొగ వ్యాపించగా, ఆ పొగకు ఊపిరాడక ఉడుము లోపలపడి ఉంటుంది. ఊదర తర్వాత గవిలో నుంచి దాన్ని తీసుకుంటారు. కొన్ని ఉడుములు కొంచెం సొక్కినాగాని బయటకు వస్తాయి. అప్పుడు వాటిని పట్టుకుంటారు.

**కడెం దోర్నం :** ఉడుము గవిని పరీక్షించి అది రావటం, పోవటం, రాటుచూసి కడెం దోర్నం పెడతారు. తీగతో అల్లిన కడియానికి ఉచ్చును జత చేసి పెడతారు. ఉచ్చు వాలిపోకుండా గుండ్రంగా ఉండటానికి కడెం ఉపకరిస్తుంది. కడెంకు ఉన్న తాడును ప్రక్కన ఉన్న చెట్టుకొమ్మకో, రాతికొనకో, ఏది ఆధారంగా ఉంటే దానికి ముడివేసి కడతారు. ఇలా కట్టడంవల్ల ఉచ్చులో చిక్కుకున్న ఉడుము తప్పించుకొని పోలేక అక్కడే పడి ఉంటుంది. గవిదగ్గర పన్నిన ఉచ్చులో ఉడుము లోపలికి వెళ్ళేటప్పుడో, బయటికి వచ్చేటప్పుడో చిక్కుకుంటుంది.

**కుక్కయాట :** పొలంలో వేట కోసం తిరుగుతున్నప్పుడు పొద చాటుగా ఉన్న ఏ వేరునో కొట్టుకుతింటున్న ఉడుము మనిషిని చూసి ఉరుకుతుంది. కుక్క వెంటతరిమి దానిని పట్టుకుంటుంది.

## (5) ముంగిసల షికారి

ముంగిసను 'ఎంటువ' అంటారు. బుడిగె జంగాలు ముంగిసలను నాలుగైదు విధాలుగా వేటాడతారు.

**బోను :** ఇనుప తీగలతో అల్లిన బోనులోని ఎరకు చేపలు గుచ్చుతారు. కవుసు నీళ్ళను బోను చుట్టుపట్ల చల్లుతారు. బోనుపెట్టి వెళ్ళిపోయాక ఆ వాసనకు వచ్చి ముంగిస బోనులో తగుల్కుంటుంది.

**ఎంటువ గూటాలు :** 10, 15 సెంటిమీటర్ల పొడవున్న గట్టి కొయ్యలకు ఉచ్చులు కడతారు. వాటిని ముంగిస వచ్చే పోయే గవి ముందు భూమిలో దిగగొట్టి పన్నుతారు. వచ్చేటప్పుడో, వెళ్ళేటప్పుడో ముంగిస ఉచ్చులో చిక్కుకుంటుంది.

**మీటు :** బోనుకు లాగానే కవుసు చల్లి మీటు పెడుతారు. ఎరను లాగి మీటు దెబ్బకు ముంగిస చస్తుంది. మీటును వెదురు కర్రలతో తయారుచేస్తారు.

**ఊదర :** ముంగిస ఉన్న గట్టు గవికైనా, పుట్టగవికైనా ఊదరగొట్టి పడతారు.

**వలలు :** పొదల్లో ఉన్న ముంగిసను జోపుతున్నప్పుడు, చేల మళ్ళల్లో జోపుతున్నప్పుడు, బావి తెట్టెకు కాచుకొని ఉన్నప్పుడు వలలు కట్టి ముంగిసలను పడతారు.

## (6) అడవి పిల్లుల షికారి

అడవి పిల్లుల్లో జంగంపిల్లి, బుడ్డపిల్లి, మోరాపిల్లి, మాలపిల్లి, దాసరి పిల్లి, పెంటపిల్లి, బూతపిల్లి మొదలైన రకాలుంటాయి. వీటిని కుక్కల సహాయంతో, వలలతో పడతారు. ఇనుపబోను, మీటు పద్ధతుల్లో కూడ ఈ పిల్లుల్ని పడతారు.

## (7) కుందేళ్ళ షికారి

వీటిలో సీమ కుందేళ్ళు, బుర్రకుందేళ్ళు మొదలైన రకాలుంటాయి. వీటిని కుందేళ్ళ వలలతోనూ, కుక్కల సహాయంతోను పడతారు.

## (8) మర్నాగి (మానుపిల్లి) షికారి

వీటిలో మంచి మర్నాగి, బొంత మర్నాగి అని రెండు రకాలు. ఇవి ఎక్కువగా చెట్టు తొర్రల్లో ఉంటాయి. తొర్రలకు ఊదర పెట్టి పడతారు.

## (9) ఏదుల షికారి

ముళ్ళ పందుల్ని 'ఏదులు' అంటారు. వీటిలో మంచేదు, పసుపేదు, ఎన్పేదు మొదలైన రకాలుంటాయి. ఇవి సాధారణంగా గట్టు గవుల్లోనే ఉంటాయి. ఊదరగొట్టి వీటిని పడతారు. దివిటి కట్టెలు ఉపయోగించి కూడ వీటిని పడతారు.

## (10) ఇతర జంతువుల షికారి

కొండ్రిగాడు, తోడేళ్ళు మొదలైన వాటిని ఊదరగొట్టి పడతారు.

**వాగ్ల :** 'అలుగు' అనే జంతువునే 'వాగ్ల' అంటారు. ఇందులో మంచివాగ్ల, ఫిడివాగ్ల, భేరివాగ్ల అనే రకాలు ఉంటాయి ఊదరగొట్టి వీటిని పడతారు.

గటుంగాడు : దీన్నే 'నీటి కుక్క' లేక 'నీరుకుక్క' అంటారు. ఇది నీటిలోనూ, తీరాల్లోనూ ఉంటుంది. ఊదరగొట్టి లేక బోను పెట్టి పీటిని పడతారు.

కొండంగి : కొందరు బుడ్గ జంగాలు కొండంగులను కూడ వేటాడుతారు. కొండంగుల్ని వలలు పన్ని పట్టటమే కాకుండా ఈటెలతో వేటాడి చంపుతారు.

## పిట్టల షికారి

పిట్టల షికారిలో కూడ బుడ్గ జంగాలకు మంచి నేర్పు ఉంది. షికారి పిట్టలను పెంచి వాటిద్వారా పాది (సన్నటి వెదురు పుల్లలతో చేసిన పంజరం) లేక 'పాంజి'లు పన్ని కముజులు, లావంకలు మొదలైన పిట్టల్ని పడతారు. గోరువంకలు, ఎల్చెలు, కేర్జాలు, బుర్కాలు, గువ్వలు, నల్లపిట్టలు, తీతువు పిట్టలు మొదలైనవాటిని ఉచ్చులతో పడతారు.

జలపక్షులైన బుడుముంకలు, ఆలేటి పిట్టలు, నీరుకోళ్ళు, నీటి బాతులు, కొంగలు మొదలైన వాటినిగూడ పడతారు. బావుల్లో వ్రేళ్ళాడే చెట్ల కొమ్మలకు గూళ్ళు కట్టుకున్న అనేక రకాల పక్షులను వీళ్ళు పడతారు.

## చేపలు ఎండ్రకాయలు

తోపెట (కాలువలో చేపలు పట్టేది - మిక్కిలి సన్నకళ్ళది), దేవుడొాల భుజాలకు తగిలించుకొని ఇటుపక్క ఒకరు, అటుపక్క ఒకరు మడుగుల్లో ఈడ్చి చేపలుపట్టే వల), తొక్కుడొాల మొదలైన వాటిద్వారా చేపలు పడతారు.

**పునుకు :** చేతులతో పుణికి, వెదకి కూడ చేపల్ని పడతారు. ఎండ్ర కాయలను వాటి గవులు త్రవ్వి, లోనికి చేతులు వేసి పడతారు.

ఈ విధంగా బుడిగె జంగాలు రకారకాల జంతువులను, రకరకాలైన విధానాల్లో వేటాడుతారు. వేటలో కనిపిస్తున్న వైవిధ్యం, వేట పద్ధతుల్లో అవగత మవుతున్న నిర్దుష్టత వేటలో వీరికి ఉన్న అనుభవాన్ని, వేటతో వీరికున్న అవినా భావ సంబంధాన్ని తేటపరుస్తున్నాయి. యానాదులు, చెంచులు మొదలైన పరిమిత గిరిజన జాతుల్లోతప్ప, వేటపట్ల ఇంతటి ఉత్సుకత, నిమగ్నత, పరిణత ఇతర తెగల్లో కులాల్లో కనిపించదు.

వీరి వేటకు సంబంధించిన మరికొన్ని అంశాల గురించి, వేటకుక్కల గురించి, వేటలో వంట గురించి తర్వాత ప్రకరణంలోని 'ఆహారపానీయాలు' శీర్షిక కింద చూడవచ్చు.

## 12. వైద్యం

మనిషికి అన్నింటికన్నా ముఖ్యమైంది ఆరోగ్యమే అని, 'అన్ని భాగ్యాల కన్నా ఆరోగ్యమే మిన్న' అని "ఆరోగ్యమే మహాభాగ్యం" అనే సామెత చాటుతున్నది. రోగబాధలు భరించలేని మనిషి అనుభవంలోనుంచి పుట్టుకొచ్చిన సామెత ఇది. రోగాల నివారణకు ఆదినుంచే అన్వేషణ మొదలైంది. రోగం పుట్టినప్పుడే దాని నివారణోపాయాలను మనిషి వెదకవలసివచ్చింది. చివరికి 'ఔషధం కానిది అవనిలో లేదు' అన్నదాకా వచ్చింది. అనుభవం మీద అన్నీ తెలిసొచ్చాయి. 'అరటికాయ ఆరు నెలల రోగం' అన్నారు. 'కరక్కాయ కన్నతల్లి,' 'ఉల్లిచేసిన మేలు తల్లైనా చేయదు,' 'చప్పిడి చేస్తే జబ్బు కుదురుతుంది,' 'గట్టిగా ఆయుష్యముంటే గరిక నూరిపోసినా బ్రతుకుతాడు' మొదలైన సామెతలెన్నో పుట్టుకొచ్చాయి. సామెతల్లో, పొడుపు కథల్లో, పిల్లల గేయాల్లో రోగలక్షణాలు, ఆరోగ్యసూత్రాలు ఎన్నో నిక్షిప్తమై ఉన్నాయి.

ప్రాచీనకాలం నుంచే ఆయుర్వేదం బాగా ప్రచారంలో ఉన్నందువల్ల జానపదుల వైద్యవిధానాలు తెలుగు కావ్యాల్లో చాలా తక్కువగా వర్ణించబడ్డాయి. బసవపురాణంలో ఈ వైద్యవిధానం ప్రస్తావించబడింది. నవనాథ చరిత్రలో ఆవులకు వచ్చే రోగాలు పేర్కొనబడ్డాయి. శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో తిన్నడు శివునికి చేసిన నేత్రవైద్యం వర్ణించబడింది.

జానపద సాహిత్యంలో వర్ణించబడ్డ వైద్యం కొన్నిచోట్ల అద్భుతాలతో కూడుకొని ఉంటుంది. మరుగు మందులు పెట్టటం, ఏదో పసరుపోస్తే రాచపుండు లాంటివి తగ్గిపోవటం, కాలికి పసరు రాస్తే ఆకాశంలోకి ఎగరటం మొదలైన అద్భుతాలతో వైద్యానికి ముడిపెట్టటం కనిపిస్తుంది.

కొన్ని బాలగేయాల్లో వైద్య రహస్యాలు ఇమిడి ఉన్నాయని ఆచార్య రామరాజుగారు ఉదాహరించారు.[1] 'కాళ్ళా గజ్జీ కంకాలమ్మా' అనే గేయంలో

1. తెలుగు జానపద గేయ సాహిత్యము - పుట. 781.

గజ్జికి మందు చెప్పబడింది. 'అలాగే చెమ్మచెక్క చేరడేసి బుక్క' అనే గేయంలో మాచకమ్మలకు చిట్కా ఉన్నది. 'ఒప్పులకుప్పా వయ్యారి భామా' మొదలైన గేయాల్లో కూడ అంతర్గతంగా వైద్య సూచనలు ఉన్నాయి.

మానవుని మనుగడకు అన్ని వృత్తులు అవసరమే. అయినా ఏ వృత్తి ప్రాధాన్యత ఆ వృత్తికి ఉంటుంది. అన్ని వృత్తుల్లోకి వైద్యవృత్తి చాలా అవశ్యకమైంది. ఆదరణీయమైంది. సుమతీ శతకకారుడు వైద్యుని అవసరాన్ని గుర్తించే 'వైద్యుడులేని ఊరు చొరకుమీ' అని బోధించాడు. శాస్త్రోక్తంగా మందులిచ్చే వైద్యుడు ఉన్నా లేకున్నా నాటు వైద్యులు, భూతవైద్యులు ప్రతి ఊళ్ళో ఉండనే ఉంటారు. నాటు వైద్యుల అవసరం కూడా లేకుండా కంటి నొప్పికో, వంటి నొప్పికో, తల నొప్పికో, మలబద్ధకానికో - ఆకో, అలమో, వేరో, బెరడో ఏదో ఒకటి తమకు అనుభవంలో ఉన్నది ఎవరికివారు వాడుతూనే ఉంటారు.

జానపద విజ్ఞానపరిశోధకులు జానపద వైద్యాన్ని ఆచార సంప్రదాయాల్లో చేర్చారు. జానపద వైద్యాన్ని అనేక విధాలుగా వర్గీకరించి చూపారు. ఆర్. ఎస్. బాగ్స్ వర్గీకరణలో వైద్యుడు, రోగానికి కారణం, రోగ నివారణ, రోగ కారణ పద్ధతులు, శస్త్ర చికిత్స అనే అంశాలు పేర్కొనబడ్డాయి. 'రోగ నివారణ' అనే అంశాన్ని తిరిగి మూడు విభాగాల కింద చూపారు. అవి 1. జంతువులు, 2 చెట్లు, 3. ఖనిజాలు.[1]

డి. సి. జార్విన్ 'ఫోక్ మెడిసిన్' అనే గ్రంథంలో జానపద వైద్యాన్ని ఈ కింది విధంగా విభాగించారు:




1. Standard Dictionary of Folklore - Page. 1146.

పైన పేర్కొన్న వర్గీకరణను అనుసరించి బుడిగె జంగాల వైద్యాన్ని ఈ కింది విధంగా పరిశీలించవచ్చు:

జానపద వైద్యం మొదట రెండు విభాగాలుగా వర్గీకరింపబడింది. 1. ప్రకృతివైద్యం, 2. మంత్రతంత్ర వైద్యం.

**మంత్రతంత్ర వైద్యం:** బుడిగె జంగాల్లో ఇంచుమించు ప్రతి గూడెంలో ఒక నాటువైద్యునితోపాటు భూతవైద్యుడు కూడ ఉండటం పరిపాటి చాలా వరకు నాటువైద్యం చేసేవాడే భూతవైద్యం కూడ చేస్తాడు. దృష్టి దోషానికి, పాముకాటుకు, తేలుకాటుకు మొదలైనవాటికి మంత్రాలు వేస్తాడు. గ్రహబాధలకు భూత ప్రేత పిశాచాల పీడలకు ముగ్గులతో యంత్రాలు రాసి, మంత్రాలు వేసి ఉపచారాలు చేస్తారు. కాగితాలమీద యంత్రాలు రాసి మంత్రోపచారంతో తాయెత్తులో పెట్టి కడతారు. వీరు అనుభవ మంత్రశాస్త్రంలోని మంత్రాలను, యంత్రాలను అభ్యాసం చేసి ఉపయోగిస్తారు. ఒకరినుంచి ఒకరు నేర్చుకోవటంవల్ల అనుభవ మంత్రశాస్త్రంలో ఉన్న యంత్రం ఒకటైతే, వీరు రాసి కట్టే యంత్రం మరొకటిగా ఉంటుంది. అనేక దోషాలు దొర్లుతాయి. నమ్మకమే ఇక్కడ ప్రధానం కాబట్టి వీరి భూతవైద్యం నిరాఘాటంగా సాగుతూనే ఉంటుంది. దేవతారాధనకంటే ప్రేతారాధన వీరిలో ఎక్కువ. ప్రేతారాధన విశ్వాసాలమీద ఆధారపడి ఉన్నప్పటికీ దయ్యాల మొక్కులో మంత్రోపచారాలు కూడ ఉంటాయి.[1]

**ప్రకృతి వైద్యం :** వృక్షసంబంధ వైద్యం, ప్రాణి సంబంధ వైద్యం, ఖనిజ సంబంధవైద్యం అనే మూడు విభాగాలు ఇందులో చేరుతాయి.

**వృక్షసంబంధ వైద్యం :** ఇందులో వేళ్ళు, బెరడు, చెక్క, తీగ, చిగుళ్ళు, ఆకులు, పూలు, కాయలు, పళ్ళు, గింజలు, పలుకులు, చెట్ల పాలు మొదలైన వాటిని వైద్యానికి ఉపయోగిస్తారు.

**ప్రాణి సంబంధ వైద్యం :** ఇందులో రెండు ఉపవిభాగాలున్నాయి. జంతువులకు వైద్యం చేయటం మొదటిది. జంతు సంబంధ వస్తువుల ద్వారా

---

1. చూడు. ఈ సిద్ధాంత గ్రంథంలోని 'ఆరాధనా పద్ధతులు.'

మనుషులకు వైద్యం చేయటం రెండవది. రెండవ విభాగంలో జంతువుల మాంసం, కాలేయం, పొట్ట (జీర్ణాశయం), చేదులు (రస గ్రంధులు) మొదలైనవి, ఎముకలు, కొవ్వు మొదలైనవి చికిత్సకు ఉపయోగిస్తారు. పిట్టల మాంసం కూడ కొన్ని రోగాలకు మందుగా వాడతారు.

ఖనిజ సంబంధ వైద్యం : ఇందులో లవణాలు, సున్నం, కర్పూరం, సిందూరం, వామపువ్వు, కుంకుమపువ్వు, శిలాజిత్తు మొదలైన వస్తువులు ఉపయోగించబడతాయి.

## కొన్ని వ్యాధులూ - వాటికి బుడిగె జంగాల వైద్యం

అనేక వ్యాధులకు భిన్న విభిన్నమైన మందులు, రకరకాల చిట్కాలు వ్యవహారంలో ఉన్నాయి. ఆయా రోగాలకు బుడిగె జంగాల్లో ఎక్కువ మంది అనుసరించే వైద్య విధానాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను. వైద్యవృత్తిలో ఉన్నవాళ్ళు ఇచ్చే ఆయుర్వేద పద్ధతి ఔషధాలు కాకుండా, ఎవరికి వారు చేసుకునే జానపద వైద్యాన్ని ఇక్కడ పేర్కొనటం జరుగుతున్నది.

తలనొప్పి : మునగ ఆకుగాని, పెద్దమాను ఆకుగాని, తలంటి ఆకుగాని తలకు కట్టినట్లైతే తలనొప్పి తగ్గుతుంది.

చెవినొప్పి : బంతాకు పసరు చెవిలో పిండితే చెవిపోటు తగ్గుతుంది. శాకమట్టను పిండి, రసంతీసి, అందులో కొంచం రసకర్పూరం కలిపి చెవిలో పోస్తే చెవిపోటు, చీముకారుట తగ్గుతాయి. జిటిపిటి ఆకును కొంచంసేపు పెనం మీదవేపి, పసరు దీసి, రవ్వంత సున్నం కలిపి చెవిలోపోస్తే కూడ గుణం కనిపిస్తుంది. అశ్వగంధి ఆకులు మంచినూనెలో వేస్తే, ఎర్రనిరంగు వస్తుంది. ఆ నూనెను చెవిలో వేసినా చెవిరోగాలు ఉపశమిస్తాయి

కళ్ళ కలక : కనుకోటి గింజలు ఉలువల లాగ ఉంటాయి. వాటిని తెచ్చి పిండిచేసి, ఆ పొడిని కళ్ళలో వేస్తే, కళ్ళ కలకపోతుంది. మునగ ఆకును ఉడకబెట్టి కాపటం పెట్టినా తగ్గిపోతుంది. తలంటు ఆకు పసరు, చనుబాలు కలిపి, కంట్లోపోస్తే కూడ కళ్ళకలక తగ్గుతుంది.

కంట్లో శుక్లం : దీన్నే కంట్లో 'పువ్వు పడటం' అంటారు. వరుసగా కొన్ని రోజులు మర్రిపాలను కంట్లో వేస్తుంటే కంటి శుక్లాలు కరిగిపోతాయి

**పంటినొప్పి** : అడవి ఆముదం చెట్టు పాలను పంటికి పట్టించినట్లైతే నొప్పి తగ్గుతుంది. అడవి ఆముదం పుల్లతోగాని, ఉత్తరేణి, వేప, తుమ్మ పుల్లలతోగాని పళ్ళు తోముకుంటే పళ్ళు గట్టిపడటమేకాక, చిగుళ్ళు ఆరోగ్యంగా ఉంటాయి. నిమ్మఉప్పు కలిపిన నీరు పాషాణం ద్రావకంలో పత్తి తడిపి, పంటి దగ్గర పెట్టి, వెన్వెంటనే నీటిలో తడిపిన పత్తిని పెట్టాలి. పురుగు చచ్చి, పత్తికి అంటుకొని బయటకు వస్తుంది.

**పార్శ్వపు తలనొప్పి** : దిరిసెన విత్తులు, గసాలలాగ ఉండే గొబ్బి (గొరిట) విత్తులు విడివడిగా దంచి, పొడిచేసి, రెండు కలిపి, నశ్యంగా పీల్చాలి. అంతేకాకుండ దిరిసెన చెక్క, గోరిటాకు, తెల్లమిరియాలు, సొంటి, యాకెల్లి పాయలు దంచి, మసలబెట్టి, కషాయాన్ని తాగాలి. ఎలాంటి శిరరోగాలైనా తగ్గిపోతాయి.

**పేను కొరుకుడు** : పెనుముష్టిగింజ అరగదీసి పేను కొరికినచోట గంధం పెడితే కొరుకుడు తగ్గుతుంది.

**గజ్జెకర్ర** : రేగిముల్లుతోగాని, వడ్లగింజతోగాని దానిచుట్టూ గుండ్రంగా గీసినట్లైతే గజ్జకర్ర పెరగకుండ తగ్గిపోతుంది.

**గజ్జి** : వేపాకు, సీతాఫల గింజలు నూరి శరీరానికి పూస్తుంటే గజ్జి తగ్గుతుంది.

**పైత్యం** : వెలగ ఆకు, జీలకర్ర నూరి తాపితే పైత్యం తగ్గుతుంది. చింతాకు, జీలకర్ర నూరి తాగినా పైత్యం తగ్గిపోతుంది. పైత్య ప్రకోపంవల్ల శరీరంలో దద్దుర్లు లేస్తాయి. మేకమాను తీగతో కడియాలు చేసి చేతులకు, కాళ్ళకు వేస్తే దద్దుర్లు తగ్గుతాయి. ఈ సందర్భంలో వల కప్పుతారు. వలకప్పితే దద్దుర్లు తగ్గుతాయని నమ్ముతారు. ఆలుబుకారపళ్ళుగాని, నిమ్మరసం, తేనె కలిపిగాని తినిపిస్తే కూడ పైత్యం తగ్గుతుంది.

**మలబద్ధకం** : శీకకాయ ఆకుగాని, ధనియాలుగాని మసలబెట్టి కషాయం సేవిస్తే మలబద్ధకం పోతుంది. సునాముఖి ఆకు, కొన్ని ఎండుమిరపకాయలు, కొన్ని పాతచింతపండు రిక్కలువేసి బాగా మసలబెట్టి తాగినా మలబద్ధకం తగ్గుతుంది. భోజనంలో రాలె చిగుళ్ళ పచ్చడిని వాడినా ఇందుకు పనిచేస్తుంది. పరగడుపున చేదుజీలకర్రగాని, దాని పొడినిగాని బుక్కినా మలబద్ధకం ఉండదు.

**అజీర్ణం:** చిన్నచెనంగి ఆకులతో పచ్చడి చేసుకొని తింటే జీర్ణశక్తి పెరుగుతుంది. అలుబుకార పళ్ళతో చేసిన పచ్చడి కూడ ఇలాగే పని చేస్తుంది. సోపు, ధనియాలు నానబెట్టి దంచి, మసలబెట్టి కషాయం తాగినా అజీర్ణం తగ్గి పోతుంది.

**సెగ (మూత్రంలో మంట):** వేసవి కాలంలో ఎండకు శరీరం వేడెక్కి మూత్రం మంటగా ఉంటుంది. వట్టివేళ్ళు, జీలకర్ర నూరి తాగితే మంట తగ్గి మూత్రం జారీ అవుతుంది. చిల్లగింజలు తిన్నా సెగ తగ్గుతుంది.

**అంటురోగాలు (లైంగిక వ్యాధులు):** రోజంతా అనుముల గుడాలు తింటూ ఈతకల్లు త్రాగుతుంటే అంటు రోగాలు తగ్గుతాయి. జెర్రిపోతు మొక్క వేళ్ళు బియ్యం కడిగిన నీళ్ళల్లో నానబెడితే ఎర్రగా అవుతాయి. ఈ వేళ్ళతో ఏలకులు, లవంగాలు, మొలకవేళ్ళు, రసకర్పూరం కలిపి, దంచి, ఈతకల్లులో ఊరబెట్టాలి. ఒక రోజు తర్వాత తీసి, రెండు పూటలా తాగుతూ పథ్యంగా రొట్టె తింటూ ఉంటే ఈ రోగాలు తగ్గుతాయి.

**భేదులకు:** బర్రె పెండలో పెట్టి ఉడికించిన నేపాలగింజను అరగదీసి తాపితే భేదులు అవుతాయి.

**విరేచనాలు తగ్గటానికి:** ఇరికి పళ్ళు తింటే విరేచనాలు తగ్గుతాయి.

**రక్తవిరేచనాలు:** ఇరికి చెక్క దంచి, రసాన్ని రెండు పూటలు తాగితే మంచి గుణం కనిపిస్తుంది. లేత దానిమ్మ కాయలను ఎండబెట్టి చూర్ణం చేసి, బుక్కితే కూడ రక్త విరేచనాలు తగ్గుతాయి.

**వడదెబ్బ :** మామిడికాయను నిప్పుల్లో ఉడకబెట్టి, పిసికి, జీలకర్ర కలుపుకొని తాగితే వడదెబ్బ ఉపశమిస్తుంది.

**సొమ్మ:** సొమ్మ వచ్చినపుడు కుక్కపొగాకు పసరు చెవిలో, ముక్కులో పిండితే సొమ్మ తగ్గిపోతుంది. కాకి మాంసం మిరియాలు, యాకెల్లి పాయలతో వండి తినిపిస్తే సొమ్మరోగం మళ్ళీ రాకుండా పోతుంది.

**దగ్గు:** తుమ్మ చెక్కను పుక్కిట ఉంచుకొని రసం మింగుతూ ఉంటే దగ్గు తగ్గుతుంది. వామ నూరి తాగినా దగ్గు తగ్గుతుంది. తెల్ల జిల్లేడు పూత, కాశపూత ఎండబెట్టి, దంచి, పొడిచేసి రెండుపూటలా బుక్కుతుంటే కాశదగ్గులు కూడ హరిస్తాయి.

**కోరింత దగ్గు:-** పచ్చి కానుగకాయల హారం మెడలో వేస్తారు. లేదా మల్లె ఆకులదండ మెడలో వేస్తారు. కోరింత తీగనార తాడును కూడ మెడలో వేస్తారు. కుత్తుక గుంతలో జీడి పెట్టుకుంటారు. పిల్లలకైతే నడిజుట్టులో జీడి పెడతారు. బాగా దగ్గు ఉన్నట్లయితే కొండనాలుకకు జీడి అంటిస్తారు.

**బాలెంత రోగానికి :-** నమిలిచెట్టుగాని లేక కలివేపచెట్టుగాని లేక వెల్తూరు చెట్టుగాని - ఏదైనా ఒక చెట్టు చెక్క తీసుకొచ్చి మోడి, పిప్పళ్ళు కలిపి దంచి, రసంతీసి మూడు పూటలు పోస్తారు. పథ్యం చప్పిడి. ఏడు పూటలు కూరలేకుండ అన్నం మాత్రం తినాలి. చన్నీళ్ళు ముట్టుకోకుండ వేడినీళ్ళు వాడాలి.

**వాత రోగాలు:-** పెద్దమాను, నమిలి, కలివేప, వెల్తూరు - వీటిలో ఏదైనా ఒక చెట్టుచెక్క తెచ్చి, మోడి, పిప్పళ్ళు కలిపి దంచి, మూడు పూటలు పోస్తారు. ఏడుపూటలు చప్పిడి చేయాలి. స్త్రీలుగాని, పురుషులుగాని సంవత్సరానికోసారి ఈ చప్పిడిమందు తాగుతారు.

**అరికాళ్ళ మంట:-** తంగెడి ఆకు పొడి బుక్కితే అరికాళ్ళ మంట తగ్గుతుంది.

**మేహ రోగాలు:-** దొండగడ్డ చూర్ణం మేహరోగాలను ఉపశమింప చేస్తుంది.

**పసిపాపలకు మీది నొప్పులు:-** ఇది ఊపిరితిత్తుల వ్యాధి. మూడురోజుల వరకు పూటపూటకు గాడిదపాలు లోనికి ఇస్తే ఈ వ్యాధి తగ్గుతుంది.

**పళ్ళపారడి విరేచనాలు:-** మూడాకుల లేదా ఐదాకుల చప్పిడి చెట్టు తెచ్చి, లవంగం కలిపి నూరి పోస్తారు.

**పుళ్ళు:-** పరకచేప కాల్చి, వెంట్రుకల చిక్కు మసిచేసి, కొబ్బరినూనె కలిపి కోడికతో పెడితే పుళ్లు ఎండిపోతాయి.

**నట్టలకు:-** రాత్రి జీడి పలుకులు గంజిలో నానవేసి, ఉదయాన్నే గంజి పారబోసి, గంజిలో శుద్ధి అయిన జీడి పలుకులు తింటే నట్టలు పడిపోతాయి.

ఎఱ్ఱబట్టకు:- ఆరె చెక్క దంచి, పూట పూటకు తాగితే ఈ రోగం తగ్గుతుంది. పచ్చి ఎఱ్ఱగురి మల్లెగడ్డతో మోడి కలిపి, దంచి, తాగినా ఎఱ్ఱబట్ట తగ్గుతుంది.

తెల్లబట్టకు:- పచ్చి తెల్ల గురిమల్లె గడ్డ, మోడి దంచుకొని త్రాగాలి.

బాలెంతలకు పాలు పడటానికి: వరక చేపల కూర, ఎండ్రకాయచారు.

జలుబుకు : మిరియాల పొడి వేసిన ఎండ్రకాయ చారు.

దెబ్బలకు : కొట్లాటలో బాగా దెబ్బలు తగిలినవాళ్ళు మేకపాలల్లో వాడాలు కలిపి కొన్ని రోజులు తాగితే దెబ్బల నొప్పులు తగ్గుతాయి. జాజి కాయ, జాపత్రి, మిరియాలు, ఎల్లిపాయలు మొదలైన దినుసులు పెట్టి వండిన పంది మాంసాన్నో, నల్లమేక మాంసాన్నో లేక నల్లకోడి మాంసాన్నో గోధుమ రొట్టెలతో తింటారు. ఇప్ప పువ్వు సారా తాగుతారు.

గాయాలకు : రక్తమండలం ఆకు తెచ్చి, నూరి కట్టినట్లైతే ఎంతటి గాయమైనా త్వరగా మానిపోతుంది.

చుండెలుక కాటు : సొంటి, మిరియాలు వేసి వండిన పిల్లి మాంసాన్ని తినటం చుండెలుక కాటుకు విరుగుడుగా భావిస్తారు.

తేలు కాటు : తెల్ల ఉసిరి కాయ నూరి తేలు కుట్టిన చోట పెడితే నొప్పి తగ్గుతుంది. ఉడుం కొవ్వు పూసి, కాపినా మంట తగ్గుతుంది.

పాము కాటు : దుష్టపాల, నాగముష్టి, నాగమల్లె నూరి లోనికి ఇవ్వాలి. కళ్ళకు పెట్టాలి. గాయం దగ్గర పెట్టి, కట్టుకట్టాలి

కుక్కకాటు : ఇప్పచెక్క దంచి పోస్తారు. పంది రక్తంలో మిరియాల పొడి కలుపుకొని మింగుతారు. పందిమాంసం వండుకొని తింటారు.

పిచ్చి కుక్కకాటు : కుక్క కాటుకు చేసే చిట్కాలన్నీ పిచ్చికుక్క కాటుకు కూడ చేస్తారు. అంతేకాకుండా పిచ్చి కుక్క కరిచినవానికి కందిపూత పురుగు వైద్యం చేస్తారు.

కందిపూతకు పట్టే పురుగు నల్లగా ఉండి, ఎఱ్ఱ మచ్చలతో జోరీగకన్నా కొంచం పెద్దదిగా ఉంటుంది దాన్ని చంపి, ఎండ పెట్టి, పొడిచేసి ఉంచుకోవాలి.

పిచ్చి కుక్క కరిచిన వానికి చద్ది గంజిలో గండుచీమ తలకాయంత పొడివేసి తాపాలి. పొద్దంతా అన్నం పెట్టకుండ త్రైద (రాగి) అంబలి, మజ్జిగ ఇవ్వాలి. ఈ మందు పిచ్చికుక్క కాటుకు విరుగుడు.

**రేచీకట్లు :** మేక కాలేయం కాల్చి, పాయదీసి అందులో తెల్ల మిరియాల పొడి, పొడపత్రం ఆకు వసరు, చేదు (క్లోమరసం) నింపి, నిప్పులమీద సెగ చూపి, ముక్కలు చేసి, పూటకొక్కటి తినిపిస్తే రేచీకట్లు పోతాయి. మిణుగురు పురుగులను అన్నం ముద్దలో పెట్టుకొని మింగితే కళ్లు బాగా కనిపిస్తాయంటారు.

**నంజు :** క్లోమరస గ్రంధిని 'చేదుబుడ్డ' అంటారు. తాబేలు చేదు, ఉడుము చేదు, నల్లకోడిచేదు - వీటిని మింగినట్లయితే నంజు రోగాలు తగ్గుతాయి. చేదు జీలకర్రను లేదా దాని పొడిని నంజు నివారణకు వాడతారు. తెల్లగలిజేరు, లింగ దొండ, చిట్టిగార, చిన్న కళంద ఆకు కలిపి, దంచి లోనికి ఇచ్చినా నంజు రోగం హరిస్తుంది.

**గడ్డలు - వాపులు :** దుప్పికొమ్ము, కొండ్రిగాని ఎముక గంధం తీసి గడ్డలకు, వాపులకు పూస్తే, అవి తగ్గుతాయి గడ్డలు తగ్గటానికి మర్రిపాలు, లేక మేడిపాలు కూడ కౌడతారు.

**కడుపు నొప్పులు :** బాలెంతలకు వచ్చే మకిల నొప్పికి తాబేలు బొచ్చె, కొండ్రిగాని ఎముక, దుప్పికొమ్ము అరగదీసి లోనికి ఇస్తారు. పిల్లలకు వచ్చే శూలనొప్పులకు ఎండబెట్టిన ఏదు పొట్ట (జీర్ణాశయం) అరగదీసి, చనుబాలతో కలిపి, లోనికి ఇస్తారు. వాము, కరక్కాయ, గారపండు, సతాపాకు కలిపి, నూరి, పిల్లలకు పోస్తే అన్నిరకాల కడుపునొప్పులు తగ్గుతాయి.

**కుష్ఠు :** నాగుపాము తలనరికి, మిగతా భాగాన్ని కూరగా వండుకొని తింటారు.

వీరి ఆహారంలో మాంసాహారం ఎక్కువ. అందువల్ల కొన్ని జంతువుల మాంసం పథ్యమని, కొన్ని జంతువుల మాంసం అపథ్యమని గుర్తించారు. పథ్యా నికి పనికివచ్చే జంతువుల్లో ఎల్లెలుకలు, ఉడుము, జంగపిల్లి ముఖ్యమైనవి. ఉడుత, ముంగిస, కుందేలు, నక్క మొదలైన జంతువులు అపథ్యాలు.

పైన కొన్ని వ్యాధులకు చేసే వైద్యం వివరించబడింది. ఇవేకాకుండా వీరికి కొన్ని ప్రత్యేకమైన వైద్య విధానాలు కూడ ఉన్నాయి. వాటిని ఈ కింద వివరిస్తాను

**కొవ్వు వైద్యం :** నడుం గట్టి పడటానికి ఉడుం కొవ్వును మర్దన చేస్తారు. మోకాళ్ళ కలుకులకు కూడ దీన్ని మర్దన చేస్తారు. ఆలస్యంగా అడుగులు వేస్తున్న చిన్న పిల్లల నడుములకు ఉడుం కొవ్వుతో మర్దన చేస్తారు. బెణుకులకు, ఉసులు పట్టు (నరం పట్టుకోవటం) లకు, వాపులకు ఈ కొవ్వును ఉపయోగిస్తారు. ఇలాగే పంది కొవ్వును కూడ వాడతారు. కలరా ఉన్న రోజుల్లో పంది కొవ్వుతో దీపాలను వెలిగించుకునేవారు. ఇలా దీపం వెలిగిస్తే వారికి కలరా సోకదని విశ్వసించేవారు.

**పంది మాంసం :-** అన్ని మాంసాలకంటే పందిమాంసాన్ని వీరు ఎక్కువగా ఇష్టపడతారు. అనేక సందర్భాల్లో పందిని చంపి పోగులు వేసుకుంటారు. పండగనాడు పంది మాంసం ఉండకతప్పదు. కులపంచాయతుల్లో, విందులిచ్చే సందర్భాల్లో, దేవతల మొక్కుల్లో, దయ్యాల మొక్కుల్లో, పందిని కొట్టుకోవటం తప్పదు. సంచారానికి వెళ్ళేముందు, మ్యాళాలుగా ఏర్పడిన రోజు కూడ పందిని చంపుకుంటారు. ఇలా చేస్తే కలిసొస్తుందని విశ్వసిస్తారు. కలరా వ్యాపించే రోజుల్లో ఇంట్లో పందికొవ్వుతో దీవం వెలిగించుకొనేవారు. చుట్టుపట్ల పంది మలంతో పొగ పెట్టేవారు. పందిమాంసాన్నే వండుకొని తినేవారు. కలరా సోకకుండ పంది ప్రభావం చూపుతుందని వారి నమ్మకం. ఈ విశ్వాసాలకు తోడు అనేక రోగాలకు చికిత్సగా పందిమాంసాన్ని తింటారు. పిచ్చికుక్క తమ వేట కుక్కలను కరిచిన సందర్భంలో గూడెమంతా కలిసి పందిని తెచ్చుకుంటారు. కుక్కలకు కూడ పంది మాంసం తినిపిస్తారు. వేట కుక్కలకు గంజి, అంబలి పోసేటప్పుడు వాటిలో జెమ్మడి పాలు కలుపుతారు. పిచ్చికుక్క కాటుకు జెమ్మడి పాలను విరుగుడుగా బావిస్తారు. మనిషికి కుక్కకరిచినప్పుడు పంది రక్తంతో మిరియాల పొడి కలిపి మింగుతారు. పందిమాంసాన్ని వండుకొని తింటారు. బాలెంత రోగంతో బాధపడే వారికి చెట్ల మందులు పోసిన తర్వాత పంది పేగులు వండి తినిపిస్తారు.

**జీడి వైద్యం :-** బుడిగె జంగాలు జీడితో అనేక చికిత్సలు చేస్తుంటారు. కాలికి విరిగిన ముల్లును తీశాక, నొప్పిచావటానికి జీడిపోసి, నిప్పుతో కాపుతారు. కీళ్ళ నొప్పులు పోవటానికి నొప్పి ఉన్న దగ్గర జీడి పెడతారు. వర్షాకాలంలో నీళ్ళల్లో తిరిగి తిరిగి కాలివేళ్ళ సందులు జవికి నొప్పి చేస్తాయి వీటినే 'ఊరిళ్ల'

అంటారు. ఈ నొప్పి తగ్గటానికి వేళ్ళ సందుల్లో జీడి పెడతారు. దగ్గు బాధ ఎక్కువైనప్పుడు గొంతు గుంటలో జీడి పెట్టటమే కాకుండ, కొండ నాలుకకు కూడ అంటిస్తారు. పిల్లలకు నడిజుట్టులో జీడిపెడతారు. కీళ్ళ నొప్పులు, దెబ్బల నొప్పులు తగ్గటానికి నొప్పి ఉన్నచోట జీడితో గుల్లులు వేస్తారు. జీడి గింజమీద గుచ్చి, ఐదారు చిన్న చిన్న రంధ్రాలు వేస్తే లోపలినుంచి రసం మెల్లగా ఉబుకుతుంది. చిన్న దబ్బడంతో జీడి గింజ వెనక భాగాన్ని గుచ్చి పట్టుకొని, రంధ్రాల వైపును నిప్పుమీద వేడి చేస్తారు. జీడికి ఉడుకు తగిలాక నొప్పి ఉన్న స్థలంలో తడిబట్ట వేసి, దానిమీదినుంచి ఈ వేడి జీడి గింజను పెట్టి, వొత్తుతారు. దానితో నొప్పి ఉన్న దగ్గర చురుక్కుమనటమే కాకుండా బట్టలోనుంచి వెళ్ళి జీడి కూడ అంటుకుంటుంది. జీడి అంటుకున్న దగ్గర తర్వాత పుండు అవుతుంది. పుండు మానటంతో నొప్పి కూడ తగ్గుతుంది. దీన్నే 'గుల్లు వేయటం' అంటారు. గత్తర (కలరా) ఉన్న రోజుల్లో జీడిబొట్లు పెట్టుకునేవారు జీడిబొట్లు పెట్టుకుంటే కలరా సోకదని నమ్మేవారు.

**అగ్ని వైద్యం :** పుట్టినప్పుడు పుల్లలు (పుడకలు) వేయటం వీరిలో కూడ ఉంది సూదిని చింతనిప్పుల్లో ఎర్రగా కాల్చి, శిశువు బొడ్డుకు నాల్గు వైపులా రెండ్రెండు వాతలు వేస్తారు. దీన్నే 'పుల్లలు వేయటం' అంటారు. ఈ విధంగా పుల్లలు వేస్తే పిల్లలకు పాలు బాగా జీర్ణమై ఆరోగ్యంగా ఎదుగుతారని విశ్వసిస్తారు. సొమ్మ రోగాలకు, కొన్ని రకాల వాత రోగాలకు పసుపుకొమ్ము మొదలైనవాటితో నొసలు, కణతలు, మెడ మున్నగుచోట్ల కాల్చుతారు. నంజు రోగం ఉన్న పిల్లలకు రెండు మణికట్ల వద్ద రూపాయి బిళ్ళంత గుండ్రంగా అగ్నిముద్రలు వేయిస్తారు. జీడి గుల్లులు కూడ అగ్ని వైద్యంలో చెప్పుకునేవే. మడిమశూల అయినప్పుడు పెండతో మడిమ మీద కుదురుకట్టి నూనె మరిగించి పోస్తారు.

ఇంతవరకు పేర్కొన్న బుడిగె జంగాల వైద్యం పరిశీలిస్తే రోగనివార ణోపాయాల్లో కొన్ని గ్రామీణుల్లో కూడ కనిపిస్తాయి. కాని వీరికే పరిమితమైన మందులు, చిట్కాలు, విధానాలు చాలా కనిపిస్తాయి. వృక్ష సంబంధ వైద్యంలో ఆయా రోగాలకు వీరే వాడేమొక్కలు అనేకం ఉన్నాయి. జంతు సంబంధ వైద్యం వీరికి ప్రత్యేకమైంది గిరిజన జాతుల్లో ఈ విధానం సంప్రదాయంగా

వస్తుంటుంది. జానపద వైద్యంలో వీరు చేయి తిరిగినవారు కాబట్టే ఏ విధమైన వృత్తి గాయకులుగా ఉన్నా ఓ పక్క వైద్యం చేయటం కూడ ఉంటుంది. సంప్రదాయంగా వస్తున్న జానపద వైద్యానికి తోడు బైరాగి చిట్కాలు, పులిప్పాణి వైద్యం మొదలైన విధానాలను కొన్నింటిని కూడ అభ్యాసం చేసి వైద్య వృత్తిలోనే కొందరు స్థిరపడటం కనిపిస్తున్నది. ఈ వైద్యానికి తోడు భూతవైద్యం కూడ చేస్తుంటారు. కోయ వంతు వృత్తి, మైకు సెట్లతో మందులమ్మే వృత్తి స్వీకరించినవాళ్ళను, ప్రతిగూడెంలో దర్శనమిచ్చే బుడిగె జంగం నాటు వైద్యులను, భూతవైద్యులను గమనిస్తే జానపద వైద్యంలో బుడిగె జంగాలకున్న అనుభవం, అవగాహన ప్రస్ఫుటమౌతుంది.

ఈ విధంగా ఈ ప్రకరణంలో బుడిగె జంగాల ఆచార సంప్రదాయాలు పరిశీలించబడ్డాయి. ఇతర కులాలవారికి, తెగలవారికి, బుడిగె జంగాలకు ఆచార సంప్రదాయాల్లో ఉన్న భేదసాదృశ్యాలు వీలైనంతవరకు చర్చించబడ్డాయి. ఏ ఆచారం తీసుకున్నా, ఏ సంప్రదాయం తీసుకున్నా వీరి కుల ప్రత్యేకత స్పష్టంగా కనిపిస్తుంది. వేట వీరిని ఆటవిక జీవనానికి దగ్గరగాచేస్తే, కుల పంచాయతులు తెగల లక్షణాలను ఆపాదిస్తున్నాయి. ప్రసూతి, వివాహం, ఆరాధనా పద్ధతులు మొదలైన ఆచారాలు ఆ విషయాన్ని బలపరుస్తున్నాయి.

ఆచార సంప్రదాయాల తర్వాత వీరి వస్తు సంస్కృతి గురించి వివరించవలసివున్నది. తర్వాత ప్రకరణంలో ఈ విషయాన్ని పరిశీలిస్తాను.

ఐదవ ప్రకరణం

# వస్తు సంస్కృతి

తమ జీవనోపాధికి అవలంబిస్తున్న చేతిపనులుగాని, వినియోగ వస్తువులు గాని, తమ అవసరాలకు తయారుచేసుకున్న వస్తువులుగాని వస్తుసంస్కృతిలో భాగాలవుతాయి. దీన్నే భౌతిక సంస్కృతి (మెటీరియల్ కల్చర్) అంటారు. 'ఫోక్‌లోర్ అండ్ ఫోక్‌లైఫ్' గ్రంథంలో రిచర్డ్ ఎం. డార్సన్ ఇందులో చేతి పనులు, చిత్రకళ, వాస్తు, దుస్తులు, వంట అనే 5 విభాగాలను పేర్కొన్నారు.

జానపద విజ్ఞానంలో స్థూలంగా రెండు విభాగాలుంటాయని అవి '1. కంటికి కనిపించనివి 2. కంటికి కనిపించేవి' అని, కంటికి కనిపించే కౌశలాన్ని ప్రదర్శించే వస్తువులు వస్తుసంస్కృతిలోకి చేరతాయని డా. ఆర్.వి.ఎస్. సుందరంగారు 'ఆంధ్రుల జానపద విజ్ఞానం'లో పేర్కొన్నారు.

పై నిర్వచనాలను దృష్టిలో పెట్టుకొని బుడిగె జంగాల్లో సంప్రదాయంగా వస్తున్న వస్తు సంస్కృతిని ఈ కింది విభాగాల కింద పరిశీలించవచ్చు.

1. ఇండ్లు
2. ఇంటిలోని వస్తువులు
3. ఆహార పానీయాలు
4. దుస్తులు - ఆభరణాలు
5. పశుసంపద (పెంపుడు జంతువులు)
6. చేతిపనులు

## 1. బుడిగె జంగాల ఇండ్లు

చెంచు నివాస ప్రదేశాన్ని 'చెంచుగూడెం' అని, కోయల నివాస ప్రదేశాన్ని 'కోయగూడెం' అని, లంబాడీల నివాస ప్రదేశాన్ని 'తండ' అని

అన్నట్లుగానే, బుడిగె జంగాల నివాస ప్రదేశాన్ని 'బిరాడు' అంటారు. 'బిరాడు' పదం 'బిడారు' నుంచి వచ్చింది. 'బిడారు' అంటె 'తండ' అని కూడ అర్థం. బిడారు పదం 'గుడారు' నుంచి వచ్చింది. గుడారు, బిడారు, బిరాడు- ఈ మూడు పదాలు సమానార్థకాలు. ఈ పదాలు 'తెగల నివాస ప్రదేశం' అనే అర్థాన్ని బోధిస్తాయి.

బుడిగె జంగాల ఇండ్లు ఊరికి దూరంగా ఉంటాయి. వీరిలో రక రకాల వృత్తి వేషాలు వేసే వారున్నా, వీరిందరి కులం మాత్రం ఒక్కటే కాబట్టి కులస్థులంతా కలిసి ఒకేచోట సామూహికంగా జీవిస్తుంటారు. అర్ధ చంద్రాకారంలో ఉండే చిన్న చిన్న మూడు వంకర్ల గుడిసెలు వీరివి. వీరు గ్రామీణులకు దూరంగా మసలుతుంటారు. నాగరక సమాజంలో ఇముడక మరుగు జీవితాన్ని ఇష్టపడుతుంటారు. అందువల్లనే సమాజానికి దూరంగా 'బిరాళ్ళ'లో విలక్షణమైన తెగ లక్షణాలతో జీవనం సాగిస్తారు.



బుడిగె జంగాల బిరాడు

జానపద వృత్తి కళలను ప్రదర్శిస్తూ, ఊరూరు తిరుగుతూ జీవిస్తారు కాబట్టి, వీరి గుడిసె సులభంగా నిర్మించటానికి, సులభంగా విప్పటానికి, సులభంగా మోస్కొనిపోవటానికి వీలుగా ఉంటుంది.

ఏప్రిల్ 1989 'బుడ్గజంగం వాణి' ప్రత్యేక సంచికలో వీరి గుడిసెను వర్ణించే ఈ కింది గేయం ప్రచురించారు.

మూడు వంకర్ల గుడిసెరా - నాది
ముచ్చటైన చాప మిద్దెరా ॥మూ॥

మూడు వంకర్లు పాతి - కుంచెన శివ్వలు జేర్చి
వెంట్రుక తాళ్ళను చుట్టి - బల్గోలలు బంధించి
వెన్క మాడుచాప వేసి - పక్క బగుల్ రిక్క గట్టి
అస్తర్లు మీదవేస్తే అదే - నా గుడిసౌనురా ॥మూ॥

ముందు నుంచి చూస్తె నేమొ - చందమామ సగం రూపు
వెనక నుంచి చూస్తే అదియే - కనక గిరి అనిపించూ
మూడు కాలాలలోనా - నీడ నిచ్చు ఆ గూడు
కావిడి దబ్బుంటె చాలు - కదులుతుంది ఊరూరు ॥మూ॥

మూడు వంకర్ల గుడిసె ఇక్కడ చాప మిద్దెగా భావింపబడ్డది. గుడిసె నిర్మాణం కూడ చెప్పబడింది. ముందు నుంచి అర్ధ చంద్రునిలా, వెనక నుంచి కనకగిరిలా తమ గుడిసె కనిపిస్తుందని, వాననుంచి, చలినుంచి, ఎండనుంచి తమను కాపాడే ఆ గుడిసె కావడి బద్ద సహాయంతో ఊరూరు తిరుగుతుందని వర్ణించబడింది.

వీరి గుడిసెకు మూలాధారం మూడు వంకర్లు. 'వంకర్లు' అంటే వంకరగా తిరిగి ఉన్న కట్టెలు. ఊడుగు చెట్టువి గాని, వావిలివిగాని ఒక అంగుళం మందం, సుమారు ఎనిమిది అడుగుల పొడవున్న కట్టెలను కొట్టుకొస్తారు. మధ్యలో రెండు గజాల ఎడం ఉంచి, వాటిని ఇటు మూడు, అటు మూడు పాతుతారు. తర్వాత రెండ్రెండు కట్టెలపై చివర్లను ఒకదానితో ఒకటి కలిపి, వలయంగా వంచి, ఇంచుమించు ఐదడుగుల ఎత్తు మీద తాడుతో చుట్టి కడతారు. అప్పుడే రెండు కట్టెలు అర్ధ చంద్రాకారంగా వంగుతాయి. దీన్నే 'వంకర' అంటారు. ప్రతి గుడిసెకు ఇలాంటి మూడు వంకర్లు కావలసి ఉంటుంది. పచ్చి కట్టెలను కొట్టుకొచ్చి, ఒక దగ్గర పాతి, వంకర్లుగా కట్టి, ఎండినదాకా ఉంచుతారు. ఎండిన

తర్వాత ఈ కర్రలు ఎప్పటికీ వంకరగానే ఉంటాయి. అప్పుడు వీటిని గుడిసెకు వంకర్లుగా వాడుకోవటం సులభమవుతుంది.

గుడిసె వేసుకునేటప్పుడు అనువైన స్థలంలో ముందుగా ఈ మూడు వంకర్లను పాతుతారు. ఈ మూడు వంకర్లకు అడ్డుకట్టెలుగా 'బల్గోలలు' వాడుతారు. 'బలమైన కోల' అనేదే 'బల్గోల' అయ్యింది. 'కోల' అంటే 'పొడవాటి కర్ర' సర్వసామాన్యంగా అంకోల వృక్షం (ఊడుగచెట్టు) కర్రలనే బల్గోలలుగా వాడుతారు. కాబట్టి వీటికి ఈ పేరొచ్చిందేమో. ప్రతి గుడిసెకు పది బల్గోలలు ఉంటాయి. ఊడుగు కర్రలు దొరకనప్పుడు వాయిలి, వెదురు కర్రలను కూడ ఉపయోగిస్తారు. వీటిని మూడు వంకర్లకు అడ్డంగా పెట్టి, ప్రతి వంకరతో కలిపి కట్టేస్తారు.

వంకర్లు, బల్గోలలు కట్టిన తర్వాత వెనకభాగంలో ఐదు 'మాడు శివ్వలు' పాతి, పై చివరలను వంకర కట్టెతో కలిపి కడతారు. 'శివ్వ' అనే పదం 'చివ్వ' నుంచి వచ్చింది దీనికి 'సన్నంగా పొడవుగా ఉండే కొమ్మ' అని అర్థం. గడ శివ్వ, శివ్వకట్టె అనే ప్రయోగాలు వీళ్ళలో కనిపిస్తాయి. మాడు శివ్వలను 'కుంచెనశివ్వలు' అనికూడ అంటారు. వంగి, వంకరగా ఉండటంవల్ల ఈ పేరు వచ్చి ఉంటుంది. వంకర్లలాగానే ఈ కర్రలను కూడ పచ్చిగా ఉన్నప్పుడు కొంచం వంపి, కట్టి ఉంచుతారు. ఎండిన తర్వాత తాడువిప్పి, మాడు శివ్వలుగా వాడుతారు. ఈ వంగిన మాడు శివ్వలు కట్టడంతో గుడిసె వెనకభాగంలో వలయంగా వాలు ఏర్పడుతుంది. ఈ వెనక భాగాన్ని 'మాడు' అంటారు. తలకు మాడ (మాడ పట్టు) ఎలాంటిదో, గుడిసెకు ఈ మాడు అలాంటిది. మాడు శివ్వలు కట్టడంతో గుడిసెకు ఒక రూపం (స్ట్రక్చర్) ఏర్పడుతుంది. ఇప్పుడు వరుసక్రమంలో దానిమీద చాపలు వేస్తారు.

గుడిసె రెండు పక్కలకు కింది భాగంలో, భూమికి రెండంగుళాలపైన మూడున్నర అడుగుల వెడల్పున్న తాటిచాపను, మొదటి వంకరనుంచి, చివరి వంకరదాకా పొడవుగా అటు ఒకటి, ఇటు ఒకటి కడతారు. ఈ తాటి చాపలను 'బగుల్ రెక్కలు' అంటారు. గుడిసెకు కట్టే 'పక్కల రెక్కలు' అనేదే 'బగుల్ రెక్కలు' అయింది. బగుల్రెక్కలు తాటి ఆకులతో అల్లినవికావు. తాటి ఆకులను వరుసగా ఒకదాని అంచున ఒకటి చేర్చి, అడుగున్నర పొడవుండే

దబ్బడం సహాయంతో తాడుతో కుట్టినవి. ఎండిన తాటి ఆకుల మీద నీళ్ళు జల్లి, ఆకును విప్పి ఒక ఆకుతో రుద్ది, వెడల్పుగా సాపు చేస్తారు. వాటిని ఒకదాని అంచువద్ద మరొకటి చేర్చి కుడతారు. రెండవ వరుసలో మళ్ళీ ఒక్కొక్క ఆకును జొనిపి, తాడుతో కుడతారు. ఈ విధంగా మూడు వరుసలు కుట్టి, బగ్రలిక్కలను తయారు చేసుకుంటారు. రెండువైపులకు చివరన ఉండే కుట్టు తాళ్ళతో బగ్రలిక్కలను మొదటి వంకరకు మూడు చోట్ల, చివరి వంకరకు మూడు చోట్ల కడతారు.

బగ్రలిక్కలను కట్టిన తర్వాత వంకర్ల మీది నుంచి 'అస్తర్లు' వేస్తారు. 'అస్తర్లు' అనేవి ఇంటిపైన కప్పే ఈతచాపలు. అటువైపు బగ్రలిక్కల మీద నుంచి వేసిన చాప (అస్తర), ఇటు కొంచం తగ్గుతుంది. ఇటు నుంచి వేసింది అటుకొంచం తగ్గుతుంది. ఒకదాని మీద ఇంకొకటి వేస్తే గుడిసె మూడు వంకర్ల వరకు మొత్తం కప్పబడుతుంది.

అస్తర్లు వేశాక మాడు శివ్వాల మీద మాడు చాపలు వేస్తారు. మాడు చాపలు బగ్రలిక్కల మాదిరిగా తాటి కమ్మతో కుట్టినవి బగ్రలిక్కల పొడవు, వెడల్పు సమానంగా ఉంటుంది. మాడు చాపలు కుడుతున్నప్పుడు ఆ వక్క ఈ పక్క కమ్మలు తగ్గిస్తూ కుట్టడం వల్ల రానురాను వెడల్పు తగ్గుతూ వస్తుంది. చివరికొన గుడి శిఖరంలాగా తయారవుతుంది. గుడిసె వెనక భాగాన్ని అంటే మాడు శివ్వాలను ఇలాంటి మాడు చాపతో కప్పుతారు గుడిసె పైనుంచి తాళ్ళతో కట్టేస్తారు. దీనితో బుడిగె జంగాల గుడిసె నిర్మాణం పూర్తయిపోతుంది.

వర్షాకాలంలో గుడిసె చుట్టు 'వర్సంది' తీస్తారు. 'వర్సంది' అంటే వర్షపు నీరు పోయే సంధి లేక సందు. గుడిసె చుట్టూ రెండు మూడంగుళాల లోతుగా చిన్న కాల్వదీసి, అదే మన్నుతో చుట్టూరా కట్టలాగా కడతారు. ఇలా చేయటం వల్ల వర్షపు నీరు గుడిసెలోకి రాకుండ. పక్కనుంచి వెళ్ళిపోతుంది.

వీరు గుడిసె కట్టటానికి ఉపయోగించే తాళ్ళకు కూడ ప్రత్యేకమైన పేర్లు పెట్టుకున్నారు. ముందరి వంకరను ఇల్గొలలు కలిపికట్టే తాడుకు, 'ముందలి వంకరతాడు' అని పేరు. అలాగే 'వెనక వంకరతాడు' ఉంటుంది. నడిమి వంకరకు కట్టే తాడును 'నడిమి గాలి తాడు' అంటారు. గుడిసె లోపల వాడే తాళ్ళు వెంట్రుకల తాళ్ళు కాగా బయట ఉపయోగించేవి నారతాళ్ళు.

ఒక ఊరినుంచి మరో ఊరికి వెళ్ళేటప్పుడు గుడిసె విభాగాలన్ని ఒక్కొక్కటిగా చకచకా తీసి, వేటికవి కట్టి, కావడి పెట్టుకొని తీసికెళ్తారు. గుడిసెకు ఉపయోగించే ప్రతి చాపకు, తాడుకు, కర్రలకు ప్రత్యేకమైన పేర్లుండటంవల్ల గుడిసె వేయటంలో, గుడిసె విప్పటంలో వీరికి సౌలభ్యం కలుగుతున్నది.

జంగం ఉపకులాల్లో సంచార లక్షణం కలిగి ఉండి, గుడిసెల్లో నివసించే తెగ బుడిగె జంగాలది. అందువల్లనే వీరికి గుడిసె జంగాలనే పేరు కూడ ఉంది. వీరు గుడిసెకు వాడే 'బల్లాల' అనేది వీరిలో ఒక ఇంటి పేరుగా ఉందంటే - వీరి జీవనపద్ధతిలో గుడిసెకు ఉన్న ప్రాధాన్యం తెలుస్తున్నది. బల్లాల చిన్న వీరన్న అనే బుడిగె జంగం నంద్యాల (కర్నూలు జిల్లా) పట్టణంలో మునిసిపల్ కౌన్సిలర్‌గా పనిచేశారు.

ఇప్పుడిప్పుడు గ్రామాల్లో స్థిరపడుతున్న బుడిగె జంగాలు పూరిగుడిసెలు, పెంకుటిళ్ళు, రేకుల ఇళ్ళు మొదలైనవాటిలో నివసిస్తున్నారు. నగర ప్రాంతాల్లోని వారిలో కొందరికి ఆర్.సి.సి ఇళ్ళు కూడ ఉన్నాయి. గ్రామ ప్రాంతాల్లో ప్రభుత్వం కట్టించిన బలహీనవర్గాల కాలనీల్లో కూడ వీరు నివసిస్తున్నారు.

## 2. ఇంటిలోని వస్తువులు

గుడిసె వాకిట్లో ఒక పక్కన మూడురాళ్ళ పొయ్యి ఉంటుంది. దాని పక్కన ఒక నీళ్ళకుండ, ఒక బువ్వకుండ, ఒక కలికుండ, కూరకుండ లేక పులుసు అటికె ఉంటాయి. కలిపెట్టి అన్నం లేక నూకల అన్నం వండుకుంటారు. రొట్టెలు చేసే పిండిలో కలిపోసి పిసికి రొట్టెలు చేసుకుంటారు. అన్నంకుండ మీద మూతపెట్టటానికి బుడ్డిలేక మరువ ఉంటుంది. అందులోనే ఉప్పు పోసుకుంటారు. పూర్వం రొట్టెలు చేసుకోవటానికి మట్టిపెనం వాడేవారు. ఇప్పుడు ఇనుపపెనం వాడుతున్నారు. కలికుండ పక్కన గంజికుండ కూడ ఉంటుంది. అన్నం నుంచి గంజి వొంపటానికి సిబ్బి వాడతారు. సిబ్బిని దూసర (సుదర్శన) తీగతో అల్లుతారు. కొబ్బరిచిప్పకు సన్ననికట్టె దోపి చేసిన తెడ్డు ఉపయోగిస్తారు దీన్ని 'దోకాయ' అంటారు.

కారం నూరుకోవటానికి ఇంటింటికి ఒక 'గుంజిప్ప,' ఒక గుత్పకట్టె' ఉంటాయి. 'గుంజిప్ప' అంటే గుండ్రని చిప్ప. ఇది అర అంగుళం మందం

ఉంటుంది. లోపలి భాగంలో దొడ్డు ఇసుకను అతికించి, వీరికోసం కుమ్మరి దీనిని ప్రత్యేకంగా తయారుచేస్తాడు. గుత్పకట్టె ఉపయోగించి గుంజిప్పలో ఎండుమిరపకాయలు మొదలైనవాటిని నూరుకోవచ్చు. కారం నూరటానికి ఉపయోగించే కట్టె అయినందువల్ల గుత్పగట్టెను 'కారంకట్టె' అని అంటారు. ఇంచుమించు రెండంగుళాల వ్యాసం, మీటరు పొడవున్న కర్రను గుత్పకట్టెగా ఉపయోగిస్తారు. చింత, తుమ్మ, ఊడుగు, వెలుతురు, మంగ మొదలైన కర్ర లను కారం కట్టెలుగా వాడుతారు. సాధారణంగా తుమ్మకర్రలను కారం కట్టె లుగా వాడుతుంటారు.

కాలానుగుణమైన మార్పులవల్ల ఇటీవలి కాలం నుంచి చాలామంది బుడిగె జంగాలు మట్టిపాత్రలకు ప్రత్యామ్నాయంగా అల్యూమినియం పాత్రలను కూడ వాడటం ప్రారంభించారు.

ఆహార పాత్రలు కాకుండ ఇంట్లో, ఇంటి బయట ఉండే వస్తువుల్లో వలలు, చిక్కాలు, ఉరులు, బోనులు, ఊదరలొట్టి, కర్ర, కొడవలి మొదలైన వేట పరికరాలు, చాపలు అల్లటానికి ఉపయోగించే ఈత కమ్మ మోపులు, తిన టానికి దాచుకున్న జొన్నలు, రాగులు పోసిపెట్టిన 'బుంగతిత్తి' మొదలైనవి ఉంటాయి. ఈత చాపతో సంచిలాగా తయారుచేసినదాన్నే 'బుంగతిత్తి' అంటారు. కొందరి దగ్గర సొరబుర్రలు కూడ ఉంటాయి. ఇప్పుడు వాటి వాడకం తగ్గినా ఇటీవలి కాలందాకా అడుక్కున్న అంబలి పోసుకోవటానికి, ఎండకాలంలో నీటిని నిలువచేసుకోనటానికి సొర బుర్రలను ఉపయోగించేవారు నూనె, తేనె, నిలువ చేసుకోవటానికి సిద్దెలు ఉంటాయి. ఇవికాకుండ ఇంటికో కావడి దబ్బ తప్పకుండ ఉంటుంది. ఒక ఊరి నుంచి మరో ఊరికి వెళ్ళేటప్పుడు సామాను మోయటానికి, వనంనుంచి ఈతకమ్మ తేవటానికి కావడిదబ్బ తప్పని సరి. కావడి పెట్టుకోవటానికి ఉపయోగించే 'బద్ద'నే 'కావడిదబ్బ' అని అంటారు. దీన్ని లావుపాటి వెదురును చీల్చి తయారుచేస్తారు.

వీరు మాట్లాడుతున్నప్పుడు తాము ఉపయోగించే వస్తువులను ఉపమానా లుగా ఉపయోగిస్తారు. బాగా కొవ్వుపట్టి ఉన్నవాణ్ణి 'నూనెసిద్దె' తో పోలుస్తారు. స్థూలకాయుణ్ణి, దృఢమైన శరీరం కలవాణ్ణి 'బుంగతిత్తి'తో ఉపమిస్తారు. పెళ్ళి కాని పిల్లను, పిల్లవాణ్ణి 'చిన్నవాళ్ళు' అనే అర్థంలో 'బుర్రకాయంత పిల్ల,' 'బుర్రకాయంత పిలగాడు' అని సంబోధిస్తారు.

పీరి ఇండ్లను ఇంటిలోని వస్తువులను గమనించినట్లైతే పీరిని ఆటవిక జీవనం నుంచి గ్రామీణజీవనం వైపు పయనిస్తున్న సమాజంగా గుర్తించవచ్చు. అటు కొండల్లో ఉండక, ఇటు గ్రామాలకు చేరక మధ్యస్థ జీవితం గడుపుతున్నారు. వీళ్ళ గూడెం 'బిరాడు' సంచార జీవనాన్ని తెలుపుతున్న పదం. ఇండ్ల నిర్మాణం కూడ ద్రిమ్మరి జీవితానికి గుర్తుగా ఉంది. ఇంటిలోని వస్తువుల్లో చోటుచేసుకున్న వేట పరికరాలు పీరికి వేటపట్ల ఉన్న గాఢమైన అభినివేశాన్ని చాటుతున్నాయి. పీరిలో వేట ఒక సాంప్రదాయిక వృత్తిగా స్థిరపడినట్లు రుజువు చేస్తున్నాయి. ఈతకమ్మ మోపులు, పట్టెలు చాపలల్లే ఉపవృత్తిని బోధిస్తాయి. వంటపాత్రలు, ఆహారపు అలవాట్లు పీరిలో ఉన్న ఆదిమ జాతి లక్షణాలకు ప్రతీకలు. ఈ విధంగా పీరి ఇండ్లు, ఇంటిలోని వస్తువులు పీరి జీవనవిధానానికి దర్పణాలుగా ఉన్నాయి.



బుడిగె జంగం బిరాడులో చాపలల్లటం

## 3. ఆహార పానీయాలు

ఆహారం కోసం వేట మీదనే ఆధారపడటం ఆదిమజాతి లక్షణం. ఆనాటి నుంచి ఈనాటి వరకు ఈ లక్షణం మానవ సమాజాల్లో కొనసాగుతూనే ఉంది. కొండ జాతుల్లో రోజూ వేటాడి, జంతువుల మాంసం తినని తెగలు అరుదుగా ఉంటాయి. పీరికి ఈనాడు వరి, జొన్న మొదలైనవి ప్రధానాహారంగా ఉన్నా,

అడవి జంతువుల మాంసాహారం కూడ అప్రధానమేమీకాదు. యానాదులు, చెంచులు మొదలైన తెగలవారిలో ఇప్పటికీ ఈ ఆహారవిధానం కనిపిస్తున్నది. బుడిగె జంగాలు కూడ ఆహారపు అలవాట్లలో యానాదులు, చెంచులలాంటివారే.

బుడిగె జంగాలకు వేట ప్రధాన వ్యాపకం. ఏ వృత్తి వేషం వేసినా, ఇంటికొచ్చాక వేటకు వెళ్ళటం సర్వసాధారణం. ప్రతి రోజు ఏదో అడవి జంతువును తెచ్చుకొని తిన్నదాకా వీరికి గడవదు. పెద్ద జంతువులేవీ దొరకకనినాడు ఉడతలో, ఎలుకలో, చేపలో, ఎండ్రకాయలో ఏవో ఒకటి తప్పవు.

**ప్రాచీన కావ్యాల్లో:** పూర్వ కవులు భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యాదులను తమ కావ్యాల్లో విరివిగా వర్ణించారు. మాంసాహార వర్ణనలు చాలా తక్కువ. కాళహస్తి మాహాత్మ్యంలో ధూర్జటి నిషాదుల వేటను వర్ణించాడు. తిన్నడు పందులు, లేళ్ళు, దుప్పులు మొదలైన జంతువులను చంపి, మంచి మాంస ఖండాలను కరకుట్లుగా కాల్చి, శివునికి భక్తితో సమర్పించాడని చెప్పాడు.[1] నిషాదులు అడవి పందులను కూల్చి, కాల్చి, తిన్నారని ఇలా వర్ణించాడు :

> క్రొవ్విన యేకలంబులను కొన్నిటి గూల్చి, కమర్చి పెంచులం
> జివ్వుచు, ఎఱ్ఱమన్నలది, చివ్వన నీరివురంగ నేర్చి, నో
> ళ్లవ్విళులూర ప్రేల్చి, చమురుట్టిపడం కరికుట్లు గాల్చి, క
> ల్జువ్వల నీడ నొక్క పరిశుద్ధ శిలాతలభూమి నందఱున్.'[2]

ఈనాడు అడవి పందులు లభించకున్నా బుడిగె జంగాలు ఊరపందులను ఇలాగే కాల్చి, పోగులు వేసుకోవటం ఉంది.

అల్లసాని పెద్దన మనుచరిత్రలో స్వారోచి మృగయావిహారం వర్ణించబడింది. వేటాడిన తర్వాత వేటగాళ్ళు సెలయేరు చెంతనే ఉన్న పెద్ద వృక్షాల నీడకు చేరి, జంతువుల మాంసాన్ని వండుకొని, కాల్చుకొని, మొదట అడవి రేనికి సమర్పించి, తర్వాత తాము తిన్న విధానాన్ని కవి ఇలా వర్ణించాడు:

---

1. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము - 3 - 88.
2. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము - 3 - 50.

వేటగాళ్ళు సమతలంగా ఉన్న భూమిని కొంచెం త్రవ్వి, చిన్న చిన్న గుంటలు చేశారు. గుంటల్లో నావురు చెట్టు ఆకులు పరిచి, మాంసం లోనుంచి మంచి మంచి మాంస ఖండాలు, కారిజం, కందనకాయ, కొవ్వు మొదలైన మెత్తని భాగాలను ఆకుల నిండుగా కుక్కారు. అందులో కండతో ఉన్న చింత కాయలను ఎక్కువ తక్కువలు కాకుండ దంచి వేశారు. తేటదైన లేడి రక్తాన్ని ఎసరుగా గుమ్మరించారు. ఉప్పు కలిపారు. కావుగప్పి, మీది నుంచి కారెనుము పిడకలను పేర్చారు. నెల్లి కొయ్యలు రాపిడి పెట్టి, అగ్గి పుట్టించి, పిడకల నుగ్గులకు అంటించారు. మంట అందుకొని లోపల బాగా ఉడికిన తర్వాత తీసి, ఉప్పువట్టి వేడి వేడిగా ఉన్న మాంసంముక్కలను చట్రాతి మీద పెట్టి, కాటిరేనికి సమర్పించారు. వీటితోపాటు కనకనలాడే నివ్వలో చమురు చిప్పిల్లగా కాల్చిన కరకుట్లను కూడ అడవి దేవుడికి కుడుపు పెట్టారు. దేవతా ప్రీతి కోసం జంతువుల తలలు, తోకలు, డొక్కలు తీసి అక్కడి చెట్లకు కట్టారు. తర్వాత పాళ్ళ వెంబడి పంచుకొని అందరు తిన్నారు.[1]

ఈనాటికి బుడిగె జంగాలు కూడ వేటలో ఇలాగే మంచి మంచి మాంస ఖండాలను వండుకొని, కాల్చుకొని తినటం కొనసాగిస్తున్నారు. 'వేటలో వంట' శీర్షిక కింద ఈ విషయం ప్రస్తావించబడుతుంది.

**బుడిగె జంగాలు తినే జంతువులు :** వీళ్ళలో ప్రచారంలో ఉన్న ఈ కింది వేటపాటలో వీరు వేటాడి పట్టుకొని తినే అనేక జంతువుల పేర్లు పేర్కొనబడ్డాయి.[2]

అశోక్కటికి ఎంత బాదరా! ఓ కారిగా!
శికారంటె సింత లేదురా! బికారిగా! ॥అ॥

కాల్వలోని చిన్నచేప - మడుగులోని పెద్దచేప
గవ్వలోని ఎండ్రకాయ - తొవ్వి తొవ్వి పట్టెగూడ ॥అ॥

తుక్కుదీసి ఊద్రగొట్టి - లొట్టిదీసి లట్టిలేసి
ఎల్క పెంట తొవ్వుకున్న - ఏమిజాలదయ్యో నీకు ॥అ॥

---

1. మనుచరిత్ర 4.60.
2. బుడ్గ జంగం వాణి - ఏప్రిల్ 1989.

చెట్టు మీది తోడ్సిగాడు - పుట్టలోని వలెంగాడు
గట్టు గవ్విలోని ఎంట్వ - పట్టుకున్న సాలదయ్యె ॥అ॥
తెట్టె మీద ఉడుంబట్టి - బాల్లయ కురుంగాని గొట్టి
నర్సిగాడు బూతకాళ్కం - నానా జంతూలదిన్న ॥అ॥
నీళ్ళలోని బుడుముంక - పొదల్లోని లావంక
తొర్రలోని గోరింక - ప్రతి పిట్టా నీదింక ॥అ॥
మత్తెకాళ్కం లేకున్న - కొక్కిడిగాడు చిక్కకున్న
మండిగాడు మ్యాసాలు - ఉండనె ఉన్నాయి నీకు ॥అ॥
కొండ గవ్వి నీకు బంగ్ల - ఉరులే నీకున్న సిరులు
వలలే నీ సంపదలు - వదలవుగా నీ వేటలు ॥అ॥

ఈ పాటలో ఉన్న బుడిగె జంగం బాషా పదాలు, వాటి తెలుగు అర్థాలు ఈ విధంగా ఉన్నాయి:

అశోక్కటి = మాంసం; కారిగా = బుడిగె జంగామా!
శికారి = వేట; ఎంట్వ = ముంగీస
తోడ్సిగాడు = ఉడత; నర్సిగాడు = నక్క
బూతకాళ్క్యం = భూతపిల్లి; మత్తెకాళ్క్యం = ఊరపిల్లి
కొక్కిడిగాడు = కోడి; మండిగాడు = పంది
మ్యాసాలు = మేకలు.

'ఓ బుడిగె జంగామా! నానా జంతువులు (పాటలో పేర్కొన్నవి), పక్షులు, చేపలు, ఎండ్రకాయలు మొదలైన రకరకాల మాంసాలు తిన్నా, నీకు నీచుమీద ప్రీతి తగ్గటం లేదు. వేటే నీకు సర్వస్వం' అని ఈ పాటలోని బావం. ఈ పాట వీరి మాంసాహారప్రియత్వానికి, వేటతో వీరికున్న అనుబంధ ప్రదర్శనానికి ప్రబల నిదర్శనంగా ఉంది.

బుడిగె జంగాలు తినే జంతువుల పేర్లను, పక్షుల పేర్లను ఈ కింది పట్టికలో చూపుతున్నాను.

**జంతువులు:** ఉడుములు, ఉడుతలు (చెట్టుడుత, బెట్టుడుత, బండుడుత) ఎలుకలు (ఎల్లెలుక, పత్తెలుక, దారెలుక లేక పుల్లరిగాడు, గంద్రిగాడు, గరకాల ముచ్చు, రాళ్ళ రాసిగాడు, చిట్టెలుక, పందికొక్కు), పిల్లులు (జంగ పిల్లి, భూత పిల్లి, మాను పిల్లి లేక మర్నాగి, ఊర పిల్లి), ముంగిసలు (బీపిరి ముంగిస, కారు ముంగిస), నక్కలు (గుంత/గుంట నక్క, పెద్ద నక్క), పందులు (ఏదుపంది, అడవి పంది, ఊరపంది, సీమ పంది), కుందేళ్ళు (సీమ కుందేలు, బుర్ర కుందేలు), తోడేళ్ళు, గటుంగాడు (నీటి కుక్క), కొండ్రిగాడు, లేళ్ళు, దుప్పులు, మనుబోతులు, మేకలు, గొర్రెలు మొదలైనవి.

**పక్షులు:** గోరింకలు (తంగెడి గోరింక, గుడ్డి గోరింక), చిలుకలు (పొట్టి చిలుక, పచ్చ చిలుక, రామ చిలుక), పద్ద పిట్ట, కోకిల, పాల పిట్ట, నల్ల పిట్ట, కారెగాడు, పిచ్చుకలు (పొట్టి పిచ్చుక, ఊర పిచ్చుక, బంగారు పిచ్చుక లేక గిజిగాడు), చాపల కేసిగాడు, బాయిల బండారిగాడు, చిట్టి పిట్టిగాడు, గువ్వ, కంజు, ఎలిసె, కేర్జం, లావంక, పూరెడు, తీతువు, కండ్ల కపిడిగాడు, పగిడి కంటె (గుడ్లగూబ), నీటి కోడి, చుక్క కోడి, బుడుముంక, అడవి బాతు, కొంగలు (చిన్న కొంగ, పెద్ద కొంగ, గుడ్డి కొంగ, ఎర్రగాలి కొంగ), డేగ, కుందేలు సాలువ, తేనె ముచ్చు (తేనె గద్ద), జల కట్టె, గబ్బిలం మొదలైనవి.

**ఇతరాలు:** జంతువులతో, పక్షులతోపాటు జలచరాలైన చేపలు, తాబేళ్ళు, ఎండ్రకాయలు మొదలైనవి కూడ వీరు తింటారు.

ఉడుతలు, ఎలుకలు, పిల్లులు మొదలైన జంతువుల్లో, గోరింకలు, చిలుకలు, కొంగలు మొదలైన పక్షుల్లో ఎన్నెన్ని రకాలున్నాయో గుర్తించి, వీటిని ఇతర జంతువుల నుంచి, పక్షుల నుంచి వేరు చేయటానికి విశేషణాలు జోడించుకున్నారు అంతేకాకుండ కొన్ని జంతువులకు పుల్లరిగాడు, గంద్రిగాడు, గరకాల ముచ్చు, రాళ్ళ రాసిగాడు, గటుంగాడు, కొండ్రిగాడు మొదలైన పేర్లు పెట్టుకున్నారు. అలాగే కొన్ని పక్షులను కూడా కారెగాడు, చాపల కేసిగాడు, బాయిల బండారిగాడు, చిట్టి పిట్టిగాడు, కండ్ల కపిడిగాడు, పగిడి కంటె, తేనెముచ్చు మొదలైన పేర్లతో వ్యవహరిస్తున్నారు. ఇదంతా గమనిస్తే బుడిగె జంగాల జీవన విధానంలో వేట ప్రధాన వ్యాపకమని నొక్కి చెప్పవచ్చు.

వీరిలో తరతరాల నుంచి కొనసాగుతున్న వృత్తి, ప్రవృత్తుల సమ్మేళనమే ఈ వేట సంప్రదాయమని నిర్ధారించవచ్చు.

**ప్రధానాహారం :** వీరికి ఉదయం వంట ఉండదు. తెల్లవారుజామున్నే యాచనకు వెళ్తారు. కాబట్టి ఊళ్ళో భిక్షగా దొరికింది తింటారేతప్ప, ఉదయం వంట చేసుకోరు. సాయంత్రం మాత్రం వంట చేసుకుంటారు అన్నం వండు కోవటం వీరిలో చాలా తక్కువ. బియ్యం కొనలేనందువల్ల నూకల అన్నం వండుకుంటారు. జొన్న, సజ్జ, రాగి రొట్టెలను చేసుకుంటారు. లేదా 'గటక' వండుకుంటారు. గటకను 'సంకటి' అని కూడ అంటారు. రొట్టెకు మారుగా అంబలి కాచుకోవటం ఉంది. అంబలి అయితే పిల్లాపాపా అందరికి కడుపు నిండుతుందనే ఉద్దేశ్యంతో చాలామంది, రొట్టె చేసుకోవటం కంటె అంబలి కాచుకోవటానికే ఇష్టపడతారు. కలిపెట్టిన అంబలి అంటే వీరికి మరీ ఇష్టం.

అంబలిని గురించి పూర్వకవుల వర్ణనలు అనేకం కనిపిస్తాయి. శ్రీనాథు నంతటివాడే 'చల్లా అంబలి' తాగాడు. గ్రామీణులు కూడ అంబలి కాస్తారు. అయితే, అన్నం, రొట్టెలతో పాటు అంబలికూడ ఉంటుంది. బుడిగె జంగాల వంటి తెగలకు అంబలే ప్రధానాహారం. నేడు కాలానుగుణంగా వీరి ఆహార పుటలవాట్లలో మార్పు చోటు చేసుకుంటున్నది. అంబలి, రొట్టె కంటె అన్నాన్నే ఇష్టపడుతున్నారు.

**కూరలు :** ఆకుకూరలు, కాయకూరలు కూడ అనేక కావ్యాల్లో వర్ణించ బడ్డాయి. అయ్యలరాజు నారాయణామాత్యుడు 37 కాయకూరలను, 13 దుంప కూరలను, 40 ఆకుకూరలను ఐదు పద్యాల్లో వివరంగా వర్ణించాడు.[1] వాటిలో గ్రామీణులు ఈనాడు చాలా కూరలను వండటంలేదు. నారాయణకవి పేర్కొన్న ఎన్నో కూరలను బుడిగె జంగాలు ఇప్పటికీ ఆహారంగా ఉపయోగిస్తున్నారు.

బుడిగె జంగాలు ఆకుకూరల్లో గునుగుకూరను ఎక్కువగా వండుతారు. జొన్న, ఆముదపు చేలల్లోని పుంటికూర అంటె వీరికి ఇష్టం. వాగుల్లో, మడుగుల్లో నీటిమీద ఉండే తూటికూర తెచ్చుకొని వండుకుంటారు. ఇవేకాకుండ దొగ్గలి,

---

1. హంస వింశతి - చతుర్థాశ్వాసంలో 129-133 పద్యాలు.

బంకంటి, బొద్ది, చిర్రి, చెంచలి, కోడిజుట్టు, గోరిమిటి, పిండి, దూసరి, సన్న పాయిలు, పల్లేరు, చేతరాసి మొదలైన కూరలు కూడ వీరి ఆహారంలో ఉంటాయి. కాయగూరల్లో సొరకాయ, బీరకాయ, వంకాయ, బెండకాయ, బుడమకాయ మొదలైనవి చెప్పుకోదగ్గవి.

ఆకు కూరలు, కాయగూరలతో పాటు వృక్ష సంతతికి సంబంధించిన పలు రకాల చిగుళ్ళు, ఆకులు, పూతలు, కాయలు, పండ్లు, గింజలు, గింజల్లోని పలుకులు, మొలకలు, తీగలు, గడ్డలు మొదలైనవి కూడ ఆహారంగా ఉన్నాయి. వాటి వివరణ ఇక్కడ ఇస్తున్నాను.

## చిగుళ్ళు, ఆకులు, పూతలు, కాయలు, పండ్లు, గింజలు మొదలైనవి

(అ) **చిగుళ్ళు :** చింత చిగురు రుచి అందరికి తెలిసిందే. చిగుళ్ళలో 'రాలె' చిగురుతో తొక్కు (పచ్చడి) నూరుకుంటారు. మలబద్ధకం ఉన్నవారికి రాలె చిగురు పచ్చడి మంచి గుణకారి అని బుడిగె జంగాల అనుభవం. రాలె చిగుళ్ళను పెనం మీద వేపి, ఈ పచ్చడి చేస్తారు.

(ఆ) **ఆకులు :** ప్రసిద్ధమైన ఆకు కూరలే కాకుండ లింగదొండాకు, కుసుమాకు, చిట్టిగారె ఆకు, తెల్లగలిజేరు ఆకు, దేవదారాకు మొదలైనవాటిని కూడా వీరు కూరలుగా వండుకుంటారు. వీరికి చింతాకు అన్ని ఆకులకన్నా ప్రియమైంది. పులుపుకోసం అధికాధికం చింతాకు మీదనే ఆధారపడతారు.

కూరగా వండుకునే ఆకులు కాకుండా మొక్కలనుంచి తెంపుకొని, అలాగే తినే ఆకులు కూడ ఉంటాయి ఇలాంటి వాటిలో 'బచ్చటాయ' తీగ ఆకులను చెప్పుకోవచ్చు. ఈ తీగ మంగ, బల్సు మొదలైన పొదల్లో పెరుగుతుంది. ఆకులు బచ్చలి ఆకుల్లాగ ఉంటాయి. తవ్వుకొని దీని గడ్డను కూడ తింటారు

(ఇ) **పూతలు:-** చింతపూత, రాలెపూత, కలబంద పూత, తెల్లవార్జం పూత మొదలైనవి కూరలుగా వండుతారు చింతపూతను పచ్చడి చేసుకుంటారు.

(ఈ) **కాయలు:-** కల్లెం కాయలు పచ్చివి తినటమే కాకుండ, పచ్చడి కూడ చేసుకుంటారు. జమ్మికాయలు కూర వండుతారు. వండకుండ కూడ తింటారు. సీతాఫలకాయలు కాల్చుకొని తింటారు.

(ఉ) **పండ్లు:-** బల్సుపళ్ళు, మంగపళ్ళు, బర్రెంక, కల్లెం, ఉల్లింత, నక్కెర, నాగజెముడు, నవరత్న లేక సీసకమ్మరి, ఊడుగు, వెలగ, ఈత, తాటి, నేరెడు, దేవదారు, పరికి, ఇరికి, మొర్రి, పులిచేరు, బుడ్డగాని, రేగి, సీతాఫల, పొగడ, మేడిపళ్ళు మొదలైనవి.

(ఊ) **గింజల్లోని పలుకులు:-** పండులో వచ్చే గింజలను పగులగొట్టి, అందులోని పలుకులను తింటారు. జీడి, రేగి, ఇరికి, గొట్టి మొదలైన గింజల్లోని పలుకులు ఆహారయోగ్యమైనవి.

(ఋ) **మొలకలు:-** వరి మొలకల నూకలను గ్రామీణులందరు ఇష్టంగా తింటారు. తాటి మొలకలైన 'తేగ'లను కూడ బలవర్ధకమైన ఆహారంగా భావిస్తారు.

(ౠ) **గడ్డలు:-** గడ్డల్లో రెండు రకాలు. 1. ఉడకబెట్టి తినే గడ్డలు, 2. తవ్వుకొని తినే గడ్డలు. మొదటిరకం గడ్డల్లో దుంప, చెంచు, భూచక్ర' కన్నెకుమారి, పిల్లిపిసిరి గడ్డలు ముఖ్యమైనవి. రెండవ రకం గడ్డల్లో బచ్చటాయ గడ్డలు, కోలటాయ గడ్డలు చెప్పుకోదగినవి.

(ౡ) **తీగలు:-** 'పుల్లంగొయ్యలు' అనే తీగలను పచ్చివే నములుకొని తింటారు. 'నల్లెడ' అనే తీగను తొక్కుగా నూరుకుంటారు.

(ౡా) **కుందెన గొమ్మలు:-** కలబంద జాతికి చెందిన ఈ చిన్న మొక్క కాండాలను పచ్చివే నమిలి తింటారు. తీయతీయగా, పుల్లపుల్లగా, కొంచెం చేదుగా రసమయంగా ఉంటుంది.

(ఎ) **కాపీలు :** జొన్న, సజ్జ, రాగి పంట కాపుకొచ్చేసరికి, కంకులను తెచ్చి, నిప్పులమీద కాపి, నలుచుకొని, ఎంతో ఇష్టంగా గింజలను బొక్కుతారు. నిప్పుమీద కంకులను కాపుతారు కాబట్టి, వీటిని 'కాపీలు' అంటారు.

(ఏ) **ఈతగడ్డ :** కల్లు తీయటానికి పెరిగొచ్చిన ఈతచెట్టును నరికి, దాని జడకు మూరెడు క్రింద, ప్రకాండం మధ్యలో ఉండే గడ్డను తీసకొని

తింటారు. ఇది తియ్యగా, నోట్లో వేసుకుంటే కరిగిపోయేలా, గుజ్జుగా ఉంటుంది. దీనిని ఈతగుజ్జు అంటారు.

(ఐ) పాలగడ్డ : పసులకాపర్లకు ప్రీతిపాత్రమైన "పాలగడ్డ' చెప్పుకో దగ్గది. మోదుగడొప్పలో ముందుగా బర్రెంకచెట్టు పాలు లేక పాల కురుచచెట్టు పాలు అడుగున కొంచం సేకరించి తర్వాత ఆ డొప్పలో మేకపాలు పిండి, ఎండకు పెడితే కాస్సేపట్లో పాలన్ని గడ్డకట్టుకొనిపోతాయి. ఈ రుచికరమైన పాలగడ్డను మేకలు కాచేవాళ్ళు ఎంతో ఇష్టంగా తింటారు.

**బుడిగె జంగాల కొన్ని వంటకాలు :** వంటచేసే విధానంలో కూడ సాంస్కృతికాంశాలు తేటతెల్లమవుతాయి. ఆదిమజాతుల లక్షణాల నుంచి, ఆధునిక కాలంలోని నాగరక సమాజంవరకు వంటచేసే విధానంలో లెక్కలేనన్ని పద్ధతులు కనిపిస్తాయి. బుడిగె జంగాల వంట విధానం చూస్తే ఆటవిక జాతుల జీవన విధానం ప్రతిఫలిస్తుంది.

**(అ) గండుకారం:** ఎండుమిరపకాయలు, ఉప్పు కలిపి నూరిన కారం.

**(ఆ) కారం :** ఏ పూట కాపూట చేసుకొనే తొక్కు లేక పచ్చడిని 'కారం' అంటారు.

ఉదా: చింతపండుకారం, చింతకాయకారం.

**(ఇ) చింతాకుచారు ;** ప్రతి చారులో పులుపు కోసం వీరు చింతాకును వాడుతారు. చింతాకును మసలబెట్టి, పినికి, పులుసుతీసి చారులో ఉపయోగిస్తారు.

**(ఈ) పిండిచారు :** మాంసం, చేపలు వండేటప్పుడు చింతాకు పులుసు పోసి, అందులో జొన్నపిండిగాని, నూకలపిండిగాని పోసి చేసుకుంటారు. వీరి కూరల్లో ముప్పాతిక భాగం పిండిచారే ఉంటుంది.

**(ఉ) వేటలో వంట :** జూన్, జులై మాసాల్లో నల్లురైదుగుదు కలిసి, తాబేళ్ళ వేటకు బయలుదేరుతారు. వర్షాలకు కుంటల్లోకి, చెరువుల్లోకి వచ్చిన నీటితోపాటు పొదల్లో, డొంకల్లో అంతవరకూ ఉన్న తాబేళ్ళన్నీ వచ్చిపడతాయి. వీళ్ళు వలలతో దేవి తాబేళ్ళను పడతారు. ఒక్క కుంటనుగాని, చిన్న చెరువును గాని దేవితే, ఇంచుమించు ఇరవై నుంచి యాభై వరకు తాబేళ్ళు దొరుకుతాయి. చెరువు వద్దనే కొన్ని తాబేళ్ళను కాల్చుకొని, వాటి వెన్ను చిప్పలనే పాత్రలుగా

చేసి, తాము తెచ్చుకున్న ఉప్పు, కారంతో మాంసం కలిపి, వండుకొని తింటారు. ఏదుల వేట, నక్కల వేట మొదలైన సందర్భాల్లో ఎక్కువుగా జంతువులు దొరికితే అడవిలోనే కాల్చుకోవటమో, వండుకోవటమో చేస్తారు.

**(ఊ) కాల్చుకొని తినటం :** ఊళ్ళల్లో పంటచేతికొచ్చినప్పుడు కంది కాయ, బొబ్బరకాయ, పెసర, వేరుశనగ మొదలైన కాయలను మంటలో కాల్చుకొని తింటుంటారు. సీతాఫలకాయలను కూడ పెద్ద మంటలో వేసి కాల్చు కొని తినటం అనేది పసులకాడి పిల్లలకు ఆ కాయలువచ్చే కాలంలో దినచర్య.

బుడిగె జంగాలు చిన్న చిన్న జంతువులను కాల్చుకొని తినటానికే ఇష్ట పడతారు. ఎలుకలు, ఉడతలు, ఉడుములు, పిట్టలు, చేపలు, ఎండ్రకాయలు మొదలైన వాటిని నిప్పుమీద కాల్చుకొని తింటారు. కల్లు, సారాలు తాగు తున్నప్పుడు ఇలా కాల్చుకొని తినటం మామూలు.

కాల్చిన జంతువుల మాంసాన్నే కూరగావండుతారు. వేటాడి పట్టుకొచ్చిన జంతువులను, పక్షులను ముందుగా కాల్చి, తోలంతా రాకి, కడిగి, వంటకు మాంసాన్ని సిద్ధంచేస్తారు.

**వరుగులు, నూనెలు, సేకరణ వస్తువులు :**

**వరుగులు :** ఎండుచేపలు, ఎండుమాంసం నిలువ ఉంచుకొని అప్పు డప్పుడు కూరల్లో వాడుతారు. పంది మాంసాన్ని ఎండపెట్టి వరుగుగా చేసు కోవటమే వీరిలో అధికం. వేటలో ఏ జంతువులు ఎక్కువగా దొరికినా, వాటి మాంసాన్ని వరుగు చేసుకుంటారు. పచ్చి మాంసానికి కొంచెం పసుపు. ఉప్పు కలిపి, పొయ్యిమీద కొంచంసేపు ఉడకనిచ్చి, తర్వాత ఎండపెట్టి, వరుగుగా నిలువ ఉంచుకుంటారు. ఈ విధంగా ఉడకబెట్టటాన్ని 'అవటీలపెట్టటం' అని అంటారు.

**నూనెలు :** కూరల్లో మంచినూనెకు మారుగా పంది కొవ్వు వాడుతారు. సిద్దెల్లో పందికొవ్వు నిలువచేసి పెట్టుకుంటారు. మంచినూనె (వేరుశనగ, కుసుమ), పందికొవ్వు ఈ రెంటిని సందర్భాన్ననుసరించి కూరల్లో ఉపయో గిస్తారు.

**సేకరణ వస్తువులు :** వేటకు వెళ్ళినప్పుడు చింతచెట్లకింద రాలే చింత పండును ఏరుకొని తెచ్చి, నిలువ ఉంచుకుంటారు. పులుపుకోసం వీరు కూరల్లో

చింతాకును విరివిగా ఉపయోగిస్తారు. చింతాకు బాగా ముదిరి పండువారుతున్న దశలో చింతాకుకు బదులుగా చింతపండును వాడుతారు. చింతకాయలు, మామిడి కాయలు వచ్చేకాలంలో పులుపుకోసం వాటినికూడ వాడుతారు.

వీరి సేకరణ వస్తువుల్లో తేనె ఒకటి. తేనె తెట్టెలను జోపి, తేనెను సీసాల్లో, సిద్దెల్లో నింపి, ఇంట్లో ఉంచుకొని, అప్పుడప్పుడు ఆహారంలో ఉపయోగిస్తారు.

**భోజనం చేసే విధానం :** భోజనం చేసే విధానాల్లో ప్రపంచం అంతటా రకరకాల సమాజాల్లో భిన్న భిన్నమైన పద్ధతులు ఆచరణలో ఉన్నాయి. పాశ్చాత్యులు మొదలుకొని ప్రాచ్యుల వరకూ, అగ్రకులాలు మొదలుకొని ఆటవిక జాతుల వరకూ వింత వింత విధానాలు, విచిత్ర పద్ధతులు విస్తృతమైన వైవిధ్యంతో గోచరిస్తాయి.

బుడిగె జంగాలు భోజనం చేసే విధానం కూడ గమనించదగ్గది. ఆటవిక జాతుల్లో ఈ లక్షణం కనిపిస్తుంది. భోజనం చేసేటప్పుడు కుటుంబ సభ్యులందరు గుడిసె ముందర "గొంతు కూర్చొని" భోజనం చేస్తారు. కాళ్ళ మీద నిలువుగా కూర్చొని చిప్పలు లేక గిన్నెలు భూమి మీద పెట్టుకొని, లేకపోతే పైకెత్తి పట్టుకొని తింటారు. కారం నూరుకునే 'గుంజిప్ప'లో ఇంటి పెద్దకు గటక లేక నూకల బువ్వ లేక ఏది వండితే అది వడ్డిస్తారు. గుంజిప్పలో ఇంటిపెద్ద తప్ప ఇతరులెవ్వరు తినరు మారుతున్న కాలంలో గ్రామీణుల, నగరవాసుల ప్రభావంతో వీరి అలవాట్లలో కూడ మార్పులు వస్తున్నాయి. యువకులు పాత పద్ధతుల స్థానంలో కొత్త విధానాలను ఆహ్వానిస్తున్నారు.

**పానీయాలు :-** ఆహార పానీయాల్లో మద్యసేవనం ఒక అంశం. ఆర్యుల సోమరసం, సురాపానం నుంచి ఆటవికుల ఇప్పపువ్వు సారావరకు మద్యం పుచ్చుకోవటం అనేక రకాలు. గ్రామదేవతల ఉత్సవాల్లో పూజారులు మద్యపానం చేసేవారని క్రీడాభిరామం వల్ల తెలుస్తున్నది. భూతవైద్యోపచారుల్లో మద్యపానం తప్పకుండా ఉంటుంది. సంచార తెగలవారు చీటికి మాటికి అనేక సందర్భాల్లో కల్లు, సారాలు తాగుతుంటారు. రాధా మాధవంలో ఎల్లనార్యుడు తాగుబోతుల దృశ్యాన్ని చక్కగా వర్ణించాడని డా॥ మసన చెన్నప్పగారు పేర్కొన్నారు.[1]

---

1. ప్రాచీన కావ్యాలు - గ్రామీణ జీవన చిత్రణ. పుట - 164.

సిగం నిండే సివసత్తులు, తలారులు, బవనీలు, ఆటపాటలవారు రుచులను మెచ్చుకొంటూ మదిరాపానాన్ని చేశారని పాలవేకరి కదిరీపతి శుకసప్తతిలో తెలిపాడు 1 ఈనాటి బుడిగె జంగాలే ఆనాటి తెరనాటకపు జంగాలు. వీరు కదిరీపతి పేర్కొన్న అనేక కులాలకు చెందిన ఆటపాటల వారిలో ఒకరని ఊహించటానికి వీలున్నది.

బుడిగె జంగాలు ఈతకల్లు, తాటికల్లు, సారా మొదలైన మద్యాలను తాగుతారు. పురుడు, నిశ్చితార్థం, పెళ్ళి, చావు, పండుగలు మొదలైన సందర్భాల్లో వీరు మద్యం పుచ్చుకుంటారు. చుట్టాలు కలుసుకున్నప్పుడు తాగుడు మర్యాద తప్పక ఉంటుంది. ఎడతెగకుండ జరిగే వీరి కుల పంచాయతుల్లో కల్లుకుండలు, సారా సీసాలు తెచ్చుకొని కులస్థులందరు తాగుతారు. తప్పుచేసినందుకు కుల శిక్షల రూపంలో ఈ విధంగా మద్యంవిందులు చేసుకోవటం వీరి కులాచారం.

ఈ విధంగా బుడిగె జంగాల ఆహారపు అలవాట్లను పరిశీలించినట్లయితే అన్నం, రొట్టెలకన్నా అడవి జంతువులను, పక్షులను తినటమే మిన్న అనిపిస్తుంది. మాంసాహారం లేందే ఉండరని తెలుస్తుంది. వీరికి సంప్రదాయంగా వస్తున్న వేట వీరి జీవితం మీద బలమైన ముద్ర వేస్తున్నది. ఇన్ని జానపద కళా ప్రక్రియలను జనరంజకంగా ప్రదర్శించే వీరు వేటలో ఇంతగా మునిగిపోవటం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది మాంసాహారంకోసం అహర్నిశలు వేటాడటం, కందమూలాలు ఆహారంగా ఉపయోగించటం, ఆటవిక భోజన విధానాలను కలిగి ఉండటం మొదలైనవి వీరిలో ఉన్న ఆదిమ జాతుల లక్షణాలను గుర్తుకు తెస్తాయి.

## 4. దుస్తులు - ఆభరణాలు

స్త్రీ పురుష భేదాలు, చిన్నా పెద్ద తారతమ్యాలు, కులవ్యత్యాసాలు, ప్రాంతీయ వైవిధ్యాలు కాలానుగుణమైన రకాలు - దుస్తులు వేసుకోవటంలో కనిపిస్తాయి. అలాగే ఆభరణాలు ధరించటంలోనూ విభిన్నత్వం గోచరిస్తుంది.

---

1. కం. సివసత్తులును తలారులు । బవనీలున్మఱియు ఆటపాటల వారుం
చవులు నుతించుచు మదిరా । సవముం గొని యొక్కడొకడె జరిగిన
ఫిధపన్. (3 - 116.)

వేసుకున్న దుస్తులనుబట్టి స్త్రీలా? పురుషులా? ఏ వయస్సువారు? వారి వృత్తి? హోదా? ప్రాంతం? తదితర అంశాలను తెలుసుకోవచ్చు.

తెలుగు సాహిత్యంలో ఆదికవి నుంచి వేషభూషణాల వర్ణనలు కనిపిస్తాయి. తిక్కన, సోమన, కేతన, శ్రీనాథుడు, రాయలు, అయ్యలరాజు నారాయణామాత్యుడు మొదలైన కవులు ఆనాటి దుస్తులు - ఆభరణాలు గురించి తెలిపారు.[1]

కొరవి గోపరాజు 49 రకాల పట్టు నూలు చీరలను, 14 రకాల అంగాభరణాలను వర్ణించాడు.[2] పింగళి సూరన, పాలవేకరి కదిరీపతి మొదలైనవారు కూడ దుస్తులు, ఆభరణాలకు సంబంధించిన వర్ణనలు చేశారు. సారంగధర చరిత్ర, శకుంతలా పరిణయం, చంద్రికా పరిణయం మొదలైన కావ్యాల్లో కూడ వీటి ప్రస్తావన ఉంది. తెలుగు కవులందరు సందర్భానుసారంగా దుస్తులను, ఆభరణాలను వర్ణించినవారే.

జానపద గేయాల్లో కూడ వీటి వర్ణన కనిపిస్తుంది. "పట్టుచీర తెచ్చాను పెట్టెలో పెట్టాను కట్టమని చెప్పవే తడికా," "ముక్కుకు ముక్కెర లేక ముక్కు చిన్నబొయ్యినాది," 'గుంటూరు చిన్నదాన గుళ్లాపేరూలదాన' మొదలైన గేయాలను ఇందుకు ఉదాహరణముగా చెప్పుకోవచ్చు కాటమరాజు కథలు మొదలైన జానపద కథాగేయాల్లో కూడ ఇలాంటి ఉదాహరణలు అధికంగానే దొరుకుతాయి.

**బుడిగె జంగాల దుస్తులు:** వీరు అనేక రకాలైన వేషాలు వేస్తారు. ప్రతి వేషానికి ప్రత్యేకమైన ఆహార్యం ఉంటుంది. గ్రామీణుల వద్ద వేషాలు ప్రదర్శించి, అడుక్కొని ఇంటికి వచ్చాక మామూలు దుస్తుల్లో ఉంటారు. వీరు ధరించే దుస్తులన్నీ చాలావరకు ఊరివాళ్ళ దగ్గర యాచించి తెచ్చుకున్నవే. నిన్న మొన్నటి దాకా వీరు చొక్కా ధరించేవారు కాదు. ఇప్పటికి వృద్ధులు ఇంటి దగ్గర చొక్కా లేకుండానే, కేవలం పంచతోనే ఉంటారు.

---

1. చూడు (1) ఆంధ్రుల జానపద విజ్ఞానం - పుటలు 379 - 398.
   (2) ప్రాచీన కావ్యాలు - గ్రామీణ జీవన చిత్రణ పుటలు 225 - 243.
2. సింహాసన ద్వాత్రింశిక - 3 - 188.

కులస్థుల పెళ్ళిళ్ళకు గాని, కులపంచాయతులకోసం గ్రామాంతరం వెళ్ళేటప్పుడు గాని, చుట్టపు చూపుగా వెళ్తున్నప్పుడుగాని బుడిగె జంగం పురుషులు 4 గజాల ముతక పంచె కట్టుకుంటారు. ఆపారాలు (Half - Shirts) లేక కమీజులు (Full - Shirts) ధరిస్తారు. భిక్షగా అడుక్కొని దాచి పెట్టుకున్న నల్లకోటును పైనుంచి తొడుక్కుంటారు. తలకు ఎర్రని పాగా చుట్టుకుంటారు. దొరలవద్ద, దాతల వద్ద అడుక్కున్న పట్టుచీరల అంచులను చింపి, అంచుల్లేని ఆ పట్టుచీరలనే తలపాగలుగా కట్టుకుంటారు. తలపాగాను 'రుమాలు' లేక 'శెమ్లా' అని అంటారు.

స్త్రీలు ముతక చీర, ముతక రవిక ధరిస్తారు. ఎర్రరంగును ఎక్కువగా ఇష్టపడతారు. గాఢమైన రంగుల దుస్తులు కట్టుకుంటారు. ఐదేళ్ళు వచ్చేదాకా మగపిల్లలకు ఆచ్ఛాదన ఉండదు. ఆ తర్వాత 10, 12 సంవత్సరాల వయసు దాకా గోచీలు పెట్టుకునేవారు. ఇప్పుడు చెడ్డీలు తొడుగుతున్నారు. ఆడపిల్లలకు 10, 12 ఏళ్ళ వయసుదాక అడ్డగుడ్డలు, వొల్లెలు ఉంటాయి.

పురుషులకు స్త్రీలకున్నట్లే సిగ ఉంటుంది. అనేక వృత్తి కళలు ప్రదర్శించటంలో, స్త్రీ పాత్రలు ధరించటంలో సిగ ఎంతో ఉపయోగకరం కాబట్టి, పురుషులు వెంట్రుకలను ఎంతో శ్రద్ధతో పెంచుతారు.

**ఆభరణాలు :** పురుషులు ధరించే ఆభరణాలలో వేళ్ళకు రాగి, వెండి ఉంగరాలు, వంకులు ఉంటాయి. ఎడమచేతికి వెండితో చేసిన ముంజేతి కడియం వేసుకుంటారు. కుడిచేతికి పోంచి (గొలుసు), దండకు వెండి బొల్లు (బుర్ర) కడియం, నడుముకు వెండి మొలతాడు, కాలుకు వెండి కంటె ధరిస్తారు. అంతో ఇంతో సంపాదించుకున్న వారు బంగారు ఉంగరం ధరించటం కూడ కనిపిస్తుంది.

స్త్రీలు బంగారు పుస్తె, వెండి మట్టెలు లేక కంచు మట్టెలు, నల్లపూసల దండలు, పగడాల దండలు ధరిస్తారు. చేతివేళ్ళకు రాగి, వెండి, ఉంగరాలు, నడుముకు వెండివడ్డాణం, ముంజేతులకు గొలుసు కడియాలు, దండకు సందె కడియాలు, దండ కడియాలు మొదలైనవి ధరిస్తారు. బంగారు ఆభరణాల్లో పుస్తెతో పాటు హంసనత్తు లేక ముక్కుపుల్ల, గెంటీలు చెప్పుకోదగ్గవి.

ఈ విధంగా వీరు వేష ప్రదర్శనా సమయాల్లో, కుల పంచాయతులు, పెళ్ళిళ్ళు మొదలైన సందర్భాల్లో, ఇంటి దగ్గర ఉన్న వేళల్లో ధరించే దుస్తులు వేరు వేరుగా ఉంటాయి. ఊళ్ళో వేషం వేసినప్పుడు రాజులైనవారు, ఇంటికొచ్చే సరికి గరీబులు. అనేక వేషాలతో ప్రజల ముందుకు వెళ్తున్నందువల్ల ప్రజలు వీరిని అనేక కులాలవారిగా పొరబడుతున్నారు. అందుకే వీరిని తోలుబొమ్మలాటలవాళ్ళు, పగటివేషగాళ్ళు, బహురూపులు, భాగోతులు, శారదగాళ్ళు, కాటిపాపలు, బాలసంతులు, సన్యాసులు, బైరాగులు, కోయదొరలు, కొండ రాజులు, మందెచ్చులు, గురవ్వలు మొదలైన పేర్లతో పిలిస్తూ, భిన్న కులస్థులని భావిస్తున్నారు. నిజానికి వీరంతా బుడిగె జంగం కులంవాళ్ళే.

**పచ్చబొట్లు :** పచ్చ పొడిపించుకోవటం అతి ప్రాచీనకాలం నుంచి కొనసాగుతూ వస్తున్నది. ఆటవిక జాతుల్లో చిత్రవిచిత్రమైన పచ్చబొట్లు పొడిపించుకోవటం కనిపిస్తుంది గ్రామీణుల్లో కూడ పచ్చబొట్లు విరివిగా వ్యాప్తిలో ఉన్నాయి ప్రపంచమంతటా పచ్చబొట్లు పొడిపించుకోవటం ఉంది.

అందం అతిశయించటానికి పచ్చబొట్లు పొడిపించుకోవటం ప్రారంభమైనా, అనాగరక జాతుల్లో రాను రాను అది ఆచారంగా పరిణమించిందని చెప్పవచ్చు. పచ్చబొట్లు అలంకార సాధనాలుగా ఉండటంవల్ల, వేషభూషణాల్లో చేరి వస్తు సంస్కృతిలో భాగమౌతున్నాయి.

బైబిలు పాతగ్రంథంలో యూదులకు పచ్చబొట్టు నిషేధింపబడినట్లు తెలుస్తున్నది. 1880 ప్రాంతాల్లో ఆంగ్ల సైనికులు తప్పించుకొని పారిపోయిన ఖైదీలకు, దుష్టవర్తన గలవారికి, 'డి' అక్షరంగాని, 'బి. సి' అక్షరాలుగాని పచ్చపొడిపించి, వారిని అందరు గుర్తించేటట్లు చేసేవారట. ఐరోపావారు ఆకుపచ్చ రంగులతోనేకాకుండా వేర్వేరు రంగులతోకూడ పచ్చబొట్లు వేసుకుంటారని తెలుస్తున్నది.[1]

పచ్చాకు మొక్క ఆకుల రసంతో వీరముష్టివారు, పాండవుల (తోటి కులం) వారు చిక్కని ఆకుపచ్చ ద్రావకం తయారుచేస్తారు. పచ్చ పొడవవలసిన

---

1. మిన్నేరు - పుట 472,

అవయవం మీద కోరిన బొమ్మ వచ్చేటట్లుగా సూదితో గుచ్చుతారు. మాటి మాటికి సూదిని ద్రావకంలో ముంచుతూ శరీరం మీద పొడవటంవల్ల, ఆకుపచ్చని ద్రావకం శరీరానికి పట్టుకుంటుంది గాయం మానినా రంగుమారకుండా బొమ్మ అలాగే శాశ్వతంగా ఉండిపోతుంది. దీన్నే 'పచ్చబొట్టు' అంటారు.

జానపదగేయాల్లో పచ్చబొట్టుకు సంబంధించిన పాటలు ఎక్కువగా లేవు. మచ్చుకు ఒక గేయాన్ని కింద ఉదాహరిస్తున్నాను.

పచ్చబొట్టు పొడిపించు బావా। - పావలా అద్దిచ్చి పొడిపించు బావా।
కొండ మీద గుడియంట - గుడిలోన దేవుడంట
సాలోరి యింటెనక - సాదుబొట్టు పెట్టుకొని
కోమటోరి యింటెనక - కోకైనా గట్టుకొని
కోకే బాగుండాలె బావా - ॥పచ్చ॥

చుక్క బాగుండాలే - రంగూ బాగుండాలె
అడవి మల్లె పొడమల్లె - ఆకాశ పొడమల్లె
రామన్న పాదాలు - లచ్చుమన్న పాదాలు ॥పచ్చ॥[1]

ఈ గేయంలో చుక్కబొట్టు, అడవి మల్లె, రామన్న పాదాలు, లక్ష్మన్న పాదాలు మొదలైన పచ్చబొట్ల ప్రస్తావన చేయబడింది.

**బుడిగె జంగాల పచ్చబొట్లు**: వీరు కూడ రకరకాల పచ్చబొట్లు పొడిపించుకుంటారు. నొసట చుక్క బొట్టుగాని, చందమామనుగాని వేయించుకుంటారు. బుగ్గల మీద, చుబుకం మీద కూడ చుక్కబొట్టు వేయించుకోవటం ఉంది. స్త్రీలు చేతులమీద పొన్నచెట్టు, సీతమ్మ ముసుగు, రామ లక్ష్మణుల తొట్టెళ్ళు, చాపముల్లు, చక్రం, రథం, జల్లెడ, కృష్ణుడు, గౌరెకన్ను, ఆరుగురు అక్కచెల్లెళ్ళు, గొల్ల భామలు మొదలైన పచ్చలను వేయించుకుంటారు. చేతుల మీద ఇష్టదేవతల పేర్లను, తమ ప్రియుల పేర్లను, ఆత్మీయుల పేర్లను పొడిపించుకుంటారు. పురుషులు చేతులమీద పేర్లను వేయించుకోవటమే కాకుండా

---

1. మిన్నేరు - పుట 474.

భుజాలమీద, దండలమీద, ఛాతిమీద కూడ పొడిపించుకుంటారు. వీరు పొడిపించు కునే పచ్చల్లో గరుడపక్షి, నాగరాజు, ఆంజనేయస్వామి, వీరభద్రుడు, భేతాళుడు మొదలైనవి చెప్పుకోదగ్గవి. పచ్చబొట్లు కేవలం అలంకరణకే కాకుండ ఆరోగ్యా నికి కూడ వేయించుకోవటం ఉంది. కండరాల నొప్పులు, కీళ్ళ నొప్పులు మొద లైనవి పోవటానికి పచ్చ పొడిపించుకోవటం పరిపాటి.

## 5. పశుసంపద (పెంపుడు జంతువులు)

**పెంపుడు జంతువులు :** వృత్తి కళలను ప్రదర్శించి, ఊరివాళ్ళను మెప్పించి, వారి వద్ద ఆవులు, ఎద్లు, మేకలు, గొర్లు, బర్లు మొదలైన పెంపుడు జంతువులను దానంగా అడుక్కుంటారు. వాటిని పెంపు చేసుకుంటారు. తమతో పాటే వాటిని ఊరూరు తిప్పుతుంటారు. వీరి స్త్రీలు, పిల్లలు వాటిని కాస్తుంటారు· వీరిలో మందెచ్చు వృత్తి కళాకారులకు గొల్లల వద్ద గొర్లు, మేకలు అడుక్కునే వతన్లు ఉంటాయి. అందువల్ల వీరి వద్ద ఎప్పుడూ గొర్లు, మేకలు ఉండనే ఉంటాయి. ఇతర వేషాలు వేసేవారికంటే పగటి వేషగాళ్ళు, భాగోతులు, కాటి పాపలు మొదలైన వేషగాళ్ళవద్ద ఆవులు, బర్లు తప్పకుండా ఉంటాయి. పై జంతువులకు తోడు అందరిలాగే కోళ్ళనుకూడ వీరు పెంచుతారు. స్థిరనివా సాలు ఏర్పరచుకున్నవారు పందులను కూడ పెంచుతారు. గుడిసె సామాను ఒక ఊరి నుంచి మరో ఊరికి చేరవేయటానికి వీరు పూర్వకాలం నుంచి గుర్రా లను కూడ పెంచుతున్నారు. ఇప్పటికీ అక్కడక్కడ కొందరు గుర్రాల్ని పెంచటం కనిపిస్తున్నది.

**వేట కుక్కలు :** దానంగా వచ్చిన జంతువులతోపాటు వీరు కుక్కలను మక్కువతో పెంచుతారు. వేట వీరికి నిత్యకార్యక్రమం అయినందువల్ల కుక్క లను శ్రద్ధతో పెంచుతారు. వేటకు వలలు, బోనులు, ఇతర పరికరాలు ఎంత ముఖ్యమైనవో, కుక్కలు అంతకంటే ముఖ్యమైనవి. వేట పరికరాలు పోతే వెంటనే తిరిగి సంపాదించుకోవచ్చు. కాని, ఒక వేటకుక్క చస్తే దానిలోటును పూడ్చలేదు. మరో వేటకుక్కను తయారుచేయటానికి ఎంతో శ్రద్ధ, సమయం, ఓర్పు, ఉత్సాహం కావాలి.

కుక్కలు గవివద్ద పసిబట్టి, జంతువు ఉనికిని యజమానికి తోక ఊపటం, కాలుతో మన్ను తోడటంద్వారా తెలియజేస్తాయి. అడవిలో వేటకు తిరుగుతున్నప్పుడు జంతువు కనిపిస్తే దాన్నిపట్టి యజమానికి ఇస్తాయి. అలా వీలుకానప్పుడు దగ్గరగా ఉన్న కన్నం లేక గవిలోనికి మలిపి, ఒక కుక్క అక్కడ కావలి ఉండగా, మరోకుక్క యజమాని దగ్గరకొచ్చి, సైగలు చేసి అక్కడికి తీసుకెళ్తుంది. గుట్ట గవ్విలో జంతువులు ఉన్నప్పుడు మనిషికి జొర రాని ఆ గవ్విలోనికి కుక్కలు వెళ్ళి, జంతువులను చంపి, బయటికి లాక్కొస్తాయి. వేట సమయంలో కుక్కలు ఎంతో చురుకుగా, ఎంతో మెలుకువగా (అలర్ట్‌గా) ఉంటాయి. అయినప్పటికీ కొన్ని వేటల్లో కుక్కలకు ప్రమాదాలు ఎదురౌతుంటాయి. ఏదు పందుల వేటలో, ఏదు ఎదురుతిరిగి ముల్లు గుచ్చిందంటే కుక్క చనిపోతుంది.

కుక్క యజమాని అభిప్రాయాన్ని అర్థం చేసుకొని ఎంతో విశ్వాసంతో ప్రవర్తిస్తుంది. వేటలో సాటిలేనిదై ఉపకరిస్తుంది. మాంస ప్రియులైన వీరికి రోజూ మాంసాహారం లభించటానికి దోహదం చేస్తుంది. అందుకే వేటకుక్కలంటే వీరికి ప్రాణంతో సమానం. కంటికి రెప్పలా వేట కుక్కలను కాపాడుతుంటారు. దానికి దెబ్బతగిలితే విలవిలలాడుతుంటారు. వీరికి తిండి లేకపోయినా పరవాలేదు- కుక్కకు మాత్రం తిండి ఏర్పాటుచేస్తారు. వీరు ఉపవాసం ఉండైనా సరే, కుక్కకు తిండి పెడతారు, కుక్క చనిపోతే కుటుంబంలోని వ్యక్తి చనిపోయినట్లుగానే ఏడుస్తారు, మనిషిలాగే దాన్నికూడా ఖననం చేస్తారు.

వేటకుక్కలతో వీరికి అనుబంధం పెనవేసుకుపోతుంది. కుక్కలకు పేర్లు పెట్టుకుంటారు. పులి, భైరి, బొబ్బిలి, మిర్చి, మోతి, చిన్న మొదలైన పేర్లతో కుక్కలను పిలవటం కనిపిస్తుంది.

వీరు వృత్తికళలు ప్రదర్శించి సంభావనగా ఈ పెంపుడు జంతువులను పొందుతున్నారు. దానంగా వచ్చిన ఈ జంతువులను పెంచుకోక తప్పటంలేదు. ఈ విధంగా వీరికి జంతువులతో ముడిపడివున్నది. ఈ అనుబంధం తరతరాలనుంచి కొనసాగుతూ వస్తున్నది. పెంపుడు జంతువులవల్ల వీరిలో కొందరికి ఇంటి పేర్లు ఏర్పడ్డాయి. అశ్వ, ఒంటెద్దు, కోళ్ళ, మ్యాకల, ఆవుల, బర్ల, మొదలైనవి ఇలా ఏర్పడ్డ ఇంటి పేర్లే.

# 6. చేతిపనులు

ఈనాడు ఎన్నో రకాలైన చేతిపనులు వృత్తులుగా ఉన్నాయి. వృత్తులని చెప్పటానికి వీలులేని చేతిపనులు కూడ ఎన్నో ఉన్నాయి. గృహావసరాల్లో గృహాలంకరణల్లో ఇత్యాది సందర్భాల్లో వృత్తులుకాని చేతిపనులు కనిపిస్తాయి.

బుడిగె జంగాల చేతిపనుల్లో ఉపవృత్తిగా మారిన 'చాపలల్లటం'తోపాటు వృత్తులు కానివి కూడా ఎన్నో ఉన్నాయి. వీరి ప్రధానవృత్తి వేషాలువేసి, జానపద వృత్తి కళలను ప్రదర్శించటం. వీరికి సంప్రదాయంగా వస్తున్న మరోవృత్తి వేట. వీటికితోడు ఏ వృత్తివేషంవేసే బుడిగెజంగమైనా తప్పకుండ అవలంబించే ఉపవృత్తి 'చాపలు అల్లటం.' చాపలు అల్లి, ఊళ్ళో అమ్మి- ధాన్యమో, డబ్బులో పొందుతుంటారు అయితే, ఈ సంపాదనతోనే బతుకు గడవదు. అందువల్ల ఇది జీవనోపాధికి అవలంబించిన ఒక ఉపవృత్తి మాత్రమే. చాపలల్లటం చేతిపనుల్లో చేరుతుంది. జీవితావసరాలకు సంబంధించిన అనేక వస్తువులను వీరు తయారు చేసుకుంటారు. అవన్నిటినీ 'చేతిపనులు' శీర్షిక కింద పరిశీలించవచ్చు. అలాంటి వాటిలో వేష పరికరాలు, వాద్య పరికరాలు, వేట పరికరాలు, గృహ నిర్మాణ పరికరాలు, గృహావసర పరికరాలు మొదలైనవి చెప్పుకోదగ్గవి.



చాపలల్లుతున్న బుడిగె జంగం స్త్రీలు

**చాపలు అల్లటం :** వీరి చేతిపనుల్లో ముఖ్యమైంది చాపలు అల్లటం. వీరి కులంలో ఎవ్వరే వేషం వేసి బతుకుతున్నా, అందరూ చాపలల్లుతారు ఇది స్త్రీ పురుషులు కలిసిచేసేపని. చాపలు అల్లటానికి ఈతకమ్మ కావాలి. వనానికి వెళ్ళి ఈతకమ్మ కోసుకురావాలి. కొన్ని ప్రాంతాల్లో కల్లుగీసే గౌళ్ళు, ఇతర భూస్వాములు ఈతకమ్మ కోయనివ్వరు. బుడిగెజంగాలు కాళ్ళా వేళ్ళాపడి కోసుకొచ్చుకుంటారు. లేదా వారి కన్నుగప్పి కోసుకొచ్చుకుంటారు. కమ్మకోయటాన్ని వర్ణించే ఒక గేయాన్ని ఏప్రిల్ 1989 బుడిగెజంగం వాణిలో ప్రచురించారు. ఆ గేయాన్ని కింద ఉటంకిస్తున్నాను.

కమ్మాకోతాము రావే
ఎంకమ్మ ఈత
కమ్మా కోతాము రావే
గడశివ్వ దీసుకొని - కమ్మాల కత్తి గట్టి
రెడ్డోని వొంపులాకు - గుట్టాగ మనం బోయి ॥క॥

మంకాడు కార్యూడు[1] - మనని జూస్తె కొడ్తాడు
కమ్మకత్తి గుంజుకొని - మనల్నెల్ల గొడ్తాడు
జెప్ప జెప్ప గోస్తుంట - రప్ప రప్ప మోపుగట్టు ॥క॥

మంచి మంచి రెబ్బాల - అంది అంది నేన్గోస్తా
చీరేసి ఆరెసి - అంతెత్తు మోపుగట్టు
కస్తీగ ఎత్తుకొని - తెస్తాను ఇంటికి ॥క॥

కమ్మరెబ్బి చీరిపెత్త - పట్టె అల్లి సాపగూర్చు
కల్చరాకు[2] అల్లి సాప - కడలన్ని పెట్టేస్తా
అంగట్ల అమ్ముకొని - ఆయిగా ఉందాము ॥క॥

---

1. భూస్వామి, కోపి.
2. చాప కడలు పెట్టటానికి ఉపయోగించే చిన్న ఈతాకు పట్టె.

ఈ గేయంలో భర్త, భార్య ఎంకమ్మతో ఎవరికంటాపడకుండ రెడ్డోని పొంపులోకి వెళ్ళి కమ్మకోద్దాం రమ్మని పిలుస్తున్నాడు. 'రెడ్డి చూసినట్లయితే మనలను కొడతాడు. అంతేకాదు కమ్మకత్తి లాక్కుంటాడు. అందుకే నేను త్వరత్వరగా మంచి మంచి రెబ్బలు కోస్తుంటాను. నువ్వు వెంటవెంటనే పెద్ద మోపుకట్టు. ఆ మోపును నేను ఇంటికి చేరుస్తాను. తర్వాత నేను కమ్మరెబ్బి చీరి ఇస్తాను. నువ్వు చాప అల్లాకా అంచులు పెడతాను. తయారైన చాపను సంతలో అమ్ముకొని హాయిగా ఉందాము." అని అతడు తన భార్యకు చెప్పు తున్నట్లు ఈ గేయంలో వర్ణించ బడింది. కమ్మకోసే విధానం, ఎదురయ్యే సమస్యలు, ఇద్దరు కలిసి చాప అల్లుకోవటం ఇందులో కనిపిస్తాయి.

వనానికి వెళ్ళి ఈతరెబ్బలను కోశాకా వాటిని రెండు వైపులా చీల్చి బరిగె (రెబ్బలో రెండు వైపుల కమ్మపోగా మిగిలిన కర్ర) నుంచి కమ్మను వేరు చేస్తారు. బరిగె చివరన అల్లికకు పనికిరాని పొడుగు తక్కువగా ఉన్న ఆకును అలాగే వదిలేస్తారు. అనవసరమైన కర్రను, పొడవు తక్కువగా ఉన్న చివరి కమ్మను పారవేయటానికి ఇలా చీలుస్తారు. వీరు చీరి వేసిన బరిగెలను గంపలు అల్లటానికి ఎరుకలవారు గ్రహిస్తారు.

తమకు కావలసినంత ఈతకమ్మను కోసుకొని, మోపు కట్టుకొని, ఇంటికి తెచ్చుకుంటారు. కమ్మ ఎండిన తర్వాత రెబ్బటం మొదటి పని. చీల్చిన రెబ్బ నుంచి కమ్మను వేరుచేయటమే ఈ 'రెబ్బటం.' కమ్మ రెబ్బిన తర్వాత 'చీరటం' ఉంటుంది. మడతగా మూసుకొని ఉన్న ఆకును చీరి రెండు ఆకులు చేస్తారు. చీరిన తర్వాత 'కలపటం' చేస్తారు. పొడుగాకు పొట్టాకు, కలిసి పోయేటట్లు, రెండు చేతులా కలగాపులగం చేస్తారు. ఇలా కలిపిన తర్వాత నీళ్ళు చిలకరించి దాన్ని కట్టగా కట్టి, దగ్గర పెట్టుకొని పట్టె అల్లటం ప్రారం భిస్తారు. పురుషులు కూడ పట్టె అల్లటం ఉంది. కాని, స్త్రీలు అల్లటమే ఎక్కువ. స్త్రీలు ఒక వైపు పాట పాడుతూ భిక్షాటనచేస్తూ మరో వైపు జోలెలో ఉన్న కమ్మతీసుకొని పట్టె అల్లుతూనే ఉంటారు. కొందరు ఒళ్ళో పసిపాపను అడ్డంగా కట్టుకొని ఈ పనులన్ని ఒకేసారి చేస్తుంటారు. అల్లుతున్నకొద్దీ పెరిగే పట్టెను ఎడమ చేతిమీద వరుసలుగా వేసుకుంటారు.

పట్టెలో ఎడమ వైపున వాలుగా ఆరు ఆకులు, కుడివైపున వాలుగా ఆరు ఆకులు, మధ్యలో ఎడమ నుంచి కుడికి, కుడి నుంచి ఎడమకు తిరగటానికి ఒక ఆకు ఉంటుంది. ఏడు ఆకుల వైపున ఉన్న చివరి ఆకునే మడిచి తిప్పుతుంటారు. ఈ ఆకు తిరిగాక ఈ వైపువి ఆరున్నొకటి ఏడు అవుతాయి. మళ్ళీ ఈ ఏడిట్లో చివరి ఆకును ఇటువైపు తిప్పుతారు. ప్రతిసారి కొత్త ఆకు పెట్టి దాని మీదినుంచి మధ్య ఆకు తిప్పుతుంటారు. ఇలా పట్టె అల్లుతూ పోతారు. అల్లిన పట్టెను గుండ్రంగా చుట్టి పెడతారు. దీన్నే 'పట్టెచుట్ట' అంటారు.

చాపకు సరిపడే పట్టెచుట్ట తయారు అయ్యాక మూడు అడుగుల వ్యాసార్ధంతో వృత్తాకారంలో ఒక పట్టెకు మరొక పట్టెను కూరుస్తారు. రెండు పట్టెల అంచుల్లో ఉన్న ఆకు మడుపు సందుల్లోనుంచి 'కూర్పటాకుల'ను దూర్చి, పట్టెలను సంధిస్తారు. చీరకుండ రెండు ఆకుల మడతలో ఉన్న ఈతాకులనే 'కూర్పటాకులు' అంటారు. రెండు పట్టెలను ఒకటిగా కూర్చే ఆకులే 'కూర్పటాకులు.' 20 పట్టెలు కూర్చాకా మధ్యలోనుంచి కమ్మకత్తితో కోస్తారు. అప్పుడు అంచులేని చాప తయారవుతుంది.

చాప అంచు పెట్టటానికి 'కల్చారి' కావాలి. కల్చారి ఏడు ఆకులతో అల్లే చిన్న పట్టె. ఇందులో అటు మూడాకులు, ఇటు మూడాకులు, మధ్యలో ఒక ఆకు అటూ ఇటూ తిరుగుతుంటుంది. చాప పట్టెలో కత్తెరలాగా అటువైపు ఒక ఆకు, ఇటువైపు ఒక ఆకు పెడతారు. కల్చారికి మాత్రం ఒకవైపే కొత్త ఆకు పెడుతుంటారు. పెద్ద పట్టెకు అంది రాని, పొడవు తక్కువగా ఉన్న ఆకులను ఈ కల్చారి అల్లటానికి ఉపయోగిస్తారు. 'కడసారి' అనే మాటనే 'కల్సారి', 'కల్చారి' అయ్యిందేమో! కల్చారిని చాప కడలకు అమర్చి, మీది నుంచి దబ్బడంతో కుట్లు వేస్తారు. కుట్లు వేయటానికి కూడ ఈత ఆకునే వాడతారు. ఇంతటితో పక్క చాప నిర్మాణం పూర్తవుతుంది. ఇతర పనుల వల్ల అంతరాయం కలుగకుంటే భార్యభర్తలు కలసి రోజుకో చాప చేసుకుంటారు. ఈత చాపలు గ్రామీణులకు ఇచ్చి గింజలో, డబ్బులో పుచ్చుకుంటారు.

ఈత చాపలతో పాటు వీరు తమ గుడిసెకు అవసరమైన తాటి చాపలను కూడ కుట్టుకుంటారు. తాటి చాపలు అమ్మటానికి కాకుండ కేవలం తమ గుడిసె అవసరాలకే తయారుచేసుకుంటారు.

**భిక్షాటనా పరికరాలు:** భిక్ష సేకరించటానికి జోలెలు కావాలి. వీళ్ళకు అవసరమైన జోలెలను వీళ్ళే కుట్టుకుంటారు. జోలెల్లో దేవుని జోలె, పెద్దజోలె, ఊర్ల జోలె, కట్ల సంచి, అశ్వసంచి మొదలైనవి ఉంటాయి. నాలుగు మూలలుగా నాలుగు అరలతో వీరు జోలెలను కుట్టుకుంటారు. అశ్వసంచి మాత్రం గుర్రం మీద, ఎద్దుమీద వేసే దానిలాగా ఆ చివరన, ఈ చివరన మాత్రమే అరలు ఉంటాయి. పాతగుడ్డలను పరిచి, దొడ్డుదారం, దొడ్డు సూది ఉపయోగించి, ప్రతి పావు అంగుళానికి ఒక దారం చొప్పున కుట్టుతారు.

**వేష పరికరాలు :** పగటి వేషాలు, కాటిపాపల, బాలసంతు, మందెచ్చు, గురవ్వల, కోయపంతు మొదలైన వేషాలకు ఉపయోగించే వస్తుసామాగ్రిని చాలా వరకు వీరే తయారు చేసుకుంటారు. కిరీటాలు, భుజకీర్తులు, దుస్తులు, దండలు మొదలైన భాగోత వస్తువులు, బాలసంతు పేరిణి బొంత, కాటిపావల నిలువు టంగీ, మందెచ్చు గురవ్వల గజ్జెలలాగులు మొదలైనవి స్వయంగా తయారు చేసుకుంటారు. శిల్పం, చిత్రలేఖనాల సమ్మేళనంతో నాట్యావకాశాన్ని కలిగించే కీళ్ళ ఏర్పాటుతో తయారు చేసే తోలుబొమ్మలు వీరి కళాత్మకమైన పనితనానికి నిదర్శనమని చెప్పవచ్చు.

**వాద్య పరికరాలు :** తందానా కథలకు ఉపయోగించే మట్టి బుడిగెలను కుమ్మర్ల దగ్గర తెచ్చుకొని వాటికి ఒకపక్క చర్మాన్ని కూర్చి, ఇనుపకడియాలతో తోళ్ళ తాళ్ళు బిగించి గుమ్మెట్లుగా తయారు చేసుకుంటారు. ఇత్తడివైతే కంచరి దగ్గర తెచ్చుకొని ఇలాగే దాన్ని గుమ్మెటగా తయారు చేసుకుంటారు. తాంబూరాకు కావలసిన కర్రపనంతా ముందు వడ్రంగి దగ్గర చేయించుకొని, తర్వాత తీగలు సవరించి తాంబూరాను యోగ్యవాద్యంగా తీర్చుకుంటారు. సొర బుర్రను, వెదురుకట్టెను సంపాదించి, ఏకతారను కూడ వీరే తయారు చేసుకుంటారు. ఇంకా వీరు ఆయా వేషాలమీద ఉపయోగించే గంట, శంఖం, ఒగ్గు, కొమ్ము, మద్దెల, హార్మోనియం, సుత్తిపెట్టె (మూడే స్వరాలున్న చిన్న హార్మోనియం) మొదలైన వాయిద్యాలను కొనుక్కోవటం ద్వారా సేకరించుకుంటారు. కొంతకాలం వాడిన తర్వాత అవి చెడిపోతే వీరే మంచి నైపుణ్యంతో బాగు (రిపేరింగులు) చేసుకుంటారు.

**వేట పరికరాలు :** వేటకు సంబంధించిన అనేక పరికరాలను వీరు తయారు చేసుకుంటారు. పిట్టలు, ఉడతలు పట్టే ఉర్లు లేక ఉచ్చులు వీరివద్ద ఉంటాయి. వీటిని గుర్రింతోక వెంట్రుకలతో తయారుచేస్తారు. ఉడుములకు పెట్టే కడెం దోర్నాలు, ముంగిసలకు పెట్టే ఎంట్వ (ముంగీస) గుటాలు మొద లైనవికూడ గుర్రింతోక వెంట్రుకలతోనే తయారుచేస్తారు.

ఇనుప తీగలను ఉపయోగించి వీరు రకరకాల బోనులను అల్లుతారు. వెదురుబద్దలతో మీట్లను తయారుచేస్తారు. వెదురుపుల్లలతో కంజులు పట్టటానికి 'పొంజీల'ను తయారు చేస్తారు.

అనేక రకాలైన వలలను కూడ వీరు తయారుచేసుకుంటారు. ఉడతలు, ఎలుకలు, ముంగీసలు మొదలైనవి పట్టటానికి అవసరమైన పెద్ద వలలు, చేపలు పట్టటానికి ఉపయోగించే దేవుడాల, తోపెట మొదలైనవి వలల్లో ముఖ్య మైనవి. తోపెట కాల్వల్లో చిన్నచేపలను పట్టటానికి, దేవుడాల మడుగుల్లో పెద్ద చేపలు పట్టటానికి ఉపయోగిస్తారు.

ఎలుకల పెంటలు, ఉడుము ముంగీసలున్న పుట్టలు, భూరంధ్రాలు త్రవ్వటానికి వీరి వద్ద కర్రులు ఉంటాయి. కర్రులను కమ్మర్ల వద్ద చేయించు కొని, రెండడుగుల పొడుగున్న కట్టెకు ఇనుప కడియాలతో అమర్చుకొని, త్రవ్వటానికి అనుకూలంగా తయారుచేసుకుంటారు. దీన్ని 'కర్రుకట్టె' అని పిలుస్తారు. ఎలుకలు మొదలైనవాటికి ఊదర కొట్టటానికి 'ఊదర తోట్ల'ను తయారుచేసుకుంటారు. వీరు వేటలో ఉపయోగించటానికి ప్రత్యేకంగా 'వేట కొడవలి' ఉంటుంది.

**గృహనిర్మాణ గృహావసర పరికరాలు :-** పైవేకాకుండా వీరి చేతిపనుల్లో గుడిసె నిర్మాణానికి వాడే వంకర్లు ఇల్గొలలు, మాదు శివ్వాలు, బగుర్లిక్కలు, అస్తర్లు, మాదు చాపలు- వీటిని కట్టటానికి వెంట్రుకలతో, నారతో తయారు చేసుకున్న తాళ్ళనుకూడ చేర్చవచ్చు. ధాన్యం దాచుకోవటానికి తయారుచేసు కున్న 'ఖుంగతిత్తి', ఇతర అవసరాలకు వాడే చిక్కాలు, వంటలో వాడే తెడ్లు (దోకాయలు), సిబ్బి (గంజి వార్చటానికి దూసర తీగతో చేసింది) మొదలైన వన్నీ వీరి చేతిపనుల్లో చేరుతాయి.

**చెకుముకి సంచి :-** అగ్గిపెట్టె అంతగా ప్రచారంలేని కాలంలో నిప్పు కోసం గ్రామీణులు చెకుముకి సంచిని తప్పకుండా వెంట ఉంచుకునేవారు. నిప్పు పుట్టించటానికి అతి ప్రాచీన కాలంనుంచి ఉపయోగంలో ఉన్న పరికరం ఇది. ఈనాడు వాడకంలో లేకపోయినా ముసలివాళ్ళ దగ్గర మూలకు పడవేసిన చెకుముకి సంచులను గురించి తెలుసుకోవచ్చు. ఆకురాయి ముక్క, పలుగు రాయి ముక్క, ప్రత్యేకంగా తయారుచేసిన దూది- ఈ మూడింటితో నిప్పు పుట్టిస్తారు.

వాగు మడుగుల్లో పెరిగిన ఒక రకమైన తుంగను 'జంబు' అంటారు. ఈ జంబు మొక్కలపై చివరన, ఇంచుమించు అడుగుపొడువున సజ్జకంకి లాగ పూత ఉంటుంది. వాటిని 'దూదేళ్ళు' అంటారు. దూదేళ్ళను కోసుకొచ్చి, ఎండబెట్టి, పొడిచేస్తే అది దూదిలాగా తయారౌతుంది. ఉత్తరేణి మొక్కలు ఆకులతో సహా కోసుకొచ్చి ఎండబెట్టాలి. ఉత్తరేణి పుల్లలు దొరకనప్పుడు వాయిలి కొమ్మలు ఆకులతో సహా తెచ్చి ఎండబెట్టాలి. ఈ రెండింటిలో ఏదైనా ఒకటి కాల్చి బూడిద చేయాలి ఒక పాత్రలో ఈ బూడిదను వేసి, తగినన్ని నీళ్ళుపోసి కలపాలి. ఆ నీళ్ళల్లో జంబు దూదిని కలిపితే, ముద్ద తయారౌతుంది. అది ఎండిన తర్వాత పిలువచేసుకొని, కొంచెం కొంచెం చెకుముకి సంచిలో పెట్టుకొని వాడుకుంటారు దాన్నే 'దూది' అంటారు.

పలుగురాయి ముక్కమీద కొంచం దూదిపెట్టి, దాన్ని ఎడమచేతితో పట్టుకొని, బొటనవేలితో నొక్కిపట్టి, కుడిచేతితో ఆకురాయి ముక్క పట్టుకొని, దాని ప్రక్కవైపునుంచి రాయి అంచున కొడతారు. అప్పుడు రాయినుంచి మెరుగుపుట్టి దూది అంటుకుంటుంది. అంటుకున్న దూదితో చొంగలు, బీడీలు ముట్టించుకుంటారు. మంట వేయాలనుకున్నప్పుడు అంటుకున్న దూదిని ఒక చిన్న గుడ్డపేలికలో చుట్టి, నిప్పు రాజుకున్న తర్వాత ఊపి, భగ్గున మంట లేవగానే పేర్చిన కట్టెలకు అంటిస్తారు.

ఈ విధంగా 'వస్తుసంస్కృతి' అనే ఈ ప్రకరణంలో బుడిగె జంగాల ఇళ్లెలా ఉంటాయి? వాటిని ఎలా నిర్మించుకుంటారు! ఇంటిలోని వస్తువుల గురించి, వారి ఆహార పానీయాల గురించి, దుస్తులు - ఆభరణాల గురించి, వారి పశు సంపదగురించి, వారు చేసే చేతిపనుల గురించి వివరించటం జరిగింది. తద్వారా బుడిగె జంగాల జీవన విధానంలో ప్రస్ఫుటమౌతున్న సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక తదితర అంశాలను పరిశీలించటానికి వీలు కలుగుతున్నది.

వస్తు సంస్కృతి ప్రకరణం ముగిసింది. తర్వాత ప్రకరణంలో వీరి భాషా సాహిత్యాల తీరుతెన్నులను పరిశీలిద్దాం.

# ఆరవ ప్రకరణం

# భాషా సాహిత్యాలు

భాష భావ వినిమయానికి తోడ్పడే సాధనం. ఒక జాతి ప్రత్యేక లక్షణాల్లో భాష మొదటిది. ఆ జాతికున్న ప్రత్యేకమైన భాష, ఇతరజాతుల నుంచి ఆ జాతిని వేరుచేసి చూపుతుంది. భాషలో విలక్షణాన్ని చూపేవి మాండలికాలు. వీటిలో కుల మాండలికాలు ఎంతో వైవిధ్యం చూపుతాయి. ప్రాంతీయ మాండలికాలు కూడ కులమాండలికాల మీద ప్రభావం చూపినా, సాధారణంగా ఒక్కొక్క కులానికి ఒక్కొక్క ప్రత్యేకత కనిపిస్తూనే ఉంటుంది. 'భాషతోపాటు పలుకుబళ్ళు, సామెతలు, పొడుపుకథలు, కథలు, గేయాలు మొదలైన సాహిత్య సంపదను' అధ్యయనం చేయటంవల్ల ఆ జాతి జీవన విధానాన్ని, సంస్కృతిని అర్థంచేసుకోవటానికి వీలవుతుంది. అదే విధంగా ఒక కులానికి సంబంధించిన సాహిత్య సంపదలో ఆ కులంవారి జీవన విధానం, వారి సంస్కృతి ప్రతిబింబిస్తుంది.

ప్రధానంగా తెలుగు మాట్లాడే బుడిగె జంగాలకు సంకేత పదాల్లాగా కొన్ని ప్రత్యేక భాషా పదాలున్నాయి. భాషా పదాలతోపాటు పలుకుబళ్ళు, సామెతలు, కథలు మొదలైనవాటిలో వీరి కుల ప్రత్యేకత కనిపిస్తుంది. వీరి భాషా సాహిత్యాలను ముఖ్యంగా ఏడు భాగాలుగా వర్గీకరించి, పరిశీలించవచ్చు. అవి 1. సంకేత భాష 2. జాతీయాలు-పలుకుబళ్లు 3. సామెతలు 4. పొడుపు కథలు 5. కథలు 6. గేయాలు 7. బుడిగె జంగాల రచనలు.

## 1. బుడిగె జంగాల సంకేత భాష - వర్ణనాత్మక విశ్లేషణ :

బుడిగె జంగాలు మాట్లాడే భాష తెలుగే అయినా, ఇతర ప్రజలకు తెలియకుండా తమ కులంలో పరస్పరం మాట్లాడుకోవటానికి కొన్ని సంకేత పదాలను ప్రయోగిస్తారు. ఈ పదాలు 200 పైగా ఉన్నాయి. గ్రామాలకు దూరంగా, గూడెంలుగా కూడి జీవిస్తూ, జానపద కళారూపాలను ప్రదర్శిస్తూ పొట్టపోసు

కుంటూ సంచార జీవనం చేసే బుడిగె జంగాలు తమ జీవన సరళిలోని, పరిధిలోని వస్తువులకు, తిర్యక్కులకు, ఇతర కులాల వారికి సంకేత శబ్దాలుగా ఈ పదాలను ఏర్పరచుకున్నారు. వీళ్ళు తమ జీవన రీతుల్ని ఊరి ప్రజలకు తెలియకుండా జాగ్రత్త పడతారు. తమ మరుగు జీవితానికి అవసరమైన కొన్ని పదాలను గుర్తులుగా ఏర్పరచుకొని తమలో తాము మాట్లాడుకుంటారు. ఈ పదాలు వీళ్ళ వ్యవహారంలోకి ఎప్పుడు వచ్చాయో స్పష్టంగా చెప్పటానికి తగిన ఆధారాలు లేవు. కాని, తరతరాల నుంచి తమ వాడుకలో వ్యవహరింపబడుతున్నట్లు కులవృద్ధులు వివరించారు.

దేశ్య, తత్సమ, అన్యదేశ ధాతువుల ఆధారంగా పరిమితమైన కొన్ని పదాల్ని నిర్మించుకున్నప్పటికి, తెలుగు భాషా నిర్మాణ సరళి ప్రభావంతో తమ పదాల్ని కూర్చుకున్నప్పటికి చాలావరకు ధాతువులు, ప్రత్యయాలు అన్నీ బుడిగె జంగాల భాషకు ప్రత్యేకమైనవి. తెలుగు, ఇతర ద్రవిడ భాషల్లో ఈ ప్రయోగాలు కనిపించవు. అందువల్ల తమ అవసరానికి తగినట్లు తమ తెగకు పరిమితమైన సంకేత పదాల్ని ఈవిధంగా నిర్మించుకున్నారని చెప్పవచ్చు.

ఈ భాషాపదాల్లో దాదాపు 20 క్రియాపదాలు తప్ప మిగిలినవన్నీ నామ వాచకాలే. వీటిలో ప్రాణి వాచకాలు, వృక్ష వాచకాలు, జడ వాచకాలు, రహస్యాంగ బోధకాలు ఉన్నాయి. ప్రాణి వాచకాల్లో కుల బోధకాలైన మహత్ మహతీ వాచకాలు, తిర్యగ్వాచకాలు ఉన్నాయి. ప్రత్యయ విధానం తెలుగు భాషా ప్రభావంతో ఏర్పడింది. బహువచన రూపాలు తెలుగు భాషలో లాగే ఉంటాయి. అనేక నిత్యైక వచన, నిత్యబహువచన శబ్దాలు ప్రయోగంలో ఉన్నాయి. మహద్వాచకాలకు, తిర్యగ్వాచకాలకు 'కా' 'డుజ్' ప్రత్యయాలు రాగా 'శాంతి' అనే పదం మహతీ ప్రత్యయంగా వస్తుంది. కొన్ని నామవాచకాల మీద అమ్, వామ్ అనేవి ప్రత్యయాలుగా ఉండగా, కొన్నింటి మీద 'కోటి' ప్రత్యయం కనిపిస్తుంది. కొన్ని నామవాచకాల్లో అట, అట్కం, క ప్రత్యయాలు చేరిన రూపాలున్నాయి. నామవాచకాల్లో సామాన్య, సంశ్లిష్ట, సమాస ప్రాతిపదికలు, క్రియల్లో సామాన్య, సంకీర్ణ, సమస్త (క్రియా) రూపాలు ఉన్నాయి.

బుడిగె జంగాల సంకేత భాషను ఈ క్రిందివిధంగా వర్ణనాత్మక విశ్లేషణ చేయవచ్చు:

(i) బుడిగె జంగాల సంకేత భాషా పదాలు - అర్థాలు :

1. అంటసిల - అధికం
2. అంటుకొను - తీసుకొను, దొంగిలించు
3. అడ్డి - అబద్ధం, ఊరకనే
4. అ్రమ - బాగా, ఎక్కువ
5. అశోడె - పర్వాలేదు
6. అశోక్కటి - మాంసం
7. అలిగె పంతు - బాలసంతువేషం
8. ఇ్రకకోటి - చెట్టు
9. ఇగ్లాటం - నవ్వటం, నవ్వు
10. ఈకెనెగాడు - తెలుగు (మున్నూరుకాపు కులస్థుడు)
11. ఉన్నానిగాడు - ఎలుక
12. ఊరగాళ్కం - పిల్లి
13. ఎంట్వ - ముంగిస
14. ఎలోక్కడు - రెడ్డి
15. ఏగియ్యి - ఇచ్చేసెయ్
16. ఏశెగాడు - భోగంవాడు
17. ఏశెకాంతి - భోగంస్త్రీ
18. ఐకంజేయు - దాచిపెట్టు
19. ఒంటు - అపరిచితుణ్ణి తమ వాడని భ్రమించుట
20. ఒల్తు - భిక్షం
21. ఒల్తుగాడు - భిక్షగాడు
22. కంచికం - డబ్బు
23. కంచికదారి - ధనవంతుడు
24. కంజు - సంభోగించు
25. కంజులాట - సంభోగం
26. కడ్డిగాడు - గవండ్లవాడు, గౌడు
27. కత్ప - ముచ్చిలిక
28. కన్క్కె - మందు
29. కన్క్కెదారి - వైద్యుడు
30. కన్కెటుగాడు - మందుల కులస్థుడు
31. కబ్బి - రహస్యం
32. కరించు - చంపు
33. కరింపు - చంపు
34. కర్నిపోవు - చనిపోవు
35. కర్కువాం - మామిడికాయ, సీతాఫలకాయ మొ॥ ఏదైన ఆకుపచ్చని కాయ
36. కరోక్కటిగాడు - ఎంద్రకాయ
37. కర్వడి - చీకటి
38. కల్వాం - రాయి
39. కల్జుగాడు - కంసాలి
40. కశాదం - అపాయం
41. కసింపు - తిట్టు
42. కాజాం - చేప, చేపలు
43. కాజాలు - చేపలు
44. కారం కోట్లు - మిరపకాయలు
45. కారిగాడు - బుడిగె జంగం కులస్థుడు.
46. కార్కుడు - కోపిష్టి, కొట్టేవాడు

47. కాళ్కం - దయ్యం
48. కాళ్కదారి - భూతవైద్యుడు
49. కిట్టిపోవు - చనిపోవు
50. కిత్తమావుచేయు - చంపు
51. కీనెగాడు - మాదిగవాడు, మాలవాడు.
52. కుచ్చగాడు - పోలీసువాడు
53. కుమ్మిగాడు - కుమ్మరి
54. కురుంగాడు - తాబేలు
55. కెంద - వస్త్రం
56. కెందలగాడు - చాకలి
57. కేమించు - నొక్కిచెప్పు, నిలదీయు
58. క్రైక - కుక్క
59. క్రైపు - తిను
60. కొంకదం - పురుషాంగం
61. కొక్కిడిగాడు - కోడి
62 కొక్కుమిద్సడు-దొంగ,దొంగబుద్ధి కలవాడు
63. కొడి - తప్పు, తప్పుపట్టుట
64. కొరంజిగాడు - ఎరుకలవాడు
65. కోసాం - పురుషాంగం
66 గండడు/గండగాడు - అక్రమ సంబంధం పెట్టుకున్నవాడు,విటుడు
67 గబ్బి - బూతు
68. గాస్వాం - గడ్డి
69. గింజాం - రూపాయి
70. గిజిగాడు - మంగలి
71 గీతాట్కం - ఏద్వటం
72 గుంటిగాడు - పిచ్చగుంట్లవాడు
73. గుయ్యం/గుయ్యాం - గుదం
74. గుల్పు - ప్రశంస
75 గూటిగాడు - పంది
76. గూడెగాడు - గూడెం ఏర్పాటు చేసిన వాడు
77. గూసు - అవమానం
78. గొంటగాడు - వైశ్యుడు
79. గొట్ట్యాం - స్త్రీమర్మావయవం
80 గొట్టెగాడు - పిసినారి
81. గోరెంద - గడుసరి, మోసకారి
82. చక్రకోటి - రొట్టె
83. జంతకోటి - దయ్యం
84. జంగాళ్కం - జంగపిల్లి
85. జకారిగాడు - మొండికులానికి చెందినవాడు
86. జాను - వెళ్లు
87. జిచ్చుపున్నెం - కాముకుడు, కాముకురాలు
88 జిడ్డువాం - తల
89. జిడ్డెగాడు - యాదవుడు
90. జిక్రర - ప్రమేయం
91. జిట్టాలు - గింజలు
92. జోడాలు - జొన్నలు
93. తాటగాడు/తాటడు-బ్రాహ్మణుడు
94. తుకారిగాడు - కటికవాడు

95. తెల్పులోడు - చాకలి
96. తెల్లాం - రూపాయి
97. తొలిప్యాం - అంబలి
98. తోడ్సిగాడు - ఉడుత
99. దత్తు - బుకాయించు, అల్లరిచేయు
100. దబ్లికోటి/దప్లికోటి - గంజి
101. దారిగాడు - తురుష్కుడు, పోలీసువాడు.
102. దాసిగాడు - దాసరి.
103. దైపు/దేపు - కొట్టు. క్రి. దెబ్బ. విశేష్యం.
104. నచ్చుండు - ఉండు, ఆగు
105. నర్సిగాడు - నక్క
106. నాగన/నాగన్న - వద్దు
107. నాటాం - సైగలద్వారా దూరంనుంచి సమాచారాన్ని అందజేయుట.
108. నాటాంపంతు/నాటుపంతు- నాటాం అందుకొని జాతకం చెప్పు వేషం.
109. నర్రలు - వడ్లు
110. నలుపు - సారా
111. నాపోక్క - తీసుకో
112. నెట్టిగాడు - దొర
113. నెట్క్క - చూడు
114. నెట్టు - సొమ్ము
115. పంతు - వేషం
116. పచ్చాట్క్కం - దొంగతనం
117. పచ్చాం - ఈతకమ్మ, పచ్చి పొగాకు
118. పచ్చిగాడు - దొంగ
119. పత్రకోటి - రాయి
120. పల్లాటం - మాట్లాడటం
121. పర్దేసి - ఇతర సంచార జాతికి చెందినవాడు
122. పల్క్వటం - మాట్లాడటం, యాచించటం.
123. పాణ్యాలు - మూత్రం
124. పింకె - పిల్ల
125. పాడ్యాలు - నీళ్ళు
126. పాష్ట్వాం - చెప్పు
127. పింకెడు - పిల్లవాడు
128. పిత్వ - తాకట్లుచెప్పు, చాడీలుచెప్పు
129. పీసాం - చాప
130. పుచ్చాం - స్త్రీ మర్మాంగం
131. పుల్ల - ముచ్చిలిక
132. పుల్లదారి - ముచ్చిలికగా ఇచ్చిన పుల్లను పట్టుకునేవాడు, కుల పంచాయతీలో కోశాధికారి.
133. పుల్లాకోట్లు - మామిడికాయలు, చింతకాయలు
134. పుల్లాం - చింతాకు
135. పూజగట్టు - సంభోగించు, దొంగిలించు
136. పొట్లకోటి - గర్భం

137. బంగిజేయు - దొంగిలించు, దాచిపెట్టుకొను
138. బడ్యాం - బర్రె, గేదె
139. బడ్యాలోడు - గంగిరెద్దులవాడు
140. బార్తిగాడు - వడ్డెరవాడు
141. బిడెంగాడు - దొమ్మరివాడు
142. బిరాడు - బుడిగెజంగాలగూడెం
143. బీరుగ - బాగుగా, మంచిగా
144. బూతకాళ్కం - భూతపిల్లి
145. బొల్లకోటి-రక్తం
146. బోగాట్కం-సంభోగం, వైభవం
147. బోడ్యాం-గిన్నె, కుండ, పాత్ర
148. మంకాడు - ఇతర కులస్థుడు, గ్రామీణుడు
149. మండిగాడు-పంది
150. మకటాం-గేదె, బర్రె
151. మక్కిడిగాడు-లంబాడివాడు
152. మట్టిగాడు-గ్రామీణుడు
153. మట్టివాం-మన్ను
154. మత్తె-ఇల్లు
155. మత్తెకాళ్కం-ఊరపిల్లి
156. మబ్బగాడు-బోయవాడు
157. మల్గు-నిద్రించు, వ్యభిచరించు
158. మళ్కోటి-స్త్రీ
159. మార్పిల్లు-అమ్ముకొను
160. మ్యాత-అన్నం
161. మ్యాసాం-మేక
162. మిటిపిళ్ళు-బియ్యం
163. మిడ్సగాడు/మిడ్సడు-దొంగ
164. మిడ్సాట్కం-దొంగతనం
165. మిత్ర-నిర్లక్ష్యం
166. మీటాం-ఉప్పు
167. మీటాంగాడు-తేలు, ఉప్పరోడు
168 ముక్కరాసిగాడు-పంది
169. ముతాక్కరి-ముసలి
170 ముత్తగాడు-దేవుడు
171 ముత్తడి-దేవత, అమ్మ, తల్లి
172. మూసగాడు-ఎలుక
173. మెస్కు-తిను, తాగు
174. మొంద్యాస్కం-మొండి మనిషి
175. మోగె-గిన్నె, చెంబు
176. యాగ్రకోటి-వ్యాఘ్రం
177. యాస్కం-భిక్షం
178. యాస్కదారి-బాగా భిక్షం తెచ్చేవాడు (అడుక్కొచ్చేవాడు)
179. యాసాం-పాము
180. లక్కు-నటన
181. లాకడాం-కట్టె
182 వలెంగాడు-ఉడుము
183 వాడివాం-కత్తి
184. వాల్కం-వేషం
185. వాల్కదారి-వేషగాడు
186. వాల్కో-కూర్చో
187. శాంతి-స్త్రీ
188. శాకాం-కూర, పులుసు
189. శారాం-స్త్రీ
190. శావిడి-అన్నం

191. శిర్పగాడు/శిర్పడు-పిల్లవాడు
192. శిర్పకోటి-ఆడపిల్ల
193. శెంద్ర-వలస, దేశాటనం
194. శెత్తాం-చేను
195. శేగు-వెళ్ళు
196. సాయిద-సాక్ష్యం
197. సిక్క జివ్వాలు - తైదలు, రాగులు
198. సిదానం - కల్లు
199. సిరస్త - పద్ధతి, ఆచారం
200. సిర్సువాం - తల
201. సీలకోటి - స్తనం
202. సెర్గువాం - చేట
203. సొన్నాం/సొన్నం - సొమ్ములు
204. సొక్కాలు - జొన్నలు
205. సొక - వద్దు

## (II) ధ్వని పరిణామం

తెలుగు భాషలో జరిగిన ధ్వని పరిణామాలే బుడిగె జంగం భాషాపదాలలో కనిపిస్తాయి. తెలుగు భాషలో చేరని కొన్ని అన్యదేశ్యాలు వీళ్ళ ప్రయోగంలో ఉన్నా, ధ్వని పరిణామం మాత్రం తెలుగులో జరిగినట్లే ఉంటుంది. అందువల్ల ఇక్కడ తత్సమ తద్భవాల్లోని ధ్వని పరిణామంతో బుడిగె జంగం భాషాపదాల్ని పోల్చటం జరిగింది.

| | | సంస్కృతం/ హిందుస్థానీ | తెలుగు | బుడిగె జంగాల ప్రయోగం |
|---|---|---|---|---|
| 1. | చ>స | చంపక | సంపెంగ* | |
| | | చోద్య | సోద్దెము | |
| | పదాదిన | | చాకలి - సాకలి | |
| | | | చెరుగు (దేశ్యం) | సెర్గువాం (చేట) |
| | అపదాదిన | | యాచకం (తత్సమ) | యాస్కం (భిక్షం) |
| 2. | అపదాది ట>డ | ఘటికా | గడియ* | |
| | | ఝకట | జగడము | |
| | | కిరీటి | క్రీడి | |
| | | కుక్కుట | (తత్సమ) | కొక్కిడిగాడు (కోడి) |
| 3. | పదాది వకారానికి లోపం | | వాన-ఆన | |
| | | | వాడు-ఆడు | |
| | | వ్యాఘ్రం | (తత్సమ) | యాగ్రకోటి (పెద్దపులి) |

| | | | |
|---|---|---|---|
| 4. | పదాది శ>స | శాణః - సాన* | |
| | | శిరసు (తత్సమ) | సిర్సువాం (తల) |
| 5. | అపదాది ష>స | భాష - బాస | |
| | | వేష - వేసము | |
| | | దోష - దోసము | |
| | | మేష - (తత్సమ) | మ్యాసాం (మేక) |
| 6. | పదాది హ>జ | హంత (తత్సమ) | జంతకోటి (దయ్యం) |
| 7. | అపదాది హ>య | గుహ్యం (తత్సమ) | గుయ్యం/గుయ్యాం (గుదం) |
| 8 | పదాది ఘ>గ | ఘాబ్రా (అన్యదేశం) | |
| | | గాబరా | |
| | | ఘాంస్ (అ.దే.) | గాంస్వాం (గడ్డి) |
| 9. | న>ణ | పాని (అ.దే.) | పాణ్యాలు (నీళ్ళు) |
| 10. | అపదాది తకారం మీది హల్లుతో సంశ్లేషించుట | పత్థర (ప్రాకృ) | పొత్రము* |
| | | ఆతురత | ఆత్రము |
| | | జాతర - జాత్ర | |
| | | పత్తర్ (అ దే.) | పత్రకోటి (రాయి) |
| 11. | మహాప్రాణాలు అల్పప్రాణాలైన రూపాలు | భోగ (తత్సమ) | భోగాట్కాం (సంభోగించు) |
| | | ఠంగి (తత్సమ) | ఠంగిజేయు (దొంగిలించు, దాచిపెట్టుకొను) |
| | | వ్యాఘ్ర (తత్సమ) | య్యాగ్రకోటి (పెద్ద పులి) |
| | | ఘాస్ (అ.దే ) | గాస్వాం (గడ్డి) |

**(iii). నామ ప్రాతిపదికలు (Noun Stems)**

నామ ప్రాతిపదికలు మూడు రకాలు. 1. సామాన్యం (Simple) 2. సంశ్లిష్టం (Complex) కృదంతాలైన తద్ధితాలైన నామవాచకాలు. 3. సమాసం (Compound). రెండుగాని అంతకంటె ఎక్కువగాని ప్రాతిపదికలు ఒకే ప్రాతిపదికగా ఏర్పడితే సమాసం అవుతుంది.

---

* తూమాటి దొణప్ప గారు ఉదాహరించిన పదాలు.

తెలుగులోని వైకృత పదాలు (వ్యాసం) - తెలుగు భాషా చరిత్ర.

# 1. సామాన్య నామవాచకాలు

పురుష వాచకాలు : గోరెంద (మోసకారి)
జంతు వాచకాలు : ఎంట్వ (ముంగిస), కైక (కుక్క).
జడ వాచకాలు : కెంద (వస్త్రం), కన్నె (మందు), నెట్టు (సొమ్ము), మోగె (గిన్నె), మత్తె (ఇల్లు), శావిడి (అన్నం), సిదానం (కల్లు).
భావార్థంలో : అగ్రమ (అధికం), అశోడె (పర్వాలేదు), ఒల్తు (భిక్షం), కబ్బి (గుట్టు), కశాదం (అపాయం), కొాడి (తప్పు), దత్తు, (అల్లరి) శెంద్ర (వలస).

# 2. సంశ్లిష్ట నామవాచకాలు - (ఎ) కృదంతాలు

## కృదంత నామవాచకాల పట్టిక

ఆమ్, వామ్, ట, ఆట్కం, క, కాళ్కం, కోటి, వడి దారి ప్రత్యయాలు చేరిన రూపాలు.

**ఆం**

1. కాజాం=చేపలు 2. కోసాం=పురుషాంగం 3. గింజాం=రూపాయి 4. గుయ్యాం=గుదం 5. గొట్ట్యాం=స్త్రీమర్మాంగం 6. తెల్లాం=రూపాయి 7. త్రొళిప్యాం=అంబలి 8. నాటాం = దూరంగా ఉండి సైగలతో సమాచారం అందించు. 9. పచ్చాం = ఈతాకు 10. పీసాం=చాప 11. పుచ్చాం=స్త్రీ మర్మాంగం 12 పుల్లాం=చింతాకు 13. బడ్యాం=బర్రె, గేదె 14. బోడ్యాం = గిన్నె 15. మకటాం=బర్రె, గేదె 16. మ్యాసాం=మేక 17. మీటాం=ఉప్పు 18. యాసాం=పాము 19. లాకడాం=కర్ర 20. శాకాం = కూర, చారు 21. శారాం = స్త్రీ, 22. శెత్తాం = చేను, 23. సొన్పాం=సొమ్ము, 24 పాష్ట్వాం = చెప్పు.

**వాం**

1. కర్కువాం=మామిడికాయ, 2. కల్వాం = రాయి, 3. గాస్వాం = గడ్డి, 4. జిడ్డువాం = తల, 5. పుల్సువాం = చింతాకు, 6. మట్టివాం=మన్ను, 7. వాడివాం = కత్తి, 8. సిర్సువాం = తల, 9. సెర్గువాం = చేట.

**ట**

1. ఇగ్లాటం = నవ్వు, 2. వల్లాటం = మాట్లాడుట, 3. పల్క్వాటం = మాట్లాడుట.

ఆట్కాం

1. కంజాట్కాం = సంభోగించు, 2. కరించాట్కాం = చంపటం, 3. గీతాట్కాం = ఏడ్వటం, 4. దైపాట్కాం = కొట్టటం, 5. పచ్చాట్కాం = దొంగతనం, 6. భోగాట్కాం=సంభోగించు, 7. మల్గాట్కాం=పడుకొను, 8. మిడ్సాట్కాం = దొంగతనం, 9. మెస్కాట్కాం = తినటం.

క

1. కంచ్కాం = డబ్బు, 2. కాళ్కాం = దయ్యం, 3. యాస్కాం = భిక్షం, 4. వాల్కాం = వేషం.

కాళ్కాం

1. ఊరగాళ్కాం = ఊరపిల్లి, 2. ఎంట్వకాళ్కాం = ముంగీస, 3. ఏదుకాళ్కాం = ముళ్ళపంది, 4. జంగాళ్కాం = జంగపిల్లి, 5. మత్రైకాళ్కాం = ఊరపిల్లి, 6. బూతకాళ్కాం = భూతపిల్లి.

కోటి

1. అళ్కోటి=మాంసం, 2. ఇక్రకోటి=చెట్టు, 3. చక్రకోటి=రొట్టె, 4. జంతకోటి=దయ్యం, 5. దబ్లికోటి=గంజి, 6. వత్రకోటి=రాయి, 7. పొట్లకోటి=గర్భం, 8. బొల్లకోటి=రక్తం, 9. మళ్కోటి=స్త్రీ, 10. యాగ్రకోటి=పులి, 11. శిర్పకోటి=బాలిక, 12. సీలకోటి=స్తనం, 13. కారంకోట్లు (నిత్య బహువచనం)=మిరపకాయలు 14. పుల్లాకోట్లు (ని.బ.) చింతాయలు, మామిడికాయలు.

దారి :

1. కంచ్కదారి=ధనవంతుడు 2. కన్కెదారి=వైద్యుడు 3. కాళ్కదారి=భూతవైద్యుడు 4. పుల్లదారి=కులపంచాయతిలో కోశాధికారి 5. యాస్కదారి=బాగా భిక్షం తెచ్చేవాడు (అడుక్కొచ్చేవాడు) 6. వాల్కదారి=వేషగాడు.

వడి :

1. కర్వడి=చీకటి

## సూత్రాంశాలు

ఆమ్ :

తిర్యక్ వృక్ష జడవాచకాలకు, రహస్యాంగ బోధకాలకు 'అమ్' ప్రత్యయం వస్తుంది.

| తిర్యగ్వాచకాలు | వృక్షవాచకాలు | జడవాచకాలు | రహస్యాంగబోధకాలు |
|---|---|---|---|
| 1. బడ్యాం. - బర్రె. ఎద్దు | పచ్చాం - ఈతాకు, | బోడ్యాం - గిన్నె | కోసాం - పురుషాంగం |
| 2. మకటాం - బర్రె | పుల్లాం - చింతాకు. | తొలిప్యాం - అంబలి. | గొట్ట్యాం- స్త్రీమర్మాంగం |
| 3. కాజాం - చేవలు. | శెత్రాం - చేను. | గింజాం - రూపాయి. | పుచ్చాం - స్త్రీమర్మాంగం |
| 4. యాసాం - పాము. | పీసాం - చావ. | మీటాం - ఉప్పు. | తత్సమ. గుయ్యాం- గుదం |
| 5. తత్సమ. మ్యాసాం - మేక | తత్సమ. శాకాం. కూర. | అన్య. లాకడాం-కర్ర | |

భావార్థంలో 'నాటాం' అనే ప్రయోగం ఒకటి కనిపిస్తున్నది.

నాటాం=దూరంగా ఉండి సైగల ద్వారా సమాచారం అందజేయటం.

**వాం :**

కొన్ని జడవాచకాలకు 'వాం' ప్రత్యయం వస్తుంది.

దేశ్యాలు : 1. కల్వాం (రాయి), 2. మట్టివాం (మన్ను), 3. వాడివాం (కత్తి), 4. సెర్గువాం (చేట) 5. పుల్సువాం (చింతాకు), 6. కర్కువాం (మామిడి కాయ)

తత్సమాలు : 1. పాష్ట్వాం (చెప్పు) 2. సిర్సువాం (తల)

అన్యదేశ్యం : 1. గాస్వాం (గడ్డి).

**ట**

"ట వర్ణకంబు ఆద్వాదులకగు నగుచో నంత లోపంబగు" - కృదంత-7 అనే సూత్రాన్ని చెప్పి చిన్నయసూరి ఆడు - ఆట, ఊరు - ఊట మొదలైన రూపాల్ని ఉదాహరించాడు. 'ఆట' శబ్దం ప్రాయికంగా క్లీబసమమై 'ము' వర్ణకము చేరి కోలాటము, పోరాటము మున్నగు రూపాలు సిద్ధించాయని చెప్పాడు. బుడిగె జంగాల పరిభాషలో ఇలాంటి రూపాలు ఉన్నాయి.

ఉదా॥ ఇగ్లాటం (నవ్వు), వల్లాటం (మాట్లాడుట).

క్రియా ధాతువుల మీద 'ఆట' శబ్దానికి ముందే 'వ్' చేరిస రూపం ఒకటి వ్యవహారంలో ఉంది.

పల్కాక్వటం (మాట్లాడటం) - పలుకు + వ్ + ఆటం

**ఆట్కం :**

భావార్థంలో 'ఆట' శబ్దంమీద 'ము' వర్ణకానికి ముందు 'క' ప్రత్యయం చేరినప్పుడు, 'ట'లోని 'అ' వర్ణానికి లోపం వస్తున్నది.

భోగాట్కం (సంభోగించటం), గీతాట్కం (ఏడ్వటం), పల్లాట్కం (మాట్లాడటం), మిజ్వాట్కం (దొంగతనం), పచ్చాట్కం (దొంగతనం), కంజాట్కం (సంభోగించటం), కరించాట్కం (చంపటం). దైపాట్కం (కొట్టటం), మాల్గాట్కం (పడుకోవటం), మెస్కాట్కం (తినటం).

**క**

'క' ప్రత్యయం చేరిన మరికొన్ని రూపాలు.

యాస్కం (భిక్షం), వాల్కం (వేషం), కాశ్కం (దయ్యం).

'యాస్కం' అనే రూపం 'యాచకము' పదానికి వైకృత రూపం. 'యాచక' పదంలో 'యాచ్' ధాతువు మీద 'క' ప్రత్యయం చేరింది.

**కాశ్కం :**

'పిల్లి' అనే అర్థంలో ఉన్న 'కాశ్కం' అనే పదం అనుబంధంగా చేరిన రూపాలు - ఊరకాశ్కం, మత్తెకాశ్కం, బూతకాశ్కం.

'జంగాశ్కం' అనే ప్రయోగంలో జంగమ + కాశ్కం-'జంగమ కాశ్కం' అని కావలసిఉండగా 'జంగ' మీది మ - క వర్ణాలకు లోపం జరిగి 'జంగాశ్కం' అయ్యింది.

**కోటి :**

కొన్ని ప్రాణి వాచకాల్లో, జడవాచకాల్లో 'కోటి' ప్రత్యయం కనిపిస్తున్నది.

| | ప్రాణివాచకాలు | జడవాచకాలు |
|---|---|---|
| 1. | మశ్కోటి (స్త్రీ) | అశ్కోటి (మాంసం) |
| 2. | శిర్పకోటి (బాలిక) | దబ్లికోటి (గంజి) |
| 3. | తత్సమ. వ్యాఘ్రకోటి (పులి) | తత్సమ. చక్రకోటి (రొట్టె) |

వృక్షార్థంలో ఇక్రకోటి, భూతార్థంలో జంతుకోటి, స్తనార్థంలో శీలకోటి (క్షీరవైకృత రూపం సీల), గర్భార్థంలో పొట్లకోటి అనే ప్రయోగాలు కూడ 'కోటి' ప్రత్యయాంతాలుగా ఉన్నాయి.

కారంకోట్లు, పుల్లాకోట్లు అనేవి నిత్య బహువచనాంతాలుగా ఉన్నాయి.

**వడి :**

కొలువడి, గెలువడి, నడవడి, లేవడి రూపాల్ని ''వడి ప్రకృతులిట్లె రుంగునది'' అని సూరి కృదంత - 22 సూత్రంలో వివరించాడు. ఈ సూత్రానికి లోబడి 'వడి' కృత్తు చేరిన రూపం ఒకటి పీళ్ళ వ్యవహారంలో కనిపిస్తున్నది. 'చీకటి' అనే అర్థంలో 'కర్వడి' అనే ప్రయోగం ఉంది.

కఱ - వడి - కఱవడి - కర్వడి.

**దారి :**

కొన్ని మహద్వాచకాలకు 'దారి' అనే అనుబంధ పదం ప్రత్యయంగా వస్తుంది.

1. కంచ్కదారి, 2. కన్కెదారి, 3. యాస్కదారి 4. వాల్కదారి, 5. కాళ్కదారి, 6. పుల్లదారి.

అన్య దేశాలలోని జమీందారు, జాగిర్దారు, కౌలుదారు మొ॥ పదాలలోని దారుశబ్దం, కొన్ని దేశ్య శబ్దాల్లో కనిపిస్తుంది. ఇది పార్శీ ప్రభావం. అమ్మకం దారు, కొనుగోలుదారు మొ॥ ఇందుకు ఉదాహరణ.

తెలుగులోని అనుబంధపదమైన ఈ దారు శబ్దమే పీళ్ళలో 'దారి' శబ్దంగా కనిపిస్తున్నది.

## (వి) తద్ధితాంతాలు

**నామాలపైన నామనిష్పత్తికోసం చేరే ప్రత్యయాలు తద్ధితాలు.**

**తద్ధితాంత నామవాచకాల పట్టిక**

| మహద్వాచకం | అర్థం | మహతీవాచకం |
|---|---|---|
| 1. ఈకెనెగాడు | - తెలగ కులస్థుడు | - ఈకెనెకాంతి |
| 2 ఏశెగాడు | - భోగంవాడు | - ఏశెకాంతి |
| 3. కడ్డిగాడు | - గౌండ్లవాడు | - కడ్డికాంతి |
| 4. కినెగాడు | - మాదిగవాడు | - కినెకాంతి |

| | | |
|---|---|---|
| 5. కల్లుగాడు | - కంసాలివాడు | - కల్లుకాంతి |
| 6. గిజిగాడు | - మంగలివాడు | - గిజికాంతి |
| 7. దారిగాడు | - తురకవాడు | - దారికాంతి |
| 8. బిడెంగాడు | - దొమ్మరివాడు | - బిడెంకాంతి |
| 9. జిద్దెగాడు | - యాదవుడు | - జిద్దెకాంతి |
| 10. కన్నేటుగాడు | - మందులకులంవాడు | - కన్నేటుకాంతి |

**అదంత మహత్తులకు రెండు రూపాలు**

| | | |
|---|---|---|
| 1. గొంటగాడు/గొంటడు | - వైశ్యుడు | - గొంటకాంతి |
| 2. తాటగాడు/తాటడు | - బ్రాహ్మణుడు | - తాటకాంతి |
| 3. నెట్టగాడు/నెట్టడు | - దొర | - నెట్టకాంతి |
| 4. మిద్సగాడు/మిద్సడు | - దొంగ | - మిద్సకాంతి |
| 5. మబ్బగాడు/మబ్బడు | - బోయవాడు | - మబ్బకాంతి |

**తద్ధితాంత తిర్యగ్వాచకాలు**

1. ఉన్నాసిగాడు=ఎలుక 2 కురుంగాడు = తాబేలు 3. కొక్కిడిగాడు=కోడి 4. తోడ్సిగాడు=ఉడుత 5. నర్సిగాడు=నక్క 6. మండిగాడు=పంది 7. మీటాంగాడు=తేలు 8. ముక్కరాసిగాడు = పంది 9. గూటిగాడు = పంది 10. మూసగాడు=ఎలుక 11. వలెంగాడు=ఉడుము 12. గటుంగాడు=సీటికుక్క.

**అడి**

1. కంజాలాడి = రంకులాడి.

## సూత్రాంశాలు

1. "కాక త్రియ వర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునందు ఆటాదులకగు (తద్ధిత-11)" అనే సూరిసూత్రంవల్ల ఆటగాడు,జూదగాడు, సీటుగాడు, నేస్తగాడు, బేరగాడు ఇత్యాది రూపాలు సిద్ధించాయి. బుడిగె జంగాల భాషలో మతుబర్థంలో కాకుండ మగాదుల వంటి పుంస్త్వపదాలమీద 'కా' వర్ణకం వచ్చి 'డుజ్' చేరిన రూపాలు కనిపిస్తాయి.

కారిగాడు, కుచ్చగాడు, కడ్డిగాడు, కొరంజిగాడు, కల్లుగాడు, గిజిగాడు మొదలైనవి. మతుబర్థంలో ఒకే ఒక్క రూపం కనిపిస్తున్నది - ఏశెగాడు.

2. మహత్తులగు మగాదులకును, కయిరాదులకును 'డుజ్' అగును. 'ఉత్వంబుగాదు' అనే అచ్చిక 4వ సూత్రంలో-

సూరి మగాదుల్లో అదంతాలైన మగ-మనుమ-రాయ-పాప పదాలతోపాటు అదంతాలు కాని ప్రే-తేలనుకూడ చేర్చాడు. ఈ సూత్రంవల్ల మగడు, మనుమడు, రాయడు, పాపడు, ప్రేడు, తేడు అనే రూపాలు సిద్ధిస్తాయి. మతుబర్థం కాదు కాబట్టి వీటికి 'కా' ప్రత్యయం రాదు.

బుడిగె జంగాల వ్యవహారంలో అదంతమైన మహత్తులకు 'కా' వర్ణకం పిదప "డుజ్' వచ్చిన రూపాలతోపాటు కేవలం డుజ్ మాత్రమే వచ్చిన ('కా' వర్ణకం రాకుండ) రూపాలు కూడ కనిపిస్తాయి. అంటే రెండేసి రూపాలు వ్యవ హారంలో ఉన్నాయి.

| 'కా', డుజ్ ప్రత్యయాలు వచ్చిన రూపం | | కేవలం డుజ్ వచ్చిన రూపం |
|---|---|---|
| గొంటగాడు | - | గొంటడు (వైశ్యుడు) |
| తాటగాడు | - | తాటడు (బ్రాహ్మణుడు) |
| నెట్టగాడు | - | నెట్టడు (దొర) |
| మిడ్సగాడు | - | మిడ్సడు (దొంగ) |

అదంతం కాని మహత్తులకు 'కా' వర్ణకం తర్వాత డుజ్ వచ్చి కారిగాడు, కుచ్చుగాడు, కడ్డిగాడు మొదలైన రూపాలు సిద్ధిస్తాయే కాని అదంత మహత్తులకువలె గొంటడు, తాటడు, నెట్టడు, మిడ్సడు అనే రూపాలలాగా కారుడు, కుచ్చుడు, కడ్డుడు వంటి రూపాలు లేవు.

'ఎల్కోడు' అనే పదానికి కేవలం డుజ్ వచ్చిన రూపమే ఉంటుంది కాని కా ప్రత్యయం రాదు.

భావార్థంలో 'కార్కుడు' అనే పదమొకదానికి కూడా 'కా' ప్రత్యయం రాదు.

3. "కావర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి" (తద్ధిత - 14) అని సూత్రీకరించి చిన్నయసూరి-

ఇబ్బందిగాడు (పెద్దపులికి చిఱుత పులికి పుట్టిన మృగమునకి పేరు కలదు), ఒంటిగాడు (పంది), కొమ్ముగాడు (అడవి పంది), పరిగాడు (ఏనుగుల

గుంపులో ముందుండు ఏనుగు) అనే మృగవాచకాలను ఉదాహరించాడు. మతుబర్థంలోనూ, స్వార్థంలోనూ పుంస్త్వద్యోతకంగా వచ్చే 'కా' ప్రత్యయం (తద్ధిత సూ. 11-13) కొన్ని మృగవాచక పదాలకు అగుపడుతున్నదని సూరి సూత్రీకరించాడు. పురుష వాచకాలకేగాక పశువాచకాల పైన కూడ ఈ 'కా' ప్రత్యయం మహాకవుల ప్రయోగంలో కనబడుతున్నదని చెప్పాడు.

బుడిగె జంగాల భాషలో ఉన్న ఈ క్రింది తిర్యగ్వాచకాలకు కూడ ఈ సూత్రం వర్తిస్తున్నది.

| | |
|---|---|
| ఉన్నాసిగాడు - ఎలుక | మండిగాడు - పంది |
| కురుంగాడు - తాబేలు | మీటాంగాడు. తేలు |
| కొక్కిడిగాడు - కోడి | ముక్కురానిగాడు - పంది |
| తోడ్సిగాడు - ఉడుత | వలెంగాడు - ఉడుము |
| నర్సిగాడు - నక్క | మూసగాడు - ఎలుక |

4. బుడ్గ జంగాల భాషలోని మహద్వాచక శబ్దాలకు 'కా' డుజ్ ప్రత్యయాలు వచ్చినట్లు మహతి వాచకంగా 'స్త్రీ' అనే అర్థంలో ఉన్న 'శాంతి' అనే పదం ప్రత్యయంగా వస్తుంది.

| మహద్వాచకం | | మహతీవాచకం |
|---|---|---|
| ఏశెగాడు | - | ఏశెశాంతి |
| కీనెగాడు | - | కీనెశాంతి |
| దారిగాడు | - | దారిశాంతి |
| నెట్టగాడు | - | నెట్టశాంతి |

"తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యం బగునపుడు మతుబర్థంబు నందగు" (తద్ధిత -19) అని సూరి నిర్వచించి - కొటవత, చాకిత, బోయత, సాలెత ఇత్యాది రూపాలు చూపాడు.

బుడిగె జంగాల భాషలో తవర్ణకానికి మారుగా కులవాచకానికి స్త్రీ వాచ్యం అయినపుడు 'శాంతి' ప్రత్యయం వస్తుంది.

ఏశెశాంతి, కినెశాంతి, దారిశాంతి, నెట్టశాంతి. 'ముత్తగాదు' అనే మహతీవాచకంలో శాంతి ప్రత్యయం చేరకుండా 'ముత్తడి' రూపం ఉంటుంది. పచ్చిగాడు, కార్కుడు అనే పదాలు మహతీవాచక బోధకాలుగా కూడా ఉంటాయి.

వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీ వాచ్యంబగునపుడు మతుబర్థంబు నందు 'ఆడి'వర్ణకంబగు (తద్ధిత.22) అనే సూత్రం ప్రకారం వగలాడి, చిన్నెలాడి, కులుకులాడి మొదలైన రూపాల్ని చిన్నయసూరి ఉదహరించాడు.

బుడిగె జంగాల భాషలో 'కంజాలాడి' అనే పదానికి ఈ సూత్రం అన్వయిస్తుంది. కంజా + లు + ఆడి = కంజాలాడి.

## 3. సమాస నామవాచకాలు :

బుడిగె జంగాల భాషలో సామాన్య, సంశ్లిష్ట నామ ప్రాతిపదికలున్నంతగా సమాస ప్రాతిపదికలు లేవు.

అలిగె పంతు, నాటువంతు, బేతప్పు, పచ్చబంగ్ల, నెట్టుకెంద, నెట్టుమత్తె మొ॥ సమాస ప్రాతిపదికలు.

## IV క్రియలు :

క్రియలు మూడు విధాలు (1) ఏకధాతుకాలైన అగు, పడు, చెప్పు వంటివి సామాన్య క్రియలు. (2) క్రియా ప్రాతిపదికలకు క్రియా కారకాలు చేరి ఏర్పడేవి సంకీర్ణ క్రియలు. ఉదా॥ కట్టించు, నడిపించు, ఒనర్చు మొ॥ 3. క్రియ మీద క్రియ గాని, నామంమీద క్రియగాని, చేరిన రూపాలు సమస్త క్రియలు. చనిపోవు, చేకొని, తెలుపుకొను, కాపాడు చేయుచుండు మొ॥[1]

**బుడిగె జంగాల భాషలోని క్రియా పదాలు**

(1) **సామాన్య క్రియలు :-** కంజు, జేగు, శేగు, దైపు, మెస్కు, మల్గు, కైపు జాను. (అన్య.దే)

(2) **సంకీర్ణ క్రియలు :-** కరించు, కరింపు, కసించు, కసింపు, కేమించు, నెట్కు.

(3) **సమస్త క్రియలు :-** క్రియ + క్రియ: అంటుకొను, ఏగియ్యి, కంజాలాడు, కర్సిపోవు, కిట్టిపోవు. నచ్చుండు, నాపోకు, వాల్కొ (చివరి రెండు పదాల్లో కొను అనుబంధం 'కో'గా మారింది), బంగిజేయు.

---

1. ఉదాహరించిన పదాలు తెలుగు భాషా చరిత్రలో పేర్కొన్నవి. పు. 196.

నామం + క్రియ:- మార్పిల్లు, పూజగట్టు, ఐకంజేయు, కిత్తమాపు చేయు.

"పువర్ణకంబు మాయ్యాదులకగు (కృదంత-11)" అనే సూత్రంలో 'ఇంచు'కు 'ఇంపు' వస్తుందని సూరి సూత్రీకరించాడు.

కరించు-కరింపు, కసించు-కసింపు అనే రూపాలు ఇలాంటివే. ఆటలాడు, మాటలాడు అనే విధంగా 'కంజాలాడు' అనే ప్రయోగం వీళ్ళలో ఉంది.

## (V) వచనం :

1. మానవ వాచకాలకు, జంతువాచకాలకు ఏకవచనంలో 'డు' ప్రత్యయం రాగా బహువచనంలో 'ళ్ళు' వస్తుంది.

| మానవ వాచకాలు | | | జంతు వాచకాలు | | |
|---|---|---|---|---|---|
| ఏ.వ | - | బ.వ | ఏ.వ | - | బ.వ |
| గొంటగాడు | - | గొంటగాళ్ళు | తోడ్సిగాడు | - | తోడ్సిగాళ్ళు |
| తాటగాడు | - | తాటగాళ్ళు | కురుంగాడు | - | కురుంగాళ్ళు |

అదంతమైన మహత్తులకు 'కా', 'డుజ్' ప్రత్యయాలు వచ్చిన నామవాచకాలకే బహువచనం వస్తుంది. కాని, అదంత మహత్తులైనను కేవలం డుజ్ వచ్చిన నామ పదాలకు బహువచనం రాదు.

ఒక్క ఎలోక్కడు - ఎలోక్కళ్లు అనే పదానికి తప్ప -

గొంటడు, తాటడు ఇత్యాది పదాలకు 'కా' ప్రత్యయం రానందున బహువచన రూపాలు లేవు.

2. బహువచన ప్రత్యయం పరమైనపుడు 'కోటి' ప్రత్యయం చేరిన పదాల చివరి ఇకారానికి లోపం వస్తుంది.
ఆశోక్కటి + లు - ఆశోక్కట్లు

ఇక్రకకోట్లు, చక్రకకోట్లు, శిర్పకోట్లు, పత్రకోట్లు మొ॥ ఇకారం లోపించిన మరో రూపం ముత్కారి + లు - ముత్కార్లు.

3. 'ఆమ్' ప్రత్యయాంత సంశ్లిష్ట నామవాచకాలకు బహువచనంలో 'మ్లు' వర్ణకం లోపిస్తుంది.

బోడ్యాం + లు - బోడ్యాలు
మ్యాసాం + లు - మ్యాసాలు
బడ్యాం + లు - బడ్యాలు
యాసాం + లు - యాసాలు

4. 'వామ్' ప్రత్యయాంత సంశ్లిష్ట నామవాచకాలకు,

అకారాంత, ఎకారాంత, దపూర్వకం కాని ఉకారాంత సామాన్య నామ వాచకాలకు బహువచన ప్రత్యయం చేరినప్పుడు ఎలాంటి మార్పులు రావు.

వామ్....కర్కు వాం + లు - కర్కువాంలు
కల్వాం + లు - కల్వాంలు

అ.... కెంద + లు - కెందలు
కెంద్ర + లు - కెంద్రలు
గోరెంద + లు - గోరెందలు

ఎ కన్నె + లు - కన్నెలు
మత్తె + లు - మత్తెలు
మోగె + లు - మోగెలు

ఉ ఒల్తు + లు - ఒల్తులు
పంతు + లు - పంతులు
దత్తు + లు - దత్తులు

5. బహువచన ప్రత్యయం పరమైనపుడు 'క' 'ట' ప్రత్యయాల మీదున్న 'మ్' వర్ణకం లోపించి పూర్వ అకారం దీర్ఘమవుతుంది.

కంచికం + లు=కంచికాలు, యాస్కాలు, కాశ్కాలు, వాల్కాలు
పల్లాటం + లు=పల్లాటాలు. మొ.

6. బహువచన ప్రత్యయం పరమైనపుడు డి - డు లకు ళకారం ఆదేశంగా వస్తుంది.

కొడి + లు=కొళ్ళు సాడి + లు=సాళ్ళు
శావిడి + లు=శావిళ్ళు ముత్తడి + లు=ముత్తళ్ళు
బిరాడు + లు=బిరాళ్ళు

7. కొన్ని నిత్య ఏకవచనాలుగా, నిత్యబహువచనాలుగా ఉన్నరూపాలు వ్యవహారంలో ఉన్నాయి.

నిత్య ఏకవచనాలు :- గొంటడు, తాటడు, నెట్టడు, మిడ్సడు, మబ్బడు, కాజాం, నలుపు, సిదానం

నిత్య బహువచనాలు :- జీవ్వాలు, జోడాలు, న్రరలు, పాణ్కాలు, సొత్కాలు, మిటిపిళ్ళు, పుల్లాకోట్లు, కారంకోట్లు.

## VI సర్వనామాలు :

ఉత్తమ, మధ్యమ పురుష సర్వనామాలు తెలుగుభాషలోనివి వాడగా, ప్రథమ పురుషకు మాత్రం వీరికి మహత్ మహతీ బోధకాలు ఉన్నాయి.

| ఏకవచనం | | బహువచనం |
|---|---|---|
| మహత్తు (అతడు) | మంకాడు | మంకాళ్ళు |
| | మట్టిగాడు | మట్టిగాళ్ళు |
| మహతీ (ఆమె) | శాంతి | శాంతులు |

## VII. అర్థ పరిణామం :

ధ్వని పరిణామం శబ్ద స్వరూపంలో జరిగే మార్పు కాగా అర్థ పరిణామం శబ్ద స్వభావంలో కలిగే మార్పు. బుడిగె జంగాలు తెలుగు భాషలోని కొన్ని ధాతువులను, పదాలను స్వీకరించి వాటిమీద ప్రత్యయాలు, అనుబంధ పదాలు చేర్చి కొత్త పదాలను పదబంధాలను నిర్మించుకున్నారు. ధాతువులమీద ప్రత్యయాలు చేరిన రూపాలు: కర్వడి, కల్వాం, ముత్కారి మొదలైనవి. పదాలమీద ప్రత్యయాలు చేరిన రూపాలు కారంకోట్లు, చక్రకోటి, మట్టివాం, వాడివాం మొదలైనవి. నామపదాల మీద అనుబంధ పదాలు చేరిన రూపాలు ఊర కాళ్కం, కిట్టు పంతు, యాస్కదారి, పూజగట్టు మొదలైనవి. యధాతథంగా ప్రయోగించే కొన్ని శబ్దాలను భిన్నార్థంలో వినియోగించుకున్నారు గండడు, అంటుకొను, కబ్బి, నలుపు, పుల్ల మొదలైనవి. వీళ్ళు నిర్మించుకున్నపదాలలో లక్ష్యార్థ ప్రయోగాలే ఎక్కువ. ఉదా॥ కారంకోట్లు, పుల్లాం, కుచ్చుగాడు, చక్రకోటి, తెల్లాం, ముక్కరాసిగాడు, వలెంగాడు, వాడివాం ఇత్యాదులు. దేశ్య, తత్సమ, తద్భవ, అన్యదేశాల్లోని కొన్ని విశేషమైన అర్థ పరిణామాలు ఈ కింది విధంగా ఉన్నాయి.

## (1) దేశ్యాలు

| | బుడిగె జంగం పదం | వీరి వ్యవహారంలో ఉన్న అర్థం | వివరణ |
|---|---|---|---|
| 1. | అంటుకొను | తీసుకొను, దొంగిలించు. | ముట్టుకొను, రాచుకొను అని తెలుగులో అర్థం. |
| 2. | ఇగ్లాటం | నవ్వు | ఇగిలింత, పళ్ళు కనబరచుట |
| 3. | ఊర కాళ్కం (ఊర) | పిల్లి | 'ఊర' తెలుగుపదంమీద అనుబంధ పదం కాళ్కం=పిల్లి చేరింది. |
| 4. | ఏగి | ఇచ్చివేయు | ఏగు + ఇయ్యి, క్రియమీద క్రియ చేరిన సమస్త క్రియాపదం. |
| 5. | కబ్బి | గుట్టు | మోసం, వంచన అని తెలుగులో అర్థం. |
| 6. | కర్సిపోవు | చనిపోవు | 'కల్సిపోవు' రూపమే 'కర్సిపోవు' కావచ్చు - పంచభూతాల్లో కలిసి పోవు అనే అర్థంలో. నిందార్థంలో 'మరణించు' అనే దానికి 'కర్సి పోవు' ప్రయోగం కూడ కనిపిస్తున్నది. |
| 7. | కర్వడి | చీకటి | 'కఱ' (నల్ల) అనే ధాతువు మీద 'వడి' అనే కృత్తుచేరి 'కర్వడి' రూపం ఏర్పడింది. నల్లనిది చీకటి. |
| 8. | కల్వాం | రాయి | 'కల్' (రాయి) ధాతువు మీద 'వాం' ప్రత్యయం చేరింది. |
| 9. | కారంకోట్లు | మిరపకాయలు | 'కారం' అనే తెలుగు పదం మీద 'కోట్లు' అనే ప్రత్యయం చేరిన నిత్యబహువచన రూపం. |
| 10. | కార్కుడు | కరుకుదనంకలవాడు | 'కఱకు' పదం మీద మహత్ ప్రత్యయం 'డుఙ్'చేరిన రూపం, 'కర్కోటకుడు'ను పోలినరూపం. |

| | | | |
|---|---|---|---|
| 11. | కిట్టిపోవు | చనిపోవు | గిట్టునుండి వచ్చిన రూపం.'కిట్టు' అనే క్రియ ఔపవిభక్తిక ఇకారాంతంతో నామపదంగా మారింది. |
| 12. | కుచ్చుగాడు | పోలీస్‌వాడు | కుచ్చుటోపి ధరించువాడు |
| 13. | కొరంజిగాడు | ఎరుకలవాడు | 'కురవంజి' భవం. |
| 14. | గుంటిగాడు | పిచ్చుకగుంటువాడు | |
| 15. | గొంటడు | వైశ్యుడు | గోమటి>కోమటి. గోమట శబ్దం. గొంట(గొమ్‌ట) పదానికి దగ్గరగా ఉంది. కొనుట>కొంట>గొంట వ్యుత్పత్తి కూడ గమనార్హం. |
| 16. | జిడ్డడు | యాదవుడు | జిడ్డుగల పదార్థాలు పాలు, పెరుగు వెన్న, నెయ్యి కలవాడు. |
| 17. | తెల్లాం | రూపాయి | తెల్లగా ఉండునది. |
| 18. | తెల్పులోడు | చాకలి | బట్టలను తెల్లగా ఉతుకువాడు |
| 19. | నలుపు | సారా | నల్లగా ఉండే పానీయం |
| 20. | పల్లాటం | మాట్లాడుట | పల్లు + ఆడు - పల్లాడు - పల్లాడటం |
| 21. | పుల్లాకోట్లు | చింతకాయలు | 'పుల్లని' తెలుగు పదంమీద కోట్లు ప్రత్యయం చేరింది. |
| 22. | పుల్లాం | చింతాకు | పుల్లని ఆకు పులుసుకోసం చింతాకును వాడుతారు |
| 23. | పొట్లకోటి | గర్భం | పొట్ట>పొట్ల. కోటి ప్రత్యయం చేరింది. |
| 24. | బిరాడు | బుడిగె జంగాలగూడెం | బిడారులోద - ర వ్యత్యస్తమైన రూపం. |
| 25. | మార్పిల్లు | అమ్ముకొను | మార్పిడి. వస్తువులను డబ్బుకు మార్చుకొను. ప్రేరణార్థకంలో 'మార్పించు'లోని-ఇంచు సబిందు చకారానికి (ంచ్), ద్విరుక్త లకారం వచ్చిన రూపం. కాని, ఇక్కడ ప్రేరణార్థకంలో ప్రయోగింపబడలేదు. |

| | | | |
|---|---|---|---|
| 26. | మ్యాత | అన్నం | 'మేయు' క్రియమీద కృత్తు 'త' వచ్చింది. పశుసంబంధి. |
| 27. | ముక్కరాసి గాడు | పంది | ముక్కు (ముట్టె) భూమిలో రాయునది. |
| 28. | ముత్కారి | ముదుసలి | 'ముదుక' ధాతువుమీద ప్రత్యయం చేరిన రూపం. |
| 29. | వలెంగాడు | ఉడుము | వాల ప్రాధాన్యం కలది. |
| 30. | వాల్కం | వేషం | వాలకం - ఆకారం, వేషం అనే అర్థాలున్నాయి. |
| 31. | వాడివాం | కత్తి, కొడవలి | 'వాడి' తెలుగుపదం మీద 'వాం' ప్రత్యయం చేరిన రూపం. వాడి గలది. |
| 32. | సెర్గువాం | చేట | 'చెరుగు' పదం మీద 'వాం' ప్రత్యయం చేరింది, చెరుగు పని ముట్టు చేట. |

## (2) తత్సమ తద్భవాలు

| | బుడిగె జంగాల పదం | వ్యవహారంలో ఉన్న అర్థం | వివరణ |
|---|---|---|---|
| 1. | ఏశెగాడు | భోగంవాడు | ఆట, పాటలు ప్రదర్శించు కులం |
| 2. | ఏశెళాంతి | భోగం స్త్రీ | అనే అర్థంలో, 'ఏశె' పదం. 'కేళి', 'మేళం' పదాలతో సామీప్యాన్ని పొందుతున్నది. |
| 3. | కురుంగాడు | తాబేలు | 'కూర్మం' వైకృతరూపమే 'కురుమ్.' |
| 4. | గండడు | విటుడు | తెలుగులో శూరుడు, మగడు అనే అర్థాలున్నాయి. |
| 5. | చక్రకోటి | రొట్టె | చక్రంలాగా గుండ్రంగా ఉండేది. |
| 6. | కొక్కిడిగాడు | కోడి | కుక్కుట శబ్దభవం. |
| 7. | గుయ్యాం | గుదం | గుహ్య శబ్దభవం. |

| | | | |
|---|---|---|---|
| 8. | జంతకోటి | దయ్యం (చంపునది) | 'హంత' శబ్దభవమైన 'జంత' మీద కోటి ప్రత్యయం చేరింది. |
| 9. | పాష్టాం | చెప్పు | 'పద్' ధాతువుతో ఏర్పడినరూపం. |
| 10. | మట్టివాం | మన్ను | 'మృత్తు' తత్సమ రూపమే మట్టి. దానిమీద 'వాం' ప్రత్యయం చేరింది. |
| 11. | మ్యాసాం | మేక | మేష శబ్ద భవం. |
| 12. | యాగ్రకోటి | పెద్దపులి | వ్యాఘ్రపద భవం. |
| 13. | యాస్కాం | భిక్షం | యాచక శబ్ద భవం. |
| 14. | శాకాం | కూర | శాక శబ్దం మీద 'అం' ప్రత్య చేరింది. |
| 15. | సిర్సువాం | తల | 'శిరసు' శబ్దంమీద వాం చేరింది. |
| 16. | సీలకోటి | స్తనం | 'క్షీర' వైకృత రూపమే 'సీల' దానిమీద కోటి ప్రత్యయంచేరింది. |
| 17. | కర్కోటిగాడు | ఎండ్రకాయ | 'కర్కట' శబ్దంమీద ప్రత్యయం చేరింది. |

## (3) అన్యదేశ్యాలు

| | బుడిగె జంగం పదం | వ్యవహారంలో ఉన్న అర్థం | వివరణ |
|---|---|---|---|
| 1. | గాస్వాం | గడ్డి | 'ఘాంస్' హిందూస్థానీ పదంమీద 'వాం' ప్రత్యయం చేరింది. |
| 2. | జాను | వెళ్లు, వచ్చు | -'జా' హిందూస్థానీ పదం.దానిపై 'ను' చేరింది. |
| 3. | పత్రకోటి | రాయి | -'పత్తర్' హిందుస్థానీ పదంమీద 'కోటి' ప్రత్యయం చేరింది. |
| 4. | పర్దేసి | ఇతర తెగలవాడు | -హిందుస్థానీలో 'ఇతర దేశస్థుడు' అని అర్థం. |
| 5. | పాణ్యాలు | నీళ్లు | -'పానీ' హిందుస్థానీ పదం మీద ప్రత్యయాలు చేరిన రూపం. |

| | | | |
|---|---|---|---|
| 6. | లాకడాం | కఱ్ఱ | -హిం. పదం 'లక్‌డీ' మీద 'ఆం' ప్రత్యయం చేరింది. |
| 7. | కిత్తమాపు జేయు | చంపు | -'కిత్త మాఫ్' మీద 'చేయు' సహాయక క్రియ చేరింది. |
| 8. | మీటాం | ఉప్పు | -'మీట్' మరాఠీ పదం మీద 'ఆం' చేరింది. |
| 9. | సౌన్నాం | సొమ్ములు | -'సోనా' హిందుస్థానీ పదం మీద ప్రత్యయాలు చేరాయి. |
| 10. | కత్వ | ముచ్చిలిక | -హిందుస్థానీ పదం ఇక్కడ భిన్నార్థంలో వాడబడింది. |

## 2. జాతీయాలు - పలుకుబళ్ళు

సమాజంలో ఒక్కో జాతికి కొన్ని విలక్షణమైన ఆచారాలు. సంప్రదాయాలు ఉంటాయి. అవి అనూచానంగా కొనసాగుతుంటాయి. అలాగే ఆ జాతి మాట్లాడే భాషలో కూడ ఇతర భాషలకు భిన్నమైన ప్రత్యేక లక్షణాలు రూపుదిద్దుకొని ఉంటాయి. భావ వినిమయం కోసమే పుట్టిన భాష అనుభూతుల అభివ్యక్తికి మాధ్యమమై మార్పులు చేర్పులతో ప్రవాహంలా ముందుకు సాగుతుంటుంది.

జాతీయం అంటే ఆ జాతికి సంబంధించింది. ఆ జాతి మాట్లాడే భాషలోని విలక్షణ ప్రయోగం అని అర్థం. జాతీయం, పదబంధం, పలుకుబడి, నుడికారం అనేవి సమానార్థకాలు కాకపోయినా పర్యాయపదాలుగా వ్యవహరింపబడుతున్నాయి. జాతీయాలు విశిష్టమైన పదబంధాలు. విభిన్న అర్థ బోధకాలైన పదాలు సమాసంగా కూడినప్పుడు ఒక వినూత్నార్థాన్ని వెలిగిస్తాయి. అలా ఏర్పడ్డవే పదబంధాలు. పదబంధ నిర్వచనాన్ని 'పదబంధ పారిజాత' కర్తలు పీఠికలో ఈ విధంగా వివరించారు—

"విడివిడిగా పొడిమాటలుగా వున్నవే అపూర్వ సమ్మేళనంతో ఆ మాటలకు విడివిడిగా వేనికి లేని ఏదో అపూర్వ భావ వ్యక్తీకరణకు మూలములై,

విశిష్ట పదబంధాలుగా భాషలో నిలిచిపోతున్నవి. వానినే పదబంధములనీ, నుడికారములనీ, పలుకుబడులనీ, జాతీయములనీ పేర్కొంటూ వుంటాము.''[1]

జాతీయాలను పరిశీలించినట్లైతే అవి అనేక విధాలుగా ఏర్పడినట్లు స్పష్టమవుతుంది. శరీరావయవాలను పేర్కొంటూ వచ్చినవి కొన్నైతే, పరిసరాల నుంచి వచ్చినవి కొన్ని. అలాగే ఆచార వ్యవహారాలనుంచి వచ్చినవి, పురాణ కథల ఆధారంగా వచ్చినవి, జనశ్రుతిగా చెప్పుకునే కథలనుబట్టి వచ్చినవి, అతిశయోక్తుల ఆధారంగా వచ్చినవి, విశ్వాసాలు ఆధారంగా వచ్చినవి, అనుభవం ఆధారంగా వచ్చినవి, అనుకరణ శబ్దాలు ఉపయోగించేవి ఇత్యాదిగా స్థూల వర్గీకరణ చేయవచ్చు.[2]

**బుడిగె జంగాల జాతీయాలు - పలుకుబళ్ళు :**

బుడిగె జంగాలు మాట్లాడే భాష తెలుగే కాబట్టి కులేతరులతో సందర్భానుగుణంగా తెలుగు జాతీయాలనే ప్రయోగించటం సహజం. అయినా, తమకున్న పరిమితమైన ప్రత్యేక భాషా పదాలతో ఏర్పడ్డ జాతీయాలను తమలో తాము మాట్లాడుకునేటప్పుడు వ్యవహరించటం సర్వసాధారణం. వీళ్ళ పరిసరాల నుంచి, అవసరాల నుంచి పుట్టినవే ఈ జాతీయాలు - విలక్షణమైన వీళ్ళ జాతి జీవన విధానం ఈ జాతీయాల్లో ప్రస్ఫుటమౌతున్నది. వాటిని ఈ కింద ఉదాహరిస్తాను.

**పదబంధాలు, పలుకుబళ్ళు**

**పదబంధాలు-**

| | పలుకుబళ్ళు | అర్థం | వివరణ |
|---|---|---|---|
| 1. | అడ్డల బుడ్డ | - అవాంతరవిషయం | -'రామాయణంలో పిడకలవేట' అన్నట్లు. |
| 2. | ఆసిగాడు | - వృద్ధుడు | -బాగోతంలో హాస్యంచేయువాడు. తోలుబొమ్మలాటలోని కేతిగాడు, గందోళిగాని వంటివాడు |

---

1. పదబంధ పారిజాతం (ప్రథమ సంపుటం) 1959-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు. సంపా: నార్ల, విద్వాన్ విశ్వం, తిమ్మావజ్ఝల కోదండరామయ్య.
2. ముదిగొండ వీరభద్రశాస్త్రి - 1988.

| | | | |
|---|---|---|---|
| 3. | కబ్బిగన్న కారిగాడు | - గుట్టుతెలిసినవాడు | - కారిగాడు=బుగ్గ జంగం. వీళ్ళ కులంలో ఒకరి గుట్టు ఒకరికి తెలుసు. అలాంటి గుట్టు తెలిసిన కులేతరుడు. |
| 4. | కావిడి మోత | - వ్యర్థం | |
| 5. | కుక్కముట్టిన కుండ | - రంకుటాలు | |
| 6. | గుయిగాని పోరు | - వ్యర్థప్రసంగం | |
| 7. | జిల్ల తల్కాయ | - తెలివితక్కువ | -జిల్ల>దొల్ల, మట్టిబుర్ర |
| 8. | తూతూ తుమ్మ కాయమంత్రం | - మభ్యపెట్టు | |
| 9. | తెల్లగోలు | - స్పష్టం చేయు | |
| 10. | దీవెనార్తి | - ఆశీర్వచనం | -'దీవన' దేశ్యపదం మీద 'ఆర్తి' తత్సమం చేరింది. |
| 11. | దుడ్డుకు దొబ్బెడు | - చౌక | -దుడ్డు=పైస, దొబ్బ=అంతరావయవం పరిమాణార్థంలో. |
| 12. | నత్తెల్లప్ప తుపాకి | వ్యర్థం | -పిట్టల దొరవేషం వేసే నత్తి ఎల్లప్ప[1] చేతిలోని కర్ర తుపాకి. |
| 13. | నోటికి విడెమిచ్చు | -మౌనంగా ఉండు | -ఎవరైనా మాట్లాడదలిచినప్పుడు ఎదుటి వ్యక్తిని మౌనంగా ఉండుమని చెప్పటానికి 'నీనోటికి విడెమిస్త' అని అంటారు- 'నీ మాటకు అడ్డమొచ్చాను' అన్నట్లుగా. |
| 14. | పచ్చ బంగ్ల | -పోలీసు స్టేషను | |
| 15. | పర్దేసి | -ఇతర తెగలవాడు | -'విదేశీయుడు' అనేఅర్థంలో ఉన్న అన్యదేశ్యం. |

---

1. నత్తి ఎల్లప్ప అనే వ్యక్తి తొలిరోజుల్లో ఈ వేషం వేయటంలో ప్రసిద్ధుడట.

| | | | |
|---|---|---|---|
| 16. | పుచ్చకాయ | -తన్నులుతినేవాడు | -'వేలుచూపితే ముడిగేది గుమ్మడి కాయ, తొక్కినా పగలనిది పుచ్చ కాయ'. ఎంత చెప్పినా వినకుండా తప్పులు చేసేవాడు అనే అర్థంలో. |
| 17. | పుల్చు బుడ్డి మొకం | -పాలిపోయిన ముఖం | -పులుసు చేసుకునే మట్టి పాత్ర. ముఖాన్ని పాత్ర నలుపుతో పోల్చటం. |
| 18. | పూజగట్టు | -సంభోగించు | |
| 19. | పౌత్రిగట్టు | -తనవైపుకు తిప్పుకొను | -పౌత్రి=రక్షాజనిత రేఖ. భూత ప్రేతాలనుంచి రక్షణకు ఇంటి చుట్టూరా గీసిన బూడిద రేఖ. |
| 20. | బట్ట గాల్చి మీదవేయు | -చేయని నేరాన్ని మోపు | |
| 21. | బుర్రకాయంత పిల్ల | -ఆడపిల్ల | |
| 22. | మతమతాన | -ఉన్నట్లుండి | |
| 23. | మీ ఇంట్ల అంబలి | -పెళ్ళికాని పిల్ల | |
| 24. | ముదురెంటువ | -పెద్దవయసువాడు | -ముదురు+ఎంటువ, ఎంటువ= ముంగిస. |
| 25. | యదార్తం | -వాస్తవం | -తత్సమ పదం |
| 26. | శనార్తి | -నమస్కారం | -శరణం+అర్తి-'శరణం కోరిన వాడు' అనే అర్థంలో కాకుండ నమస్కారం అనే అర్థంలోనే ఉంది. |
| 27. | సొంగపిడ్త | నిరుపయోగం | చొంగ+పిడత. |
| 28. | దేవుని జోలె | | పావు తులం మొదలుకొని తులం పరిమాణం వెండితో ఎల్లమ్మ, పోశమ్మ మొదలైన దేవతల పతకాలు చేయించుకొని, ఒక అడుగు పొడవున్న చిన్న జోలెలో గవ్వలు, పసుపు వేసి, గుడిసెలో పైభాగాన తగిలిస్తారు. దీన్నే 'దేవుని జోలె' అంటారు. ఆరాధన సందర్భంలో ఈ జోలెలోని పతకాలను విగ్రహాలుగా ఉంచుతారు. |

| | | |
|---|---|---|
| 29. | బాపనింటి ఎల్లమ్మ | బలి లేకుండా శాకాహార పదార్థాలతో మ్రొక్కే ఎల్లమ్మ. |
| 30. | ఫిరంగి ఎల్లమ్మ | బలులతో మ్రొక్కే ఎల్లమ్మ. |
| 31. | బరిబత్తల ఎల్లమ్మ | నగ్న శరీరంతో మ్రొక్కే ఎల్లమ్మ. |
| 32. | సకినం | 'శకునం' వికృతి సకినం. దయ్యం పట్టిన సందర్భంలో దయ్యంతో మాట్లాడి, బలులను నిర్ణయించే ఒక సంప్రదాయ ప్రక్రియ. |
| 33. | ఎడ | దేవతకుగాని, దయ్యానికిగాని మొక్కు చెల్లించేటప్పుడు-అన్నం, వండిన బలి జంతువుల అంతరావయవాలు, మాంసం విస్తళ్ళలో గుమ్మరించి అర్పించటం. |
| 34. | పారబోసుకోవటం | బలులు, ఎడలద్వారా దయ్యాల మ్రొక్కు చెల్లించుకోవటం. |
| 35. | మందు త్రాగటం | భూత వైద్యుని దగ్గరకెళ్ళి తమ దయ్యాన్ని చంపించుకోవటం. |
| 36. | తంగెడి దేవర | కులేతరుల దయ్యం. |
| 37. | తీసివేయటం | తన కీడు తొలగాలని, గాలి సోకితే పోవాలని, భూతవైద్యునిచేత నిమ్మకాయలతో మంత్రింపించి 'ఎడ'తో తీసివేయటం. |
| 38. | దాసంగం | (దాస సంఘం) ఐదుగురు దాసులను పిలిచి భోజనం చేయించటం. |
| 39. | ఉత్కలాడు | ఉదకములాడు - ప్రసవించు. |
| 40. | ప్రసిద్ధగు | ప్రసవించు. |
| 41. | కొల్లు | ఇంటి ముందర బాలెంత స్నానానికి రెండుమీటర్ల వ్యాసంలో ఏర్పాటు చేసిన గుండ్రని కాలువ మధ్య భాగం. |
| 42. | పొరక్కట్ట | పొరక కట్ట - పొరకలతో చేసిన కట్ట - చీపురుకట్ట |
| 43. | పొత్తి | ప్రసవం జరిగినప్పుడుగాని, సమర్త అయినప్పుడుగాని, అమ్మతల్లి (మశూచి) పోసినప్పుడు గాని గుడిసె చుట్టూరా పోసిన బూడిద రేఖ - రక్షణనిత రేఖ. |

| | | |
|---|---|---|
| 44. | కమ్మలకత్తి | వెదురు గడకు చివరన కట్టి ఈతకమ్మ రెబ్బను కోసే చిన్న కొడవలి. |
| 45. | పురుడు | ప్రసవం జరిగిన 3 వ రోజు చేసే నామకరణ తతంగం. |
| 46. | లింగాలు | పురుడునాడు పూజించటానికి కుంకుమ వసుపు బొట్లు పెట్టిన చిన్న చిన్న పలుగురాళ్ళు, ఎల్లిపాయల దండలు. |
| 47. | పొంగు లొట్టి కల్లు | ఎంగిలి చెయ్యకుండ లొట్టి నిండుగా ఉన్న కల్లు సాక పెట్టటానికి ఉపయోగిస్తారు. |
| 48. | సాక | దేవుణ్ణి లేక దయ్యాన్ని మొక్కేటప్పుడు పొంగు లొట్టి కల్లునుగాని, సారానుగాని భూమి మీద కొంచం ధారగా పోయటం. |
| 49. | పుల్లలు వేయటం | 9 వ రోజు శిశువు కడుపు మీద బొడ్డు చుట్టు దబ్బనం లేక సూదితో ఎర్రగా కాల్చి వాతలు వేయటం. |
| 50. | ఇడెం | (విడియం = తాంబూలం) నిశ్చితార్థం. |
| 51. | కల్లు పోయించు | నిశ్చితార్థం. |
| 52. | మాటముచ్చటయింది | నిశ్చితార్థం జరిగింది. |
| 53. | పుల్ల విరుపు | ఉభయులకు ఎలాంటి తగాదా లేదని కులపెద్ద ముందు పుల్ల విరిచి తెలియచేయటం. |
| 54. | బుర్రకాయంత పిల్ల/పిలగాడు | నిశ్చితార్థం రోజున వధువు, వరుణ్ణి బుర్రకాయతో పోల్చుతారు. |
| 55. | అంబలి | నిశ్చితార్థం రోజున కన్యను 'అంబలి' లేక 'బుద్దెదంబలి' అని అంటారు. |
| 58. | అంబ్యాత్కుడు | అమాయకుడు |
| 59. | ఇచ్చులు గచ్చకాయలు | రంధ్రాన్వేషణ, గూఢార్థాలు |
| 60. | గంట్లు | మొండి మాటలు |
| 61. | గంట్ల ప్రసంగం | మొండి మాటలు మాట్లాడే మనిషి. మూర్ఖుడు. |
| 62. | గంట్లు మారముండ్లు | మొండి మాటలు, ఎదురు ప్రశ్నలు |

| | | |
|---|---|---|
| 63. | అరిశెరలు (అరి చెఱలు) | శత్రువుకు చెఱలోని బాధలవంటి మితిమీరిన కష్టాలు |
| 64. | ఇరమాను | ఇతర వృక్షం, ఇంటి కోడలు. |
| 65. | సంసారి మనుషులు | మర్యాదస్తులు, అంతో యింతో ఉన్నవాళ్ళు. |
| 66. | చింతాకు జీడాకు | (చింతాకు, జీడి ఆకు) చింతాకు మొదలైనవి. |
| 67. | ఇల్లు కట్టుకొనిపోవు | ఒక ఊరినుంచి మరో ఊరికి గుడిసెతో తరలి పోవు. |
| 68. | చెయ్యి సాక్షి | నిశ్చితార్థం రోజున, వివాహం రోజున విభిన్నమైన ఇంటి పేర్లున్న ఐదుగురు కులస్థుల చేతుల్లో చెయ్యివేసి వరుని తండ్రి వధువు తన ఇంటి కోడలైందని చెప్పటం. |
| 69. | కోరుకున్నవాళ్లు | నిశ్చితార్థం రోజున, వివాహం రోజున వరుని తండ్రి ఇచ్చే విందు అనుభవించటానికి, వధువు తండ్రి కోరుకున్న తన బంధువర్గం. |
| 70. | కల్లు కలుపుకోవటం | పెళ్ళి తేదీ నిర్ణయించుకునే సందర్భంలో వియ్యంపులు కలిసి తాగటం. |
| 71. | బిరాడు | బుడ్గ జంగాల గూడెం. |
| 72. | తికట్టి | మూడు కట్టెలు భూమిమీద నిల్పి, వాటిపైన చాప వేసి, కట్టిన చిన్న గుడిసె. |
| 73. | చాపమీది మాట | పెళ్ళిరోజు కులపెద్ద ముందు వియ్యంపులు పరస్పరం పెట్టుకునే నిబంధనలు. |
| 74. | నేవింపులు | నియమాలు (నియమింపులు) - పెళ్ళినాడు కుల పెద్ద చేసే కట్టుదిట్టాలు. |
| 75. | సనుబాలముష్టి | చనుబాలముష్టి = ఓలి |
| 76. | దాపుడు చీర | దాచిపెట్టుకున్న జలతారు పట్టుచీర. |
| 77. | కట్నాలు | పెళ్ళిలో కులస్థులు వధూవరులకు డబ్బురూపేణా ఇచ్చే కానుకలు. |
| 78. | సుట్టాల బంతి | (చుట్టాలబంతి) పెళ్ళి జరిగిన రెండవరోజు వరుని తల్లిదండ్రులు వియ్యంపులకు, వాళ్ళ సమీప బంధువులకు ఇచ్చే విందు. |

| | | |
|---|---|---|
| 79. | నెత్తిపట్ల కల్లు | పెళ్ళి జరిగిన మూడవరోజు వరుని తల్లిదండ్రులు వియ్యంపులకు మాత్రమే తాగించే కల్లు. |
| 80. | మ్యార | ఒప్పందం ప్రకారం వరుడు అత్త మామలకు సేవలుచేస్తూ వాళ్ళ వెంటనే ఉండి జీవించటం. |
| 81. | వూట | (వధూవరులు) మధ్యవర్తి అయిన పెద్దమనిషి వెంట ఉండి జీవించటం. |
| 82. | దిగుట | ఒక ఊరినుండి మరో ఊరికి వచ్చి గుడిసె వేసు కోవటం. |
| 83. | పిల్లను తోలుకోవటం | తల్లిగారింట్లో ఉన్న తన కోడలిని వియ్యంపులకు కల్లు త్రాగించి, తన యింటికి తెచ్చుకోవటం. |
| 84. | కొత్త పెట్టుకోవటం | కొత్త ధాన్యాన్ని వండుకునేరోజు పండుగ. |
| 85. | సోబన బంతి | శోభనపు బంతి - శోభనం రోజు వధువుపక్షం వాళ్ళకు ఇచ్చే విందు. |
| 86. | బందార్తం | బంధ + అర్థం-వధూవరుల శారీరక అనుబంధం కోసం వధువుపక్షం వాళ్ళకిచ్చే విందు - సోబనం బంతి. |
| 87. | రూపాయి పావలా | విడాకులిస్తున్నప్పుడు భార్యకొంగులో కట్టేడబ్బు. |
| 88. | రూపాయి పావలా పెడతా | విడాకులిస్తా. |
| 89. | చీరైరికి | చీర, రవిక - పునర్వివాహం. |
| 90. | పంచాయతి | కులస్థులద్వారా వాద వివాదాలు పరిష్కరించు కోవటం |
| 91. | న్యాయం-తగు(వు) | పంచాయతి (రూ. పంచాది) |
| 92. | సొంగ ముంత | పొగాకు తాగే చొంగ బిలుము, కల్లు ముంత, ఇవిప్రతి కులస్థునికి ఉన్న కులాచారపు హక్కులు. |
| 93. | బొట్టు | ఆధారం. హక్కు. |
| 94. | పుల్ల | పుడక. వాది ప్రతివాదులు కులస్థులకిచ్చే ముచ్చిలిక. |
| 95. | కత్ప | పుల్ల. |

| | | |
|---|---|---|
| 96. | పుల్లదారి | కత్వదారి. కుల పంచాయతీలో వాది ప్రతివాదులు ఇచ్చే పుల్లను పట్టుకునేవాడు. కుల పంచాయతీలో కోశాధికారి. |
| 97. | కోరడి | కుల పంచాయతీ తీర్మానానికి దూర గ్రామంలో ఉన్న కుల పెద్దను కోరుకొని, అతని వద్దకు కులస్థుని పంపటం. |
| 98. | జోడ | దూర గ్రామంలో ఉన్న కుల పెద్దను పంచాయతీ తీర్మానానికి రమ్మని చెప్పటానికి పంపిన ఇద్దరు కులస్థులు. |
| 99. | శెంద్ర | భిక్షాటన కోసం గ్రామాంతరానికి వలస వెళ్ళటం. |
| 100. | దండ్గ | (దండుగ - దండగ) - జరిమానా. కుల పంచాయతీలో దోషిమీద వేసే కులం ఖర్చు. |
| 101. | న్యాయగాళ్ళు | (నాయగాళ్ళు) - కులం పంచాయతీలో తీర్పు లిచ్చే కుల పెద్దలు. |
| 102. | వాదుకాళ్ళు | వాది ప్రతివాదులు |
| 103. | సాక్షిగాళ్ళు | సాక్ష్యం చెప్పేవాళ్ళు |
| 104. | సాలు | చాలు, వరుస. వాది ప్రతివాదుల వాఙ్మూలం. |
| 105. | దడావతు | తీర్పుకు ముందుగానే వాది ప్రతివాదులు కుల పెద్ద అడిగిన రొక్కాన్ని అతని వద్ద ఉంచుట-డిపాజిట్టు. |
| 106. | తప్పస్తుడు | తప్పుచేసినవాడు. |
| 107. | ఇమానం (చేయు)తిను | ప్రమాణం చేయు. |
| 108. | గుడికొట్టు | గుళ్ళో దేవుని పాదాల మీద ప్రమాణం చేయు. |
| 119. | బాణి | కుల పంచాయతీలో సాక్ష్యాలు లేనప్పుడు దోషికి కీడు జరుగుతుందనే నమ్మకంతో వారం, పది రోజుల నిర్ణీతకాలాన్ని ఇస్తారు. ఈ సమయంలో ఎవరికి కీడు జరిగితే వారిదే తప్పుగా పరిగణిస్తారు. దీన్నే 'బాణి' కట్టటం అంటారు. |
| 110. | సాటువ | ఉదాహరణంగా చెప్పే కథ. |
| 111. | సాలు పట్టుకొచ్చు | వాది ప్రతివాదుల తప్పొప్పులను ఎన్ను. |

112. కొడి — తప్పు
113. నోటొట్టం — తిట్టినందుకు దండ్గ లేక జరిమానా.
114. హశాం చేయు — దౌర్జన్యం చేయు
115. కుండచాట తీసివేయు — కుల బహిష్కారం చేసిన తర్వాత, కులం శిక్షలకు ఒప్పుకున్నట్లైయితే కుండ, చాట మొదలైన వస్తువులను పారవేసి తిరిగి కులంలో కలపటం.
116. వెనకేసుకొను — కూతురును అత్తగారింట్లో బాధిస్తున్న కారణంగా కాపురానికి పంపకుండా తమ ఇంట్లోనే ఉంచుకోవటం.
117. కూని (ఖూనీ) — కొట్లాటలో కాళ్ళు, చేతులు విరగటం, తల పగలటం మొదలైన ప్రాణాపాయమైన, రక్తసిక్తమైన దెబ్బలు.
118. కాయం-కురాకు (ఖురాక్) — కొట్లాటలో దెబ్బలు తగిలినవానికి పెట్టే ప్రత్యేకాహారం.
119. మగనాలి పడుచు — వివాహిత
120. పుట్టింటి పిల్ల — అవివాహిత
121. మ్యాళం — మేళం, జానపద కళారూపాలను ప్రదర్శించటానికి ఏర్పడిన బృందం.
122. తాళాలు మీవే, మద్దెండ్లు మీవే — మీరు ఆడించే ఆట, పాడించే పాట.

భాగవత, పగటివేషాల ప్రదర్శనల కారణంగా ప్రజల వ్యవహారంలో పుట్టిన కొన్ని జాతీయాలు:

1. తప్పిన భాగోతం కాదు - అనివార్యం
2. తెరవెనుక భాగోతం - లోలోపల జరుగుతున్న కుతంత్రం
3. పగటివేషగాడు - మోసగాడు, వేషాలు, మార్చేవాడు
4. గుడిపూడి జంగాల బాపతు - మాటలెక్కువ పనితక్కువ.
5. చేతిచమురు భాగోతం - లాభంలేదు. పైగా ఉన్నది పోయింది.

### వేట - జాతీయాలు

బుడిగె జంగాల జీవన విధానంలో 'వేట' అతి ప్రధానమైంది. వేట అనుభవంలోనుంచి పుట్టిన ఈ క్రింది ఉపమానాలను తమ మాటల్లో సందర్భాను సారంగా ఉపయోగిస్తారు.

### జాతీయాలు

1. బండ తోడ్సిగాడు - గుట్టకు ఉండే ఉడత - మొండి మనిషి
2. మొండిజీవం - వేటగాళ్ళకు చిక్కని జంతువు-మొండిమనిషి
3. ఆకుడు తిన్నజీవం - వలలోపడి తప్పించుకున్న జంతువు మొండి మనిషి

(1–3: దాన ధర్మాలు చేయని వాడు)

4. గుట్టగవ్వి - అందులేనిది
5. పొలం దిరుగు - వేటకు వెళ్ళు
6. జీవం బెదిరింది - సంకోచించు
7. పసిపట్టు - తెలుసుకొను

### ఉపమానాలు

1. కర్కోటిగాని కొండ్లలాగా - ఎండ్రకాయ కొండ్లు - ఎదురు చెప్పే మాటలు
2. ఏదుకొయ్య - ఏదు పంది కొయ్య - ప్రాణాంతకం
3. ఉర్లపడ్డ తోడ్సిగాడు - ఉచ్చులో పడిన ఉడత - చేతికి చిక్కినవాడు
4. తుక్కేసుకున్నట్లు - ఎలుకల కన్నం దగ్గం ఊదర పెడితే, పొగ రాకుండా మట్టిని అవి అడ్డంగా పెట్టుకోవటం - తమను తాము రక్షించు కోవటం.
5. కొమ్ము పొడుచుకున్నట్లు - ఊదర పెట్టినప్పుడు ఎలుకలు రక్షణార్థం భూమిపైకి కన్నం చేసుకొని పోతాయి. దాన్ని కొమ్ము పొడుచుకోవటం అంటారు. తప్పించుకోవటం
6. వలెంగాని నాల్కె - ఉడుము నాలుకలు. పామువలె రెండు నాల్కలుంటాయి - మాట మార్చుట.
7. కురుంగాడు పూడుకున్నట్లు - తాబేలు బురదలో కూరుకోవటం - ఏదీ పట్టనట్లు వొదిగి కూర్చోవటం.

8. వలల బిడ్డ జీవం(లక్క)లాగ - ఆపదలో చిక్కుకోవటం.
9. పగిడికంటె గుడ్లు - గుడ్లగూబ కళ్ళు - ఆశ్చర్యపోయి చూడటం.
10. ఎల్క పెంటలాగ - ఎలుకల కన్నంవలె - లంకంత ఇల్లు

**వాక్యాలు**

బుడిగె జంగాల భాషలో నామవాచకాలే ఎక్కువ. దాదాపు పాతిక దాకా క్రియాపదాలు వ్యవహారంలో కనిపిస్తున్నాయి. ప్రత్యేకమైన ఈ భాషా పదాలకు తెలుగు భాషా భాగాలను చేర్చి మాట్లాడుతుంటారు. బుడ్గ జంగాలు ప్రయోగించే కొన్ని వాక్యాలను ఇక్కడ ఉదహరిస్తున్నాను.

1 మంకాడు కార్కుడు కర్కువాంలంటుకుంటుంటె నెట్కుయ్య వట్టెనాగన- (భూస్వామి కోపిష్టివాడు కాయలు తెంపుతుంటుంటె చూస్తున్నాడు. తెంపొద్దు.)
2. సిదానం పున్నెంమెస్కిండు - (కల్లు త్రాగాడు )
3. జిట్టాలు మార్పిల్లితే ఐదు తెల్లాలు వచ్చినవి - (గింజలు అమ్మితే ఐదు రూపాయలు వచ్చాయి.)
4. మిడ్సగాల్లు కర్వట్ల జాని మిటిపిల్లు అంట్క పోతరు - (దొంగలు చీకట్లో వచ్చి బియ్యం దొంగతనం వేస్తారు.)
5. కుచ్చుగాడు బందిచ్చుకోని గింజలు నావుక్కంటడు - (పోలీసువాడు పట్టుకొని రూపాయలు లాక్కుంటాడు)
6. నెట్టకాంతి నెట్టు శావిడి ఏగిస్తది- (దొరసాని మంచి అన్నం పెడుతుంది.)
7. ఆ గొంటగాడు గొట్టె పున్నం - (ఆ వైశ్యుడు పిసినారి.)
8. పచ్చిగాల్లు మంకాన్ని దైపి, కరింపి, కల్వాం గట్టి బాయిలపున్నెం ఐకం జేసింద్రు. కుచ్చుగాళ్ళు జాన్తున్నరు - (దొంగలు ఒకతణ్ణి కొట్టి, చంపి రాయికి కట్టి బావిలో పడవేశారు. అందుకే పోలీసులువెళ్తున్నారు.)

## 3. సామెతలు

'సామ్యం' శబ్దం నుంచే 'సామెత' పదం పుట్టింది సామ్యం అంటే పోలిక. సామెతల్లో సామ్యమున్న రెండు విషయాల్ని పోల్చి చెప్పటం జరుగుతుంది. లేదా లోక వృత్తాన్ని సామెతతో పోల్చటం జరుగుతుంది. చాటువులు, లోకోక్తులు అనేవి సామెతలకు సమానార్థకాలుగా ఉన్నాయి. పలువురు పండితులు సామెతల స్వరూపాన్ని అనేక విధాలుగా ఉగ్గడించారు.[1]

సామెతలు సూటిగా, సూత్రప్రాయంగా, సంఘవృత్తానికి దృష్టాంతంగా ఉంటాయి. సరళంగా, సంక్షిప్తంగా, అలంకారయుక్తంగా ఉండి మనసుకు హత్తుకుపోయేవి సామెతలు. మానవ జీవితానుభవంలో కాచి వడపోసిన సత్యాలే సామెతలై జనవ్యవహారంలో జీవిస్తూ వస్తున్నాయి. సూత్రప్రాయమైన నీతులకు, ఆచారాల రీతులకు, విశ్వాసాలకు, మానవ జీవన విధానాలకు, అనుభవాలకు సామెతలు అద్దం పడతాయి.

సామెతల కర్తృత్వం నిర్ణయించటం సాధ్యం కాకపోయినా సామెతల్ని అనేక రకాలుగా వర్గీకరించవచ్చు. కొందరు భాషాపరంగా వర్గీకరిస్తే, కొందరు వస్తుపరంగా వర్గీకరించారు. ధార్మిక, నైతిక, సామాజిక, శాస్త్ర విభాగాలుగా కొందరు వర్గీకరిస్తే - బంధు సంబంధి, వ్యక్తి వివేచనా సంబంధి, సత్య విషయ సంబంధిగా కొందరు విభజించారు.[2]

### బుడిగె జంగాల సామెతలు

బుడిగె జంగాలు తెలుగు సామెతలతోపాటు తమ జాతి జీవన ప్రవాహంలో ప్రభవించిన సామెతల్ని కూడ నిత్య వ్యవహారంలో ప్రయోగిస్తారు.

బుడిగె జంగాల సామెతల్ని పరిశీలిస్తే రెండు విభాగాలుగా ఇవి కనిపిస్తాయి. జంగం కులం నుంచి బుడ్గ జంగం ఒక ఉప కులంగా విడిపోనికాలంలో జంగం కులాన్ని గురించి ప్రజల వ్యవహారంలో పుట్టిన సామెతలు మొదటి విభాగం కాగా, బుడ్గ జంగం కులం ఏర్పడిన తర్వాత వారి జీవన సరళిలో పుట్టినవి రెండవ విభాగంలో చేరుతాయి.

---

1. తెలుగు జానపద సామెతలు పుట - 3.
2. ,, ,, ,, పుట - 10.

మొదటి విభాగంలో చేరే సామెతల్లో ఈ కిందివాటిని చెప్పుకోవచ్చు.

1. ఏక జంగం శతమర్కటః
2. జాతి చెడ్డవాడు జంగం.
3. సాలెకు జంగానికి సయోధ్య కుదురుతుందా?
4. కుక్క మొరిగితే జంగం పరపతిపోతుందా - మొదలైనవి.

ఇక రెండవ విభాగానికి చెందిన బుడ్గజంగాల జాతి జీవనం నుంచి పుట్టిన సామెతల్లో ఈ కిందివి కొన్ని ఉదాహరణలు.

1. కత్వ కట్టనింకె సిద్ధమే గుత్వపట్టనింకె సిద్ధమే.
2. కంజిమెస్కె కారిగాడు దత్తుపెట్టె దారిగాడు.
3. తనువుకు నూరేండ్లు - తగువుకు వెయ్యేండ్లు.
4. ఎల్క తొంటికాడ ఏడు నూర్లు పెట్టుకున్నట్లు - మొదలైనవి.

వస్తు వైవిధ్యాన్ని గమనించినట్లైతే వీళ్ళ సామెతల్ని i) కులాన్ని వర్ణించేవి, ii) వృత్తులు, iii) పంచాయతులు, iv) విశ్వాసాలు - ఆచారాలు - అనే భాగాలుగా పరిశీలించవచ్చు.

(i) కులాన్ని వర్ణించేవి : వీరశైవమతం ఉధృతంగా ఉన్న రోజుల్లో 'జంగం' కులవాచకం కాదు. 'వీర శైవ మతస్థుడు' అనే అర్థంలో వ్యవహరించబడేది. 'జంగం' శబ్దం కాకతీయుల కాలం నుంచి ఒక కులవాచకంగా ఏర్పడసాగింది. ఈ చివరి మూడు నాలుగు శతాబ్దాలనుంచి జంగాలలో అనేక తెగలు ప్రారంభమై, అవి ప్రత్యేక కులాలుగా ఏర్పడ్డాయి.

వీరశైవ మతంలో కులాలు లేవు. అంతకుముందు సువ్యవస్థితమైన వర్ణ వ్యవస్థలోని ఏ కులంవారైనా వీరశైవాన్ని స్వీకరింపవచ్చు. కులదృష్టి వల్ల ఏర్పడిన ఉచ్చనీచాలు వీరశైవులు పాటించరు. కుల ప్రసక్తిలేని సర్వసమదృష్టి కలవారు వీరశైవులు. 'జంగమైన వెనుక జాతి నెంచగరాదు' అనే సామెత అప్పుడు పుట్టిందే.

వీరశైవేతరులు జంగాలను హేళన చేసిన సందర్భంలో 'జాతిచెడ్డవాడు జంగం' అనే సామెత వచ్చింది. వీరశైవం అన్ని కులాల సంకరం అనే అర్థంలో ఈ సామెత పుట్టింది. ఈ విధంగా జంగాలను వీరశైవేతరులు హేళన చేస్తున్నప్పుడు 'కుక్క మొరిగితే జంగం పరపతి పోతుందా' అని తమని జంగాలు సమర్థించుకునే సందర్భం మరో సామెతగా అవతరించింది.

శైవ వైష్ణవ మత వైషమ్యాల వల్ల పుట్టిన సామెతల్లో ఈ కిందివాటిని చెప్పుకోవచ్చు.

1. దాసర్లా జంగాలా అంటే ముందూరును ఐట్టిఅన్నట్లు.

2. అయ్య దాసర్లకు పెడితే అమ్మ జంగాలకు పెట్టినట్లు.

జంగాల తత్త్వాన్ని చెప్పే సామెతలు కొన్ని పుట్టాయి.

1. ఏక జంగం శతమర్కటః

2. ఇల్లుకాలింది జంగమయ్యా అంటే, నా జోలె, నా కప్పెర నా వద్ద ఉన్నాయిలే అన్నాడట.

3. జగడమెట్లా వస్తది జంగమయ్యా అంటే, భిక్షం పెట్టవే బొచ్చుముండ అన్నాడట.

4. జంగానికి పిల్లలు పుడితే ఊరివారి గోడు పోసుకున్నాడట- మొదలైనవి ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు.

'జంగం' కులం నుంచి వేరై ప్రత్యేక కులంగా బుడిగె జంగం కులం ఏర్పడిన తర్వాత పుట్టిన సామెతగా 'కంజి మెస్కె కారిగాడు - దత్తుపెట్టె దారిగాడు' అనే సామెతను చెప్పుకోవచ్చు. 'కారిగాడు' అంటే 'బుడిగె జంగం,' 'దారిగాడు' అంటే పోలీసువాడు. నిజానికి 'దారిగాడు' అంటే 'మహమ్మదీయుడు' అని అర్థం. నిజాం వంశ పాలనలో ముస్లిములే పోలీసువాళ్ళుగా ఉండే వారు. కాబట్టి పోలీసువాణ్ణి కూడ బుడిగె జంగాలు 'దారిగాడు' అంటారు. పోలీసువానికి అవసరమై మందిచ్చో, మంత్రంవేశో బుడిగె జంగం అతనివద్ద డబ్బు గుంజాడు. 'కంజిమెస్కె' అంటే 'దెంగిపోయినాడు' అని అర్థం. బుడిగె జంగం ఇచ్చిన మందువల్ల లేదా మంత్రం వల్ల దారిగానికి ఏం ఫలితం కనిపించ లేదు. అందువల్ల అతడు దత్తు (అల్లరి) పెట్టాడు. ఈనాడు వ్యవహారంలో ఈ సామెతకు 'పీలైనంతగా లాభపడి పైపెచ్చు అల్లరి చేసేవాడ'ని అర్థం స్థిర పడింది.

జంగాల మీద వచ్చిన మరికొన్ని సామెతలు.

1. అమ్మోడుగాడు అయ్యోడుగాడు జంగాన్ని పట్టుకొని జాముసేపు ఏడ్చినట్లు

2. గుఱుపూరు జంగాలు అమ్మకు ఇల్లు కట్టినట్లు

3. కొండూరు జంగాలు తరువాయి సన్నాసులు.

నిమ్న జాతుల్లో ఆచారాలు, విశ్వాసాలు ప్రబలంగా ఉండి తరతరాలుగా ఆచరింపబడుతూ కొనసాగుతాయి. శిష్ట సమాజంలో వచ్చినంత వేగంగా మార్పు ఈ జాతుల్లో రాదు. అందువల్ల వీళ్ళలో కులకట్టుబాట్లు ఎక్కువ. బుడిగె జంగాలకు కూడ కులకట్టుబాట్లు ఎక్కువే. కుల ప్రాముఖ్యాన్ని చాటిచెప్పే సామెతలెన్నో వీళ్ళ వ్యవహారంలో ఉన్నాయి.

ఏ పక్షిని చూసినా స్వజాతి పక్షులతోనే తిరుగుతుంది. విజాతి పక్షులతో అది మనలేదు. వనచరమైన కోతికి వనమే ఆధారం. వనం విడిస్తే జీవనం గడువదు. అలాగే తన కులాన్ని వదిలిపోతే మనిషికి మనుగడ లేదనే అర్థంలో 'కులమిడిచిన పక్షిలేదు వనమిడిచిన కోతిలేదు' అనే సామెత పుట్టింది. అనంత గంభీరమైన సముద్రం కంటే కూడా కులమే లోతైనదని 'కులం కుత్కెలమంటి సముద్రం మోకాల్లమంటి' అని సామెతను పుట్టించారు.

ఎలుక చస్తే పిల్లిపాలవుతుంది. అలాగే కులస్థునికి కష్టాల్లో, సుఖాల్లో కులమే గతి అవుతుందనే అర్థంలో 'కులస్థునికి కులమే గతి - ఎల్కజస్తే పిల్లి గతి' అనే సామెత ప్రచారంలోకి వచ్చింది. కులాన్ని ధిక్కరించి పోయినట్లైతే 'కులం కన్ను గద్ద కన్ను' అనే హెచ్చరికగా ఒక సామెత పుట్టుకొచ్చింది. గద్ద ఆకాశంలో ఉండి భూమ్మీద వస్తువుల్ని కనిపెట్టగలదు. నిశితమైన చూపు దానిది. అలాగే కుల కట్టుబాట్లను నిర్లక్ష్యంచేసి తిరిగేవాణ్ణి కులస్థులంతా గమనిస్తూనే ఉండి, అవకాశం దొరికినప్పుడు వాణ్ణి శిక్షించకమానరు అనే భావం ఈ సామెతలో సాక్షాత్కరిస్తుంది. ఇలాంటి సందర్భంలోనే 'కులానికి కులం చేటు - నీటికి నాచుచేటు' అనే సామెత కనిపిస్తుంది.

ఎరుకల, యానాది, చెంచు, మొదలైన కులాలవాళ్ళ జీవనవిధానం కూడ బుడిగె జంగాల జీవన సరళినే పోలి ఉంటుంది. సంచారజీవనంతో వీళ్ళంతా కలిసిమెలిసి జీవిస్తుంటారు. ఈ కులాలు పరస్పరం స్నేహభావంతో ఉంటాయి. ఏ కులంలో తగాదా వచ్చినా ఇతర కులాలవాళ్ళు కూడ పంచాయతీలో పాల్గొంటూ ఉంటారు. ఈ అంతస్సూత్రాన్ని తెలియజేస్తూ ఒక సామెత పుట్టింది. ''కూసుంటే కులం-లేస్తే పర్దేసి.'' ఈ కులాలవాళ్ళు ఒక దగ్గర కూర్చొని మాట్లాడుతున్నప్పుడు అందరికీ సమానమైన విలువనే ఉంటుంది. తీర్మానం తర్వాత లేదా మాట్లాడుకోవటం తర్వాత లేచి, ఎవరి దారిన వారు వెళుతు

న్నప్పుడు మాత్రం పర్దేసి అవుతాడు. పర్దేసి అంటే ఇతర సోదర సంచార కులం వాడు.

ఇతర కులాల వాళ్ళకు సంబంధించిన కొన్ని సామెతలు వీళ్ళల్లో వినిపిస్తాయి.

1. ఎర్కుండి ఎర్కలదాన్ని అడిగినట్లు
2. కుయ్యన్న బర్కన్న కుర్మ మల్లన్న
3. పిచ్చగుంట్లోడు పాట పాడితే దయ్యం పొయ్యి బాయిల పడ్డదంట
4. పిత్తబల్సిన మాదిగోడు పింగుమీద దప్పుకొట్టినట్లు

ii. **వృత్తులు :** బుడ్గ జంగాలు జంగం కథలు చెప్పటంతోపాటు అనేక వృత్తులు అవలంబిస్తారు. వాటిలో వీధి భాగోతాలు, పగటివేషాలు, తోలుబొమ్మలాటలు మొదలైన వృత్తుల ఆధారంగా కొన్ని సామెతలు వ్యవహారంలోకి వచ్చాయి.

**వీధి భాగోతాలు :**

1. రెడ్డొచ్చె మొదలుపెట్టు: వీధి భాగవతంకాని, బొమ్మలాటగాని ప్రదర్శిస్తున్నప్పుడు ఆ ఊళ్లో ప్రముఖుడైన రెడ్డి వచ్చిందాకా ఆగి, వచ్చాకా మొదలుపెట్టటం ఆనవాయితీ. ఆ సందర్భంలో పుట్టిన ఈ సామెత 'అంతవరకు చెప్పిన విషయమే మరొకరికి మళ్ళీ మొదట్నుంచి చెప్పాలన్నప్పుడు' ప్రయోగిస్తారు.

2. ఆడలేక మద్దెలఓడు: ఈ సామెత తన అసమర్థతను కప్పిపుచ్చుకోవటానికి. వైఫల్యాన్ని ఇతరులకు ఆపాదించే సందర్భంలో వ్యవహరింపబడుతున్నది.

3. బరువు ఓర్చుకుంటే బాగోతం బాగుంటది

4. ఒక్కనాటి బాగోతానికి మూతి మీసాలు గొరుక్కున్నట్లు

5. ఆడండోయ్ బాగోతులు చూడండోయ్ ప్రజలారా అన్నట్లు

6. చమురు దండగ బాగోతం

7. పైకం భాగవతం వారికి; తిట్లు చాకలి, మంగలి వారికి

ఈ సామెత కూచిపూడి భాగవతులు ప్రదర్శనలు ఇస్తున్న కాలంలో పుట్టిందని చెప్పవచ్చు. భాగవత ప్రదర్శన ఏర్పాటుకు కావలసిన పనులన్నీ ఆనాడు చాకలి, మంగలివారు చేసేవారు.

**తోలుబొమ్మలాట :** శిష్టకళా ప్రక్రియగా చెలామణి అవుతున్న 'హరికథ' కంటే కూడ తోలుబొమ్మలాట ప్రాశస్త్యాన్ని ఈ కింది సామెత తెలియజేస్తున్నది. ''అరవై ఆమడలుబోయి హరికథ వినాలె-తొంభై ఆమడలుబోయి తోలు బొమ్మలాట చూడాలె.''

తోలుబొమ్మలాటకు సంబంధించిన మరికొన్ని సామెతలు.

1. బోడి ఊళ్ళో బొమ్మలాట

2. తిరిగి తిరిగి దిమ్మ దిరిగి బొమ్మలాట చూసి ఇంటికి జేరె

**పగటి వేషాలు :** 'ఉదర నిమిత్తం బహుకృత వేషం' అన్నట్లు 'ఏ వేష మేస్తేనేం గాస మొస్తుంది కద' అని కూడ ఒక సామెత పుట్టింది. భ గోతాల్లో గాని, పగటివేషాల్లోగాని పెద్ద వేషంవేసేవారికి గౌరవం ఉంటుంది. ఆ అవకాశం మేళం పెద్దకేగాని ఇతరులకు రాదు. 'వేషం ఉంటేనేగాని గాసం' అని మరో సామెత. అలాంటప్పుడు పెద్ద వేషం వేయాలని ఉబలాటపడే ఉత్సాహవంతుడు అన్నమాటే సామెతగా రూపుదిద్దుకున్నది. నేడు 'పొట్ట పోసుకోవటానికి ఏ పని చేసినా తప్పులేదు' అనే అర్థంలో వ్యవస్థితమైంది.

కళా ప్రదర్శన చూసి 'రేపు రా - మాపు రా' అని తిప్పించుకునేవాళ్ళ వల్ల 'రేపు రా రేగ్గాయిస్త - మాపురా మారేడుకాయిస్త' అనే సామెత రూపు దాల్చింది.

ప్రత్యేకమైన వృత్తులకు కాకుండా సామాన్యంగా అన్ని వృత్తులకు అన్వయించే సామెతలు కూడ కొన్ని ప్రచారంలో ఉన్నాయి.

1. అడుక్కుతినేవాళ్ళకు అరవై ఊళ్ళు

2. బుక్కెడు మెతుకులకోసం భూముల్దెగవాయ్యినట్లు

3. నెత్తికాలందే జోలె నిండదు.

**భిక్షాటనకు వెళ్ళి పెట్టనివాళ్ళను తిట్టుకోవటం కూడ తరచుగా వింటూం టాం.** 'పెట్టనమ్మ పెట్టనేలేదు-పెట్టే ముండకేమొచ్చింది' అని విసుక్కుంటుం

టారు. దీనికి తగినట్లుగా ఒక్కొక్కప్పుడు వీళ్ళు ఎన్నిపాటలు పాడినా భిక్షం పెట్టకపోగా పైపెచ్చు 'నీవు పాడిందానికి నేను విన్నదానికి సరిపోయింది. తల ఊపినందుకు తాంబూరా పెట్టిపో' అనే సంఘటనలు కూడ జరుగుతుం టాయి.

వేట:- బుడ్గ జంగాలకు వేట ఆరోప్రాణం. ఏ వృత్తిచేస్తున్నా ప్రతిదినం వేటకు వెళ్ళటం తప్పదు. వేటకు సంబంధించిన జాతీయాలనేకం ఉన్నాయి. అలాగే కొన్ని సామెతలు కూడ ప్రచారంలో ఉన్నాయి.

'తాను తీసుకున్న గొయ్యిలో తానే పడ్డట్టు' అనే అర్థంలో 'ఉడుము తోకతోని ఉడుమే కట్టుబడ్డట్లు' అనే సామెత; చిన్నపనికోసం వృథా ప్రయాస ఎక్కువైందని చెప్పే అర్థంలో 'ఎండ్రకాయ కోసం ఏడు చెరువులు తెంపినట్లు' అనే సామెతల్ని చెప్పుకోవచ్చు.

'అది కరిచి చంపితే ఇది నాకి చంపుతుంది' అనే సామెత 'వెనుక గొయ్యి ముందు నుయ్యి' లాంటిది. ఇక్కడ రెండు వైపులనుంచి అపాయం సమీ పించింది. పైగా, ఒకదానికంటె ఒకటి ప్రాణాంతకమైనవి. వేటానుభవంనుంచే ఈ సామెత ఉద్భవించింది. నాగుపాము కరుస్తుందని, నూనె కట్లపాము నాకు తుందని చెబుతారు.

iii) కుల పంచాయతులు :- బుడిగె జంగాల జీవన విధానంలో పంచాయతులు అతి ప్రధానమైనవి. రోజూ తగాదాలే. ప్రతిరోజూ ఏదో ఒక పంచాయతీ, ఏదో తీర్మానం జరుగుతూనే ఉంటుంది. పంచాయతులకు సంబం ధించి అనేక సామెతలు పుట్టాయి.

'తనువుకు నూరేండ్లు తగువుకు వెయ్యేండ్లు' అనే సామెత ద్వారా బుడిగె జంగాల కులవ్యవస్థలో పంచాయతుల ప్రాబల్యం తెలుసుకోవచ్చు.

అంగబలం, అర్థబలం ఉన్నవాళ్ల గర్వాతిశయంతో 'కత్పకట్టనింకె సిద్ధమే - గుత్పపట్టనింకె సిద్ధమే' అంటూ రొమ్ము విరుచుకోవటం సహజం. 'కత్ప' అంటే ముచ్చిలిక. 'గుత్ప' అంటే కర్ర. ఈ సామెత 'దేనికైనా సిద్ధమే' అనే అర్థంలో స్థిరపడింది.

'చిలుమెదిలిస్తే చీకటి పొస్తది' అనేది మరో సామెత. చిలుము=డబ్బు. చీకటి=గర్వం, పొగరు. కులమంతా కలిసి పంచాయతీలో వాని డబ్బు ఖర్చుచేసి, జరిమానాలు విధిస్తే గర్వం అడుగంటి చెప్పినట్లు వింటాడని అభిప్రాయపడతారు.

తప్పు చేసినవాడు పంచాయతీలో కులం శిక్షలు అనుభవించి డబ్బంతా ఖర్చులకిందపోగా తలపట్టుకుంటాడు. ఆ సందర్భంలో 'చేసుకున్న పాపానికి ఏడ్చుకుంట పోరా' అనే సామెత పుట్టింది.

వీళ్ళలో వృత్తి న్యాయగాళ్ళకు తిరుగులేదు. వాళ్ళ కుతంత్రాలను చాటి చెప్పటానికి 'చెన్నంపల్లి పంచాయతీ చెరిసగం' అనే సామెత మంచి ఉదాహరణ. వాది ప్రతివాదుల్ని బాగా రెచ్చగొట్టి వేలకువేలు ఖర్చు చేయించారు. జేబులు నింపుకున్నారు. తీరా తీర్పునాడు 'చెరిసగం' తప్పు అని తీర్పు చెప్పి చెక్కేశారు. ఇలాంటి వాళ్ళను దృష్టిలో ఉంచుకునే 'తగుజెప్పు ధర్మరాజా అంటే దుడ్డెబర్రె నాదే అన్నాడంట.' అనే సామెత జనవ్యవహారంలో స్థిరపడింది.

సాక్ష్యం లేకుంటే పంచాయతీకి ప్రమాణమే ఆధారం. ప్రమాణం మీద పుట్టినకొన్ని సామెతలు.

1. ఇద్దట్ల ప్రమాణం - ముగ్గుట్ల సాక్ష్యం
2. పామునైనా పట్టవచ్చు - పచ్చనికొమ్మ పట్టరాదు.

సాక్ష్యం చెప్పేటప్పుడు కోర్టుల్లో మత గ్రంథాలమీద ప్రమాణం చేయిస్తారు. బుడిగె జంగాల పంచాయతీలో సాక్ష్యం చెప్పేటప్పుడు అబద్ధపు ప్రమాణం చేస్తే, ఆ పచ్చని కొమ్మ పాముకంటే అపాయకరమైనదని విశ్వసిస్తారు. వేపచెట్టును ఎల్లమ్మ దేవతగా పూజిస్తారు కాబట్టి, ఎల్లమ్మ దేవతమీద ప్రమాణం చేసినట్లుగా భావిస్తారు.

3. రశీదు తప్పితే మసీదు: అప్పు విషయంలో, ఒప్పందాల విషయంలో రాసుకున్న పత్రం పోయి, ఇద్దరి మధ్య పేచీవస్తే - గుళ్ళో ప్రమాణం చేసుకోక తప్పదని ఈ సామెతకు అర్థం.

వాదికో, ప్రతివాదికో వత్తాసు పలికేవాళ్ళకు హెచ్చరికగా 'నడుముకు కట్టుకోని నడిమికి రావాలె' అనే సామెత పుట్టింది. డబ్బు నడుముకు కట్టుకొని, వివాదం మధ్యలో కలుగజేసుకోవాలి లేదా పక్షపాతపు వైఖరి వీడనాడాలని ఈ సామెత హెచ్చరిస్తుంది.

చాడీలు చెప్పటంవల్ల, కుటర పన్నటంవల్ల పంచాయతీలో తమకు అన్యాయం జరిగిందని, కుల ఖర్చుల నిమిత్తం తన ఇల్లు గుల్లయిపోయిందని బాధపడేవారు తిట్టుకోవటమే–

"సాడి చెప్పినోనిల్లు సావిడి కొట్టం
పిత్య జెప్పినోనిల్లు పీర్లకొట్టం" - అనే సామెతగా పరిణమించింది.

''ఎంద్రకాయ కొండుకాడ ఏడునూర్లు పెట్టుకున్నట్లు''

'ఎల్కతొంటి కాడ ఏడునూర్లు పెట్టుకున్నట్లు' అనే సామెతలు గతంలో జరిగిన పంచాయతుల ఆధారంగా పుట్టినవి. వేటాడి తెచ్చుకున్న ఎలుకల్ని; ఎంద్రకాయల్ని పంచుకోవటంలో వచ్చిన తగాదాలే చిలికి చిలికి గాలివానై ఏడు నూర్లు రూపాయల ఖర్చయిన పంచాయతులుగా మారాయి. ఇకముందు ఇలా జరుగకూడదని హెచ్చరించటానికి గాను ఈ సామొతలు ప్రయోగింపబడతాయి.

**(vi) విశ్వాసాలు - ఆచారాలు - నీతులు ఆధారంగా పుట్టినవి :**

**విశ్వాసాలు**

1. ఆవగింజంత ఆవుసుంటె బీరగింజంత సైతాను పారిపోతదంట
2. దాచిపెడ్తే పాచి పోతది.
3. పదిమంది కూర్చున్న తాన పరమాత్ముడుంటడు

**ఆచారాలు :**

1. అతికిందాక గతుకాలె. వీళ్ళలో వరసేవా వివాహాలు ఉన్నాయి కాబట్టి భార్య అనుకూలవతి అయ్యేదాకా అత్తమామలకు సేవలు చేస్తూ ఉండాలి.
2. పిల్ల ఉన్న దగ్గరికి ముల్లె ఉన్న దగ్గరికి పదిమంది వస్తుంటారు.

**నీతులు :**

1. తలగొట్టేవానికి మూడు మనుములు
2. అడ్డతాకట్లకు బోతె చుక్కబొట్టు పెట్టుకోవాలె.

**అకారాదిక్రమంలో సామెతలు**

1. అంతపొడుగు ఇంతపొడుగు - చస్తే బొందపొడుగు
2. అంబలి మీద అట్టుగాడు - పాశంమీద పక్కుగాడు
3. అక్క తినెటోల్లకు అరవై ఊళ్ళు

4. అడ్డ తాకట్లకుపోతే - సుక్కబొట్టు[1] పెట్టుకోవాలె.
5. అతికిందాక గతుకాలె.
6. అది కరిచి చంపితే - ఇది నాకి చంపుతుంది.
7. అద్ర బుద్రం అల్లుడొచ్చిండు - తక్కెడ తేండమ్మ వొట్టలు జోకుదాం
8. అబొద్ధం అప్పటిది - నిజం ఎప్పటిది.
9 అమ్మోడుగాడు అయ్యోడుగాడు, జంగాన్ని పట్టుకొని జామునేపు ఏడ్చిందట.
10. అయ్య జూస్తె అంకారం - లెక్క జూస్తె ఇకారం
11. అయ్య దాసర్లకు పెడితే - అమ్మ జంగాలకు పెట్టింది
12. అరవై ఆమడలు పోయి హరికథ వినాలె; తొంభై ఆమడలు పోయి తోలు బొమ్మలాట చూడాలె.
13. అడండోయ్ భాగోతులు - చూడండోయ్ ప్రజలారా.
14. ఆడలేక మద్దెల వోడు అన్నట్లు
15. అవగింజంత అవుసుంటె - బీర గింజంత సైతాను పారిపోతదంట
16. ఆవులను మలిపినవాడె అర్జునుడు.
17. ఆశపడితేనే ఆడదాన అంటె - ముట్టైతిరా ముండకొడుకా అన్నదంట.
18. ఇంటిపిల్ల ఇగిలిస్తే - లంజపిల్ల గంజికేడ్సె.
19. ఇచిత్రం ఇస్తరెత్తుకపోతె - కాకొచ్చి డొప్పెత్తుకపాయె.
20. ఇద్దట్ల ప్రమాణం - ముగ్గుట్ల సాక్ష్యం.
21. ఇరుగు పొరుగు సముతుల్లార[2] - ఇల్లు కాపాడండి వాదులేక వల్లూరుకు పోతున్న.
22. ఇల్లు కాలింది జంగమయ్యా! అంటె నా జోలె కప్పెర నా వద్దనే ఉన్నవిలే అన్నాడంట
23. ఉడుముతోకతోని ఉడుమే కట్టుబడ్డట్టు
24. ఉదర నిమిత్తం బహుకృతవేషం
25. ఎంద్రకాయ కొండుకాడ ఏడునూర్లు పెట్టుకున్నట్లు.

---

1. రక్తంబొట్టు.
2. సవతుల్లారా!

26. ఎంగ్రకాయ కోసం ఏడు చెరువులు తెంపినట్లు.
27. ఎర్కుండి ఎరుకల దాన్ని అడిగినట్లు.
28. ఎలుకతోంటి కాడ ఏడునూర్లు పెట్టుకున్నట్లు.
29. ఏకజంగం శత మర్కటాః.
30. ఏతులకు ఏలేశ్వరం పోతే - పక్క తోలు కుక్క ఎత్తుకపోయినట్లు.
31. ఏమినాపున్యం లేదు[1] - ఇనవోయి రామిరెడ్డి.
32. ఏ వేషం వేస్తేనేం గానమొస్తుంది గద.
33. ఒక్కనాటి బాగోతానికి మూతి మీసాలు కొరుగుకున్నట్లు.
34. కంజి మెక్కె కారిగాడు - దత్తు పెట్టె దారిగాడు.[2]
35. కత్పకట్టనింకె సిద్ధమే - గుత్ప పట్టనింకె సిద్ధమే.[3]
36. కనుకున్నోంది కడుపు - కాసుకున్నోంది అంబలి.
37. కబలమంటె నోరుదెరుస్తడు - కల్లెమంటె ఎన్కకుపోతడు.
38. కానకు గతిలేదు - ఎల్లికి బులావ్.
39. కుక్క మొరిగితే జంగం పరపతి పోతుందా?
40. కుక్కెంత తిన్నది - కుండలెంత ఉన్నది?
41. కుయ్యన్న బర్కన్న - కుర్మ మల్లన్న.
42. కులం కన్ను గద్దకన్ను.
43. కులం కుక్కల మంటి - సముద్రం మోకాల్లమంటి.
44. కులమిడిచిన పక్షిలేదు - వనమిడిచిన కోతిలేదు.
45. కులమొస్తే కులమే గతి - ఎలుక జస్తే పిల్లిగతి.
46. కులానికి కులం చేటు - నీటికి నాచు చేటు.
47. కూసుంటే కులం - లేస్తె పర్దేసి.[4]
48. కొండూరు జంగాలు తరువాయి సన్నాసులు.
49. కొత్తగ సిగమొస్తే - గోడలు పట్టుకొని ఊగులాడినట్లు.
50. కౌసుకన్న[5] తల్లి - మెతుకుమేనత్త.
51. కౌసుకాద జూడురా - నీసుగాని[6] గుణము.
52. గుడ్డి కొంగకు పెత్తనమిస్తే - ఎగిరెగిరి పెద్ద కొంగల పొడిచె.

---

1. ఏం లాభం లేదు. 2.3. వెనక పుటల్లో వివరించబడ్డాయి.
4. ఇతర సంచార తెగవాడు 5. మాంసాహారం. 6. నీచు.

53. గుబుపూరు జంగాలు అమ్మకు ఇల్లు కట్టినట్లు.
54. గళ్లో పోశమ్మ గుగ్గిళ్ళకేడిస్తే - బైండ్లోడు భక్షాల కేడ్చె.
55. గూబకు పెత్తనమిస్తే . ఊళ్ళ ఉన్న ఊరవిస్కెల[1] తిన్నట్లు.
56. చంక జోలె తూటుపడలేదు - ముందలూరు పాడుపడలేదు.
57. చచ్చిన పిల్లను చంకలేసుకొని - బతికిన పిల్లను బాయిలేసినట్లు.
58. చమురు దండుగ బాగోతం.
59. చాడి చెప్పినోనిల్లు చావడి కొట్టం - పిత్వ చెప్పినోనిల్లు పీర్ల కొట్టం.
60. చిలుమొదిలిస్తే - చీకటి వాస్తది.
61. చెన్నంపల్లి పంచాయతి - చెరిసగం.
62. చేపలకు బాపనోల్లకు పొంతనగాదు.
63. చేసుకున్న కర్మానికి - ఏడ్చుకుంట పోరా
64. ఛీ! అంటె చిత్తాపురం కుక్కపోయి బాయిల వడ్డదంట.
65. జంగమైన వెనుక జాతి నెంచగరాదు.
66. జంగాలపాలు దేవాంగుల విత్తము.
67. జగడమెట్ల వస్తది జంగమయ్య అంటే - బిచ్చం పెట్టవే బొచ్చుముండ అన్నట్లు.
68. జాతికొంచం కొంక నక్క - తెచ్చెరా ముర్దారు బొక్క.
69. జాతి పెద్దవాడు జంగం.
70. దర్రు బుర్రు డాల్ కత్తి - గుద్దలొక్క సూర్ కత్తి.
71. తగువు జెప్పు ధర్మరాజా! అంటే - దుద్దె బర్రె నాదే అన్నదంట.
72. తనువుకు నూరేండ్లు - తగువుకు వెయ్యేండ్లు.
73. తలగొట్టేవానికి మూడు మనుములు.
74. తిననేరని పిల్ల తీర్థం బాయె - వొడుకనేరని పిల్ల అంగడివాయె.
75. తియ్యబోయి కయ్యలబడ్డట్లు.
76. తిరిగి తిరిగి దిమ్మ దిరిగి - బొమ్మలాట చూసి చేరెరా కొంప.
77. తువ్వర్ల పసేగాని - మంత్రాల పస లేదు.
78. దాచి పెడ్తె - పాచిపోతది.
79. దా పెట్టి దా పెట్టి - దయ్యాల పాల్ జేసినట్లు.
80 దసర్లా? జంగాలా? అంటె ముందూరునుబట్టి అన్నట్లు.
81. నడుముకు కట్టుకొని నడిమికి రావలె.

---

1. ఊర పిచ్చుక.

82. నాజూకు కోమటోళ్ల పిల్ల - తొమ్మిది రొట్టెలు దినె
83. నిజం నిజమే - అబొద్దం అబొద్దమే.
84. నీయతెంతొ - బర్కతంత.
85. నీళ్ల పోసుకున్న మొగుడా అని నిచ్చె ఖర్చు పెట్టిస్త్రివి.
కడుపేది పెండ్లామా అంటె - కందిపప్పు దిని కరిగిపోయింది మొగుడా అన్నదంట.
86 నీవు పాడిందానికి నేను విన్నదానికి సరిపోయింది.
తల ఊపిందానికి తాంబూర పెట్టిపో అన్నట్లు.
87. నెత్తి కాలందే జోలె నిండదు.
88. నేనమ్మ సంసారిని గానా - జెర్ర దీప సమురు కన్న దేనా.
89. పది మంది కూసున్న తాన - పరమాత్ముడుంటడు.
90. పాడు మొకానికి ఏడు బాసింగాలు.
91. పామునైనా పట్టవచ్చు - పచ్చటి కొమ్మను పట్టరాదు.
92. పిచ్చకుంట్లోడు పాట పాడితే - దెయ్యం బొయ్యి బాయిల పడ్డదంట.
93. పిత్త బలిసి విత్తనాల కుండ ఎత్తేసినట్లు.
94. పిలిచి పిల్లనిస్తే అల్లుడు అలిగలిగి పోయిండంట.
95. పిల్ల ఉన్న దగ్గరికి ముల్లె ఉన్న దగ్గరికి పది మంది వస్తుంటరు.
96. పిల్ల పుట్టకతోలె - కుల్ల కుట్టి పెట్టినట్లు.
97. పెట్టనమ్మ పెట్టనేలేదు - పెట్టేముండకే మొచ్చింది రోగం అన్నట్లు.
98. పైకం భాగవతం వారికి - తిట్లు చాకలి మంగలి వారికి.
99. పొంకాల పోతిరెడ్డికి ముప్పయి మూడు దొడ్లు మూడు ఎడ్లు.
100. పోయిన కుందేలు చాలా పెద్దది.
101. పోశమ్మ కూడబెడ్తె - మైసమ్మ మాయం జేసినట్లు.
102. బట్టలేనిరూపు బాంచ రూపు - కూడులేని రూపు కోతి రూపు.
103. బతకని పిల్ల పాసు పాసు.
104. బరువు కోర్చుకుంటె - భాగోతం బాగుంటది
105. బాగాయెర బసివిరెడ్డి - మన పసుల దొడ్డి
106. బుక్కెడు మెతుకుల కొరకుభూముల్దెగపోయినట్లు
107. బుడ్డోని బెదిరించి-బుర్రకాయ ఎత్కపోయినట్లు
108. బుర్రిగాడు బెదిరిచ్చి-బుర్రకాయ ఎత్కపోయె

109. బోడి ఊళ్ళో బొమ్మలాట
110. మంది సొమ్ము పెట్టుకొని-మొగని కాళ్ళు మొక్కినట్లు
111. మొదటికే మోక్షం లేదు-కొడుకు పేరు గోవిందు
112. రసీదు తప్పితే మసీదు
113 రేపురా రేగ్గాయిస్త-మాపురా మారెడుకాయిస్త
114. రెడ్డొచ్చె మొదటి నుంచి పాడుమన్నట్లు
115. లంజమాటలకు-గంజొలుకపోసుకున్నట్లు
116. వగలకోడి గుమ్మెడుకొర్రలు బుక్కిందంట
117. వగలపిల్ల మొగని పట్టుకొని ఏడ్చె
118. వద్ద వగలేదు లంజను జూస్తె దుఃఖమొచ్చె
119. వస్తిరా నీ ఆశ జెప్పక-చస్తిరా నీ నోటి గబ్బుకు సాలెపెద్దిగా
120. వేషం ఉంటేనే గాసం
121. సాయి సంసారి-లచ్చి దుడుక
122. ఢెంగెట్టోన్కి-దేవుడు వరమిస్తడు.

## 4. పొడుపు కథలు

పొడుపు జానపదుల మనోవికాసానికి పొద్దు పొడుపు. పొడుపు కథలు అర్థాన్వేషణమనే కడలి కడుపు నుంచి వెలికి తీసే అనర్ఘరత్నాలు. అపార్థాల తెరల్లో నుంచి సత్యం వైపుకు దూసుకువేళ్ళే ఆలోచనాలోచనాల్ని తెరిపించి, జానపదుని జ్ఞానపదుని చేస్తాయి పొడుపు కథలు. గవేషణకు మార్గాలు వేసి, వివేచనకు స్ఫూర్తి నిచ్చి అద్భుతానందాల్ని చిందిస్తాయి. వినోద విజ్ఞానాల్ని అందిస్తాయి. విసుగును పారదోలి మనసుకు విశ్రాంతిని కలిగిస్తాయి. ఇష్టాన్ని పెంచి, కాయ కష్టాన్ని మరిపిస్తాయి. ధారణాశక్తిని ధారపోస్తాయి. అనల్ప కల్పనాచాతురిని కలిగిస్తాయి. భావాల్ని సైతం సారూప్య ప్రపంచంలో నిలిపి, సుస్వరూప సౌందర్యాల్ని సందర్శింపజేసే ఆలంకారిక దృక్పథాన్ని జానపదునికి సంప్రదానం చేస్తాయి. తన చుట్టూరా ఉన్న వస్తుమయ ప్రపంచాన్ని, ప్రకృతిని, జీవిత వైవిధ్యాన్ని గుప్తంగా, సంక్షిప్తంగా చూపించే దర్పణాలుగా పొడుపు కథల్ని చెప్పుకోవచ్చు. కొన్ని పొడుపుల్లో హాస్యం శృతి మించి, అశ్లీలం కనిపిస్తుంది. ఆ అశ్లీలాన్ని విశ్లేషిస్తే వ్యంగ్యవైభవం విరుస్తుంది. జీవన భాష్యం

మెరుస్తుంది. కర్త ఎవరో తెలియని పొడుపుకథ వ్యవహర్తల నోళ్ళల్లో జీవిస్తుంది. పొడుపుకథ విస్తృతి, వైవిధ్యం కలిగి విశిష్టమైన, విలక్షణమైన ఒక సాహితీ ప్రక్రియగా సంభావింపబడుతున్నది.

తెలుగులో పొడుపు కథకు తట్టు, శాస్త్రం, విడుపు, మారుకథ, సమస్య, సమిచ్చ, చిటుక, చిక్కుముడి, అడ్డుకథ, ఒడ్డుకథ ఇత్యాది పేర్లు ప్రచారంలో ఉన్నాయి. పొడుపు కథ సంస్కృతంలో ప్రహేళిక, ఆంగ్లంలో రిడిల్, హిందీలో పహేలి లేక చుట్కులు, ఉర్దూలో లతీఫా, తమిళంలో విడుకతై, మలయాళంలో విడికద, కన్నడంలో ఒగటిన కదె లేక ఒగటు గళు అనే పేర్లతో వ్యవహరింపబడుతున్నది.

సంస్కృత ఆలంకారికులు, పాశ్చాత్య పండితులు, తెలుగు పరిశోధకులు చెప్పిన లక్షణాలను క్రోడీకరించి, పరిపూర్ణించి, డా. కసిరెడ్డి వెంకటరెడ్డి గారు పొడుపు కథ అష్టాదశ లక్షణ సంశోభితమని నిర్వచించారు. స్వరూపాన్ని బట్టి 15 విభాగాలుగా, స్వభావాన్ని బట్టి 8 విధాలుగా వర్గీకరించారు. అనేక కోణాల నుంచి అనుశీలించారు.[1]

బుడిగె జంగాల్లో పొడుపు కథలు అతివేలంగా ప్రచారంలో ఉన్నాయి. ఇంతవరకు పరిశోధకులు సేకరించిన పొడుపు కథల్లో అధికభాగం బుడిగె జంగాలు చెప్పినవే. కులేతరులైన ఊరి ప్రజల వ్యవహారంలో ఉన్నవి కూడ వీరికి తెలియనివి కావు. అందువల్ల ఇకముందు ఉదాహరించే పొడుపు కథల్లో అక్కడక్కడ గ్రామీణుల వ్యవహారంలోనివికూడా కనిపిస్తాయి. అలంకార ఛందో రీతులు స్పృశించేటప్పుడు కొన్ని ముద్రితమైన పొడుపులు కూడ ఉదాహరించటం జరుగుతున్నది.

### బుడిగె జంగాల పొడుపు కథలు

వేద పురాణాది విశిష్ట రచనలు ఋషిప్రోక్తాలుగా కాలంతోపాటు సమాజంలో జీవించాయి. అలాగే జానపద సాహితీ రీతులు మౌఖిక రూపంలో తర

---

1. తెలుగు పొడుపు కథలు - పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం.

తరాలుగా జానపదుల నాల్కల మీద నాట్యం చేస్తూ వస్తున్నాయి. బుడిగె జంగాలు అనేక జానపద కళలను ప్రదర్శిస్తారు. అభినయ విధానం వీళ్ళకు కరతలామలకం. లయ జ్ఞానం వీళ్ళకు కొట్టిన పిండి. కల్పనాచమత్కారం ప్రదర్శనలోని కథాకథనం ద్వారా అబ్బిన విద్య. అందువల్ల ఇంతకుముందే ఒక చట్రంలో ఉన్న రచనకు ప్రభావితులై, జీవితానుభవాలకు, కాల్పనిక భావాలకు శబ్దాలు పొదిగి - ఆ నమూనాలో క్వాచిత్కంగా రచన చేయటం పరిపాటి. అలా ప్రాదుర్భవించిన పొడుపు కథలు కొన్నింటిని ఇక్కడ ప్రస్తావిస్తాను.

1. అలేటి సంజన్న బిడ్డ
అంశమంతురాలు
నోటితోని జోగల పొడ్తది
అరికాల్తోని సన్ని స్తది (కోడి పెట్ట)

కోడి తన పిల్లల్ని వెంట తిప్పుతూ మేత తిననేర్పుతుంది. పెంట కుప్పల్ని అరికాలితో చెదురుతూ, పిల్లల్ని పిలుస్తూ ముక్కుతో గింజల్ని చూపిస్తుంది. మొదటి రెండు పాదాలు అపార్థ ద్యోతకానికి వాడినవి. 'అలేటి'[1] అనే ఇంటి పేరు గలిగిన 'సంజన్న' అనే వ్యక్తి కూతురు అదృష్టవంతురాలు (అంశమంతురాలు) అని కోడిపెట్టకు ఉపమానంగా చెప్పబడింది. 'జోల' పదమే 'జోగల' అయ్యింది.

2. ఇంటికి ముగ్గురు మూర్తులు (మూడు వంకర్లు)

బుడిగె జంగాల ఇళ్ళు అర్ధ చంద్రాకారంలో ఉన్న ఈత చాప గుడిసెలు. ఊడుగుచెట్టు (అంకోల వృక్షం) నుంచి పొడుగాటి కర్రలు కొట్టి తెచ్చి, రెంటిని ఎదురెదురుగా పెట్టి అర్ధచంద్రాకారంలో వంచి, తాళ్ళతో కడతారు. దాన్నే 'వంకర' అంటారు. ఇలాంటి మూడు వంకర కట్టెలు వరుసగా పాతి, వాటిమీద ఈతచాపలు కప్పి, గుడిసె నిర్మించుకుంటారు. లోకానికి త్రిమూర్తులు ఎలాంటి వారో వాళ్ళ గుడిసెకు ఆ మూడు వంకర్లు అలాంటివి. ముగ్గురు మూర్తులు

---

1. బుడిగె జంగాల ఇంటి పేర్లలో 'అలేటి' ఒకట్టి.

అనగానే బ్రహ్మ విష్ణు మహేశ్వరులని అపార్థ స్ఫురణ కలుగుతుంది. మూడు వంకర్ల కథను గుప్త పరచిన పొడుపు కథ ఇది [1]

3. ఇంటికొక్క రాజు (కావడి దబ్బ)

'బద్ద' పదమే వ్యత్యస్తమై 'దబ్బ' అయ్యింది. బుడిగె జంగాల సంచార జీవనంలో కావడి బద్దకు మిక్కిలి ప్రాముఖ్యం ఉంది. ఇంటి కర్రలు, చాపలు, కుండ, చేట, బుట్టి, బుర్రకాయ అన్నీ మూటగట్టుకొని, కావడి పెట్టుకొని మరో ఊరికి కదలిపోతారు. ఇంటి నిర్మాణంలో ఉపయోగించే అన్ని కర్రల్లోకి ఇది మేటి. రాజులాంటిది. ఇంటికొక్కరాజు అనగానే ఇంటి యజమాని అనే భావం కలుగుతుంది.

4. చెట్టుమీద జానకాడు (ఉడత)

'జాణ' పదమే 'జాన' అయ్యింది. (జాణతనం > జానతనం) చెట్టుమీద ఉన్న ఉడుతను పట్టటానికి ఒకవైపు వల పన్నుతారు. మరోవైపు మనుమ లుంటారు. ఉడత దిగటానికి చెట్టుమీదికి రాళ్ళను విసురుతారు. చెట్టుమీది ఉడత నాల్గువైపుల పరికించి కొన్నిసార్లు తప్పించుకోగలుగుతుంది. అప్పుడు ఉసూరు మంటూ 'ఎంత జాణరా ఈ ఉడత' అని అనుకుంటారు. ఉడతలు పట్టటంలోని అనుభవమే ఈ పొడుపుకు కారణమైంది.

5. సరసర కత్తులు
సన్నపు కత్తులు
లంజెల వలపులు
గంధపు చెక్కలు (ఈతచాప)

బుడిగె జంగాల జీవనోపాధిలో చాపలల్లటం ప్రధానమైంది. చాపలల్ల టానికి పొడుగాటి ఆకులున్న ఈతరెబ్బల్ని చూసి చూసి మరీ కోసి, తెస్తారు. మంచి కమ్మతో అల్లుతున్నప్పుడు మురుస్తూ అల్లుతారు. ఉత్సాహంతో అల్లు తారు. సర సర (త్వరత్వరగా) అల్లుతారు. అల్లుతున్నప్పుడు కమ్మ చివరన

1. 'వస్తు సంస్కృతి' ప్రకరణంలో వీరి ఇంటి నిర్మాణం సమగ్రంగా వివరించబడింది.

ఉన్న ముళ్ళు సుతారంగా గుచ్చుకుంటాయి. పట్టెగా తయారయ్యాక ముచ్చట గొలుపుతుంది. చాపగా కూరుస్తున్నప్పుడు కొత్త పట్టెలు పెళపెళలాడు తుంటాయి- గంధపు చెక్కల్లాగా అందగిస్తాయి. ఈతకమ్మకు వీళ్ళకు ఉన్న అవినాభావ సంబంధమే ఈ పొడుపు కథ జన్మకు మూలహేతువు. ఈతకమ్మకు అన్వయించుకున్న మరో పొడుపు కథ: అడవిలో పుట్టె - అడవిలో పెరిగె - మాయింటికొచ్చి తైతక్కలాడె (ఈతకమ్మ).

6. పోత ఐదు
వస్త పదిహేను (ఎండ్రకాయ).

వాగులోని ఎండ్రకాయ గవిలో చెయ్యివేసి, పట్టి, దాన్ని బయటకు తీస్తారు. గవి లోపలికి చెయ్యి వేసినప్పుడు ఐదు వేళ్ళు, బయటకు తీసినపుడు ఎండ్రకాయకున్న పదివేళ్ళతో కలిసి పదిహేను వేళ్ళు.

**మరికొన్ని పొడుపు కథలు :**

7. ఇంటికో పెద్దమనిషి (గుంజిప్ప. గుండ్రని చిప్ప. కారం నూరుకోవటానికి కుమ్మరి ప్రత్యేకంగా తయారుచేస్తాడు. ఇంటి పెద్ద (కర్త) అందులో తింటాడు).
8. ఉస్కెలో ఉంది బిస్కి పోతది (ఉసిక దొంతు అనే చేప).
9. భూమిలో మాయ కల్పతోక (ఎలుక).
10. ఏనిగంత గుండుమీద ఎండ్రకాయ అర్సె (మోట గిలక).
11. మూడు ముంగిసలు, ఒక దెంగిస (మూడు పొయ్యిరాళ్ళు ఒక బువ్వ కుండ).
12. బాయిల బంగారు బిల్ల (తాబేలు).
13. కొడ్తె కూసును, కొట్టకపోతె మూసును (నీళ్ళమీద నాచు).

బుడిగె జంగాల వ్యవహారంలో ఉన్న పొడుపు కథలను విషయాన్ని బట్టి మూడు విధాలుగా వర్గీకరించవచ్చు.

(i) గృహ జీవనం (ii) ప్రకృతి సంబంధాలు (iii) ప్రాణి సంబంధాలు.

(i) **గృహజీవనం :-** గృహజీవనానికి సంబంధించిన పొడుపులలో (ఎ) వస్తు సంచయం (బి) ఆభరణాలు (సి) వాయిద్యాలు చేరుతాయి.

(ఎ) వస్తు సంచయం :- ఈ పొడుపుకథల్లో గృహ సంబంధమైన వస్తువుల ప్రస్తావన కనిపిస్తున్నది. ఇంటిగోడకు సున్నం, జాదుపట్టి, తలుపు, మంచం, దిండు, అగ్గిపెట్టె, దీపం, చేట, విసుర్రాయి, మంట, పెనం, రొట్టెలు, నిప్పు, ఉప్పు, పసుపు, అద్దం, పార, గొడ్డలి, గడ్డపార, కొడవలి, తుపాకి, ఈర్వ్యాన మొదలైన వస్తువులు ఈ పొడుపుల్లో చోటు చేసుకున్నాయి.

ఉదా॥ 1. పది బర్రెలెముకలు, ఒక ఎన్నుపూస, మూడు ముడ్డిపూసలు, ఐదు తోక బద్దెలు (బుడిగె జంగాల చాపల గుడిసె)

2. గుట్టగూలుతుంటె గంగెద్దు ఆనబట్టు (బువ్వకుండ, సిబ్బి)

3. అంగడి వోదురు అన్ని దెత్తురు ఒక్కటి దేరు (నిప్పు)

4. నల్లెద్దు పండె - ఎర్రెద్దు లేసె (బూడిద, మంట)

5. దగిడి దత్తం ఎన్క సండ్లు (చేట)

6. పండుకొని లేతురు - కదుకోని సూతురు (అద్దం)

7. మార్ మారవ్వ - గుద్దదేకప్ప (సల్కెపార)

8. చక్కటి చెట్టుకు చెక్కల్లేవు (గడ్డపార)

(బి) ఆభరణాలు :- తాము ధరించే ఆభరణాల స్థితిని బట్టి, వర్ణనను బట్టి పొడుపుల్లో వాటిని బంధించారు. ముక్కుపుడక, హంసనత్తు, పుస్తె, ఒడ్డాణం, సందెటొంకు, గాజులు మొదలైన ఆభరణాలను పేర్కొన్నారు.

1. బాయినిండ బల్లిగుడ్లు (హంసనత్తు)

2. గవానిలో గడ్డపార (ముక్కుపుడక)

3. తూముల తుమ్మ మొద్దిరికె (ముక్కుపుడక)

4. దాలి గుంతల దగ దగ (పుస్తె)

5. చిక్ చిక్ తాళం - చీకటోళ్ళ తాళం
బయటకు ఎత్తే - బైరూపుల బాధ (గెంటీలు)

6. వొత్తిత్తి పెట్టంగ - వన్నెలు గులుకంగ
సాల్ సాల్ అనంగ - సంతోషపడంగ - ఈ పొడుపులో రంగుల గాజుల మిల మిలలు, చేతినొప్పి, మనసులో నిండిన సంతోషం, సంతృప్తి వర్ణించబడ్డాయి.

(సి) వాద్యాలు : బుడిగె జంగాల వాయిద్యాలలో తాంబూరా, డింకి, అందెలు, మద్దెల, హార్మోనియం, తాళం మొదలైనవి చెప్పుకోదగ్గవి. వీటికి సంబంధించిన పొడుపు కథలు వీళ్ళలో ప్రచారంలో ఉన్నాయి.

1. బక్క కుక్కకు బండెడు పేగులు (డింకి లేదా మద్దెల)
   గ్రామీణుల ప్రయోగంలో దీనికి 'మంచం' అని అర్థం చెప్పుకుంటారు.

2. లోపల గొంతులు
   మీదన దొంతులు
   రాగం దీస్తే
   రాజులు మెత్తురు (హార్మోనియం).

హార్మోనియం 'రీడ్‌లు' (నాలుకలు) లోపల ఉండగా వాటిని మూసి ఉంచే మెట్లు పైన ఉంటాయి. రీడ్‌లను గొంతులుగా, మెట్లను దొంతులుగా చెప్పటంలో రమణీయమైన కల్పనాపటిమ ప్రస్ఫుటమవుతున్నది.

3. గుండెకు ఒత్తుకో - బుజానికెత్తుకో
   అడ్డం పెట్టుకో - గడ్డం పట్టుకో
   గొంతెత్తి పాడ్తడు - గొంతుదాక పెడ్తడు (తాంబూరా)

బుడిగె జంగాలు కథలు చెప్పేటప్పుడు ఉపయోగించే ప్రధాన వాద్యం తాంబూరా. తాంబూరాను ఎడమ భుజం మీద పెట్టుకొని, దాని పైభాగాన్ని భుజానికి, మెడకు మధ్యన నొక్కి పట్టి, కుడిచేతితో తీగల్ని మీటుతుంటారు. ఎడమచేతి బొటన వేలికి కంచు అందెలు ఉంటాయి. కూర్చుని కథ చెబుతున్నప్పుడు తాంబూరాను అడ్డంగా ఒళ్లో పెట్టుకొని వాయిస్తుంటారు. 'గడ్డం పట్టుకో' అనటంలో 'దాని మీటు' అని. జాతీయంగా తీసుకుంటె బుజ్జగించు, బతిమాలు అనే అర్థాలున్నాయి. తాంబూరాను శ్రద్ధగా శ్రుతిచేసుకుని, మీటుతూ కథ చెప్పినట్లయితే, కథ రక్తి కడుతుంది. శ్రోతలు సంతోషించి, సంభావనలు ఇస్తారు. నీకు గొంతుదాకా తిండి దొరుకుతుంది అని పొడుపులోని అర్థం.

**మరికొన్ని పొడుపు కథలు :**

4. కడుపుల మూడే పేగులు
చెయ్యి తాకితే
కయ్యిమంటవి (తాంబూర తీగలు).

5. ఏలు సుట్టుకొని
తలలు గొట్టుకొని
ఆవి మొత్తుకుంటే
అందరికి ముద్దు (బొటనవేలుకు వేసుకునే రెండు అందెలు).

6. కంచు గొంతు
కంగుమనె (తాళాలు).

7. తట్టుకు మాత్రట్టేసి
తల గుబ్బలెగిరేసి
పేరైన గద్వాల
పెకపెకలాడె (తప్పెట-తాళాలు).

8. సముద్రంలో పుట్టి
సముద్రంలో పెరిగి
ఊళ్లోకొచ్చి అరిచేది (శంఖం).

(ii) **ప్రకృతి సంబంధాలు** : వీటిలో రెండు విభాగాలు చేయవచ్చు. (ఎ) ప్రకృతి దర్శనం (బి) వృక్షసంతతి.

(ఎ) ప్రకృతి దర్శనం : ప్రకృతిలో భాగమైన మానవుడు ప్రకృతిని చూస్తే పరవశించిపోతాడు. రంగురంగుల ప్రకృతి శోభామనోహరత్వానికి ముగ్ధుడైపోతాడు. శిఖరాలు, లోయలు, శాద్వలాలు, జలపాతాలు, జలధితరంగాలు, ఉషా సంధ్యలు, విశాల వినీలాకాశం, వెన్నెలవన్నెలు - సకల సృష్టిని విలోకించి, పులకించిపోతాడు మనిషి.

బుడిగె జంగాలు చెప్పుకునే పొడుపు కథల్లో ఆకాశం, చుక్కలు, చంద్రుడు, సూర్యుడు, వల్మీకం మొదలైనవి దర్శనమిస్తాయి.

1. అంతులేని చెట్టుకు అరవై కొమ్మలు,కొమ్మకొమ్మకు కోటిపూలు. పూలల్ల రెండేకాయలు (ఆకాశం, చుక్కలు, సూర్యచంద్రులు)
2. రంగడు పింగడు తొక్కితె అన్గడు (నీళ్ళు)
3. నూనె కుండకు నూటొక్క చిల్లి (పుట్ట).

(బి) వృక్ష సంతతి :- మానవునికీ వృక్ష సంతతికి ఎడలేని అనుబంధం ఉంది. మనిషికి, తిండి, బట్ట, ఇల్లు మొదలైన అవసరాలనుంచి మొదలుకొని ప్రాణవాయువు వరకు వృక్ష సంతతి వల్లనే లభిస్తుంది. వృక్ష సంతతి వినా మనిషికి మనుగడ లేదు. అందుకే మనిషి మాటలోనైనా, పాటలోనైనా వృక్ష సంతతిని ఉపమించిందాకా, ఉదాహరించిందాకా ఊరుకోడు.

బుడిగె జంగాల వ్యవహారంలో ఉన్న ఇలాంటి కొన్ని పొడుపు కథలకు ఉదాహరణలు.

1. అడవిలో పుట్టె - అడవిలో పెరిగె
   మా ఇంటి కొచ్చె - తైతక్కలాడె (ఈతకమ్మ)
2. నిలబడితే నీళ్ళు దాగదు - వొంగితె మ్యాత మేయదు
   పండితె నిద్రబోదు - నిత్తె బుడ్డెడు పాలిచ్చు (ఈత చెట్టు).
3. గజ్జి కుక్క అంగడి పోవును (వంకాయ)
4. తిక్కదాని సిగలు - రిక్క రిక్కలు (త్రైద (రాగి) కంకులు).
5. పట్నం బోతుంటె పసుపుబట్టలద్దమొచ్చె (తంగెడిపూలు)

వీటితోపాటు ఇంకా మామిడి, తాటి, కొబ్బరి, ఉల్లిగడ్డ, జీడిపండు, నువ్వు గింజ, మొక్కజొన్న కండె, శనగ మొక్క మొదలైనవి పొడువబడ్డాయి.

(III) ప్రాణి సంబంధ పొడుపు కథలు :- వీటిని రెండుగా విభాగించ వచ్చు (ఏ) మానవ సంబంధమైన పొడుపు కథలు (బి) తిర్యక్కులు క్రిమి కీటకాదుల పొడుపు కథలు.

(ఏ) మానవ సంబంధమైన పొడుపు కథలు :- ఇందులో వృత్తులు, శరీరావయవాలు మొదలైనవి చేరుతాయి.

**వృత్తులు :**

1. జానెడు మొదలు - పొదసందెడు
ఏ తీరు కాతగాయమంటె
ఆ తీరు కాత గాస్తది (కుమ్మరి చక్రం)
2. సంత దిరుగు తుంటె - గుంత పుట్టె
గుంతలో గుమ్మడి కాయపుట్టె (కుమ్మరి చక్రం)
3. గుట్టకిందికేలి - గూనోడు పాయె (చాకలి)

**శరీరావయవాలు :**

1. పలుగు రాళ్లల్ల - పంది పొర్లాడె (నాలుక)
2. ఒక సీసల మూడు రంగులు (కనుగుడ్డు)
3. గునగున్న ఉర్కేటోల్లెవరమ్మ
గుండెక్కి సూసెటోల్లెవరమ్మ
ఆకుల్ని దెంపెటోల్లెవరమ్మ
అర్థాల్ని చెప్పెటోల్లెవరమ్మ (కాళ్లు, కళ్లు, చేతులు, పెదవులు, నోరు)
4. లోతు బాయిల జోరు బెల్లం (చెవిలో గుబిలి)

(బి) **తిర్యక్కులు క్రిమి కీటకాదుల పొడుపు కథలు :** ఈ పొడుపు కథలో కుక్క, పులి, కుందేలు, గొర్రె, నెమలి, కోడి, కప్ప, పాము, తేలు, తేనె తెట్టె, కందిరీగ, పేను, చీరపేను, చెదలు, పిల్లి, ఎండ్రకాయ, మిడత, పిడుదులు మొదలైనవి కనిపిస్తాయి.

ఉదా॥

1. పదిమంది యాటకు[1]వోయి-ఒక జీవాన్ని[2]దెచ్చి పంచుకుంటె
ఒక్కొక్కనికి ఒక తొడరావాలె (ఎండ్రకాయ)
2. చిటుకు చిటుకులాడి - గోడ దుంకులాడి (పిల్లి)
3. వొంక చెట్టు బురాన్ సాబ్ (కుక్క)

---

1. వేట 2. జంతువు

4. గుద్దల బొచ్చు - దేవుడు మెచ్చు (నెమలి)
5. ఏటవతలికి పోయి ఏడుమంది మేస్త్రీలను దెస్తే
   నీళ్లలేందే గోడ పెట్టిరి (చెదలు)
6. ఇస్తర కింద - బెస్తోడు (చెదలు)
7. చిప్పెడు గగ్గిళ్ళు - మీ యన్న దినపాయె
   మా యన్న దినపాయె-వచ్చిన చుట్టం ఒల్లకపాయె (పిడుదులు)
8 యాసింగి వడ్లకు - లేసి గూసునె (మిడత)
9. గుడ్డ దిందురు - సద్ది పారేతురు (కోడి అరలపొట్ట)[1]
10. హమార డొప్ప - ఢిల్లీకా బంక - ఆడోళ్ళకైరాదు -
    మొగోళ్లదినొచ్చు (తేనె)
11. మొలొక్కొడ్ల బువ్వ - మట్టలచారు - మొగోళ్ళకైరాదు -
    ఆడోళ్ళుదినొచ్చు (తేనె)

ఛందస్సు : పొడుపు కథలు లయాత్మకమైనవి. సమాన మాత్రలు కలిగిన కొన్ని అక్షర సముదాయాలు వరుసగా ప్రయోగించటంవల్ల లయాత్మక మైన గతి ఏర్పడుతుంది. చాలావరకు పొడుపు కథలన్నీ మాత్రా గణబద్ధాలే. గతి విధానాన్ని బట్టి వీటిని త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ గతి విధే యాలుగా పట్టి చూపవచ్చు. ఒక పొడుపు కథ మాత్రం ద్విమాత్ర గతిలో కనిపి స్తున్నది. అది. అగ సిగ పొగ (అనగపు కాయ, చిక్కుడు కాయ, పొట్లకాయ అని దాని విడుపు. గతులు, పాదవర్గీకరణ, యతి, ప్రాస అనే అంశాలకు ఉదాహరణలను పొందుపరుస్తాను.

## గతులు

త్ర్యస్రగతి (మూడేసి మాత్రలు): 1. చిన్నపిట్ట కమ్మగుండు (నువ్వు గింజ)
2. ఏనిగంత గుండుమీద ఎంద్రకాయ అరిసె (మోట గిలక)

చతురస్రగతి (నాల్గేసి మాత్రలు):1. ఏనిగ దంతం పళపళ (ఈర్వ్యాన)

---

1. జీర్ణాశయం

2. సాకలి మూటకు - సన్నని బియ్యం (చీరపేలు)

3. సరసర కత్తులు - సన్నపు కత్తులు
లంజెల వలపులు - గంధపు చెక్కలు (ఈతచాప)

ఖండగతి (ఐదేసి మాత్రలు) : 1. అయ్యన్న గుఱ్ఱానికి - పయ్యేల్ల కండ్లే (నులకమంచం)

2. గునగున్న ఉర్కేటోల్లెవరమ్మ
గుండెక్కి చూసెటోల్లెవరమ్మ
ఆకుల్ని దెంపెటోల్లెవరమ్మ
అర్థాల్ని చెప్పెటోల్లెవరమ్మ (కాళ్లు, కళ్లు, చేతులు, నోరు)

3. అడవిలో పుట్టింది - అడవిలో పెరిగింది
మా ఇంటి కొచ్చింది - తైతక్కలాడింది (ఈతకమ్మ)

మిశ్రగతి (త్ర్యస్ర చతురస్రాల సవ్య, అపసవ్య గతులు) :

సవ్యగతి (3 + 4) : 1. ఒక్క సీసల - మూడు రంగులు (కనుగుడ్డు)

2. కింద ఎఱ్ఱన - నడుమ నల్లన - మీద తెల్లన (మంట - పెనం - రొట్టె)

అపసవ్యగతి (4 + 3) : 1. బాయిలకొమ్మ - బటారికొమ్మ
ఎంతగొట్టినా తెగదు (నీడ).

2. పరంగి తోట్ల
పిరంగి పిట్టె
పట్టవోతె పది
గిచ్చులు గిచ్చె (వంకాయ)

మొదటి ఉదాహరణలో తొలి రెండు పాదాల్లో లక్షణం కనిపిస్తుంది. రెండవ ఉదాహరణలో మూడవ పాదంలో ఒక మాత్ర ఎక్కువైంది.

5 + 4 మాత్రలగతికి ఒక ఉదాహరణ 1. ఆకాకు సందున - దేకాకు సందున -ఏమయ్య పంతులు - పైనింద కంతులు (సీతాఫలం).

సంకీర్ణగీతి :

3 + 4 + 3 : ఏట్ల ఎంపళ్ళ చెట్టు - ఎంత గొట్టినా తెగదు (సీడ).

4 + 3 + 4 : చేతుల ఉన్న చటారి . మంచం కింద మటారి-ఊరికి పోయె ఉటారి (కొడవలి, చెప్పులు, ఉత్తరం).

3 + 3 + 4 : తిరుగు తిరుగు జల్లెడ - తిరుగ బోకు జల్లెడ-ఆరె వాండ్లొచ్చినా - అదరబోకు జల్లెడ (విసుర్రాయి).

## పాద వర్గీకరణ

పాదాల దృష్ట్యా వర్గీకరిస్తే పొడుపు కథల్లో ఏకపది, ద్విపది, త్రిపది, చతుష్పది, షట్పది ఇత్యాది విభాగం కనిపిస్తున్నది.

ఏకపది :

1. సచ్చినోడు అంగడి పాయె (ఎండుచేప)
2. బాయిల బంగారు బిల్ల (తాబేలు)
3. భూమిలో మాయ కల్పతోక (ఎలుక)
4. ఇంటికొక్క రాజు (కావడి దబ్బ)
5. దాలి గుంతల దగ దగ (పుస్తె)

ద్విపద :

1. అంకుమ చెట్టు కింద
   కుంకుమ రాలె (విసుర్రాతి పిండి)
2. ఇంటెన్క మా అక్కని
   ఇరిచి కట్టేతురు (కొప్పు)

త్రిపది :

1. కోపూరంత కొంగు
   మూసాపేటంత ముసుగు
   ఆలూరంత అంచు (సున్నం, తలుపు, జాజుపట్టి)
1. కింద ఎరగ్రిన
   నడుమ నల్లన
   మీద తెల్లన (మంట, పెనం, రొట్టె)

చతుష్పది :

1. లోపల గొంతులు
   మీదన దొంతులు
   రాగం దీస్తే
   రాజులు మెత్తురు (హార్మోనియం)

2. వంక వంకల కత్తి
వయ్యారి కత్తి
రాజులు మెచ్చిన
రత్నాల కత్తి (సందెటొంకు)

షట్పది : 1. గుండెకు ఒత్తుకో
భుజానికెత్తుకో
అడ్డం పెట్టుకో
గడ్డం పట్టుకో
గొంతెత్తి పాడ్తడు
గొంతుదాక పెడ్తడు (తాంబూర)

### యతి

1. గుట్టకిందికేలి - గూనొడు పాయె (చాకలి)
2. నూనె కుండకు - నూటొక్క చిల్లి (పుట్ట)
3. కారండపడవిల - కరాగ్నివుమేసె (పేను)
4. చిన్న బాయికి - చిలకల మెట్లు (నిచ్చెన)
5. అనంతమ్మ బొరగ్రిల - అందరు జొచ్చిరి (బస్సు)

### ప్రాస

1. కంప దాపున - చెంపదెబ్బ (తేనెపట్టు)
2. సంత తిరుగుతుంటె - గుంత పుట్టె
   గుంతలో గుమ్మడికాయ పుట్టె
3. అయ్యన్న గుర్రాన్కి
   పయ్యేల్ల కండ్లే (మంచం)

### (v) అలంకారాలు

పొడుపు కథల్లో రూపకాలంకార విశ్వరూపాన్ని దర్శింపవచ్చు. అలాగే శబ్దాలంకారాల్లో పిరివిగా కనిపించే అంత్యానుప్రాసలతో పాటు యమకం, శ్లేష, ముక్త పద గ్రస్తం మొదలైన అలంకారాలను కూడా చూడవచ్చు. కొన్ని ఉదాహరణలు చూద్దాం.

అంత్యప్రాసలు : 1. ఆకాకు సందున - చేకాకు సందున
ఏమయ్య పంతులు-పైనింద కంతులు (సీతాఫలం)
2. వొత్రాత్తి పెట్టంగ - వన్నెలు గులుకంగ
సాల్ సాలనంగ - సంతోషపడంగ (గాజులు పెట్టటం)

మొదటి మూడవ పాదాల్లో ఒక ప్రాస, రెండవ నాల్గవ పాదాల్లో మరోప్రాస :

సూటి జూతురు
దెబ్బ దెంగుదురు
తిత్తి దీతురు
దిగ మింగుదురు (మామిడిపండు)

యమకం : 1. బొట్ల బొట్ల కుండ
బోనాల కుండ
మెల్లంగ దించరా
కదిలించ కుండ (సీతాఫలం)

'కుండ' అనే పదం అర్థభేదంతో ప్రయోగించబడింది.

శ్లేష : 1. మద్దూరు గట్లల్ల మా యన్న ఉన్నడు
వల్కితె తొల్కరా
పల్కపోతె ఊకెరా (సీతాఫలం)
పలుకు - మాట - కాయ పలుకుట (పలకమారుట)
2. మా తాత రెండెద్దుల దెచ్చిండు
మాట మాటకు పోట్లాడుతయ్ (పెదవులు)
మాట మాటకు : చీటికి మాటికి, ప్రతి మాటకు

ముక్తపదగ్రస్తం : 1. అంతులేని చెట్టుకు అరవై కొమ్మలు
కొమ్మకొమ్మకు కోటి పూలు
పూలల్ల రెండే కాయలు (ఆకాశం, చుక్కలు, సూర్యచంద్రులు)
2. చేటంత కోట - కోటంత కోటి గదులు
గదికొక్క సిపాయి - సిపాయి కొక్క తుపాకి (తేనెపట్టు)

3. తచ్చేవాడు, తచ్చేవానిమీద గొల్లవాడు
గొల్లవానిమీద కుమ్మరివాడు
కుమ్మరివానిమీద గాండ్లవాడు
గాండ్లవానిమీద సాలెవాడు
(కొయ్యదీపస్తంభంమీద ప్రమిద)

**రూపకాలంకారాలు :** పొడుపు కథల్లో జానపదుని శబ్దచిత్రాల రచనా పటిమ, నిసర్గ రామణీయకమైన ప్రతీక వైచిత్రి అపూర్వమైందేకాక, అపురూపమైంది కూడ. సుందరమైన కొన్ని ఉపమానాల్ని ఈ కింద చూడవచ్చు.

1. కట్లకట్లపాము = తుపాకి 2. కారండవపడవిలోని కర్ర్యావు = పేను
3. గుట్టకింది గూనోడు = చాకలి 4. దమ్మిడి ఎచ్చం మోసే పదహారు ఎడ్లు = దాళన పెట్టిన పళ్ళు
5. నూటొక్క బిల్లుల నూనెకుండ = పుట్ట 6. పలుగురాళ్ళల్లో పొర్లాడే పంది = నాలుక
7. బొట్లబొట్ల బోనాలకుండ = సీతాఫలం 8. మిరియాలసంచి = తేనెపట్టు
9. నూటొక్క ముత్యాల ముల్లుకట్టె = సజ్జకంకి 10. మూడు రంగుల సీసా = కనుగుడ్డు

## 5. కథలు

జానపద కథలను డా. జి. ఎస్. మోహన్ గారు పది రకాలుగా వర్గీకరించారు.[1] డా. కె. సుమతి గారు,[2] డా. బుక్కా బాలస్వామి గారు[3] మొదలైన పరిశోధకులు జానపద కథలను అనేక విధాలుగా వింగడించి చూపారు. ఆరె కులానికి సంబంధించిన 15 జానపద కథలను, గాథలను ఆచార్య పేర్వారం జగన్నాథంగారు పరిశీలించారు.[4]

---

1. జానపద కథలు - పుట - 20.
2. తెలుగు జానపద కథలు - పిహెచ్.డి. సిద్ధాంతవ్యాసం.
3. మహబూబ్‌నగర్ జిల్లా జానపద కథలు - పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం.
4. ఆరె జానపద సాహిత్యం - పుటలు - 151 - 163.

కుల సంస్కృతి పరిశీలనకు కులసంబంధ కథలు ఎంతగానో దోహదం చేస్తాయి. ఈ కథలు ఆ కులానికి సంబంధించిన ఆచార వ్యవహారాలను, వృత్తులను, జీవన విధానాలను అద్దంపట్టి చూపుతాయి.

బుడిగె జంగాలు కథల పుట్టలు. ఈ జంగాలు చెప్పే కథలే 'జంగం కథలు' అనే పేరుతో వ్యవహరింపబడుతున్నాయి. వీటినే 'తందానా కథలు' అనే పేరుతో కూడ పిలుస్తున్నారు. ఈ కథలన్నీ గేయాత్మకాలు. ఇవే కాకుండా వచన కథలను అసంఖ్యాకంగా వీరు చెబుతారు. ఈప్తి (విభూతి) పెంటయ్య అనే బుడిగె జంగం ఒక్కడే డా. బుక్కా బాలస్వామి గారికి 100 కథలను చెప్పినట్లు తెలుస్తున్నది.[1] పరిశోధనా దాహపీడితులైన జానపద క్షేత్ర పరిశీలకు బుడిగె జంగాలు చెలమలవంటివారు.

బుడిగె జంగాల కథలను స్థూలంగా మూడు విభాగాలుగా విభజింపవచ్చు. అవి I వృత్తిపరమైన కథలు, II కాలక్షేప కథలు, III. జీవన కథలు.

I. **వృత్తిపరమైన కథలు :** ఈ భాగంలో వృత్తి రీత్యా వీరు చెప్పే కథలను చేర్చవచ్చు. ఇవన్నీ కథాగేయాలు. ఇందులో శతాధికంగా ఉన్న జంగం కథలు లేక తందానా కథలు మొదట చెప్పుకోదగ్గవి. మందెచ్చుల కథలు, వీధి భాగోతాలు, తోలుబొమ్మలాటలు, పగటి వేషాలకు సంబంధించిన కథలు మొదలైన వృత్తి కథలు ఈ శీర్షిక క్రింద చేరుతాయి. వృత్తి కథలను మూడవ ప్రకరణంలో వివరించటం జరిగింది.

II. **కాలక్షేప కథలు :** వృత్తి పరమైన కథలు, జీవన కథలు లేక కుల సంబంధ కథలు కాకుండా ఇతరమైన కథలన్నీ ఈ విభాగంలోకి వస్తాయి. ఇవన్నీ జానపద వచన కథలు (Folk tales). ఇందులో పురాణ కథలు, నీతి కథలు, శృంగార హాస్య కరుణాద్భుతరసాశ్రయాలైన కథలు మొదలైనవి చేరుతాయి. కుల పంచాయతుల పరిష్కార సమయాల్లో కుల పెద్దలు 'సాటువలు'

---

5. మహబూబ్‌నగర్ జిల్లా జానపద కథలు - పర్యవేక్షకుల తొలిపలుకు 'సత్యమొక్కటి'లో.

అనే పేరుతో లెక్కకు మిక్కిలిగా చెప్పే కథలన్నీ ఈ కోవకు చెందినవే.[1] ఇవికూడ జానపద వచన కథలే (Folk tales).

III. **జీవనకథలు**:- ఇవి వీరి జీవనంలోనుంచి పుట్టుకొచ్చిన కథలు. వీటిని కులసంబంధి కథలుగా కూడ చెప్పుకోవచ్చు. ఇలాంటి కథల్లో మచ్చుకు ఆరు కథలను ఉదాహరిస్తున్నాను. అవి (1) ఎవరి దేవుడు గొప్ప? (2) అడ్డబొట్టు నిలువుబొట్టు (3) ఉడుత - కుందేలు కథ. (4) తాబేలు కథ (5) భార్య మంచితనం (6) పోరడి పుల్పు.

ఈ కథల్లో మొదటి రెండు కథలు మత సంబంధాలు. శైవ వైష్ణవ స్పర్థల్లో పుట్టిన కథలు. ఉడుత కుందేలు కథలో బుడిగె జంగం యుక్తి, దాసరి అమాయకత్వం ప్రదర్శింపబడగా, తాబేలు కథలో కులపంచాయతుల స్వభావం, దూరదృష్టి చూపబడింది. చివరి రెండు కథలు ఆహార సమస్యతో ముడిపడి ఉన్నాయి. దాదాపుగా ఈ కథలన్నింటికీ వేట నేపథ్యంగా ఉంది. వేట వీరి సాంప్రదాయిక వృత్తి అని, తమలో తలెత్తిన తగాదాలను కుల పంచాయతుల ద్వారా పరిష్కరించుకుంటారని, కడుపు నిండా తిండి దొరకని పరిస్థితులతో జీవనం గడుపుతారని ఈ కథలవల్ల తెలుస్తున్నది. సేకరించిన కథల్లో పైన పేర్కొన్న ఆరు కథలను మాత్రం ఈ కింద వరుసగా ఇస్తున్నాను ఇవన్నీ బుడిగె జంగాల వద్ద సేకరించినవే.

### (1) ఎవరి దేవుడు గొప్ప?

కథకుడు: కప్పెరి గండయ్య (60 సం॥)
సంగారెడ్డి, మెదక్ జిల్లా.

ఒకసారి ఒక బుడిగె జంగం, ఒక దాసరి ఇద్దరు గలిసి యాటకు[2] వొయ్యిండ్రు. అడివిల తిరిగి తిరిగి ఒక తాన గూసుండ్రు. అడ ఒక తంగెడి సెట్టు, ఒక తీటకోయిలాకు సెట్టు[3] జూసిండు జంగం. ఎట్లగన్న గీ దాసరిని సతా

1. 'ఆచార సంప్రదాయాలు' అనే ప్రకరణంలో 'కులపంచాయతులు' శీర్షిక కింద సాటువలను గురించి కొంత వివరించటం జరిగింది.

2. వేట 3. దురదగొండి మొక్క

యించాల్నని అనుకుండు. "బావ బావ మీ దేవుడెవ్వరు?" అని అడిగిండు. ''మా దేవుడు విష్ణుమూర్తి'' అన్నడు దాసరాయన. ''అయితె బావ మీ దేవుని మయిమ[1] ఈ తంగెడి సెట్టుమీద జూయించు. మా దేవుడు శివుడు గద. మా దేవుని మయిమ నేను ఆ పక్కసెట్టు (దురదగొండి) మీన జూయిస్త'' అని జంగం అన్నడు. ''అదెట్ల బావ'' అని దాసరి అడిగిండు. ''నీ దేవుని సెట్టు మీద నేను దేకుతనోయ్ బావ'' అని జంగం గోసి తీసి తంగెడు సెట్టు మీదికెల్లి దేకిండు. అది జూసి దాసరికి అరికాలు మంట నెత్తికెక్కింది. ''నా దేవుని సెట్టు మీద దేకుతావోయ్ బావ. నీ దేవుని సెట్టు మీనికెల్లి నేను దేకుత సూడు'' అని కోపం జేసిండు. ''దేకు బావ. దాంట్లేమి లేదు. నీ దేవుని సెట్టుమీది కెల్లి నేను దేకిన. నా దేవుని సెట్టు మీదికెల్లి నువు దేకు. నా దేవుని సెట్టు ఇగో గిదే'' అని తీటకోయిలాకు సెట్టును జూపెట్టిండు జంగం. దాసరి కోపం మీనవోయి, గోసి దీసి, తీటకోయిలాకు సెట్టు మీదికెల్లి మూడుసార్లు దేకిండు. ''నువ్వు నా దేవుని సెట్టు మీదికెల్లి ఒక్కసారి దేకితే, నేను నీ దేవుని సెట్టుమీది కెల్లి మూడుసార్లు దేకిన బావ'' అని సంతోషపడిండు. ''అమ్మ అయిందిరా దాసరి బావ పని'' అని లోపట లోపట నవ్వుకోబట్టిండు బుడిగె జంగం. జెర్రసేపు ఉండెసరికల్ల దాసరి బావకు గోకుడు బుట్టింది. చీద్రకు ఆగలేక చెంగ చెంగ ఎగర బట్టిండు. లబ్బ లబ్బ మొత్తుకోబట్టిండు. ''సూసినావ్. నేన్జెప్పలే మా దేవుని మయిమ జూడు. ఎట్ల జూపిచ్చిండో. మీ దేవుని మయిమ లేదు గియిమ లేదు. నాకు గోకుడు గికుడు ఏం లేదు సూడు'' అని జంగం అన. బట్టిండు ''అవును బావ. నివాద్దె.[2] మీ దేవుని మయిమ దెల్వక దేకితి గద బావ. మీ దేవుడు మయిమగల దేవుడు బావ. ఎట్లగన్న గీ తిండి[3] తగ్గేటందుకు జూడు బావ'' అని దాసరి జంగాన్ని గీములాడబట్టిండు.[4]

## (2) అడ్డబొట్టు నిలువుబొట్టు

కథకుడు : రేవెల్లె ఉసేను (60 సం॥)
అచ్చంపేట, మహబూబ్‌నగర్, జిల్లా.

ఒక బుడిగె జంగమోడు, ఒక దాసరోడు ఇద్దరు ఊర్ల బిచ్చమడుకొని, ఊరవతల బాయికాడ కల్సుకున్నరు. వీల్లు కల్సుకొని మాట్లాడుకుంట ఉండం

1. మహిమ 2. నిజం 3. చీదర 4. బ్రతిమిలాడాడు.

గనె బాయిగడ్డమీద గడ్డివాములు అంటుకున్నై. ఆ మంటల్జూసి ఊర్లకెల్లి అందరు ఉరుకొస్తున్రు. ఆ గుంపున్జూసి ఇగ మా పనైందని బుడిగె జంగ మోడు ఫికర్ జేస్తుండు. ఇగ ఎట్ల జెయ్యాలని బాధపడ్తుండు. "దాసరి బావ, దాసరి బావ మనల్నిప్పుడు మన దేవుండ్లే కాపాడాలె. నన్ను మా దేవుడు శివుడే రచ్చించాలె. నిన్ను మీ దేవుడు విష్ణే రచ్చించాలె" అని చెప్తుండె వరకల్ల ఊరోల్లు రానె వచ్చిన్రు. జంగాన్ని, దాసరోన్ని పట్టుకున్రు. "గడ్డివాములు ఎవర్గాల్చిన్రు చెప్పున్రి కొడుకులార" అని కొట్టవట్టిన్రు. గప్పుడు బుడిగె జంగమోడు తలాకాయని అడ్డంగ ఊపిండు. దాసరోడు ఇది జూసి "వీడు అడ్డంబొట్టు పెట్టుకోని తలాకాయ అడ్డంగ ఊపిండు. నేను విష్ణు మతమోన్ని నిలువ బొట్టోన్ని. తలాకాయ నిలువుగ ఊప్త"నని నిలువుగ ఊపవట్టిండు. గది చూసి ఊరోల్లంత గీదాసరోడె వాములు తల్గవెట్టిండని ఇర్గ మర్గ బాదిన్రు. యిష్టమొచ్చినట్లు కొట్టిన్రు. బుడిగె జంగమోన్ని ఇడ్సిపెట్టిన్రు.[1]

### (3) ఉడుత కుందేలు కథ

కథకురాలు : తూర్పాటి నాగమ్మ (50 సం॥)
రేవూని, వరంగల్ జిల్లా.

దాసరోడు, బుడిగె జంగం పక్కపక్కనే గుడిసె లేసుకొని ఉంటున్రి. దాసరి పెండ్లానికి, జంగం పెండ్లానికి పత్తలేదు. దాసరి పెండ్లాం మీద జంగం పెండ్లాం పగబట్టింది. ఈ సంగతి మొగనికి జెప్పింది. "ఎట్లనన్నజేసి దాసరి పెండ్లాన్ని మొగన్తోని కొట్టిపిస్తతియ్యే. నువు సప్పుడాకుండు" అని జంగం తన పెండ్లానికి జెప్పిండు.

ఒకనాడు దాసరి, జంగం ఇద్దరు గల్సి యాటకు బోతె ఒక ఉడ్త, ఒక కుందేలు దొరికినయ్. బుడిగె జంగం దాసరితోని అన్నడు: "దాసరి బావ. దాసరి బావ. మనకు ఒక ఉడ్త, ఒక కుందేలు దొర్కె. ఉడ్తనేమొ ఉడికుడికి, ఉడికుడికి కుండ నిండైతది. కుందేలెమొ ఉడికుడికి, ఉడికుడికి కూలారిపోయి రొండే తునకలైతది. ఎట్ల పంచుకుందం?"అన్నడు. దానికి దాసరోడు అన్నడు

---

1. డా. బుక్క బాలస్వామి గారు కూడ ఇలాంటి ఒక కథను ఉదహరించారు. మహబూబ్‌నగర్ జిల్లా జానపద కథలు - పుట 125.

గదా-''బావ. నీ ఇష్టం. నువ్వెట్ల పంచితె గట్లనె. నువ్వె జెప్పు'' అన్నడు. అట్ల అంటెకల జంగమేమన్న దంటె, ''బావ, ఇగ ఏం బంచాలె, నేనైతె నిత్తె యాట కొయ్యేటోన్నె. తోడ్సిగాల్లో,[1] వలెంగాల్లో,[2] ఎంట్యలు,[3] జంగాశ్కాలు[4] ఎన్నో జివాలను[5] మస్తుగదెస్తుంట. అందు గురించి నాకు లేకపోతెపాయె. ఉడికుడికి రొండు తున్కలయ్యే కుందేల్ని దీసుకుంట. ఉడికుడికి కుండ నిండె ఉడ్తని నువ్వు దీస్కో'' అని అన్నడు ''ఉడ్త ఉడికుడికి కుండ నిండ్తదంట. అదే నా కిచ్చిండు.'' అని దాసరి సంతోషపడి ఉడ్తను దీసుకుండు. ఇంటికొయ్యి పెండ్లానికిచ్చిండు. ''ఉడ్త ఉడికుడికి కుండెడైతదంట మంచి గొండె'' అని దాసరి పెండ్లానికి జెప్పి కల్లుదాగనింకె బొయ్యిండు. ఇగ బుడిగె జంగం కుందేల్ని దీసుకపొయ్యిండు. వాల్లు భార్యాభర్తలు మంచిగ వొండుకొని తిన్నరు.

ఉడ్తని వొండుకుంట మద్దె మద్దెల మూతెత్తి సూస్కుంట గూసున్నది దాసరి పెండ్లాం. ఎంతుడికిన గంతనె ఉన్నది. మగడొచ్చి బువ్వవెట్టమన్నడు. ఆమె బువ్వపెట్టి తున్కలేసింది. ''తున్కలేవే? గివ్వేనా? ఉడికుడికి కుండ నిండైతె గివ్వేనా తున్క'' లని కోపం జేసిండు. "ఇంట్ల గూద్దిగ నేనేం జెయ్యాలె? ఎంతుడ్కపెట్టిన గంతె ఉన్నయ్." అని వాని పెండ్లాం అన్నది.

తెల్లారి దాసరి జంగాన్ని అడిగిండు : "ఏంది బావ! ఉడ్త ఉడికుడికి కూరకుండ నిండ్తదంటివి. కుండ నిండలేదు. గింద నిండలేదు. గవ్వె రొండు తున్కలున్నయ్!" అని అడిగిండు

''అయ్యో బావ! ఏం జెప్పాలె. నువ్వు కల్లుదాగనింకె బొయినవా. అదె సందనుకొని, మా చెల్లె (దాసరి భార్య) కుండల తున్కలన్ని దేవుకొని గప్ప గప్పదిని, నీకు రొండు తున్కలుంచింది. కుండ నిండలేదని నీకు అవొద్దం[6] జెప్పింది. ఒకసారి మీ చెల్లె (జంగం భార్య) గిట్లనె జేస్తె, మెత్తగ గొట్టి పండ వెట్టిన. గప్పట్నుంచి బుద్ధి కొచ్చింది. పెండ్లాన్ని అజ్ఞల[7] బెట్టుకోవాలె బావ!'' అని జంగమన్నడు. దాసరికి లోపట లోపట పెండ్లాంమీద చాన కోపమొచ్చింది. ''చూసినావ్ నా పెండ్లాం ఎట్ల జేసింది! దీనికి నా మీద యాపాటో ఇష్టంలేదు. దీని పనిజేస్త" అని అనుకొని, ఇంటికొయ్యి, పెండ్లాన్ని మెత్తగా బాదిండు. ఇది జూసి బుడిగె జంగం మొగుడు పెండ్లాం సంతోషపడ్డరు.

---

1. ఉడతలు, 2. ఉడుములు, 3. ముంగీసలు, 4. జంగ పిల్లులు, 5. జంతువులు, 6. అబద్ధం, 7. అదుపులో.

## (4) తాబేలు కథ

కథకుడు : సదుల మదనయ్య (65 సం॥)
జిల్లెల్లగూడెం - రంగారెడ్డి జిల్లా

ఒక బిరాడ్ల[1] ఇద్దరు బావ బామ్మర్దులు ఉండెటోల్లు. ఒకనాడు ఇద్దరు యాటకు వొయ్యింర్రు. పోతుంటె పోతుంటె ఒక కుంట కనవడింది. కట్టమీద నిలబడి సూసింర్రు. అక్కడక్కడ కురుంగాల్లు[2] నీల్లల్లకెల్లి తల్కాయలెల్ల బెట్టినయ్. అరె దీంట్ల కురుంగాల్లున్నయ్ దేవుదమని నీల్లల్లకు దిగి, వలతోని దేవింర్రు. పొద్దుమూకిందనుక ఎంత దేవినా, ఒక్కటి గూడంగ దొర్కలేదు. యాష్ట[3]కొచ్చింది. ఆకర్కు[4] ఒక చిన్న తాబేలు పిల్ల దొరికింది. గా తాబేలు పిల్ల రూపాయి బిల్ల కన్న జెర్ర పెద్దగున్నది. బిరాదు కొచ్చినంక మరిది జూసి "బావ! ఈ సిన్న తాబేలు పిల్లని ఇద్దరం పంచుకుంటె ఎవలకు[5] సరిపోదు. నువ్వే దీసుకొని పుల్సుగాసుకో బావ" అని ఇచ్చి పోయిండు. బావ తెలివి మంతుడు. బాగ సోంచాయించిండు.[6] 'ఈ కురుంగాని పిల్లని నేనుగన్క పుల్సు గాసుకుంటినా, రేపు కాడ ఏమొస్తదో! వీడు సిన్నమన్షిడుగాడు. దండ్గలమారి.[7] వలెంగాని[8] నాల్కలోడు. మాట మీద నిలవడడు. ఎన్కటికి ఇట్లనే యాటకు వొయ్యొచ్చి ఎల్కతోక పంచలేదని పంచాతి పెట్టుకొని ఏడు నూర్లు మునిగింర్రంట. ఎంర్రకాయ కొండుకాడకొట్లాడి ఏడునూర్ల పంచాతి చేసుకుంర్రంట. ఈ జిబ్బులన్ని ఎవరు పెట్టుకుంటరు?' అని తలకుదెచ్చుకొని,[9] ఆ తాబేలు పిల్లను నీల్ల సిద్దెలేసి, ఎవ్వరికి దెలువకుంట ఉంచిండు. ఇట్లనే కొన్ని నెలలదాక పెంచిండు. అది పెరిగి పెద్దదైంది. ఈ సంగతి ఎవ్వరికి దెల్వాదు. ఒకనాడు బావ బామ్మర్దులకు దేనికాడనో మాట మాట పెరిగి, ఒకల్లమీద ఒకరు ఈరులు సూరులు[10] అయ్యింర్రు. బాగ కొట్టుకుంర్రు. కులపెద్దల తానికి పోయి పంచాతి పెట్టుకుంర్రు.

---

1. బుడిగె జంగాల గూడెంలో.
2. తాబేళ్ళు.
3. విసుగు.
4. చివరికి.
5. ఎవరికి.
6. ఆలోచించాడు.
7. ఎన్నోసార్లు కులపంచాయతుల్లో జరిమానాలు వేసుకున్నవాడు.
8. ఉడుము.
9. బుర్రకెక్కించుకొని.
10. వీరులు శూరులు.

'అయ్యా. వీడు నా జిమ్మ[1] గొట్టి యాటల దొరికిన కురుంగాన్ని దిన్నడు. దాన్ని పుల్సు గాసుకోని నాకు గింత పోరడి[2] కూడ పంపలేదు. ఒక్కడే దిన్నడు. ఇది తప్పని పిస్త' అని బావమీద బామ్మర్ది పుల్ల గట్టిండు.[3] బావ కిన్నుడయిండు. 'సూసినావ్! నేనాయాల్ల కురుంగాని పిల్లను తిన్నట్లయితే ఇప్పుడు తప్పులబడి పోతుంటి. అట్లనె ఉంచింది మంచిగైంది' అనుకొని నాయం ఎట్లజేస్తరో సూస్తనని సప్పుడాక[4] గూసుండు. బామ్మర్ది జెప్పింది యిని కుల పెద్ద 'అట్ల నువ్వు వాని నోరుగొట్టి తినడం తప్పు' అని అనుకొచ్చిండు. ఇగ గప్పుడు లేసి బావ, గుడిసె కాడికి వొయ్యి, సీల్ల సిద్దెను దీసుకొచ్చి కులంవాల్ల ముందు బెట్టిండు. దాంట్ల కురుంగాని జూసి, అందరు దమ్మదిన్నరు.[5] అన్నడు గద 'నేనా రోజే దీని వొగ్గ్యాల[6] దిన్నుంటే గియ్యాల్ల నా పనేమయ్యేది? వీడు గిసుంటోడని తెల్సుకొని దీన్ని గిట్ల కాపాడగల్గిన. ఇగ మీరె సూడుండ్రి. తగు జెప్పుండ్రి' అన్నడు. కులపెద్ద బామ్మర్ది మీనికిలేసిండు. ఒగ దిట్టిండు. ఒగ దిట్టిండు. నువు సొంటెవు. పలుగాకివి. అన్నడు. కులం కర్సులన్ని[7] వాని మీద మోపింండ్రు.

## (5) భార్య మంచితనం

కథకులు : మోటం జంగయ్య (58 సం॥)
పసుమామ్ల, రంగారెడ్డి జిల్లా.

ఎన్కటికి ఒక బిరాడ్ల ఒక మంచి యాటగాడుండెటోడు. అయ్న రోజు యాటకొయ్యి ఎంట్వలు, వలెంగాల్లు, తోడ్సిగాల్లు, ఉన్నానిగాల్లు, కురుంగాల్లు[8] ఇంక ఎన్నో జివాలని పట్టుకొస్తుండె. వాని పెండ్లాం మంచిగ వొండి, గుంజిప్ప[9] నింద బువ్వవెట్టి, తున్కలేసి అయ్నకు వొడ్డిస్తుండె. ఆయన బువ్వదీసోకని తింటుండంగనె పెండ్లాం మొగన్ని మెచ్చుకుంట గూసుంటుండె. "మా అయ్న

---

1. జిహ్వ. 2. పొరుగింటికి పంపేకూర. 3. పుల్లవిరిచే ఆచారం. చూడు. నాల్గవ ప్రకరణంలో కుల పంచాయతులు. 4. చప్పుడుగాక. 5. ఆశ్చర్యపోయారు. 6. ఒకవేళ. 7. ఖర్చులన్నీ. 8. వరుసగా-ముంగిసలు, ఉడుములు, ఉడతలు, ఎలుకలు, తాబేళ్ళు. 9. కారం నూరే గుండ్రని చిప్ప.

మంచోడు. వాగర్లక్క పెండ్లానికి బువ్వ పెట్టకుండ తినెటోడుగాడు. తున్కలు బువ్వ అట్లనె యిడ్చిపెట్టి నాకిస్తడు" అనుకుంట కూసుంటుండె. ఈ మాటలు ఇనంగనె మొగుడు ఉబ్బిపోయి, బువ్వతున్కలు పెండ్లాని కిచ్చి చెయ్యి కడుకుంటుండె. ఇడ్చిపెట్టిన బువ్వతున్కలు ఆమె మంచిగ తింటుండె. ఇట్లనె నిత్తె[1] జరుగుతుండె. తిని తిని ఆమె బలిసిపోయింది. తిండి సరిగ తినక మొగుడు ఎండిపోతుండు. ఇదంత సూసి కులపెద్ద అయ్న్నని అడి గిండు - "ఏమైందిర, గిల్లైపోతున్నవ్? తిండి తింటున్నవా? తింటలేవా? నిత్తె జివాలను దెస్తనె ఉంటవ్. తున్కలు దింటలేవా? గిట్ల బక్కగై ఆలతు[2] లేకుంద ఐపోతున్నవ్. నీ పెండ్లం సరిగ బువ్వ పెడ్తున్నదా? లేదా?'' అని గుచ్చి గుచ్చి అడిగిండు. ఇట్ల అడ్లంగనె అయ్న్న అన్నడు: ''నా పెండ్లాం ఎంత మంచిది! అది తినకుండ బువ్వ, తున్కలు నాకె వెడ్తది. నేను కొంచం దిన్నంక దానికే ఇచ్చేస్త అంత'' అని భార్యను మెచ్చుకున్నడు. 'వీని మెచ్చుకోని మెచ్చుకోని వీడు దినకుంట ఇట్ల జేస్తున్నది వీని పెండ్లాం' అని కులపోల్లంత అనుకున్నరు. ''అరె! నీ పెండ్లాం మాటలకు నువ్వు ఉబ్బిపోయి, తిండి దినకుంట ఉంటివంటె సస్తవురా. నువ్వు తినెటప్పుడు మాట్లాడుకుంట నేనొస్త. నీ పెండ్లం ఎంత గానము మెచ్చుకున్నగాని, నువ్వు తింటనె ఉండు. అట్లైతెనె ఈడికేలి నువ్వు దినేది నీకు వెడ్తది. ఆమె దినేది ఆమె దింటది'' అని కులపెద్దచెప్తడు. అయ్న్న సరెనంటడు. మర్నాడు మున్పటిలెక్కనె ఆమె బువ్వపెట్టి, తున్కలన్నీ దేవే స్తది. అయ్న్న ఇడ్చిపెట్టకుండ అంత దింటడు. ఆమెకు కోపమొస్తది. "ఇడ్సి పెడ్తడేమొ అని ఇట్ల వడ్డిస్తి. ఇడ్సిపెట్టపాయె. నాకు ఆకలైతుంది. మొగుడంట మొగుడు! పెండ్లానికి ఇయ్యకుండ దింటడా? మంచోడనుకున్నగాని, ఇసుమం టోడని ఇప్పుడు దెల్సింది'' అని సాధిస్తది. ఆమె మాటలు యినంగనె" ఇన్ని రోజులు నా మొగుడు మంచోడు, నా మొగుడు మంచోడు అంటె నిహొద్దే[3] అను కున్న. నా పెండ్లాం మంచితనము ఇయ్యాల్ల దెలిసింది'' అనుకున్నడు. గప్పుడే ఇట్ల జెయ్యమని చెప్పిన కులపెద్ద వొచ్చి ''మొగడు పెండ్లం వొండుకున్నకాడికి సెరింత దినాలె ఉన్నదాంట్లనె మొగనికింత, పెండ్లానికింత పెట్టుకుని తినాలె. గట్లైతె మంచిగుంటది సూడుండ్రి'' అని చెప్తడు.

---

1. నిత్యం, 2. హాలత్, అస్యదేశం=శక్తి, 3. నిజం.

## (6) పొరడి పుల్సు[1]

కథకుడు : అలేటి జంగయ్య (54 సం॥)
మీర్ పేట, రంగారెడ్డి జిల్లా

ఒక బిరాడ్ల ఒక ముసలామె ఉండె. అమెకు నల్గురు కొడుకులుండ్రి. ఆ నల్గురు కొడుకులు శెంద్ర[2] పొయిండ్రు. ఇగ ఇంటికాడ ముసలామె, ఆమె నల్గురు కోడండ్లే ఉన్నరు. కోడండ్లని శాన కట్టుదిట్టాలల్ల పెట్టింది ముసలామె. కోడండ్లు పొద్దుగాల లేవాలె. ఈతాకు కల్పుకోవాలె. జోలె వేసుకొని ఊల్లెకు పొవ్వాలె. అడ్క తినాలె. ముసల్దానికి తిననింకె తేవాలె. పొద్దుమీకి వొంట జేసుకుంటె, మునిమాపుదాక సాపపట్టి అత్తెనే వాల్లకు రొట్టెనో, అంబలో, ఒక బుక్క బువ్వనో పెట్తది. సాప[3] అల్లకుంటె తిండిలేదు. గిండిలేదు. ఉపాసం పండుకోవాలె. ముసలి అత్త కడుపు నిండ తిండి పెట్టదు. కంటి నిండ నిద్ర పోనియ్యదు. దెయ్యం లెక్క దగుల్తుంటది. ఇట్ల అత్త పెట్టె బాధలకు కోడండ్లు ఏడుస్తుండ్రు. ఎన్నడీ బాధలు పోతయని దేవున్కి మొక్కుతుండ్రు.

ఇట్లుండగ ఒకనాడు బిరాళ్ళ అందరు గలిసి పందిని కొట్టుకుండ్రు. పోగులేసుకుండ్రు. "ముసలమ్మ! నువ్వుగూడ ఒక పోగు[4] దీస్కో. నీ కోడండ్లు అందరు దింటుంటే మొకాలు జూడకుండ ఉంటది'' అని బిరాడు పెద్ద జెప్పిండు. అట్ల జెప్పినాగాని ముసలమ్మ పోగు దీసుకోలేదు. పొద్దు మూకంగనె బువ్వ ఒకటే వొండుకొని కూసుంది. కూర వండలేదు. కోడండ్లు జూసి అన్నరు గద: "అత్త - అత్త! అంతారోలె మనం గూడంగ పోగు దీసుకుంటే తలా రెండు తున్కలు తింటుంటిమి గద? నీ కొడుకులు శెంద్రలు పొయిరి. యాటకు పొయ్యెటోల్లెవ్వరులేక, పొలం మాంసం[5] దినక నోరు సప్పపడ్డది. ఇయ్యాలన్న అందరిలెక్క మనం గూడ పందిపోగు ఎత్తుకుంటె తింటుంటిమి'' అన్నరు. కోడండ్లిట్లఅనంగనె అత్త వాల్లకు జెప్పింది- ''మీరెంత పిచ్చోల్లే! మనము పోగు

---

1. పొరుగింటి వారు పంపే కూర.
2. భిక్షాటన కోసం గ్రామాంతరం వెళ్ళటం.
3. ఈత చాప.
4. మాంసం కుప్ప.
5. వేటాడిన జంతువుల మాంసం.

దీసుకుంటె మనకు పోరడి ఎవ్వరు బంపరు. తీసుకోకుంటె 'అయ్యో! పిల్లు పోగు తీస్కో లేదని' అందరు పోరడి బంపుతరు. అవన్ని పోగుకంటె ఎక్కువైతయ్. మనం కమ్మగ దినొచ్చు'' అని మసలమ్మ అంటది. ''మీరు గుడిసెలల్ల కమ్మ అల్లుకుంట గూసోండ్రి. అన్ని పోరళ్ళు రాంగనె మీకు బువ్వ పెడ్త'' అని చెప్పింది. కోడండ్లు 'గట్లనే' అని కమ్మ అల్లుకుంట గూసుంటరు. మద్దె మద్దెల 'బువ్వ పెడ్తవా' అని అడుగుతరు. ''ఇగ అయిపాయె. గాల్ల పోరడి రాంగనె దిందాం గీల్లపోరడి రాంగానె తిందాం'' అని జరుపుతుంటది. రాత్రి మించి పోతుంటది. అందరు పండుకునెయాలైతది. పోరడి వంపెటోల్లందరు పంపింద్రు. అయినగాని ముసలత్త కోడండ్లకు బువ్వ పెట్టదు.

అంతట్లనె ఒక గుడ్డేలుగు[1] వచ్చి, ముసలామె చెయ్యిపట్టి జమురుతుంటది. ఆమె అనుకుంటది- కొన గుడిసె ఆయన గూడ పోరడి తెచ్చిండని అనుకుంటది. తీస్కోనింకె మర్లుతది. సూస్తె అదేమొ గుడ్డేల్లు. ముసలామె భయంతోని నోట్ల మాట రాదు. ఆమెను గుడ్డేలుగు ఎత్తుకొని పోతది. ఆ సప్పుడుకు కోడండ్లు వచ్చి అత్త గుడిసెల జూస్తరు. అత్త ఉండదు. ఎక్కడన్న పాడైపోని ఈ ముసల్ది అని అనుకుంటరు. బాగ ఆకలైతుంటది. బువ్వపెట్టుకొని, తున్కలేసు కొని కమ్మగ తింటరు. తర్వాత అత్తని గుడ్డేల్లు ఎత్కపోయిందని తెలుస్తది. మా ఉసురుదాకి ముసల్ది సచ్చింది. మాకు పీడవొయ్యిందని కోడండ్లు అనుకుంటరు.

ఈ కథలన్నీ టేపు మీద రికార్డు చేసి, తర్వాత రాసుకున్నవి. ఈ కథల్లో చక్కటి తెలంగాణా మాండలికాన్ని చూడవచ్చు. ఇవన్నీ బుడిగె జంగాల కుల సంబంధి కథలు అయినందువల్ల వీరి బిరాళ్లు, తోటి సంచార జాతులతో సంబంధాలు, అవిరళంగా వీరు చేసే వేటకు సంబంధించిన ప్రస్తావనలు, కులం వారికెవ్వరికి అధిగమించరాని కుల పంచాయతీ వ్యవస్థ, వారు ఎదుర్కొంటున్న ఆహారపు కొరత మొదలైన అంశాలను చిత్రం కట్టిస్తాయి.

---

1. ఎలుగుబంటి.

సోదర సంచార కులాలతో వీరు కలిసి మెలిసి ఉంటారు. చెంచు, యానాది, ఎరుకల, దాసరి మొదలైన కులాలతో వరుసలు పెట్టుకొని వ్యవహరిస్తుంటారు. బుడిగె జంగం కులేతరులైన సంచార జాతులవాళ్ళను వీరు 'పర్దేసులు' అని అంటారు. పంచాయతుల పరిష్కార సమయాల్లోని కొన్ని సందర్భాల్లో వీరు పర్దేసులను కూడ ఆహ్వానిస్తారు. అలాగే పర్దేసుల పంచాయతుల్లో బుడిగె జంగాలను కూడ ఆహ్వానిస్తారు. అందుకే 'కూసుంటే కులం, లేస్తే పర్దేసి' అనే సామెత ఏర్పడింది. కూర్చొని పంచాయతీ మాట్లాడుతుంటే అందరు సమానమే పంచాయతీ పూర్తయిన తర్వాత లేచి వెళ్తుంటే అప్పుడు ఎవరి కులం వారిది. సంచార కులాలైన వారు, వీరు కలిసిమెలిసి ఉండటంవల్ల, ప్రక్కప్రక్కగా జీవిస్తుండటంవల్ల పరస్పర సంబంధాల్లో ఎన్నో కథలు పుట్టుకొచ్చాయి.

వేటకు, బుడిగె జంగాలకు ఎడతెగని సంబంధం ఉంది. వీరి జీవితం మీద వేట గాఢమైన ముద్రవేసింది. వీరి కులసంబంధమైన కథల్లో వేట ప్రస్తావన ఉన్న కథలే ఎక్కువ. కులపంచాయతులు ఇతివృత్తంగా ఉన్న కథలు కూడ అధికంగానే ఉన్నాయి. ముఖ్యంగా వీరికున్న ఆహార కొరత చాలా కథల్లో కనిపిస్తుంది. ఆహార కొరత ఆత్మీయతల తీవ్రతను తగ్గిస్తుందని ఈ కథలను బట్టి చెప్పవచ్చు. ఇలా వీరి కథలు వీరితో విడిపోని ఆదిమజాతి లక్షణాలను, ఆటవిక జీవన విధానాన్ని పట్టి చూపుతున్నాయి.

## 6. గేయాలు

బుడిగె జంగాలు తందానా కథలకు కథా గేయాలను గానం చేస్తారు. తోలుబొమ్మలాటలకు, వీధి బాగోతాలకు సాహిత్యంగా కవులు రచించిన యక్షగానాలను ఉపయోగిస్తారు. తుపాకి రాముడు, కాటిపాపలు, బోడి బాపనమ్మ (బ్రాహ్మణ వితంతువు), బాలసంత మొదలైన వృత్తి వేషాలకు స్వంత ప్రసంగాలను వల్లిస్తారు. వీధి బాగోతాలు, తోలుబొమ్మలాటలు మొదలైన ప్రదర్శనల్లో మధ్య మధ్య ముక్తకాలైన గేయాలను పాడుతుంటారు. ఇవి కథా రహిత గేయాలు. ఈ గేయాల్లో హాస్య గేయాలు ఎక్కువైనప్పటికీ శృంగార, నీతి, పారమార్థిక తదితర గేయాలు కూడ ఉంటాయి. ప్రదర్శనల సందర్భాల్లోనే కాకుండ విడిగా భిక్షాటన చేస్తున్నప్పుడు పురుషులుగాని, స్త్రీలుగాని ఈ పాటలు

పాడుతారు. కొందరు జానపద పరిశోధకులు సేకరించిన గేయాల్లో కూడ బుడిగె జంగాలు పాడగా సేకరించినవే అత్యధికమని చెప్పవచ్చు. డా. పొద్దుటూరి ఎల్లారెడ్డి గారు ప్రచురించిన 'జానపద విజ్ఞానం - హాస్య గీతాలు' అనే సంకలనంలో ఉన్న 103 గేయాల్లో 70 కి పైగా బుడిగె జంగాలు పాడినవే.

నేను సేకరించిన ఇలాంటి కొన్ని గేయాలను అనుబంధం - 6 లో చూడవచ్చు.

## 7. బుడిగె జంగాల రచనలు

యక్షగానాలకు, వీధి భాగోతాలకు, తోలుబొమ్మలాటలకు ఉపయోగించే సాహిత్యం తప్ప, వీరు ప్రదర్శించే మిగిలిన వృత్తికళల సాహిత్యమంతా వీరి స్వంత సృష్టే. పారంపర్యంగా వస్తున్న కథాగేయాల మూసలో కొత్త కథలను కూడ వీరు పాడుతుంటారు. అగ్గిరాముడు సినిమా రీళ్ళను తీసుకురావటానికి మద్రాసు వెళ్తూ జనగామ వద్ద రైలు ప్రమాదంలో మరణించిన 'గౌండ్ల అంజయ్య' తందానా కథను ఇందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు. యక్షగానాల్లో, వీధి భాగోవతాల్లో, తోలుబొమ్మలాటల్లో హాస్యంకోసం పాడే గేయాలన్నీ వీరు కూర్చుకున్నవే. తరతరాలుగా వస్తున్నవే.

మౌఖిక సంప్రదాయ విధానాల్లో గేయాలను అల్లటం కాకుండా, లిఖిత సంప్రదాయంలో రచనలు చేసిన బుడిగె జంగం కవి ఒకడు ఉండేవాడని తెలుస్తున్నది. అయన పేరు డొక్క వట్టాభిరాములు. మహబూబ్‌నగర్ జిల్లాలో వీధి భాగోతాలు వేస్తూ సంచరించేవాడు. తర్వాత రోజుల్లో వైద్యాన్ని వృత్తిగా స్వీకరించాడు. 1946 ప్రాంతంలో తన 70 వ ఏట మరణించాడు. అంటే 1876 - 1946 మధ్య కాలంలో జీవించాడు. ఈ జిల్లాలోని వసంతాపురంలో ఇతని సమాధి (బొంద) ఇప్పటికీ ఉన్నదట.

డొక్క వట్టాభిరాములుకు సాముద్రికం, జ్యోతిష్యంలో కూడ ప్రవేశముండేదట. 'అనుదవాకుల' అనే గ్రామంలో 'శేషిరెడ్డి' అనే భూస్వామి కొత్త ఇల్లు కట్టి, పట్టాభిని భోజనానికి పిలిచి, గదిలో కూర్చోబెట్టి, వడ్డింపించాడట. పట్టాభి ఎంతకూ తినకపోయేసరికి ఏం సంగతని రెడ్డి అడిగాడట. "అయ్యా!

మీరు ఏమీ అనుకోకపోతే విషయం చెబుతాను. ఈ విస్తరి క్రింద భూమిలో మనిషి అస్థికలున్నాయి. ఇది ఒకప్పుడు బొంద'' అని చెప్పాడట. రెడ్డి కోప గించుకొని అక్కడ త్రవ్వించగా పట్టాభి చెప్పినట్లే అస్థి పంజరం బయట పడ్డదట. రెడ్డి ఆశ్చర్యపోయి పట్టాభిని అభినందించి, 35 ఎకరాల భూమిని మాన్యంగా ఇచ్చాడట. దాన్ని 'బొక్కల మాన్యం' అని పిలిచేవారట.

పట్టాభి తాను చనిపోవటానికి ముందే, ఇక మూడు రోజుల్లో తాను చని పోతానని చెప్పి, కులంవారికందరికి విందు చేశాడట. చెప్పినట్లుగానే మూడవ రోజు కన్నుమూశాడట.

ఈయన ఒక హరికథను, ఒక యక్షగానాన్ని, ఒక కావ్యాన్ని రచించి నట్లు తెలుస్తున్నది. ఈయన కుమారుడు కీ.శే. డొక్క రామేరం గారిని రాయిన్ పేటలో 1986 లో కలిసి అడిగినప్పుడు ఆ గ్రంథాలు తన సోదరుల వద్ద ఉండి ఉంటాయని చెప్పారు. మరో కుమారుడు డొక్క శ్రీరాములుగారిని అడిగినా ఆ గ్రంథాలు ఎవరివద్ద ఉన్నాయో తెలియలేదు.

పైన పేర్కొన గ్రంథాలే కాకుండా ఆయా సందర్భాల్లో డొక్క పట్టాభి రాములు రచించిన కొన్ని పాటలు దొరికాయి. వాటిని ఈ కింద ఇస్తున్నాను.

ఈ పాటలో త్రిమూర్తులను కవి అభేదభావంతో స్తుతించాడు. త్రిమూర్తు లను ఏకమూర్తిగా దర్శించాడు.

## 1

పల్లవి : ఎప్పుడేలే ధీరులూ - త్రిమూర్తులు - ధాత్రీలోపల శూరులూ
ఎప్పుడెప్పుడు తప్పకను - నా కప్పుడే కనిపించనైతే
మెప్పుగా గులాల్ బుక్క - గుప్పు గుప్పున జల్లనౌదు ॥ఎప్పు॥

చరణం : 1. రక్షింతువని నమ్మితీ - ఓం నమశ్శివా - లక్ష్మినాయకవేడితీ
వక్షమున సిరిగల్గు వాడవు - రాక్షసాంతక పక్షివాహన
కుక్షిలో నెనరుంచి నాపై - రక్షకుడవై బ్రోవరాదే ॥ఎప్పు॥

చరణం : 2. రంగనాయక రారా - ధరుణి - సింహాసనమైనావురా
రామ తారక బ్రోవ నేర్చిన - కావవే కైలాస నాయక
వరదుడా మార్తాండతేజా - కరుణతో నను బ్రోవరాదా ॥ఎప్పు॥

చరణం : 3. పీతాంబర దీక్షితులూ - వరవీరభోగ రాజా రామయోగులు
రార పంచ బ్రహ్మ నీ - వక్షమున రుద్రాక్షలాడగ
పంచబ్రహ్మను గన్న తండ్రి - పరమ గురుడవు నీవె
యనుచును ॥ఎప్పు॥

చరణం : 4 నిత్యాత్మ రఘురామా - కమలాధిపతి - దివ్యాత్మలింగామా
కపట నాటక కంస సంహార - కాల కంధర గట్టునాయక
దిట్టముగ పట్టాభిదాసుని - రెట్టవట్టుక బ్రోవరాదా ॥ఎప్పు॥

## 2

పల్లవి : వరవీర భోగ వ - సంత రాయుడ నీకు
వందానమిదుగో గోవిందానందా ॥వర॥

చరణం : 1. ధాత్రీలో నీ నామా - పత్రికలును చదివి
చిత్రామై తోచె ఈ - రాత్రింతలోనా ॥వర॥

చరణం : 2. మున్నూ విభీషణుని - పన్నూగ బ్రోచీనా
కన్నతండ్రివని - నిన్నే పిలిచితి
చెవ్వుల వినవూ - నన్నూ గనవూ
ఎందుబోదూ - నేనెందుబోదూ ॥వర॥

చరణం : 3. తల్లీదండ్రులు నాకు - అన్నాదమ్ములు లేరూ
తండ్రీవై రక్షించూ - ఈ ధాత్రీలోనా ॥వర॥

చరణం : 4. దిట్టముగను డొక్కా - పట్టాభి దాసుని
జెట్టీపై రక్షించూ - ఇట్టి దీనూని ॥వర॥

## 3

ఈ పాటలో రెండే చరణాలు దొరికాయి.

పల్లవి : కోపమా - నగరాజ వల్లభ - కోపమా
గంగాధర హర కోపమా - గౌరి మనోహర కోపమా

అనుపల్లవి : కోపమా నగరాజ వల్లభ - నీ పదాబ్జము వేడినందుకు
ఛూపవై తివి నీదు కృప - నా పాపమేమొ తెల్పుమన్నా ॥కోప॥

చరణం : 1. అజాని శిరము వధించి జగతిలో - విజయుపై భిక్షంబు చవిగొని
త్రిపురములు గెలిచినట్టి - భుజంగ భూషణ దేహియన్నా ॥కోప॥

చరణం : 2. జంగమాకృతి దాల్చి శిరమున - గంగనిడుకొని తిరుగమరిగియు
శశాంకధర నిన్ను వేడినందుకు - కరుగదేర నీదు మనసు ॥కోప॥

## 4

అంకితంగా చెప్పే చరణం ఒకటే ఉండవలసి ఉండగా ఈ పాటలో అలాంటి రెండు చరణాలు కనిపిస్తాయి.

పల్లవి : యాదున్నదా యాది లేదా నీకు
బాగున్నదా బాగలేదా నీకు ॥యా॥

చరణం : 1. ఎక్కడి సుతులు బాంధవులు - తిక్క ముండ కొడుక నీకు
అల్పులతో స్నేహమొందు - అగడు జేతురన్నమాట ॥యా॥

చరణం : 2. ఎంచరాని పాపములు - సంచితముగ త్రుంచి గురుని
పంచతత్వములో మెరయు - పరమ పదవి జేరె దారి ॥యా॥

చరణం : 3. వాసిగా శ్రీరంగపురము - వాసుడైన మారుతిని
ధ్యాస జేయు చుండు గురుని - గాసి దొలగునన్న మాట ॥యా॥

చరణం : 4. వాసిగాను సిరిసెనగండ్ల - ఈశుడైన రామదాసు
గట్టిగ పట్టాభిదాసు - రెట్టవట్టి బ్రోచుచుండు ॥యా॥

బుడిగె జంగాలు అనేక కళా ప్రక్రియలను ప్రదర్శించటంవల్ల, అసంఖ్యాకంగా పాటలు, పద్యాలు వీరికి కంఠస్థమై ఉండటంవల్ల ఆ ఒరవడిలో కొందరు పాటలను కూర్చగలుగుతున్నారు. పద్యాలను అనుకరిస్తూ పాదాలను అల్లుతారు. వీరికి శాస్త్రజ్ఞానం లేనందువల్ల వీరి రచనలు దోషభూయిష్టంగా ఉంటాయి. ఉదాహరణకు మహబూబ్‌నగర్ జిల్లా, హన్వాడ మండలం, మునిమోక్షం గ్రామవాసి పొన్నకంటి రాములు అల్లిన ఈ కింది రచనను చూడవచ్చు:

సొంటెలు పొనకంటులు కుల - మంటుంటెను వింటె మనసు తంటలో
బడియెన్ శుంఠలు ప్రతి ఇంటికి అ-న్నుంటరు ఇది తెలుసుకుంటె అంతే చాలున్.

వివరణ : ఇది కంద పద్యాన్ని పోలిన రచన. బుడిగె జంగాల్లో 'పొన్న కంటి' అనే ఇంటి పేరుగలవాళ్ళను అందరు 'శుంఠలు' అని అంటున్నారని పొన్నకంటి ఇంటి పేరుగా ఉన్న ఈయన బాధపడుతున్నాడు. ప్రతి వంశం లోనూ 'శుంఠలు' ఉంటారనే విషయాన్ని అందరు తెలుసుకుంటే మంచిదని అతని భావన. అలాంటిదే మరో అనుకరణ.

తప్పులుగల మనుజులు తమ-తప్పులు బలె కప్పిపుచ్చి గొప్పలు బల్కన్
తిప్పలబడుదురు తదుపరి - ఎప్పుడొ ఏవేళనొ ఇది ఎరుగరు ఎవరున్.

పొన్నకంటి రాములు తమ కులస్థులను దృష్టిలో పెట్టుకొని కూర్చినదే ఈ కింద ఉదహరించిన ప్రబోధ గీతం.

పల్లవి : కల్లుదాగి కలవరించకూ - ఓ కారిగా - ఇల్లాలిని ఏడిపించకూ
కల్లుదాగి కలువరిస్తు - తెల్లవార్లు లొల్లిజేస్తె
తల్లి పిల్లలాకు నిదుర - కళ్ళకేమొ రాదాయె ॥కల్లు॥

చరణం : 1. కల్లబొల్లి మాటలాడకూ - ఓ కారిగా - పిల్లలాను కష్టపెట్టకూ
పిల్ల తల్లిదండ్రులేమొ - తల్లడిల్లి తగువులాడ
పుల్లగడ్డె ఎల్ల కులము - చెల్లనోడవని తిడ్డురు ॥కల్లు॥

చరణం: 2. మారవేమి మంచి గుణముకూ - ఓ కారిగా - మర్యాదవీడి మాట
లాడకూ - దారు దుకాణానికెళ్ళి - సారను కడుపార తాగి
భార్యపుత్ర మిత్ర బంధు - బలగంబుల దూరెదావు ॥కల్లు॥

చరణం: 3. పొల్లుగావు ఇట్టి మాటలూ - ఓ కారిగా - పొన్నకంటిరాములన్న నీతులూ
ఒంటరితనంబు మాని - జంటగ కాలంబు పూని
సంటి పాపలను సాకి - సాలెబళ్ళ కంపుమంటి ॥కంపు॥

ఆంధ్రప్రదేశ్ బుడిగె జంగం సంక్షేమ సంఘం పక్షాన ఏప్రిల్ 1989 లో ప్రచురించిన 'బుడిగె జంగం వాణి' లో కొన్ని పాటలను ముద్రించారు. వాటిలో నుంచి గుడిసె పాట, వేటపాట, ఈతకమ్మ కోసే పాట అనే మూడు పాటలను 'వస్తు సంస్కృతి' అనే ప్రకరణంలో ఉదాహరించటం జరిగింది. బుడిగె జంగం భాషా పదాలు, తెలుగు పదాలు కలగలిపి రచించిన వారి కుల ప్రబోధ గీతాన్ని ఇక్కడ ఉటంకిస్తున్నాను.

పల్లవి : కారిగాల్ల సంఘము కదిలొచ్చెరో
దారిజూపి బతకమని పిలుపిచ్చెరో ॥కారి॥

చరణం: 1. మంకాల్లా కసింపులూ - మనన్యాస్టా పెట్టగా
యాస్కానికి జానోకకు - నాగన్నా శిర్పగా
మత్తైలోన వాలోకక - మంచిపనికి పూనుకో ॥కారి॥

2. కనికొంట్లకు కళాదాలు - పచ్చాముకు దైవాలు
శావిడికీ కంచ్కాలకు - శాంతుల పల్కావటాలు
బంజెయ్‌రా జంగామా - బతుకుదాము సంఘానా ॥కారి॥

3. పింకెల శేతులకూ - బోడ్కాలేగియ్యకూ
పచ్చాముూ కట్టాలు - శేతుల సుట్టియ్యకూ
సాలెకేసీ సదువుజెప్పి - సక్కనోల్ల జేతాము ॥కారి॥

4. సదువుకునే పింకెలకూ - పుస్తకాలు కంచికాలూ
శావిడి కెందాలిచ్చి - విద్యాబుద్ధులు జెప్పి
కొల్వుకు జానొస్తై వాన్ని - కోరి అంటుకుంటారు ॥కారి॥

5. మ్యారదిప్పి పూటకేసి - తోడ్పిగాడున్నానిగాడు
చింతాకూ జీడ్యాకూ - మెస్కి ఎన్కేసుకొని
అల్లుండ్లను గోసబెట్టె - ఆలోచన మానాలి ॥కారి॥

6. కొట్లాడీ పుల్లగట్టి - నలువూ సిదానం బెట్టి
ఇల్లంతా గుల్లైతే - మల్లా అప్పుల్లబడీ
చితికిపోతవ్ నెట్కి - బాగుపడి రాపైకి ॥కారి॥

7. మట్టిగాల్లు మనుషులే - మనం గూడ మనుషుల మే
వాల్లేమో గట్లయిరి - మనమెందుకు గిట్లయితిమి
గూసయ్యే మన కులమూ - గుర్తెరిగి సాగుదాము ॥కారి॥

పై పాటలో వచ్చిన బుడిగె జంగం భాషా పదాలకు అర్థాలు:
కారిగాల్లు=బుడిగె జంగాలు, మంకాల్లు=కులేతరులు
కసింపులు=తిట్లు, యాస్కానికి=భిక్షానికి
జానోకకు=వెళ్ళకు, నాగన్నా=వద్దు
శిర్పగా=పిల్లవాడా (బుడిగె జంగం), మత్తైలోన=ఇంటిలోన
వాలోకక=కూర్చొక, కనిక + ఒంట్లకు

కనికొంట్లకు=మందులివ్వటం, జాతకాలు చెప్పటం అనే పనులకు
కశాదాలు=అపాయాలు, వచ్చాము=ఈత ఆకు
దైపులు=దెబ్బలు, శాపిడికి=అన్నానికి
కంచ్యాలకు=డబ్బులకు, శాంతుల=స్త్రీల
వల్యాట్వటాలు=భిక్షం అడుక్కోవటం, పింకెల=పిల్లల
బోడ్యాలు=గిన్నెలు, ఏగియ్యకు=ఇవ్వకు
కెంద=వస్త్రం, జానొస్తే=వస్తే
అంటుకుంటారు=తీసుకుంటారు, తోడ్సిగాడు=ఉడత
మ్యార = వరుడు అత్తగారి వెంట సంచారంచేస్తూ సేవలు చేసుకుంటూ ఉండటం
ఉన్నానిగాడు = ఎలుక, పూట=వరుడు కులపెద్ద వెంట సంచరిస్తూ భార్యను కష్టపెట్టకుండ బాగా చూసుకుంటూ జీవించటం. మెస్కి=తిని
నలుపు=సార, సిదానం=కల్లు
నెట్కి=చూడు, గూసయ్యే=అవమానం పొందింది.

పాటలోని భావం :- బుడిగె జంగాల సంఘం కదిలి వచ్చి అభివృద్ధి మార్గంలో అడుగు పెట్టాలని పిలుపు ఇస్తున్నది. భిక్షాటన చేస్తూ ఉంటే అందరు తిడుతున్నారు. ఇది నీచమైన పని. దీన్ని మానుకోవాలి. ఏదైనా గౌరవ ప్రదమైన పని చేసుకొని బ్రతకాలి. మూలిక లివ్వటం, జాతకాలు చెప్పటం మొదలైనవి ఇప్పుడు హాని కారకాలయినాయి. ఈతకమ్మ కోయబోతే కొడుతున్నారు. ఈత చాపలు అల్లటానికి ఈతకమ్మ కరువైపోతున్నది. స్త్రీలు, పిల్లలు భిక్షం అడగటం మానాలి. పిల్లలను అడుక్కోవటానికి పంపకుండ బడిలో చేర్చి, చదివించాలి. చదువుకునే పిల్లలకు పుస్తకాలు, స్కాలర్ షిప్పులు ఇవ్వటమే కాకుండ చదువు ముగిశాకా రిజర్వేషన్‌లో ఉద్యోగాలు ఇస్తారు. ఆడపిల్లలను అమ్ముకోవటం (కన్యాశుల్కం), వర సేవా వివాహ పద్ధతులు, ఎప్పుడు తగవులాడి కులపంచాయతులు పెట్టుకొని కల్లు సారాలతో విందులు చేసుకోవటం - ఇవన్నీ మానాలి. సమాజంలో ఇతర కులాలవారిలాగా మనం కూడ మారాలి. ఇప్పటికైనా కళ్ళు తెరిచి ప్రగతి బాటలో నడుద్దాం.

ఈ విధంగా బుడిగె జంగాల్లో పాటో, పద్యమో అల్లేవాళ్లు అక్కడక్కడ కనిపిస్తారు. వాళ్ళ పాటలు తరతరాలుగా పయనిస్తూనే ఉంటాయి. 'ఈ పాటను నేను అల్లాను' అనే గుర్తింపును వీరు కోరుకోరు. చదువు సంధ్యలు రాని కారణంగా వాటిని గ్రంథస్థం చేయలేరు. అందువల్ల మౌఖిక సంప్రదాయంలో ఇలాంటి పాటలు ముందు తరాలవారికి అందుతూనే ఉంటాయి.

ఈ ప్రకరణంలో బుడిగె జంగాల భాష, భాషలో కనిపిస్తున్న కొన్ని వ్యాకరణ నియమాలను వివరించటమే కాకుండా, వీరి సాహిత్య సంపదను విశ్లేషించటం జరిగింది. పలుకుబళ్లు, సామెతలు, పొడుపు కథలు, వీరు వృత్తి పరంగా చెప్పే కథా గేయాలు, కులపరమైన కథలు, వృత్తి కళల ప్రదర్శనల్లో, భిక్షాటనలోపాడే గేయాలు, ఈ కులంవారే అల్లిన కొన్ని పాటలు మొదలైన వాటిని గురించి ఇందులో వివరించటమయింది.

# ఉపసంహారం

ఈ సిద్ధాంత వ్యాసాన్ని ఆరు ప్రకరణాలుగా విభజించాను. మొదటి ప్రకరణం 'బుడిగె జంగాలు - సంస్కృతి పరిచయం.' ఇందులో జాతి, కులం, తెగ నిర్వచనాలు, బుడిగె జంగాల కులలక్షణాలు, వృత్తులు. సంస్కృతి నిర్వచనం గురించి చర్చించటం జరిగింది.

రెండవ ప్రకరణమైన 'జంగం కులాలు'లో 'జంగం' శబ్ద విచారం, ఉపకులాలుగా చీలిపోయిన జంగం, మాల జంగం, బేడ జంగం, బుడిగె జంగం కులాలను గురించి వివరించటమే కాకుండా, బుడిగె జంగాలకున్న ఇతరమైన వ్యవహారనామాలు కూడ పేర్కొనబడ్డాయి.

మూడవ ప్రకరణం వృత్తి కళారూపాలు లేక వృత్తి వేషాలు. బుడిగె జంగాలు ప్రదర్శించే వృత్తి కళారూపాలను ఏకవ్యక్తి వృత్తి కళారూపాలు, సామూహిక వృత్తి కళారూపాల పేరుతో రెండు భాగాలు చేసి, 'ఏకవ్యక్తి వృత్తి కళారూపాలు' శీర్షిక కింద తుపాకి రామునివేషం, బ్రాహ్మణ వితంతువు వేషం, బాలసంతు వేషం, కోయపంతు, ముత్తడి పంతు. ఏకతార పంతు, ఇతరాలు అనే అంశాలను వివరించటం జరిగింది. రెండవ భాగమైన 'సామూహిక వృత్తి కళారూపాలు' శీర్షిక కింద జంగం కథలు/శారద కథలు, తోలుబొమ్మలాటలు, వీధి భాగోతాలు, పగటివేషాలు, కాటిపాపల వేషాలు, మందెచ్చు వేషాలు, గురవ్వల వేషాలు, నాటావంతు ఇతరాలు అనే అంశాలను విశదీకరించటం జరిగింది.

నాల్గవ ప్రకరణం ఆచార సంప్రదాయాలు. ఇందులో మొదట ఆచారాన్ని, సంప్రదాయాన్ని నిర్వచించి, బుడిగె జంగాల ప్రసూతి, సమర్త, నిశ్చితార్థం, వివాహం, చావు - కర్మకాండ, ఆరాధనా పద్ధతులు, కుల పంచాయతులు, పండుగలు, నమ్మకాలు, ఇంటిపేర్లు, వేట, జానపదవైద్యం మొదలైన ఆచార సంప్రదాయాల తీరుతెన్నులను చర్చించటం జరిగింది.

ఐదవ ప్రకరణమైన 'వస్తు సంస్కృతి'లో బుడిగె జంగాల ఇండ్లు, ఇంటిలోని వస్తువులు, ఇండ్ల నిర్మాణం, ఆహారపానీయాలు, దుస్తులు ఆభరణాలు, పశు సంపద, చేతిపనులు మొదలైన అంశాలు వివరించబడ్డాయి.

ఆరవ ప్రకరణం భాషా సాహిత్యాలు. ఇందులో బుడిగె జంగాల పరిభాష లేక సంకేత భాషా విశ్లేషణ, జాతీయాలు - పలుకుబళ్ళు, సామెతలు, పొడుపు కథలు, కథలు, గేయాలు, బుడిగె జంగాల రచనలు అనే శీర్షికలలో బుడిగె జంగాల భాషాసాహిత్యాల్లోని విశేషాలను పట్టిచూపడం జరిగింది.

బుడిగె జంగాలు చెప్పే 'జంగం కథలు' చాలావరకు ప్రచురింపబడ్డాయి. వీరు వీధిభాగవతాలకు ఉపయోగించే యక్షగానాలు కూడ అచ్చులో దొరికేవే. ఈ అంశాలమీద పూర్వ పరిశోధకులుకూడ కొంత కృషి చేశారు. అందువల్ల ఇలాంటి వాటిని స్పృశించి వదిలేయటం జరిగింది. బ్రాహ్మణ వితంతువు, బాలసంతు, తుపాకి రాముడు, వడ్డెర వేషాలు మొదలైన వృత్తి కళారూపాల పూర్తి ప్రసంగ పాఠాలను సేకరించి సిద్ధాంత వ్యాసంలో పొందుపరచటం అపూర్వమైన కృషి. ఇంకా కొన్ని వృత్తి కళారూపాల ప్రసంగాలను సేకరించవలసి ఉన్నది. ఒక్కొక్క కళారూప ప్రదర్శనలో వీరి ప్రత్యేకతను పట్టి చూపటానికి సూక్ష్మ పరిశీలనలు చేయవలసిన అవసరం ఉంది.

బుడిగె జంగాల 'కుల పంచాయతులు' ప్రత్యేకంగా పరిశీలించదగ్గవి. సాంగోపాంగాలతో, నిర్దుష్టమైన లక్షణాలతో పటిష్టమైన కట్టుబాటుగా కొనసాగుతున్న ఈ కుల పంచాయతులు విషయవైవిధ్యంతో కూడుకొని ఉన్నాయి. కుల పంచాయతుల్లో కులపెద్దలు సందర్భానుసారంగా చెప్పే 'సాటువలు' వందల్లో లభిస్తాయి. అలాగే వీరి వేట విధానంకూడ ప్రత్యేకమైన పరిశీలనకు అర్హమైన అంశం.

జానపద విజ్ఞాన నేపథ్యంలో కుల సంస్కృతి అంశాలను గురించి వివరంగా పరిశీలించటానికి ఇందులో ప్రయత్నం చేశాను. అయినా, యింకా సూక్ష్మ పరిశీలన చేయటానికి అవకాశం లేకపోలేదు.

భాషా సాహిత్యాల ప్రకరణంలో 200 పైగా వీరి పరిభాషా పదాలు ఇవ్వబడ్డాయి. ఇందులో మొదటి వ్యాసం భాషా విశ్లేషణకు సంబంధించింది. ఇది భాషా శాస్త్రజ్ఞుల దృష్టిని ఆకర్షించి, భావి పరిశోధనలకు ఉపయోగపడవచ్చు. ఇతర తెగల పరిభాషలతో తులనాత్మక అధ్యయనం చేయటానికి ఉపకరించవచ్చు.

మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాల్లో నివసిస్తున్న బుడిగె జంగాల మాతృ భాష తెలుగే. వీరి భాషా సాహిత్య సంస్కృతుల మీద ప్రత్యేకమైన అధ్యయనం చేయవచ్చు.

'జంగం' శబ్దం 'వీరశైవుడు' అనే అర్థంలో మతవాచకంగా ఉండేది. 13 వ శతాబ్దం నుంచి అది కులవాచకమైంది. ఆ తర్వాత 'జంగం' కులం అనేక ఉపకులాలుగా చీలటం ప్రారంభమైంది. బుడిగె జంగాల వివిధ వృత్తి వేషాలను గమనిస్తే, 'వీరశైవ మత స్వీకారానికి ముందు వీరు బహుకులాలవారా? అప్పుడు వీరిది ఏ కులమై ఉంటుంది?' అనే ప్రశ్నలు ఉదయిస్తాయి. వీరు తోలుబొమ్మ లాటలను ఆరెవాళ్ళ నుంచి; వగటివేషాలను, వీధి భాగోతాలను కూచిపూడి బ్రాహ్మణుల నుంచి: మందెచ్చు వృత్తివేషాన్ని ఒగ్గు కథకులైన ఎర్రగొల్లల నుంచి నేర్చుకున్నారు. అలాగే మహారాష్ట్ర నుంచి తెలుగు రాష్ట్రానికి (ఎల గందల) వచ్చిన హర్నామ్ సన్యాసి నుంచి సన్న్యాసివేషాన్ని నేర్చుకున్నారు. ప్రక్క- రాష్ట్రాల్లో ఉన్నట్లు పూర్వ పరిశోధకుల చేత వర్ణింపబడ్డ 'బాల సంతోష'కు అనుకరణంగా బుడిగె జంగాల 'బాలసంతు' వృత్తి వేషం కనిపిస్తు న్నది. 'మసాన్ జోగి', 'సుడిగాడు సిద్ధ' అని పొరుగు రాష్ట్రాల్లో పిలువబడు తున్న భిక్షకుల లక్షణాలున్న వృత్తే 'కాటి పాపల' పేరుతో వీరు కొనసాగిస్తు న్నారు.

13 వ శతాబ్దంలో 'జంగం' ఒక కులమైనట్లుగానే 'బలిజ' కూడ కొత్త కులంగా ఆవిర్భవించింది. అయితే, బలిజ కులంగా ఏర్పడ్డవారు వీరశైవం స్వీక రించకముందు బహుకులాలకు సంబంధించినవారుగా కనిపిస్తారు (తెలుగు శాసనాల సామాజిక సాంస్కృతిక అధ్యయనం - పుట 620) త్రిపురాంతక శాసనంలో 'వీర బలంజ ధర్మ ప్రతిపాలనులు' అంటూ పేర్కొన్న బలిజల వ్యక్తి నామాల్లో రాజు, రడ్డి (రెడ్డి), నాయుడు, సెట్టి, కుమ్మర, బోయండు మొదలైన కులవాచక శబ్దాలు ఉండటం పై విషయాన్ని నిర్ధారణకు తెస్తున్నది. ఈ దృష్టితో 'జంగం' కులాన్ని పరిశోధించవలసి ఉన్నది.

ఇటీవలి కాలంలో బుడిగె జంగాలు పట్టణాలకు, నగరాలకు వలసలు ప్రారంభించారు. సంచార జీవనానికి స్వస్తిచెప్పి, స్థిర నివాసులౌతున్నారు. పట్టణ

నగరవాసులు విద్యా, ఉద్యోగ రంగాల్లో మెల మెల్లగా అడుగుపెడుతున్నారు. అనేక కొత్త వృత్తుల్ని నేర్చుకుంటున్నారు. ఈ కొత్త పోకడలు వీరి జీవన విధానం మీద ప్రభావాన్ని చూపిస్తాయి. వీరి కుల సంస్కృతిమీద ప్రభావాన్ని చూపిస్తాయి. ఈ పరిణామాలను విశ్లేషిస్తే వీరి జీవన వికాసశీలం అవగాహనకు వస్తుంది.

మన రాష్ట్రంలో 33 గిరిజన కులాలు, 59 షెడ్యూలు కులాలు, 92 వెనుకబడిన కులాలతోసహా అగ్రవర్ణాలతో కలుపుకొని మొత్తం 180 కి పైగా ఉన్నాయి. వీటిలో జానపద కళారూపాలను ప్రదర్శించి పొట్టపోసుకునే భిక్షుక కులాలు అనేకం ఉన్నాయి. వృత్తి గాయకులైన వీరి సాహిత్య సంస్కృతుల మీద అధ్యయనం చేయవచ్చు. ఆ విధంగానే ప్రవృత్తిగాయకుల కులసంస్కృతి, సాహిత్యాలమీద పరిశోధనలు చేయవచ్చు. ఇలాంటి పరిశోధనలు జానపద విజ్ఞాన పరిశోధనా పరిధిని విస్తృతంచేసి, తద్వారా మానవుని సంస్కృతీ చరిత్రను పునర్నిర్మించుకోవటానికి మార్గం సుగమం చేస్తాయి.

అనుబంధం - 1

# తుపాకిరాముడు (పిట్టలదొర) వేషం—ప్రసంగ పాఠం

ప్రాసంగికుడు : పదుల రామలింగం దేవునిపల్లి, మహబూబ్‌నగర్ జిల్లా.

చలోప్, చలోప్, ఫ్రెండియాం, యస్ యస్ పుస్‌పుస్, వాట్ వూట్, రైట్ లైట్. జల్ది ఉటాయించాలె ఇక్కడ. జప్తి ఉటాయించాలె ఇపుడు గోలిడువాలె ఇక్కడ, గుండిడువాలె. సర్కార్ ఉక్కు దెచ్చినిపుడు. దండొచ్చి ఆగింది. దండుమీదికి లడాయికి బోయిన, పొద్దంత నిన్నటిదిక్కే పోతవుంది. నిన్నటినుంచి దండుమీద లడాయి జేసిన్నంటె ఇపుడు ఒక్కొక్కటి గుండిడ్సిపెట్న ఇపుడు. ఒకటే గుండుకు మున్నాటరవైమంది పడిపోయిండ్రిపుడు. గుండువొయ్యి గుండ్లపల్లి చెరువులబడ్డే నేన్‌వోయి తుంగమడ్గుల బడ్డ. అంత పెద్ద లడాయ్ జేసిన్నంటె యిపుడు నా భయాన్కి దండంత దెంక పొయ్యింది.

ఇక్కడ ఊరిబైట యిపుడు సర్కారి బంగ్లల్ గట్టిపిస్తున్న. ఒక్కొక్కటి బంగ్లలంటె పెద్ద పెద్ద బంగ్లలు వడ్తున్నయ్. ఏదంత్రాల బంగ్లలు. బంగ్లకొక్క లక్ష రూపాయల్ కర్సైపోతున్నయ్. అద్దాల జిలేమాల్. గాలివెత్తె గలగల. వానపత్తె జల జల. తుంగ వాసాలు. వరిగడ్డి దూలాలు. వర్ర్యాకు కప్పు. ఏపెయి నిచ్చెన్లు. మీదికెల్లి వానబత్తవుంటె ఇపుడు బంగ్ల కిందికేలి వానసీల్లు పడిపోత ఉన్నాయ్. అటువంటి గట్టి బంగ్లలు బడ్తున్నయ్.

ఇక్కడ మన రాజ్యానికి పెద్దరాజు ఉన్నదంటే, రాజు చేతి కింద పెద్ద ప్రతాని ఇపుడు నేనే వుంద. రాజు మాటకంటె ఇంక జెర్రంత మాట నాది

ఎక్కువగ సాగుతుంది. రాజు చేతికింద యిపుడు ఎంతమందిమి ప్రతాన్ల మున్నమంటె అల్లం సాబ్, బెల్లం సాబ్, కొతిమీర్ సాబ్, లవంగ సాబ్, లత్కోర్ సాబ్, వటవట లింగడు, వొంటిపిర్ర గంగడు, తూట్ల ఎల్లడు, దబ్బాల ముత్తడు, తుర్రు పోశిగాడు, గాండ్ల సంగడు, పొయ్లి విత్తడు, మర్నాగి గుద్దోడు, కుందేలు పిచ్చలోడు- ఇంతమందిమి ప్రతాన్ల మున్నమంటె అందరి మాటకన్న నామాట జెర్ర ఎక్కువ సాగుతుంది. మాట ఎక్కువ సాగినందుకు పెద్ద పేరొచ్చింది. అది చాలా మంచి పేరు. ఏంపేరంటే '**లత్కోర్‌సాబ్**' అని పేరొచ్చింది. అందుకొరకు సర్కార్‌గల్ల మొత్తాన్ని మాఫ్‌జేసిన. లత్కోర్ సాబ్ గల్ల వసూల్ జేస్తున్న. లత్కోర్‌సాబ్ గల్ల యిపుడు ఎంత వసూలైం దంటే, ఇంటికి మానెడు, ఇంటికి మానెడు, ఇంటికి మానెడు బియ్యం వసూల్ జేస్తున్న. ఈడికైన యిపుడు ఏడుపుట్ల బియ్యం వసూలైతే ఎల్కతోక మీద గట్టి పంపిన ఇపుడు బంగ్లకాడికి. నాల్గువేల రూపాలు వసూలైతే నల్లిమీద గట్టి పంపిన ఇపుడు. లారికంటె ఎక్కువ గుంజకపొయ్యింది బర్రి. ఎందుకంటె, బంగ్ల కాద దావత్‌జెయ్యనింకె బియ్యం గొండవొయిన చెరువుల నానబోసిన, తూము కింద మంటబెట్న. పొట్టుపొలావ్ జేశ్న. తౌడు చాయ్ జేసి పెట్న. చాల మందిని పిలువనంపిన బంగ్లకాడికి భోజనాలకు. మొకం కడుకోని రమ్మంటే మొకం కడుకోకనే వచ్చింద్రు భోజనాలకు బంగ్లకాడికి. వాండ్లకు ఏమి కూర గాయలు వొండి పెట్టినంటే- అటువంటి కూరగాయలు మీరు గూడంగ ఎన్నడు బోంచేయలేదు. అంత మంచి కూరగాయలు జేపిచ్చిన. పొవ్వాకిత్తులు పోగుసే పిచ్చిన. గాంచునూనె తాలింపేసిన. ఒక సంచి ఉప్పు వోసిన. ఒక మెర్పకాయ వేసిన. ఒక బస్త యాపకాయ దెచ్చిన. పచ్చిపులుసు పిసికిబెట్టిన వాండ్లకు. పొట్ట నింద అన్నం దినాలంటని జమ్మాకేమో ఇస్తర్లేసిన. తుమ్మాకేమొ దొల్లలు గుట్టి చ్చిన. ముగ్గురి నడుమ ఒక్క మెతుకు ఇరిసి పెట్టిన. పొట్టనింద దింటవుందరు. పొట్టమీద బట్టేసుకొని వచ్చింద్రు. బట్టెందుకంటె దిష్టి దగలకుండ. మిగిలిన అన్నమంత పెంటమీద పారెస్తవుంటే కుక్కలు గూడంగ దింటలేవు. అట్లనె మర్లవడిపోయింది. అన్నమంత ఎక్కువైపోయింది మా బంగ్లకాద.

ఇక్కడ మా బంగ్ల కాద ఏమి తక్కువుందిప్పుడు. అంతా మస్తుగనె వుండె. ఇంటెన్క ఎండే వుండే. ఇంటి ముందల ఎండే వుండే. చాట్ల ఎండే, గంపల ఎండే, మొంటెల ఎండే. ఇపుడు ఒక్కనాడు మన బస్తిలకెల్లి రాకుంటె పిలగాని గుద్దంతా ఎండ్తనేవుండే బంగ్లకాద.

ఒస్తాస్త ఇపుడు గుమ్మడికాయంత బంగారం కుక్క ముద్దేనే బాయిలేసొచ్చిన అంటే, నా ప్రాణమే కలకల అంటుంది. ఈడికైనా ఇపుడు మున్నూట అరవై మంది తయారైండ్రు బంగారం దెచ్చుకోనింకె. జుట్టుకేమొ గుండు గట్టుకుండ్రు. కాలుకేమొ బెండు గట్టుకుండ్రు. బాయిల మున్గి మున్గి జూస్తవుండరు. బంగారం దొర్కుతలేదు. వాల్లు బైటకెల్తలేరు. మునిగినోల్లందరు లోపలికె బోతవుండ్రు. తల్కాయె కిందికి కాళ్ళు మీదికై పోయినై.

ఇపుడు మన బస్తీలకేలి గూడంగ ఎవరు జూసిన లత్కోర్‌సాబొచ్చె, లత్కోర్‌సాబొచ్చె అని అంటవుండరు. మాట నడుస్తుందని జెప్పి చాలమంది నన్నే యాదిజేస్తవుండరు. ఒక్కనాడు మనం బస్తీకెల్లకుంటే లత్కోర్‌సాబ్ తిరగకుంటే బస్తంత కిందమీదంగ ఉల్టాపల్టా ఐపోతున్నదని వాండ్లు అనుకుంటరు. అందుకొరకు ఇప్పుడు నా మాట మీదనె నడుస్తవుందిప్పుడు. ఇపుడు రాజు మాట ఎవరు యింటలేరు. నా మాట చాలామంది యింటవుండరు. ఇంటింటికి, బస్తి బస్తికి, గల్లి గల్లికి మొత్తానికి నా మాట యింటవుండరు. ఎందుకంటనంటె, ఇపుడు కావాల్నంటె వంపిస్త తీసుకోండి. బియ్యం గావాల్నా, వొడ్లు గావాల్నా, దబ్బుగావాల్నా, ఎండిగావాల్నా, బంగారంగావాల్నా ఏ వొడ్ల బియ్యం గావాలిప్పుడు. వొన్నిను నంబరు బియ్యంగావాల్నా, గంట మొల్కల బియ్యంగావాల్నా, రాజనాలబియ్యం, గద్దరెక్కలు, కొంగముక్కులు, ఏక్ నంబర్ బియ్యం, దో నంబర్ బియ్యం, లంజ గుసగుసలు, రామక్క పిర్రలు, దొర్సాని సిగలు, దొర మీసాలు, తాటి గొల్కలు, ఈత పేళ్ళు, చిట్టిముత్యాలు, అక్కులు, బసంగీలు - ఇవన్నీ పంపిస్తున్న. ఈడికైనా ఏడుపుట్ల బియ్యముంటే మీది మోటరు మీద కట్టిపంపితే, కింది మోటరుకు టక్కరై పడ్తుంది బర్తి ఎక్కువైపొయి. ఈడికైనా ఏడువేల రూపాలు ఎల్కతోక మీద కట్టి పంపిస్తున్న, నాల్గువేలరూపాలుంటే నల్లితోకమీద కట్టి పంపిస్తున్నిపుడు. లారికంటె ఎక్కువ గుంజుకొస్తుంది బర్తి.

ఏం తక్కువైంది మా బంగ్లకాడ. అంతా మస్తుగనెవుండె ఇపుడు. ఎందుకంటె, బియ్యం గూడంగ ఎందుకు వసూలు జేస్తున్ననంటె, బియ్యమేమొ మా అత్త పెండ్లికి తలంబ్రాలకు గావాలె. వసూల్‌జేసిన దబ్బు మొత్తానికి మా అత్త పెండ్లికి కట్నాలకు గావాలె. మా అత్త పెండ్లికి మంచి మంచోళ్ళను పిలువ

నంపిన. వట వట లింగి, వొంటి పిర్రగంగి, తూట్ల ఎల్లి, దబ్బాల ముత్తి, తుర్రు పోసి, గాండ్ల సంగి, యింకా పొల్లయవిత్తి, తద్కలపోశి, బర్రెంకల ముత్తి పిల్లంద రొచ్చి కూసున్నరు. వాల్లకు ఏం జేసిననంటనంటే సూదిగాల్చి సుక్కబొట్టు పెట్న్య. కర్రుగాల్చి కాటుక పెట్న్య. గుండ్రాయి గాల్చి గుద్దకింద పెట్న్య. గడ్డ పారగాచ్చి వాతలు పెట్న్య. ఎర్ర ఎండల గూసుండ పెట్న్య. వచ్చిన వాళ్ళందర్ని మూర్రోజులాయె ఇపుడు కూసునవెట్టి. అట్లనె గూసున్నరు. పండ్లిగిల వట్టిండ్రు. ఇపుడు నోరు దెరిసిండ్రు. గుడ్లు మిక్కరిచ్చిండ్రు. చెవులు కొక్కిరిచ్చిండ్రు. నీల్గయ్య, నిక్కయ, గోడకు వొర్గయ్య, కాల్వట్టి గుంజయ్య, కాటికెయ్యవయ్య అని అంటుండ్రు.

ఇపుడు మా బంగ్లకాడ ఏంతక్కువుంది. బియ్యమంటె మస్తుగనె వుండె. ఈడికైన ఇపుడు ఏడేండ్లనాటి ఏడుపుట్ల బియ్యముండయి. పాతబియ్యం ముక్కిపోయినయ్. తినేటోడెవ్వడు లేకుండయిండు. కోడికేతమంటే ఐదిత్తులు లేకుండైనయ్. మాపుదింటె రేపులేదు. రేపుదింటె మాపులేకుండయింది. అందు కొరకు ఇక్కడ పాతబియ్యము మాపుజేసిన. కొత్త బియ్యము వసూలుజేస్తున్న. కొత్త బియ్యం కొండవాయి కోళ్ళకేస్తున్నిప్పుడు. కోళ్ళకు మూతిగట్టి మూతి ముందల గింజలేస్తె మూర్రోజులాయె తినక. అవిటిగ్గూడంగ ఎక్కువైపోయింది. అందుకె గల్లి గల్లి దిరిగి గల్ల వసూల్ జేస్తున్న. జెల్ది జెల్ది దేండ్రి. జప్పున దేండ్రి. లేకుంటే తుపాకేస్త.

* * *

అనుబంధం _ 2

# బ్రాహ్మణ వితంతువు (బోడి బాపనమ్మ) వేషం – ప్రసంగ పాఠం

ప్రాసంగికుడు : ని॥ రామచంద్రం, మీర్ పేట, రంగారెడ్డి జిల్లా.

ఏణోనారాయణా![1] అయ్యో! నా తల్లీ! వెంకట్రాయుడుండగ నేనిట్లుంటినా? అయ్యవారు చెయ్యెత్తు మనిషి. అయ్యవారు ఏడగూర్చున్నాగాని, రోతల్నే గూర్చునేది! అయ్యో! రోతల గాదమ్మ! రాతల! రాతల గూర్చునేది. అయ్య వారికి మేమేడుమంది భార్యలం. సుబ్బమ్మ, శేషమ్మ, రమణమ్మ, గాయిత్రమ్మ, అలివేలమ్మ, క్రిష్ణమ్మ, నా పేరు బాగీరత్తమ్మ. నేనంటే అయ్యవారికి ప్రాణమంటె ప్రాణం. 'బాగీర్తా! బాగీర్తా! ఎక్కడ గూర్చున్నాగాని నాకేం లాభం లేదు, నా తొర్ర మీద కూర్చుందురావే! తొర్రమీదగాదమ్మా! తొడమీద. నాతొడ మీద గూర్చుంద రావే!' అని పిలిచేవారు.

ఎటువంటివాడు వెంకట్రాయుడు! భలే బుద్ధిమంతుడు. ఏం బుద్ధి అంటె కునకనాథుని[2] బుద్ధీ, తన బుద్ధీ ఒకటే. అయ్యవారు వెంకట్రాయుని చూపు ఏం చూపంటే-మార్జాలం చూపు వెంకట్రాయుని చూపు. అయ్యవారు వెంకట్రాయుని నడకేం నడకంటే, వెంకట్రాయుని నడక గార్దభం నడక. వెంకట్రాయుడు మనిషంటే మనిషి. చేయెత్తు మనిషి! ముంగట బొర్రఉండె, ఎన్క తొర్ర ఉండె. అయ్యో....వెంకట్రాయుడు....(ఏడ్పు)

---

1. 'ఏకో నారాయణ' అనటానికి.
2. 'కుక్క' అనే అర్థంలో.

వెంకట్రాయుడు ఎటువంటి కూరలు, ఎటువంటి పదార్థాలు తినేవాడంటే- అరటికాయ, సొరకాయ, బీరకాయ, బెండకాయ, దొండకాయ, దోసకాయ, పొట్లకాయ, చిక్కుడుకాయ, గోకరికాయ, వంకాయ, మున్గకాయ, కీకరకాయ- కీకరకాయ గాదమ్మా! కాకరకాయ తినేవారు. సుక్కకూర, సోయికూర, పాల కూర, చామకూర, తోటకూర, బచ్చలికూర, పొన్నగంటి కూర, మెంతెంకూర, గోంగూర, దొంగవాయిలికూర.... దొంగవాయిలికూర గాదమ్మా! గంగవాయిలి కూర, చామగడ్డ, కందగడ్డ, ఉల్లెంగడ్డ, కాలుగడ్డ.... అయ్యో, కాలు గడ్డ గాదమ్మా! ఆలుగడ్డ కూర అయ్యవారు తినేవారు. వెంకట్రాయుడు కూరల్లొ కోతిమీరు, పుదీన, కలెమాకు,[1] తమాట[2] లేంది తినకపొయ్యేది.

తొక్కులంటె వెంకట్రాయునికి ఎంతిష్టమో! మామిడికాయ తొక్కు, చింతకాయ తొక్కు, నిమ్మకాయ తొక్కు, దోసకాయ తొక్కు, గోంగూర తొక్కు- ఇవన్నీ ఇష్టపడేది వెంకట్రాయుడు.

గుమ్మడికాయంటె వెంకట్రాయునికి బలే ఇష్టముండేది నెయ్యిలేంది అన్నం దినకపొయ్యేది అయ్యవారు. బర్రె పుర్రు లేంది భోంచేసుకోక పొయ్యేది. బర్రె పుర్రుగాదమ్మా, బర్రె పెరుగు. బర్రె పెరుగులేంది భోంచేసుకోకపొయ్యేది.

వెంకట్రాయుడు ........ వెంకట్రాయునికి మేం ఏడుమంది భార్యలం ఉన్నాంగాని, సంతానం లేదు. అవునే శేషమ్మా, సుబ్బమ్మా, రమణమ్మా, గాయత్రమ్మా, అలివేలమ్మా, క్రిష్ణమ్మా, నన్ను గూడా 'బాగీరతమ్మా' అని పేరు పెట్టి పిలిచి, అందర్ని విచారించిండు వెంకట్రాయుడు. 'మీరు యాత్ర వస్తరా? ఎవరెవ్వరు వస్తరు?' అని విచారించిండు అయ్యవారు. 'అమ్మో! తీర్థ యాత్రలకు మేం రాము నాయనా! తీర్థ యాత్రలంటే దేశదేశాల్ తిర్గాలె. కాకులు దూరని కారడవులు, చీమలు దూరని చిట్టడవులు దాటుకుంట పొవ్వాలె. సింహాలు, మెకాలు, శిర్తపుల్లు, శిరికుక్కలు, ఎలుగొడ్లు, తోడేళ్ళు, పాములు, తేళ్ళు.ఎన్నో అడవి జంతువులుంటవి. కొండలెక్కాలె. నదులు దాటాలె. మాతోని

1. కరివేపాకు.
2. టమాట.

గాదు నాయనా! తీర్థ యాత్రలకు రానింకె. మేం నోరార తినెటోళ్ళం. కంట్యార పండెటోళ్ళం అని మా అక్కలందరూ ఎవరూ రామని చెప్పి అన్నారు. మా అక్కగార్లు అట్లా అంటే ఏమే బాగీ ర్తీ! నువ్వు యాత్రకు వస్తావా? అని నన్నడి గిండు వెంకట్రాయుడు ప్రేమతోటి. అయ్యో .... వెంకట్రాయుడు .... నేను ఒస్తానని చెప్పి అన్నాను.

పప్పులూ, బ్యాళ్ల, చింతపండు, నెయ్యి గియ్యి అన్ని సమస్త వస్తువులు తీసుకున్నాడు. గుర్రాన్ని కోయిలకు గట్టిండు వెంకట్రాయుడు. కళ్లెం బట్టు కొని గుర్రం మీద తాను గూర్చుండు. తన జుట్టు పట్టుకొని నేను గూర్చున్న. వెంకట్రాయుడు నేను గలిసి శ్రీశైలం, తిరుపతి, కాళహస్తి, రామేశ్వరం, పూరి, ప్రయాగ, కొంకణ, టెంకణ, బర బర, కాశ్మీర, కళింగ, కాశి- ఇంకా ఎన్నో దేశాలన్నీ తిరిగినాము. తిరిగి తిరిగి అలిసిపోయి మా వెంకట్రాయుడు అన్నడు గదా! అవునే బాగీ ర్తీ! ఎక్కడ బోయినా మనకు సంతులేదు. ఎన్ని యాత్రలు తిరిగినా గాని మనకు సంతుగాకపాయె. ఇన్ని యాత్రలు తిరిగినా గాని ఏం ఫలం? లేకుండాపాయె అనుకొని ఈ గంగ ఒడ్డున దిగి స్నానం చేసుకొని, వంట జేసు కొని, భోజనం జేసుకుందామని మా వెంకట్రాయుడన్నాడు. నేనుగూడ సరే నన్నా. అయ్యో.... వెంకట్రాయుడు....

నేనేమో నవగాయ పిల్లివంటలు- పిల్లివంటలు గాదమ్మా, పిండివంటలు. నవగాయ పిండివంటలు వండుకుంట నేనున్న. అందులోన్కి అవుప్రు- అవు ప్రు గాదండి! అవు నెయ్యి తీసిపెట్టిన. గారెలు, బూరెలు, అరిసెలు, అట్లు, గరిజెలు, భక్ష్యాలు అవన్నీ జేసుకుంట నేను గూర్చున్న. పొయ్యిమీద గూర్చున్న. పొయ్యిమీద గాదండి! మంటమీద గూర్చున్నా. అయ్యో! మంటమీద గాదు. వంటమీద గూర్చున్నా.

అయ్యవారు వెంకట్రాయుడు గంగాస్నానానికి వెళ్ళిపోతానని చెప్పి అన్నాడు. అంటే నేను జూసి అన్నాను. వెంకట్రాయుడా! వంటలన్నీ తయా రౌతున్నాయి. తొందరగా నువ్వు స్నానం జేసుకోనివస్తే, నేనుగూడ స్నానం జేసుకొని సంజ వార్చుకుంటాను. నువ్వు వెళ్ళిరా అన్నాను. వెంకట్రాయుడు నా మాట ప్రకారంగా నదిలకు వెళ్ళిపోయినాడు. మోకాళ్ళ మంటినీళ్ళకు పొయ్యి, 'బాగీ ర్తీ! ఇక్కడ స్నానం జేసుకుంటే మంచిగుంటదా' అన్నాడు. అంటే, నేను

జూచి ఏమన్నానంటే 'వెంకట్రాయుడా! ఇక్కడ కప్పల వెంగిలి, చాపల వెంగిలి, కరోకటాల వెంగిలి. వెంగిలి నీళ్ళు. మురికి నీళ్ళున్నాయి. అవతలికి పోయి లోతుల స్నానం జెయ్యరాదా వెంకట్రాయుడా!' అన్నాను. అంటే అదే ప్రకారంగా అయ్యవారు వెంకట్రాయుడు నడుములోతు నీళ్ళల్ల కెల్లిపోయినాడు. వెంకట్రాయుడు అన్నాడు గదా! ఏమే బాగీర్తీ! ఇక్కడ స్నానం జేసుకుంటే మంచిగుంటదా అన్నాడు 'వెంకట్రాయుడా! నడుములోతు నీళ్ళల్ల స్నానంజేస్తే అదొక స్నానమా? ఇంక కొంచం అసుంటపొయ్యి చెయ్యరాదా వెంకట్రాయుడా!' అన్నాను. వెంకట్రాయుడు ఎదమంటి నీళ్ళల్ల కెల్లిపోయినాడు. 'బాగీర్తీ! ఇక్కడ బాగుంటదా?' అని అడిగినాడు. 'అవతలికి పోయి నిండు సముద్రంల స్నానంజేస్తే మనకు ముక్తి వస్తది వెంకట్రాయుడా! మనకు సంతానం కలుగుతది' అన్నాను. అప్పుడు అయ్యవారు వెంకట్రాయుడు కుత్కెలమంటి నీళ్ళల్ల కెల్లిపోయినాడు. కుత్కెలమంటి నీళ్ళల్ల కెల్లిపోయి వెంకట్రాయుడు మునుగుతూ ఉన్నాడు. మునుగుతూ ఉంటే తదలమీద తద, తదలమీద తద వస్తున్నది. వెంకట్రాయుడు మున్గానాం తేలానాం వెంకట్రాయుడు మున్గానాం తేలానాం.

అయ్యవారు......అయ్యవారు! వెంకట్రాయుని జుట్టు నీళ్ళమీద టిక టిక కొట్టుకొంటున్నది. మున్గుకుంట గిరగిరా తిర్గుతున్నాడు. 'పోతున్నానె బాగీర్తా! పోతున్నానే బాగీర్తా! సముద్రంల పడిపోతున్నానే బాగీర్తా!' అని అయ్యగారు చెయ్యెత్తి టాటా గొట్టినాడు. టాటా గొడ్తే - నేను జూసి ఏమన్నానంటే - వెంకట్రాయుడా! పోతున్నావా? అటేనాం సాగరగతి - అటేనాం సాగరగతి' అన్నా. వెంకట్రాయుడు గంగల కొట్టుకపోయినాడు. నేను జూసిన. ఇక్కడ నవగాయ పిండివంటలు ఉన్నాయి. ఇవన్నీ ఏంజెయ్యాలబ్బా అని దుఃఖం వస్తుంది. నవగాయ పిండివంటలు జూసి దుఃఖంమీద దుఃఖం వస్తున్నది. ఇగ ఏంజెయ్యాలె. పొయ్యినోడు వస్తడా? రాడనుకున్నాను. గంగ ఒడ్డుకుబోయి మూడు మునుగులు మునిగినాను. స్నానం జేసినాను. 'వెంకట్రాయుడా! నువ్వు పోతివా?' అని మూడు దారల నీళ్ళు చదివించినాను.[1] నీళ్ళల్లకెలి లేసివచ్చి, మాందోలు పట్టుచీర గట్టుకున్నాను. జరి అంచురైక తొడుక్కున్నాను. నుస్టివాపుకొని, 'వెంకట్రాయుడా! పోతివా' అని ఆ నవగాయ పిండివంటల కాడికొచ్చిన. వంటలు జూసి దుఃఖమంటె దుఃఖమొస్తుంది. దుఃఖమంటె దుఃఖమొస్తుంది. కండ్లమీది నీళ్ళన్ని సండ్లమీదికెల్లి

---

1. తిలోదకాలిచ్చాను.

కారిపోతున్నాయ్. దుఃఖాన్ని ఆపుకోలేక 'వెంకట్రాయుడా పోతివా' అని జెప్పి, వెంకట్రాయుని పేరుమీద ఒగ ఇస్తరాకేసిన. నా ముంగల ఒక ఇస్తారాకేసుకున్న. కలిపి నోట్లబెట్టుకుంటే వెంకట్రాయుని పేరుమీద దుఃఖమొచ్చి, నోట్లకేగాని బేటి కెల్తలేదు. ఏంజెయ్యాలె. అయ్యవారి కుదెంల[1] ఏంజెయ్యాల్నో తోస్తలేదు. నా ఇస్తరాకుల అన్నం, అయ్యవారి ఇస్తరాకుల అన్నం, రొండిస్తరాకుల అన్నం మొత్తం భోంచేసుకున్న. దుఃఖమంటె దుఃఖం. దుఃఖమంటె దుఃఖం. అన్నం లోపలికేగాని బేటికొస్తలేదు. భోంచేసుకొని 'వెంకట్రాయుఁడా' అని అనుకుంట ఇస్తరాకు పట్టుకొని దిగ్గున లేవబోయిన. కట్టుకున్న మాందోలు పట్టుచీర పదారొక్కలై పోయింది. ముడ్డికింది చెక్కపీట మూడొక్కలై పోయింది. అయ్యో ఇట్లగూడ సావు రాకపాయె అని జెప్పి, తోటకుపోయి ఉల్లిఆకుతోని ఉరిపోసు కున్న. అట్లగూడ నాకు సావు రాకపాయె. ఎట్లైన సావాలె అని జెప్పి, కోమటింటి కురికిన. కొబ్బెరబెల్లం దెచ్చి, రోట్లయేసి మెత్తగ దంచి, ఆవు నెయ్యిల గల్పుకొని ముద్దమీద ముద్ద, ముద్దమీదముద్ద, మూడేసి ముద్దల చొప్పున మింగిన. అట్లగూడ సావు రాలేదు నాకు. నీళ్ళులేని బాయిజూసి దాంట్ల పడ్డాగాని సావురాలే నాకు. నాకు సావొస్తలేదని జెప్పి, వెంకట్రాయుడు గూర్చున్న గుఱ్ఱంమీద గూర్చొని కాశి, తిరుపతి దిరిగి, ఇంటికి పోయిన. ఇంటికి బోయేసరికి నా సముతులందరు ఎదురొచ్చి, నాకు మంగళారతులు ఇచ్చి ఎదుర్కొన్నారు- వచ్చింది సంతానం దీసుకొచ్చిందని. నేను వాళ్ళకు ఎట్ల జెప్పాలె వెంకట్రాయుని సంగతి. దుఃఖం మీద దుఃఖం వస్తుంది. అయ్యవారు వెంకట్రాయుడేదని అడిగి నారు. వెంకట్రాయుడు కాశి గంగల కొట్కపోయిండు. నేనొక్కదాన్నే ఒచ్చినాను అని జెప్పి అన్నాను. వాళ్ళకు గూడ దుఃఖం మీద దుఃఖం, దుఃఖం మీద దుఃఖం, వాళ్ళేడ్వ నేనేడ్వ. వాళ్ళేడ్వ నేనేడ్వ - వాళ్ళేడ్వ నేనేడ్వ........ ఇగ అందరం ఏడుగురక్కజెల్లెండ్లం ముండమోసి మూలకుగూర్చున్నాం........

* * *

---

1. దుఃఖంలో.

## అనుబంధం - 3

# బాలసంతు పాట (సీత పాట)

పాడిన వారు : కప్పెరి పోశయ్య, రంగారెడ్డి గూడెం, మహబూబ్‌నగర్ జిల్లా.

హర హర మీ యిల్లు బంగారమమ్మా - బాలసంతువాణ్ణి దీవింతునమ్మా
లేవండి అమ్మలాల[1] లేవండి తల్లులాల - కొడుకులగన్న వాండ్లు బిడ్డలగన్న వాండ్లు
హర హరా మహదేవా!
హరహరా సీతమ్మ అయోజ్యశిరామా - అయ్యోజ్య పట్నాన శ్రీరామచంద్రా
శ్రీరామ రామ రామ!
నరులోకము[3] జలిమించిన[4] నాడు - కల్లాది త్రైలోకం[5] బుట్టిన నాడు
అయ్యోజ్య పట్నాన దశరత మారాజు - కైకా కంసల్య[6] సుమిత్రాదేవి
వారి జేష్ట[7] పుత్రుండైన శ్రీరామచంద్ర - రాములు లక్ష్మణ అన్నాదమ్ములు
భరత శత్రగ్నులు[8] వారి తమ్ముళ్లె
అమ్మా కొడుకులగన్న తల్లులు - బిడ్డల గన్నవాండ్లు
తెల్లంగ తెల్లారె తొలికోళ్ళు గూసె - బళ్ళున తెల్లారె బామండ్లు[9] గూసె
నీ నిద్ర తెల్లారె నీరోళ్ళు గూసె - లేవమ్మ బాలెంత తల్లి సీతమ్మ
అమ్మా! బాలెంత వయ్యేవు బాయికెళ్ళేవు - నీవు బాలెంత వైనప్పుడు
నీ కొలుపు గుంతల్లా నమ్మా! - ఎండిపి కొడవళ్ళు యాపరిల్లాలు
పసుపు బండారు గౌరమ్మ చాట - నీ గండా దీపాలు
నీకు ఏనాడు గలుగూనె తల్లి సీతమ్మా!
ఆదికాలము నాడు పూర్వకాలము నాడు - గా తల్లి సీతమ్మ గాయమ్మ వారు
వాళ్ళ తప్పులేదు వొంక న్యారము లేదు - వైదేవి[10] సీతమ్మా నమ్మా

---

1. అమ్మలార 2. అయోధ్య 3. నరలోకము 4. జన్మించిన
5. ఏడేడు లోకాలు 6. కౌసల్య 7. జ్యేష్ఠ 8. శత్రుఘ్నుడు
9. పక్షి విశేషం 10. వైదేహి.

అదనా సాకలి వాడు - అయ్యో దైవమా గా సాకలివాడు
పట్టపగలు నగరమందు పదిమందిలోపట - ఎనకా ముందు సూదకుండ ఎంత
మాట అన్నాడు.
రామణాసురుని లంకలో ఉన్న సీతను - ఏలుతున్నాడుగా ఎడ్డిరాముడు
ఎడ్డి రాముడుగా ఎఱ్ఱి రాముడు - అట్ల ఏలుతానా నా భార్యను
అన్నాడుగా సాకలివాడు - సాకలివాడు అన్నమాట
సెవులల్ల బడ్డాది శ్రీరామచెంద్రునికి - కనుగడ్డు ఎఱ్ఱంగ జేసిందే రాముడు
తప్పులేని తల్లిని తలగొట్టమన్నాడే రామా - తమ్మీ నీ వొదిన సీతమ్మ
భూలోకమాతా
కాని తప్పులు జేసింది ఖండించిరారా - రారా నా తమ్ముడ రాలచ్చుమయ్యా
అన్నయ్యా! అన్నన్నా శ్రీరామ అయ్యోధ్యరామా - తప్పులేకనె సీత తలగొత్తై
అన్నా
తల్లూలు పెద్దాలు తగదందురన్నా - తమ్ముడ లచ్చుమణా
అట్ల ఎప్పుడన్నావో అయ్యానా తమ్మీ - సీతమ్మా నువుగూడి ఏలు అయోధ్యా
అన్నా! అంతమాట అంటివ అన్నా రఘూవా - నీ యాజ్ఞ దప్పాను మన్నించు
అన్నా
రామబాణ మిచ్చిండు అన్న రాముడే - నడువవమ్మ వొదినె నా తల్లి సీతమ్మ
అమ్మలాల! తల్లులాల! ఆ సీతాదేవి - వనవాసమెల్తుంది మాయమ్మలాల
లేవండీ లేవండి తల్లీ సీతమ్మా - సీతమ్మ సెరమీద రాముల పేరు మీద
మీ ఇంటి దేవుని పేరు మీద - మీ తాత పెద్దల పేరు మీద
కన్నవారి పేరు కొన్నవారి పేరు - సాదినోళ్ళ పేరు మీద
నీ పెద్దాల పేరు మీద తల్లి సీతమ్మా - గౌరమ్మ చాటానిచేత బట్టమ్మా
గౌరమ్మ చాటబట్టి యదార్థము[1]తోటి - పొద్దుగాల అరువాతని[2] ఓయమ్మ
ఊళ్ళ ఉన్న భూతాలు ఉర్కులాడంగా - ఊళ్ళ ఉన్న దయ్యాలు
సందుల్లో దిరుగా
ఓయమ్మా! బాలెంతలాలా - మా శంఖు పాడ్తుందే
కామునివి భూతాలు కాల్వదాటేనమ్మ - ఊళ్ళ ఉన్న భూతాలు ఊరుదాటేనమ్మ

---

1. మనసార 2. వరువాత

తెల తెల ఏగిళ్ళు వారనింకె వొస్తుంది - కడపదాటి భిక్షం బెట్టమ్మా నా తల్లి
సీతమ్మ గట్టేటి సిల్కు సీరాలు - రాములు గట్టేటి రత్నాల దోతి
రాముల పేరు మీద తేవమ్మ తల్లీ - సీతమ్మ పేరు మీద దానంబు చెయ్యమ్మ
నీ నిన్న కొడుకులు నీ నిన్న బిడ్డలు - పాల్దాగె నీ బాల పరుగెత్తె బాల
తొట్టెండ్ల నీ బాల ఆడేటి బాల - నీ ఎడ్ల గాడియు నీ వసుల మందా
పాలిచ్చె ఆవులు బుసకొట్టె ఎడ్లూ - పండేటి పంటలు నిండేటి గాదెలు
నీ కడప కడపకు - మా దీవెనలు కలుగునోయమ్మ
అమ్మ! ఇగనన్న లేవమ్మ తల్లి సీతమ్మా - నీ నొష్టి కుంకుమ నీ నోము దండా
నీ కాళ్ళ కడియాలు నీ కాళ్ళ మెట్టెలు - ముత్తైదగాజులు పుస్తెది బలమూ
నీ కడపా కడపాకు పెట్టిన దీపంబు - అమ్మా మా దీవెండ్లు గలగాని తల్లీ సీతమ్మా
అయ్యయ్యో రామ రామ రామ! - అలనాడు సీతాదేవి లక్ష్మణస్వామి
రామా! అరుండ[1] వాసముల పోతావున్నారే - నడువవమ్మ వొదినె నాతల్లి సీతమ్మ
గా తల్లి సీతాదేవి అరుండ వాసముల - వొద్దిమాను మొద్దులు ఈ దేకు అడవులు
చేకులు టాకులు, మద్దులు మారెళ్ళు - జీన్గలు జిట్టలు, శంపక పున్నలు
గలగాలమనియేటి గళరాగి రుక్షాలు[2] - దట్టంగ పెరిగిన దండి రుక్షాలు
తల్లీ! కాకులు దూరని కారండ పడవి[3] - సీమలు జొర్రని నిచ్చుండపడవి[4]
అయ్యయ్యో! రామ రామ - బ్రహ్మండమైన అరుండవాసముల
గా తల్లి సీతాదేవి వొద్దిమాను మొద్దు వద్దన ఉన్న 12 బీగాల పరుపుబండ దగ్గరకు వచ్చింది.
అయ్యయ్యో నా మరది మరదీ లక్ష్మణా - నడవా శాతగాదయ్యా మరదీ లక్ష్మణా
నడిసిన కాళ్ళకు బొగ్గలొచ్చే మరదీ - ఊపిన సేతులకు ఉర్లు దిగినావి
తట్లాకు గోళ్ళల్ల చిల్లే రక్తామూ - కాళ్ళల్ల సత్తువ కరవాయె మరదీ
అప్పుడు లక్ష్మణ స్వామి తల్లి సీతమ్మా - నీ వొళ్ళ తప్పులేదు వొంక న్యారములేదు

---

1. అరణ్య
2. ఘన రావి వృక్షాలు
3. కారడవి
4. ధావాగ్నితో నిండిన అడవి

అన్న ఆజ్ఞ తప్పంగ వశముగాదు వొదిన - రామబాణం బట్టిండు మరది లక్ష్మణా
అన్నిచ్చిన రామబాణం పైకి లేపిండా - పైకి లేపిన లక్ష్మణ మూర్ఛపొయ్యిండా
లక్ష్మణ స్వామి కారుంద పడవిల మూర్ఛ తేలుకొని చేతుల్ల బాణాలు కిందయేసి
వొంగింగి దండాలు వైదేవికి బెట్టి - పోవమ్మ నా తల్లీ తల్లీ సీతమ్మా
వొదినే ఎన్నేండ్లు ఉన్నగాని మా తల్లివి నువ్వైతే నీ మొకము జూసేను
ఇంకా ఆలిశముంటె అక్కడ అన్నయ్య రాములు ఈడికే కోపాన ఉన్నాడు
పోవమ్మ పోవమ్మా తల్లీ సీతమ్మా ఎనుకాకు మల్లిండు మరది లక్ష్మణా
సీతాదేవిని అడవి ఆరుండములో వదిలిపెట్టి అదే బాణము తోటి
గురిమెకాన్ని ఖండించి గురిమెకం[1] కనుగుడ్లు అరటాకు దొల్లల పెట్టుకొని
అన్న రాములుకు జూయించే వరకు అన్న శ్రీరామచంద్రుడు
అవి సీతాదేవి కండ్లనుకొని తన రెండు కండ్లకు అద్దుకొని గంగలో యేసి
తమ్మీ లక్ష్మణా! అట్టి సీత పేరు మీద గంగాస్నానం జెయ్యయ్యా లక్ష్మణా!
ఓ సీతా! ఈడికి బ్రహ్మ సృష్టి మునిగిందే ఓ భామా సీతా!
సృష్టి సృష్టంట శ్రీరాములవారు గంగలో మునుగంగ
లక్ష్మణస్వామి సీత పురుడు పురుడు పురుడంట మునుగుతున్నాడా
ఆ మాట యిన్నాడు అన్నా రాములు - అగ్రమైన[2] కోపంబు పుట్టే రాములకు
నా తమ్మీ లక్ష్మణా సీత పేరు మీద నేను సృష్టంట మునుగుతుంటే
నువ్వు పురుడంట మునిగితివి చెప్పు కారణమూ
అన్నయ్య శ్రీరామచంద్రా నీకు పదివేల వందనంబులు
ఈ గంగ సప్పుడుకు నాకు తెలువలేదు నా తప్పు మన్నించు శ్రీరామాచంద్రా!
ఆడికి వారన్న దమ్ములు స్నానంబులు జేసి అయోధ్య పట్నాన ఉండగా
శ్రీ రామ రామ రామ! అమ్మలాల! తల్లులాల! ఇగనన్న మేలుకొండమ్మా!
బాలింతలయ్యేరు బాయి కెల్లేరు! - ఓ తల్లి సీతమ్మ బాలెంతరాలా
అర్ధరాత్రియాళ అపరరాత్రియాళ - కరిసేటి పామనక కరిసేటి కుక్కనక
ముట్టేటి పురుగనక పొడిసేటి ఆవనక - ఇరిగేటి ముల్లనక తగిలేటి తట్టనక

---

1. విలుకాళ్లు (వేటగాళ్లు) తమ నైపుణ్యానికి మెకాన్ని (జింకను) గురిగా చేసుకునేవారు. అందువల్లనే జింకకు గురిమెకమనే అర్థం స్థిరపడి ఉంటుంది. 2. అగ్రహమైన

మీ కడపా కడపా దీవింతునమ్మా
అప్పుడు గా తల్లి సీతాదేవి ఏడేడు అంత్రాల[1] పరుపుబండ మీద
కాలిన బండమీద దేకు ఆకులు పరిసి - రామ చిత్పల సెట్టుకింద తల్లీ సీతమ్మా
కొలువై కూసోని మొకాన కొంగు పెట్టి - వలవల సీతమ్మ వలపోతా దమ్మా
అయ్యయ్యో శ్రీరామ దయలేదా తండ్రీ - నా మరిది లక్ష్మణ కరణన్న[2] లేదా
మీ రన్నా దమ్ముళ్లు నవ్వుతున్నారా-భగవంతుడు ఎన్ని బాధలు పెట్టె దైవమా
అక్కడ ఉన్న యాగ్రాలు[3], యాగ్రా పెద్దపుల్లు, సింహశార్దూలాలు
గుడు గుడు గుడ్డేలుగులు, జంబోనక్కలు, సర్పకా పాములు
సుట్టు ముట్టు ఉన్న మృగాలు సీతమ్మ దుఃఖముజూసి దుఃఖపడుతున్నావి
రామా! ఆ తల్లి సీతమ్మ మృగాలను జూసి
ఓ తల్లీ మృగాలూ మీకు దండాము - మీరన్నా మింగండి తల్లీ మృగాలూ
అయ్యో తల్లులాల! ఓ మృగాల్లాల - తిననింకె అన్నంబు లేక
కట్టా వస్త్రంబులేక - వల్లుకు స్తానంబు[4] లేక
పండా స్తళము లేక - త్రాగా నీళ్ళు లేక
ఈ బాధలు నేను పడుతున్న నన్ను మీరు మింగితే మీకు పుణ్యమే తల్లీ!
అని సీతమ్మవారు అనంగనె అప్పుడు ఆ మృగాలు ఓ తల్లీ సీతమ్మా
రామ శబ్దము నీ నోట రాకపొయ్యింటె - ఎన్నముద్ద ప్రకారము ఏ మృగమన్న మింగేది
రామ రామ అన్నందుకు ఓ తల్లీ నిన్ను - ఏ మృగము మింగరాదు ఇది నిజము తల్లీ
తల్లీ ఇంక మూడు ఘడియల కల్ల - నీకు నవమాసములు నిండివస్తున్నవి
కొడుకూని గందూవు తల్లీ సీతమ్మా - ఆ మృగాలు ఇట్లాని అన్నంత మాత్రంల
కష్టంబులేదు అతివకు బాదలులేవు - సీతమ్మ దేకు ఆకుల మీద ప్రసిద్దయింది[5]
ఏమమ్మా మృగాలు ఎడ్డి మృగాలు - ఎంతమాట అంటిరే నా తల్లి మృగాలు
ఓ తల్లి సీతమ్మ మేమన్న మాటగాదు - రాముల వారు ఇచ్చిన సంతానమమ్మా
మేమ ఛాయన[6] బుట్టిండు నీ కొడుకు తల్లీ - రామ రూపుల బుట్టిండు నీ కొడుకు తల్లీ

---

1. అంతస్తులు 2. కరుణ 3. జంతువులు
4. స్నానము 5. ప్రసూతి 6. ఛాయ

నీ కొడుకుని వొడిగట్టుకొని పోవమ్మా - అప్పుడు సీతాదేవి
అయ్యేటి మైలాలు ఔతా ఉన్నాయి - పొయ్యేటి మైలాలు పోతా ఉన్నాయి
మైల కోకల్ల అంటు బట్టల్ల - గా తల్లి సీతమ్మ
రక్తంల కొడుకూని ముందలేసుకొని - వల వల సీతమ్మ వలపోతాదమ్మా
లేవండి లేవండి నా తల్లులాల - సీతమ్మ సెరమీద రాముల పేరు మీద
మీరు బాలెంతలయ్యేరు బాయికెల్లేరు - గౌరమ్మ కాట[1] బట్టుకొని
గండ దీపాల తోటి - కడపదాటి భిక్షం బెట్టండోయమ్మ
అమ్మా బాలెంతలాల - మీరు బాలెంతలయి నపుడు
సొంటి పిప్పళ్లు వాము వజపోడి - బాలెంత కాయంబు ఎవరిస్తారమ్మ
ఆ సీతాదేవి సూడండి తల్లులాల - సీతమ్మ దుఃఖము మా నోట విన్న వారికి
యాట సంతానము యాట కొడుకుల పెండ్లిండ్లు - యాట ఇంట బాలలు యాట
తొట్టెండ్లు
మా జోగలపాటలు మా శంఖు నాదాలు - మా గంట నాదాలు మీ యందు
గలుగునోయమ్మా
కోళ్ళు గూసి పాయెనమ్మ - వాకిళ్ళు ఊకె యాళాయెనమ్మ
స్త్రీపుకట్టల దుమ్ము మా శెంకుపైకి - వచ్చేటి సమయమాయె లేవండి తల్లీ
హరహరా! గప్పుడు సీతమ్మ గాయమ్మ వారె - ఆ కొడుకుని ముందలపెట్టుకొని
గా తల్లి దుఃఖము మరి కాకి శోకము - కొడుకా! నా కడుపున పడితివా!
నా సక్కనయ్యా!
అయోధ్యల నువు పుట్టినుంటె కొడుకా - నీకు ఎంత వైభోగముంటుండె తండ్రీ
సుట్టేడు దాసీలు సూసుకుంటుండ్రీ - ఊరాన ఊరంత ఎత్తుకుంటుండ్రీ
అటువంటి నీవు ఇక్కడ - నీకు తలకంట సమరు లేక
నీ బొడ్డుగొయ్య కొడవండ్లు లేక - నాకు బాలెంత మందులు లేక
ఇగ మరణమయ్యి పోదాము కొడుకా నా తండ్రీ అని దుఃఖపడుతుండగ
భళ్ళుభళ్ళున తెల్లారె తూర్పున పొద్దుపొడిసె ఏడు అంత్రాల పరుపుబండమీదికెల్లి
ఆ తల్లి సీతాదేవి ఆ చిన్ని కొడుకుని - వొడి గట్టుకొని రామ రామ అంట
పోతయున్నది

1. చేట

పన్నెండు అడుగులు వెట్టంగనె - అక్కడన్నే మాయా మఠమున్నదో రామా
ఆ మాయా మఠముకాడికి వచ్చేవరకు అది వాల్మీకి మాముని మఠము యున్నాది
మఠము కాడి కొచ్చింది తల్లి సీతమ్మా - కండ్లు వొయిన పెద్దలు ఎవరయ్యా
మీరు
అమ్మా మీరెవరె తల్లి గీ అరుండమందు - నా పేరు సీతమ్మ అయోధ్యమాత
వొల్లా తప్పులేదు వొంక న్యాయము లేదు - తలగొట్టమన్నాడు శ్రీరామచంద్రా
నా మరిది లక్ష్మణస్వామి తలగొట్ట వస్తేను నా తలపండు తెగకుండే
నన్నాదిలి పొయ్యిండు నా లచ్చుమయ్యా- నేను తండ్రదంట ఇటువస్తి ననుగన్నా
తండ్రి
అప్పుడు వాల్మీకి మాముని వైదేవి పాదాలకు మొక్కి
ఆ చిన్న కొడుకుకు మాయ తొట్టెల గాయించి
తేవమ్మా నీ కొడుకుని తల్లీ సీతమ్మా - గానిన్నా కొడుకుని చేతాబట్టిందు
ఓ బిడ్డ సీతమ్మ నీ కొడుకుని తొట్టెండ్ల నేను ఊపుతుంటాను
స్తానముజేసి రావమ్మా తల్లీ సీతమ్మా - అప్పుడు వైదేవి సీతమ్మ
ఆ కొడుకుని తొట్టెండ్ల పండవెట్టి - గళ్ళుపెళ్ళు గళ్ళుపెళ్ళున
స్తానానికి సముద్రానికి వచ్చె సీతమ్మ
వన వృక్షముల మీద వానరా కోతులు - పిల్లలను కడుపులో దాసుకోని
తిరుగుతున్నావా
ఓ ఎర్రి సీతమ్మా ఓ ఎడ్డి సీతమ్మా - గుడ్డివానిముందు నీ కొడుకుని ఏసివస్తివా
నీ కొడుకుని ఏ మృగము మింగునో - ఏ జంతువు మింగునో
అన్నంత మాత్రంల ఆ తల్లి సీతమ్మ - హా రామ రామ యనుచు
నా కొడుకుని గుడ్డివాని ముందు ఏసివస్తిని - కోతులకున్న బుద్ధి నాకు లేదమ్మా
అడవి మృగాలకులేని బరువు - నాకే అయ్యేన రామ రామ
నా కొడుకు నాకు బరువైతడా అని దబ దబ ఎద గుద్దుకోని-
మఠము కాడికొచ్చిందే తల్లీ సీతమ్మా - మునినాధుడు నిద్రలో మునిగి ఉన్నాడా
అమాంతము కొడుకుని అదుముకున్నాది - ఎత్తుకున్న కొడుకుని వొడిల గట్టింది
ఓ తల్లులాల ఓ యమ్మలాల - వాడవాడ వాండ్లు గేరిగేరి వాండ్లు
తెల్లవారెను పొద్దు పొడుచును - లేవండి అమ్మలాల
ఉగ్గుదిన్న నీ బాల ఉరుకులాడానీ - పాలుదాగిన నీ బాల పారాడానమ్మా

ఎన్నదిన్న నీ బాల ఎదిగిరానమ్మా - బాలసంతు దీవెండ్లు భాగ్యంబుగలుగా
అయోధ్యారాములు మీయందు గలిగి-దేవాన దేవతలు ఊరుముందల అనుమాండ్లు
మీ ఊరు గాపాడనీ తల్లులాల - ఎల్లకాలము మిమ్మల్ని సల్లంగజూడని తల్లులాల
అప్పుడు ఆ సీతాదేవి - ఆ చిన్న కొడుకుని దీసుకోని
గంగవొడ్డున చెట్టుకింద - అమ్మవారు కొడుకుని పండవెట్టి
అమ్మా! స్తానం జేస్తయున్నాదే బాలెంతరాలు - కొడుకుని స్నానం జేయించి
అమ్మవారు మఠము కాడికి రానే వస్తయున్నది-
అంతలోపల ఆ మునినాధుడు - తొట్టెండ్ల కొడుకు సప్పుడులేదు
పండిండా బాలుడు పల్కుతాలేడు - సెయ్యిపెట్టి జూస్తె కొడుకందూ లేదు
మునినాధుని గుండెలు గుబేల్‌మన్నాయి - హా రామ యన్నాడు అంగలార్సిండు
అయ్యో నా తల్లి సీతాదేవి వచ్చి - నా కొడుకు లేడంట శాపమిస్తదేమో
శోకంల ఉన్న ఆ తల్లి సీతాదేవి - శాపమిస్తె మరి తిరుగుండబోదు
మఠమంత భగ్గున మంటలు మండు - మఠమంత బూడ్దిగ మారును రామ
సీతాదేవి రాకముందే కొడుకుని సిద్ధంగా ఉంచాలని-
మునినాధుడు ఎదమీద మన్నుదీసిండు - అచ్చంగా బాలూని రూపుజేసిండు
రాముని మదిలోన యాది[1] జేసిండు - బొమ్మకు ప్రాణాలు బోసి నిలిపిండు
మాయ బొమ్మకు ప్రాణాలు బోసి తొట్టెండ్ల పండబెట్టి గా మునినాధుడు-
ఏడ్వాకు ఏడ్వాకు ఎర్రినా బాలా - లాలిపాటలు నీకు పాడేను నేను
జోల పాటలు నీకు పాడెను నేను - మునినాధుడు తొట్టెల ఊపుతున్నాడు
అంతలో సీతమ్మ అక్కడికి వచ్చె - బాలుని జూసింది చిత్రపోయింది
అయ్యయ్యో నాయనా మునినాథా - శ్రీరామ రామ రామ
నా కొడుకు నా సంకల ఉండగా - ఈ కొడుకెక్కడివాడు చెప్పు నా తండ్రి
అప్పుడు మునినాధుడు మూర్ఛపోయి పడ్డాడు - ఓ తల్లి సీతాదేవి భూలోకమాతా
నీ కొడుకును నువ్వు కొంచవొయ్యింది తెలువక మృగాలు ఎత్తుక పోయినవని
మాయా బాలుని జేస్తి మన్నించవమ్మా - ఈ కొడుకు ఆ కొడుకు ఇద్దరు
కొడుకులు

1. జ్ఞాపకం (యాది అనే హిందూస్తానీ పదంనుంచి వచ్చింది)

ఇద్దర్నీ పెంచమ్మా ముద్దూగ తల్లి - అయితే నాయన్నా మునినాథా
కొడుకులకు పేర్లు నువు బెట్టరాదా - అనగానే మునినాథుడు
ఓ బిడ్డా సీతమ్మ ఇంటావా తల్లి - పెద కొడుకు లవ్వయ్య ప్రేమ గల కొడుకు
చిన కొడుకు కుశలయ్య ముద్దూల కొడుకు - లవ్వయ్య కుశలయ్య
వారన్నదమ్ములు
అయోధ్యా పట్నానికి అతిపాతు[1]లమ్మ - సాదుకో నా తల్లీ బాలెంతరాలా
సీతమ్మ దుఃఖాలు ఆకాశవేణికి[2] భూదేవికి దేవాన దేవతలకు మాలిమయ్యింది
హర హరా ఆ సమయంల - అయోధ్యా పట్నాన పందుకున్న లక్ష్మణుడు
సీత దుఃఖాలు అరిసెరలు కలగని - దిగ్గున్న మేలుకున్నాడు ఆ లచ్చుమయ్య
అయ్యయ్యో రామ రామ రామ - వొదినెను అడవిలో వొదిలి పెట్టొస్తి
ఆమె కొడుకును గన్నట్లు కలవచ్చెనాకు - ఎన్ని బాధల్లఉన్నదో తల్లి సీతమ్మ
నాకు ఎంత పాపము దగిలిందమ్మా - నిన్ను అడవిలో ఇడ్చి పెట్టివచ్చినందుకు
ఈ పాపమెట్ల బోవు తల్లి సీతమ్మా - సీతమ్మను దర్శించుకుంటేనె
పాపరైతంబు[3]
అన్నయ్య శ్రీరాముల వారికి మాలిమైతే - కాశిలో గోవుని గోసిన పాపంబు
వొడిగట్టు మా యన్న అన్న రాముడే - కాని నేను అర్ధరాత్రియాళ పొయ్యి
వొదిన సీతమ్మ యాడ ఉన్నగాని - చూసివస్తానని లేని లక్ష్మణా
ఈశ్వరుని వొద్దాకె ఎల్లె లక్ష్మణ - శివుని శంఖు గంట సెతుల బట్టిండు
ఏదుమంత గంట పందుమంత శంఖు - యీబూది రేకులు దిద్దుకున్నాడు
పేరిణి బొంతను గట్టుకొన్నాడు - ముందుకు ఏసిండు మున్నూరు జోలె
ఎనకంగ ఏసిండు ఎయినూరు జోలె - రుద్రాక్ష భద్రాక్ష మెడనగట్టిండు
అయోధ్యాపట్నాన ఆ జంగమయ్య - ఇల్లిల్లు ఇల్లిల్లు తిరుగుతున్నాడు
ఓ యమ్మలాల తల్లులాల - ఇంట్ల ఉన్న ధర్మ తల్లులాల ఓ బాలెంతలాల
సీతమ్మ సెరమీద రాముల పేరుమీద - సీతమ్మ సీరెలు
పుట్టు అంగులు పుట్టు కుల్లలు - మీ చిన్న బాలల గజ్జెల లాగులు
సిద్దెల్ల నూనెలు గురుగుల్ల కొంపి - మీరు తినియేటి మందులు
బాలెంత కాయాలు ఇవ్వండి తల్లి - అప్పుడు లచ్చుమయ్య అవి
మాయజోళ్ళ పెట్టుకొని

1. అధిపతులు 2. ఆకాశవాణి 3. రహితం.

అయ్యోజ్యల శంఖు బాడి - అయ్యోజ్యల గంట గొట్టి రామ రామ అనుకుంట
ఎల్లిండు లక్ష్మణ స్వామి - 12 ఆమడ 12 అడగుల్ల వచ్చి
సీతమ్మ ఉన్న స్థలానికి చేరె లక్ష్మణ స్వామి -
అర్ధన్రాత్రి[1] యాళ గణగణగంటలు గొట్టి - భం భంన శంఖుబట్టి
'ఓ యమ్మా ఎవరమ్మ మీరు బాలెంతరాల - భిక్షా, జంగమయ్య భిక్షం
బెట్టు తల్లీ'
అన్నప్పుడే గాతల్లి సీతాదేవి - జంగం మాటలు సెవున ఇన్నాది
అయ్యోయ్యో రామ రామ ఇక్కడ అడవిలోపట -
మాట్లాడ మాన్యుడు లేడు - పర్కి కోరింత అడవి
బ్రహ్మండమైన అరుండములో - వస్త్రివా నా తండ్రి ఓ జంగమయ్యా
పుట్టెడు దుఃఖములో మునిగి ఉన్నాను - నా వద్ద ఏమున్నది స్వామి అన్నంతల
బంగారు మొంటెల ముత్యాలు నిండె - జంగమయ్య జోల్ల తల్లి బోసింది
ఓ బాలెంతరాలా ఓ తల్లీ నీకు - వచ్చిన బాధలు వైదొలగునమ్మా
కలిగిన కష్టాలు కడతేరునమ్మా - బాలసంతు దీవెండ్లు బాలలకు గలుగాని
ఈ పుట్టు కుల్లాలు ఈ పుట్టు అంగీలు - ఈ గజ్జల లాగులు గురుగుల్ల నూనెలు
సీతమ్మ సీరెలు బాలెంత ఎచ్చాలు - పట్టమ్మా ఓ తల్లి బాలెంతరాలా
అన్నిగాయమ్మ వారికిచ్చి గణగణ గంట గొట్టి భం భంన శంఖు పాడి -
గిరుక్కున ఎంటకు మల్లి అయ్యోజ్య కొచ్చిండు ఆ లచ్చుమయ్య -
ఓ యమ్మలాల ఊళ్ళ ఉండ తల్లులాల - సీతసెర మీద శ్రీరాముల పేరు మీద
గౌరమ్మ చాటబట్టి గండదీపాలు బెట్టి - పాత వస్త్రాలిచ్చి పప్పు బియ్యం బెట్టి
కడపదాటి భిక్షం బెట్టండి - అమ్మలాల ఓ తల్లులాల
శంఖు నాదాలతో గంట నాదాలతో ఈ జంగం వాని దీవెండ్లు
మీకు గల్గని ఓ యమ్మలాల!

* * *

1. రాత్రి.

అనుబంధం - 4

# పగటి వేషాల్లోని 'వడ్డెర వేషాలు' ప్రసంగ పాఠం

ప్రాసంగికుడు : మిరియాల జానయ్య కొత్తూరు, రంగారెడ్డి జిల్లా,

పురుషవేషం : నమస్కారం దొర వారికి. వడ్డెరి వాండ్లము, నా పేరు సుక్క సత్తయ్య, ఈ గ్రామం వచ్చినాము. మాకు ఏమీ పనిలేకపోయింది. నాలుగు కుటుంబాల వాండ్లము వచ్చినాము. పోతులకు మ్యాతలేదు. పిల్లలకు గంజిలేదు. మొర మొర అని మొర మొర పెడ్తున్నారు. దొరవారు ఏమన్నా ఆధారం చేస్తారని వచ్చినాము. ఇరువుదిండ్లోల్లవి మూడు బండ్లు ఉన్నాయి. నరికుపలోల్లవి మూడు బండ్లు ఉన్నాయి. ఇచ్చపూన్లోల్లయి మూడు బండ్లు ఉన్నాయి. అందులో నేను పెద్దవాణ్ణి. వాళ్ళు ఏమీ తెలియనివాండ్లు. ఇప్పుడు నేను వచ్చినాను. బంగ్ల పని జేపిస్తవా? బాయిపని జేపిస్తవా? చెరువు పని జేపిస్తవా? కాల్వపని జేపిస్తవా? కందకాలు తీపిస్తవా? రాయి గొట్టిస్తవా? ఏ పనైనా చేయించేవాణ్ణి నేను చేసేటి వాండ్లు నా చేతికిందివాండ్లు.

స్త్రీ వేషం : నేను సుక్కురారం[1] నాడు పుట్టినానంట. నా పేరు 'సుక్క తిమ్మి' అని పేరు పెట్టినారు. ఈన మేనత్త కొడుకంట. మేనత్త కొడుకుతోని తలబలిగెసినారు.[2] నేను ఐదునెల్ల గర్భిణిస్త్రీని. నాకు పుల్లనిబెల్లం కావాల్నంటె లేదు. తియ్యని చింతకాయ తెమ్మంటె లేదు. వీణ్ణి తలబలిగేసినందుకు నాకేమి సుఖంలేదు. దొరవారి ముందు మా ఇద్దరి వాస్తవం జెప్పి, మా అమ్మగారింటికి వెళ్ళిపోదామని వచ్చినాను ప్రభూ! నమస్కారాలు. నా తప్పిదార్థం[3] ఏమన్నా నాకు జెప్పి, మా అమ్మగారింటికి తోలివ్వవలసింది. వీడు తిండికి తిప్పరాజు.

---

1. శుక్రవారం 2. ఇష్టంలేని పెళ్ళిచేశారు. 3. తప్పు

పనికి పాతచాట. మాట్లాడేది ఎక్కువ. పనిచేసేది తక్కువ. ఒక్కసారి గడ్డ పారవేసినాడంటే 'నాకు కాళ్ళు గుంజుతున్నవి. నాకు నడుము నొస్తున్నది, నాకు పయ్యి[4] నొస్తున్నది' అని కూర్చుంటాడు. వీడు పని జెయ్యడు. నన్ను బతి కివ్వడు. ఈ ప్రభువారికి జెప్పి పని జెయ్యనందుకు చెట్టుకు కట్టేపిస్త, వంగబెట్టి బండలెత్తిపిస్త.

**పురుష వేషం :** ఏమన్నావే నా మేనత్తకూతుర. పనిజెయ్యనా! పాట జెయ్యనా! ఏ పనంటె ఆ పని జేస్తా. బంగ్లపని, బాయిపని సరాసరిగ మొత్తిదుస్తా బంగ్లపని ఎట్ల జెయ్యాలంటే చెప్తజూడు.

బునాది తీసుకోవాలె. బునాదిలో ముందు వరిపొట్టు పొయ్యాలె. వరిపొట్టు మీద రౌతు[2] పెట్టాలె. రౌతుమీద అసలు[3] వెయ్యాలె. అసలు మీద బూదిద పొయ్యాలె. ఆ బూదిద మీద ఏనుగంతంత రాయి ఎదురుబెట్టాలె. పోక బద్దంత రాయి దానికి పోటీ బెట్టాలె. నాల్గుదిక్కులకు పొయ్యేటి సీఖ్ళ నడింట్ల కొచ్చేటట్లుగ మలుపాలె. నడిమిదానిమీద కూర్చొని కొక్కొరోకో అని కోడి కూస్తే, ఆ బరువుకు నాలుగు దోనులు నిమ్మళంగా నేలమీద కూలాలె.

అప్పుడు సుక్క సత్తయ్య ఎటువాయె, సుక్క సత్తయ్య ఎటువాయె అని కర్రలు, త్రాళ్ల వట్టుకొని దేశాలన్నీ తిరుగుతారు నా కొరకు. నేను జేసేటి పనులు ఇంత జాగర్తగ జేస్త. నేను ఎక్కడెక్కడ పనులు చేసి వచ్చినానో తెలుసా! గొల్కొండ కోట నేనే కట్టినాను. వరంగల్లు దుర్గం నేనే కట్టినాను. చార్‌మినార్ నిలబడి కట్టించినాను. పట్నంల ఉన్న గండిపేట చెరువు తొవ్వించి నాను. దేశదేశాల దొరలు నన్ను పిలిపించుకొని పెద్ద పెద్ద బంగ్లలు కట్టించు కున్నారు. ఈ ఊర్ల సావుకారి తాన బంగ్ల కట్టినాను. రెడ్డిగారి తాన ఒక బాయి తొవ్వినాను. ఈ దొరవారు కందకం తీయించుకున్నారు. ఆ కందకం తీయించిన దబ్బులు యింకా చెల్లించలేదు. అందుకు దబ్బులు తీస్కపోనింకె ఇప్పుడు వచ్చి నాను. దొరవారు మెచ్చి గోదానమే ఇవ్వనీ. భూదానమే ఇవ్వనీ, వస్త్ర దానమే ఇవ్వనీ. సువర్ణదానమే ఇవ్వనీ తీసుకొని వెళ్ళేటివాళ్ళము.

* * *

1. శరీరం 2. రాయి 3. కట్టుడుకు ఉపయోగించే తడిపిన మన్ను.

# కాటిపాపని రాగిశాసనం – పూర్తిపాఠం[1]

స్వస్తిశ్రీ సమస్త విజయద్భుత శాలివాహన శకం 1315 శత వర్షంబు లగు వర్తమాన వ్యవహారిక చాంద్ర మానయనాయనం మార్గశిర శు॥ 2 గురు వారం నాడు కాశీ విశ్వనాథుడు కాటిపాపలకు వ్రాసి ఇచ్చిన ధర్మశాసన క్రమం. అంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ కామరూప సౌధర సౌరాష్ట్ర బంగాళ మాగద మాళవ నిషాద నేపాల కేరళ చోళ మలయాళ సింహాద్రి ఎళం కర్నాట నాట కరహాట పనిదట పాండ్య పరంద్ర పులింద్ర హనద కరణాద్రి కర్వాన నర్పి కరుగాంధార బిరల విదర్భ విదేహ బాహ్లీక బర్బర కేకయ కోసల తల కుంతల కిరాత సుదేష్ట్ర శూరసేన శివస కొంకణ టెంకణ పంచదేశ సందత పార్హా లంపాక బర్బర యవన యుజ్వలాంధ్ర సాళ్వ చెంద్రి శ్రిదవంత్రిత్య అష్ట బాషా భూమిది అత్ర విద్య ఇది యాభై ఆరు దేశాలకు శ్రీరాములు నీవే కలవు. శ్రీ శుభమస్తు. శ్రీ.శ్రీశ్రీ రామయం సమయః కోసల దేశమను అయోధ్యలో నుండిన వీరేణ్యుని యొక పేరు. రెండోది హరి తండ్రి చంద్రుడు తల్లి. మూడోది త్రిశంకుడు. వారి కుమారుడు హరిశ్చంద్రుడు అను పేరు. వారి భార్య తండ్రి పట్టణము కముద దుష్యంతుడను పేరు. భార్య చంద్రమతి. కుమారుడు లోహితుడు. వారు అయోధ్య యను పట్టణము ఏలుచున్నవారు. సత్యము వహించియున్నారు. ఇట్లుండ విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని సత్యము చూచుటాని కయ్యి చాలా కష్టము పెట్టెను. తదుపరి హరిశ్చంద్రుడు కాటికాపరి అయ్యెను. వారి కుమారుడు పాము కాటుచే లోహితుడు నశించ తల్లి శాసన భూమికి నెత్తి కెల్లెను. కాటికాపరి మాడలడిగెను. భార్య లేదనెను. హరిశ్చంద్రుడు మెదనున్న

---

1. రంగారెడ్డి జిల్లా గ్రామాల్లో సంచరించే కాటిపాపల వేషగాడు ఆలేటి జంగయ్య (54 సం॥) దగ్గర శాసనం నుంచి ఎత్తి వ్రాసిన పాఠం ఇది. (కాటిపాపల ఫొటోలో రాగిశాసనం చూడవచ్చు.)

తాళి యడిగెను. నీవే భర్తయనె. చాలా దుఃఖించుచూ ఇట్లుండ విశ్వామిత్రుని శెళిర అవకాః మయ్యి మీ భక్తికి మెచ్చితిని అని మీరు అయోధ్యకు వెళ్ళండని వేడపోగా విశ్వామిత్రుడు విష్ణు ఈశ్వర బ్రహ్మలను వేడ ప్రత్యక్షమయ్యి లోహితుని లేపి ఈశ్వరుని అంశముచే నొక్క కాటికాపరిని చేసి వీర బాహుడుచేయు కాష్టములు శెరి సగము భాగించిరి. మహేశ్వరులు. అంతవరకు మననానందించి హరిశ్చంద్రుడు చంద్రమతి లోహితుడు వైకుంఠవాసులైరి. కాటిపాపడు తిరిగే కర్తవ్యంగాన కాటిలో గొనేది అవు లేగను ఇచ్చేది. కడు ప్యాదవాడైన కాడు ఏదయిన - ఇచ్చిన వారు కాశికి బోయిన ఫలం బందుదురు. లోకంమీద పేరయ్యినది. చెప్పన్న దేశాల వాండ్లకు పుణ్యం, కీర్తి దేశాలయందు తిరిగి అయిదువేల వరహాలు భిక్షం విశ్వనాథునికి ముఖ్యమంటపం గట్టి ఇచ్చినారు. విశ్వనాథునికి నాగఫణి సమర్పించినారు. పసిబిడ్డలకు పేరైన పెట్టించినారు. ఈ అయ్యాలు ఇటువంటి మహత్తును గన్న అయోధ్య మదురకాశి యావంత్రి ద్వారా..........

## రాగి శాసనంలో రెండవ ప్రక్క :

భూలోక ప్రత్యక్ష కైలాసంబగు కోటి సూర్యప్రభా దివ్యమాన దివ్య రత్న శిలయ్యాసాహశనులకు - భోగయుత ప్రదాయకుండగు కాశీ విశ్వనాథునియు - భూమండలాన కూర్చున్ననంత ఫకీరు వానికి కాటిపాపనితో కలవదు. కాట్ల పుట్టినవాడు కాటిపాపడు. గోరికి పుట్టినవాడు ఫకీరువాడు. కాల్చిన కాటికి పూడ్చిన బూడ్దికి చేసిన త్రిరుపల్లెకు కర్తవై యుండును. వీరబాహుడు కాటి పాపనికి ఒకటి ఇచ్చేది ఉన్నది. మీ ప్రధాని నివిత్యప్రధాని రామ ప్రధాని.... ప్రధాని మొదలైన ప్రధానోత్తముల వాండ్రు సకల దివ్యజన మహాజనంబు వాండ్రు. నమ్మలేకంద్ర వారున్ను పుణ్యంగాను వ్రాసియిచ్చిన ధర్మశాసన క్రమము. కాటిపాపలకు భోగమోక్ష ప్రదాయకుండగు కాశీ విశ్వనాథుని యందు పుట్టిన న్యాయము ఇంటికి వొక దొవ్వాన ఇచ్చేది ఉన్నది. తవ్వేడు గింజలు ఇచ్చేది ఉన్నది. రారా పాపడ పోరా పాపడ అని బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రాదులున్ను నయన పెకంద్రలున్ను ఉల్లిపూసలు గట్టిన తల్లి కాటుక బొట్టు పెట్టిన తల్లి విభూతి బొట్టుపెట్టిన తల్లి, కడుప కొలుతు ఇచ్చిన తల్లి, పాపడు పాపడని పలికిన వారెల్ల కాటిపాపనికి ఈ ధర్మం అది పెన్నిది. కాటి పాపనికి ఊరిమీద ఉలుప బత్తెం ఇచ్చేది. నల్లమందుకు పైసలు ఇచ్చేది. కాటి

పాపనికి యెర కాశిలో పుట్టిన యెర ఇది తప్పిన కాశిలో గోవు బ్రాహ్మణి చంపుట. తమ తల్లిదండ్రాదులకు తప్పుట. స్వదత్తాది గుణం. పన్యం పరదా జానుపాలనం. పరదత్తాపహారే నస్యదత్తా నష్టలంబవెతు. ఈ మేర సముద్రానికి నల్లెలు కట్టవంటిది. ఊరికి మేర కందకం వంటిది. పాలు వత్యన వంటిది. కాన్న సాయిగ వంటిది. ఇది మీరరాదు. హరుడు పురాంతకుడు. జగదంతక శూలి పినాక పాణి........ అమరుడు విముగిన పసార సపాలి రసాల పాణి తానిక గెల్తునని కటు విరపీగును రుద్రతోడుత గెలియునను మన్మధుడు మసిగా కదకునె రుద్రుండు మన్మదుని బస్మంచేసి చిత్రకంట చెమట దీసి కాట్లవేస్తే కాటిపాపడు పుట్టినాడు. అప్పుడు కాడు ఏర్పడెను కాటికి కర్తవైయుండుమని శివమహాదేవుండు సెలవిచ్చినాడు. ఇటువంటి కాటిపాపని తిట్టరాదు. కొడుకువంటివాడు కాటిపాపడు. కాట్లో గూల్లెవేసిరి. దినబత్తెం మొకంమీది పాతబట్ట. తలె ముంత ఆయనది. వీరబాహు సంతతి మాలవాడు. ఆజ్ఞలో ఉండి వెంట కబురుజెప్పి సాయిదెలు నడిపించేది ఇది పరమేశ్వరుడు చేసిన మర్యాద. తప్పరాదు. ఇది చదివిన వారికి అనేక పుణ్యం గలుగును.[1]

* * *

1. ఈ రాగి శాసనంలో కొన్నిచోట్ల అక్షరాలు అస్పష్టంగా ఉండటం వల్ల ఆ పదాలను వదిలివేసి చుక్క గుర్తులుంచటం జరిగింది. కొన్నిచోట్ల అర్థంకాని పదాలను ఉన్నదున్నట్లు వ్రాయటం జరిగింది.

## అనుబంధం - 6

# కొన్ని కథారహిత గేయాలు

### 1

పాడినవారు : మోటం యాకయ్య
(60 సం॥)
స్టేషన్ ఘన్‌పూర్, వరంగల్ జిల్లా.
1వ మే, 1990.

మంచీది మ్యాసా కోటి
నాగన్నా పంతులొచ్చే
బంగిజెయ్యే శిర్పాకోటి
కాజాల కట్టతోటి

మ్యాసాకోటి=మేక, నాగన్న=జాగ్రత్త, బంగిజెయ్యి=దాచిపెట్టు, శిర్పాకోటి=ఓ పిల్లా (ఓ భార్యా), కాజాలకట్ట=చేపలకుప్ప.

పంతులుగారి మేకను దొంగిలించి పోగులు వేసుకున్నారు. పంతులుగారికి వీరిమీద అనుమానం వచ్చి, వీళ్ళ గుడిసెల్లో చూసిపోదామని వస్తున్నాడు. పంతులు రావటం చూసి, ఒక బుడిగె జంగం ఈ పాట అందుకున్నాడు. "పంతులుగారి పెద్ద మేకను కోసుకున్నాం కదా! అనుమానం వచ్చి మన ఇళ్ళు సోదా చేయటానికి వస్తున్నాడు. మిగిలిన మాంసాన్ని, ఎండు చేపల్లో దాచిపెట్టు" అని పాటలో ఉన్న సంకేత పదాల ద్వారా భార్యకు తెలిపాడు. ఎండు చేపల కంపువాసనకు పంతులుగారు వాటిదగ్గరకెళ్ళరని అతని తలంపు.

## 2

పాడినవారు : పొన్నకంటి శివలింగం
వయసు - 26 సం॥
తేది : 19-6-1988
నంద్యాల, కర్నూలు జిల్లా.

ఏమయా ఓ పెండ్లికొడకా
ఎంత కిర్తి దెస్తివీ ॥ఏ॥

సన్నబియ్యం సారపప్పు వండి పెడతామంటిమీ
రాగిముద్దా ఉలవచారూ నాకు కావాలంటివీ ॥ఏ॥

పట్టెమంచము పరుపుదిండూ నీకు వేస్తామంటిమీ
పాతా చాపా వంచటరుగులు నాకు కావాలంటివీ ॥ఏ॥

చిగురుటాకులు చిగెన వొక్కలు నీకు ఇస్తామంటిమీ
కట్టమీది కానుగ్గాయలు నాకు కావాలంటివీ ॥ఏ॥

అందమైన వడుచు పిల్లను నీకు ఇస్తామంటిమీ
పెట్టిసాకిన బుల్లి కుక్క నాకు కావాలంటివీ ॥ఏ॥

## 3

పాడినవారు : వాంద్రాని బాలకిష్ట
వయసు : 40 సం॥
మహబూబ్‌నగర్.

రాంద్రమ్మా పెండ్లికి బోదాము
ఓ అమ్మల్లారా ॥రా॥
ఓ అక్కల్లారా ॥రా॥
చీరెలు గీరెలు లేకాపోతే ॥చీ॥
తివ్వ తీగలు చుట్టుకోంద్రమ్మా
ఓ అమ్మల్లారా ॥రా॥
ఓ అక్కల్లారా ॥రా॥

రైకలు బియ్కలు లేకపోతే ॥రై॥
ఆద్దపాకులు చుట్టుకోండ్రమ్మా
ఓ అమ్మల్లారా ॥రా॥ ఓ అక్కల్లారా ॥రా॥
పోదరు గిదరు లేకాపోతే ॥పో॥
కొత్తసున్నము రుద్దుకోండ్రమ్మా
ఓ అమ్మల్లారా ॥రా॥ ఓ అక్కల్లారా ॥రా॥
కమ్మలు గిమ్మలు లేకాపోతే ॥క॥
బండికమ్మలు పెట్టుకోండ్రమ్మా
ఓ అమ్మల్లారా ॥రా॥ ఓ అక్కల్లారా ॥రా॥

## 4

పాడినవారు : సిరువాటి బొర్రమీసాలు
(38 సం॥)
నంద్యాల, కర్నూలు జిల్లా, 19.5.88.

పియ్యం పియ్యం అంటదోయ్ కోడిపిల్లా
రెడ్డోల్ల జీతగాడు - వడ్లైతె దీసినాడు
తుంబె కట్టె దీసుకొని దొడ్లోకి విసిరినాడు
వడ్లగింజలేసివాడు - తిప్పి తిప్పి కొత్రవుంటె
పియ్యం పియ్యం అంటదయ్య కోడిపిల్లా
అబ్బ ఏమిలాను గంటదయ్య కోడిపిల్లా
అహా ఏమి తమాషంటదయ్య కోడిపిల్లా ॥పి॥
దాన్నైన జంపినాడు దిబ్బ మీదికి దీస్కపోయి
బొచ్చైన పీకుతుంటె మంగలి మౌలాలి నాకు
సవ్రంజేస్తదంటదయ్య కోడిపిల్లా
అబ్బ ఏమిలాను గంటదయ్య కోడిపిల్లా
అహా ఏమి తమాషంటదయ్య కోడిపిల్లా ॥పి॥
దిబ్బ మీద్కి దీస్కపోయి - బొచ్చైన పీకినాడు
మంటల్లోన వేసినాడు మంటలోన గాల్చుతుంటె
సలీ సలికాలమని
స్లలిగాష్త నంటదయ్య కోడిపిల్లా ॥అబ్బ॥ ॥పి॥

దాన్నైన గాల్చినాడు - శెంబేడు నీల్లతోటి
రుద్ది రుద్ది కడుగుతుంటె గంగా స్త్రానము నేను
చేస్తున్న అంటదయ్య కోడిపిల్లా ॥అబ్బ॥ ॥పి॥
దాన్నైన కడిగినాడు కీలు కీలు గోస్త ఉంటె
కమ్మరి వీరయ్య తోటి
నర్కులాడ్డ మంటదయ్య కోడిపిల్లా ॥అబ్బ॥ ॥పి॥
దాన్నైన గోసినాడు కుండలోన వేసినాడు
ఉప్పు మసాల పెట్టి కారాము ఉప్పుపెట్టి
కుతకుతాను ఉడ్కుతుంటె పున్కా జవ్వాది నేను
పూసుకున్న నంటదయ్య కోడిపిల్లా ॥అబ్బ॥ ॥పి॥
కూరాకు వొండినాడు తెల్ల బియ్యం అన్నం మీద
కూరాకు పెట్టి ఉంటె పూలా పానూపు మీద
పండుకున్న నంటదయ్య కోడిపిల్లా ॥అబ్బ॥ ॥పి॥
అంతా నేపాటిదాక - అన్నమైతె దిన్నాడు
ఎంకాలు[1] దీస్కపోయి - గోడ పక్కన సల్లుతుంటె
కుక్కలైన గొరుకుతుంటె కుక్కల తోటిగ నేను
తండ్లాడ్త నంటదయ్య కోడిపిల్లా ॥అబ్బ॥ ॥పి॥

## 5

పాడినవారు : జయంపు పుల్లయ్య
వయసు : 42 సం॥
తేది : 19-5-1988
నంద్యాల, కర్నూలు జిల్లా.

ముసిలోడు ముసిలమ్మ
ముచ్చట్లు ఆడుతుంటె
ముద్దివట్టి పెరికెరా
నడ్డి ముక్కు దోమా
దోమా దోమ దొరసానిగాదురా॥

---

1. ఎముకలు.

దోమకు దగిన ఇసరసగాలి
ఈగ ఇల్లుజేర నివ్వదురా
నంద్యాల సందూనా
ఊరుమాపురం సందునా
కుండలో నీళ్ళు లేవని అలిగేర దోమా
దోమా దోమ దొరసాని గాదురా॥

కల్లుట్ల సందునా
కమ్మదల్ల సందునా
కమ్మలు లేవని ఎగిసెర దోమా
దోమా దోమ దొరసాని గాదురా॥

ఏ ఊరి సందునా
ఏమనపాడి సందునా
ఏనిగ లేదని ఎగిసెర దోమా
దోమా దోమ దొరసాని గాదురా ॥మునిలోడు॥

## 6

పాడినవారు : కల్లెం సత్తెమ్మ (48 సం॥)
శాబ్దిపూర్, కామారెడ్డి, 4-12-1985.

ఏమి చేయుదూ దైవనందనా
మొగడు చిన్నవాడూ - అయ్యో మొగడు చిన్నవాడు
పెండ్లి జేసినా పెద్ద వారికీ
తగ్గని నా ఉసురూ - అయ్యో తగ్గని నా ఉసురూ ॥ఏమి॥
అందరి మొగుళ్ళు శికారి[1] కోయి
శికారి వట్కొస్తే
నా ముద్దుల మొగడు శికారికోయి
తొండల వట్కొచ్చే ॥ఏమి॥

1. శికారి = వేట.

అందరి మొగుళ్ళు ఈతగొొట్టవొొయి
ఈత గొొట్టొొస్తే
నా సక్కని మొగడు ఈతగొొట్టవొొయి
తోతు జూసొొచ్చె ॥ఏమి॥
అందరి మొగుళ్ళు మోటగొొట్టవొొయి
మోట గొొట్టొొస్తే
నా సక్కని మొగుడు - మోట గొొట్టవొొయి
మొత్తల పండొొచ్చె ॥ఏమి॥
అందరి మొగుళ్ళు లడాయికోొయి
లడాయి జేసొొస్తే
నా బంగరు మొగడు లడాయి కోొయి
లబదిబ మొత్తుకూనె ॥ఏమి॥

## 7

పాడినవారు : తూర్పాటి నాగమ్మ
(60సం॥)
వంత : తూర్పాటి యాదమ్మ
(30 సం॥)
శాబ్దిపూర్, కామారెడ్డి, 4.12.85.

ఎలుకా నీ మీదా మల్లెలు వొొల్కా
ఎలుక ఎలుక అని పల్కరించితే
పదారు గుమ్మలు పాడు జేస్తివి ॥ఎల్కా॥
కొొత్త ఇంటికి సుట్టామొస్తే
జొొట్టా గొొరికి బుట్లా పెడ్తివి ॥ఎల్కా॥
కొొత్త ఇంటికి అల్లుడొొస్తే
చత్రీ గొొరికి పొొయిలాబెడ్తివి ॥ఎల్కా॥
కోమటోొల్లింట్ల సంసారం జేస్తివి
ఈడిగోొల్లింట్లా నీల్లాడ్తివి ॥ఎల్కా॥
పచ్చి కొొబ్బెర పాత బెల్లం
నువ్వేదింటివి నాకేం బెడ్తివి ॥ఎల్కా॥

## 8

పాడినవారు : కల్లెం నర్సెమ్మ (48 సం॥)
శాబ్దిపూర్, కామారెడ్డి 4-12-85.

సింత సెట్టు కొనలమీద
సిల్క యున్నాదీ
సిల్క పొట్టలోన
బంగరు పల్కులున్నావి ॥సి॥
ఆకులేని మానుమీద కాకి యున్నాది
ఆ కాకి కన్నులోన కైలాసమున్నాది ॥సి॥
చెరువు తోట బొగుడమీద కోతి యున్నాది
ఆ కోతి నెత్తిమీద రముల[1] పాదమున్నాది ॥సి॥
మర్రిచెట్టు మొదటిలోన పుట్ట యున్నాది
ఆ పుట్ట పొట్టలోన జగతి దేవుడున్నాడు ॥సి॥
మూడు మూల్ల బాయిలోన చాప యున్నాది
ఆ చాప పొట్టలోన శివా లింగమున్నాది ॥సి॥

## 9

పాడినవారు : మిరియాల రామయ్య
వయస్సు : 23 సం॥
తేది : మే, 1989
పిట్లం, నిజామాబాదు జిల్లా.

ఉడ్తా ఉడ్తా ఓయ్ - యాడికొ్కితివోయ్
జీడికంటి కోయ్ - జీత మెంత నోయ్
రాగిపైస నోయ్ - నువ్వేందింటివోయ్
గంజి మెతుకులోయ్ - నీ పెండ్లానికేం బెడ్తివోయ్
పెరుగు మెతుకులోయ్ - పెండ్లామేడ పండెనోయ్
మంచంమీద నోయ్ - నువ్వేడ పండ్తివోయ్

1. రాముల.

కాళ్ళకాడ నోయ్ - యాడ దన్నె నోయ్
రొమ్ముమీద నోయ్ - యాడపడ్తివోయ్
పౌయిల పడ్తినోయ్ - ఏం గాలెనోయ్
గడ్డం గాలెనోయ్.

## 10

పాడినవారు : తాటికొండ రామయ్య
వయసు : 70 సం॥
తేది : మే 1990
నందికొట్కూరు, కర్నూలు జిల్లా.

సందమామా సందమామా సందమామా
సందుజూసే ఙ్ఞానులెవరే సందమామా ॥సంద॥
పనిగుఱ్ఱం ఎక్కినాడు సందమామా
పగిడికల్లెం పట్టినాడే సందమామా ॥సంద॥
నీలంపు గొడుగూకింద సందమామా
గుఱ్ఱంపైనా కొలువూ తీరే సందమామా ॥సంద॥
మచ్చకంటి దర్వాజగుండా సందమామా
అతడేమో బయలుదేరే సందమామా ॥సంద॥

* * *

## అనుబంధం - 7

# సమాచార దాతలు

విషయ సేకరణార్థం నేను చేసిన పర్యటనల్లో బుడిగె జంగం వృత్తి కళాకారులు, బుడిగె జంగం సంఘం కార్యకర్తలు సమధికోత్సాహంతో సమాచారాన్ని అందించి ఎంతగానో సహకరించారు. కృతజ్ఞతాపూర్వకంగా వారిని ఇక్కడ స్మరిస్తున్నాను.

**హైదరాబాదు :**

కడమంచి రాంచందర్, వాంౖడాని అంజయ్య, సిరిసాల భీమయ్య (జంగంమెట్ వాస్తవ్యులు).

**రంగారెడ్డి జిల్లా :**

నిదానకవి వెంకటేశం, నిదానకవి రామచంద్రం, ఇప్ప ఎల్లయ్య (లెనిన్ నగర్), పస్తం గండయ్య (గుడి మల్కాపురం), పర్తం తిరుపతయ్య (పర్త పురం), ఆలేటి జంగయ్య (నడికుడ), మోటం మల్లయ్య (వినాయకనగర్ - రామకృష్ణాపురం).

**నల్గొండ :**

రేవెల్లె నర్సిహ్మ (ఇందిరాల), పస్తం రామస్వామి (బ్రాహ్మండ్లపల్లి), పస్తం నర్సిహ్మ (బీబీనగర్), వేముల ఇస్తారి (నల్గొండ).

**మహబూబ్‌నగర్:**

కప్పెరి పెంటయ్య, చెన్నయ్య, పస్తం మన్యం, వాంౖడాని బాలకిష్టి (మహబూబ్‌నగర్), విభూతి రాందాసు (పిరట్వానిపల్లి), దొక్క వెంకట్రాములు (షాపూర్), పొన్నకంటి రాములు (మునిమోక్షం), పస్తం ఎల్లయ్య (ఖూరెడ్డిపల్లి).

**మెదక్ :**

ప్యార్ల నర్సింహులు, బైల్పాటి నర్సిహ్మలు (బిలాల్‌పూర్), కొమారి బిచ్చయ్య (జహీరాబాద్), కప్పెరి గండయ్య, కప్పెరి మల్లేశం, కల్లెం చంద్రయ్య (సంగారెడ్డి), వాంౖడాని సాయిలు (దాయర- మెదక్).

**నిజామాబాదు :**

జి. సాయిలు (పిట్లం), తూర్పాటి నారాయణ (లాబ్దిపూర్-కామారెడ్డి), మాదెనం చంద్రయ్య (అర్మూర్), నిడుగొండ భద్రయ్య (ఏడెపల్లి-బోధన్).

**కరీంనగర్ :**

గంధం సమ్మయ్య (హుజూరాబాదు), చెన్నూరి రాంచందర్ (పెద్దపల్లి), ఎదురుగట్ల రామస్వామి (జగిత్యాల).

**వరంగల్ :**

తూర్పాటి సారయ్య (హన్మకొండ), కిన్నెర పాండు, తూర్పాటి వెంకటేశ్వర్లు (తొర్రూరు), చిత్తారి మల్లేశం, చిత్తారి చంద్రయ్య (జనగామ), కడమంచి జగన్నాథం (నెమలిగొండ), మోటం యాకయ్య కొండపల్లి రవి. (ఘన్‌పూర్.) పర్వతం యాదగిరి (పోతారం - నర్మెట్ట),నర్సూటి వెంకన్న (దాట్ల), కిన్నెర వెంకటేశ్వర్లు (అమ్మాపురం).

**ఖమ్మం :**

ఇప్ప వీరస్వామి, వెంగళరావునగర్ కాలనీ, న్యూపాల్వంచ.

**తూర్పుగోదావరి జిల్లా :**

నిండుకొండ సింహాచలం, నిం. శంకర్ (భోగాపురం), ప్యార్ల పల్లారావు (కండ్రిగ - అమలాపురం డివిజన్), మోటూరి రాము (కందరాడ), మోతు పెద్దిరాజు (బి కొత్తూరు).

**పశ్చిమగోదావరి జిల్లా :**

సిహెచ్. కోటయ్య, బూతం అబ్బయ్య (పినకడియం - ఏలూరు).

**ప్రకాశం :**

విప్ప గురుమూర్తి, వేముల.

**కర్నూలు :**

తాటికొండ నారాయణ (కొత్త బిజినవేముల - నందికొట్కూరు), సిరివాటి సుంకన్న (నెహ్రూనగర్, పగిడ్యాల మండలం), నిడుగొండ గిరప్ప (బన్నూరు బంగ్లా), మోతె ఎల్లప్ప, విభూతి రాముడు, పొన్నకంటి శివలింగం, సిరిగిరి బాలకృష్ణ, సిరిగిరి జమ్మన్న (సుద్దుల పేట - నంద్యాల).

# ఉపయుక్త గ్రంథసూచి


1. అనసూయాదేవి, అవసరాల (డా) - జానపద గేయాలు - ఆం. ప్ర. సంగీత అకాడమీ (1983)
2. అప్పారావు, ఎం. ఆర్. - సంస్కృతి - ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు (1977)
3. అప్పారావు, పి.ఎస్.ఆర్. (డా) - తెలుగు నాటక వికాసము (1967)
4. అనంతరాజు, మట్ల - కకుత్స్థ విజయము - ఆం.ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు (1980)
5. ఆంధ్ర దర్శిని - విశాలాంధ్ర ప్రచురణలు
6. ఎల్లారెడ్డి, పొద్దుటూరి (డా) - 'జానపద విజ్ఞానం - హాస్య గీతాలు' జానపద సాహిత్య పరిషత్తు, పాలమూరు (1991)
7. ఎల్లోరా - జానపద సాహిత్యం - దీప్తి పబ్లికేషన్స్, హైదరాబాదు (1982)
8. కదిరీపతి, పాలవేకరి - శుక సప్తతి - ఆం ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు (1979)
9. కృష్ణకుమారి, నాయని (ఆచార్య) - తెలుగు జానపద గేయగాథలు - తెలుగు అకాడమీ, హైదరాబాదు (ద్వి.ము. 1990)
10. కృష్ణారెడ్డి, చిగిచర్ల - ధర్మవరం తాలూకా జానపద గేయాలు.
11. కొండలరావు, వెలిచాల - 'భాష - పరిభాష - సాహిత్యం - సంస్కృతి' తెలుగు అకాడమీ, హైదరాబాదు (1990)
12. కోదండరామిరెడ్డి, మరుపూరు - మాండలిక పదకోశం
13. గంగాధరం, నేదునూరి - మిన్నేరు - ఆదర్శ గ్రంథమాల, రాజమండ్రి (1968) - జానపదగేయ వాఙ్మయ వ్యాసావళి (1961) - మున్నీరు (1973) - పసిడి పలుకులు - జాతీయ జ్ఞానమందిరం, మద్రాసు (1960)

14. గంగప్ప, ఎస్ (ఆచార్య) - జాతికి ప్రతిబింబం జానపద సాహిత్యం - శశి ప్రచురణలు, గుంటూరు (1984)
15. గోపరాజు, కౌరవి - సింహాసన ద్వాత్రింశిక - ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు (1982)
16. గోపి, ఎన్. (ఆచార్య) - ప్రజాకవి వేమన - చైతన్య ప్రచురణలు, హైదరాబాదు (ద్వి.ము 1991)
17. గౌరన - హరిశ్చంద్రోపాఖ్యానము
18. చెన్నప్ప, మసన (డా) - 'ప్రాచీన కావ్యాలు - గ్రామీణ జీవన చిత్రణ', 12-11-1095/ఎ, సికిందరాబాదు - 361 (1991)
19. జగన్నాథం, పేర్వారం (ఆచార్య) - ఆరె జానపద సాహిత్యం - ఆరె పరిశోధక మండలి, వరంగల్లు (1989)
20. జోగారావు, ఎస్.వి. - ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర.
21. తిక్కన, సోమయాజి - విరాట పర్వము - ఆం.ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు (1971)
22. తిప్పేరుద్రస్వామి, హెచ్. - బసవేశ్వరుడు (ఆంగ్లం) - అనువాదం. బి. వి. సింగరాచార్య.
23. తిమ్మకవి, కూచిమంచి, - రాజశేఖర విలాసము
24. తెలగన్న, పొన్నగంటి - యయాతి చరిత్రము
25. తెలుగు విజ్ఞాన సర్వస్వము - 3, 4, 10 సంపుటాలు
26. దొణప్ప, తూమాటి (ఆచార్య) - జానపద కళాసంపద - అభినందన సమితి, హైదరాబాదు (1987)
27. ధర్మారావు, తాపి - పెళ్ళి, దాని పుట్టుపూర్వోత్తరాలు
28. ధూర్జటి - శ్రీకాళహస్తి మాహాత్మ్యము - ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు (1968)
28ఎ. నదీం హస్నైన్ - భారతీయ గిరిజనులు (Tribal India to-day) అనువాదం - ప్రసాదరెడ్డి, ఎం.- ఓరియంట్ లాఙ్మన్, హైదరాబాదు.
29 నన్నచోడుడు - కుమార సంభవము - ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు (1968)

30. నరసింహారెడ్డి - పి. (డా) - తెలుగు సామెతలు, జనజీవనం - శ్రీనివాస మురళీ పబ్లికేషన్స్, తిరుపతి (1983)
31. నాగేశ శాస్త్రిలు బళ్లారి, వై. - వీరశైవ ధర్మబోధిని (కన్నడం)-అను. రవికోటి మఠం వీరభద్రయ్య, శివానుభవ సమితి, హైదరాబాదు - 27.
32. నారాయణరావు, కోదాటి - చిన్ననాటి జ్ఞాపకాలు - ప్రభాత ప్రచురణ సమితి, గాంధీ జ్ఞానమందిర్, హైదరాబాదు (1967)
33 నాగభూషణాచార్యులు, చిర్రావూరు - సంచారజాతులు (1977)
34 నారాయణరెడ్డి, సి. (ఆచార్య) - 'ఆధునికాంధ్ర కవిత్వము: సంప్రదాయములు - ప్రయోగములు'
35. నారాయణామాత్యుడు, అయ్యలరాజు - హంసవింశతి - ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు (1977)
36. పద్మావతి, కె, (డా), విల్సన్. కె. (డా) - సంస్కృతి అంటే ఏమిటి? నవభారత్ బుక్‌హౌస్, విజయవాడ - 2 (1990)
37. పిన వీరభద్రుడు, పిల్లలమర్రి - శకుంతలా పరిణయము - వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ మదరాసు (1970).
38. పెద్దన, అల్లసాని - మనుచరిత్ర - ఎమెస్కో, విజయవాడ.
39. ప్రతాపరెడ్డి, సురవరం - ఆంధ్రుల సాంఘిక చరిత్ర.
40. ప్రసాదరాయ కులపతి (డా.) - సంస్కృతి - యువభారతి, హైదరాబాదు (1983).
41. ప్రేమలత, రావి (డా.) - తెలుగు జానపద సాహిత్యము : పురాణగాథలు స్వీయ ప్రచురణ, హైదరాబాదు (1983).
42. బాలస్వామి, బుక్కా (డా.) - మహబూబ్‌నగర్ జిల్లా జానపద కథలు - తెలుగు పరిశోధన ప్రచురణలు, హైదరాబాదు.
43. బ్రహ్మానంద, హెచ్.ఎస్ (డా.) - శిష్ట సాహిత్యంలో జానపద ధోరణులు- అక్షర ప్రసార ప్రచురణలు, అనంతపురం (1989).
44. మలయశ్రీ - కాకతీయుల కాలంనాటి సామాజిక జీవితం - హైదరాబాదు బుక్ ట్రస్ట్ (1990).
44ఎ. మాణిక్ ప్రభు - మెదక్ జిల్లా గ్రామనామాలు - అముద్రిత సిద్ధాంత గ్రంథం - ఉస్మానియా విశ్వవిద్యాలయం.

45. ముద్దుపళని - రాధికా సాంత్వనము.

46. మోహన్, జి.ఎస్ (డా.) - జానపద విజ్ఞాన వ్యాసావళి - శ్రీనివాస పబ్లికేషన్స్, మలయనూరు (1981).

46ఎ. యాదగిరి శర్మ, ఎన్. (డా.) - జానపద భిక్షుక గాయకులు - అముద్రిత సిద్ధాంత గ్రంథం - ఉస్మానియా విశ్వవిద్యాలయం (1987).

47. యాదయ్య, చింతల. జానపద విజ్ఞానంలో బవనీలు - ఒక పరిశీలన - హరి ప్రచురణలు, హైదరాబాదు.

48. రఘుమారెడ్డి, యెల్దండ (డా.) - పల్లె పదాలలో ప్రజా జీవనం - గురుకుల విద్యాపీఠ ప్రచురణలు, యెల్దండ, మహబూబ్‌నగర్ జిల్లా.

49. రమాపతిరావు, అక్కిరాజు (డా.) - మాండలిక పదకోశం - తెలుగు అకాడమీ, హైదరాబాదు (1985).

50 రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని (డా.) - ఆంధ్ర నాటకరంగ చరిత్ర - రేణుకా గ్రంథమాల, మద్రాసు - 24 (196[illegible]).

51. రామచంద్ర, తిరుమల - సాహితీ సుగతుని స్వగతం, విశాలాంధ్ర ప్రచురణ, విజయవాడ (1969).

52. రామరాజు, బిరుదురాజు (ఆచార్య.) తెలుగు జానపద గేయ సాహిత్యము- జానపద విజ్ఞాన ప్రచురణలు, హైదరాబాదు (ద్వి.ము. 1990).
—తెలంగాణా పల్లె పాటలు (ద్వి.ము. 1990).
&—నాయని కృష్ణకుమారి (ఆచార్య) (సంపా.) జానపద గేయాలు - సాంఘిక చరిత్ర. ఆం.ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు (1974).

53. రామాచార్యులు, బి. - శిష్ట సాహిత్యంలో జానపద విజ్ఞాన ధోరణులు - స్వీయ ప్రచురణ, హైదరాబాదు (1990).

54. రెడ్డి. డి సి. (డా) - గ్రామనామాలు: భాషా సామాజిక పరిశీలన (చిత్తూరు జిల్లా) - స్వీయ ప్రచురణ, తిరుపతి (1983).

55. లక్ష్మయ్య, పైడి. - జ్ఞాపకాలు - వ్యాపకాలు.

56. లక్ష్మీకాంత మోహన్ - తెలంగాణా జానపద గేయాలు - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ (1972).

57. లక్ష్మీనరసింహశాస్త్రి, చింతలపాటి (విద్వాన్) - కూచిపూడి భాగవతులు.

58. లక్ష్మీనారాయణ, జి. (డా) - తెలుగు శాసనాలు (6 శ - 16 శ) - సామాజిక, సాంస్కృతిక అధ్యయనం - అముద్రిత సిద్ధాంత వ్యాసం (ఉస్మా. వి. వి. 1985).

59. లక్ష్మీరంజనం, ఖండవల్లి-బాలేందు శేఖరం-ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి' బాలసరస్వతి బుక్ డిపో, హైదరాబాదు (1957).

60. లింగారెడ్డి, గోపు. (డా) - తెలంగాణా శ్రామిక గేయాలు - సుషమా పబ్లికేషన్స్;
-జానపద విజ్ఞానం సేకరణ : అనుభవాలు;
-కరీంనగర్ జిల్లా జానపదగేయాలు

61. వసుంధరారెడ్డి, సి. (డా) - 'తెలుగు జానపద సాహిత్యము - స్త్రీల గేయములలో సంప్రదాయము'-స్వీయ ప్రచురణ, హైదరాబాదు (1986).

62. విశ్వనాథరెడ్డి, కేతు (ఆచార్య). కడప ఊర్ల పేర్లు - తిరుపతి (1976).

63. వెంకటకవి, చేమకూర - విజయ విలాసము - తాపీ ధర్మారావు వ్యాఖ్య - విశిష్ట రచనలు, హైదరాబాదు (1968).

64. వెంకటప్పయ్య, వెలగా (డా). పొడుపు కథలు - (సంపా). సిద్ధార్థ పబ్లిషర్స్, విజయవాడ (1981).

65. వెంకటరెడ్డి, కసిరెడ్డి (డా) - తెలుగు పొడుపు కథలు - జాతీయ సాహిత్య పరిషత్, భాగ్యనగర్ (1990).

66 వెంకటశాస్త్రి, ముసునూరి - విప్రుల ఇంటిపేర్లు - శాఖలు - గోత్రాలు;
-శబ్దార్థ దీపిక (నిఘంటువు);
-ఆంధ్రనామ సర్వస్వం (తెలుగు నుడికడలి) - 1971.

67. వెంకట సుబ్బారావు, తంగిరాల-కాటమరాజు కథలు - 1, 2 సంపుటాలు. ఆం. ప్ర. సా. అకాడమీ, హైదరాబాదు (1976)

67.ఎ వెంకటేశ్వరావు, నార్ల; విద్వాన్ విశ్వం; తిమ్మావజ్ఝల కోదండరామయ్య (సంపా) - పదబంధ పారిజాతం - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు (1959)

68. శంకరరావు, బి. - పొడుపు కథలు - ఆం.ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

69. శ్రీకృష్ణదేవరాయలు - ఆముక్తమాల్యద - ఎమెస్కో, విజయవాడ.
70. శ్రీనాథుడు - శివరాత్రి మాహాత్మ్యము - క్రీడాభిరామము - ఎమెస్కో, విజయవాడ (1991)
71. సత్యనారాయణ, కంభంపాటి - ఆంధ్రుల సంస్కృతి, చరిత్ర (ఆంగ్లం) అను. మహీధర రామమోహనరావు - హైదరాబాదు బుక్ ట్రస్ట్ (1984)
72. సత్యవతి, తేళ్ళ (డా) - తెలుగువారి ఇంటిపేర్లు.
73. సీతారామాచార్యులు, బహుజనపల్లి - శబ్ద రత్నాకరము (నిఘంటువు)
74. సుందరం, ఆర్. వి. ఎస్. (ఆచార్య) - ఆంధ్రుల జానపద విజ్ఞానం - ఆం. ప్ర. సా. అకాడమీ, హైదరాబాదు (1983)
75. సుందరాచార్యులు, కె. వి (డా) - అచ్చ తెలుగు కృతుల పరిశీలనం - స్వీయ ప్రచురణ, హైదరాబాదు (1989)
76. సుబ్రహ్మణ్యశాస్త్రి, పోతుకూచి - అచ్చ తెలుగుకోశం - తెనాలి (1979)
77 సూర్యప్రకాశరావు, సహదేవ - రూపకళ.
78. సోమనాథుడు, పాల్కురికి - పండితారాధ్య చరిత్ర - తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు (1990)
-బసవపురాణము
79. స్త్రీల పాటలు - ఎన్. వి. గోపాల్ అండ్ కంపెనీ, మదరాసు (1977)
80. హనుమంతరావు, బి. ఎస్. ఎల్. (డా) - ఆంధ్రుల చరిత్ర - త్రిపుర సుందరి, 3/17 బ్రాడిపేట, గుంటూరు - 2 (1983)

## పత్రికలు - వ్యాసాలు :

1. బాలసంతువారి ఉత్తర రామాయణం - డా. యెల్లంద రఘుమారెడ్డి - భారతి - అక్టోబర్, 1977.
2. కాటిపాపలు-కె. వి. హనుమంతరావు-ఆంధ్రప్రభ-దినపత్రిక 25-11-90
3. శారదకాండ్రు ,, ,, 18-11-90
4. తోలుబొమ్మలాట ,, ,, 27-1-91, 3-2-91, 10-2,91.
5. 'ఏ దేశమేగినా ఈ ఘోష ఆగదు - ఏ పీఠమెక్కినా నీ పొట్ట నిండదు' ఉదయం - 17-5-1985 నాగార్జునసాగర్.
6. గతుకుల బాటలో గాలివాటు బతుకులు - ఈనాడు 16-2-1985.

7. కంప్యూటర్ యుగంలో సంచారజీవనం - ఉదయం 2-2-1986 పిఠాపురం.
8. ఇంకా కన్యాశుల్కం - ఈనాడు. 5-10-1987 - నాంపల్లి (నల్గొండజిల్లా).
9. ఆకలి శిలువమోస్తున్న క్రీస్తులు - ఉదయం. 1987 కర్నూలు జిల్లా.
10. బతుకులు భారమైన బుడ్గజంగాలు - ఆంధ్రభూమి 5-9-88. నంది కొట్కూరు.
11. బుడగ జంగాల పట్ల ప్రభుత్వ బాధ్యత లేదా? - ఆంధ్రభూమి 8-2-89. సంగారెడ్డి
12. బుడగ జంగాల బడుగు బతుకులు - ఈనాడు. 22-2-89
13. బుడ్గ జంగాలను ఎస్.టి. లుగా గుర్తించండి - ఈనాడు 4-3-89. ఎల్. బి. నగర్ రంగారెడ్డి జిల్లా
14. Budga Jangams : A Neglected Tribe. Deccan Chronicle 11-2-89. Sangareddy.
15. భుక్తి గడవని బుడగ జంగాలు - ఈనాడు 3-5-89 తొర్రూరు (వరంగల్)
16. గుండెల్లో విలాపాగ్నులు - కళ్ళల్లో విషాదాశ్రువులు - ఉదయం 25-10-89 హైదరాబాదు
17. బుడగ జంగాల బతుకు దుర్భరం - ఈనాడు 17-12-89, మెదక్
18. ఈ జీవితాలు తెగిన గాలిపటాలు - ఈనాడు. 29-12-89 శామీర్‌పేట.
19. బజారున పడ్డ బుడగ జంగాలు - ఈనాడు 21-1-90 ఎల్. బి. నగర్ (రంగారెడ్డి జిల్లా)
20. వృత్తికి ఆదరణలేని బుడ్గ జంగాలు - ఆంధ్రభూమి. 25-11-90. నంద్యాల
21. బాధల బడబాగ్ని బుడగ జంగం కాలనీ - ఆంధ్రభూమి 26-6-91, చార్మినార్
22. మట్టిలో మాణిక్యాలు 'బుడగ జంగాలు' - 4-5-91 జమిస్తాన్‌పూర్
23. బుడిగ జంగాలకు 5 వయోజన విద్యాకేంద్రాలు - ఈనాడు. 8-8-91, బాగ్ అంబర్‌పేట్.

24. బజారునపడ్డ కళాకారులు - ఆంధ్రభూమి 30-5-1989 - ధర్మపురి, కరీంనగర్ జిల్లా.

25. నవజీవన స్రవంతిలో మాకూ స్థానం! - ఆంధ్రజ్యోతి 25-8-1988 చిట్యాల, నల్గొండజిల్లా.

26. అనాచారమే ఆచారమా! - ఉదయం 19-4-1988 - బచ్చన్నపేట, వరంగల్ జిల్లా.

27. కులకట్నం - ఉదయం వారపత్రిక 17-1-88 గద్వాల మహబూబ్‌నగర్ జిల్లా.

28. ఆకలికేకలే శార్దకాల్ల బ్రతుకులు - ఉదయం 9-12-87 డిచ్‌పల్లి, నిజామాబాదుజిల్లా.

29. దిక్కూమొక్కూలేని శారదగాళ్ళు - ఈనాడు 8-3-89 - బాల్కొండ.

30. కాలం మరుగున కమ్మటి కథలు - ఆంధ్రజ్యోతి 19-1-87 - కరీంనగర్.

31. కూటికోసం పగటివేషం - ఉదయం - 18-11-87 చేర్యాల, వరంగల్.

32. పడరానిపాట్లు పడుతున్న పగటి వేషగాళ్ళు - ఆంధ్రభూమి - 5-9-88 చింతపల్లి.

33. తోలుబొమ్మలాటలు - ఆంధ్రజ్యోతి 8-7-91 ఆదివారం సంచిక.

34. ఉదయం దినపత్రిక - 31-8-88.

35. బతుకు తెరువు బహురూపాలు - హిమబిందు - ఆంధ్రజ్యోతి 13-1-91 ఆదివారం సంచిక.

## ENGLISH

1. Sirajul Hasan, Syed. The Castes and Tribes of H.E.H. The Nizam's Dominions (1920).

2. Thurston, Edgar - Castes and Tribes of Southern India (1903).

3. Sherring, M. A. (Reverend) - Hindu Tribes and Castes (1879).

4. Vijaya, N. (Dr.) - The Role of Traditional Folk-media in Rural Areas, Gain Publishing House - Delhi-7 (1988).

5. Russel, R.V & Heeralal - The Tribes and Castes of the Central provinces of India (1916 Reprint in 1975).

6. Enthoven R E. - The Tribes and Castes of Bombay (Reprint in 1975).

7. Dundes, Alan - The Study of Folklore (1965).

8. Richard, M. Darson (ed) - Folklore and Folk life - an Introduction, Chicago (1972).

9. Narla, V. R. - Traditional Indian Culture and other Essays - Vishalandhra Publications, Vijayawada.

10. Census of India - Ethnographic Notes - Vol. II, Part V - B (2), (8), (9) and (10)- Director of Census operations, A. P. Hyderabad.

11. Gulam Ahmed Khan - Census of India 1931. Vol. XXIII, Part - I, Report.

12. Memo No. 1030/J1/88-5 dt. 23-3-1989. Govt. of A. P. Social Welfare (J) Dept.



